ఓం తత్సత్.

శ్లో- దంతులూర్యన్వయ క్షీరవారిరాశి హిమాంశునా।
నారాయణగజపతిరాజ్ఞేయం రచితా ముదా।
ఆహ్నికాచారవిషయా చతుర్వర్గ ఫలప్రదా।
మన్వాదిస్మృతివిఖ్యాత శాస్త్రసారేణ యోజితా।
సంబోధినీ సత్క్రియాణాం మునిభావసుబోధినీ।
తద్రాజవర్యాదత్తస్వాతంత్ర్యం పరిగృహ్ణతః।
విన్నకోట్యన్వయోత్పన్న నరసింహాఖ్యశ్రేష్ఠినః।
శారదాముకుటాఖ్యాయాం మమ వై శాఖపట్టణే।
౪ శ్రీముద్రాక్షరశాలాయాం జయనామకవత్సరే।
౫ మాఘమాసి సితే పక్షే ద్వితీయాభానువాసరే।
వెంపరాలాన్వయోద్భూత శ్రీజగన్నాథశాస్త్రిణా।
౬ సమ్యక్సంశోధయిత్వా వై ధీమతా బుధసేవినా।
సుష్ఠు ముద్రాపయిత్వాతు ప్రచురీక్రియతే మయా॥

శ్రీమన్నారాయణభూరమణపుత్రులును
శ్రీబుచ్చివేంకయాంబా గర్భశుక్తి ముక్తామణులునగు
శ్రీదంతులూరి నారాయణగజపతి రాజశిరోమణులచేత
మన్వాది ధర్మశాస్త్రములనుండియు, తదితరగ్రంథములనుండియు
ఆహ్నికాచారాద్యశేషవిశేషంబుల సంగ్రహించి
తత్తద్గ్రంథానీత శ్లోకవాక్యంబులకు తెలుగుపదంబుల స్పష్టతరంబగు
భావంబులం దెలిపి రచింపబడిన

# మునిభావబోధిని

తద్రాజశిరోమణులవలన స్వాతంత్ర్యమును పొందిన
విన్నకోట అప్పల నరసింహులుగారిచేత
స్వకీయ శ్రీశారదాముకుట ముద్రాక్షరశాలలో
ముద్రింపించి ప్రచురింపబడియె.

VIZAGAPATAM:
Printed by A. VENKATAREDDI, at the S. S. M. Press. 27-1-95

## మునిభావబోధిని ప్రథమాధ్యాయము విషయసూచిక.

# ఉపోద్ఘాతము.

ఈగ్రంథము, శ్రుతాధ్యయనసంపన్నులకును, వేదాంతులకును, భోగరాగాదులయందాసక్తిగలవారికిని, కృషివాణిజ్యాదికార్యములయందభిరుచిగలవారికిని, ఐహికాముష్మికములను గోరువారికిని, శరీరారోగ్యాది సంరక్షణలయందపేక్షగలవారికిని, గృహారామాదిసమస్తస్థితుల నభివృద్ధిచేయుటయందు వేడుకగలవారికిని, పండితులు పామరులు మొదలగు ప్రపంచమందలి సర్వజనులకు నావశ్యకంబైన ప్రతియంశము నితరగ్రంథాపేక్షలేకుండ మన్వాద్యష్టాదశ ధర్మశాస్త్రములనుండియు, సష్టాదశపురాణేతిహాసాదులనుండియు, చరకసుశ్రుత వాహటాది వైద్యగ్రంథములనుండియు, నానావిధ జ్యోతిష గ్రంథములనుండియు నింకననేకేతర గ్రంథములనుండియు మిగులశ్రద్ధతోను జాగ్రతతోను సంగ్రహింపబడినశ్లోకంబులకును వాక్యంబులకును మృదుశైలితో బాలబోధకంబగునటుల తెలుగుటీక జేర్చి శ్రీ దంతులూరి నారాయణ గజపతి రాజశేఖరులచే రచియించి మొదట ముద్రింపించి ప్రచురింపంబడినది.

ఇదిపైని వివరించినప్రకార మనేకోపయుక్తాంశంబులుండుటచే మొదటికూర్పు పుస్తకములన్నియు నచిరకాలములో విక్రయమయినవి.

పిదప నీగ్రంథమందత్యాసక్తిగలవారనేకులు పదేపదేకోరగా నీగ్రంథకర్తలగు నారాజశ్రేష్ఠు లితరవ్యాపారములచేత తిరిగి ముద్రింపించుటకు నవకాశములేకయును మాకృతముగనైనయెడల గ్రంథము జగద్విశ్రాంతిగ ప్రచురమగునని యునెంచి మాయందలి దయచేత నేతద్గ్రంథస్వాతంత్ర్యమును మాకొసగినందున మేమదిగైకొని సంతసముతో రెండవపర్యాయము విషయసూచికా సహితంబుగ లేఖక ప్రమాదజనితదోషంబు లపనోదింపించి ముద్రింపించి ప్రచురించడమైనది.

దీనివెల అంచెకూలిసహా రు 3-0-0 లు.

చిన్నకోట అప్పలనరసింహులు,
శ్రీశారదామకుట ముద్రాక్షరశాల ప్రొప్రయిటరు.

శ్రీ గ ణే శా య న మః.

——(౦)——

శ్రీ ర స్తు.

——౦——

# ము ని భా వ బో ధి నీ.

——(౦)——

యేనేదం నిర్మితం విశ్వం తద్విశ్వముపజీవితుం । అంతఃప్రవిష్టశ్చాత్మా యస్సవిష్ణుశ్శరణం మమ॥ * * * * *

ఎవనిచే నీపరిదృశ్యమానప్రపంచము నిర్మింపబడినదో ఆజగత్తును బ్రవర్తింపజేయుట కంతర్యామియగుచు నెవఁడు నియామకుఁడై యుండెనో, అట్టివ్యాపకుడగువాడు నాకు రక్షకుడని గ్రంథకర్తయనును.

ధర్మశాస్త్రార్థ సంఘాతవిమర్దవిశదీకృతం । యస్యచేతో విధిసతీ వినోదమకురాయతే॥ సోయంనారాయణగజపతిరాణ్మునిభావబోధినీంధర్మ్యాం। యశసేఽదధాత్యేతాం బహుమునికృత శాస్త్రపద్ధతిం దృష్ట్వా॥

ధర్మశాస్త్రార్థశాస్త్రములయొక్క సంఘర్షణముచేత నిర్మలముగ జేయబడినదై యెవనిచిత్తముసరస్వతికి విలాసార్థమగు శద్దమువలె నుండునో, అట్టి నారాయణగజపతిరాజు, ధర్మమునెడబాయకుండునటుల మునిభావబోధినియను గ్రంధమును, ఋషులచే జేయబడిన శాస్త్రమార్గమునుజూచి, తనకు కీర్తిని శాశ్వతముగ నుంచుటకు రచించుచుండెను.

పృథువిరచితమేతద్ధర్మశాస్త్రం మునీంద్రైస్తదను లఘుమయేదంతత్ప్రదిష్టార్థమేవ। కృతమిహహి సహేతుజ్ఞాపకం నోక్తపూర్వం యది నసదిదముక్తం సజ్జనైః క్షమ్యతాం తత్ ॥

మునులచేతను విస్తృతముగ ధర్మశాస్త్రములురచించబడెను. వారిమతములననుసరించి సంగ్రహముగ పూర్వమందనుక్తమైన హేతువులనునాచేజెప్పబడెనట్టి యుక్తులలో నయుక్తములుండిన నది సత్పురుషులచే క్షమించబడుగావుత.

ఇహఖలు పాణినామాయురారోగ్యైశ్వర్యాది ప్రాపణాయనిష్కామనయానిత్యనైమిత్తికకర్మాచరణేన దురితక్షయద్వారాజ్ఞానినః కర్తుం మోక్ష

సామ్రాజ్యం ప్రాపయితుంచ సర్వజ్ఞాస్సకలనిగమాగమశాస్త్రజ్ఞాస్త్రికాలజ్ఞాస్సకలకళావిదో మునయః పరమకారుణికా జగత్ప్రవృత్తయే ధర్మాననూచురితి వదామః ప్రత్యక్షాగమానుమానైః ॥

ప్రాణులకాయురారోగ్యైశ్వర్యములనొందించుటకును, విధిచోదితులై పరమేశ్వరారాధన బుద్ధిచేతను సంధ్యాపంచయజ్ఞాది నిత్యకర్మములను వ్రతపూజాదినైమిత్తిక కర్మములను, జేయుటచేత పాపనివర్తనపూర్వకముగా జ్ఞానవంతులను జేసి, మోక్షరూపపూజ్యరాజ్యమునొందించుటకు, సర్వనిగమాగమములను దెలసినవారలగుటచే, సర్వజ్ఞులు, భూతభవిష్యద్వర్తమానములను దెలసినవారలు, సకలవిద్యావేత్తలతిదయాళులు, మననశీలురగు ఋషులచే నీప్రపంచమును నడపించుటకు నిశ్చయముగా ధర్మములు జెప్పబడెనని ప్రత్యక్షశబ్దప్రమాణోక్తులచేత నీగ్రంథమందున జెప్పుచున్నారము.

అథజీవాత్మా నిరూప్యతే-

పృథివ్యాది మహాభూతాని సత్యాని ప్రమాణగమ్యత్వాత్తథాత్మాపి సత్యఇతి సూక్ష్మదృష్టయోమన్యంతాం । అన్యథా యది బుద్ధీంద్రియవ్యతిరిక్తో జ్ఞాతా ధ్రువోనస్యాత్ । తర్హ్యేకేన నేత్రేంద్రియేణ దృష్టం త్వితరేణ స్పర్శనేంద్రియేణ కో విజానాతి । యమహమద్రాక్షం తమహం స్పృశామీతి తథా కస్యచిత్పురుషస్య వాచం పూర్వం శ్రుత్వా పునశ్శ్రూయమాణాం వాచం తస్య వాగియమితి తత్ప్రత్యభిజానాతి । తస్మాజ్జ్ఞానేంద్రియవ్యతిరిక్తోజ్ఞాతా నిశ్చిత ఇతి సిద్ధం । ఉత । యద్యాత్మా ధ్రువో నస్యాత్తర్హ్యనుభూతార్థగమ్యాస్మృతిః పూర్వానుభవభావిత సంస్కారోద్బోధనిబంధనా కస్య భవేన్నహ్యన్యేన దృష్టే వస్తున్యన్యస్య స్మృతిరుపపద్యతే । తథా కస్స్వస్వజ్ఞానస్య కారకః । నహీంద్రియాణాముపరతవ్యాపారాణాం తత్కారకత్వం । తథాహమేవాభిజనత్వాది సంపన్న ఇత్యేవం విధానుసంధాన ప్రత్యయః కస్య భవతి । స్థిరాత్మవ్యతిరిక్తస్య తథా శబ్దస్పర్శాది విషయోపభోగ సిద్ధ్యర్థముద్యోగం మనోవాక్కాయైః కః కుర్యాత్తస్మాదపి బుద్ధీంద్రియ వ్యతిరిక్తాత్మాస్థితః । అపిచ మమేదంశరీరమిత్యాది దేహాతిరిక్తాత్మానుభవైః జన్మమరణాభ్యాంజన్మాంతరానుష్ఠిత ధర్మనియతాభ్యాం దేహాతిరిక్తాత్మానుమానంజన్మాంతరగతకర్మానుష్ఠాతృనియతతయా తథాగమనాగమనాభ్యాంజ్ఞానేచ్ఛాప్రయత్నాధారనియతాభ్యామపి భౌతికదేహాతిరిక్తాత్మానుమానంతథాశుభకర్మానుష్ఠానాశుభకర్మపరిత్యాగైశ్చ జ్ఞాననియతైర్దేహాతిరిక్తాత్మానుమానం భూతం

పశకునజ్ఞానగ్రహాదిసంయోగజఫలైశ్చ నక్షత్రసంచారజాగరావస్థాజన్యసచ్ఛిద్రావిత్యాదిదర్శనైశ్చ స్వప్నజైః ఖరవరాహాదియుక్తరథారోహణాది జ్ఞానైశ్చ సాక్షాత్పరంపరయావా ఆత్మనోద్యోతకాని దృశ్యంతే తస్మాదస్తి దేహాతిరిక్త ఆత్మేతి సిద్ధం॥

ఈపైని జీవాత్మను నిరూపింతుము.

భూమిమొదలైనమహాభూతపంచకము సత్యము- ప్రమాణముచేత నగపడుటవలన ఆలాగుననే ఆత్మయును సత్యమని సూక్ష్మదృష్టిగలవారలు తలచవలెను. ఆలాగునగానుండిన బుద్ధీంద్రియములకంటె వేరైన జ్ఞాత లేకపోవును- అయితే ఒకటియగు నేత్రేంద్రియముచే జూడబడిన వస్తువితరమగు స్పర్శేంద్రియముచేత నెవడు తెలుసుకొనును- ఎవడు నాచే జూడబడినాడో వాడు స్పృశింపబడినాడనియును ఆలాగుననే పూర్వమొక పురుషునిమాట విని కాలాంతరమందున తిరుగ నిను నామాటను మొదట వినినవానిగా తెలిసికొనును గనుకను జ్ఞానేంద్రియాదులకు వ్యతిరిక్తుడగు జ్ఞాత నిత్యుడని చెప్పగలము. ఇంతియెకాదు ఒకవేళ ఆత్మ నిత్యుడు గానట్లైతే అనుభూతమగు ప్రయోజనమును గోచరించు స్మృతి పూర్వమనుభవించుటచేత నూహించబడిన వాసనచేతను స్ఫురించడముయొక్క- సంబంధమెవ్వానికయ్యెను- ఇతరునిచేత జూడబడిన వస్తువునందు మరియొకనికతిశార్థము గోచరించిన జ్ఞానము సంభవించదు. ఆప్రకారముగానే స్వప్నవిషయజ్ఞానమును బుట్టించువాడెవడు- వ్యాపారశూన్యమైన చక్షురాదీంద్రియములకు స్వప్నమును బుట్టించుట సంభవించదు- నేనే కులము ధనము గలుగువాడనను అనుసంధానజ్ఞానమెవనికవుచున్నది. నిత్యుడగు నాత్మకంటె వేరగు నెవనికి శబ్దస్పర్శాద్యనుభవసిద్ధికొరకు ప్రయత్నము మనోవాక్కాయకర్మములచే నెవడొనర్చును- ఈ హేతువులవలనను బుద్ధీంద్రియములకంటెను వేరైన ఆత్మ గలడు- భౌతిక దేహము లింద్రియములు బుద్ధి మొదలగునవియాత్మ కాదని- అణుస్వరూపము, స్వల్పము కానిది, కురచ కానిది, హస్తపాదములు లేనిది యాత్మయని వేదప్రమాణములచేతను ఇది నాశరీరమను మొదలగు దేహముకంటె వేరైన ఆత్మానుభవములచేతను జన్మాంతరమందు చెయ్యబడిన ధర్మము నియామకముగాగలిగిన జన్మమరణముల వలన దేహాతిరిక్తాత్మానుమానము జన్మాంతరమును బొందినట్టువంటి కర్మను జేయుటకు నియామకమగుటచేతి నాప్రకారముగానే జ్ఞానము ఇచ్ఛ ప్రయత్నమాధారముగాగల గమనాగమనములచేతను పృథివ్యాదిభూతవికారమైన దే

హముకంటె వేరగువాడాత్మయని యనుమానము. * * *

ఆ ప్రకారముగానే జ్ఞానముచేత నియమించబడిన శుభకర్మముల నాచరించుటయు నశుభకర్మముల బరిత్యజించుటచేతను దేహముకంటె భిన్నమైన ఆత్మానుమానము- భూకంపము శుభాశుభసూచక శకునజ్ఞానము- శుభారిష్టగ్రహముల సంయోగవియోగములవలనగలుగు ఫలములచేతను నక్షత్రగమనములవలన వచ్చెడి యనిష్టము నిష్టమును జాగ్రదవస్థలయందుత్పన్నములయ్యెడి ఛిద్రయుక్తమైన సూర్యదర్శనముచేతను స్వప్నమందునబుట్టు గర్దభవరాహాదులను బూన్చిన యరదమందధివసించిన జ్ఞానముచేతను స్వతహా లేక పరంపరచేతనైనను ఆత్మయొక్క స్థితిని సూచనజేసినవియై జూడబడుచున్నవి గనుక దేహాతిరిక్తుడును సర్వవ్యాపియునగు నాత్మ కలడని స్పష్టము.

హతం జ్ఞానం క్రియాహీనం హతాస్త్వజ్ఞానతః క్రియాః । అపశ్యన్నంధకో దగ్ధః పశ్యన్నపిచ పంగుకః ॥

ఆచరణకు దేకుండిన తెలివియును, తెలివిలేక జేసినదియును వ్యర్థము. చూడక గుడ్డినాడును, చూచి నడువలేక కుంటివాడును గాలునింటిమంటచే మంటినంటును.

ఆధాతో ధర్మం వ్యాఖ్యాస్యామః

ఇదం ధర్మలక్షణమసూత్రయత్। చోదనాలక్షణార్థో ధర్మ ఇత్యుభయం చోదనయా లక్ష్యత ఇతి జైమినిః॥ శ్రేయస్సాధనం ధర్మః ప్రత్యవాయసాధనమధర్మ ఇతి సూత్రార్థః॥ తత్ర ధర్మోద్వివిధః పరోఽపరశ్చ। అత్ర పరమధర్మో నిరూప్యతే। ఆత్మజ్ఞానమేవ పరమధర్మః। తదుక్తం యోగీశ్వరేణ॥ అయంతు పరమో ధర్మో యద్యోగేనాత్మదర్శనమితి॥

ఆత్మసద్భావే కింప్రమాణమితిచేత్తన్నిరూప్యతె। తథాచ శ్రుతిః॥ యతోవా ఇమాని భూతాని జాయంతే। యేన జాతాని జీవంతి। యత్ప్రయంత్యభిసంవిశంతి। తద్విజిజ్ఞాసస్వ। తద్బ్రహ్మేతి॥ 'జగదుత్పత్తిస్థితిలయోపాదానత్వం బ్రహ్మణో లక్షణం॥ ఏతదాత్మలక్షణమనుమానసిద్ధమపి॥

నిర్విఘ్నపరిసమాప్తికొరకు మంగళాచరణమొనర్చి గ్రంథారంభప్రయోజనమును జెప్పి యనంతరము ధర్మమునుం బల్కెదము.

శ్రేయస్సాధనము ధర్మమనియు, ప్రత్యవాయజనకమగునది యధర్మమనియును జైమినిసూత్రము.

ధర్మము పరమనియు నపరమనియు రెండు విధములు. ఈపైని పరమధర్మము నిరూపింపబడును. ఆత్మను తెలిసికొనుటయే పరమధర్మము. యాజ్ఞవల్క్యస్మృతి యుపాయముగా నాత్మను దర్శించుటయే పరమధర్మమనిబల్కెను.

ఈ ప్రపంచనిర్మాణపాలన లయములకు కారణమగుటయే బ్రహ్మలక్షణమని శ్రుతి.

అట్టిబ్రహ్మమును బొందించుటకు హేతువగు నాత్మజ్ఞానమే స్వరూపముగాగల పరమధర్మము. ఈఆత్మలక్షణము శబ్దప్రమాణముగాక ననుమానసిద్ధమును.

నను ఆత్మనః స్వకాశాదేతజ్జగత్కథముత్పన్నమిత్యాకాంక్షాయామాహ యథాహి కుంభకారః చక్రమృత్స్నాదికం కరణజాతం స్వీకృత్య కరక శరావాదికం నానావిధం ద్రవ్యజాతం రచయతి యథా వా వర్ధకిః వాసమృత్పాద్యైః పరస్పరసాపేక్షైః గృహాదికం కార్యం కరోతి। యథా వా స్వర్ణకారకః కేవలం హేమాద్యుపాదాయ కటకమకుటాదికార్యముత్పాదయతి। యథా వా కీటవిశేషో నిజలాలయా ఆత్మబంధనం కోశాఖ్యమారభతే। తథాత్మాపి పృథివ్యాదీని సాధనాని పరస్పరసాపేక్షాణి తథాకరణానిచ శ్రోత్రాదీని స్వీకృత్య అస్మిన్ సంసారే తాసు తాసు సురాదియోనిషు స్వయమేవాత్మానం స్వకర్మబంధబద్ధం శరీరతయా సృజతి॥

యద్యపి - ఈశ్వరః స్వరూపేణ సత్యజ్ఞానానంద లక్షణస్తథాప్యవిద్యాసమాపన్నకామ క్రోధరాగాదిభావైరనుభూయమానో నానాహీనయోనిజననసాధనం మానసాది త్రివిధం కర్మనిచయమాచరతి తేనచాంత్యాది హీనయోనిషూత్పద్యతే ॥తథాచమనుః॥ పరద్రవ్యేష్వభిధ్యానంమనసానిష్టచింతనం। వితథాభినివేశశ్చ త్రివిధంకర్మ మానసం। పారుష్యమనృతంచైవ పైశున్యంచాపిసర్వశః। అసంబద్ధప్రలాపశ్చ వాఙ్మయం స్యాచ్చతుర్విధం। అదత్తానాముపాదానం హింసాచైవావిధానతః। పరదారోపసేవాచ శారీరంత్రివిధంస్మృతం। మానసం మనసైవాయముపభుంక్తే శుభాశుభం। వాచావాచాకృతంకర్మ కాయేనైవచ కాయికం।శరీరజైఃకర్మదోషైర్యాతిస్థావరతాంనరః। వాచికైఃపక్షిమృగతాం మానసైరంత్యజాతితాం।వాగ్దండోథ మనోదండః కాయదండస్తథైవచ।యస్యైతేనిహితాబుద్ధౌత్రిదండీతిసఉచ్యతే॥ త్రిదండమేతన్నిక్షిప్య సర్వభూతేషుమానవః। కామక్రోధౌతు సంయమ్య తతస్సిద్ధింనియచ్ఛతీతి॥

ఆత్మవలన సకలమగునీజగమేరీతిని బుట్టినదని శంకించుకొని బల్కుచున్నారము.

కుమ్మరి మన్ను, చక్రము మొదలగు పరికరములను బరిగ్రహించి నానావిధమృత్పాత్రల నెట్లు రచించునో, ఒడ్డరి గడ్డి, కఱ్ఱలు, మృత్తిక మొదలగు నన్యోన్యాపేక్ష గలవాటిచేతను గృహనిర్మాణ మెట్లొనర్చునో, బంగరు పనివాడొకే బంగారమును మాత్రమే గ్రహించి కడెయను కిరీటము మొదలగు నలంకారకార్యముల నెట్లు బుట్టించుచున్నాడో, కీటవిశేషమెటులటునిటులగ దలకనుండక తనచే నొంగచే నారంభించినకోశమును దనబంధమును జేయునో ఆరీతి నాత్మయును నన్యోన్యాపేక్షితములగు పృథివ్యాదిసాధనములను శ్రోత్రాదీంద్రియములను స్వీకరించి యీసంసారమందాయాయి సురనరాదియోనులందు తానే దనకర్మబంధమువలనబద్ధుడై శరీరమును సృజించుకొనును. ఆలోచించగా నీశ్వరుడు సత్యజ్ఞానానందస్వరూపుడైనప్పటికిని మాయాసమావేశమువలన మోహరాగాదిచేష్టలచేతను బరస్పరులై యనేకవిధములైన హీనయోనులందు జనించుటకు కారణమైన మనోవాక్కాయకర్మములను జేయుచున్నాడు. పరద్రవ్యాభిలాష, ఇతరులకనిష్టచింతనము, దేహాత్మభ్రమయు, నీమూడువిధములగు మానసకర్మయును పరుషము, అనృతము, కొండెము, వ్యర్థప్రలాపము యీనాలుగువిధములగు వాగ్వ్యాపారమును- దొంగలించుట, వేదబోధితముగానిహింస, పరదారాగమనము యీమూడువిధములగు శారీరకర్మములు- నీయడుగున వివరించురీతి ననగా, మానసికకర్మము మనస్సుచేతను, వాక్కృతము వాగ్వ్యాపారముచేతను, శారీరము శరీరముచేతను శుభాశుభములను దేహియనుభవించును. శరీరముచే జేయబడు కర్మలచేతను స్థావరత్వమును, వాచకముచేతను పక్షిమృగత్వమును, మానసికముచేత సంత్యజత్వమును నరుడొందును.

వాగ్దండమనోదండ కాయదండములనగా, సత్యప్రియవచనశీలతయును, అసత్యసంకల్పశూన్యతయును, నిషిద్ధవ్యాపార రాహిత్యమెవని బుద్ధియందుండు నట్టివాడు త్రిదండియనంబడును. త్రిదండమును సర్వభూతములకు నుపచరించునటుల జేసి యనగా మనోవాక్కాయదమనమును జేసి క్రోధనియమనమొనర్చి, మోక్షసిద్ధిసాబరిశుద్ధుడొందగలడని మనువచనములు.

నను ప్రాకృతికప్రళయసమయె మహదాద్యఖిల వికారనాశే కర్మణో నాశాత్కథం తన్నిబంధనః ప్రథమపిండపరిగ్రహ ఇత్యాశంకాయాం బ్రూ

మః । మనోహంకారౌ సంసరణహేతుభూతో దోషరాశిశ్చ । కర్మఫలం లింగాత్మకం శరీరంచ బ్రహ్మసాక్షాత్కారం వినా న ముచ్యతే । అతః బ్రహ్మసాక్షాత్కారాదయమాత్మా ముచ్యతే॥

ప్రాకృతిక ప్రళయ సమయమున మహదాది సకల వికారములకును వినాశముకలుగుచుండగా కర్మములకును నాశము కలుగుచున్నది. ప్రథమపిండపరిగ్రహమునకట్టి కర్మములు లేకున్ననెట్లు మొదటిపిండ సంగ్రహమగుచున్నదని శంకించుకొని జెప్పుచున్నారము.

మనోహంకారములు, సంసరణకు కారణమైన దోషరాశియు, కర్మఫలమైన లింగశరీరము బ్రహ్మసాక్షాత్కారము లేకుండిన విడువబడవు.

నను ప్రాగ్జన్మనీయజ్ఞానస్యాప్యాత్మప్రకాశత్వాత్తస్య చ స్వతస్సిద్ధిత్వాన్నానుపలంభో యుక్త ఇత్యాశంక్య యోగీశ్వరేణోక్తం॥ మలినోహి యథాదర్శో రూపాలోకస్య న క్షమః। తథాఽవిపక్వకరణఅత్మజ్ఞానస్య న క్షమః। కటుకాయాం యథా పక్వా మధురస్సన్ రసోపి న। ప్రాప్యతేహ్యాత్మని తథా నాపక్వకరణేజ్ఞతా। సర్వాశ్రయాం నిజే దేహే దేహీ విన్దతి వేదనాం। యోగముక్తశ్చ సర్వాసాం యో న చాప్నోతి వేదనాం॥ యథా పుర్స్యదేహీ దేహాభిమానయుక్తః సర్వాత్మికామాధ్యాత్మికాది రూపాం వేదనాం స్వకర్మార్జిత ఏవ దేహం ప్రాప్నోతి । దేహాంతరంగత భోగాయతనారంభాదృష్ట వైలక్షణ్యాద్దేవ యస్తు యోగీ ముక్తో ముక్తాహంకారాదిః సకలక్షేత్రజ్ఞగతానాం సుఖదుఃఖాది సంవిదాం వేత్తా భవతి పరిపక్వకరణత్వాత్॥

ప్రాగ్జన్మజ్ఞాన మాత్మను ప్రకాశింపజేసెదవుటవలన నది స్వతస్సిద్ధమైనందువలన, నిందయుక్తము కాదని శంకించుకొని యోగీశ్వరునిచేతను జెప్పబడినది.

మలినమగునద్దములో రూపమును జూచుటకుపయోగించదు. అలాగుననే ఇంద్రియజయము లేనివాడు ఆత్మజ్ఞానమునకసమర్థుడు. చేదుదోసకాయయందు మధురరసము మొదటనుండును గాని పండనిది మధురరసమగపడదు. అలాగుననే ఆత్మయందు అపక్వేంద్రియుడగుటవలన నజ్ఞానుడై యుండును. వాడు దేహాభిమానయుక్తుడై ఆధ్యాత్మికాది రూపమైన నానావిధపీడను దనప్రాగ్జన్మకర్మచే నార్జించబడిన యాదేహమందుననే బొందును. దేహాంతరమును బొందినటువంటి సుఖదుఃఖములకు సాధనమైన శరీరమునకు జనక

మైన యదృష్టవిశేషమువలన విడువబడిన యహంకారముగల ముక్తుడైన యోగియైతే సమస్తజీవులను బొందినట్టి సుఖదుఃఖాది జ్ఞానమును, పరిపక్వమైన ఇంద్రియములు గలవాడౌటవలన జ్ఞానము గలవాడగును.

నన్వేకస్మిన్నాత్మని దేవమనుష్యాది శరీరేషు భేదప్రత్యయోనఘటత ఇత్యాశంక్య వదామః॥

యద్వైకమేవ వియత్కూపకుంభాద్యుపాధిభేదం నానేవానుభూయతే। యథావైకో విభాకరో విభిన్నేష్వాపకభాజనేషు కరక మణిక మల్లికాదిషు నానేవానుభూయతే। తథైకో ప్యాత్మా అంతఃకరణోపాధిభేదేన నానా ప్రతీయతే। కించాత్మనస్సర్వాత్మకత్వదర్శనేన రాగద్వేషాభావా దధర్మనివృత్తిరూపం దృష్టఫలంచ దృశ్యతే॥ సర్వమాత్మని సంపశ్యన్నాధర్మే కురుతే మన ఇతి మనుః।

ఒకడగు నాత్మయందు దేవమనుష్యాది శరీరభేదజ్ఞానము సంభవించదని శంకించుకొని బల్కెదము. ఒకటియైన యాకాశము, నుయ్యి, కుండ మొదలగు నుపాధిభేదమందనేకాకాశములవలె నగుపడురీతి, సూర్యుడొకడే నానావిధములైన కమండలము, కాగు, మండిగ మొదలగు జలపూరితపాత్రలందనేక సూర్యులవలె గోచరుడగునో ఆప్రకారముగా నొకడగు నాత్మయంతఃకరణోపాధి భేదములవలన ననేకాత్మలుగా ప్రతీయమానమగును- సకలమాత్మగా జూచుటచే సమత గలిగి యధర్మమును జేయకుండును గానదీనిచే దృష్టఫలంబును గనబడుచున్నదని మనువు.

చతుర్వింశతితత్త్వాని క్షేత్రమితి పంచవింశకో జీవః క్షేత్రజ్ఞ ఇతి యోగీశ్వరేణోక్తం ॥తద్యథా॥ బుద్ధీంద్రియాణి సార్థాని మనః కర్మేంద్రియాణిచ। అహంకారశ్చ బుద్ధిశ్చ పృథివ్యాదీని చైవహి। అవ్యక్తమాత్మా క్షేత్రజ్ఞః క్షేత్రస్యాస్య నిగద్యత ఇతి॥

ఇరువది నాలుగు తత్త్వములు క్షేత్రమనియు నిరువదైదవవాడు జీవుడు క్షేత్రజ్ఞుడనియును యోగీశ్వరునిచేతను జెప్పబడెను. అది యెట్లనిన, త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములైదును జ్ఞానేంద్రియములు. వాటివిషయములగు శబ్దస్పర్శరూపరసగంధములైదు మనంబొకటి వాక్పాణిపాదపాయూపస్థలైదు కర్మేంద్రియములు. అహంకారము, బుద్ధియును, రెండు-పృథివ్యాపస్తేజోవాయ్వాకాశములైదు, నవ్యక్తమొకటి- యీ యిరువదినాలుగును క్షేత్రమనబడును. క్షేత్రజ్ఞుడిరువదైదవవాడు.

నను దేహేంద్రియవ్యతిరిక్తాత్మసద్భావేసత్యాధిభౌతికాధ్యాత్మికాధిదైవికదుఃఖ మనుభవామీతి పురుషః కథంమన్యతే। వస్తుతోఽపి తథైవదుఃఖం సుఖంచానుభూతఇవ దృశ్యతేచ తస్మాదస్మాద్దేహాద్వ్యతిరిక్తః క్షేత్రజ్ఞఇతి కథంమన్యామహే ఇత్యాశంక్యవదామః॥

సత్యజ్ఞాననిర్మలనిర్వాణమయోప్యాత్మా సుఖదుఃఖాజ్ఞానాదయోధర్మాః ప్రకృతివికృతయఏవ యథా స్థాల్యగ్నిసంపర్కాత్తద్గతోదకస్యశబ్దోద్రేకాదయోధర్మాస్పృశ్యంతే। తద్వత్ప్రకృతిసంసర్గాదహంభావాది దూషితః ప్రాకృతాన్ధర్మాన్భజతివభాతి। అవ్యయస్సపురుషో గగనేభ్రఇవ నిర్లేపశ్శరీరే తిష్ఠతీత్యవగంతవ్యం॥

తథాచ శ్రీవిష్ణుపురాణే॥ నిర్వాణమయఏవాయమాత్మాజ్ఞానమయోఽమలః। దుఃఖాజ్ఞానమయాధర్మాః ప్రకృతేస్తేతు నాత్మనః। జలస్య నాగ్నిసంసర్గస్థాలీసంగాత్తథాపిహి। శబ్దోద్రేకాదికాన్ధర్మాన్సంకరోతి యథానృప। తథాత్మా ప్రకృతేస్సంగాదహంమానాదిదూషితః। భజతే ప్రాకృతాన్ధర్మానన్యస్తేభ్యోహిసోఽవ్యయ ఇతి॥

దేహేంద్రియములకంటె వేరైనవాడాత్మైనట్లైతే భూతములు నిమిత్తముగా జేసికొనునట్టియది యాధిభౌతికమనబడు ననగా మృగములు మొదలగువాటివలన గలుగు దుఃఖము. ఆత్మను దేహాదికమును నిమిత్తముగ జేసికొనివచ్చేదాధ్యాత్మికము. రోగాదులను, కామక్రోధాదులను, కేవలము దైవమునే నిమిత్తముగా జేసికొనివచ్చేది యాధిదైవికము. శీత వాతాదులచే బుట్టినవి. ఈదుఃఖములననుభవించుచున్నాడనని పురుషుడేలతలచును. నిజముగా సుఖదుఃఖములననుభవించువానివలె గనబడుచున్నాడు. గాననీదేహముకంటె వేరైనవాడు క్షేత్రజ్ఞుడని మేమెట్లుదలచెద మీలాగునశంకించుకొని జెప్పుచున్నారము.

సత్యజ్ఞాన నిర్మలకైవల్యస్వరూపుడాత్మ. సుఖదుఃఖాదిధర్మములు మాయాకార్యములు స్థాలికగ్నిసంపర్కము గలుగుటచేతను దానియందుండు నుదకమునకు పొంగుట, కాగుటచే బుట్టుశబ్దము మొదలగు ధర్మములెట్లుగలుగుచున్నవో, అటువలెనే ప్రకృతిసంబంధమువలన యహంకారమమకారములచేతను దూషితుడై మాయాజనితకృత్యములను బొందుచు నున్నవాడువలెనుండును. నిత్యుడగు నాపురుషుడు, ఆకాశమందు మేఘునివలె నిర్లిప్తుడై శరీర

ముందుండు నిందువిషయమై వ్రాసిన విష్ణుపురాణ వచనములను జూడుడు.

అపిచ ననుజాగ్రద్దశాయామనుభూత శీతోష్ణాదిరూప సుఖదుఃఖాదికంచానుభూత నదనదీ పురపల్లి పర్వత సురనర సరీసృప మృగ కీట పక్ష్యాద్యఖిల జీవకోటీశ్చ, బాల్య యౌవన వృద్ధత్వాద్యవస్థాశ్చ, స్వర్గనరకాద్యనుభూతీశ్చ, కథం విస్మృత్యేంద్ర జాలికావస్థావద్భ్రమయే ధారయామ ఇతిచేద్బ్రూమః యథాస్వప్నానుభూత పూజ్య రాజ్య లలిత వనితాస్రక్చందనాద్యఖిలభోగ్యాని జాగ్రద్వేళాయామసత్ప్రతీతిరేతదితి మన్యామహే తద్వద్దృశ్యమాత్రధిషణావస్థాయామేతజ్జాగ్రదపి సర్వం మనఃపరిణామ ఏవ॥ తథాచ శ్రీవిష్ణుపురాణే॥ మనఃప్రీతికరస్స్వర్గో నరకస్తద్విపర్యయః। నరకస్స్వర్గసంజ్ఞే వై పాపపుణ్యే ద్విజోత్తమ। వస్త్వేకమేవ దుఃఖాయ సుఖాయేర్ష్యోద్భవాయ చ। కోపాయచ యతస్తస్మాద్వస్తువస్త్వాత్మకం కుతః। తదేవప్రీతయే భూత్వా పునర్దుఃఖాయజాయతే। తదేవకోపాయచ పునఃప్రసాదాయచ జాయతే। తస్మాద్దుఃఖాత్మకంనాస్తి నచకించిత్సుఖాత్మకం। మనసఃపరిణామోయం సుఖదుఃఖాదిలక్షణః। జ్ఞానమేవ పరంబ్రహ్మ జ్ఞానం బంధాయ నేష్యతే। జ్ఞానాత్మకమిదంవిశ్వం నజ్ఞానాద్విద్యతేపరం। విద్యావిద్యేచ మైత్రేయ జ్ఞానమేవోపధారయేతి॥ శ్రీభాగవతేపి॥ మనోమయత్వాత్సర్వథా స్వప్నజాగరయోస్సమా ఇతి॥ * * * * * * *

ఇంతియేకాదు- జాగ్రదవస్థయందనుభవింపబడు శీతోష్ణాదిరూప సుఖదుఃఖములనుభూతములైన పురములు పల్లియలు పర్వతములు సురనరనదీనదసరీసృపపశుపక్ష్యాదికమగు జీవసముదాయమును బాల్యయౌవనవార్ధకావస్థలను స్వర్గనరకములననుభవించుటయును మేమెట్లుమరచి యింద్రజాలికావస్థలవలె దలంచెదమని శంకించి సమాధానమును జెప్పుచున్నారము.

స్వప్నమందనుభవింపబడిన పూజ్యరాజ్య రమారమణీపరిగ్రహము పరవనితాస్రగ్దామచందనాద్యఖిలభాగ్యైశ్వర్యములును జాగ్రద్దశయందలి యాస్థియును మాయాజనితములని దలంచినటులనే యాత్మానుభవసమయమున నీజాగ్రదవస్థయును దలంపబడునుగాన సుఖదుఃఖాద్యఖిలమును మనోవికారములేను. * * * * *

శ్రీవిష్ణుపురాణవచనములిందుకుప్రమాణములు- స్వప్నజాగరాను

ఘూతిన కల్యార్థములును మనంబుచేసగునుగాన స్వప్నజాగ్రదవస్థలకు భేదములే దని తెలియవలెను. * * * *

శ్రు॥ య ఏనం విదురమృతాస్తే భవంతీతి బ్రహ్మవిత్ప్రశ్నాక్షణే చ యదుక్తం తత్స్వనదీకరోమి యే పురుషా ఏనం పరమాత్మానం ఏకాగ్రేణ మనసా విదుః సాక్షాత్కుర్వంత్యపరోక్షజ్ఞానినో భవంతి తే పురుషా అమృతా మరణరహితా భవంతి దేహాత్ప్రాణానాముత్క్రాంతిర్మరణం తచ్చ తత్త్వవిదాం నాస్తి న తస్య ప్రాణా ఉత్క్రామంత్యత్రైవ సమవలీయంత ఇతి శ్రుతేః॥ ఘటాశ్రితాకాశో విభిన్నే ఘటే మహాకాశే యథైకత్వమాపద్యతే తద్వత్ బ్రహ్మాతీతి బ్రహ్మ తద్వేత్తీతి బ్రహ్మవిత్ విదజ్ఞానే తస్మిన్వ్యాపకే బ్రహ్మణి తత్ప్రతిబింబచైతన్యాని వ్యాప్యాన్యేకీభవంతీత్యర్థః॥

ఎవనియాత్మను ఏకాగ్రమగు మనంబుచేతను సాక్షాత్కారమునర్చి కొనుదురో వారలు మోక్షము నొందుదురని బ్రహ్మను దెలిసినవాడు బ్రహ్మ మునొందునని జెప్పిన శ్రుత్యర్థములను స్పష్టపరచుచున్నారము- దేహమువలన ప్రాణములు బయలు దేరుట మరణము- అది తత్త్వమును దెలసినవారలకు లేదు. ముక్తిని ప్రాణములకుత్క్రమణము లేదు. అచటనే అంతర్యామియందణగును. ఘటమందగునాకాశమాఘటమునకు విఘాతమైన మహదాకాశమం దెటులణగున మగునో అటువలెనే బ్రహ్మశబ్దమునకు విస్తృతమర్థమట్టివ్యాపకమైన బ్రహ్మ మందున నాబ్రహ్మముయొక్క ప్రతిబింబచైతన్యము లేకమగుచున్నవి.

సాంఖ్యయోగాదయో ఉపాసనావిధయశ్చ గాంధర్వాదయశ్చ విద్యా స్సకలాశ్చైతైః కాగ్రతాముపపాదయంతశ్చోత్పన్నా ఇతి వదామః॥

సాంఖ్యా నిరీశ్వరాః కేచిత్కేచిదీశ్వరదేవతాః। పంచవింశతితత్త్వానాం వివేకేనాత్మదర్శనం। యస్మిన్భవతి తత్సాంఖ్యం వదామస్స్మృతిబోధనాత్। సాక్షాన్నారాయణో వ్యాస స్స్వస్మృతావుక్తవానిదం। శుద్ధాత్మతత్త్వవిజ్ఞానం సాంఖ్యమిత్యభిధీయత ఇతి॥ సమ్యఖ్యాయతే అనయేతి సంఖ్యా సంఖ్యాయాః భవం సాంఖ్యం యోగ్యయయాబుద్ధ్యా తత్త్వాని విమృశ్య తత్సాక్షిత్వేన ప్రకాశమానమాత్మానమహమితి నిశ్చినోతి సజీవన్ముక్తో భవతి తథా చ శ్రుతిః జీవః పంచవింశకః స్వకల్పితచతుర్వింశతితత్త్వం పరిత్యజ్య షడ్వింశకపరమాత్మాహమితి నిశ్చయాజ్జీవన్ముక్తో భవతీతి॥ ఆత్మా క్షేత్రజ్ఞసంజ్ఞోయం సంయుక్తః ప్రాకృతైర్గుణైః। తైరేవ విగతశ్శుద్ధః పరమాత్మా నిగద్యత ఇతి శ్రీవిష్ణుధర్మోత్తరే॥

సాంఖ్యము, యోగము, ఉపాసనావిధులు, గాంధర్వాది సకలవి ద్యలును చిత్తైకాగ్రతను గలుగజేయుటకు నుత్పన్నమైనవని జెప్పగలము.

నిరీశ్వరసాంఖ్యులనియును, సేశ్వరసాంఖ్యులనియును ద్వివిధనాం ఇరువదైదుతత్త్వములయొక్క వివేకముచేత నాత్మదర్శనమెనర్పడము చేనియ దగుచున్నదో అదియే సాంఖ్యమని వ్యాసులవారు తమస్మృతియందు చెప్పడ ముచేతను శుద్ధమగు నాత్మతత్త్వవిజ్ఞానమే సాంఖ్యమని జెప్పుచున్నారము. దీని చేతను తెస్సగా జెప్పబడుగాన సాంఖ్యమనబడును. సంఖ్యవలనబుట్టేది సాం ఖ్యమనబడు నెవడు నిష్క్రియాత్మికమైన బుద్ధిచేతను తత్త్వవిచారణనుజేసి వాటి కి సాక్షియగుటచేతను ప్రకాశమానుడైన యాత్మ దానని నిశ్చయముకలవాడ గునో వాడు జీవన్ముక్తుడగుచున్నాడు.

ఇరువదైదవవాడగు జీవుడు తనచేతను గల్పించబడిన యిరువదినా లుగు తత్త్వములను త్యజించి యిరువదారవవాడగు పరమాత్మ దానను నిశ్చ యముచవలన జీవన్ముక్తుడగుచున్నాడని శ్రుతిప్రమాణము. ప్రకృతిగుణములతో గూడినయాత్మ క్షేత్రజ్ఞుడనబడును. ప్రకృతిగుణముల నొందని బరిశుద్ధాత్మ పర మాత్మయని విష్ణుధర్మోత్తరమునందుండెను.

చిత్తవృత్తేర్విషయాంతరతిరస్కారేణాత్మని స్థైర్యం యోగః॥ యోగ శ్చిత్తవృత్తినిరోధఇతి పాతంజలం సూత్రం॥

శ్రీవిష్ణుపురాణేపి॥ ఆత్మప్రయత్నసాపేక్షా విశిష్టాయా మనోగతిః। త స్యాఃబ్రహ్మణిసంయోగో యోగఇత్యభిధీయతఇతి॥ అస్యార్థః॥ ఆత్మనః ప్రయ త్నో యమనియమాదివిషయః। తత్సాపేక్షా। తదధీనావిశిష్టా। సత్త్వమయీ। మనసోవృత్తిః। తస్యాః బ్రహ్మణ్యేవ సంయోగో యోగః॥

చిత్తవ్యాపారమునకు నితరవ్యాపారస్పర్శనములేక నాత్మయందే నిశ్చలమైయుండుట యోగము. చిత్తవృత్తినిరోధమే యోగమని పాతంజలసూ త్రము. యమనియమాదియత్నముచేతను తదధీనమైన సత్త్వవృత్తిగలమనంబును బ్రహ్మయందునగూర్చుటయే యోగమని శ్రీవిష్ణుపురాణము.

ఆత్మవ్యతిరిక్తవిషయేభ్యో మనోబుద్ధిస్మృతీంద్రియాణి ప్రత్యాహృత్య ఆత్మైకవిషయాణి కృత్వా ఆత్మా ధ్యేయః యోసౌ ప్రభుర్నివాతస్థదీపవద్దేదీ ప్యమానో నిష్ప్రకంపో హృది తిష్ఠతి। ఏతదేవ తస్య ధ్యేయత్వం। యశ్చిత్త వృత్తేర్బహిర్విషయావభాసతిరస్కారేణాత్మప్రవణతానామ శరావసంపుట నిరుద్ధప్రభాప్రతానప్రసరస్యేవ ప్రదీపస్యైకనిష్ఠత్వం తథాచ యోగీశ్వరః॥ అన

స్వవిషయంకృత్వా మనోబుద్ధిస్మృతీంద్రియం ధ్యేయ ఆత్మాస్థితో యోసౌహృదయే దీపవత్ప్రభుంతి॥ * * * *

ఆత్మకంటె వేరైనవిషయములవల్లనుండిసంకల్పవికల్పాత్మికయగుమనంబును, నిశ్చయాత్మికయగు బుద్ధిని, వ్యతీతవిషయికజ్ఞానముగల స్మృతిని, ఇంద్రియములను మళ్లించి యాత్మను గోచరించునటులజేసి ధ్యానగోచరునిగ జేయవలెను. ఏయీజగదుదయస్థితిలయకర్త వాతరహితస్థలదీపమువలె నచలుడై దహరాకాశమందుండును. * * *

మనోవ్యాపారమునకు ప్రాపంచికవిషయములందున స్ఫురించకుండ మళ్లించి ఆత్మయందుఁ గూర్చుటనగా నభిముఖముగ జోడించబడిన రెండగు మూకుడులమధ్యను వెలగు దీపదీప్తిప్రసారమువలె నితరమునందు వ్యాపించక నిశ్చలముగ విశేషదీప్తిగలుగుటదియే యట్టి యాత్మను ధ్యానించదగుట యోగీశ్వరుండగు యాజ్ఞవల్క్యర్షి యిటులనెను.

మంతారం త్రాయత ఇతి మంత్రాః మంత్రాస్సర్వే బ్రహ్మైక్యానుసంధానచణాఏవ మహావాక్యానుబోధేన తదుపాసకాన్బ్రహ్మీభూతాన్కృత్వా సంసారార్ణవాత్త్రాయంతె తథాచ శ్రుతిః॥ నమస్త్వమర్థో విజ్ఞేయో రామస్తత్పదముచ్యతె। అసీత్యర్థే చతుర్థీస్యాదేవంమంత్రేషుయోజయేదితి॥

నన్వఖిలవాఙ్మయబీజభూతపంచాశద్వర్ణపఠనేనాశేషవైశేషికాముష్మికాది ఫలదాయినో మంత్రాస్సర్వే జపితా ఇతి మన్యామహా ఇతిచేత్తన్నసదితి సదృష్టాంతం బోధయామః॥ * * *

క్షారగంధకాంగారకా యథాభాగమేళనేన బహువిధాగ్నిబాణా భవంత్యేవ సఏవ భాగమేళనమనాదృత్యైకీకృత్యాగ్నినా దహ్యతేచేత్కిమపి వైచిత్రిం నరచయతి తద్వత్పంచాశద్వర్ణాః నిగమాగమోక్తరచనేన మంత్రీభూతా జపకర్తృణాం ఫలదాభవంత్యేవ నకేవలమఖిలవర్ణపఠనేన॥

మననముజేయువానిని రక్షించునది గాన మంత్రములనబడును. అట్టి మంత్రములన్నియును బ్రహ్మైక్యబోధకములగుట ప్రసిద్ధములయ్యున్నవి. మహావాక్యానుసంధానమువలన నట్టి యుపాసకులను మంత్రములు బ్రహ్మీభూతులను జేసి సంసారార్ణవమును దరింపజేయుచున్నవి.

నమః యనుశబ్దము త్వమనియెడిపదమునకర్థము. రామః యనునది తత్పదవాచ్యము. చతుర్థీవిభక్తి యసియనుబదార్థబోధకము. ఈరీతి నన్నిమం

త్రములయందు సర్థసందర్భమెనుసర్చుమని శ్రుతి. ... ... ...

నిఖిలశబ్దములకు మూలమైన పంచాశద్వర్ణపఠనమువలన సకలమగు నిహపరఫలముల నిచ్చుననియును మంత్రములన్నియు జపించినవాడగునని యనుశంకించి యదియుక్తము గాదని దృష్టాంతయుక్తముగ బోధించెదము.

గంధకము సూరాకారము, బొగ్గును వాటివాటి పాళ్లచొప్పున మేళనచేసిన తుపాకిమందు, మహతాబ్, చక్రములు, బుడ్లు, బువ్వాలు, నైజవము, రవ మనేకచిత్రవిచిత్రవరవర్ణములుగలవయ్యెగపడును. అవి యేభాగాతిక్రమమైనను బ్రత్యేకమైన నట్టిగుణమేమియును బుట్టించవు. అటువలెనే పంచాశద్వర్ణములు నిగమాగమోక్తరీతిని గూర్చిన మంత్రములై జపితలకు ఫలములనిచ్చును గాని యఖిలవర్ణములు పఠించుమాత్రముచేత నేమియును గార్యకారులు గావు. * * * * *

గాంధర్వవిద్యాచణస్తు తదనువిద్ధబ్రహ్మోపాసనతయా తాలాదిభంగభయాచ్చిత్తవృత్తేరాత్మైకాగ్రతాయాం సుకరత్వాదల్పాయాసేనైవముక్తిపథం నియచ్ఛతి తథాచయోగీశ్వరేణోక్తం॥ వీణావాదనతత్వజ్ఞశ్శ్రుతిజాతివిశారదః। తాలజ్ఞశ్చాప్రయాసేన మోక్షమార్గం నియచ్ఛతీతి ॥

గాంధర్వవిద్యావేద్యుడైతే దానితోగూర్చబడిన బ్రహ్మోపాసనగలవాడాటచేతను తాలరాగాదిభంగభయమువల్లనుండి చిత్తవృత్తికి ఆత్మయే ముఖ్యస్థానముగాగలుగుటయందును సాధ్యమైనదాటవల్లనుండి యల్పశ్రమచేతను ముక్తిమార్గమునుబొందుచున్నాడని యాజ్ఞవల్కిచే జెప్పబడెను.

అవిద్యాయాస్స్వరూపజ్ఞానేసతి విద్యావిర్భావో భవతీత్యాశయేన తత్స్వరూపం వివృణ్మహే॥ * * *

అర్థమృతే యత్ప్రతీయేత ఆత్మని యన్నప్రతీయేత తదాత్మనో మాయామితి వింద్యాత్ యథా ద్విచంద్రాదిప్రతీతిరసతోపి సదితిభ్రాంతౌ దృష్టాంతః యథా గ్రహమండలే రాహుస్థితోపి నదృశ్యతే ఇతి సతోప్యసత్ప్రతీతౌ దృష్టాంతః తథాచ పాతంజలంసూత్రం॥ అవిద్యావిపర్యయరూపాయా అనిత్యాశుచిదుఃఖానాత్మసు నిత్యశుచిసుఖాత్మఖ్యాతిరవిద్యేతి॥ శ్రీవిష్ణుపురాణే పి॥ అనాత్మన్యాత్మబుద్ధిర్యా చాస్వే స్వమితి యామతిః। సంసారతరుసంభూతిబీజమేతద్ద్విధాస్థితమితి॥ * * * *

అవిద్యను నిరూపించుటచేత విద్యాసంపత్తియగునని మాయాస్వరూపమును జెప్పుచున్నారము. * * *

వాస్తవము వినాగా నేది తోచబడుచున్నదో సత్యమగునాత్మయందేదితోచబడదో అది ఆత్మయొక్క మాయనుగా దెలిసికొనదగును. ప్రతిబింబాదికమువలన రెండవచంద్రుడున్నటులదోచుట లేనిది యున్నట్లుగ పడుటకు దృష్టాంతము. గ్రహమండలమున రాహువుండియు తమోమయుడైనందున యగపడకనుండుట సత్యవస్తువుయందయథార్థజ్ఞానము గలుగుటకు నిదర్శనము. విపర్యయముగ స్ఫురించుట స్వరూపముగాగలదియు నశాశ్వతము. దుఃఖదాయియు నిత్యవస్తువందు విపరీతభావనలను బుట్టించునదియును మాయయని పాతంజలసూత్రము. శ్రీవిష్ణుపురాణమునందునగూడ నీరీతినే జెప్పబడెను.

అష్టాదశసు పురాణేషు సర్గాదిపంచకోక్తి హేతుః కిమిత్యాశంక్య వదామః॥ * * * *

సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశమన్వంతరాణిచ। వంశానుచరితంచేతి లక్షణానాంతు పంచకం॥ పంచలక్షణాన్యస్యేతి పంచలక్షణం ॥ పురా పూర్వస్మిన్భూతమితి పురాణం॥ యథోక్తం మాత్స్యే॥ పురాణం సర్వశాస్త్రాణాం ప్రథమం బ్రహ్మణా స్మృతం। అనంతరంతు వక్త్రేభ్యో వేదాస్తస్య వినిర్గతాః। పురాణమేకమేవాసీచ్ఛతకోటిప్రవిస్తరమితి॥ ధర్మసంహితాయాంచ॥ బ్రహ్మమేవకృతంచాద్యం పురాణం శ్రుతిసంమితం। అష్టాదశవిధంతచ్చ శతకోటిప్రభేదతః। తస్మాత్త్రేతాయుగే ప్రోక్తం శతమేకాదశోత్తరం। పురాణసంహితాకర్తా ద్వాపరే వ్యాసఏవహీతి॥ పునర్మాత్స్యే॥ తదర్థోత్ర చతుర్లక్షైస్సంక్షేపేణ నివేశితః। పురాణాని దశాష్టౌచ సాంప్రతంతదిహోచ్యతఇతి॥ సర్గస్సృష్టిః॥ ప్రతిసర్గఃప్రళయః॥ ఉభయమప్యారోపాపవాదాభ్యాం సర్వదా కేవలం బ్రహ్మైవావశిష్యతఇతి బోధయితుముక్తం తథాచశ్రీమద్భాగవతే॥ అహమేవాసమేవాగ్రే నాన్యద్యత్సదసత్పరం। పశ్చాదహంయదేతచ్చ సోవశిష్యేతసోస్మ్యహమితి॥ కళాకాష్ఠాదికాలనిర్ణయ భూర్భువస్సువ మహర్జనస్తపస్సత్యలోకాదిసంస్థితిశ్చ మన్వంతరాద్యనువర్ణనంచ వేదతదంగస్మృతిపురాణేతిహాసాద్యశేషవాఙ్మయంచాత్మని సర్వాత్మకత్వదృష్టిదార్ఢ్యాయ తచ్ఛక్తికాలరూపేణచ తత్సృష్టలోకరూపేణచ తత్తల్లోకస్థభూతరూపేణచ తద్బోధకశబ్దబ్రహ్మరూపేణచ చతుర్ధోపాసనార్థముచ్యతఇత్యవగంతవ్యం॥ వంశో మనుపుత్ర పృథు ప్రియవ్రత వంశానువర్ణనం వంశానుచరితం సూర్య చంద్ర

వంశీయరాజానుచరితకథనం వంశవంశానుచరితస్యోక్తిః తైరాశ్యోత్పాదనార్థంచ తదుక్తం శ్రీవిష్ణుపురాణే॥ భగీరథాద్యాస్సగరః కకుత్థ్సో దశాననో రాఘవలక్ష్మణౌచ। యుధిష్ఠిరాద్యాశ్చ బభూవురేతే సత్యం నమిథ్యా క్వనుతే నవిద్మ॥ యేసాంప్రతం యేచనృపాభవిష్యాః ప్రోక్తామయా విప్రవరోగ్రవీర్యాః। ఏతే తథాన్యేచ తథాభిధేయాస్సర్వేభవిష్యంతి యథైవ పూర్వే॥ ఏతద్విదిత్వానవరేణకార్యో మమత్వమాత్మన్యపి పండితేన। తిష్ఠంతి తావత్తనయాత్మజాయా క్షేత్రాదయో యేచ శరీరిణోన్యే ఇతి॥

తస్మాత్సృష్ట్యాత్మజ్ఞానం పరమోధర్మఇతి॥

పదునెనిమిదిపురాణములయందును సర్గాది పంచకకథనమొనర్చుటకు హేతువేమియని శంకించి చెప్పుచున్నారము.

ఐదులక్షణములుగలదియైనందున పంచలక్షణమనిపురాణమునకు పేరు. వేదములకంటెను పూర్వమునందావిర్భూతమైనందున పురాణమనియును. శతకోటిగ్రంథమైన పురాణమును ముందుగా బ్రహ్మ చెప్పినాడనియును దరువాత నతని ముఖములనుంచి వేదములావిర్భూతములైనవనియును మత్స్యపురాణమందును, పురాత్యర్థమును దెలుపునట్టి బాహుళ్యమను సంజ్ఞకలదియై మొదట శతకోటివిస్తృతమై పదునెనిమిదివిధములను జెప్పబడినదనియును, విస్తారమగుటవలన త్రేతాయుగమున నూటపదునొకలక్షగ్రంథమునుగానది జెప్పబడెననియును ధర్మసంహితలోను జెప్పబడెను. ఆయర్థమును నాలుగులక్షల సంఖ్యకలదిగా సంగ్రహమొనర్చి త్రేతాయుగమున పదునెనిమిది పురాణములనుగా వేదవ్యాసమహర్షి యొనర్చుచున్నారని తత్కాలకృతమగు మాత్స్యమున దిరుగ వివరించబడెను. సర్గమనగా సృష్టి. ప్రతిసర్గమనగా ప్రళయము. ఇవి రెండును శుక్తియందురజితమువలె నారోపించడమువల్లను నట్టిభ్రాంతి నశించడముచేత నెల్లప్పుడొకబ్రహ్మమే మిగిలియుండునని బోధించుటకొరకు చెప్పబడెను. సృష్టికంటెను బూర్వము స్థూలసూక్ష్మములకును వాటికి కారణమగు ప్రధానమునకును పరుడగు తనకంటె వేరగునదిలేక తానే యుంటిననియును సృష్ట్యనంతరమందు నీదృశ్యమగు ప్రపంచమే స్వరూపముగా గలవాడనైయుంటిననియును ప్రళయానంతరమవశేషించినవాడనై యుంటిననియును శ్రీమద్భాగవతమున భగవంతునిచేతను జెప్పబడెను. ఈలాగగుటచే ఆద్యంతములులేక నద్వితీయుడగుటవలన పరిపూర్ణుడని తెలియవలయును. కళయు కాష్ఠయు మొ

దలగు కాలనిర్ణయమును, భూర్భువస్సువర్మహర్జనస్తపస్సత్యలోకముల స్థితి యును, మన్వంతరాదులును, వేదములును, వాటికవయవభూతములగు మన్వాదిస్మృతులు, బ్రాహ్మ్యాది పురాణములు, భారతాదీతిహాసములు మొదలగు నఖిలవాఙ్మయమును, ఆ యాత్మయొక్క కాలరూపకమగు శక్తివలన నా యాత్మచే సృజింపబడిన లోకరూపముచేతను, ఆయాలోకములందుండు భూతములయొక్క రూపము చేతను, ఆ యాత్మను బోధించు వేదాది రూపము చేతను ఆత్మయందు సర్వస్వరూపుడను దృష్టి దార్ఢ్యముకొరకు నాలుగు విధముల నుపాసననిమిత్తమై జెప్పబడెనని తెలియవలయును.

వంశమనగా మనుపుత్రులగు పృథు ప్రియవ్రతాదుల వంశవర్ణనము. వంశానుచరితమనగా సూర్యచంద్రవంశీయులగు రాజన్యుల చరిత్రను జెప్పుట యివి రెండును వైరాగ్యమును బుట్టించుటకు జెప్పిరి. భగీరథులు, సగరకకుత్థ్సులు, దశాననుడు, రామలక్ష్మణులు, యుధిష్ఠిరాదులగు నధికబలశాలురు పూర్వ ముండిరను నది నిజమదియసత్యముకాదు. వారిపుడెచటనుండెనదియును దెలి యదు. ఇపు రెవరుండిరో ముందెవరు కాగలరో వారలందరును బూర్వులవలె నే కాగలరు. ఈ సంగతిని దెలిసికొని తన శరీరమందును, బుత్రకళత్ర వైభవములందును, జీవితమందును మమత్వాద్యభిమానముంచకూడదని శ్రీ విష్ణు పురాణమందున జెప్పబడె నిందువలన నాత్మజ్ఞానము పరమధర్మమని యోగ్యముగ మాచేతను జెప్పనైనది.

అపరఃపంచవిధః। తథాచ భవిష్య పురాణే॥ ధర్మశ్శ్రేయ స్సముద్దిష్టం శ్రేయోభ్యుదయలక్షణం। సతుపంచవిధః ప్రోక్తో వేదమూలస్సనాతనః॥ అస్య సమ్యగనుష్ఠానాత్స్వర్గో మోక్షశ్చ జాయతే। ఇహలోకేసుఖైశ్వర్య మతులం చఖగాధిపఇతి॥ శ్రీమహాభారతేస్య వివరణంకృతం॥ ప్రభవార్థాయ భూతానాం ధర్మప్రవచనంకృతం। ధారణాద్ధర్మ మిత్యాహుర్ధర్మో ధారయతేప్రజాః। యస్మాద్ధారణ సంయుక్త స్సధర్మ ఇతినిశ్చయః॥ అహింసాసత్యవచనం సర్వభూతాను కంపనం। శమోదానం యథాశక్తి గార్హస్థోధర్మ ఉత్తమః॥ పరదారేష్వసంసక్తో న్యాసస్త్రీపరిరక్షణం॥ అదత్తాదానవిరమోమధుమాంసస్యవర్జనం। ఏషపంచ విధోధర్మో బహుశాఖ స్సుఖోదయః। దేహిభిర్ధర్మపరమైః కర్తవ్యో దేహసంభవ ఇతి॥

అపరమైన ధర్మమైదువిధములు. ధర్మమనగా శ్రేయమది యభ్యుదయము స్వరూపముగాగలదది యైదువిధములై వేదము దానికి మూలము

అది యనాదియనియును, దాని జక్కఁగ నాచరించుటచేతను స్వర్గము, మోక్షము నీ లోకమునందమిత్తైశ్వర్యమును బొందునని భవిష్యోత్తర పురాణము॥ భూతహితార్థము ధర్మము జెప్పబడెను. ప్రజలను ధరించునది గనుక ధర్మమనబడును. అహింస, సత్యవచనము, భూతదయ, ఇంద్రియనిగ్రహము, యథాశక్తి దానము నివి గృహస్థధర్మములు. పరదారయందనాసక్తి, రిక్షణార్థముంచబడిన స్త్రీని సంరక్షించుట, దొంగలించమి, మద్యమాంసత్యాగము నీ యైదు విధములగు ధర్మము ధర్మేచ్ఛగల వారలచే నాచరింపదగినదని శ్రీ మహాభారతోక్తి.

ననుధర్మప్రతిపాదక వేదోప బృంహకత్వేన బ్రహ్మ విద్యాస్థానే ష్వాంతర్భూత పురాణేషు- సర్గప్రతిసర్గ రామకృష్ణాద్యవతార రాజవంశాది ఘట్టేషు వివిధవిచిత్ర చరితేషు భేదాభిధానాత్పురాణ సంహితాయాం కథం ప్రత్యయం ప్రాప్నువామ ఇత్యుచ్యతే చే త్తద విమర్శక పౌరాణిక జల్పాకత్వమితిబ్రూమః॥

తథాహి కల్పభేదేన సర్గప్రతిసర్గాదయో భిన్నభిన్నతయా పురాణ సంహితామష్టాదశధా విభజ్య భగవతా నారాయణాంశ సంభూతేన వేదవ్యాసార్యేణ ప్రకటీకృతాః॥ తదుక్తంమాత్స్యే॥ బ్రహ్మణాభిహితం పూర్వం యావన్మాత్రం మరీచయే। బ్రాహ్మంతద్దశ సాహస్రంపురాణంపరికీర్త్యతే। ఏతదేవచవైబ్రాహ్మం పాద్మకల్పేజగద్ధితం। పాద్మం తత్పంచపంచాశత్సహస్రాణి నిగద్యతే॥ వరాహకల్పవృంత్తాంత మధికృత్యపరాశరః। యాన్ప్రాహధర్మానఖిలాన్తద్యుక్తంవైష్ణవంవిదుః। విష్ణ్వాఖ్యమష్టసాహస్రంతత్పురాణంవిదుర్బుధాః। శ్వేతకల్ప ప్రసంగేన ధర్మాన్వాయు రివాబ్రవీత్ । యత్రతద్వాయవీయంస్యాద్రుద్రమాహాత్మ్య సంయుతం। చతుర్వింశత్సహస్రాణి పురాణం శైవముచ్యతే॥ యత్రాధికృత్యగాయత్రీం వర్ణ్యతే ధర్మవిస్తరః। వృత్రాసురవధోయత్రతద్భాగవత ముచ్యతే॥ సారస్వతాయమునయె యచ్ఛుద్ధ్యేయు ర్నరామరాః। అష్టాదశ సహస్రాణి తద్భాగవత ముచ్యతే। యత్రాపినారదోధర్మాన్బృహత్కలాశ్రయాణిహ। పంచవింశత్సహస్రాణినారదీయంతదుచ్యతే। యత్రాధికృత్యశకునేర్ధర్మం ధర్మవిచారణాత్ । తద్వాత్రింశత్సహస్రంవై మార్కండేయమిహోచ్యతే। శాపావసానే భృగుణాఋషిణా సంప్రకాశితం। చయనానాం సముత్పత్తి రిష్టకాగణనంతథా । క్రతు సంఖ్యాదితః కృత్వా హ్యాగ్నేయంతదిహోచ్యతే। ఆగ్నేయం చాష్టసాహస్రం సర్వక్రతుఫలప్రదం। శతానీకేనపృష్టేనవ్యాసశిష్యేణ ధీమతా। సారాధర్మావిశేషేణవ్యాఖ్యాతాస్తు సు

మంతునా । ఏకత్రింశత్సహస్రాణిభవిష్యాఖ్యం సుభాషితం। యత్ర వై వైష్ణవా ధర్మా వశిష్ఠేన మహాత్మనా। అంబరీషస్యవై ప్రోక్త స్సర్గో బ్రాహ్మ స్తదైవచ। పురాణం బ్రహ్మకైవర్తం తద్వాదశ సహస్రకం॥ యత్తదీశానకల్పస్య వృత్తాంతమధికృత్యచ। నందినాలైంగ్యమిత్యుక్తమేకాదశసహస్రకం। మహావరాహస్యవపుర్మాహాత్మ్యమధికృత్యచ। విష్ణునాభిహితం క్షోణ్యా స్తద్వారాహమిహోచ్యతే॥మానవస్యప్రసంగేనకల్పస్యమునిసత్తమాః।చతుర్వింశత్సహస్రాణి తత్పురాణ మిహోచ్యతే॥ యత్రమాహేశ్వరాన్ధర్మా నధికృత్యచ షణ్ముఖః। కల్పేతత్పురుషేరుద్రచరితేఉపబృంహితం।స్కాందంనామపురాణంతత్సహస్రశతసంమితం॥ త్రివిక్రమస్యమాహాత్మ్యమధికృత్య చతుర్ముఖః । త్రివర్గంచత్రిదైవత్యంవామనంపరికీర్త్యతే॥చతుర్దశసహస్రాణి శ్వేతకల్పానుగంశివం।యత్రధర్మార్థకామానాం మోక్షస్యచరసాతలే। మాహాత్మ్యంకథయామాసకూర్మరూపీ జనార్దనః। ఇంద్రద్యుమ్న ప్రసంగేన ఋషిభ్యశ్శక్రసన్నిధౌ। కౌర్మం తత్షట్సహస్రాణిఅగ్నికల్పానుషంగికం। శ్రుతీనాంయత్రకల్పాదౌప్రవృత్త్యర్థంజనార్దనః।మత్స్యరూపీచమనవెనరసింహోపవర్ణనం। అధికృత్యాబ్రవీత్స ప్తకల్పవృత్తంసహస్రతం। తన్మాత్స్యమితిజానీధ్వంసహస్రాణి చతుర్దశ॥ యథాచగారుడేకల్పే విశ్వాండంగారుడోద్భవం। అధికృత్యాబ్రవీద్విష్ణుర్గారుడంతదిహోచ్యతే। తత్షోడశసహస్రాణిన్నప తేత్విహపఠ్యతే।బ్రహ్మబ్రహ్మాండమాహాత్మ్యమధికృత్యాబ్రవీత్పునః।తచ్చద్వాదశ సాహస్రం బ్రహ్మాండం ద్విశతాధికం। భవిష్యాణాంచ కల్పానాం శ్రూయతె యత్రవిస్తరః। తద్బ్రహ్మాండ పురాణంతు బ్రహ్మణాసముదాహృతే మిత్యాది॥

ధర్మమును విస్తృతమొనర్చి ప్రతిపాదించెడి వేదార్థములను జెప్పుటచేతను బ్రహ్మవిద్యకు స్థానములగు నాటిలో నంతర్భూతములగు పురాణములందున విచిత్రచరిత్రములైన సృష్టి ప్రళయ రామకృష్ణాద్యవతార రాజవంశముల నచటచటను భేదముగ జెప్పుటచేతను పురాణసంగ్రహితయందు మేమెటువంటుల విశ్వాసమును బొందగలమని శంకించిబలికినట్లయితే యది విమర్శించబడని పౌరాణిక వచనములు గలుగువారగుటయని జెప్పుదుము- అదియే జెప్పుచున్నారము. నారాయణాంశముచేత నవతరించిన వేదవ్యాసభట్టారకులచేతను పురాణసంగ్రహిత నష్టాదశవిధముగ విభజించి సృష్టిస్థితిలయములను జెప్పుటలో కల్పభేదముననుసరించి వేరువేరు ప్రకారములను ప్రచురపరచబడెను. మత్స్యపురాణమందటుల జెప్పబడినది. పూర్వము బ్రహ్మచేతను మరీచికొరకు పదివేల సంఖ్య గలదిగా నేదిచెప్పబడినదో యదియే బ్రాహ్మ్యపురాణము.

పాద్మకల్పవృత్తాంతమనుసరించి యేదిజగదుత్పత్తికొరకే బడినయె దువేలసంఖ్యగలదిగ జెప్పబడినదో యది పద్మపురాణము. పరాశరులవారు వరాహకల్పవృత్తాంతమనుసరించి సకలధర్మముల నష్టసహస్రసంఖ్యతో జెప్పినదియే విష్ణుపురాణమని పెద్దలు తెలుసుకొనుదురు.

శ్వేతకల్పమును జెప్పెడి ప్రసక్తి చేతను వాయుదేవుడు రుద్రమహిమను ధర్మములతో నెచట జెప్పెనో యది యిరువది నాలుగు వేల సంఖ్య గలదియైన శైవపురాణమగు వాయుపురాణమని చెప్పబడుచున్నది. గాయత్రిను ద్దేశించి యచట ధర్మములు విస్తృతముగ వర్ణించబడుచున్నవో, వృత్రాసుర వధకథన మెచట కలదో, సారస్వతమునికొరకు జెప్పబడిన దేని శ్రవణ పఠనములచే సురనరులు శుద్ధులగుదురో పదునెనిమిది వేలసంఖ్యగల యది శ్రీమద్భాగవతమని పలుకబడుచున్నది. బృహత్కల్పము నాశ్రయించబడిన ధర్మముల నెచట నారదునిచే జెప్పబడినదో యిరువదైదు వేల సంఖ్యగలయది నారదీయమని చెప్పబడుచున్నది. ధర్మవిచారణవలన బక్షులెచట జైమినినుద్దేశించి ధర్మములను జెప్పినవో యది ముప్పదిరెండువేల సంఖ్యగల మార్కండేయమని యిచట జెప్పబడుచున్నది.

శాపాంతమునందు భృగుమహర్షిచేతను జైనములయొక్క పుట్టుగయు, నిష్టకలగణనయును, క్రతుసంఖ్యయును మొదలుగ జేసుకొని యెనిమిది వేల సంఖ్యగలదియైన సకల క్రతుఫలముల నిచ్చునది యాగ్నేయను-

ప్రశ్నను జేసినశతానీకునితో వ్యాసశిష్యుడును సుబుద్ధియునగు సుమంతునిచేతను సారములగు ధర్మముల జెప్పబడిన ముప్పదియొక వెయ్యిసంఖ్యగలది భవిష్యమను బురాణము. బ్రహ్మసర్గవృత్తాంత మంబరీషునికొరకు వైష్ణవధర్మములను మహాత్ముడగు వశిష్టునిచేతను జెప్పియున్నది. బ్రహ్మకైవర్తమను బురాణము పదియరు రెండువేలు. ఈశానకల్పవృత్తాంత మనుసరించి నందిచే పదకొండువేల సంఖ్యగలది లింగపురాణమని జెప్పబడినది.

మహావరాహమూర్తి మాహాత్మ్యముననుసరించి భూదేవికొరకు విష్ణుదేవునిచేతను మానవకల్పవృత్తము నిరువదినాలుగువేల సంఖ్యగల గ్రంధముచేతను జెప్పునది వారాహమని పలుకబడుచున్నది. మాహేశ్వర ధర్మముల నుద్దేశించి కుమారస్వామిచేతను తత్పురుషకల్పమందలి రుద్రచరిత్రమును విస్తరింపజేసి నూరు వేల గ్రంధమును జెప్పినయది స్కాందమను బురాణము.

వామనమూర్తిమహిమననుసరించి బ్రహ్మప్రోక్తము, ధర్మార్థకామప్రదము, త్రిమూర్తి దేవతాకము, శ్వేతకల్పముననుసరించినదియు, మంగళప్రదమును పదునాలుగు వేలసంఖ్యగలదియు వామనపురాణమని చెప్పబడుచున్నది.

ఇంద్రసన్నిధి నింద్రద్యుమ్నప్రసక్తిచేతను ఋషులవలన ధర్మార్థకామమోక్షములయొక్క మహిమను పాతాళమందగ్నికల్పముననుసరించిన చరిత్రలు గలుగునటులగాను కూర్మరూపముగల విష్ణువుచేత నారువేల సంఖ్యతో జెప్పబడినది కౌర్మమనుపురాణము. భగవంతునిచేతను గల్పాదిశ్రుతులయొక్క ప్రవర్తనకొరకు నరసింహమహిమానువర్ణనమనుసరించి యారునొక కల్పముల వృత్తమును వ్రతములతోగూడ పదునాలుగు వేలసంఖ్యగలదిగా మత్స్యమూర్తిచేతను మనువుకొరకు జెప్పబడినది మాత్స్యపురాణమని దెలసికొనుడు. గరుడకల్పమందు గరుడునిచే సృజించబడిన బ్రహ్మాండముననుసరించి పదారు వేలసంఖ్యగలదిగా విష్ణువుచే జెప్పబడినది గారుడమని బలుకబడుచున్నది. భవిష్యకల్పవృత్తమెచటవిస్తారముగ వినబడునో యది పదిరెండువేలనిన్నూరుసంఖ్యగలిగి బ్రహ్మచేతను బ్రహ్మాండమాహాత్మ్యమనుసరించి జెప్పినది బ్రహ్మాండపురాణము. * * * * * *

నను మహీయం పంచాశత్కోటివిస్తారేతిశతకోటివిశాలేతిచ పురాణే షూక్తం సూర్యసిద్ధాంతాదిషు భూకర్ణోషోడశశతమిత్యాచుఃఏతద్విరోధపరిహారో కథమనూన్యస్తుశోభూపరిమితిః కియతీతి వ్యవస్థా ఇష్యతఇతిచేత్ ॥ పంచాశత్కోటివిస్తారా సేయముర్వీమహామునే। సహైవాండకటాహేన సద్వీపాబ్ధిమహీధరేతి శ్రీవిష్ణుపురాణే॥ సూర్యాండగోళయోర్మధ్యే కోట్యస్స్యుఃపంచవింశతిరితి శ్రీమనుక్తః॥

భూమండలంతు శతకోటివిస్తారం సాండకటాహమితి వారాహే॥కోటిద్వయం త్రిపంచాశల్లక్షాణిచ తతఃపరం। పంచాశచ్చ సహస్రాణి సప్తద్వీపాస్ససాగరాః। తతో హిరణ్మయీభూమిర్దశకోట్యో వరాననే। దేవానాం క్రీడనార్థాయ లోకాలోకస్తతఃపరం। పర్వతో వలయాకారో యోజనాయుతవిస్తృతః। తస్మాద్బాహ్యం తమోఘోరం దుష్ప్రేక్ష్యం జీవవర్జితం। పంచత్రింశత్సృతాకోట్యో లక్షాణ్యేకోనవింశతిః। చత్వారింశత్సహస్రాణి యోజనానాం వరాననే। సప్తసాగరమానస్తు గర్భోదస్తదనంతరం। కోటియోజనమానస్తు కటాహశ్చ వ్యవస్థితఇతి స్కాందే శివరహస్యేచ॥ కల్పభేదాదిభిః న్యూనాధికభేదోక్తిరితి శ్రీధరాచార్యాదికృత విష్ణుచిత్తీయాది టీకాకారాదిభిరుక్తం॥ క్వచిత్పురాణేషు విరోధో యదిలక్ష్యేతే కల్పభేదాదిభిస్తత్రవ్యవస్థా

షడ్భిరిష్యత ఇతి॥ యోజనానాం శతాన్యష్టౌ భూకర్ణో ద్విగుణానితు। తద్వర్గతో దశగుణాత్పదంభూపరిధిర్భవేదితి సూర్యసిద్ధాంతే॥ భూకర్ణో భూమధ్యసూత్రం॥ పరిధిర్వలయాకారరేఖా॥ అథ శాస్త్రీయయోజన క్రోశ హస్త వితస్తి సంఖ్యానిర్ణయం బ్రూమః॥ తిర్యగ్యవోదరాణ్యష్టావూర్ధ్వావా వ్రీహయస్త్రయః। ప్రమాణమంగుళస్యోక్తం వితస్తిర్ద్వాదశాంగుళా॥ హస్తో వితస్తిద్వితయం దండో హస్తచతుష్టయం। తత్సహస్రద్వయంక్రోశో యోజనం తచ్చతుష్టయం॥ హూణమైల్సు త్రితయషష్ట్యుత్తరవితస్తయో హిందూక్రోశో భవతి॥ అశీత్యుత్తరద్విశతాధికపంచసహస్రవితస్తయో మైలితి హూణాః॥ తస్మాన్నేన భూకర్ణో ద్వాదశోత్తర నవశతాధికసప్తసహస్రమైల్సవః॥ సూర్యసిద్ధాంతోక్త్యా ద్విసప్తత్యుత్తర చతుశ్శతాధికైకాదశసహస్రమైల్సవశ్చ చత్వారింశదుత్తర ద్విశతాధిక దశసహస్రవితస్తయశ్చ తస్మిన్ హూణశాస్త్రీయ భూకర్ణ ద్వాదశోత్తరనవశతాధికసప్తసహస్రమైల్సవో హరేచ్చేత్ షష్ట్యుత్తరపంచశతాధికత్రిసహస్రమైల్సవశ్చ చత్వారింశదుత్తరద్విశతాధిక దశసహస్రవితస్తయశ్చ జ్యోతిశ్శాస్త్రీయ భూకర్ణాదధికమితి ప్రతిభాతి॥ లోకాలోకాద్రిం మేరోరభితస్స్థితాచ। కర్మలోకాఖ్యా భూశ్చ తమోగర్భోదాచ। తామసభూతావాసభూతా।సగర్భోదస్తమసః పరస్తాత్ పరితః ప్రతిదిశమండకటాహాదర్వాక్। మహాపురుషనివాసభూతో శ్రీవైకుంఠలోకః। తతః కటాహ ఇతిజ్ఞేయం॥ శ్రీభాగవతే హరివంశేచ బ్రాహ్మణపుత్రానయనప్రస్తావె భగవత్స్థానస్య తతోవర్ణితత్వాత్। ఏవమూర్ధ్వాధః కటాహావధిశ్చాండ ఉచ్ఛ్రాయాది ఇద్ధం సంహృత్య పంచాశత్కోటిభూవిస్తార ఇత్యవగంతవ్యమ్॥

శంకరభగవత్పాదైస్సర్వజ్ఞైర్వ్యాసైః కిమన్యథా ప్రతిపాదిత మిత్యుక్త్వా పంచాశత్కోటివిస్తారా సేయముర్వీతి నిఖిలపురాణేతిహాసస్మృత్యాది వ్యాసైర్వ్యాసైర్యదుక్తం తన్మహాభూరాదికం సంహృత్యేతి బోధ్యం॥ తదుక్తం॥ దివాకరరశ్మయోయత్ర ప్రభాం తన్వంతి నాతపం। శశినశ్చ నశీతాయ నిశిద్యోతాయ కేవలం। యత్ర నజ్ఞాయతే లోకా గతోపి దనుజాదిభిరితి కాశీఖండే॥ ఉత పురాణకారస్య వైరాగ్యోత్పాదన భగవన్మాహాత్మ్యజ్ఞాపనేచ తాత్పర్యాన్నలోకసంఖ్యాగణితత్వాదర ఇతిజ్ఞేయం తథాచ సూర్యసిద్ధాంతే॥ పంచాశత్కోటివిస్తీర్ణం కేవలం కల్ప్యతే మహీ। అల్పరాజ్యమదాంధానాం విషాదాయ విరక్తయేతి॥

ఈభూమి యేబదికోట్ల విస్తారము గలదనియును నూరుకోట్లవిశా

ఆమైనదనియును పురాణములయందున జెప్పియున్నది. సూర్యసిద్ధాంతము మొదలగు జ్యోతిశ్శాస్త్రములందున భూమియొక్క మధ్యకొలత పదారువందలామడయని జెప్పియున్నది. పురాణజ్యోతిశ్శాస్త్రములకిట్లుకలిగిన విరోధపరిహారమెట్లగుననియును నిజముగ భూమెంతవిస్తృతముగలదనియును తర్కించి వ్యవస్థాపూర్వకముగ విరోధపరిహారమొనర్చుచున్నారము.

ఈపృథివి యేబదికోట్లనియు నాప్రకారముగా సముద్రములు పర్వతములు ద్వీపములతో నండకటాహముకలదని విష్ణుపురాణము. సూర్యునకును డగోళమునకును మధ్యమందిరువదియైదుకోట్లని శుకోక్తి. అండకటాహముతో భూమండలము నూరుకోట్లవిస్తారముకలదని వారాహపురాణము. రెండుకోట్ల యేబదిమూడులక్షల యేబదివేలయోజనముల సంఖ్యగలది సప్తసముద్రద్వీపములతోనుండిన భూమి యటుపైని స్వర్ణభూమి పదికోటులు. దేవతలకు విహారయోగ్యమైనది. అపైని లోకాలోకపర్వతమదికడియమువలె పదివేలామడ విస్తృతముకలదై యుండును. దానికి వెలుపల జీవరహితమునగమ్యమునగు ఘోరమగు తమస్సు ముప్పదైదుకోటుల బందొమ్మిదిలక్షల నలుబదినాలుగువేల యోజనములు ప్రమాణముకలిగియుండును. అటుతర్వాత గర్భోదము సప్తసాగరసంఖ్యగలదియైయుండును. అండకటాహము కోటియామడ కలదియైయున్నదని స్కాందమందును శివరహస్యమందును జెప్పియున్నది. కల్పభేదాదికమువలన సంఖ్యాభేదోక్తియని శ్రీధరాచార్యులవారును విష్ణుచిత్తీయమను విష్ణుపురాణటీకాకారులును జెప్పిరి.

ఇటుపైని శాస్త్రీయమగు యోజన క్రోశ హస్త వితస్తి పరిమాణములను జెప్పుచున్నారము.

అడ్డగనుంచబడు యవోదరము లెనిమిదియైనను నిడువుగనుంచబడు యవలు మూడైన యంగుళమునకు ప్రమాణము జెప్పబడెను. అట్టియంగుళములు పది రెండు వితస్తియగు. వితస్తిద్వితయము హస్తమగు. నాలుగుహస్తములు దండమగు నట్టిదండములు రెండువేలు క్రోశమగు. క్రోశచతుష్టయము యోజనమనబడును. హూణమానముచే మూడుమైల్సులపైని నూటయిరువదియడుగుల కొలగలది హిందూక్రోశమగుచున్నది. అయిదువేల రెండువందల యెనబదేనడుగులు మైలుకు పరిమాణమని హూణనిర్ణయము. ఈపరిమాణముచే భూమధ్యసూత్ర మేడువేలతొమ్మనూటపదిరెండు మైల్సులగును. సూర్యసిద్ధాంతోక్తిచే పదకొండువేల నన్నూట డెబ్బది రెండు మైల్సులపైని పదివే

లయిన్నూటనలుబదియడుగులు హూణశాస్త్రీయ భూమధ్యసూత్ర పరిమాణమగు యేడువేల తొమ్మన్నూట పన్నెండు మైల్సులు తీసివెయ్యగా మిగిలిన మూడువేలయేనూట యిరువదిమైల్సులపైని పదివేల యిన్నూటనలుబది యడుగులు జ్యోతిశ్శాస్త్రీయభూమధ్యసూత్రపరిమాణముకంటె నధికమగపడుచున్నది. లోకాలోకాద్రియు మేరుగిరియొక్క యావత్ప్రదేశము కర్మలోకమను పేరుగల యీభూమియు తమఃప్రదేశము గర్భోదము తామసభూతములకు నివాసభూతమైన గర్భోదముతోనున్న తమస్సుకు వెలపలను ప్రతిదిక్కునందు నంతట నండకటాహమునకు లోపలను శ్రీమహాపురుషస్థానమైన శ్రీవైకుంఠలోకమూపైనియండకటాహమని దెలియదగును. భాగవతము హరివంశమునందును బ్రాహ్మణపుత్రులను దెచ్చిన కథను జెప్పుటలో వైకుంఠము నటుల వర్ణించుటచేత నీప్రకారముగా నండకటాహముయొక్క మీదుక్రిందు లవధియు నండోఘ్రియమును గలిపి యేబదికోటులు భూవిస్తారమని దెలియతగినది.

పూజ్యులగు శంకరాచార్యులవారిచేతను సర్వమును దెలసిన వ్యాసులవారిచేతను వాస్తవముగ జెప్పబడినదాయనిన నట్లులేదని బల్కి పంచాశత్కోటివిస్తారమీభూమియని సకలవేదపురాణేతిహాసస్మృతులను విస్తృతియొనర్చిన వ్యాసులవారిచేత నేదిచెప్పబడినదో యది సర్వభూమియు నండకటాహాదికమును గలసినదని దెలియదగును. పగటియందు సూర్యకిరణము లెచటయండను గాంతిని జేయవో దనుజాదులచేతనైన నేప్రదేశమందున గతమగు కాలమును దెలియబడదో అట్టి తమస్సని కాశీఖండమందు జెప్పబడెను. ఇంతియకాదు- పురాణకారులు వైరాగ్యముదయించుటకు భగవన్మహిమను దెల్పుటకొఱకును తాత్పర్యము గలవారలై జెప్పిన భూసంఖ్యగాని లోకసంఖ్యను గణించుటయందాదరముగలవారలై గాదని దెలియదగును. అల్పరాజ్యముచే నంధులగువారికత్యంతవిరాగము విషాదముదయించుటకై పంచాశత్కోటి విస్తీర్ణముగా భూమిని గల్పింతురని సూర్యసిద్ధాంతమునందున జెప్పబడెను.

ఇంగ్లాండుభూపభూగోళశాస్త్రేస్మిన్నుక్తవానిదం। మృత్పాషాణమయాస్సర్వే గ్రహాణాం మండలా ఇతి ॥ ఇమంభ్రమం ప్రమృజ్యామి పశ్యంతు శ్లక్ష్ణబుద్ధయః। అప్తేజోమండలేష్వేతచ్చంద్రభృగ్వాదికేషుచ। దూరదర్శనయంత్రేణ పశ్యంతి ప్రతిబింబితం। ప్రతిబింబితమూర్ధ్వస్థముకురే పర్వతాదికం। సత్యంచేన్మృత్తికాశైలాస్సత్యాస్స్యుర్గ్రహమండలే॥

ఇంగ్లాండురాజులభూగోళశాస్త్రమునందున గ్రహమండలములన్ని

యు మృత్పాషాణమయములని చెప్పబడెను. ఈభ్రమ నివారణను జేసెదను. సూక్ష్మబుద్ధిగలవారలు చూడవలెను.

అగ్న్యుదకమయములగు చంద్రశుక్రాదిమండలములందు ప్రతిబింబితమైన భూపర్వతాదికమును దూర్బినులవలనను జూచుచున్నారు. ఉపరిభాగమందుండిన యద్దమున ప్రతిబింబితమగు పర్వతభూములు సత్యముగ నందుండిన గ్రహమండలమున మృచ్ఛిలలుండుట నిజము.

ఘన వర్ష గర్జన విద్యు దింద్రధను రశనీ హిమ ప్రస్రవ
ణాదీనా ముత్పత్తిం వ్యాఖ్యాస్యామః॥

చండ చండకిర కర తాపవశా జ్జలం పృథివ్యా ఉద్ధితం సల్లఘుతయా వియన్మండలె తిష్ఠేత్ బాష్ప మతిసూక్ష్మమదృశ్యంచ అర్ద్రాజలీయ పరమాణుర్వ్యాకాశే సముత్తిష్ఠతి యదాచ సంభూయ సంకీర్ణస్సందృశ్యో భవతి తదా మేఘఇత్యభిధీయతె॥ తదుక్తం॥ యదా బాష్పైర్వాయురీదృక్పూర్ణో భవతి యదాన్యత్కిమపి ధారయితుం నశక్నోతి తదా సంభూయ కృత్స్నం బాష్పం స్వస్వగురుత్వేన కర్ణికాకారైః పతేత్ తస్యాఖ్యా వృష్టిరితి కణికారూపేణ వృష్టేఃపతనే ఈశ్వరస్య కీదృశాభిజ్ఞతా ప్రకాశతే యది కరికరవత్ ధారయా వృష్టిః పతేత్ తదా పృథ్వీ ప్రణశ్యేత్ ఇత్యనేనరూపేణ జగతాం మహతీ హానిర్జాయేతఇతి తథావ శ్రూయతే స్మర్యతేచ॥ యాభిరాదిత్యస్తపతి రశ్మిభిస్తాభిః పర్జన్యో వర్షతీతి॥ ఆదత్తే రశ్మిభిర్యత్తు క్షితిసంస్థం రసంరవిః। తముత్సృజతి భూతానాం పుష్ట్యర్థం సస్యవృద్ధయఇతి॥ ధూమజ్యోతిస్సలిలమరుతాం సన్నిపాతఏవ ఘనఇతి ఘనశాస్త్రజ్ఞా వదంతి॥

మేఘాభ్యంతరే యద్వహ్నిమయంవస్త్వస్తి తద్వహ్నిమయం వస్త్వేకస్మాన్మేఘాదపరమేఘం ప్రవిశతి తదా విద్యుదుపపద్యతే॥

ఏవంమేఘాంతరప్రవేశమాత్రేణ గంధకముఖ్యవస్తువత్ప్రజ్వలన్మహాంతంశబ్దంకరోతి తదేవ మేఘగర్జనమిత్యభిధీయతే సా విద్యుద్బాధాజనక బాష్పం నాశయతి సమీరణంచేతస్తతశ్చాలయతి యేన వాయుర్నిర్మలస్స్యాత్ ఏవం వృష్టిముత్పాదయతి గ్రీష్మస్య చాల్పత్వం విదధాతిచ లవణవిశేషగంధకమయవస్తునోర్బాష్పం ఖరకరతాపేన పృథివ్యా ఉద్ధాయ యదా మేఘేన యుక్తం భవతి తదా తస్మిన్మేఘే జ్వలిత్వా ఛిన్నభిన్నతాంగతే తద్గర్జనముపజాయతే కారణాంతరంచ యదా తటిద్బిర్వాయుమయం వస్తు ఛిన్నభిన్నతాం యాతి తదా తేనాపి మేఘగర్జనం భవతి ప్రతిధ్వనినా కఠోరత్వం తస్యజాయ

తే శబ్దగుణకాకాశే వాయోర్గత్యా ప్రతిధ్వనిరుత్పద్యతే యతోహి యది వ
యురుచ్చైర్భిచభిత్తిపర్వతాదీనా ముపరి నిపతతి తదాసౌ ప్రతిధ్వనిజనిర్భ
తీత్యవగంతవ్యమ్॥

వృష్టిర్యదానిపతతి తత్కాణాసుచ రశ్మయః। లగంతీనస్య తద్వ్రశ్యేద్ధన
రాకృతివద్ధ్రువం॥ ఉత్పద్యంతే యాస్తుజలకణికాసు రవేఃప్రభాం।ప్రవిశ్యతా
స్సరంత్యో దృశ్యంతే లోహితప్రభాః। కణేషుయేషు దృశ్యంతే రశ్మయోఽ
ప్రభానిభేః। నిర్గచ్ఛంతి ప్రవిశ్యాశు సాభా నీలా ప్రదృశ్యతే। అనేకవర్ణా
హుధా జాయంతే కణికాస్ఫుటం। సఏవేంద్రస్య ధనురిత్యుచ్యతే భువనేజనైః
పర్జన్యనాధో దేవేశస్తస్మా దేతదితీర్యతే॥ సూర్యస్య వివిధావర్ణాః పవనేన
ఘట్టితాః॥ కరాస్సాభ్రే వియతి ధనుస్సంస్థానా యేదృశ్యంతే తదింద్రధనుః।

కేచిదనంతకులోరగనిశ్వాసోద్భూతమాహురాచార్యాః॥ ఇతిప్రవద
తి సంహితాయాం వరాహమిహిరాచార్యేణ॥

దృశ్యంతే యాబహువిధా మేఘే శుక్లాదికాఃప్రభాః। కరాస్త్వినస్య
తేపోక్తాస్సూరిభిస్తత్వవేదిభిః॥ దివాకరస్య నికటే స్వర్ఘనే బహుధావిభా
వాయునా చలితో మేఘో దృశ్యతే వివిధాకృతిః॥

యచ్ఛీతేనాంబుకణికా స్సంకీర్ణభూయుతేంబరే। తత్పతేత్కరకాకా
రా కఠినాదృతశీతలా॥

శీతంహిమశ్చ సమయేష్వఖిలేషు వాయో రాయాతి తత్రచ విశేషత
ఔత్తరాత్తై। ఆధిక్యతస్తదుభయోరుపకారఏవ లోకస్యసంభవతి తచ్ఛృణుతే
హ వక్ష్యే॥ విధాయదేహం పరసంతు నీరసం తతోబలం తేష్వధికం వితన్వతః।
ధరాంసమస్తాం సఫలాంచకుర్వతో ఘ్నుతశ్చతౌ శీతహిమౌ కుకీటాన్॥ తథా
చ సుశ్రుతే॥ దక్షిణాయనం వర్షాద్దేమంతేషూత్తరోత్తరం సర్వప్రాణినాం
బలంవర్ధత ఇతి॥

సూర్యాహృతం యదవనీరసబాష్పమభ్రే సంతిష్ఠతేత్రచ వసత్యనిలో
యతోతః। భానోఃకరస్య గగనేఖిలవర్ణభాజ స్సందృశ్యతేచ శితిమాభ్రమతో
వినీలం॥

రవ్యాహృతాఖిలపదార్థసుబాష్పయుక్తవహ్న్యంశలేశనిచయాః ఖగ
తాస్తఏవ। వాయోర్వశేన విధుతాః క్వచిదాపతంతి నక్షత్రపాతనమితి ప్రవ
దంత్యతజ్ఞాః॥

యదాయదాద్వౌ బలవత్సమీరనౌ పరస్పరం సమ్ముఖవర్తినౌ స్తః। త

ధాధవా సుస్థిర వాయువిస్తరేప్యధః పతత్యాశ్వశనిస్తతస్తతః॥ మేఘేషుయల్ల వణగంధకవస్తునీ స్తః శుష్కేయదాచ లఘునీ గగనోర్ధ్వభాగే। తద్యోగతో జ్వలతి విద్యుది మేగురుత్వాన్నిర్ఘాతమావహతఆర్త్రిక్రృదుర్విగానాం॥

సంమూర్ఛితా రవీంద్వోః కిరణాః పవనేన మండలీభూతాః। నానావర్ణాకృతయస్త్వన్యభ్రే వ్యోమ్ని పరివేషాః॥

మేఘము, వర్షము, ఉరుము, మెరుపు, నింద్రధనస్సును, పిడుగును, మంచుబడుటయునివి మొదలగువాటియుత్పత్తిని జెప్పుదుము.

తీక్ష్ణమగు సూర్యకిరణ తాపమువలన జలము భూమివలనపైకి నాకర్షించబడినదై చులకనిదవుటచేత నాకాశమందు నిలిచియుండునదియే యుబ్బగావున నతిసూక్ష్మమై యదృశ్యమైయుండి యాకాశమందలి జలసూక్ష్మాంశములొకప్పుడీ యుబ్బలతో కలసినందున నది దిట్టమైకనపడును. దానిని మేఘమనిబల్కుదురు. ఎప్పుడీయుబ్బలతో నిట్టివాయువులు పూర్ణములగునో యపుడు దీనిని వేరొకటి ధరించలేకుండునో యపుడాకలసిన యుబ్బంతయు తమతమబరువుచేత కణికాకారములై భూమియందుబడు నిదియే వృష్టియనబడును. కణికారూపముచే వర్షము గురియుటయందీశ్వరునకేమి తాత్పర్యమనిన నేనుగతుండమువలె వర్షధారలు పడినభూమి నశించునందువలన జగంబులకధికమగు హానియగునని పరమేశ్వరుడు కణికారూపముగా జలమునువర్షించుటకు సంకల్పించెనని. ఇందుకు ప్రమాణము. ఏ కిరణములచే సూర్యుడుతపించు నాకిరణములచే పర్జన్యుడై వర్షించునని శ్రుతి- సూర్యుడు కిరణములచే భూమియందలి యేరసము నాకర్షించునో మరల నారసమును భూతములయొక్క వృష్టికొరకు సస్యాభివృద్ధియగుటకు వర్షించునని విష్ణుపురాణవచనము. పొగయును, జ్యోతిస్సును, జలమును, గాలియును వీటిమేళనమే మేఘమని ఘనశాస్త్రజ్ఞులు బలుకుదురు,

మేఘమందలి వహ్న్యంశంభేదిగలదది మేఘాంతరమున బ్రవేశించునప్పటిప్రకాశమే మెరుపనదగును.

ఇటులొకమేఘము భేదించుకొని రెండవమేఘమును బ్రవేశించునత్తు గంధకాదివస్తువులవలె వెలింగి యొకమహాధ్వనిని బుట్టించు నదియే మేఘగర్జనమనబడును.

మెరుపుపీడనుజేసే యుబ్బును బోగొట్టును- మెరుపువలన గాలినిర్మ

లమై యిటునటుకదల్చబడు నిందువలన వర్షమును కలిగించును. వేసవిని స్వల్పముగాజేయును.

మరియును భూగతమైన లవణవిశేష గంధకమయములైన వస్తువులయొక్క ఉబ్బ సూర్యకిరణ తాపముచేత భూమినుండి పైకి నాకర్షించబడినదై యెప్పుడు మేఘముతో గూడుకొనునో, యప్పుడా మేఘమందు ప్రజ్వలించితునకతునకలైనపుడు పుట్టినధ్వని గర్జనమందురు- మరియు నెపుడు మెరుపులచేత మేఘగతమగువాయువు భేదించబడునో యందుచేబుట్టినధ్వనియును గర్జనంబనబడు నది ప్రతిధ్వనిచే కఠోరత్వమునుబొందును. శబ్దగుణకమైనయాకాశమందు వాయువుయొక్క గమనముచేతను ప్రతిధ్వని బుట్టించబడును.ఉన్నతస్థలమునుండి వాయువు కిందుగా నున్న పర్వతములు మొదలగువాటిపైని బడుచున్నపుడందువలన బ్రతిధ్వని గలుగుచున్నదని యిందుచేదెలుసుకొతగినది.

వర్షము గురుయునపుడా జలకణములందు సూర్యకిరణములు ప్రసరించినందున నింద్రధనురాకృతిగ నగపడును. వర్ష జల కణములయందు సూర్యకాంతులు ప్రవేశించి బయలుదేరుటవలన యెర్రనికాంతులును మరికొన్ని కణములందున గనుపడు సూర్యప్రభనల్లనైదోచును- వర్ష జల కణిక లనేకవర్ణములుగలవై యుండడమువలన యాయాయి సంపర్కంబువలనసూర్యప్రభనానావర్ణములుకలదై యేదగుపడునో యదియింద్రధనువని చెప్పబడును- పర్జన్యుడనని౦ద్రుడన భేదములేనందున యాసంబంధముచే నింద్రధనువందురు. మరియును సూర్యుని నానావిధవర్ణములగు కిరణములు మేఘయుక్తమగు నాకాశమందుధనురాకారముగా నేవి కనపడునో, యవి యింద్రధనువందురు. కొందరనంతుని వంశ్యులగు నాగవరుల నిశ్వాసమువలన నింద్రధనురాకృతిగ వల్మీకమార్గమువలన బయలుదేరునని పలుకుదు రాచార్యులని వరాహమిహిరాచార్యుల వారిచేతను సగ్హితయందున జెప్పబడెను.

మేఘమందునదెలుపు మొదలగుననేక విధములగు కాంతులేవిచూడబడునో యవిమేఘలగ్నసూర్యకరప్రభలని తత్వవేదులగు విద్వజ్జనులచేజెప్పబడెను. మరియుసూర్యసన్నిధిని మేఘమందనేక కాంతులుచూడబడును. వాయువుచేగదల్చబడు మేఘములు నానాకృతులైచూడబడును.

ఆకాశమందు మేఘములనుండు జలముతో సంపర్కముగల మంచుగట్టిపడి ఘుటికాకారములై చల్లని ప్రస్రావము కలవైపడునవి వడగళ్లందురు.

చల్లనిమంచు నానాసమయములందనగా ప్రచురముగా నుత్తరవాయువులచేత నాకర్షించబడి భూమియందు ప్రసరించు నది లోకమున నుపకార

మగు నిందునుగూర్చి చెప్పెదము వినుండు. మంచును,చలియును నీరసమగుశరీర మును రసయుక్తముగ జేయును. బలమునువర్ధిల జేయును. సమస్తభూమినిఫలిం పజేసును. కీటకములనునశింప జేయును. సుశ్రుతమునదక్షిణాయనమందలి వర్ష రుతువుకంటె శరదృతువు దానికంటె హేమంత దినములందంతకంతకు సకల ప్రాణులకును బలవృద్ధియగునని.

సూర్యునిచేభూమివలన నాకర్షించబడు నీరసమాకాశమందుండు నో యందు గాలియును వసించు నిందువలన నానావర్ణముగల సూర్యకిరణము నకు నాకాశమందు నీలిమ సంభవించినందువలన నాకాశమును నీలిమని యం దురు.

సూర్యునిచే నాకర్షించబడు సకల పదార్థములయందుగల యుబ్బ తోగూడిన వహ్న్యంశ లేశములాకాశమందుండును. వాయువుచే నొకప్పుడవి చిమ్మబడి తేజోరూపములై పడును. ఇది తెలియనివారు నక్షత్రములు బడునం దురు.

ఎప్పుడెపుడు ప్రతికూలములగు వాయువులు పరస్పరాభిముఖములై వర్తించునో,లేక స్థిరవాయువును గొట్టినందుననో, ఆవాయుగతమగువహ్న్యం శమతివేగముగ బడు నది పిడుగనబడును.

సూర్యచంద్ర కిరణములొకప్పుడు వాయువశముచే మండలాకార ములై నానావర్ణములై కనబడు నవి గగనమందు పరివేషము లనబడును.

## గ్రహణోత్పత్తి కారణాని.

నను భగవంతౌ పుష్పవంతౌ పర్వణి రాహుకేతుభ్యాం గ్రస్తౌ భవత ఇతి శ్రుతిపురాణేతిహాసాగమేషు శ్రూయతే । సూర్యాది సిద్ధాంతగ్రంథేషు గభస్తిమాలినం శశీ శశినం భూఛాయాచాచ్ఛాదయతీత్యుక్తం॥

శ్రుతిస్మృతిపురాణానాం విరోధోయత్రజాయతే। తత్ర శ్రౌతం ప్ర మాణంతుతయోర్ద్వైధే శ్రుతిర్వరేతి స్మరణాచ్ఛ్రుతింప్రతిశ్రుతిరేవ ప్రమా హేతుస్తదన్యచ్ఛ్రుతిమాత్రమితి మన్యామహఇత్యాశంకాయాం నిశ్శంకముప పాదయిష్యామః॥

ఛాదకోభాస్కరస్యేందురధస్థోఘనవద్భవేత్ । భూచ్ఛాయాం ప్రా జ్ముఖశ్చందో్రవిశత్యస్యభవేదసావితి సూర్యసిద్ధాంతే॥ యత్వాసూర్యస్వర్భా నుస్తమసా విధ్యదాసురః। అత్రేత్రవిద్యధాముగ్ధో భువనాన్యదీధయురితి శ్రు

తిః ॥ అస్యార్థః ॥ యత్త్వాసూర్యేతి॥ సూర్యః హేసూర్య సర్వస్య ప్రేరక త్వాత్త్వాం యత్ యదా౽సురః అసురస్యపుత్రస్స్వర్భానుసంజ్ఞకః తమసా మాయానిర్మితేన అవిధ్యత్ ఆవృణోత్ తదా భువనాని త్రిభువనం తత్రత్యా లోకా లక్ష్యంతె సర్వేపిజనాః తథా అధీధయుః దృశ్యంతె యథా అక్షేత్ర విత్ ముగ్ధః నక్షేత్రంవేత్తీత్యక్షేత్రవిత్ స్వస్థానమజానన్ యథా ముగ్ధోమూ ఢోభవతి తథా ఆసన్నిత్యర్థః॥

పురాణవేదినా యతో మూర్త్తమా నాగ్రహురిత్యుపగమ్యతె తదసత్ చందోగ్రపరాగస్య సర్వగ్రాసమయె వృక్షచ్ఛాయాంతర్గతపురుషవద్భూచ్ఛా యాంతర్గతశ్చంద్రమా దృశ్యతె తస్మాచ్చంద్రస్య భూచ్ఛాయైవాచ్ఛాదికా॥ తత్రైవోక్తం॥ త్రిలోకైకదీపాద్విధోర్భార్ధసంస్థాద్దినేశాన్మహీవృత్తశకోగ్రప్రభాయాం। ప్రవిష్టేవిధౌ పర్వణీహప్రసిద్ధం వృథా రాహుణా గ్రస్తమిత్యుక్తమన్యైః॥ లంకాయాం నతురామసేతునికటే సప్తాంశకోర్క గ్రహశ్శ్రైశైలే దశలిప్తికా వసుకలా శ్రీకాళహస్తీస్థలె। తతావంతిపురేర్ధమానమమరావత్యాంచ కేదారకే తస్యాసౌ గ్రహణస్య హేతురితిచే త్స్వర్భానవ స్తేకతీతి దైవజ్ఞాభరణె వశిష్ఠః॥ ఉద్భూతాఖిలధరణీ ఛాయా ఛాదయతి చంద్రముపరిస్థం। స్థగయతి రవిముపరిస్థం పశ్చాదాగత్య శీఘ్రగశ్చంద్రః॥ బ్రహ్మసిద్ధాంతె॥ ఛాదకోధస్థితశ్చాద్యముపరిస్థం శశీ రవిం। ఛాదకాధస్థితా రాజ్ఞో భూచ్ఛాయా మునిసత్తమ॥ స్ఫుటశశిమాసాంతేర్క౦పాతాసన్నో యదా ప్రవిశతీందుః। భూచ్ఛాయాం పక్షాంతె తదాదికోసౌ గ్రహణమధ్యం॥ ఇత్యుక్తవద నైర్గణ్యతె॥ చంద్రపాతస్తు విక్షేపమాత్రహేతుః నాచ్ఛాదకః తథాపి బలాద్వ్యభిచారమాపాదయంతీతి తత్సంహితా పురాణవేదినః చంద్రగ్రహణె రాహుర్భూచ్ఛాయామాశ్రిత్యార్కగ్రహణె శశినమాశ్రిత్య గ్రసతీత్యుక్తే సర్వాగమానా మవిరోధస్స్యాదిత్యుక్తం సిద్ధాంతశిరోమణౌ॥ దిగ్దేశకాలావరణాది భేదాన్నాచ్ఛాదకో రాహురితిబ్రువంతి। యన్మానినః కేవలగోళవిద్యా తత్సంహితా వేదపురాణబాహ్యం॥ రాహుః కుభామండలగశ్శశాంకం శశాంకమాచ్ఛాదయతీ నబింబం। తమోమయశ్శంభువరప్రసాదాత్సర్వాగమానా మవిరుద్ధమేతత్॥

## గ్రహణములు గలుగుటకు హేతువులు.

ఓయీ పూజ్యులగు సూర్యచంద్రులు పర్వమందు రాహుకేతువులచే మ్రింగబడుదురని శ్రుతిపురాణేతిహాసములయందు వినబడుచున్నది. సూ

ర్యసిద్ధాంతాదిగ్రంథములయందు సూర్యమండలమును చంద్రబింబము చంద్రుని భూచ్ఛాయయు నాచ్ఛాదించునని జెప్పబడియున్నది. శ్రుతిస్మృతి పురాణములకు విరోధమేవిషయమందగపడునో యచట శ్రుత్యుక్తము ప్రమాణము. స్మృతిపురాణములకు విరోధమగునపుడు స్మృతిప్రమాణమనుటచేతను శ్రుతులకు శ్రుతియే ప్రమాణము. దీనికంటె నన్యము భ్రమమాత్రమని దలచెదను. ఇటుల శంక గలుగుచునుండ నిశ్శంకముగనుపపాదించెదము. చంద్రుడు దిగువనుండి మేఘమువలెను రవి నాచ్ఛాదించును. చంద్రుడు పూర్వాభిముఖముగ భూచ్ఛాయయందు బ్రవేశించును. ఇవి వీరలకు గ్రహణములని సూర్యసిద్ధాంతము. * * * * * *

సర్వజగత్ప్రేరకుడైన ఓసూర్యుడా నిన్ను నెవుడసురబుత్రుడగు స్వర్భానుడను పేరుగలవాడు తనమాయానిర్మితమగు చీకటిచేతను గప్పెనో అపుడు భువనస్థజనులు తమస్థలమునే గుర్తెరుగక మూఢుడగు జనునివలెను యథార్థము నెరుగకుండిరని ఋగ్వేదశ్రుతి.

పురాణవేదులచే రాహువుస్వరూపముగలవాడని జెప్పబడు నది గాదు. చంద్రగ్రహణమునకు సర్వగ్రాసమందు వృక్షచ్ఛాయను బ్రవేశించిన పురుషునివలె భూచ్ఛాయనుబ్రవేశించి చంద్రుడగపడును. దీనివలన జందురుని కాచ్ఛాదకము భూచ్ఛాయయేయని జెప్పబడును.

త్రిలోకదీపమగు చంద్రునకు నేడవరాశియందున్న సూర్యునివలన బ్రవృత్తమగు భూగోళచ్ఛాయను పర్వమందు చంద్రుడు ప్రవేశింపుచుండ చంద్రగ్రహణమగు నివి సుప్రసిద్ధమన్యులచే రాహువు చంద్రుని గ్రసించునని వృథాగా బలుకబడును.

ఎప్పుడు లంకయందు గ్రహణమగుపడదప్పుడు రామసేతుప్రాంతమందు సూర్యగ్రహణమేడంశలగపడును. శ్రీశైలమందు పదిలిప్తలును కాళహస్తియందెనిమిది కళలు నవంతీపురమందు సగమమరావతియందును కేదారమందును బూర్ణముగ సూర్యగ్రహణమగపడును. ఇట్టిగ్రహణమునకు రాహువు కారణమైనయెడల రాహువులెందరుందురని దైవజ్ఞాభరణము. భూచ్ఛాయ బయలుదేరి పైనియున్న చంద్రుని గప్పుననియును పైనియున్న సూర్యునివెనకనుంచి శీఘ్రగతిగల చంద్రుడాచ్ఛాదించునని వశిష్ఠముని జెప్పెను. ఇటువలెనే బ్రహ్మసిద్ధాంతమందును జెప్పబడెను. ఇట్లు వచనములచే బ్రమాణముగ జెప్పబడెను. * * * * *

చంద్రపాతమైతే విక్షేపమాత్రమునకు హేతువుగాని యాచ్ఛాదకముగాదు. అలాగైనప్పటికీ బలాత్కరించి వ్యభిచారమును జెప్పుచున్నారు. అయిన పురాణవేదులు చంద్రగ్రహణమందు రాహువు భూచ్ఛాయనాశ్రయించియు సూర్యగ్రహణమందు చంద్రునాశ్రయించియు గ్రసించుననిఁ బలికిన సకలశాస్త్రములకు విరోధము లేదని జెప్పబడెను.

సిద్ధాంతశిరోమణియందును దిక్కు, దేశము, కాలము, ఆవరణము మొదలగు భేదమువలన రాహువాచ్ఛాదకుడుకాడని జెప్పుచున్నారు. ఇది కేవలగోళవిద్యాభిమానులు వేదపురాణవిరోధముగ జెప్పినమాట యిక నేమంటే- తమోమయుడగు రాహువు భూచ్ఛాయనాశ్రయించి చంద్రుని చంద్రునాశ్రయించి సూర్యుని శివవరప్రసాదమువలన నాచ్ఛాదించునని సర్వశాస్త్రావిరుద్ధముగానిట్లు జెప్పబడెను.

చంద్రకళానాం వృద్ధిక్షయద్యోతనే కారణమ్.

కళానాథస్య కళానామేవ వృద్ధిక్షయా నతు క్షపానాథమండలస్యేతి సహేతుకం బ్రూమః॥ అప్యమండలశ్చంద్రమాః॥ తేజోమండలశ్చండరశ్మిః॥ తయోరేకనక్షత్రావస్థానేన దృశ్యతే శశీ చక్షుషాం మార్తాండమండలేన సమదేశస్థితేన వ్యవధానాత్ సా అమావాస్యా॥ అథ షష్టినాడికాభిశ్చంద్రమా నక్షత్రాంతరం గచ్ఛతి అరుణకిరణస్తు త్రయోదశభిరహోరాత్రైః అతః ప్రతిపదమారభ్య విషమస్థితస్యాదిత్యమండలస్య పంచదశోభాగః అప్యమండలె ప్రతిబింబతో దృశ్యతె సా కళేత్యుచ్యతె ఏవంపంచదశేహ్ని త్రయోదశభిర్నక్షత్రైరంతరమితి రాశిచక్రస్యసప్తవింశతినక్షత్రాత్మకస్యమధ్యే సమ్ముఖౌ శశిశిరఖరమయూఖౌ యదా తిష్ఠతః తదా సంపూర్ణప్రతిబింబం భూచ్ఛాయాలాంఛితం దృశ్యతే సాపూర్ణిమా తస్యాం పౌర్ణిమాస్యాం సంపూర్ణప్రతిబింబేన షోడశకళశ్చంద్రఇత్యుపచర్యతె తతః పునః ప్రతిపదమారభ్య మండలయోర్విషమభావాత్కళాహ్రాసఇతి జ్ఞేయం॥ తథాచ స్మర్యతె॥ సలిలమయే శశిని రవేర్దీధితయో మూర్ఛితాస్తమోనైశం। క్షపయంతి దర్పణోదరనిహితాఇవ మందిరస్యాంతః॥ తరణికిరణసంగా దేషపియ్యూషపిండో దినకరదిశి చంద్రశ్చంద్రికాభిశ్చకాస్తి॥ తదితరదిశి బాలాకుంతల శ్యామలశ్రీర్ఘటఇవనిజమూర్తిశ్ఛాయయైవాతపస్థః॥ తేజసాంగోళకస్సూర్యో గ్రహర్క్షాణ్యంబుగోళకఇతిభాస్కరాచార్యః॥

చంద్రకళలకు వృద్ధిక్షయములుగలుగునట్లగపడుటకు కారణము.

చంద్రునియందగపడు కళలకే వృద్ధిక్షయములుగాని చంద్రునికవి లేవని సహేతుకముగ జెప్పెదము.

చంద్రుడు జలమయుడు సూర్యుడు తేజోమయుడు వీరిరువురు నేకతారయందున్నతరిని చంద్రుడగపడడు. సూర్యచంద్రమండలములు సమముగానున్నందున క్రిందిప్రజలకు చంద్రుడు కనపడని దినమమావాస్య. ఇందుకు హేతువరువదిగడియలకు చంద్రుడొకనక్షత్రము నతిక్రమించును. పదమూడు దినములకు సూర్యుడొకనక్షత్రము నతిక్రమించు నిందువలన పాడ్యమి మొదలు జలమయుడగు చంద్రుడు విషమస్థితుడైనందున సూర్యుని పదేనవభాగము ప్రతిబింబించి కనబడునపుడు చంద్రుడేకకళావంతుడై యగపడు నిటులొక్కొ-దినమందొక్కొ-కకళ ప్రతిబింబితమగుచు నధికముగా గనబడును. ఇటులు పదియేనవదినమందు సప్తవింశతినక్షత్రాత్మక రాశిచక్రమధ్యగతులై చంద్రసూర్యులన్యోన్యముఖముగ నుండునపుడు సంపూర్ణ చంద్రబింబమగపడును.

అథాతస్సదాచారం వ్యాఖ్యాస్యామః

సతాం సాధూనా మపగతకిల్బిషాణాం య ఆచారస్సదాచారః తం వ్యాఖ్యాస్యామః విశేషేణాభిధాస్యామః॥ తదుక్తం శ్రీవిష్ణుపురాణే॥ సాధవః క్షీణదోషాస్తు సచ్ఛబ్దస్సాధువాచకః। తేషామాచరణంయత్తు సదాచార స్స ఉచ్యతఇతి॥

సదాచారనిరూపణము.

ద్వివిధధర్మాదినిరూపణానంతరమందు గతపాపులగు సత్పురుషుల యాచారమును జెప్పుచున్నారము. * * * *

సాధువులనగా క్షీణదోషులగువారు. సచ్ఛబ్దము సాధువులందున వర్తించును. వారాచరించునది సదాచారమనబడునని శ్రీవిష్ణుపురాణము.

త్రివిధకర్మలక్షణమ్.

కర్మాణి త్రివిధాని దృష్టఫలజనకానిచ కానిచి దృష్టాదృష్టఫల జనకానిచ యథామతి తాన్యుపపాదయిష్యామః॥

కర్మములు మూడువిధములు దృష్టఫలమునుబుట్టించునవియు నదృష్టఫలమునుబుట్టించునవియును కొన్నిదృష్టాదృష్టఫలజనకములును వాటిని మాపరిజ్ఞానముకొలది ప్రతిపాదనము జేసెదము.

## బ్రాహ్మీముహూర్తే చతుర్వర్గవిచారణమ్.

బ్రాహ్మేముహూర్తే బుధ్యేత ధర్మార్థౌచానుచింతయేత్ । కాయక్లేశాంశ్చ తన్మూలాన్వేదతత్త్వార్థమేవచేతి మనుః॥ బ్రాహ్మీముహూర్తో రాత్రేస్సంధ్యాపూర్వదండద్వయాత్మకః కాలః తత్రబోధో అభ్యనుజ్ఞాతః। ధర్మార్థౌచ పరస్పరావిరోధేనానుష్ఠానార్థ మవధారయేత్ । తథా । ధర్మార్జనహేతూన్కాయక్లేశాన్నిరూపయేత్।యదిమహాన్కాయక్లేశోల్పశ్చ ధర్మోర్థోవా తదాతంపరిహరేత్। వేదస్యతత్త్వార్థం బ్రహ్మకర్మాత్మకం నిశ్చినుయాత్। తస్మిన్సమయే బుద్ధిప్రకాశాత్తదుక్తం బ్రహ్మపురాణే॥ బ్రాహ్మే ముహూర్తే స్వస్థేచ మానసేమతిమాన్నృపః । విశుద్ధశ్చింతయేద్ధర్మమర్థంచాస్యావిరోధినం । అపీడయా తయోః కామముభయోరపి చింతయేత్॥ వాహటస్తు॥ బ్రాహ్మేముహూర్త ఉత్తిష్ఠేత్స్వస్థోరక్షార్థమాయుష ఇత్యుక్తత్వాత్। నైశే చతుర్థశేముహూర్తే ప్రబోధనమాయుర్వృద్ధికరమిత్యవగంతవ్యం। స్వస్థఇతి తన్ముహూర్తే ప్రతిబుద్ధజనవిశేషణం । తస్మిన్ముహూర్తే సమదోషస్సమాగ్నిస్సమధాతుర్భవతీతిచగమ్యతే॥ తథాహుః॥ సమదోషస్సమాగ్నిశ్చసమధాతుమలక్రియః। ప్రసన్నాత్మేంద్రియమనస్స్వస్థఇత్యభిధీయత ఇతి॥ ధర్మార్థకామయోరవిరోధేన సేవనం శ్రేయఇతి మన్వాదయోవదంతి తయోరన్యోన్యపీడనే కాపీడా అసేవనే కింస్యాదిత్యాకాంక్షాయాం వదామః॥ ధర్మార్థావుచ్యతే శ్రేయః కామార్థౌ ధర్మఏవచ। అర్థఏవేహవా శ్రేయస్త్రివర్గ ఇతితుస్థితిః॥ ధర్మార్థౌ శ్రేయోవిధీయేతే కామహేతుత్వాదితి కేచిదాచార్యా మన్యంతే అన్యేత్వర్థకామౌ సుఖహేతుత్వాత్ శ్రేయోభిధీయేతే ధర్మఏవేత్యపరే అర్థకామయోరప్యుపాయత్వాత్ అర్థఏవేహలోకే శ్రేయఇత్యన్యే ధర్మకామయోరపి సాధనత్వాత్ సంప్రతి స్వమతమాహ ధర్మార్థకామాత్మకః పరస్పరావిరుద్ధః త్రివర్గఏవ పురుషార్థతయా శ్రేయఇతి వినిశ్చయః ॥ తదుక్తం ॥ పరిత్యజేదర్థకామౌ యౌ స్యాతాం ధర్మవర్జితౌ। ధర్మమప్యసుఖోదర్కం లోకవిక్రుష్టమేవచేతిమనుః॥ విక్రుష్టం లోకానాంవిక్రోశం॥ ధర్మార్థకామాస్సమమేవ సేవ్యా యోహ్యేకసక్తస్సనరో జఘన్యఇతిచ॥ ధనానితు యథాశక్తి విప్రేభ్యః ప్రతిపాదయేత్ । వేదవిత్సు వివిక్తేషు ప్రేత్య స్వర్గం సమశ్నుతఇతి మనుః॥ అస్యార్థః ధనాని గోభూహిరణ్యాదీని శక్త్యనతిక్రమేణ బ్రాహ్మణేషు వేదజ్ఞేషు వివిక్తేషు పుత్రకళత్రాద్యవసక్తేషు ప్రతిపాదయేత్తద్వశాచ్చ స్వర్గప్రాప్తిర్భవతీతి॥

నను ధనాని ప్రతిపాదయేదిత్యుక్తం తదార్జనోపాయాశ్చ అర్జితేద్ర

న్యా ధర్మార్థకామేషు కియత్పరిపాట్యా ప్రజ్ఞాపాటవేన వ్యయః కర్తవ్య నోక్తమితిచేద్బ్రూమః॥

అలబ్ధమీహేద్ధర్మేణ లబ్ధం యత్నేన పాలయేత్। పాలితం వర్ధయేన్నీత్యా వృద్ధం పాత్రేషు నిక్షిపేదితి యోగీశ్వరః॥ అస్యార్థః॥ అలబ్ధలాభాయ ధర్మశాస్త్రానుసారేణ యతేత తల్లబ్ధంతు స్వయమపేక్షయా రక్షేత్ పాలితం నీత్యా వాణిజ్యాదికయా వృద్ధింనయేత్ వృద్ధంచ పాత్రేషు ధర్మార్థకామయుక్తేషు త్రివిధేషు నిక్షిపేద్దద్యాదితి॥

ధర్మేణార్థస్సమాహార్యో ధర్మలబ్ధం త్రిధాధనం। కర్తవ్యం ధర్మపరమం మాసవేన ప్రయత్నతః॥ ఏకేనాంశేన ధర్మార్థా కర్తవ్యా భూతిమిచ్ఛతా। ఏకేనాంశేన కామార్థమేకమంశంవివర్ధయేదితి శ్రీమహాభారతే ఆనుశాసనికపర్వణి॥ కచ్చిదాయస్యచార్ధేన చతుర్భాగేనవాపునః। పాదభాగై స్త్రిభిర్వాపి వ్యయస్సంశోధ్యతే తవేతి సభాపర్వణి కచ్చిత్సర్గే॥ అస్యార్థః॥ సుభిక్షసామ్యదుర్భిక్షేషు ఆయస్య పాదేన పాదాభ్యాం త్రిభిః పాదైర్వా వ్యయస్సంశోధ్యతేత వేతి కచ్చిత్కామప్రవేదనం॥

యావద్విత్తస్య వృద్ధాచ జీవనం పుత్రపౌత్రయోః। తావద్ధనం స్థాపనీయం శేషద్రవ్యంప్రదాపయేదితి వృద్ధమనుః॥ వృద్ధాచ మాతాపితరౌ భార్యా సాధ్వీ సుతశ్శిశుః। అప్యకార్యశతంకృత్వా భర్తవ్యా మనురబ్రవీత్॥ శక్తః పరజనేదాతా స్వజనే దుఃఖజీవినీ। మధ్వాపాతో విషాస్వాద స్సధర్మప్రతిరూపకః॥ భృత్యానాముపరోధేన యత్కరోత్యౌర్ధ్వదైహికం। తద్భవేదసుఖోదర్కం జీవతశ్చ మృతస్యచేతి మనుః॥

మాతాపితా గురుర్భార్యా ప్రజా దీనస్సమాశ్రితః। అభ్యాగతోతిథిశ్చాపి పోష్యవర్గఉదాహృతః॥ భరణం పోష్యవర్గస్య ప్రశస్తం స్వర్గసాధనం। నరకఃపీడనే యస్మాత్తస్మాద్యత్నేన సంభరేత్॥ జ్ఞాతిబంధుజనక్షీణ స్తథానాథస్సమాశ్రితః। అన్యోపిధనయుక్తస్య పోష్యవర్గఉదాహృతఇతి దక్షః॥ మాతాపితృషు యద్దత్తం భ్రాతృషు శ్వశురేషుచ। జాయాపత్యేశ్చ యో దద్యాత్సోనంతస్స్వర్గసంక్రమః॥ పితుశ్శతగుణందానం సహస్రం మాతురుచ్యతే। భగిన్యాం శతసాహస్రం సోదరే దత్తమక్షయమితి వ్యాసస్మృతిః॥

న కేవలం బ్రాహ్మణానాం దానం సర్వత్ర శస్యతే। భగినీభాగినేయానాం మాతులానాం పితృష్వసుః। దరిద్రాణాంచ బంధూనాం దానంకోటిగు

ణం భవేదితి భవిష్యోత్తరపురాణే॥ సమమబ్రాహ్మణే దానం ద్విగుణం బ్రాహ్మణబ్రువే। సహస్రగుణమాచార్యే అనంతం వేదపారగ ఇతిమనుః॥

విత్తకామస్సమమతి ర్దాతు రాయవ్యయా వీక్ష్య విహింసన్న్యాచేతేతి నియమ అరణ్యకపర్వణి కుంభసంభవోపాఖ్యానే ఖ్యాతః॥

అగస్త్యః॥ విత్తకామావిహప్రాప్తౌ విద్ధ్యావాం పృథివీపతే। యథా శక్త్యవిహింస్యాన్యాన్సంవిభాగం ప్రయచ్ఛనః॥ లోమశ ఉవాచ॥ తత ఆయవ్యయా పూర్ణా తాభ్యాం రాజా న్యవేదయేత్। తతోజ్ఞాత్వాతు గృహీతం యదత్ర వ్యతిరిచ్యతే॥ తత ఆయవ్యయా దృష్ట్వా సమా సమమతిర్ద్విజః। సర్వథా ప్రాణినాం పీడా ముపాదానాదమన్యతేతి॥

ఇష్టాపూర్తకర్మణా మధికారిణం ధనినం ప్రతిపాదయతిమనుః॥ యస్య త్రైవార్షికం భక్తం పర్యాప్తం భృత్యవృత్తయే। అధికంవాపి విద్యేత ససోమం పాతుమర్హతి। అతస్స్వల్పీయసిద్రవ్యే యస్సోమం పిబతిద్విజః। సపీతసోమపూర్వోపి నతస్యాప్నోతి తత్ఫలమితి ॥ కామసేవనేపి నియమస్స్మర్యతే॥ తద్యథా॥ సేవేత విషయాన్కాలే ముక్త్వా తత్పరతాం వశీ। సుఖంహి ఫలమర్థస్య తన్నిరోధే వృథా శ్రియః॥

కామాదీనామాచరణే కాలం దర్శయతిదక్షః॥ పూర్వాహ్ణే చాచరేద్ధర్మం మధ్యాహ్నేర్థముపార్జయేత్। సాయాహ్నే చాచరేత్కామ మిత్యేషా వైదికీశ్రుతిరితి॥

ధర్మకామార్థసిద్ధిశ్చ భృత్యాదీనాం భరణం మిత్రప్రాప్తిః కోశాదేవ భవేదితి స్మర్యతే॥ భృత్యానాం భరణం దానం భూషణం వాహనక్రయః। స్థైర్యం పరోపజాపశ్చ దుర్గసంస్కారఏవచ। సేతుబంధోవణిక్కర్మ ప్రజామిత్రపరిగ్రహః। క్షీణప్రజాశ్చ మిత్రాణి కోశేనైవచ గృహ్యతే॥ ధర్మకామార్థసిద్ధిశ్చ కోశాదేవ ప్రవర్తత ఇతి॥

ఉత్థాయ పశ్చిమే యామే శాంతమానసో వినీతనిద్ర స్సతివిరోధే తం త్యక్త్వా నోచేత్తత్ర సంస్థిత స్సమా ప్రాణాపానౌ ధృత్వా దివాకరం సముద్ధాప్య దివాకరేణ ప్రోత్ఫుల్లితే పద్మే మానసం హంసం సమాశ్రమే దంగుష్ఠమాత్రం పురుషం పరాపరం జ్యోతీరూపమాలోక్యదివ్యం దివ్యేనచక్షుషా యథాలాభముషఃకాలే స్థిత్వా స్తోత్రైరనేకధా స్తుత్వేతి గౌతమప్రగీతమార్గేణ ధ్యాత్వా ధర్మార్థకామచింతనం కుర్వంత్వితి వదామః॥

భూప్రార్థనా విధిః

సముద్రవసనే దేవి పర్వతస్తనమండలే। విష్ణుపత్ని నమస్తుభ్యం పాదస్పర్శం క్షమస్వ మే ఇతి భూదేవిం ప్రార్థయేదితి॥

వేదతత్త్వార్థచింతనప్రపంచోఽత్ర న విస్తృతః ప్రకరణాంతరే ప్రకటితత్వాత్॥ * * * * * * *

బ్రాహ్మీముహూర్తమున చతుర్వర్గవిచారణము.

ప్రాతస్సంధ్యాకాలమునకు పూర్వమగు రెండుగడియల వేళకు బ్రాహ్మ్యముహూర్తమని పేరు. అట్టిసమయమున నిద్రించకుండ లేచుటకు మనువుగారిచే ననుజ్ఞ జేయబడెను.

ఒకదానిచే నొకదానికపాయము లేకుండ ధర్మార్థార్జనోపాయములను వాటికి హేతువులగు శరీరాయాసమును నిరూపించుకొని ధర్మార్థలాభమల్పము శరీరాయాసమధికము నైకృత్యము జేయుటచే నగు నాకర్మను జేయరాదు. బ్రహ్మమునందత్యంతప్రీత్యుపాయభూతములగు కర్మలను ప్రతిపాదించుటస్వరూపముగాగల వేదతత్త్వమును నిశ్చయించుకొనదగును.

ముందు కాదగు మేలుకీళ్లను దెలిసి మెలగు పరిశుద్ధుడు దనమానసమున ధర్మమునకు బాధలేని యర్థము నర్థమునకు విరోధమగుపడని ధర్మమును ధర్మార్థములను లోపింపజేయని కామపురుషార్థమును దానొనర్చుకొరకు బ్రాహ్మీముహూర్తవేళ చిత్తమునకు ప్రసన్నత కలిగియుండును గాన నాలోచించదగునని బ్రహ్మపురాణవచనము-

రాతిరి పదునైదుభాగములొనర్చిన యందు పదునాల్గవభాగము బ్రాహ్మ్యముహూర్తమనబడు నందాయుర్వృద్ధికొరకు స్వస్థుడగుచు నిద్రమేల్కొనదగునని బాహటుండనెను. స్వస్థుడనుశబ్దము బ్రాహ్మ్యముహూర్తమందున లేచినమనుజునకు విశేషణము. ధాతువులు త్రిదోషము లగ్నియును సమత కలిగి యింద్రియము లాత్మయు మనంబును ప్రసన్నమైయుండువాడు స్వస్థుడని జెప్పబడుచున్నదని వచనము.

మన్వాదులు ధర్మార్థకామములలో నొకదానికొకటి బాధకముగాకుండ సేవనమధికశ్రేయమని జెప్పుచునున్నారు. ఇతరేతరబాధవలన గలిగెడి లోపమేది యది సేవించకుండిన నేమగునను నాకాంక్షను జేసి చెప్పెము. ధర్మార్థములు రెండును కామమునకు హేతువులగుటవలన శ్రేయములని గొంద

రాచార్యులచేత విధించబడుచున్నది. అర్థకామములు సుఖమునకు కారణమగుటవలన శ్రేయమని కొందరిమతము. అర్థకామముల కుపాయభూతమైనందున ధర్మమొకటే సేవించతగునని గొందరందురు. ధర్మకామసాధనమగుటచేత సర్థార్జనమే శ్రేయోర్థమని మతాంతరము. పరస్పరవిరోధములేకుండ నన్నియును పురుషార్థములగుటవలన శ్రేయములని మామతమనుచుమనువచనముగలదు.

ధర్మవర్జితములగు నర్థకామముల సేవించకూడదు. ధర్మమును ముందు బాధకమొనర్చునది లోకనిందితమును గ్రాహ్యముకాదని మనువచనము.

ధర్మార్థకామములను సమముగ సేవించక నొకదానియందుమాత్రమాసక్తుడధముడని స్మృత్యంతరమును జెప్పుచున్నది.

గోవులు భూమియు స్వర్ణము మొదలగునవి తన శక్తి నతిక్రమించకుండ వేదవేత్తలు కుటుంబవంతులు బీదలునగు బ్రాహ్మణులకు దానమొనర్చి యాసుకృతమున స్వర్గమునొందుదురని మనుస్మరణముండుటవలన ద్రవ్యదానమొనర్చుట విధిగా విధించబడెను. అవి ఆర్జించునుపాయము నట్టి యార్జితద్రవ్యమును ధర్మార్థకామములకెంతమట్టుకు తనప్రజ్ఞచేసి వ్యయమును జేయవలసినదో యవి చెప్పలేదని శంకించిరట్లాయనా స్పష్టముగ నట్టివిధులను జెప్పుదుము.

తనకు లబ్ధముగాని యర్థలాభమునకు ధర్మశాస్త్రము ననుసరించి యత్నమును జేయవలయు నట్టిధర్మలబ్ధము నత్యంతయత్నపరుడై రక్షణమొనర్చి వర్తకాదికముచేతను వృద్ధినొందించి యావృద్ధమగు నర్థమును ధర్మార్థకామయూపపాత్రమందున వ్యయమునర్చుమని యాజ్ఞవల్క్యవచనము.

ధర్మముచే నర్థము నార్జించి యాన్యాయలబ్ధమును మూడుభాగములొనర్చి యందునొకటి ధర్మార్థములను సంపాదించుకొరకును రెండవపాలు కామపురుషార్థలాభముకొరకును వ్యయమొనర్చి మూడవపాలు దాచి వృద్ధినొందించవలయునని శ్రీమహాభారతమందలి యానుశాసనికపర్వశాసనము.

తనకువచ్చునాదాయములో సుభిక్షకాలమున నొకపాలును సమకాలములో రెండుపాళ్లను దుర్భిక్షములో మూడుపాళ్లను ధర్మార్థకామములందు వ్యయమొనర్చి మిగిలినద్రవ్యమును దాచియుంచవలెనని భారతసభాపర్వమందలి కచ్చిత్సర్గలోని నారదవచనము.

ఎంతద్రవ్యముయొక్క వృద్ధిచేతను దనపుత్రపౌత్రులకు జీవనమగునో

అంతధనముంచి మిగిలినద్రవ్యమును ధర్మార్థకామపాత్రమందు వ్యయమొనర్చు మని వృద్ధమనువచనము.

వృద్ధులగు తలిదండ్రులను బతివ్రతయగు భార్యను నిసువగు ననుతుల్యుడగు తనశిశువును సేయదగని నూరుకార్యములైనను జేసి బోషింపుమని భాషించెను మనువు. మరియును పరజనమునకు దాతయై స్వజనమును గష్టముగ జీవింపజేయువానికి ధర్మము ప్రతికూలమైనదై తత్కాలమందు తేనెవలె తీపను జూపి విషమునాస్వాదింపజేయును. భృత్యభరణమొనర్చక నాముష్మికము కొరకు నెవడు వ్యయమొనర్చునో వాడిహపరములయందు నుత్తరకాలమున సౌఖ్యమునొందడనియును మనువు చెప్పెను.

తలిదండ్రులు గురువు దీనులైన తనసంతతి భార్యయు నాశ్రితులతిథులు నభ్యాగతియును బోష్యవర్గమని జెప్పబడెను. వీరలను బోషించుట స్వర్గసాధనము. పీడించుటవలన దనకు నరకపీడ గలుగు నదికారణమువలన యత్నముచేతను జక్కగ బోషింపవలయును.

ధనికొనకు క్షీణించిన జ్ఞాతి, బంధువు, తననాశ్రయించిన యనాథయును బోష్యవర్గములోవారలని దక్షవచనములు. తల్లికిని దండ్రికిని భ్రాతలకు నత్తమామలకు భార్యకు దనసంతతికిచ్చునది యనంతమై స్వర్గప్రాప్తికి హేతువగును. తండ్రికిచ్చునది శతగుణము. తల్లికిచ్చునది సహస్రగుణము. భగినికిచ్చునది లక్షగుణము. సోదరునకిచ్చునది యక్షయమునగునని వ్యాసస్మృతి.

బ్రాహ్మణమాత్రునకిచ్చునది ప్రశస్తమని దలంచకూడదు. దరిద్రులగు బంధువులకును భగినీభాగినేయమాతులపితృవ్యులకు నిచ్చుదానము శ్రేయస్సాధనమని భవిష్యోత్తరపురాణము.

బ్రాహ్మణేతరునకిచ్చిన దానము ధనముమాత్రముకే ఫలదాయియగును. బ్రాహ్మణమాత్రునకిచ్చిన దానము ద్విగుణఫలము. ఏకశాఖాధ్యాయికిచ్చునది సహస్రగుణము. రెండుమూడు వేదములు జదివినవానికిచ్చునది యనంతమగునని మనువచనము. * * * * *

ద్రవ్యమును యాచించువాడు దాను సమర్థుడై యిచ్చువానియాదాయవ్యయములను జూచి హింసించక యాచించుట యారణ్యపర్వమందలి యగస్త్యోపాఖ్యానమున విధించబడెను. అగస్త్యులవారొక రాజునడుగుటలో ద్రవ్యకాంక్షచే నిచటకేవచ్చినవారలనుగా మమ్మున దెలిసికొనవలెను. నిత

రులకు హింస కలుగకుండ మీశక్తికొలది చక్కగ విభజించి మాకివ్వవలయు ననిరి. ... ... ... ... ... ... ..

రాజు తన యాదాయవ్యయములు సమముగానున్నవని దెలియజే యుటవలన నారాజునుం దోడ్కొని మరియొకరాజువద్దికి వెళ్లి యతని నగస్త్యులవారు యాచించిరి. యా రెండవరాజుయొక్కయు సమముగు నాదాయ వ్యయములనుజూచి సమమతిగల యగస్త్యముని సమస్తప్రకారములచేతను ద్రవ్యస్వీకారమువలన ప్రాణులకు పీడకాగలదని మళ్లినట్లు లోమశమహాముని యుధిష్ఠిరులకు జెప్పెను.

ఎవనికి భృత్యాదులతోగూడ మూడుసంవత్సరములకు సరిపడనన్నమునకు తగిన యామద్రవ్యమైన నధికమైన గలదో వాడు సోమమునుపానమొనర్చదగును. స్వల్పమగు ద్రవ్యముగల ద్విజుడు సోమపానమొనర్చినను నందుల ఫలమునొందడని మనువచనము.

కామసేవనమునకు నియమము స్మరించబడుచున్నది.

ఇంద్రియజయముగలవాడై శాస్త్రానుజ్ఞాతములైన కామములను కాలమందున సేవించవలయును. అర్థార్జనకు సుఖమే ఫల మందుకు నిరోధను కలిగిన సంపదలు వ్యర్థము. * * * * *

పూర్వయామమున ధర్మము మధ్యాహ్నమున నర్థము సాయంకాలమున గామమునాచరించవలయునని వేదమువలన గనబడుచున్నదని దక్షవచనము. ... ... ... ... ... ...

ధర్మకామార్థసిద్ధియు స్వజనభృత్యాదిభరణమును మిత్రప్రాప్తియు మొదలగునన్నియును ద్రవ్యమువలన గలుగును గాన ద్రవ్యార్జన మావశ్యకమని జెప్పబడెను. * * * *

రాత్రిచరమభాగమున మేల్కొని ప్రసన్నచిత్తుడై విగతనిద్రుడగుచు శయ్యయందుండియైన నది వివిక్తస్థలముగాకుండిన విడచి ప్రాణాపానవాయువులను సమముగ ధరించి సూర్యప్రబోధభావనచేతను హృదయపద్మవికాసమునొనర్చి యందు మానసహంసయును పరాత్పరుడును దివ్యుడు నంగుష్ఠమాత్రుడునగు పురుషుని జ్ఞానదృష్టిని దర్శించి ధ్యానగోచరుడగునంతమట్టుకు ధ్యానించుచు నుషఃకాలమందుండి యనేకస్తోత్రములచే స్తుతి యొనర్చుమను

గౌతమసూత్రప్రకారముగ ముందొనర్చి యనంతరమున ధర్మార్థకామచింతన మొనర్చుట శ్రేయప్రదము. ... ... ... ...

### భూమిని ప్రార్థించువిధి.

సముద్రములు వస్త్రములుగాగలిగినటువంటియు, పర్వతములు స్తనమండలములుగా గలిగిన విష్ణుపత్నివగు ఓ భూదేవీ నీకొరకు నమస్కారము. నా పాదస్పర్శమును సహించుమని భూదేవిని ప్రార్థించవలెను.

వేదతత్త్వార్థప్రపంచము ప్రకరణాంతరమున ప్రకటించుటవలన నిచట విస్తరించబడలేదు.

### మూత్రపురీషోత్సర్జనవిధిః

తతశ్చావశ్యం కర్తుం నైఋతిం దిశమాశ్రయేత్। గ్రామాద్ధనుశ్శతం గచ్ఛేన్నగరాచ్చ చతుర్గుణమితి కాశీఖండే॥ తతః కల్యం సముత్థాయ కుర్యాన్మూత్రం నరేశ్వర। నైఋత్యామిషువిక్షేపమతీత్యాభ్యధికం భువః। దూరాదావసథాన్మూత్రం పురీషంచ విసర్జయేదితి విష్ణుపురాణే॥ అస్యార్థః॥ కాల్యముషసి మైత్రం మిత్రదేవతాధిష్ఠితపాయుకృత్యం మలోత్సర్గకర్మ శయనస్థానాన్నైఋత్యాం తదసంభవే శయనస్థానాద్దూరం మూత్రాద్యుత్సర్గం కుర్యాత్ నైఋతో రాక్షసః నిఋతిదిక్ప్రదర్శనం తస్యాః విశేషేణ దేవతాంశాధిష్ఠితత్వాదితి గమ్యతే॥ రాక్షసః కోణపః క్రవ్యాత్ క్రవ్యాదోఽస్రప ఆశరః। రాత్రించరో రాత్రిచరః కర్బురో నికషాత్మజః। యాతుధానః పుణ్యజనో నైఋతో యాతు రక్షసీత్యమరః॥ గ్రామనగరాదారాన్మూత్రపురీషోత్సర్జనేన తత్రత్యజనస్య రోగహేతుర్హేయత్వం జననికటతాంచ నస్యాదిత్యాలోచ్య దూరాదుత్సృజేదిత్యుక్తవంతః॥

శుష్కైస్తృణైస్తథా కాష్ఠైః పత్రైర్వేణుదళేన వా। మృణ్మయైర్భాజనైర్వాపి అంతర్ధాయ వసుంధరామితి వాయుపురాణే॥ తృణైః కుశాదివ్యతిరిక్తైః। తృణమయాజ్ఞికం కాష్ఠమిత్యాపస్తంబవచనాత్। అత్ర హేతుర్గౌతమేన దర్శితః। కేశవస్యాఙ్గనా భూదేవీ జగద్ధాత్రీ వసుంధరా విశ్వంభరా యతస్తస్మాత్తామాచ్ఛాద్య మలంత్యజేదితి॥ మూత్రోచ్చారసముత్సర్గం దివాకుర్యాదుదఙ్ముఖః। దక్షిణాభిముఖో రాత్రౌ సంధ్యయోశ్చ యథా దివేతి మనుః॥ సూర్యచంద్రసప్తర్షిధ్రువాద్యభిముఖం న తిష్ఠేదిత్యేవమర్థమ్॥

ఉత॥ ఛాయాయామంధకారేవా రాత్రావహనివా ద్విజః। యథాసుఖముఖః కుర్యాత్ప్రాణబాధాభయేషు చేతిమనుః॥ అనేన స్వస్థస్యైవ శాస్త్రోక్తక్రమనియమోపష ఇతి గమ్యతే॥ సభోపి మూత్రదిక్సంధ్యాగ్న్యాదిత్యగోఽప్రసిద్ధదేవతాభిముఖో మూత్రపురీషే నవిసృజేత్పథి గోవిప్రాంత్యుపయోగి ఛాయాయాం నవిసృజేత్స్వంతు ఛాయాయా మపమేహన్నసోపానన్మూత్రపురీషే కుర్యాత్కృష్టేప్సుచేతి గౌతమః॥ సభః అన వరణ్యసహ॥ తదుక్తం వాయుపురాణే॥ యదాకాశస్స్వతోఽభిమస్తస్మాన్నాసంవృతేక్వచిత్, కుర్యాన్మూత్రపురీషంవా నభుంజీత పిబేన్నవేతి॥ పిణ్మూత్రాభిముఖో నతిష్ఠేదితియదుక్తం తత్ అమేధ్యాఘ్రాణేన రోగాద్యుపద్రవసంభవస్స్యాదితి॥ చంద్రాగ్న్యర్కాగ్నినామభిముఖమేహనే ప్రజ్ఞానాశోభవేదితి॥ తథాచమనుః॥ ప్రత్యగ్నిం ప్రతిసూర్యంచ ప్రతిసోమోదకద్విజాన్। ప్రతిగాం ప్రతివాతంచ ప్రజ్ఞానశ్యతి మేహతఇతి॥ పథి విసృజన్పురందండ్యోభవతి॥ తథాచ మనుః॥ సముత్సృజేద్రాజమార్గే యస్త్వమేధ్యమనాపది। సద్వౌకార్షాపణౌ దద్యాదమేధ్యంచాశు శోధయేత్। ఆపద్గతోఽథవా వృద్ధో గర్భిణీబాలఏవవా। పరిభాషణమర్హంతి తచ్చ శోధ్యమితిస్థితిరితి॥ కార్షాపణో పణద్వయం పరాటికానాం దశకద్వయం యత్నా కాకినీ తాశ్చ పణశ్చతస్రఇతి లీలావత్యాం॥ గోవిప్రాంత్యుపయోగి ఛాయాయాం స్వచ్ఛాయాయాంచాదృష్టార్థహానిస్స్యాదితి॥ సపాదకోత్సర్జననిషేధస్తు తయోః విణ్మూత్రసంపర్కో నస్యాదితి॥ కృష్టక్షేత్రే యద్యవమేహేత్తు తత్ర నిష్పన్నానాం యవాదీనాం భక్షణేరోగస్స్యాదితి॥ విజ్ఞానినభక్షయేదితి యాజ్ఞవల్క్యః॥ అభక్ష్యాణి ద్విజాతీనా మమేధ్యప్రభవాని చేతిమనుః॥ అప్సుమేహనే లోకస్య స్నానపానాదీనామననుకూలోభవేదితి॥ అమేధ్యాదకం పరిహరేదితి శంఖలిఖితౌ॥ తథాచ వైద్యకే॥ విణ్మూత్రతృణసీలికా విషహాతం తప్తం ఘనం ఫేనిలం చంద్రార్కాంశుతిరోహితంచ నపిబేన్నీరం సదా పండితఇతి॥ దక్షిణకర్ణోపవీతవాన్నివీతం పృష్ఠతఃకృత్వేతి గౌతమోక్తిః॥ కుక్షిస్థ మలమూత్రాదివిసర్జనే కుక్షిసంపర్కోనభవేదితి॥ ఘ్రాణాస్యం వాససావేష్టయిత్వా మృద్పాత్రీం కంఠే సమాసజ్య దక్షిణబాహుపార్శ్వే కమండలుమాదాయేతి హారీతః॥ శిరః ప్రచ్ఛాద్య కుర్వీత శకృన్మూత్రవిసర్జనమితియమః॥ మృద్పాత్రీం మృత్తికాపాత్రం॥ మనురపి॥ నియమ్య ప్రయతోవాచంసంవీతాంగోవకుంఠితఇతి॥ ఘ్రాణాస్యయోరాచ్ఛాదనం విణ్మూత్రగంధాఘ్రాణవాక్ప్రవృత్త్యోః ప్రతిబంధార్థం అమేధ్యస్థాననిష్ఠీవనేన కంఠనాళే రోగముత్పద్యతే తన్నివృత్త్యర్థంచ సంవృతాంగత్వశిరోవేష్టనే మలసంసర్గవత్కీటాదిసంపర్కో గే

హావస్తకయోర్న స్యాదితి॥ అనుజ్ఞాగస్త్యశ్చైః పాయుమలమృత్స్యజేదితి గౌతమః॥ అనుజ్ఞాంగస్త్యజేనోత్సర్జనం తత్సంపర్కదర్శాదినా ప్రమాదాద్యస్థివినియోగోన స్యాదిత్యేతదర్థం। మృజ్జలశౌచాత్పూర్వమేతదాచరణబోధకం। కేవలంతత్సంపర్కజలమృత్స్నయోర్న స్యాదితిజలమృత్పూజార్థమిత్యవగమ్యం॥

## మూత్రపురీషోత్సర్జన విధి.

అనంతరమున మూత్రపురీషోత్సర్జనముకొరకు నైఋతిదిశ నాశ్రయించవలెను. గ్రామముకంటె నూరువిల్లు పెట్టును పైకి వెళ్లవలెనని కాత్యాయనము. దూరముగ విణ్మూత్రములను విడువ్రమని విష్ణుపురాణము. నైఋతిదిక్కునందు విడువ్రమనుట నాసికను విశేషముగ దేవతలుండరని జెప్పినటుల దోచుచున్నది. గ్రామనగరములకు సమీపమున మూత్రపురీషోత్సర్గముచే నచటిజనులకు రోగహేతువు నసహ్యము జనసాన్నిధ్యమునగునని యాలోచించి దూరమున విడువవలయునని జెప్పిరి.

ఎండినగడ్డి లేక కాష్ఠములు, పర్ణములు, వేణుదళములు, మృణ్మయపాత్రలు వీనియందువేటిచేతనైనను భూమినాచ్ఛాదించి విణ్మూత్రవిసర్జనమొనర్చుమని వాయుపురాణము. యజ్ఞార్హములగు తృణకాష్ఠములు పైకినిత్తమునకు వినియోగపరచకూడదని యాపస్తంబవచనము.

విష్ణుప్రియయయు జగత్తుకు తల్లియు ధనమును ధరించినదియు విశ్వమును ధరించినదియును గావున భూమినాచ్ఛాదించి మలోత్సర్గమును జేయుమని గౌతములవారిచేతను జెప్పబడెను.

మలమూత్రోత్సర్జనము పగలు సంధ్యల నుత్తరాభిముఖుడయ్యును, రాత్రిరి దక్షిణాభిముఖుడగుచును జేయవలయునని మనువు. సూర్యచంద్రనక్షత్రధ్రువాదులకభిముఖముగనుండగూడదని యటుల జెప్పుటకు హేతువు. మరియు ఛాయయందు, చీకటిరాత్రులను, ప్రాణబాధకమగు భయము సంభవించునపుడును, దివారాత్రులయందును జెప్పబడిన దిజ్నియమమును మాని యథాసుఖముఖుడై యుండవచ్చునని మనువచనము. దీనిచే స్వస్థముగనున్నవానికే శాస్త్రాతిక్రమణదోషమని దోచుచున్నది.

ఆకాశమునకు, మలమూత్రములకు, జందురునకు, అగ్నికి, సూర్యునకు, గోవులకు, విప్రులకు, స్త్రీలకు, దేవతలకు నభిముఖుడై మార్గమందు, గోవులుండు నీడను, దననీడను, పాదుకులనుదొడగియు, దున్నినభూమిని, జలమునను విణ్మూత్రముల విడువదగదని గౌతమవచనము.

ఆకాశమునకనగా ననావరణస్థలమందని యర్థము. ఎందువలన నాకాశము భయంకరము మనదో అందువలన ననావరణస్థలమందెవడును మూత్రపురీషోత్సర్జనమును భోజనమును పానమును సేయదగదని వాయుపురాణము.

విణ్మూత్రాభిముఖముగ నుండగూడదనుట నమేధ్యాఘ్రాణముచే రోగాద్యుపద్రవములు బుట్టునని చంద్రాగ్న్యాదులను జూడగూడదనుట ప్రజ్ఞ నశించుననియు మార్గమందుగూడదనుట దండార్హుడగుననియును తెలియదగును.

రాజమార్గమందాపదలేనివాడు మలవిసర్జనమును జేసినవానివలన రెండుకార్షాపణములను దండముగ బుచ్చికొని యమేధ్యమును వానిచేతను శోధించవలెననియు నాపన్నుడు, వృద్ధు, గర్భిణి, బాలుడు నట్లొనర్చిన వారు దండార్హులగుదురనియు వారలచే నమేధ్యమును శోధించుమనియును మనువచనము.

ఇరువదిగవ్వలు కాకిణియనబడునవి నాలుగైన పణమది డబ్బు కీలాపతి. * * * * * * *

గోవిప్రమచ్ఛాయయందున స్వచ్ఛాయను తొగదనుట యదృష్టఫలహానియగునని గోవులు పూజ్యములనుటచే దానగౌరవము నొందగూడదని సపాదుకుడై కూడదనుట పాదుకలకు విణ్మూత్రసంపర్కమగునని దున్నిన భూమిని గూడదనుట యందుబుట్టిన యవాదికములను భక్షించినరోగమగునని.

ద్విజాతులకు నమేధ్యభూములను బుట్టిన ధాన్యాదిక మభక్ష్యమని మనువచనము. జలమందునగూడదనుట స్నానపానాదులకాజలమనర్హమగునని యమేధ్యోదకమును బరిహరించుమని శంఖలిఖితులును మలము మూత్రము- తృణము, నీలి, విషము వీటిచే దుష్టమైనను తపించి చిక్కబడినను నురుగుగలిగినను చంద్రసూర్యకిరణములు తగులకుండ నాచ్ఛాదము గలిగిన నీయుదకమును బుద్ధివంతుడు పానము సేయగూడదని వైద్యశాస్త్రము.

దక్షిణకర్ణమందుపవీతమును దగిల్చి నివీతముగ పృష్ఠభాగమునందుంచి మలమూత్రవిసర్జనమును జేయవలసినదని గౌతమవచనము. ఇట్లనుట కుక్షియందున్న మలమూత్రములు విసర్జించువేళ కుక్షిసంపర్కంబుపవీతంబున కుండదగదని. ... ... ... ... ... ...

నాసికయు నాస్యంబును వస్త్రముచే నాచ్ఛాదించి శౌచార్థమానీతంబగు మృత్తికను కంఠమునంగట్టి దక్షిణబాహువుచే జలపాత్రను ధరించి

వెళ్లవలయునని హారీతుడు. శిరోవేష్టనమునుంచి శకృన్మూత్రములను విసర్జించవలెనని యముడు. ... ... ... ... ...

మాటలాడకుండవలెను వస్త్రముచే శరీరమును శిరమును గప్పుకొని మలమూత్రవిసర్జనమొనర్చుమని మనువు. ఘ్రాణాస్యముల యాచ్ఛాదనము విణ్మూత్రగంధాఘ్రాణము వాగ్వ్యాపారమును లేకుండుటకని హేతువు. మరియును నమేధ్యస్థానమందుమిసిన కంఠనాళమందున నొప్పిపుట్టును నది గాకుండ నాస్యబంధమును శిరము శరీరమును గప్పుట మలసంపర్కముగల మక్షికాదుల సంపర్కము లేకుండుటకు. ... ... ... ...

యజ్ఞీయములుగాని తృణములచే పాయుస్థానమలనును తుడువవలయునని గౌతములు. అయజ్ఞాంగములనుట మలసంపర్కముగల దర్భలు ప్రమాదముచే యజ్ఞమందు వినియోగమగునేమోయని మృజ్జలములచేనగు శౌచముకంటె ముందు తుడచుట కేవలమలసంపర్కము పూజ్యములగు మృజ్జలములకు కాగూడదని. ... ... ... ...

శౌచవిధిః.

గృహీతశిశ్నశ్చోద్ధాయ మృద్భిరభ్యుద్ధృతైర్జలైః । గంధలేపక్షయకరం శౌచంకుర్యాదతంద్రితఇతి యోగీశ్వరః॥ అనంతరం శిశ్నం పాణినాగృహీత్వోద్ధాయాధఃకాయె మూత్రబిందుర్నపతేదిత్యేవమర్థె శిశ్నగ్రహణం॥ వామేన పాణినా శిశ్నం ధృత్వోత్తిష్ఠేత్ప్రయత్నవానితి కాశీఖండే॥ శౌచవిధిర్దక్షిణం హస్తం నాధశ్శౌచే నియోజయేదితి దేవలవచనాచ్చ వామవిశేషణం॥ ఉద్ధృతాభిరద్భిర్వక్ష్యమాణలక్షణాభిర్మృద్భిశ్చ గంధలేపక్షయకరం శౌచం కుర్యాదనలసః॥ ఉద్ధృతాభిరద్భిరితి జలాంతశ్శౌచనిషేధః తథాకృతే మలమూత్రసంపర్కజలేన జనాదీనాం పానాద్యనుపయోగస్స్యాదితి అతఏవ గౌతమేన శౌచంకమండలుకైస్తోయైరాచరేదిత్యుక్తం॥ దక్షిణబాహుపార్శ్వే కమండలుమాదాయేతి హారీతోప్యాహ॥ అత్ర గంధలేపయోః క్షయకరమితి సర్వాశ్రమిణాం సాధారణమిదం శౌచం। మృత్సంఖ్యాదినియమస్త్వదృష్టార్థఇతి విజ్ఞానేశ్వరః॥ ఏకాలింగే గుదే తిస్రస్తథైకత్ర కరే దశ। ఉభయోస్సప్త దాతవ్యా మృదశ్శుద్ధిమభీప్సతా । ఏతచ్ఛౌచంగృహస్థానాం ద్విగుణం బ్రహ్మచారిణాం। త్రిగుణం స్యాద్వనస్థానాం యతీనాంతు చతుర్గుణమితిమనుః॥ మూత్రపురీషోత్సర్గేసతి శుద్ధిమభీప్సతా మృద్వార్యా దేయమర్థవిదిత్యుక్త్వాజ్జలసహితా మృదేకాలింగె దాతవ్యా। గుదే తిస్రోమృదః। తథైకస్మిన్కరే వామే। ఏకైకం

పాదయోర్దద్యాదితి కాశీఖండే॥ శౌచవిద్దక్షిణంహస్తం నాధశ్శౌచే నియోజ
యేత్। తత్రైవ వామహస్తేన నాభేరూర్ధ్వం నశోధయేదితి దేవలవచనాత్త
స్యైవాధశ్శౌచసాధనత్వాత్తత్రైవ దశమృదో దాతవ్యాః। తత ఉభయోః కర
యోస్సప్త దాతవ్యాః యదాతూక్తశౌచేనాపి గంధలేపక్షయో నభవతి తదా
యావన్నాపైత్యమేధ్యాక్తాదితివచనాదధికసంఖ్యాఅపి మృదో దాతవ్యాః। ఏ
తద్విషయాణ్యేవ మునీనామధికమృత్సంఖ్యావచనాని॥

మృత్పరిమాణమాహ దక్షః॥ మృత్తికాతు సమాదిష్టా త్రిపర్వా పూ
ర్యతేయయా॥అయంచపరిమాణవిధిర్గుదంవినాయ బోద్ధవ్యః॥ ద్వితీయాచ తృతీ
యాచ తదర్ధార్ధాప్రకీర్తితేతి। దక్షిణగుదే పరిమాణాంతరవిధానాత్॥ శౌచం
చద్వివిధంప్రోక్తం బాహ్యమాభ్యంతరంతథా। మృజ్జలాభ్యాం స్మృతంబాహ్య
భావశుద్ధిస్తథాంతరమితి॥ దివావిహితశౌచాచ్చ రాత్రావర్ధం సమాచరేత్।
రుజ్వర్ధంచ తదర్ధంచ పథిచోరాదిబాధితే। తదర్ధంయోషితాంచాపి స్వస్థేన్యూ
నం నచాచరేత్॥ అపిసర్వనదీతోయైర్మృత్కూటైశ్చాప్యగోత్రమైః। ఆపాత
మాచరన్శౌచం భావదుష్టోనశుద్ధిభాగితి కాశీఖండే॥ రాత్రౌతు పురుషాణా
ముక్తశౌచార్ధగ్రహణం తత్కాలస్య వైదికకర్మానుష్ఠానానర్హత్వాత్ అపి
చాస్తమితే ఆదిత్యే బహిర్గ్రామాన్మూత్రపురీషేకుర్యాదిత్యాపస్తంబః॥ తదా
అంతర్గ్రామేపి గృహస్య దూరతోపి నకుర్యాత్ దృష్టార్థోయంప్రతిషేధః చో
రవ్యాఘ్రాదిశంకయా నిర్భయదేశే నాయంప్రతిషేధఇత్యాహ హరదత్తమి
శ్రః॥ స్త్రీణాంతు గంధలేపక్షయకరమాత్రశౌచమేవాలం యత స్త్రియస్స్వ
భావతఏవ మేధ్యాః। పాకాగ్నిపతిశుశ్రూషాఏవ తాసాం ముఖ్యకర్మాణి య
స్మాదేవం తస్మాన్మృత్సంఖ్యాదిపరిమాణాదికం నోక్తం స్వభావమేధ్యత్వం
యోగీశ్వరేణోక్తం। సోమశ్శౌచం దదాస్త్రీణాం గంధర్వశ్చ శుభాం గిరం।
పావకస్సర్వమేధ్యత్వం మేధ్యావై యోషితోహ్యత ఇతి॥ స్వస్థే న్యూనం నచా
చరేదిత్యనేన గృహస్థస్యాతీవ కార్యవ్యగ్రత్వాచ్ఛౌచాల్పత్వం వానప్రస్థయతి
భ్యాం బ్రహ్మచారిణః గుర్వగ్నిపరిచర్యాదికర్మకలాపాధికత్వేన తయోరల్పం
గృహస్థస్యాధికం యతేరల్పత్వం వానప్రస్థస్యాపి తద్వైవేతిబోధ్యం॥

వసాశుక్రమసృఙ్మజ్జామూత్రవిట్కర్ణవిణ్ణఖాః। శ్లేష్మాశ్రుదూషికాస్వే
దోద్వాదశైతేనృణాంమలాఇతిమనుః॥ వసా కాయస్నేహః। మజ్జా శిరోమధ్య
పిండితస్నేహః॥ ఆదదీతమృదోపస్సు షట్సుపూర్వేషుశుద్ధయే। ఉత్తరాసుచ
షట్స్వద్భిః కేవలాభిర్విశుధ్యతీతి దేవలః॥ దౌర్గంధ్యనివారణాయపూర్వషట్క
శౌచే మృద్గ్రహణం॥

అన్యోన్యమృదం సమాదద్యాజ్జంతుశర్కరవర్జితాం। విహాయ మూషకో
త్ఖాతాం శౌచోచ్ఛిష్టాంచ నాకులామితి కాశీఖండే॥ ఆహరేన్మృత్తికాం విప్రః
కూలాత్ససికతాం తథేతి యమః॥ విప్రఇతి శౌచకర్తృమాత్రోపలక్షణం। కూ
లాదితిచ శుద్ధదేశోపలక్షణం। శౌచాచారే విహీనస్య సమస్తాః క్రియానిష్ఫలా
ఇతి గౌతమః॥ జంతుమయమృద్గ్రహణే ప్రాణిహింసాస్యాదితి। శర్కరాయు
క్తా లింగపాయ్వాదిస్థానశ్లక్ష్ణచర్మబాధకరీభవేదితి॥ మూషకాదిఖాతామృద
పవిత్రేతి। శౌచోచ్ఛిష్టాన్యశౌచోచ్ఛిష్టా ఉచ్ఛిష్టేతిచనగార్హ్యేత్యుక్తం॥ శౌ
చానంతరం హారీతః। గోమయేన మృదావా కమండలుం పరిమృజ్య పూర్వవ
దుపస్పృస్యాదిత్యమగ్నింవా వీక్షేత। అత్ర దివాదిత్యం రాత్రౌ సోమ ముభ
యోరభావేగ్నిమితి బోద్ధవ్యం॥ బ్రహ్మపురాణే॥ పాదయోర్ద్వే గృహీత్వాచ
సుప్రక్షాళితపాణినా। త్రిరాచమ్య తతశ్శుద్ధస్స్మృత్వా విష్ణుం సనాతనం॥ అత్ర
శంఖలిఖితౌ ఆచమ్యేశానం మనసా ధ్యాయేత్॥ వ్యాసః॥ శౌచంకృత్వామూ
త్రోచ్చారం నపశ్యేత్॥ దృష్ట్వాదిత్యమగ్నింసోమంవా పశ్యేత్। ఆదిత్యాదిదర్శ
నం పవిత్రార్థం॥ శిరఃపరివేష్టనంప్రథమం। నివీతం ద్వితీయం। దిశావలోకనం
తృతీయం। అంతర్ధానం చతుర్థం। మౌనంపంచమం। పురీషగ్ షష్ఠం। మృత్తికా
గ్రహణగ్ సప్తమముదకమష్టమ మేతదష్టకమిత్యాచక్షతఇత్యాపస్తంబః॥ ప్రక్షా
ళనాత్పాదయోర్దృష్టఫలం దర్శయతి సుశ్రుతే॥ పాదప్రక్షాళనం పాదమలరో
గశ్రమాపహమితి॥

## శౌచవిధి.

లింగము నెడమచేతబట్టుకొని లేచి మృత్పిండములచేతను గంధలేప
క్షయకరమగునట్లు తంద్రలేకుండ శౌచమాచరింపవలయునని యాజ్ఞవల్క్య.

మేహనగ్రహణము నూరువులు మొదలగువాటియందు బడకుండుట
కు వామహస్తముచే లింగగ్రహణమని కాశీఖండోక్తమునకు హేతువు. శౌచ
వేళ దక్షిణహస్తముచే నధఃకాయశౌచము జేయగూడదను దేవలవచనమువల
న వామహస్తమని జెప్పుట. పాత్రముచే దెచ్చిన జలములచేతను శౌచము జే
యుమనుట తటాకాదులందు పాయుప్రక్షాళననిషేధమునకు నటులజేసిన నా
జలము జనమునకు పానాద్యనర్హమగునని- ఇందువలననే గౌతములవారు క
మండలజలము శౌచముజేయవలయునని జెప్పిరి. దక్షిణబాహుపార్శ్వమందు
కమండలువును ధరించుమని హారీతుడును జెప్పెను. ఇచట గంధలేపక్షయకరమ
నుట సకలాశ్రమములవారికిని దిసామాన్యమగు శౌచము. మృత్పిండసంఖ్యాదిని
యమమదృష్టార్థమని విజ్ఞానేశ్వరుడనెను. లింగమందొకటిని పాయువందు

మూడును వామకరమందు పదియును రెండుహస్తములందు నేడును మృత్పిండములు శుద్ధినిగోరువానిచే శౌచార్థమై గ్రహించవలయునని జెప్పబడెను.

ఇది గృహస్థులకు దీనికి ద్విగుణము బ్రహ్మచారులకు త్రిగుణము వానప్రస్థులకు చతుర్గుణము యతులకును శౌచముగావలయునని మనువు. మూత్రపురీషోత్సర్గానంతరమున శుద్ధినిగోరువానిచే మృజ్జలములు గ్రహించదగునని జెప్పబడుటవలన జలసహితమగు మృత్పిండము లింగమందొకటియును గుదమందు మూడును వామహస్తమందు మూడును రెండుహస్తములందు పాదములందొకొకటియని కాశీఖండమందు జెప్పబడెను. దక్షిణహస్తముచే నాభికంటె నధఃకాయమునందు శౌచము సేయకూడదటుల వామహస్తము నాభికూర్ధ్వభాగమునకుపయోగించనను దేవలవచనమువలన నధఃకాయశౌచసాధనమగు వామహస్తమందు పదిమృత్పిండములచే బ్రక్షాళన గావలయు నటుపైని యుభయకరంబుల నేడుమృత్పిండకములు పయోగపరచవలెను. ఇటులైనను గంధలేపక్షయము గాకుండిన జెప్పిన సంఖ్యకు నధికమైనను గంధలేపక్షయమగు పర్యంతంబు మృత్పిండంబులచే శౌచము సేయదగును. ఇందునిమిత్తమే మృత్సంఖ్యాదికమును జెప్పిన మునివచనములు ఎంతమృత్తికచే హస్తపర్వంబులు మూడు పూరించబడు నంతమృత్తికొకమృత్పిండమని దక్షునిచే జెప్పబడెను. ఈపరిమాణవిధి పాయుస్థానమును విడచియని దెలియదగును. చెప్పినపరిమాణములో రెండవవంతైనను మూడవవంతైన నందు సగంబైనను పాయుస్థానశౌచమునకుపయోగపరచమని దక్షునిచే పరిమాణాంతరముచెప్పబడెను- మృజ్జలములచే బాహ్యశౌచమనియు భావశుద్ధియే యాంతరశౌచమనియు శౌచము రెండుప్రకారములుగ జెప్పబడెను. పగలువిధించబడు శౌచములో సగము రాత్రియందాచరించవలయును.- అందు సగము రోగమందును చోరాదిబాధితమార్గములందందుసగంబును స్త్రీలకందులోసగంబును విధించబడెను. స్వస్థుడై శౌచమును తగ్గించ రాదు.

సర్వనదులందుదకములచే బర్వతతుల్యమృత్పిండములచేనైనను శాస్త్రోక్తశౌచమొనర్చినను సంశయగ్రస్తుడు పరిశుద్ధుడు గాడని కాశీఖండము. పురుషుడు రాత్రియందున బగలులోని సగముశౌచమొనర్చుమనుటకు హేతువు- వైదికకర్మాధికారము పగలువలె రాత్రిలేనందున ఇంతియేకాదు సూర్యాస్తమయానంతరమున గ్రామసమీపమున మలమూత్రములను విడువుడని యాపస్తంబులు.

చోరవ్యాఘ్రాద్యుపద్రవనివారణకొఱకు గ్రామమధ్యమునందున్న
ను రాత్రి గృహమునకు ద్వారము గలయూరి మూలను విడువకూడదని దృష్ట
ఫలములను బోధించుచు హారీదత్తమునులవారు చెప్పిరి- స్త్రీలకు గంధలేపము
లు లేనిమట్టుకే శౌచముచాలును- స్నానమువారలు శుచిగలవారౌటవలన వా
రలకుపతిపరిచర్యయును పాకాగ్నిహోమము మంత్రము ముఖ్యకర్మములు గాన నా
రీ మృత్సంఖ్యానకము ముఖ్యము కాదు చంద్రుడు శుద్ధిని మధురవచనరచనల
ను గంధర్వుడగ్ని దేవుడు పవిత్రత్వమును స్త్రీలకొసంగిరి గావున పవిత్రులని
యాజ్ఞవల్క్యులు.

స్వస్థుడగువాడు శౌచమును తక్కువ నొనర్పరాదనుటచేతను గృ
హస్థుడధిక కార్యపరుడౌటవలన శౌచాల్పమును జెప్పుట వానప్రస్థయతులకం
టె బ్రహ్మచారికి గుర్వగ్ని పరిచర్య వేదాభ్యాసము లధికమగుటచేతను వారికం
టె తక్కువవానప్రస్థయతులకల్పము- యతికంటె వానప్రస్థుకు తక్కువశౌచ
మును జెప్పుటయు నటువలెనని తెలియదగును.

క్రొవ్వు, రేతస్సు, నెత్తురు, మెదడు, గులిమి, మూత్రము, విష్ఠ,
చిమిడి, శ్లేష్మము, కన్నీరు, కంటిపుసి, చెమటయుననివి పండ్రెండు విధములు
పూర్వషట్కమునకు మృత్తికయు నుదకముచేతను ద్వితీయషట్కమునకు కేవ
లోదకముతో శుద్ధియని దేవల వచనము- పూర్వషట్క శౌచమందు దుర్గంధ్య
నివారణకొఱకు మృత్తికతోనొనర్పుమనుట కీటములును కంకరయును మొలక,
పందికొక్కు,ముంగియును ద్రవ్వినదియు నితరులొనర్చమిగిలినమన్నును శౌచా
ర్థము తేగూడదని కాశీఖండము- విప్రుడు నద్యాది తటమువలనయిసుకతో గూ
డిన మృత్తికను దేవలయుననని యముడు చెప్పెను- విప్రుడనుటచేతను శౌచకర్తకు
పలక్షణము- కూలమనగ బరిశుద్ధదేశమునకుపలక్షణము- శౌచాచార విహీనున
కు సకల కర్మములును వ్యర్థములని గౌతములవారు చెప్పిరి- జంతువులతో గూడి
న మృత్తిక గ్రహించిన యెడల పాపిహింసయగునని- మూషకాదికము చే త్ర
వ్వబడిన మృత్త పవిత్రమని- శౌచశిష్టము చ్ఛిష్టమగునవియు గ్రహించతగద
నుట- గోమయముచేత లేక మృత్తికచేతను బాత్రను శుద్ధియొనర్చి యాచమ
నము జేసి సూర్యునైన నగ్నినైన జూడవలయు నచట పగటియందు సూర్యు
ని రాత్రిచంద్రుని యుభయులు లేనియెడల నగ్నిని జూడవలయునని తెలియవ
లయును. ప్రక్షాళనమొనర్చిన హస్తములచే పాదములను స్పృశించి ముమ్మా
రాచమనమొనర్చిద్విజులు పుండరీకాక్షుడైనవిష్ణువునుస్మరించి శుద్ధుడౌనని బ్రహ్మపు

రాఁగము. ఆచమనమొనర్చి యీశ్వరధ్యానము జేయవలయునని శంఖలిఖితులు- శౌచమొనర్చి మూత్రోత్సర్గమును జూడతగదని వ్యాసులు- అట్లు మూత్రోత్సర్గమును జూచినట్లైతే సూర్యాగ్నిని జందురునైనను జూచి శుద్ధుల గుదురని వ్యాసులు- సూర్యాదిదర్శనము పవిత్రతకొరకు.

మొదటిది శిరోవేష్టనము- యజ్ఞసూత్రము నివీతముగనుంచుట రెండవది- దిశావలోకనము మూడవది- ఆచ్ఛాదనము నాల్గవది- మౌనమైదవది- పురీషోత్సర్జనమారవది- మృత్తికనుగ్రహించుట యారునొకటి- యుదకస్వీకారమెనిమిదవది- ఇట్లు శౌచమష్టాంగమని యాపస్తంబులు. పాదప్రక్షాళనము పాదములందు గలిగిన మలినము పోవుననియు రోగనివారణయును శ్రమనివర్తకము నగుననియు సుశ్రుతము.

## ఆచమనవిధిః

అథాచమనవిధిం వ్యాఖ్యాస్యామః॥ అథేతి మృత్తికాశౌచానంతర్యే ఆచమనవిధిం ఆచమ్యతె ఉదకమత్రేత్యాచమనం చము అదనే తస్యవిధిం వివేచయిష్యామః॥ త్రిరాచామేదపః పూర్వం ద్విః ప్రమృజ్యాత్తతోముఖం। ఖాని చైవ స్పృశేదద్భిరాత్మానం శిరఏవ చేతిమనుః॥ పూర్వం ప్రక్షాళితచరణకరో బ్రహ్మాదితీర్థేన జలగండూషత్రయం పిబేత్॥ బ్రహ్మతీర్థాదిలక్షణం యోగీశ్వరేణోక్తం॥ కనిష్ఠాదేశిన్యంగుష్ఠమూలాన్యగ్రంకరాణిచ। ప్రజాపతిపితృబ్రహ్మదేవతీర్థాన్యనుక్రమాదితి॥ అత్ర విశేషో దక్షోక్తః॥ ప్రక్షాళ్యపాదౌ హస్తౌ చ త్రిః పిబేదంబువీక్షితం। సంవృత్యాంగుష్ఠమూలేన ద్విః ప్రమృజ్యేత్తతోముఖం। సంహతాభిస్త్రిభిః పూర్వమాస్యంతు సముపస్పృశేత్। అంగుష్ఠవిప్రదేశిన్యా ఘ్రాణం పశ్చాదనంతరం। అంగుష్ఠానామికాభ్యాంచ చక్షుశ్శ్రోత్రే పునఃపునః। కనిష్ఠాంగుష్ఠతోనాభిం హృదయంతు తలేనవై। సర్వాభిస్తు శిరస్స్పశ్చాద్బాహూచాగ్రేణ సంస్పృశేదితి॥ త్రిః ప్రాశ్యాపో ద్విరున్మృజ్య ఖాన్యద్భిస్సముపస్పృశేత్। అద్భిస్తు ప్రకృతిస్థాభిః హీనాభిః ఫేనబుద్బుదైరితి యోగీశ్వరః॥ అద్భిర్ద్రవ్యాంతరాసంస్పృష్టాభిః। పునరద్భిర్గ్రహణమూర్ధ్వకాయగతమాషికాశింఘాణశింబూషలాలాదిశోధనాయ ప్రతిచ్ఛిద్రముదకస్పర్శార్థం పునస్తా ఏవ విశినష్టి ప్రకృతిస్థాభిః గంధరూపరసస్పర్శానంతరమప్రాప్తాభిః ఫేనబుద్బుదరహితాభిరుపస్పృశేత్॥ నరసింహపురాణె॥ దక్షిణంతుకరంకృత్వా గోకర్ణాకృతివత్పునః। త్రిః పిబేద్వీక్షితంతోయమాస్యం ద్విః పరిమార్జయేదితి॥ వీక్షి

తం జలఫేనబుద్బుదరహితమేవాంబు స్వీకృత్యాచమనం కర్తవ్యం మాషమగ్నజలంపిబేదిత్యాచమనజలపరిమితిరుక్తా మాషం నామ హస్తమధ్యస్థరేఖా। న కేవలం పిబేత్ । తత్రోత్సర్జనానంతరమేవాచమనం భుక్త్వాద్యఖిలనిమిత్తేష్వావశ్యకమితి దర్శయంతి ఋషయః॥ సుప్త్వా క్షుత్వాచ భుక్త్వాచ నిష్ఠీవ్యోక్త్వానృతాని వచః। పీత్వా౾ధ్యేష్యమాణస్స్యాదాచామేత్ప్రయతో౾పిసన్॥ సంవర్తః॥ చర్మాణం రజకం వేణుం ధీవరం నటమేవచ। ఏతాంత్స్పృష్ట్వా ద్విజో మోహదాచామేత్ప్రయతో౾పిసన్॥ బ్రహ్మపురాణే॥ అధమస్పృశ్యం దాహాదిః॥ వాయుపురాణే॥ నిష్ఠీనేతథాభ్యంగే తథా పాదావనేచనే। ఉచ్ఛిష్టస్యచ సంభాషాదశుచ్యుపహతస్యచ। సందేహేషుచ సర్వేషు శిఖాం ముక్త్వా తథైవచ॥ పైఠీనసిః॥ కలిలం కాశ్యపాగమే రథ్యాచత్వరశ్మశానాన్యాక్రమ్యాచాంతః పునరాచామేత్॥ కలిలం కఠినశ్లేష్మా శ్వానశ్చాత్ర వికృత॥ యమః॥ సకర్దమేతు వర్షాసు ప్రవిశ్య గ్రామసంకరం। జంఘాభ్యాం మృత్తికాస్తిస్రః పద్భ్యాం ద్విర్గుణాస్స్మృతా॥ సుషుప్తిసమయే లాలాదూషికాశింఖాణకింజూషాం స్రావో భవతీత్యాచమనమనుమతం భవతి। క్షుతే తు లాలాశింఖాణస్రావస్స్యాదితి॥ పీత్వా మధుకటుకషాయాదీని పీత్వాస్య సౌష్ఠవార్థం॥ అధ్యేష్యమాణో కంఠగతశ్లేష్మశోషనేనకురిత స్వరో విశుద్ధస్సన్పఠేదితిచ రజకాదిహీనకర్మకరాదీనాం ప్రాణివధోపజీవినాం ధీవరాదీనాం స్పర్శనే చండాలభాషణేఽనృతవాదే ప్రత్యవాయీ స్యాదితి జ్ఞాపయితుం మేధ్యాపస్పర్శన తదంగవిష్ణుస్మరణాదిత్యదర్శన విప్రభాషణాదినా పూతో భవతి। పాపకారిణా మసకృద్దర్శన స్పర్శన సహావస్థానాదినా తత్సంయోగిచ పంచమ ఇతి స్మృత్యుక్త మహాపాతకీ నస్యాదితి। చండాలదర్శనే జ్యోతిషాం దర్శనం। చండాలభాషణే బ్రాహ్మణసంభాషణమిత్యాపస్తంబః॥ రథ్యాచత్వరగమనే పతితసంభాషణస్పర్శనాదిక నిమిత్తం స్మశానే స్థ్యంగారచితిభస్మస్పర్శనప్రయుక్తాఽశుచినివారణాయ గ్రామసంకరకర్దమస్పృష్టే తత్ప్రక్షాళనాచమనాది భావిరుగ్వనర్థప్రతీకారాయ శుద్ధ్యర్థమర్థజ్ఞాః కరిష్యంతి। తస్మిన్కర్దమే గ్రామస్థ మనుష్య కుక్కుర కుక్కుట మార్జారాది విణ్మూత్ర సంపర్కాదికమస్త్యేవేతిచ ప్రాగే తత్ప్రక్షాళనమనంతరమాచమనమితి బోధ్యం॥ తైలాభం ఫేనిలం స్నిగ్ధం పురాణోదకమిశ్రితమిత్యాదీనుపక్రమ్య తత్కార్యాత్స్నానపానాభ్యాం తృష్ణాధ్మానోదరజ్వరాన్। అర్శ భగంధర గ్రంధి శోభ పాండు హలీమకాన్। కామావసాదాభిష్యంద కండూ గండాదికాన్దదానిత్యాయుర్వేదే॥ భుక్తోత్తరే తథా ఉషస్యుదకాచమనేన దృష్ట ఫలజనకం దర్శయంతి వాహటాదయః॥ పీతంవారినిశావసానసమయే సర్వామయధ్వంసనం భు

క్త్వా నానాక్షయసుఖశ్చ పుష్టిజననం పాశ్చీనపక్షేమతం। యచ్చాం జాతగవహ్నిస్తా టవకరం పథ్యంచ భుక్తోత్తరే॥ అత్యంబుపానాదపిపక్వకంచ మధ్యాంబుపానాచ్చ సపవదోషః। తస్మాన్నరో వహ్నివివర్ధనాయ ముహుర్ముహుర్వారి పబేదభూరి॥ యత్పానీయం పిబతి శిశిరం స్వాదు నిత్యం నిశీథే ప్రత్యూషేవా పిబతి యదివా ఘ్రాణరంధ్రేణ ధీరః। సోయంసద్యః తగపలితవ్యర్థిత నేత్రశక్త్యా స్వర్గాచార్యం ప్రహసతి ధియా ద్వేష్టి దస్రౌచతన్వా॥

## ఆచమనవిధి.

శౌచప్రకరణమును జెప్పితిమి యాచమనవిధిని జెప్పుచున్నారము. ఉదకమీకర్మమునందు పానము జేయబడును గాన నాచమనమనబడును.

ముందుగనుదకము మువ్వారాచమనమునర్చి ముఖమును రెండుపర్యాయములు తుడచి యటుపైని నేత్రాదీంద్రియములను శిరస్సునుదకముతో స్పృశించి ముందుగ హస్తపాదములను గడిగి బ్రహ్మతీర్థముచే మువ్వారు జలమును పానము చేయవలయును. కనిష్ఠికామూలమునుంచి ప్రజాపతితీర్థమననగా ఋషితీర్థమనియు తర్జనీమూలమునుంచి పితృతీర్థమనియు నంగుష్ఠమూలమునుంచి బ్రహ్మతీర్థమనియు- హస్తాగ్రమునుంచి దేవతీర్థమనియు యోగీశ్వరులచే జెప్పబడెను. ఈవిషయమై దక్షునిచే విశేషము చెప్పబడెను. హస్తపాదప్రక్షాళనము చేసి పరిశోధితజలమును మువ్వారు పానముజేసి యంగుళములను ముడిచి యంగుష్ఠమూలముచే నాస్యము రెండుమార్లు తుడచి మూడువ్రేళ్లు దగ్గిరబట్టి వాటిచే ముందుగ నాస్యమును స్పృశించి తర్జన్యంగుష్ఠములచే ఘ్రాణము నంగుష్ఠానామికములచే చక్షుశ్శ్రోత్రములను కనిష్ఠాంగుష్ఠములచే నాభిని. కరతలముచే హృదయమును, వ్రేళ్లచే శిరస్సును, యంగుళాగ్రములచే బాహువులను స్పృశించవలయునని దక్షుడు- స్వచ్ఛములై ఫేనబుద్బుదరహితములైన యుదకములచే నాచమించవలయునని యాజ్ఞవల్క్య. ఈవచనమందుమరలమగలన పశ్నబ్ధప్రయోగమూర్ధ్వకాయస్థసింఘాణాది మలమోచనమునకు జలయుక్తముగ స్పృశించవలయునని- ప్రకృతిస్థములనగా నితరగంధాదిస్పర్శరహితములని- గోకర్ణాకృతిగల దక్షిణహస్తముచే చూడబడిన జలము మువ్వారుపానముసేయుమని నరసింహపురాణము. చూడడము జంతుఫేనబుద్బుదరహితమగు జలము స్వీకార్యమని.

మాషమగ్నజలము నాచమించవలెనని విధియందు జలపరిమితి జెప్పబడెను. మాషమనగా హస్తమధ్యరేఖ యదిమునుగునంత జలమని- ఈవచనము

మలమూత్రోత్సర్గనానంతరమే గాదు. నిద్రలేచి, తుమ్మి, భుజించి, యుమిసి, యనృతము బలికి, పానముజేసి, యధ్యయనారంభమందును నియమముగ నుండినను నీవేళల నాచమించవలయును. చర్మకారుని, రజకుని, సేదరిని, జాలరిని, నటుని, యధములగు చండాలాదులను వీరల నజ్ఞానముచే జూచిన నాచమించవలయునని సంవర్తుడును, బ్రహ్మపురాణమును.

స్నానముజేసి పదములుగడగి యుచ్ఛిష్టజనముతో సంభాషించి యశుచిస్పర్శనముజేసి మరియు నేసందియముగలిగినను శిఖముడివిడినను శ్లేష్మస్రావముకలిగినను కాసశ్వాసలైనను వీధులను చత్వరములను శ్మశానములను మట్టినవాడు మంచాచిమించినను మరల నాచమించవలయునని పైఠీనసి. వర్షకాలమందు గ్రామ్యకర్దమమున నడచి పదములు గడుగునపుడు మూడైన నాలైన మృత్పిండములతో గడుగవలయునని యముడు.

నిద్రాంతమందు తుమ్మియు లాలాశింఘాణాది స్రావదోషనివృత్త్యర్థమును భోజనానంతరమందుచ్ఛిష్టశోధనార్థమును నిష్ఠీవనమందు శ్లేష్మశోధనముకొరకును అమ్లకటుకషాయాదికమును పానముజేసి ముఖసౌష్ఠవనిమిత్తము నధ్యయనము సేయబోవునపుడు కంఠగతశ్లేష్మశోధనముచే స్వరశుద్ధియగునని రజకాదులు హీనకర్మకరులు ధీవరాదులు ప్రాణిహింసకరులు వీరల జూచిన భాషించిన నన్నృతము బలికినను బ్రత్యవాయమగుననియు నాచమనముచితము. విప్రసంభాషణవిష్ణుస్మరణరవిదర్శనములచే పవిత్రుడగును. పాపకారులతోటి మాటిమాటికి దర్శన స్పర్శన భాషణ సహవస్థానాదికము గలుగుటవలన మహాపాతకులతోగూడినవాడై అయిదవవాడగుననువచనమువలన మహాపాతకుడగునని నీచసంపర్కమంచాచమించుట సూచించబడెను. చండాలదర్శనమైన జ్యోతిర్దర్శనమును చండాలభాషణమైన విప్రభాషణమును జేయవలయుననియాపస్తంబులు. వీధులనడచిన పతితులతో భాషణ స్పర్శనములగుననియు శ్మశానమందస్థ్యంగారాద్యశుచిస్పర్శనమగుననియు గ్రామసంకరకర్దమస్పర్శచేననంతరమునననగు రోగాదినివృత్తికొరకును పాదప్రక్షాళనాచమనాదికములు విధించబడెను. గ్రామమంలి యాబురదయందు నర శూర్కర కుక్కుట మార్జారాది విణ్మూత్రసంపర్కము కలిగియుండునని ముందుగా బురదను గడిగి యనంతరమాచమనమని దెలియదగును.

చమురువలెనుండిన సురుగుగలిగిన చిక్కనైన ప్రాచినీళ్లతో గలసిన జలము స్నానపానములకు తగదను నీవచనము మొదలుకొనియుదకదోషములను దాహటుడు చెప్పుచున్నాడు.

దాహము, కడుపుపొంగు, ఉదరములు, జ్వరములు, మూలశంక, భగంధరము, గ్రంధి, పొంగు, పాండు, హలీమకములు, వీర్యహాని, బహుమూత్రము, దురద, గండమాల మొదలగురోగములను బుట్టించు గావున పూర్వోక్తమగు దుష్టజలమును విడువవలయునని యాయుర్వేదము.

భోజనోత్తరమందు నుషఃకాలమందును ఆచమనమనగా జలపానమగును గావున నది సర్వరోగములను పోగొట్టును. పుష్టిజేయును. రుచిగలిగించును. జఠరాగ్నిని దీపింపజేయును. ప్రాచీనులకుసమ్మతమై పథ్యమగుననియు నంబుపానమధికమైన స్వల్పమైన నన్నమరుగదు గావున మాటిమాటికి నించుకించుకజలమును జఠరవృద్ధికై పానముసేయవలయుననియు, చల్లని జలము నపరరాతిరియందు పానముజేసినను, ముక్కురంధ్రములనుంచి బీల్చి కపాలశోధన మభ్యసించిన నట్టినరుడు చూపు బలిమికి గరుత్మంతుని, బుద్ధికి బృహస్పతిని, శరీరసౌష్ఠవముచే యశ్వనీదేవతలను బోలుననియు బాహటాదులు చెప్పిరి.

ఆచమనానుకల్పవిధిః

అనుకల్పోకల్పాభావేవిహితత్వాత్తద్విధింబ్రూమః॥ తత్ర మార్కండేయపురాణే॥ కుర్యాదాచమనం స్పర్శం గోపృష్ఠస్యార్కదర్శనం। కుర్వీతాలంభనంవాపి దక్షిణశ్రవణస్యచ। యథావిభవతోహ్యేతత్పూర్వాభావే తతః పరం॥ నవిద్యమానే పూర్వేస్మిన్నుత్తరప్రాప్తిరిష్యతఇతి॥ పరాశరః॥ క్షుతే నిష్ఠీవనేచైవ దంతశ్లిష్టేనృతే తథా। పతితానాంచసంభాషే దక్షిణం శ్రవణం స్పృశేదితి॥ అత్రబోధాయనః॥ ఆర్ద్రం తృణం భూమిం గోమయంచోపస్పృశేదితి॥తత్రాపస్తంబః॥ఆర్ద్రంవాశకృదోషధింవాభూమింవా॥ శకృద్గోమయం॥

ఆచమనానుకల్పవిధి.

అనుకల్పమనగా ప్రథమవిధానము జరగనిచోట దానికి ప్రతినిధి- గోపృష్ఠమును స్పృశించుట- సూర్యునిజూచుట- కుడిచెవినిముట్టుట- యివియాచమనసమములు. పూర్వపూర్వముసంభవించనిచోట నుత్తరోత్తరము కర్తవ్యమని మార్కండేయ పరాశరాదులు. తుమ్మిన నుమిసిన పల్లుగుట్టిన నసృతమాడిన పాతకులతో భాషించిన గుడిచెవిముట్టవలెనని పరాశరులు. ఆర్ద్రతృణమును భూమిని గోమయమునుస్పృశించవలయుననిబోధాయనులాపస్తంబులును.

దంతధావనవిధిః

దంతస్య శోధనం దంతధవనం తస్యవిధానం బ్రూమః॥ తద్దృష్టార్థం

వాదృష్టార్థమేవవేత్యాశంక్య తదుభయమభయహేత్వర్థే బ్రువయో బ్రువన్॥ తద్యథా॥ తత్రాదౌ దంతధవనం ద్వాదశాంగులమాయతం। కనిష్ఠికాపరీణాహమృజ్వగ్రంథితమవ్రణం।అయుగ్మగ్రంథి యచ్చాపి ప్రత్యగ్రం శస్తభూమిజం। అవేక్ష్యర్తుంచదోషంచ రసవీర్యంచయోజయేత్। కషాయం మధురం తిక్తం కటుకం ప్రాతరుద్ధితః। నింబశ్చతిక్తకే శ్రేష్ఠః కషాయె ఖదిరస్తథా। మధూకో మధురే శ్రేష్ఠః కరంజఃకటుకేతథా। క్షౌద్రవ్యోషత్రివర్గోక్తం సతైలంసైంధవేనచ। చూర్ణేన తేజోవత్యాశ్చ దంతాన్నిత్యం విశోధయేత్। ఏకైకంఘర్షయేద్దంతం మృదునా కూర్చకేనచ। దంతశోధితచూర్ణేన దంతమాంసాన్యబాధయన్। తద్దౌర్గంధ్యోపదేహౌతు శ్లేష్మాణంచాపకర్షతి। వైశద్యమన్నాభిరుచిం సౌమనస్యంకరోతిచ। నఖాదేర్గలతాల్వోష్ఠజిహ్వారోగసముద్భవె। అథాస్యపాకే శ్వాసేచ కాసహిక్కావమీషుచ। దుర్బలోజీర్ణభుక్తశ్చ మూర్ఛార్తో మదపీడితః। శిరోరుగార్తస్తృషితశ్శ్రాంతఃపానక్లమాన్వితః। అర్దితీకర్ణశూలీచ దంతరోగీచమానవః। జిహ్వానిర్లేఖనంరౌప్యంసౌవర్ణంవార్క్షమేవచ। తన్మలాపహరం శస్తం మృదుశ్లక్ష్ణందశాంగులం। ముఖవైరస్యదౌర్గంధ్యశోభజాడ్యహరంసుఖం। దంతదార్ఢ్యకరంరుచ్యం స్నేహగండూషధారణం। క్షీరవృక్షకషాయైర్వా క్షీరేణచవిమిశ్రితైః। భిల్లోదకకషాయేణ తద్వైవామలకస్యవా। ప్రక్షాళయేన్ముఖం నేత్రే స్వస్థశ్శీతోదకేనవా। నీలికాం ముఖశోషంచ పిండకాంవ్యంగమేవచ। రక్తపిత్తకృతాన్రోగాన్సద్యఏవ వినాశయేదితి సుశ్రుతే॥ తేజోవతీ జ్యోతిష్మతీ। క్షౌద్రబృహతీబీజాని। వ్యోషత్రికటుకం। త్రివర్గోక్తం త్రిఫలం। భిల్లో భూనింబో। ఉశీరోవా। ఏతద్దృష్టార్థమాయుర్వేదోక్తం అథాదృష్టార్థం బ్రూమః॥ తత్ర దక్షః॥ ఉషఃకాలేతు సంప్రాప్తె శౌచంకృత్వాయథావిధి। తతస్స్నానంప్రకుర్వీత దంతదావనపూర్వకం॥ యాజ్ఞవల్క్యః॥ ప్రాతస్సంధ్యాముపాసీత దంతధావనపూర్వకం। ముఖేపర్యుషితేనిత్యం భవత్యప్రయతో నరః। తస్మాత్సర్వం ప్రయత్నేన భక్షయేద్దంతధావనమితి॥ వృద్ధశాతాతపేనాచమనవత్ స్వతంత్రస్యైవ శుద్ధిహేతుతయాభిధానాత్॥ దంతాన్ప్రక్షాళ్యస్నాయాదితి ఘందోగపరిశిష్టేపి॥ కాలార్థస్సంయోగః॥ ఉద్ధాయనేత్రే ప్రక్షాళ్యశుచిర్భూత్వా సమాహితః। పరిజప్యచ మంత్రేణ భక్షయేద్దంతధావనం॥

మంత్రస్తు॥ అన్నాద్యాయవ్యూహధ్వంసోమోరాజాయమాగమత్। సమేముఖంప్రవేక్ష్యతె యశసాచ భగేనచ॥ వ్యా॥ హేదంతాః। అన్నాద్యాయ అన్నభక్షణాయ। వ్యూహధ్వం స్థిరపఙ్క్తాః దృఢీభవత॥ యతస్సోమో రాజా స్వయంకాష్ఠరూపమగమత్। సమేముఖంప్రవేక్ష్యతి శోధయిష్యతీతి మం

తార్థః॥ ఆయురిత్యస్యమంత్రస్య ప్రజాపతిఋషిః। వనస్పతిర్దేవతా త్రిష్టుప్ఛందః శాఖాభిమంత్రణే వినియోగః॥ ఆయుర్బలంయశోవర్చః ప్రజాంపశువసూని చ। బ్రహ్మప్రజ్ఞాంచ మేధాంచ త్వంనోదేహివనస్పతే॥ మంత్రేణేతాన్సముచ్చార్య యఃకుర్యాద్దంతధావనం। వనస్పతిగతస్సోమస్తస్యనిత్యం ప్రసీదతీతి భక్షయేదితి దంతఘర్షణాభిప్రాయం॥ ప్రక్షాళ్యభక్షయేత్కాష్ఠం ప్రక్షాళ్యైవ తు సంత్యజేదిత్యంగిరాః॥ తతఃకాష్ఠంప్రక్షాళ్య నైఋత్యాం త్యజేత్। రాత్రుస్యాముత్సృజేత్కాష్ఠమిత్యాశ్వలాయనస్మరణాత్॥ ఆచాంతోప్యశుచిర్యస్మాదకృత్వా దంతధావనం। ప్రతిపద్దర్శ షష్ఠీషు నవమ్యాం రవివాసరే। దంతానాంకాష్ఠసంయోగే దహేదాసప్తమంకులం॥ ఏతేష్వశేషపర్వాదిషుదంతానాం కాష్ఠస్పర్శనేనాస్పృక్ర్హోస్యాదితి నిషేధం దర్శితం॥ అలాభేదంతకాష్ఠానాం నిషిద్ధేవాధవాసరే। గండూషాద్ద్వాదశాగ్రాహ్యా ముఖస్య పరిశుద్ధయే॥ కనిష్ఠాగ్రపరీమాణం సత్వచం నిర్వ్రణం ఋజు। ద్వాదశాంగుళమానంచ సార్ద్రంస్యాద్దంతధావనం॥ ఏకైకాంగుళహ్రస్వేన వర్ణేష్వన్యేషు కీర్తితం। ఆమ్రామ్రాతకధాత్రీణామంకోలఖదిరోద్భవం। శమ్యాపామార్గ ఖర్జూరీ శేలుశ్రీపర్ణి పీలుజః। రాజాదనంచ నారంగం కషాయకటుకంటకం। క్షీరవృక్షోద్భవంచాపి ప్రశస్తం దంతధావనమితి కాశీఖండే॥ తృణపర్ణైస్సదా కుర్యాదమామేకాదశీంవినా। తయోరపిచకర్తవ్యం జంబూప్లక్షరసాలజైః॥ ద్వాదశాంగులాదిపరిమాణోక్తిః వర్ణతారతమ్యజ్ఞాపనార్థం। యతవాగ్భక్షయేద్దంతధావనమితి విష్ణూక్తిః॥ మంత్రానుష్ఠానార్థం యతవాగ్భక్షయేదిత్యుక్తం॥ నాంగుళీభిర్దంతాన్ప్రక్షాళయేదిత్యుశనాః॥ తృణపర్ణైర్మధ్యమాంగుష్ఠైర్వా నిషిద్ధాహేపి కుర్యురితి స్మృత్యర్థసారే॥ అన్నాద్యాయేతి మంత్రాభిమంత్రితవనస్పతిభక్షణేన తద్గతసోమప్రసన్నతామాభూదిత్యంగుళీభిర్దంతాన్ప్రక్షాళయేదిత్యుక్తం॥ ఆయురిత్యాదిమంత్రోయముక్తశ్శాఖాభిమంత్రణం। తూష్ణీం వృథాస్యాద్దంతధావనమిత్యంగిరాః॥ దంతకాష్ఠభక్షణనిషిద్ధదినేష్వంగుళినా కుర్యురేవ॥ భానావభ్యుదితేనవికృతేనవినా దంతధావనంనకుర్యాత్కుర్యాచ్చేన్మునయోమంత్రా దేవాః పితరస్తత్పరాఙ్ముఖాభవంతి। పూర్వాభిముఖో ధృతి శరీరారోగ్యవాన్ దక్షిణాస్యో రోగీ పశ్చిమాస్యో నిర్ధన ఉత్తరాస్యో భోగిస్యాదితి గౌతమః॥ ఖరకరోదయానంతరదంతధావనే పశ్చాద్భావిస్నానసంధ్యాహోమాదికాలాతిక్రమస్స్యాదతఏవ మునయోమంత్రా దేవాః పితరః పరాఙ్ముఖా భవంతి యథా అకాలకృతకృషివదఫలాస్సర్వేక్రియా భవేయుః॥ దిగ్భేదేన ఫ

లభేదప్రదర్శనమదృష్టార్థమేవ॥ మంత్రోపస్థానార్థమేవ ప్రాగుత్తరముఖదంతధావనప్రశస్తశంసనం॥

## దంతధావనవిధి.

ఇదిదృష్టఫలము, నదృష్టఫలమును, జేయునని ఋషివచనములు గలవు.

దంతకాష్ఠము పదిరెండంగుళముల పొడవు. కనిష్ఠికతోసమమగువలమును గలిగి తిన్ననిది గుంటులులేనిది పుప్పిలేనిది చేసిగుంటులు గలది కొత్తది మంచిభూమినిబుట్టునది ఋతువును దోషమును రసమును వీర్యమునుయోజించి గ్రహించవలెను. వగరు చేదు మధురము వట్టిన గాలకాష్ఠమునగావలెను. చేదువాటిలోకి వేపపుల్ల శ్రేష్ఠము. వగరువాటిలోకి చండ్రుపుడక- తీపులలోనిప్పపుడక- వట్రగలవాటిలో గానుగుపుడక యివిమంచివి.

వాకుడుగింజలు, శుంఠి, పిప్పలి, మిర్యము, కరకతాడి, యుసిరికలు, నూనియ, సైంధవలవణము, మాలమెరికతగింజల పొడుము నివి, యన్నియు చూర్ణముచేసి దంతములనొక్కొక్కటిని వేరువేర దంతమాంసమునుబాధించకుండ చూర్ణయుక్తముగ మృదువగుకుంచిచేత దంతములను దోమిన వాటి దౌర్గంధ్యము బోవుటయేగాక శ్లేష్మమును హరించును. ముఖము విశదమగు నన్నమందు రుచిగలుగును. మనంబు స్వచ్ఛమగును. కంఠతాల్వోష్ఠ జిహ్వారోగములు శమించును. ముఖరోగము, శ్వాస, కాస, హిక్క, వమనము, నీరసము, అజీర్ణము, మూర్ఛ, బద్ధకము, శిరోరోగము, విదాహము, అలియక, పానముచేసినగుగ్లాని, కర్ణశూల, దంతరోగమివిగలవారలకు పైనిచెప్పినప్రకారము దంతధావనమారోగ్యకరము.

బంగరుబద్దతోనైన వెండిబద్దతోనైన నావృక్షసంబంధమగు బద్దతోనైన నాలుకనుగీసి యాప్రాచిని బరిమార్చవలెనది నునుపుగలదియై పదియంగుళములపొడవుగలదియై యుండవలెను. ఇందువలన ముఖమందగు నరుచియు దౌర్గంధ్యము పొంగును నశించును. పాలచెట్లుకషాయములతోనైన, నేలవేము లేక వట్టివేళ్లు, ఉసిరికపప్పు వీటికషాయములలో [illegible] గలిపి గండూషముజేసిన దంతదార్ఢ్యకరమగును. రుచిపుట్టును. ముఖమును నేత్రములు చల్లని జలముచే గడిగిన పుసియును, ముఖశోషమును, ముఖపొక్కులును, రక్తపిత్తమును హరించబడునని సుశ్రుతమందునదృష్టఫలము జెప్పబడెను.

దృష్టఫలమునుజెప్పితిమి యదృష్టార్థమునిటుపైని జెప్పుచున్నారము.

ఉషఃకాలమునందు పూర్వోక్తప్రకారముగ శౌచమును జేసి దంత

ధావనమొనర్చికొని స్నానముఁ జేయుమని దక్షుఁడు. దంతధావనపూర్వకముగ స్నానమొనర్చవలెను. ముఖము పర్యుషితమైయుండిన బరిశుద్ధుఁడుగాఁడునరుఁడుగానముందుగ దంతశోధనమతిప్రయత్నముతో నొనర్చుమని యాజ్ఞవల్క్య. వృద్ధశాతాతపులవారిచేత నాచమనమువలె స్వతంత్రమైనదిగ శుద్ధిహేతువగుటచేతను జెప్పబడెను. ఛాందోగపరిశిష్టమందును దంతప్రక్షాళన మొనర్చి స్నానమొనర్చుమనియుండెను.

నిద్రాముద్రితములగు నేత్రములను గడిగి యత్యంతసమాహితుఁడైశుచియగుచు మంత్రమును జపించుచు దంతధావన మొనర్చవలెను.

మంత్రములయర్థమును వ్రాయుచున్నారము.

ఓదంతములారా అన్నభక్షణకొరకు స్థిరమగు పఙ్క్తిగలవారలైస్థిరముగనుండుఁడు. రాజగు చంద్రుఁడు స్వయమేది కారణమువలన నేవనస్పతియందు బ్రవేశించెనో అది కీర్తితో నైశ్వర్యముతోఁగూడ నాముఖమును బ్రవేశించుగాక.

ఆయుః అనే మంత్రమునకు ఋషిప్రజాపతి- దేవత వనస్పతి- ఛందస్సనుష్టుప్- శాఖాభిమంత్రణమందు వినియోగము. ఓవనస్పతీ ఆయువును, బలమును, కీర్తిని, తేజమును, ప్రజను, పశుధనాదిసంపత్తిని త్రైకాల్యగోచరమగు ప్రజ్ఞ నది నవనవోన్మేషశాలినియైన మేధయనబడు ప్రజ్ఞానమును నీవు మాకు నొసగుమని యీయర్థములుగల మంత్రములనుచ్చరించి యెవఁడు దంతశోధనమొనర్చునో వానికి కాష్ఠమందధివసించిన చంద్రుఁడు నిత్యమును బ్రసన్నుఁడగును. ఆశ్వలాయనులవారు రాక్షసదిశననగా నైఋతిదిగ్భాగమున దంతధావనకాష్ఠమును బరిత్యజించుమనిరి. బుడకను గడిగి పళ్లతోమవలెను మరల దానిగడిగి త్యజించుమని యంగిరసులు. ఆచమన మొనర్చననుదంతశోధనమును జేయకుండినయశుచియనియు, పాడ్యమి నవమవ షష్ఠి ని నవమిని యాదిత్యవాసరమందునను కాష్ఠమును దంతములకు తగల్చుటవలన దన సప్తకులములను దహించుననియును దంతకాష్ఠముదొరకకుండినను నిషిద్ధదివసమునను ముఖశుద్ధికి పదిరెండుగండూషములను జేయుమని యున్న కనిష్ఠాగ్రసమపరిమాణము త్వక్కుగలిగి గంటుతేక తిన్ననై కుచ్చికలిగియున్నదియును, వర్ణక్రమమున పదిరెండు, పదకొండు, పది, తొమ్మిది యంగుళములుపొడవైన మామిడి, అంబాలపుడసీరిక, చిట్టియంకుడు, చంద్ర, జమ్మి, ఉత్తరేణి, ఖర్జూరీ, నెరిజె, గుమ్ముడి, వరగోకిపుల్ల, పాలపుల్ల, నారంజిపుల్లలు, చేదు, వగరు, ముళ్లు, పాలుగలిగినచెట్టుపుల్లలు దంతధావనమునకు ప్రశస్తమని కాశీఖండము.

అమవసనేకాదశినిదప్ప నితరదినములను తృణపర్ణములచే దంతశోధనముజేయవలయుననియు నా రెండుదినములందును గూడ వేరేదు జువ్వి మామిడాకులతో దోమవచ్చుననియును జెప్పియున్నది. పర్వములందును నుపవాసదినములదంతకాష్ఠసంపర్కముచేతను రక్తస్రావ మగు నది యశుచిహేతువు గావున నిషేధమగపరచెను. వర్ణతారతమ్యజ్ఞానముకొరకే కైకాంగుళి ప్రాప్తిసక్తి-ప్రధానముగానుండి దంతధావనమొనర్చునది యొడి నిష్ఫలవచనము- పూర్వోక్తమంత్రానుష్ఠానముకొరకు నంగుళులచేతను దంతశోధనము గూడదని యుశనసులు.

తృణపర్ణములచేతనైన మధ్యమాంగుష్ఠములచేతనైన నిషిద్ధదినములందైనను దంతశోధనమొనర్చునని స్మృత్యర్థసారము. వనస్పతిహోమించిన చంద్రప్రసన్నతనిమిత్తము జపమొనగ. దంతశోధనము కాష్ఠములేకుండిన గాక ప్రేక్షవని యంగుళులచేతను శోధించగూడదని యుశనసోక్తికి హేతువు. అంగిరసులవారు మంత్రానుష్ఠానముజేయక దంతశోధనముజేసిన యది నిష్ఫలమనుటచేతను దంతకాష్ఠనిషిద్ధదినములయందంగుళులచేతను శోధనమొనర్చికొనవచ్చునని స్మృత్యర్థసారోక్తికి తాత్పర్యము.

రోగముచేనవశుడైయుండినతప్ప సూర్యుడుదయించినపిమ్మట దంతధావనముజేసిన మునులు మంత్రములు పితృదేవతలును పరాఙ్ముఖులగుదురనియును బూర్వాభిముఖుడై దంతధావనమొనర్చిన ధృతియు శరీరారోగ్యము దక్షిణముఖుడైయాచరించిన రోగియు పశ్చిమముఖుడై యొనర్చిన నిర్ధనుడు నుత్తరాస్యుడై శోధించిన భోగియునగునని గౌతములు.

సూర్యోదయానంతరమున దంతశోధనమొనర్చిన యనంతరమున కృదగు స్నానసంధ్యాజపహోమాదికము కాలకృతమై యఫలమగు న కాలకృతకృషివలెను గాన మంత్రములు మునులు దేవతలు పితృదేవతలు పరాఙ్ముఖులవ్యాదరనుట.

దిగ్భేదముచే ఫలభేదమగపరచుట కేవలమదృష్టార్థము. మంత్రముల జపించుకొనుటకు నుత్తరపూర్వదిఙ్ముఖుడగుచు దంతధావనమొనర్చిన శ్రేష్ఠఫలప్రాప్తియగునని జెప్పుట.

## స్నా న వి ధిః

స్నాత్యనేన స్నానం। ష్ణా శౌచే। తత్తు నిత్యనైమిత్తిక కామ్యమలాపకర్షణగౌణభేదా దశార్ధం భవతి॥ అస్నాత్వా శీమలంభుంజే- అజపీప్రాయశోణి

తం। అహుత్వాశీక్రిమింభుక్త్వా అదత్వావిషమశ్నుతేఇతిపారాశరీ స్మృత్యుక్త
జపహోమాద్యనుకూలశౌచార్థమహరహః కర్తవ్యం నిత్యం గ్రహణసంక్రాం
త్యాదీనధికృత్యకృతం। శ్వకాకచండాలాదీనాం స్పర్శనే మృతజన్మాశౌచేచ।
మృతేజన్మనిసంక్రాంతౌ శ్రాద్ధేజన్మదినేతథా। అస్పృశ్యస్పర్శనేచైవ నస్నా
యాదుష్ణవారిణేతి స్మారితనిమిత్తేనకృతం స్నానం నైమిత్తికమితిస్ఫుటం॥ దర్శ
వ్యతీపాతరథసప్తమ్యాదౌ స్నానం కార్తికమాఘస్నానాదికం చాదృష్టస్వర్గా
దికామనయా కృతం కామ్యం॥ కేవలం తనుకాంతితుష్టిపుష్ట్యర్థమభ్యంగస్నానే
నాఖిలమలమార్జనం మలాపకర్షణం॥

మంత్రైర్జలావగాహే వారుణం। భస్మనాగ్నేయం। గోరజసా వాయ
వ్య మాపోహిష్ఠాదిభిర్మంత్రైర్మంత్రస్నానం । నాభేరధఃప్రక్షాళనం ఊర్ధ్వం
చార్ద్రవాససా శరీరసంమార్జనం కాపిలమవ్యయానందచిత్స్వరూపం విష్ణుచిం
తనంమానసం యత్సాతపవర్షం తద్దివ్యస్నానం। శరీరస్యాసామర్థ్యాద్దేశకాల
యోర్వైషమ్యాత్స్నానాన్యేతాని తుల్యాని। శ్రేష్ఠంమానసముచ్యతే। భేషజా
సక్తేసరుజేరాజచోరాద్యుపద్రవే మంత్రస్నాన మాపోహిష్ఠాదిభిర్మంత్రైర్విధీ
యతఇతి గౌతమప్రగీతస్నానాని గౌణాని। గౌణస్నానైర్జప సంధ్యాదౌ శుద్ధి
ర్నతుశ్రాద్ధదేవార్చనాదౌ బ్రహ్మయజ్ఞేవికల్పః॥

నను సర్వకర్మాచరణానుకూలస్నానమదృష్టఫలజనకంవాదృష్టాదృష్టఫ
లజనకమేవేత్యాశంక్యాగ్నేయవాయవ్యమంత్రస్నానాదిష్వదృష్టఫలంవినాన్యం
నపశ్యామో తద్వదశేషేషు స్నానేషు కేవలమదృష్టార్థమితివదామః ఇతిచేత్త
న్నసత్కింత్వదృష్టదృష్టఫలజనకంస్నానమితిబ్రూమోమునివచనరచనైః ప్రత్య
క్షైశ్చ॥ అలక్ష్మీకాలకర్ణీచ దుస్స్వప్నం దుర్విచింతితం। అమ్మాత్రేణాభిషిక్త
స్య నశ్యంతి ఇతిధారణేతి మార్కండేయపురాణే॥ ప్రాతస్స్నానం ప్రశంస
తి దృష్టాదృష్టకరంహితం। సర్వమర్హతి పూతాత్మా ప్రాతస్స్నాయీజపాది
కమితిదక్షః॥ అస్యార్థః॥ దృష్టం స్థూలశరీరనైర్మల్యారోగ్య మనఃప్రసన్నతాది
ఈశ్వరార్పితజపయజ్ఞదానాదిరూపం। అదృష్టం జపాదినా దురితక్షయద్వా
రా జ్ఞానినో భవతః మోక్షసామ్రాజ్యప్రాప్తిః। ఏతచ్చసర్వమర్హతి॥ అత్యం
తమలినఃకాయో నవచ్ఛిద్రసమన్వితః। స్రవత్యేవ దివారాత్రౌ ప్రాతస్స్నానం
విశోధనమితి మనుః॥ ప్రాతస్స్నానాద్యతశ్శుద్ధేత్కాయోయం మలినస్సదా।
ఛిద్రితోనవభిశ్ఛిద్రైస్స్రవత్యేవదివానిశం। ఉత్సాహమేధాసౌభాగ్యరూపసంప
త్ప్రవర్తకం। మనఃప్రసన్నతాహేతుః ప్రాతస్స్నానం ప్రశస్యతే। ప్రస్వేద
లాలాద్యాక్లిన్నోన్నిద్రాధీనోనరోయతః। ప్రాతస్స్నానాత్తతోర్హస్స్యాన్మం

త్రస్తోత్రజపాదిషు। తతః ప్రాతస్తు యత్స్నానం సంజాతే చారుణోదయే। ప్రాజాపత్యసమం ప్రాహుస్తన్మహాఘవిఘాతకృత్। ప్రాతస్స్నానం హరేత్పాపమలక్ష్మీం గ్లానిమేవచ। అశుచిత్వంచ దుస్స్వప్నం తుష్టిం పుష్టిం ప్రయచ్ఛతి॥ నోపసర్పంతి వై దుష్టాః ప్రాతస్స్నాయిజనం క్వచిత్। దృష్టాదృష్టఫలం యస్మాత్ప్రాతస్స్నానం సమాచరేదితి స్కాందే కాశీఖండే॥ ఉభేసంధ్యేచ స్నాతవ్యం బ్రాహ్మణైర్గృహమాగతైః। తిసృష్వపిచసంధ్యాసు స్నాతవ్యంచ తపస్వినేతి యోగియాజ్ఞవల్క్యః॥

విష్ణుర్ధర్మేయతిప్రాతస్స్నానవేళాం॥ ప్రాతస్స్నాయ్యరుణకరగ్రస్తాం ప్రాచీమవలోక్య స్నాయాదితి॥

అభ్యంగో మార్దవకరః కఫవాత నిరోధనః । ధాతూనాం పుష్టిజననో మృజావర్ణబలప్రదః। సేకశ్శ్రమఘ్నోఽనిలహృద్భగ్నసంధిప్రసాధకః । క్షతాగ్నిదగ్ధాభిహతవిఘృష్టానాం రుజాపహః। జలసిక్తస్య వర్ధంతే యథా మూలేంకురాస్తరోః। తథా ధాతువివృద్ధిర్హి స్నేహసిక్తస్య జాయతే। శిరాముఖై రోమకూపైః ధమనీభిశ్చ తర్పయేత్ । శరీరబలమాధత్తే యుక్తస్స్నేహోఽవగాహనే। తత్రప్రకృతిసాత్మ్యర్తుదేశదోషవికారవిత్। తైలం ఘృతంవా మతిమాన్యుంజాదభ్యంగసేకయోః। కేవలంసామదోషేషు నకథంచనయోజయేత్। తరుణజ్వర్యజీర్ణీచ నాభ్యక్తవ్యౌ కథంచన। తథావిరిక్తోవాంతశ్చ నిరూఢో యశ్చమానవః। పూర్వయోఃకృచ్ఛ్రతావ్యాధేరసాధ్యత్వమథాపివా । శేషాణాం తదహఃప్రోక్తాః అగ్నిమాంద్యాదయోగదాః। ఉద్వర్తనంవాతహరంకఫమేదోవిలాపనం। స్థిరీకరణమంగానాం త్వక్ప్రసాదకరంపరం। సిరాముఖ వివిక్తత్వం త్వక్స్థస్యాగ్నేశ్చతేజనం। ఉద్ఘర్షణోత్సాదనాభ్యాం జాయేయాతామసంశయం। ఉత్సాదనాద్భవేత్స్త్రీణాం విశేషాత్కాంతిమద్వపుః। ప్రహర్షసౌభాగ్యమృజా లాఘవాదిగుణాన్వితం। ఉద్ఘర్షణంతు విజ్ఞేయం కండూకోఠానిలాపహం। ఊరోర్వ్యస్సంజనయత్యాశు ఫేనకస్థైర్యలాఘవే। కండూకోఠానిలస్తంభమలరోగాపహశ్చసః। తేజనంత్వగ్గతశ్చాగ్నేశ్శిరాముఖవిరేచనం।ఉద్ఘర్షణంత్విష్టకయాకండూకోఠవినాశనం। నిద్రాదాహశ్రమహరం స్వేదకండూతృషాపహం। హృద్యంమలహరంశ్రేష్ఠం సర్వేంద్రియవిశోధనం । తంద్రాపాపోపశమనం తుష్టిదం పుంస్త్వవర్ధనం। రక్తప్రసాదనంచాపి స్నానమగ్నేశ్చదీపనం । ఉష్ణేనశిరసస్స్నానమహితశ్చక్షుషస్తథా। శీతేనశిరసస్స్నానశ్చక్షుష్యమితి నిర్దిశేత్। శ్లేష్మమారుతకోపేతు జ్ఞాత్వా వ్యాధిబలాబలం। కామముష్ణం శిరస్స్నా

నం భైషజ్యార్థం సమాచరేత్। అతిశీతాంబుశీతే చ శ్లేష్మమారుతకోపనం। అ
త్యుష్ణముష్ణకాలే చ పిత్తశోణితవర్ధనం। తచ్చాతిసారజ్వరిత కర్ణశూలానిలార్తి
షు। ఆధ్మానరోచకాజీర్ణభుక్తవత్సు చ గర్హితమితి సుశ్రుతే॥ అస్నాతస్య శరీర
స్య వహ్నిస్సర్వాంగగోచరః। స్నానే నైకత్వమాపన్నం తస్మాత్స్నానం స
మాచరేదితి వాహటః॥ స్నానం సర్వాంగశుద్ధిర్మలినశుచికరం దేహకాంతిం క
రోతీ కండుఘ్నం స్వేదహారి శ్రమకరణహరం పైత్త్యదాహాదిమేహాన్। దీప్తాగ్ని
ర్ధాతువృద్ధిస్సుఖతరమపి సంస్తంభకృత్పావనం చ నానారోగోపశాంతిర్హృత
కరణకరం చిత్తశుద్ధిం కరోతీతి చరకే॥ నదీషు దేవఖాతేషు తటాకేషు సరస్సు
చ। స్నానం సమాచరేన్నిత్యం గర్తప్రస్రవణేషు చేతి కూర్మపురాణే॥ ఉత్తమం
తు నదీస్నానం తటాకే మధ్యమం స్మృతం। కూపే స్నానం తు సామాన్యం భాం
డస్నానం తథైవ చ। నదీషు దేవఖాతేషు ప్రాతస్స్నాయాద్దినే దినే। తదభావే
తటాకే వా కూపే వా స్నానమాచరేత్। నదీం గంతుమశక్తశ్చేద్గృహే వా స్నా
నమాచరేత్। స్వయం వైవాథ శిష్యైర్వా పుత్రైర్వోద్ధృతవారిణేతి విష్ణుః॥ న స్నా
యాచ్ఛూద్రహస్తేన నైకహస్తేన వా తథా। ఉద్ధృతాభిరపి స్నాయాదాహృతా
భిర్ద్విజాతిభిరితి పరాశరః॥ ప్రభూతే విద్యమానే తు విమలే తు మనోహరే। నా
ల్పోదకే ద్విజస్స్నాయాన్నదీం చోత్సృజ్య కృత్రిమేతి యోగియాజ్ఞవల్క్యః॥ పం
చ పిండాననుద్ధృత్య న స్నాయాత్పరవారిణి। నిపానకర్తుస్స్నాత్వా తు దుష్కృ
తాంశేన లిప్యత ఇతి మనుః॥ పంచ పిండానితి సేతుకూపవ్యతిరిక్త జలాశయో నిరు
ద్ధాసు చ మృత్పిండాన్కూపాత్త్రీన్ఘటాంస్తథేతి బోధాయనదర్శనాత్। త
త్ర ప్రాంచః అప్రతిష్ఠితమాత్రే తు పిండోద్ధారస్తస్యైవ పరకీయత్వాదిత్యా
హుస్తన్నేతి హరిహరాదయః అప్రతిష్ఠితజలత్వేన తత్ర స్నానాభావాత్ పర
స్వోపయోగే చౌర్యాపత్తేర్న్యాదౌ పరకృతస్వరూపం పరకీయత్వావగమా
చ్చ॥ పంచపిండాననుద్ధృత్య న స్నాయాత్పరవారిషు। అన్యథా ఫలమాప్నోతి
స్నానస్యార్థం తటాకినామితి స్కాందే ధర్మఖండే॥ ధనుస్సహస్రాణ్యష్టౌ చ గ
తిర్యాసాం న విద్యతే। న తా నదీశబ్దవహా గర్తాస్తాః పరికీర్తితా ఇతి ఛందోగపరిశి
ష్టే॥ ధనుర్హస్తచతుష్టయం। పయ్యద్వయం శ్రావణాది సర్వా నద్యో రజస్వలాః।
తాసు స్నానం న కుర్వీత వర్జయిత్వా సముద్రగాః। ఉపాకర్మణి చోత్సర్గే ప్రే
తస్నానే తథైవ చ। చంద్రసూర్యగ్రహే చైవ రజోదోషో న విద్యత ఇతి ఛందోగ
పరిశిష్టే॥ అగ్రాహ్యా అగతా ఆపో నద్యాః ప్రథమవేగికాః। ప్రక్షోభితాశ్చ కేనా
పి యాశ్చ తీర్థాద్వినిస్సృతా ఇతి యోగియాజ్ఞవల్క్యః॥ గంగాది ప్రవాహవిచ్ఛి
న్నాః పంకిలేషు నిఖాతేషు న స్నాయాద్వైకదా చ నేతి కూర్మపురాణే॥ పూర్వ

నం భైషజ్యార్థంసమాచరేత్। అతిశీతాంబుశీతేచ శ్లేష్మమారుతకోపనం। అత్యుష్ణముష్ణకాలేచ పిత్తశోణితవర్ధనం। తచ్చాతిసారజ్వరిత కర్ణశూలానిలార్తిషు। అధ్మానరోచకాజీర్ణ భుక్తవత్సుచ గర్హితమితి సుశ్రుతే॥ అస్నాతస్యశరీరస్య వహ్నిస్సర్వాంగగోచరః। స్నానేనైకత్వమాపన్నం తస్మాత్స్నానం సమాచరేదితి వాహటః॥ స్నానంసర్వాంగశుద్ధిర్మలినశుచికరం దేహకాంతిం కరోతీకండుఘ్నం స్వేదహారిశ్రమకిరణహరం పైత్యదాహాదిమేహాన్। దీప్తాగ్నిర్ధాతువృద్ధిస్సుఖతరమపి సంస్తంభకృత్వావనంచ నానారోగోపశాంతిర్హితకరణకరం చిత్తశుద్ధింకరోతీతి చరకే॥ నదీషు దేవఖాతేషు తటాకేషు సరస్సుచ। స్నానంసమాచరేన్నిత్యం గర్తప్రస్రవణేషుచేతి కూర్మపురాణే॥ ఉత్తమంతు నదీస్నానం తటాకే మధ్యమం స్మృతం। కూపేస్నానంతుసామాన్యం భాండస్నానం తథైవచ। నదీషుదేవఖాతేషు పాత్రస్నాయాద్దినేదినే। తదభావే తటాకేవా కూపేవా స్నానమాచరేత్। నదీంగంతుమశక్తశ్చేదగ్రహేవాస్నానమాచరేత్। స్వయంవైవాథశిష్యైర్వా పుత్రైశ్చోద్ధృతవారిణేతివిష్ణుః॥నస్నాయాచ్ఛూద్రహస్తేన నైకహస్తేనవాతథా। ఉద్ధృతాభిరపిస్నాయా దాహృతాభిర్ద్విజాతిభిరితి పరాశరః॥ ప్రభూతే విద్యమానేతు విమలేతుమనోహరే। నాల్పోదకేద్విజస్స్నాయాన్నదీంచోత్సృజ్యకృత్రిమేతి యోగియాజ్ఞవల్క్యః॥ పంచపిండాననుద్ధృత్య నస్నాయాత్పరవారిణి। నిపానకర్తుస్స్నాత్వాతు దుష్కృతాంశోనలిప్యతఇతిమనుః॥ పంచపిండానితి సేతుకూపవ్యతిరిక్తజలాశయోనిరుద్ధాసుచమృత్పిండాన్సముద్ధృత్య త్రీన్ఘటాంస్తథేతి బోధాయనదర్శనాత్। తత్రపాంచః అప్రతిష్ఠితమాత్రేతు పిండోద్ధార స్తస్యైవ పరకీయత్వాదిత్యాహుస్తన్నేతి హరిహరాదయః అప్రతిష్ఠితజలత్వేనతత్రస్నానాభావాత్ పరస్యోపయోగాచార్యాపత్తేర్మన్వాదౌ పరకృతస్వరూపం పరకీయత్వాదగమాచ్ఛ॥ పంచపిండాననుద్ధృత్య నస్నాయాత్పరవారిషు। అన్యథా ఫలమాప్నోతి స్నానస్యార్థం తటాకినామితి స్కాందే ధర్మఖండే॥ ధనుస్సహస్రాణ్యష్టౌచగతిర్యాసాంనవిద్యతే। నతానదీశబ్దవహాగర్తాస్తాఃపరికీర్తితాఇతి ఛందోగపరిశిష్టే॥ ధనుర్హస్తచతుష్టయం। పవ్యద్వయంశ్రావణాది సర్వానద్యోరజస్వలాః। తాసు స్నానం నకుర్వీత వర్జయిత్వా సముద్రగాః। ఉపాకర్మణిచోత్సర్గే ప్రేతస్నానేతథైవచ। చంద్రసూర్యగ్రహేచైవ రజోదోషోనవిద్యతఇతి ఛందోగపరిశిష్టే॥ అగ్రాహ్యత్రగతాఆపోనద్యాః ప్రథమవేగికాః। ప్రక్షోభితాశ్చ కేనాపి యాశ్చతీర్థాద్వినిసృతాఇతి యోగియాజ్ఞవల్క్యః॥ గంగాది ప్రవాహవిచ్ఛిన్నాః పంకిలేషు నిఖాతేషు నస్నాయాద్వైకదాచనేతి కూర్మపురాణే। పవ్యే

మాసశ్శ్రావణాదీ ద్వౌమాసౌ శ్రావణాషాఢౌ సర్వానద్యోరజస్వలాః రజ
స్త్వాసామితిరజస్వలాః వర్షాసు ప్రథమవేగికా అపః పంకిలాస్తాస్స్నానపానే
నాపాయో శరీరస్య భవేదితి నిషేధంతి తదుక్తం వైద్యకే నద్యః ప్రావృషిజా
స్తు పీనసకఫశ్వాసాదికాసప్రదాః॥ క్రిమికీటకపత్రపంకశంఖతృణలూతావిష
దుగ్ధసంగమంచ। నపిబేన్మతిమాన్నజాతుతోయం యదిపీతం విదధాతిరోగమా
శు॥ పానవిషేధే నైవస్నానమపి॥ సింహకర్కటయోర్మధ్యే సర్వా నద్యో రజ
స్వలాః। తాసుస్నానం నకుర్వీత వర్జయిత్వామహానదీః। గంగాచయమునాచైవ
వప్లక్షగాచసరస్వతీ। గోదావరీకృష్ణవేణీ మహానద్యః ప్రకీర్తితా ఇతి స్కాందే
ధర్మఖండే॥ సముద్రగానద్యోగంగాద్యాః పరమపావనాస్సదా ఇతి దర్శయి
తుం చంద్రసూర్యోపరాగాద్యావశ్యకకాలేషు నదీస్నానాదరణార్థ మదోషో
క్తిరిత్యవగమ్యం॥ అస్పృశ్యస్పర్శనేవాంతఅశ్రుపాతేక్షురేభగే। స్నానం నైమి
త్తికంకార్యం దైవపిత్ర్యవివర్జితమిత్యాపస్తంబః॥ నిత్యం నైమిత్తికంకామ్యం త్రి
విధంస్నానముచ్యతే। తర్పణంతుభవేత్తస్యఅంగత్వేన ప్రకీర్తితమితి బ్రహ్మపు
రాణవచనాత్సామాన్యతః ప్రసక్తస్య తర్పణస్యచ వ్యావృత్తిః॥ అజీర్ణేభ్యుది
తే వాంతే శ్మశ్రుకర్మణి మైథునే। దుస్స్వప్నే దుర్జనస్పర్శే స్నానమాత్రం వి
ధీయతఇతియమః॥ అభ్యుదితే అశుద్ధఆహారాదినాభివ్యక్తేపి తచ్ఛోత్తరకాల
స్నానప్రాప్త్యర్థం అజీర్ణావస్థాయాం నిషేధాత్ అభ్యుదితేవాంతే ఇతి సం
బంధే పర్యుషితవాంతఇతి విశేషః సద్యోవాంతే ఆచమనమాత్రమేవ॥ శ్వపచ
మూషకప్రేతహారకశవాస్సంస్పృశ్య దేవీరాపఇత్యేతాభి రంతర్జలే స్నాతః
పూతోభవతి అజీర్ణవాంతే శ్మశ్రుకర్మాయోనిశుచివా మైథునేచేతి హారీతో
క్తేః॥ దుర్జనోత్రచండాలాదిః మాత్రపదేన సగ్రావంగవ్యావృత్తిః తస్మాదప్రా
యత్యనిమిత్తేస్నానే మజ్జనమాత్రేణ శుద్ధిః గౌతమః పతితచండాల సూతికోద
క్యాశవస్పృష్టితత్స్పృష్ట్యుపస్పర్శనే సచేలోదకోపస్పర్శనాచ్ఛుద్ధో భవతి అత్ర
చశవస్పర్శనశ్చ స్పర్శే స్నానవిధానాత్।ఉపస్పృశ్యాశుచిస్పృష్టం తృతీయం
వాపిమానవః। హస్తౌపాదౌచతోయేన ప్రక్షాళ్యాచమ్య శుధ్యతీతి దేవలవచ
నం।పతితాదిస్పర్శి స్పర్శే సంకోచనీయం తత్స్పృష్టిపదంపతితాదిస్పర్శినోప్యా
హేంతి కేచిత్ తదయుక్తం ద్వంద్వద్వయగౌరవాత్ ఏకద్వంద్వేచ సన్నిహిత
పరత్వమేవభేదః। ఉదకోపస్పర్శనం స్నానం। సచేలో యద్వస్త్రధరస్సన్ స్పృ
ష్టస్తద్వస్త్రధరఇత్యర్థః। ఏకాంశాఖాం సమారూఢశ్చండాలాదిర్యదా భవేత్।
బ్రాహ్మణస్తత్రఆసీనస్స్నానేన శుచితామియాదిత్యాపస్తంబః॥ భాసవానర
మార్జారఖరోష్ట్రాణాం శునాం తథా। సూకరాణా మమేధ్యంచ స్పృష్ట్వా

స్నాయాత్సచేలకమితి వ్యాసః। శ్వవిష్ఠాంకాకవిష్ఠాంవా కంకగృధ్రనరస్యచ।
అధోచ్ఛిష్టంతుసంస్పృశ్య సచేలోజలమావిశేదితి లఘుహారీతః॥ అధోచ్ఛిష్టం
మూత్రోత్సర్గేణాశుద్ధః॥ శ్వానం శ్వపాకం ప్రేతధూమం దేవద్రవ్యోపజీవినం
గ్రామయాజకం యూపం చితిం చితికాష్ఠం మద్యం మద్యభాండం సస్నేహం
మానుషాస్థిశవస్పృష్టం రజస్వలాం మహాపాతకినం శవం స్పృష్ట్వా సచేల
మంభోవగాహ్య ఉత్తీర్యాగ్నిముపస్పృశేద్గాయత్ర్యష్టశతం జపేత్। ఘృతం
ప్రాశ్య పునస్స్నాత్వా త్రిరాచామేదితి చ్యవనః। అగ్నిస్పర్శనాది కామకృతే
స్మృత్యంతరే స్నానవిధానాత్। అయోనిదివాపశుమైధునేచ స్నాయాదితి। అ
నుదకమూత్రపురీషకరణే స్నాయాదితిసుమంతుః। ఆతురస్నానసంప్రాప్తౌ ద
శకృత్వస్త్వనాతురః। స్నాత్వాస్నాత్వాస్పృశేత్క్షిప్రం తతశ్శుద్ధేత్సఆతురఇ
తియమః॥ అస్తంగతే యదాసూర్యే చండాలంపతితంస్త్రియం। సూతికాంస్పృ
శతశ్చైవ కథంశుద్ధిర్విధీయతే। జాతవేదాస్సువర్ణంచ సోమమార్గం తథైవచ।
బ్రాహ్మణానుమతేచైవ దృష్ట్వాస్నాత్వాచ శుధ్యతి। ఆచాంతమనుగర్తంవా
నిశిస్నానంనవిద్యతే। స్నానమాచమసంప్రోక్తం దివోద్ధృతజలేనచ। జాతవే
దాః అగ్నిః సోమమార్గం ఆకాశం బ్రాహ్మణానుమతే స్నాత్వా అగ్న్యాది
కం స్పృష్ట్వా శుధ్యతీత్యర్థః। ఆచాంతమాచమనం అనుగర్తం జలాశయం ప్ర
విశ్య నిశీత్యుభయత్రయోజ్యం। స్నానమగ్నేశ్చదీపనమితి సుశ్రుతోక్త్యాజీర్ణా
వస్థాయాం పర్యుషితవాంతే స్నానమనుమతమేవ దృష్టఫలజనకత్వేన। శ్మశ్రు
కర్మణి లోమనఖకృంతనరక్తస్రావోభవేత్తదర్థం। వ్యాయామే స్నానంహితమితి
దృష్టఫలం దర్శితం సుశ్రుతే। స్నానంసవ్యజనంస్వప్నో వ్యాయామంతేహితాని
త్వితి। పశుయోనావయోనౌ దివామైధునేనాతీవానర్థం దర్శయతి సఏవ। క్షుధి
తఃక్షుబ్ధచిత్తశ్చ మధ్యాహ్నేతృషితోబలః। స్థితస్యహానిం శుక్రస్య వాయోః
కోపంచవిందతి। తిర్యగ్యోనావయోనౌచ దుష్టయోనౌ తథైవచ। ఉపదంశస్త
థావాయోః కోపశ్శుక్రస్యచక్షయఇతి। స్నానేనదుస్స్వప్నశమనం భవతీతి కాశీ
ఖండోక్తముక్తమేవపూర్వం। పతితసంసర్గేణ పతితోభవన్పంచమహాపాతకీభ
వతీత్యేతన్నివారణార్థమస్పృశ్యోక్తిరిత్యాచమనప్రకరణేభిహితం। భాసవానర
మార్జార ఖరోష్ట్ర శున సూకర కాక కంక గృధ్రాః అభక్ష్యభక్షణత్వాచ్చా
స్పృశ్యహీనజంతుత్వాచ్చ తేషాంవిష్ఠాపి శిష్టాస్పృశ్యత్వేసతిస హేతుకంస్నా
నం ప్రేతధూమ మనారోగ్యకరం॥ దేవద్రవ్యోపజీవికాదయో దేవద్రవ్యాణి
వంచనయా పంచత్వపర్యంతం భక్షయంతి। దేవార్పిత దీపాన్నమయఘృత తై
లాదీనపి గ్రహిష్యంత్యర్చనాదిష్వనాదృత చర్యా భవంత్యేతేఽతీవ పాపినఇతి।

గ్రామయాజినో ప్యాజీవిత మతిలౌల్యాద్దుర్జానదురన్నాదీనాదత్తేయ శౌండిక రజకాదిభ్యోపి యాజనాధ్యయనదానాని స్వస్నేవినాచరంత్యేతేఽస్పృశ్యాః పాపినఇతి దర్శయన్దుర్వృత్తాన్నివారయితు మాత్మనిక్యాన్మనయో బ్రువన్। యూపస్యాస్పృశ్యత్వహేతుర్వైదికకర్మవ్యప్యశేష జంతుహింసా సాధనస్య హేయత్వబోధనార్థంమద్యంపృాద్యమనవద్యమితి యేసేవితారస్సృతిర్మతిబుద్ధివిభ్రమేనతే విహితానుష్ఠానవిందితాచరణాస్సంతోఽసంతస్సతఃపతతీతిమ ద్యత త్వాత్రస్పర్శనమప్యశుచికారణత్వేన చ్యవనోవదన్నసర్థజం నివారయతీత్య వగమ్యం। నరవిష్ఠాన్యనరవిష్ఠా। మానుషాస్థివసావిష్టామార్తవంమూత్రరేతసీ। మజ్జానంశోణితంవాపి పరస్యయదిసంస్పృశేత్। స్నాత్వా విమృజ్యలేపాదీనాచమ్యశుచితామియాత్। తాన్యేవ స్వానిసంస్పృశ్య పూతస్యాత్పరిమార్జనాదితి దేవలవచనాత్। అనుదకమూత్రపురీషకరణే సచేలస్నానందృష్టఫలమేవ యస్మాత్సంపర్కాస్యాదక్షాళితపాయూపస్థావస్థాయాంవస్త్రధారణేతస్మింస్థలే లేపస్స్యాదితి। శ్వపాకంపతితంవ్యంగ్యమున్మత్తశవహారక(సూతికాం సూయికాం నారీం రజసాచపరిప్లుతాం। శ్వకుక్కుటవరాహాంశ్చ గ్రామ్యాన్సంస్పృశ్యమానవః। సచేలంసశిరస్నాత్వా తదానీమేవశుధ్యతీతి దేవలః॥ శ్వాదిభిశ్శిరస్పర్శేస్నానం। గాత్రాంతరస్పర్శే క్షాళనాచమనమాత్రం॥ తథాచ శాతాతపః॥ రజకశ్చర్మకృచ్చైవ వ్యాధజాలోపజీవినౌ। చేలనిర్ణేజకశ్చైవ నటశ్శైలూషకస్తథా। ముఖేభగస్తథాశ్వాచ వనితా సర్వవర్ణగా। చక్రీధ్వజీ వధ్యఘాతీ గ్రామకుక్కుటసూకరౌ॥ ఏభిర్యదంగం సంస్పృష్టం శిరోవర్జయిత్వా ద్విజాతిషు। తోయేనక్షాళనంకృత్వా ఆచాంతశ్శుచితామియాత్। చక్రీ తైలికః ధ్వజీ శౌండికః॥

అమేధ్యోదకంపరిహరేత్ తథానసముద్రోదక మవగాహేదితి శంఖలిఖితౌ॥ చంద్రసూర్యోపరాగ సోమాదిత్యవారయుక్త పూర్ణిమాదర్శ కృష్ణాంగారకచతుర్దశ్యాదిపర్వాణిచ సింధౌస్నాయాదేవాదృష్టఫలావాప్తిదర్శనాత్। తద్వ్యతిరిక్తదినేషు నస్నాయాద్దృష్టఫలవిరుద్ధత్వాత్ తథా బోధాయనచరకౌ అథాతస్సముద్రస్నానవిధిం వ్యాఖ్యాస్యామో తామ్రాదా[illegible]ంవా స్నాయాన్నాన్యతిథిషు॥ మందాంగారకవారాణాం కర్త్యేషు లవణాంభసి। సంతానకామో నస్నాయాత్ ప్రాహిహారన్యత్ర దర్శనాత్। తత్రకుజవారేసనివారే వా సంతత్యభివృద్ధినస్నాయాత్। పర్వదినేషు సుస్నాయాత్। కృష్ణాంగారకపర్వయుక్తే సముద్రస్నాతస్య జన్మసహస్రార్జితపాపం నశ్యతి। ప్రాహ్మణః

పూతో భవతీత్యాహ భగవాన్బోధాయనః॥ బలపాప్రమకారిణ్యా స్యాగరాంభ స్త్రిదోషకృదితి చరకః॥

అథాశ్వత్థజలస్నానమాదిత్యపురాణోక్తంవదామః॥ గురువారేత్వమాయాంవై అశ్వత్థచ్ఛాయవారిణి। స్నానంప్రయాగసదృశం సర్వపాతకనాశనం। పారిజాతే॥ అశ్వత్థీయోదకేస్నాయాద్గజచ్ఛాయేతి సోచ్యతే। అమాగురుసమాయోగాత్సూర్యపర్వశతాధికః। తత్ర ప్రార్థనామంత్రః॥ జీవోబృహస్పతిస్సూరిరాచార్యోగురురంగిరాః। వాచస్పతిర్దేవమంత్రీ శుభంకుర్యాత్సదామమ। ఏతైర్నామభిరష్టాభిర్గురుంవై ప్రార్థయేత్తతః॥

అభ్యంగేచైవమాంగళ్యే గృహేచైవతు సర్వదా। శీతోదకేన నస్నాయాన్నధార్యం గోపిచందనం। ఆపస్స్వభావతో మేధ్యాః కింపునర్వహ్నిసంయుతాః। అతస్సంతః ప్రశంసంతి స్నానముష్ణేనవారిణా॥ సంక్రాంతౌ గ్రహణేచైవ హ్యమావాస్యార్కపర్వసు। గృహేవాపిప్రకుర్వీత స్నానం శీతోదకేనచ॥ గృహే అభ్యంగమాంగళ్యాదివ్యతిరిక్తోష్ణోదక స్నానబోధకాన్యేతద్వచనాన్యశక్తస్నానవిషయాణి॥ తథాచయమః॥ ఆదిత్యకిరణైః పూతం పునఃపూతంచవహ్నినా। అస్నాతమాతురస్నానే నశస్తం శీతలోదకం॥ తద్విధిశ్చ॥ పాత్రేశీతోదకంప్రక్షిప్య తదుపరి ఉష్ణోదకేనాపూర్య శంనోదేవీ అభీష్టయే తంతు ద్రుపదాదివేతి ఋతంచ ఆపోహిష్ఠేతి పంచభిరుగ్భిరభిమంత్ర్యేమంమ ఇత్యాదినా తీర్థానిస్మరన్ స్నాయాత్॥ గృహస్నానే సంకల్పఆచమనం అఘమర్షణంచన। అంతేఆచమనం మార్జనంచకార్యం। తదుక్తంధర్మఖండే॥ సంకల్పసూక్తపఠనం మార్జనంచాఘమర్షణం। దేవాదితర్పణంచైవ గృహేపంచ వివర్జయేదితి। నద్యాదౌ స్నాత్వా దేవర్షిపితృతర్పణాధికారీభవత్యన్యథానభవేదితి నద్యాదిస్నానమహరహః కారయితుముపదిశ్య దృష్టఫలముపపాదయితుమద్యతా ఋషయోబ్రూయురితి వదామః। అభ్యంగమాంగళ్యాదిషు తైలఘృతాది మాలిన్యముష్ణేనవారిణా సులభేన నివార్యతఇతి చోపదేశవంతః॥

## సంక్షేపస్నానవిధిః

నద్యాదౌగత్వా శిఖాంబధ్వా జానూర్ధ్వజలే తిష్ఠన్నన్యథాతూపవిశ్యాచమ్య మమకాయికవాచికమానసికదోషనిరసనపూర్వకం సర్వకర్మసు శుద్ధిసిద్ధ్యర్థం ప్రాతస్స్నానంకరిష్యఇతి సంకల్ప్య జలంనత్వా ప్రాఙ్ముఖః ప్రవాహాభిముఖోవా త్రిరవగాహ్యాంగాని నిమృజ్య స్నాత్వా ద్విరాచమ్యాపోహిష్ఠేతిమార్జనంకృత్వా ఇమంమేగంగఇతి త్రిష్టుభాలోచ్యాఘమర్షణే త్రిరావృ

తేన ఋతంచేతి సూత్రేణ కాత్యాయనైర్స్పపఠేతి ఋచా జలే నిమగ్నతయా కృత్వాష్టత్వావమ్య జలతర్పణం కుర్యాత్। ఉపవీతీ। బ్రహ్మాదయో యే దేవా స్తాన్ దేవాంస్తర్పయామి- భూర్దేవాంస్తర్పయామి- భువర్దేవాగ్ స్తర్పయామి- స్వర్దేవాంస్తర్పయామి- భూర్భువస్స్వర్దేవాంస్తర్పయామి- నివీతీ। కృష్ణద్వైపాయనాదయో యే ఋషయః తాన్ ఋషీంస్తర్పయామి- భూఋషీంస్తర్పయామి- భువఋషీంస్తర్పయామి- స్వఋషీంస్తర్పయామి- భూర్భువస్స్వఋషీంస్తర్పయామి। ప్రాచీనావీతీ। సోమఃపితృమాన్యమో ఽఙ్గిరస్వానగ్నిష్వాత్తాః కవ్యవాహనాదయో యే పితరః తాన్పితౄంస్తర్పయామి భూఃపితౄంస్తర్పయామి- భువఃపితౄంస్తర్పయామి- స్వఃపితౄంస్తర్పయామి- భూర్భువస్స్వఃపితౄంస్తర్పయామి॥ విధిస్నానసిద్ధా శరీరే మృద్గోమయలేపన తిలదర్భాదిక మధికమితిబ్రూమః। తథాచస్కాందే కాశీఖండే॥ విధిస్నానం యతః ప్రాహు స్నానాచ్ఛతగుణోత్తరం। విశుద్ధాంమృదమాదాయ బర్హీంషి తిలగోమయం। శుచౌదేశే పరిస్థాప్య స్నానమాచరేత్। ఉరుం హి రాజేతిమంత్రేణ తోయమావర్తయేత్పృష్టతః। ఏతేన తం తతో జప్త్వా తోయస్యామంత్రణాయచ। సుమిత్రియాన ఇతిమంత్రేణ పూర్వం కృత్వా జలాంజలిం। క్షిపేద్ద్వేష్యం సముద్దిశ్య జపన్దుర్మిత్రియా ఇతి। ఇదంవిష్ణురితిమంజప్త్వా లింపేదంగాని మృత్స్నయా। మృదేకయా శిరఃక్షాళ్యం ద్వాభ్యాం నాభేస్తథోపరి। నాభేరధస్తిసృభిః పాదౌషడ్భిర్విశోధయేత్। మజ్జేస్ప్రవాహాభిముఖ ఆపో అస్మానిమంజపన్॥ వ్యా॥ ఆపో అస్మాన్మాతరశ్శుంధయంతు। ఉదిదాభ్యశ్శుచిరితి మంత్రే ఉన్మజ్జనేమతః। మానస్తోక ఇమంజప్త్వా లింపేద్గాత్రే గోమయైః। ఇమం మేవరుణేత్యాది మంత్రైస్స్నాత్వాభిషేచనం। తత్వాయామి తథోత్పన్నస్స్యేన్న శ్చామ్య వ త్తమం। ధామ్నోధామ్నా హ ఓషధీరితి సంజపేత్। యదాప ఖరఘ్న్యా చంతు మేతి చావభృదేతిచ। అబ్దేవతా ఇమేమంత్రాః ప్రోక్తాస్స్నాత్వాభిషేచనే। ప్రణవేన తతో విప్రో మహావ్యాహృతిభిస్తతః। ఆత్మానంపావయేద్విద్వాన్ గాయత్ర్యాచతతఃస్మృతీ। అపోహిష్ఠేతి తిసృభిః ప్రత్యృచం పావనంపరం। ఏతేపిపావనామంత్రా ఇదమాపః ప్రవహతేతి। దేవీరాపఆపో దేవాదృపదాదివసంజ్ఞకః। శంనో దేవీరభిష్టయే హిరణ్యవర్ణాః పునంతుమేతిచ పావమాన్యః ప్రకీర్తితాః। తతోఘమర్షణంజప్త్వా ద్రుపదాంచ తతో జపేత్। ప్రాణాయామంచవిధివదథవాంతర్జలంజపేత్। ప్రణవం త్రిర్జపేద్వాపి విష్ణుంవాసంస్మరేత్సుధీరితి॥

అథపద్మపురాణేఽస్నానవిధిః తత్ర పద్మపురాణం। నైర్మల్యం భావ

శుద్ధిశ్చ వినాస్నానం నజాయతే। తస్మాన్మనోవిశుద్ధ్యర్థం స్నానమాదౌ విధీయతే। అనుద్ధృతైరుద్ధృతైర్వా జలైస్స్నానంసమాచరేత్। తీర్థం ప్రకల్పయేద్విద్వాన్ మూలమంత్రేణ మంత్రవిత్। ఓం నమోనారాయణాయేతి మూలమంత్రఉదాహృతః। దర్భపాణిస్తు విధినా హ్యాచాంతః ప్రయతశ్శుచిః। చతుర్హస్తసమాయుక్తం చతురశ్రం సమంతతః। ప్రకల్ప్యావాహయేద్గంగామేభిర్మంత్రైర్విచక్షణః॥ ఓం విష్ణోః పాదప్రసూతాసి వైష్ణవీ విష్ణుపూజితా। పాహి నస్త్వేనసస్తస్మాదాజన్మమరణాంతకాత్। తిస్రః కోట్యర్ధకోటీచ తీర్థానాంవాయురబ్రవీత్। దివిభువ్యంతరిక్షేచ తానితేసంతి జాహ్నవి। నందినీత్యేవ తేనామ దేవేషు నళినీతిచ। బృందాచ పృథ్వీ సుభగా విశ్వకాయా శివా సితా। విద్యాధరీసుప్రసన్నా తథాలోకప్రసాదనీ। క్షేమ్యాచ జాహ్నవీచైవ శాంతా శాంతిప్రదాయినీ। ఏతానిపుణ్యనామాని స్నానకాలే ప్రకీర్తయేత్। భవేత్సన్నిహితాతస్య గంగాత్రిపథగామినీ।సప్తవారాభిజప్తేన కరసంపుటయోజితం। మూర్ధ్నికుర్యాజ్జలం త్రిశ్చతుఃపంచచ సప్తవా। స్నానంకుర్యాన్మృదాతద్వదామంత్ర్యచవిధానతః। అశ్వక్రాంతే రథక్రాంతే విష్ణుక్రాంతే వసుంధరే। మృత్తికేహరమేపాపం యన్మయాదుష్కృతంకృతం। ఉద్ధృతాసి వరాహేణ కృష్ణేనశతబాహునా। ఆరుహ్యమమగాత్రాణి సర్వంపాపం వ్యపోహయ। నమస్తేసర్వలోకానాం ప్రభవారిణి సువ్రతే॥ ఆదౌ సంధ్యాతర్పణాదీనామితి శేషః। సప్తవారాభిమంత్రితేన పూర్వోక్తమూలమంత్రేణ ఏకవచననిర్దేశాత్ మూలమంత్రంవినా నిర్దేశస్యానార్థకత్వాచ్చ నత్వేభిర్మంత్రైరిత్యుపక్రమ్యోక్థితానాంమంత్రాణాం గ్రాహక ఇతి భ్రమః కార్యః స్నానంకుర్యాదితి అగ్రిమమంత్రేణ మృదమామంత్ర్య తయాగాత్రాణ్యాలిప్య మజ్జనం కుర్యాదిత్యర్థః అయంచస్నానవిధిః సర్వశాఖిసాధారణ స్సర్వవర్ణసాధారణశ్చ సంకోచే ప్రమాణాభావాత్పురాణశ్రవణే సర్వాధికారశ్రవణాచ్చ అనధీతవేదంప్రతిచాయమేవస్నానవిధిః ప్రశస్తః వేదమంత్రశూన్యత్వాత్ స్నానకాలేగాత్రలేపనం గోమయేన దృష్టఫలజనకమితి దర్శితం చరకే॥ అలక్ష్మీహరణం గోవిట్లేపకర్మణి శస్యతే। సర్వశుద్ధికరంపుణ్యం శస్తమున్మాదరోగిణామితి॥ ఉపగ్రహీ బద్ధపరికరః ధృతవస్త్రస్స్నానార్థం॥

## నద్యాదిజలగుణాని॥

గంగాదిపుణ్యసరితామంభః పాపాదిభంజకః। శ్రుతిస్మృతిపురాణేతిహాసాల్లోకాచ్చదృశ్యతే। ఉత ప్రత్యక్షతో బ్రూమో పుణ్యగిర్యాదినిర్ఝరాః।

సకుంభాస్థిన్యాంభసంగాత్కారయంత్యయనాచ్ఛిలాః । ప్రత్యేకం సరితా మంభోగుణానూచ ర్మహర్షయః । తద్వైద్యశాస్త్రరచనాం దర్శయామోను మోదతాం॥

తత్రభాగీరథ్యాయధా। శీతంస్వాదుస్వచ్ఛమత్యంతరుచ్యం పథ్యం పాక్యం పాచనం పాపహారి। తృష్ణామోహధ్వంసనం దీపనంచ ప్రజ్ఞాం ధత్తే వారిభాగీరథీయం॥ తధా॥ స్వాదుపాకరసంశీతం త్రిదోషశమనంలఘు। పవిత్రమతిపథ్యంచ గాంగంవారి మనోహరం॥ యమునాయాయధా ॥ పిత్తదాహశమనం శ్రమాపహం స్వాదువాతజననంచపావనం। వహ్నిదీపనకరంచ రోచనం యామునంజలమిదం బలప్రదం॥ నర్మదాయాయధా॥ సలిలం లఘు శీతలం సుపథ్యం కురుతేపిత్తకఫప్రకోపనంచ।సకలామయమర్దనంచరుచ్యం మధురంమేకలకన్యకాసముద్ధం॥ సరస్వత్యాయధా॥ సరస్వతీజలంస్వాదు పూతంసర్వరుజాపహం। రుచ్యందీపనకృత్పథ్యం దేహకాంతికరం లఘు॥ చంద్రభాగమధుమత్యోర్యధా॥ చంద్రభాగసలిలంసుశీతలం దాహపిత్తశమనంచవాతదం। చాంద్రభాగగుణసామ్యదంజలం యచ్చమాధుమతమగ్నిదీపనం॥ చంద్రభాగామధుమతీ కాశ్మీరే ప్రసిద్ధా॥ శతద్రు విపాశాసింధూనాం యధా॥ శతద్రుర్విపాశాచ సింధుస్త్రియాణాం సుశీతంలఘు స్వాదుసర్వామయఘ్నం। జలం నిర్మలం దీపనంపావనంచ ప్రదత్తేబలం బుద్ధిమేధాయుషంచ॥ శోణభద్రస్యయధా॥ శోణస్యాపిజలంపరంరుచికరం సంతాపశోషాపహం పథ్యం వహ్నికరంతధాచ బలదం క్షీణాంగపుష్టిప్రదం॥ తాపీవేత్రవత్యోర్యధా॥ తాపీవేత్రవతీ జలం సుమధురం కాంతిప్రదం పుష్టిదం వృష్యం పావనదీపనం బలకరం పానే ప్రశస్తం నృణాం॥ పయోష్ణ్యాయధా॥ పయోష్ణీసలిలంరుచ్యం పవిత్రం పాపనాశనం। సర్వామయహరంసౌఖ్యం బలకాంతిప్రదంలఘు॥ వితస్తాయాయధా॥ వితస్తాసలిలంస్వాదు త్రిదోషశమనంలఘు । ప్రజ్ఞాపుష్టిప్రదం పథ్యం తాపజాడ్యహరంపరం॥ వితస్తాకాశ్మీరె॥ సరయ్వాయధా॥ సరయూసలిలంస్వాదు బలపుష్టిప్రదాయకం॥ గోమత్యాయధా॥ గోమతీసలిలంస్వాదు బల్యంపిత్తకరం గురు॥ గోదావర్యాయధా॥ పిత్తార్తిరిక్తార్తిసమీరహారి పథ్యంపరం దీపనం పాపహారి। కుష్ఠాదినానామయదోషహారి గోదావరీవారి తృషాపహారి॥తధా॥ కండూకుష్ఠప్రశమనం వహ్నిసందీపనంపరం। పాచనంవాతపిత్తఘ్నం వారి గోదావరీభవం॥ కృష్ణాయాయధా॥ కృష్ణంజాడ్యకరంస్వాదు పూతంపిత్తాస్రకోపనం॥ కృష్ణవేణ్యాజలంస్వస్థం రుచ్యందీపనపాచనం॥ తుంగభద్రాయాయధా॥ తుంగభద్రాజలంస్నిగ్ధం నిర్మలం స్వాదుదంగురు। కటుపిత్తాస్రదంపాత్రియః స్వా

నె శైత్యకరంపరం॥ కావేర్యాయథా॥ కావేరీసలిలంస్వాదు శ్రీమఘ్నం లఘు దీపనం। దద్రుకుష్ఠాదిదోషఘ్నం మేధాబుద్ధిరుచిప్రదం॥ పూర్వదేశోద్భవా నద్యః సర్వేవాతకఫప్రదాః। పశ్చిమేపిత్తలాస్సర్వే కఫవాతవినాశనాః॥ పశ్చిమోదధిగాశ్శీఘ్రం వహంయాశ్చామలోదకాః। పథ్యాస్సమస్తాస్తానద్యో విపరీతాస్తతోన్యథా॥ ఉపలాస్ఫాలనాక్షేపవిక్షేదేఖేదితోదకాః। హిమవన్మలయోద్భూతాః పథ్యాస్తాఏవచస్థిరాఇతి॥ తత్రనద్యఃపశ్చిమాభిముఖాఃపథ్యాలఘూదకత్వాత్ పూర్వాభిముఖాస్తు నప్రశస్యంతె గురూదకత్వాత్ దక్షిణాభిముఖానాతిదోషలాస్సాధారణత్వాదితి సుశ్రుతే॥

పారిస్రవణం బలమమలం స్వచ్ఛం లఘు మధురరోచనం దీపం ॥ పానీయంఖలుపర్వతోపరిగతం తశ్లేష్మవాతప్రదం హృద్యం స్వాదుసశైత్యతిక్తహరణం దుర్గంధికం పిచ్ఛలం॥ కించిజ్జలం శుక్లవివర్ధనంచ సుఖప్రదం శైత్యకఫానిలఘ్నం। సత్వప్రదం తాపతృష్ణాపహంచ సందీపనం స్వచ్ఛతరం లఘూష్ణం॥

తాటాకమంభోమధురంవిశేషం నిహంతిశైత్యం కఫవాతహారి । ప్రాణప్రదంశాంతికరాతిరుచ్యం వృష్యంమనోహారి సమస్తరోగ॥ ఉష్ణంశ్లేష్మ మరున్నివారణకరం కాయాగ్నిసందీపనం కుర్యాత్త్రైత్యవినాశనంచ కథితం వాపీభవం జీవనం॥ కూపోదకం త్రిదోషఘ్నం లఘుత్వంచబలప్రదం। సర్వకాలేషు పానార్హం రోగఘ్నందీపనంపరమితి॥ యథాదృష్టఫలంతద్వదదృష్టముపపద్యతె। సర్వజ్ఞాస్సత్యవచనామునయస్సంశితవ్రతాః। ప్రతిపత్తిస్తుకర్తవ్యాహ్యాదృష్టఫలకేష్వపి। తస్యహేతుస్తీర్థగణె కాశీఖండేబ్రవీదిదం॥

భౌమానామపితీర్థానాం పుణ్యత్వేకారణం శృణు। యథా శరీరస్యోద్దేశాః కేచిన్మేధ్యతమామతాః॥ ప్రభావాదద్భుతా భూమేస్సలిలస్యచ తేజసా। పరిగ్రహాన్మునీనాంచ తీర్థానాం పుణ్యతాస్మృతేతి॥

## స్నానవిధి.

దంతధావనానంతరమున స్నానవిధిని విశేషముగ జెప్పుచున్నారము.

దీనిచేతను శుచినొందుదురుగాన స్నానమనబడు నది నిత్యము, నైమిత్తికము, కామ్యము, మలాపకర్షణము గౌణమనియు నైదువిధములు. స్నానజపహోమదానములొనర్చక భుజించిన మలమును, దుర్గంధరక్తమును, క్రిములను, విషమును వరసగ భుజించుననినపారాశరీస్మృత్యుక్తమగు జపతపాదులకనుకూలమగు శుచిత్వార్థమాచరించుస్నానము నిత్యము, గ్రహణసంక్రాం

తులయందున, శునకకాకచండాలాది స్పర్శనముచేతను, మృతజన్మాశౌచనిమిత్తమును జేయుస్నానము నైమిత్తికమది యుష్ణోదకముతో జేయరాదు.

అమవస, వ్యతీపాతయోగము, రథసప్తమి, కార్తిక, మాఘముమొదలగు నదృష్టస్వర్గాదికామముచే నొనర్చు స్నానము కామ్యము, శరీరకాంతి, తుష్టి, పుష్టి, మలమార్జనముకొరకును జేయుస్నానము మలాపకర్షణమనబడును. మంత్రములచేతను జలావగాహనను వారుణము భస్మలేపనమాగ్నేయమనబడును. గోపరాగము వాయవ్యము మంత్రజలములచేతను మార్జనము మంత్రస్నానము నాభికిదిగువను ప్రక్షాళనమొనర్చి నూర్ధ్వశరీరమునుం దడిచేలముచే చాలనమొనర్చిన కాపిలమనబడును. అవ్యయుడానందుడు చిత్స్వరూపుడునగు విష్ణునిజింతించుట మానసము. ఆతపములో వర్షించునపు డొనర్చునది దివ్యస్నానము. శరీరసామర్థ్యములేనపుడును, దేశకాలముయొక్క వైషమ్యము వలన నీస్నానములు తుల్యములు. మానసస్నానము శ్రేయను. ఔషధసేవాసక్తుడై రోగమున రాజచోరాద్యుపద్రవమున ఆపోహిష్ఠాదిమంత్రముల మార్జనస్నానము విధించబడెను. గౌతములవారిచే జెప్పబడిన స్నానములు గౌణములు. గౌణస్నానములచే జపసంధ్యాదికమందు శుద్ధియగును గాని శ్రాద్ధదేవతార్చనలయందుపయోగించదు బ్రహ్మయజ్ఞమందు వికల్పము.

ఓయీ సకలకర్మములనాచరించుట కనుకూలమగు స్నానమదృష్టఫలమా దృష్టఫలమా దృష్టాదృష్టఫలమా యనిశంకిం యాగ్నేయవాయవ్యమంత్రస్నానాదులయందదృష్టఫలముదక్కనన్యముజూడమటువలెనే సకలస్నానములయందును కేవలమదృష్టార్థఫలదమె యంటిరా యదిగాదు. మరియేమనినస్నానము దృష్టాదృష్టార్థఫలదమని మునివచనములచేతను, ప్రత్యక్షముచే జెప్పెము.

అలక్ష్మియు, కాలకర్ణియు, దుస్స్వప్నమును, దుర్విచారమును, మంత్రరహితమైనను జలమాత్రస్నానముజేయువానికి కీడుసేయవని మార్కండేయపురాణము. కాలకర్ణియనగా ననాచారులకు బాధకురాలగు రాక్షసి. ప్రాతస్స్నానము దృష్టాదృష్టకరమై హితమనియు దీనిచే పూతాత్ముడగువాడన్నికర్మములకర్హుడనియును దక్షుడు. దృష్టఫలమనగా స్థూలశరీరనైర్మల్యారోగ్యములును మనఃప్రసన్నతయు నదృష్టఫలమనగా నీశ్వరార్పితజపయజ్ఞదానాదికము. వాటిచే నిష్పాపుడై జ్ఞానియగు నంత మోక్షసామ్రాజ్యప్రాప్తి యగునను నిందకుప్రమాణములు- నవరంధ్రములవలనదివారాత్రములుమలములను స్రవించునత్యంతమలినమగు కాయము ప్రాతస్స్నానముచే పరిశుద్ధమగునని మనువు.

ప్రాతస్స్నానమువలన నవచ్ఛిద్రితమై మలినమగు నీ దేహము పరిశుద్ధమగుట యేగాక ఉత్సాహము, మేధ, సౌభాగ్యము, రూపసంపదను, మనఃప్రసన్నతను గలిగించును. ప్రాతస్స్నానము అధికమగు చొంగ చెమట మొదలగువాటిచే నిద్రాధీనుడగు పురుషుడు తడపబడినను వానిని బరిశుద్ధునిజేయు నట్టుపైని మంత్రస్తోత్రజపాదులకర్హుడగును. గావున నరుణోదయకాలమున జేయు స్నానము సకలపాపనివర్తకమగు ప్రాజాపత్యసమమని పెద్దలు జెప్పిరి.

ప్రాతస్స్నానము పాపము నలక్ష్మిని గ్లానతను అశుచిత్వమును దుస్స్వప్నమును నశింపజేయును. తుష్టి పుష్టి మొదలగువాటినిచ్చును. దుష్టములగు నెవ్వియును ప్రాతస్స్నానముజేయువారిని నెచ్చటను స్పృశించవు. దృష్టాదృష్టఫలదంబుగావున ప్రాతస్స్నానమావశ్యకమని కాశీఖండము. ప్రాతర్మాధ్యాహ్నికస్నానముల గృహస్థుడును, తపస్వి త్రిసంధ్యలను జేయవలయునని యోగయాజ్ఞవల్క్య.

అభ్యంగస్నానము శరీరమార్దవమును జేయును. కఫవాతములను బోగొట్టును- ధాతువృద్ధిని జేయును. నలుగుబెట్టుటచే శరీరకాంతి బలమును గలుగును. శ్రమను, చమటను, వాయువును శమింపజేయును. భగ్నమగు సంధులను బాగుజేయును. నరుకుచే కాల్పుచే క్షతుడగువాడును, శరీరము చితికినవాడును వీరిపీడను బోగొట్టును. జలముచే తడచిన వృక్షమునందంకురములు బొడమునట్లు శరీరమందు ధాతువులు చమురురాయుటచే వృద్ధినొందును. నాడులు, రోమకూపములు, పెద్దనాడులు వీటివెంబడిని శరీరమునరాయు చమురు లోపలికి ప్రవేశించి స్నానమగుచుండ బలమును బుట్టించు నందుశరీరప్రకృతియు పరిణామము ఋతుభేదము దేశము వీటివలన బొడము దోషము వికారములును దెలసినబుద్ధిమంతుడు నభ్యంగాదికమందు తైలమైనను ఘృతమైన నుపయోగముజూచి శరీరమున రాయించవలయును. కేవలమామదోషమునందు తరుణజ్వరమందు నజీర్ణమందును విరేచనములగువాడు వమనములగువాడును నిరూఢుడును ముందురోగముయొక్క కష్టతయు నసాధ్యముగలిగిన స్నేహాలేపము తగదు. మిగిలినయగ్నిమాంద్యాదిరోగములు దీనిచేతను శమించును.

శరీరమందునలుగుబెట్టిన కఫము, వాతము, మేదస్సును క్షీణించును. అవయవములు దృఢమగును. చర్మము నున్నబడును. నాడీముఖములు స్పష్టమగును. చర్మమందలి పిల్లనరములు, జఠరాగ్నియు తేజమునొందును. స్నేహమర్దనముచేతను నలుగుచేతను బూర్వోక్తగుణములగును. స్త్రీలశరీరమునకు నలుగధికకాంతిప్రదము, సౌభాగ్యము, సంతోషము, నున్నదనము, లఘుత్వము మొ

దలకు గుణములును శరీరమునకు గలిగించును. మర్దనమైతే కండూతియు పాకకోశమందలి వాయువును హరించును. తొడలకు తృప్తియును స్థైర్యమును లాఘవమును గలిగించును. స్తంభించిన పాకకోశమందలి వాయువును శమింపజేయును. మలరోగములమాన్పును. చర్మగతమగు నగ్నినలరించును. నాడీముఖములరక్తము లెస్సనడచును. దద్రికండ్వాదిరోగములుగలవానికి నిష్టకతో తుష్టిగ మర్దనాజేసిన యవిశమించును. నిద్రాదాహ శ్రమ స్వేదకండూత్యాదులను హరించును. సకలేంద్రియములును బరిశుద్ధములగు గావున మలాపహరమైహృద్యమగును. తంద్రాతాపములు శమించును. పుంస్త్వమును వృద్ధినొందించును. రక్తమును స్వచ్ఛముగ జేయును. ఇదిమర్దనోద్వర్తనములనగుఫలము.

వేడినీళ్లతో శిరస్స్నానము నేత్రములకు హితకరము. చల్లనినీళ్లతో శిరస్స్నానము నేత్రములకు హితమగును. కఫవాయువులు ప్రకోపించునపుడు రోగబలమును దెలిసివైద్యుడుష్ణోదకముచే శిరస్స్నానము జేయింపవలయును. మిక్కిలీ చల్లనగుజలము శ్లేష్మవాయువులను బ్రకోపింపజేయును. మిక్కిలీ వేడినీరు వేసవిని పైత్యరక్తమును వృద్ధినొందించును. ఆయుష్ణోదకస్నానము జ్వరము, నతిసారము, కర్ణరోగము, వాతరోగము, కడుపుపొంగు, అజీర్తియు గలిగినను, భోజనముజేసినబిమ్మటను జేయతగదని సుశ్రుతులు.

స్నానముసేయని శరీరముయొక్క సకలావయవముల వేడి స్నానముచే సమతనొందును గావున స్నానముసేయవలయునని బాహటుడు.

స్నానము సర్వావయవములను శుద్ధినొందించి మలినమును బోగొట్టి దేహకాంతిని జేసును. కండూతిని, స్వేదమును, శ్రమను, పైత్యదాహమోహములనుశమింపజేసును. జఠరాగ్నిదీపనమును, ధాతువృద్ధిని, స్తంభనమును, పవిత్రమును, సకలరోగశాంతిని, హితవును, చిత్తశుద్ధిని జేయునని చరకము. నదనదీదేవఘాతతటాకసరోగర్త్మనిర్ఝరములలో నిత్యము స్నానమాచరించవలయునని కూర్మపురాణము.

నదీస్నానముత్తమము. తటాకమున మధ్యమము. కూపోదకము కుంభములతో దెచ్చినదియును సామాన్యము. ప్రాతస్సమయమున ప్రతిదినమును నదుల దేవఘాతములను స్నానమొనర్చవలయును. అటుల సంభవించకుండిన తటాకమున లేక నూతినీరులను స్నానముజేయదగును. నదికి వెళ్లుటకశక్తుడైన గృహమందు స్వయమైన భృత్యులు లేకశిష్యులచేతను దోడినసీళ్లను స్నానముసేయవలెనని విష్ణు.

శూద్రహస్తముచేతనైన నేకహస్తముచేతనైన నుద్ధృతమగు జలమున స్నానమొనర్చగూడదు. ద్విజులచేతను దేబడినయుదకమున స్నానముసేయదగునని పరాశరులవారు.

మనోహరము నిర్మలము నధికమునగు నదీజలముగలిగియుండగ కృత్రిమజలముల స్నానముసేయరాదని యోగియాజ్ఞవల్క్యులు.

పరులచేత్రవ్వబడిన జలాశయముననైదుమృత్పిండములనుదీసి వెలుపలవేసి స్నానమునుజేయవలె నటులైన ద్రవ్వించబడినవాడొనర్చు పాపముపొందదు లేకుండిన బొందునని మనువచనము.

అయిదుపిండములనుదీయుట కూపసేతువ్యతిరిక్త జలాశయమునందు కూపమున మూడుఘటముల జలమునుదీసి భూమిపైబోసి యాపైని స్నానమును జేయుమని బోధాయనులవారిచే జూపించబడెను. ఆయర్థమందు ప్రతిష్ఠనుజేయని జలాశయమునమాత్రము పంచపిండోద్ధృతిగాని ప్రతిష్ఠితమందు సర్వజనోపయోగముకొరకు విడువబడినది గాన పరకీయమనబడదని ప్రాచీనులుగొందరనిరి. అదియుక్తముగాదని హరిహరమిశ్రాదులు. ఎందుచేతననిన ప్రతిష్ఠనుజేయని జలము స్నానయోగ్యముగానిదౌటవలననుపయోగమెకాదు. పరద్రవ్యానుభవము కలుగుచునుండగా దొంగలించుటయ్యేను. పరులచేతను జేయబడుటే పరకీయమని దెలియబడుటయని మన్వాదిస్మృతులందుండెను. గాన ప్రతిష్ఠితజలాశయమందున బంచపిండోద్ధృతి యావశ్యకము. పంచపిండోద్ధృతినిజేయకనితరులజలమున స్నానమొనర్చినసందలి సగముఫలము జలాశయమును గల్పించువానికి గలుగునని స్కాందమందలి ధర్మఖండము.

హస్తచతుష్టయము ధనస్సు అట్టిధనస్సులెనిమిది వేలమట్టుకుగమనమొనర్చనది నదియనబడదు. అది గర్తమనబడునని ఛాందోగపరిశిష్టము.

శ్రావణాషాఢమాసములందున సముద్రిగాని నదులన్నియును రజోదోషముగలిగియుండును. ఉపాకర్మోత్సర్జనములయందు ప్రేతస్నానము చంద్రసూర్యగ్రహణములయందునుదప్ప స్నానమును జేయగూడదు. నదులందు ప్రథమమునవచ్చిన వరదనీటిని కలకనొందిననీరులలో గంగమొదలగు ప్రవాహాదులచే విచ్ఛిన్నములగు వాటిలో స్నానము జేయరాదని యోగియాజ్ఞవల్క్య. పంకిలములగు నిఖాతములయందొకప్పుడును స్నానముజేయరాదని కూర్మపురాణము. సింహకర్కటమాసమధ్యమమున సర్వనదులును రజోదోషము గలవగును. గంగా యమునా ప్లక్షగా సరస్వతీ గోదావరీ కృష్ణవేణియు మ

హోషదులు వీటియందునదప్ప నితరనదులను స్నానము చెయ్యరాదని స్కాంద మందలి ధర్మఖండము.

వార్షికదినములలోని మొదటివరదలో స్నానమొనర్చిన శరీరాపాయమగునని ఋషులచే నిషేధించబడెను. ప్రావృట్కాలమందలి నదీజలము పీనసకఫశ్వాసకాసలనుబుట్టించుననియును, క్రిమియు, కీటములును, పత్రములు, పంకమును, శంఖాదిగుల్లలు, తృణము, పట్టులుండినదియు, విషమార్గములనుంచివచ్చునదియునగు జలమును మతిగలిగినవాడు పానమును జేయరాదొకవేళజేసిన శీఘ్రముగ రోగియగునని వైద్యశాస్త్రము. పాననిషేధముచేతనె స్నానము నిషేధించబడెను. గంగాదిసముద్రగాములగు నదులు సర్వదా పవిత్రములని జూపించుటకును చంద్రసూర్యోపరాగాద్యావశ్యక కాలములయందు నదీస్నానమునంతాదరముచేతను రజోదోషములేదని మునులనిరని దెలియదగును. * * * * * *

అస్పృశ్యస్పర్శనమున, వాంతియు, నశ్రుపాతము, క్షౌరమందు నైమిత్తికస్నానము దేవపితృతర్పణములేకుండ జేయదగునని యాపస్తంబులు. నిత్యనైమిత్తికకామ్యభేదమున మూడువిధములై స్నానముచెప్పబడెను. వీటికవయవముగ తర్పణమన్యోనను బ్రహ్మపురాణమువలన సామాన్యముగ ప్రసక్తమగు తర్పణమునకు నివృత్తియని దెలియుడు. అజీర్ణమువలన పర్యుషితాహారవమనమునందును క్షౌరమొనర్చికొనియును మైధునమున దుస్స్వప్నమున దుర్జనస్పర్శమగునపుడు స్నానమును జేయుమని యముడు. తత్కాలాహారవాంతియందాచమనమాత్రమె జేయదగును. చండాలుని, మూషకము, శవవాహకుని, శవమునుస్పృశించియును, అజీర్ణవాంతమున, క్షౌరమొనర్చికొని, అయోనిమైధునమున, ఋతుకాలమైధునమున నవగాహనస్నానమొనర్చి దేవీరాపయనుమంత్రమునుబఠించిన బరిశుద్ధుడగునని హారీతుడు. గౌతములు పతితుని, చండాలుని, శవమును, దానిస్పృశించువానిని, సూతికాస్త్రీని, రజస్వలాస్త్రీని ముట్టినవాడు కట్టినబట్టలో స్నానముజేసిన బవిత్రుడగుననెను. శవాదిస్పర్శనమొనర్చిన వానినిముట్టిన వానిముట్టిన మూడవవాడు హస్తపాదములను గడగి యాచమించినబవిత్రుడగునని దేవలుడు. చండాలాదులతోనొకశాఖ నధివసించిన బ్రాహ్మణుడు స్నానమొనర్చి శుద్ధినొందునని యాపస్తంబులు.

కుక్కుటము, వానరము, మార్జారము, గాడిద, లొటిపిట, శునకము, సూకరము వీటియొక్క విష్ఠనంటిన గట్టినబట్టతో స్నానమొనర్చుమని

ర్గాసులు. శ్వ కాక కంక గృధ్రాదులవిష్ఠను మూత్రోత్సర్గమొనర్చి శౌచము నుజేయనివానిని స్పృశించిన సచేలస్నానమును జేయవలెనని లఘుహారీతులు. శ్వానమును, శ్వపాకుని, ప్రేతధూమము, గ్రామయాజకుని, దేవద్రవ్యముచే జీవించువాని, యూపమును, చితిని, చితికాష్ఠమును, మద్యము, నదియుంచుపాత్రను, పచ్చిదగుమనష్యాస్థిని, శవమును, దానిస్పృశించువానిని, రజస్వలను, మహాపాతకిని స్పృశించిన సచేలుడై యవగాహనస్నానమొనర్చి యగ్నినిస్పృశించి గాయత్ర్యష్టశతజపమును జేసి ఘృతప్రాశనమాచరించి దిరుగ స్నానమును జేసి ముమ్మారాచమించి బవిత్రుడగునని చ్యవనుడు. కామకృత్యమందగ్నిస్పర్శనగాయత్రీజపాదికము గూడ గావలయు నకామకృతమున స్నానమాత్రము జేయవలెనని యనుపైస్మృతివచనములకు తాత్పర్యము. అయోని పశు దివామైథునముల నుదకము లేనిచో విణ్మూత్రోత్సర్జన మొనర్చిన స్నానమొనర్చుమని సుమంతుడు. * * * * *

రోగియైనవాడు నైమిత్తికస్నానమొనర్చవలసినపుడు మరివకరు పదిస్నానములు జేసి యతనిబదిమారులు స్పృశించుచువచ్చిన యారోగి శుద్ధుడగునని యముడు. ... ... ... ...

సూర్యుడస్తమించినబిమ్మట, చండాలుని, పతితుని, సూతికాస్త్రీని స్పృశించిన యగ్నిని సువర్ణమును వియత్పథమును బ్రాహ్మణానుమతిచే జూచుట స్నానముజేసుటచేతను శుద్ధుడగును. రాతిరి జలాశయమున స్నానము జేయరాదు. పగలు తెచ్చియుంచిన నీళ్ల నాచమనమును జేయదగును. స్నానము గ్నిదీపనమను సుశ్రుతోక్తివలన నజీర్ణావస్థయందగు పర్యుషితవాంతియందు స్నానము దృష్టఫలమును బుట్టించేవాటచేత ననుమతమేను. క్షౌరకర్మను నఖకృంతమున రక్తస్రావమయ్యెనుగాననందుకొరకు స్నానము. మైథునానంతరమున స్నానము, విసర్జించుకొనుట, నిద్రించుట హితమగునని దృష్టఫలము సుశ్రుతమున జూపించబడెను. మరియును బశుయోనిని, రజస్వలగానియోనిని, దుష్టయోనిని మైథునమొనర్చిన పాండు, శ్వాస, అరోచక, వమన, హిక్కా, నాడీరోగ, కాస, హృద్రోగములకు ఉపదంశమనే సంజ్ఞ యదిబుట్టును, ఇంతియెకాదు. వాయుప్రకోపము వీర్యక్షయమునగును. దివామైథునమున తృష్ణ తృపాసలు మనఃక్షోభయు బుట్టును. బలము శుక్రము నశించును. వాతవృద్ధియగునని సుశ్రుతులు. స్నానముచేతను దుస్స్వప్ననాశనమగునను కాశీఖండోక్తమును బూర్వమగపరచియుంటిమి. పతితసంసర్గవలన పంచమహాపాతకుడగునుగాన నదలేకుండుటకస్పృశ్యోక్తియని యాచమనప్రకరణమునబ్రకటించితిమి.

కుక్కుట మార్జారోష్ట్రశునకకాకకంకగృధ్రము లభక్ష్యమాంసాదులనుభక్షించునస్పృశ్యతుచ్ఛజంతువులు గానవాటివిష్ఠయుశిష్టులచేముట్టరానిదగుటవలనస్నానమునకు హేతువు. ప్రేతధూమమనారోగ్యమును జేసును. దేవద్రవ్యోపజీవి దేవద్రవ్యములనువంచనగాదనజీవితమువరకనుభవించును. దేవునికర్పించినదీపములార్పి ఘృతతైలములగ్రహింతురర్చనజేయుటయందాదరులుగారు గానవీరలతిపాపులనియు- గ్రామయాజి యాజీవితమత్యాశను దుర్దానదురన్న దుష్ప్రతిగ్రహములను శౌండికరజకాదులవలన జేసి యాజనాధ్యయనదానములను స్వప్నమందైన నాచరించరుగాన వీరలస్పృశ్యులు మహాపాపులని జూపించుచు దుర్వృత్తమువలన నివారించుటకు మునులు బల్కిరి. యూపమునుముట్టరాదనుట వేదచోదిత కర్మలయందైన జంతుహింసాసాధనములకును హేయమగుటను బోధించుటకు. మద్యమతిహృద్యము దోషహేతువు కాదనియెవరు సేవించుదురో వారికి మతిస్మృతిబుద్ధులకు భ్రాంతికలవారలైహికహితాచరణమొనర్చక నిందితకర్మలను శేయుచు పతితులగుదురు గావున మద్యము దానినుంచినబాత్రయును స్పృశించుట యశుచిహేతువని చ్యవనులు చెప్పి మద్యపానమువలనబుట్టిన యనర్థమునువారించు నిచ్ఛకలవారలైరని దెలియదగును. మలస్పర్శనమనగా నన్యనిమలమును స్పృశించిన స్నానమని గ్రహించదగును. ఇతరమనుజుని యస్థి, క్రొవ్వు, మూత్రము, ఆర్తవము, మలము, రేతస్సు, నెదడు, రక్తమును స్పృశించిన యదిగడగికొని స్నానమొనర్చి యాచమించి శుచినొందుననియు నవి తనవి స్పృశించిన గడగికొనుటచే బవిత్రుడగుననియును దేవలవచనము.

ఉదకములేనిస్థలమున మూత్రపురీషోత్సర్జనమొనర్చినవాడు సచేలస్నానమును జేయుమనుటకు క్షాళనములేకుండ వస్త్రచ్ఛాదనమువలన వాటిసంపర్కము గలుగునని యది దృష్టఫలము. రజక, చర్మకార, వ్యాధ, జాలోపజీవులు, రంగులువేయువాడు, నటువు, వేషములువేయువాడు, ముఖభగుడు, సర్వవర్ణములవాళ్లతో వ్యభిచరించుస్త్రీ, తెలుకులవాడు, శౌండికుడు, వధించవిధించినవాని జంపువాడు, ఊరపంది, కోడి వీరలు శిరస్సుగాక మరియేఅవయవమును స్పృశింతురో ఆయవయవమును గడగి యాచమనమొనర్చిన శుద్ధుడగునని శాతాతపులు. శిరమును స్పృశించిన స్నానమొనర్చవలయును.

అమేధ్యోదకము సముద్రోదకము స్నానయోగ్యముకాదని శంఖలిఖితులు. చంద్రసూర్యోపరాగములను సోమాదిత్యవారయుక్తములగు పున్నమ యమవసలను కృష్ణాంగారకచతుర్దశి మొదలగు పర్వములను సముద్రస్నా

నమదృష్టఫలావాప్తి కొరకు జేయవలయు నీదినములుతప్ప నితరదినములనుస్నానముజేయ రాదు. అమవసను సోమసూర్యోపరాగములను కృష్ణాంగారక చతుర్దశిమొదలగుపర్వములను సముద్రస్నానమొనర్చెడివాని జన్మదుష్కృతము నశించుననియును శనికుజవారములనుదయవేళ నితర దినముల స్నానమును సంతతినిగోరువాడు జేయ రాదని బోధాయనులు. సముద్రోదకము త్రిదోషముల ను బలపౌరుషములను గలిగించునని చరకులు.

ఆదిత్యపురాణోక్తమగు నశ్వత్థజలస్నానమును జెప్పుచున్నారము.

గురువారమున దర్శను రావిచెట్టుఛాయను స్నానము జేసిన ప్రయాగస్నానతుల్యమై సకలపాతకముల నశింపజేసును. పారిజాతమను గ్రంథమందశ్వత్థచ్ఛాయ గజచ్ఛాయయని జెప్పబడును గాన అమాగురువారసంయోగము నూరుపర్వములకంటెనధికము.

బృహస్పతిప్రార్థన మంత్రార్థమును జెప్పుచున్నారము. జీవః బృహస్పతిః సూరిః ఆచార్యః గురుః అంగిరాః వాచస్పతిః దేవమంత్రిః నాకెల్లప్పుడును శుభమును జేసుగాత. ఈ నామను లెనిమిదిచేతను స్నానానంతరమున బ్రార్థించవలయును.

అభ్యంగమునందును మంగళస్నానమొనర్చునపుడును సర్వదా గృహమున శీతోదకస్నానము జేయరాదు. గోపీచందనధారణము కూడదనియు నుదకములు స్వయము పవిత్రములగ్నిసంపర్కముగలిగిన యతిపవిత్రములదికారణమువలన సత్పురుషులుష్ణోదకమును శస్తముగ స్నానమునకు ప్రశంసింతురు. సంక్రాంతిని గ్రహణమున దర్శను బర్వముల గృహమందైనను శీతోదకస్నానమె జేయవలయును. అభ్యంగమాంగళ్యవ్యతిరిక్తోష్ణోదకవ్యతిరిక్త స్నానబోధకములగు పైవచనములశక్తవిషయములని తెలియదగును. సూర్యకిరణములచేతను దిరుగనగ్నిచేతను బవిత్రితములగునుదకములు రోగి స్నానమొనర్చుటకు ప్రశస్తములు- శీతలోదకములుగావని యముడు.

ఆతురుడుష్ణోదకస్నానమునుజేయువిధిని జెప్పేము. పాత్రయందు నశీతోదకముంచి దానిలోనుష్ణోదకమునుబోసి శంనోదేవీ, ఆఘాయుతంతు, ద్రుపదాదివ, ఋతంచ, ఆపోహిష్ఠా అనునైదురుక్కులచే నభిమంత్రించి ఇమంమేగంగేయనుమంత్రములచే తీర్థస్మరణజేసి స్నానమొనర్చదగును. గృహమున సంకల్పమాచమనాఘమర్షణతర్పణములు లేవు. స్నానానంతరమందాచ

మనమార్జనములొనర్చవలె. సంకల్పసూత్రపఠనము మార్జనము నఘమర్షణము దేవర్షి పితృతర్పణము నీవైదును గృహస్నానమునలేవని ధర్మఖండము.

నద్యాదికమున స్నానముజేసి జపతపస్తర్పణాధికారి యగునని యు లేకుండినగాడనియు నిత్యమును నదీతటాకనిర్ఝరాదికమున స్నానముజేయుమ ని దృష్టాదృష్టఫలమును సంపాదనజేసుటకొరకు మునులుపదేశమును జేసిరని జెప్పుచున్నారము. అభ్యంగమాంగళ్యాదులందున తైలఘృతాదిక ముష్ణోదక ముచేత నతిసులభముగ బోవునని యుష్ణోదకస్నానోపదేశమును జేసిరి.

సం క్షే ప స్నా న వి ధి.

నది మొదలగు జలాశయమునుగూర్చి వెళ్లి శిఖనుముడివేసి జానువుల లోతుకమించిన జలమందు నిలువబడి యంతకుతక్కువజలమున గూర్చుని యా చమించి శరీరముచేతను వాక్యములవలన సంకల్పముతో జేయబడినదోషము ని వర్తనపూర్వకముగ సకలకర్మలయందున శుద్ధిసిద్ధించుకొరకు ప్రాతస్స్నాన మును జేసెదనని సంకల్పమునుజేసి యుదకమునకు నమస్కరించి నదియందు ప్రవాహాభిముఖుడై సరస్తటాకాదుల సూర్యాభిముఖుడైముమ్మారుములిగి య వయవములదోమి దిరుగస్నానమొనర్చి రెండాచమనములను జేసి యాపోహి ష్ఠామయనుమంత్రమునమార్జనమొనర్చి ఇమంమేగంగేయను మంత్రముచ్చరించు చు జలను ముమ్మారుగలిపి త్రిరావృత్తాఘమర్షణము యాజుషులు, ఋతంచ యనుసూక్తమాశ్వలాయనులు, ద్రుపదయను ఋక్కుచేతను కాత్యాయనులు మార్జనముచేసి జలపర్యంతము శిరస్సును వంచి యవగాహనమొనర్చి యాచ మించి జలతర్పణమాచరించవలెను.

ఉపవీతియై బ్రహ్మాదులగు నేసకలదేవతలుగలరో వారలందరికిని తర్పణమునుజేయుచున్నానని భూలోకదేవతలను, భువర్లోకదేవతలను, స్వ ర్లోకదేవతలను, భూర్భువస్స్వర్లోకదేవతలను ప్రత్యేకప్రత్యేకముగ వీరిగణము లకు, పత్నులకును, పుత్రులకును, పౌత్రులకును తర్పణమొనర్చెదనని, నివీతియై కృష్ణద్వైపాయనులు మొదలగు నేసమస్తఋషులుగలరో వారినందరికిని తర్ప ణమును జేయుచున్నానని భూలోకఋషులను, భువర్లోకఋషులను, స్వర్లోక ఋషులను, భూర్భువస్స్వర్లోకఋషులను తర్పణమొనర్చుచున్నానని ప్రత్యేక ప్రత్యేకముగ వీరిగణములకు, పత్నులకు, పుత్రులకు, పౌత్రులకును, ప్రాచీ నావీతియై సోముడు, పితృమంతుడు, యముడు, నంగిరసుడు, అగ్నిష్వాత్తు డు, కవ్యవాహనుడు మొదలగు నేపితృదేవతలుగలరో ఆపితృదేవతలను తర్ప

ణమొనర్చుచున్నానని భూలోకపితృదేవతలను, భువర్లోకపితృదేవతలను, స్వర్లోకపితృదేవతలను, భూర్భువస్స్వర్లోకపితృదేవతలను తర్పణమొనర్చుచున్నానని ప్రత్యేకప్రత్యేకముగ వీరిగణములకు, పత్నులకు, పుత్రులకు, పౌత్రులకు తర్పణమొనర్చవలెను.

విధిస్నానమున శరీరమందు మృద్గోమయలేపనము తిలతర్పణాదిక మధికమని జెప్పుచున్నారము. శుద్ధమగు మృత్తు దర్భలును తిలలు గోమయమును దెచ్చి శుభ్రస్థలమునందుంచి యాచమించి స్నానమాచరించవలెను. నడుముకుగట్టి శిఖముడివేసి జలమధ్యమునొంది ఊరుంవైహీయను మంత్రముచే నుదకమును హస్తముచేచుట్టుగదీసి యటుపైని ఏతేశతమను మంత్రజపము నుదకప్రార్థనకొరకు జపమొనర్చి సుమిత్రియానో యనుమంత్రముతో నుందుగా జలాంజలియొనర్చిదుర్మిత్రియాయనుమంత్రమునుజపించుచు శత్రువునుగూర్చియా జలము నూర్ధ్వముఖముగా విడువవలయును. ఇదంవిష్ణురనుమంత్రమును జపించి మృత్తికచేత నవయవలేపనమొనర్చవలెను. ఒకపర్యాయము మృత్తికచే శిరమును, రెండుపర్యాయములు నాభికిపైని, నాభికిదిగువున మూడుమారులు, పాదములనారుమారులును మృచ్ఛౌచమాచరించదగును. ప్రవాహాభిముఖుడగుచు నాపోఅస్మాననుమంత్రమును జపించుచు ఉదిదాభ్యశ్శుచియనుమంత్రమున్మజ్జనమున సమ్మతము మానస్తోకమనుమంత్రమునుబఠించుచు గోమయముచే గాత్రలేపనమొనర్చవలెను. ఇమంమేవరుణయనుమంత్రములచేతను స్నానమొనర్చి యభిషేకమును జేసికొనవలెను.

తత్వాయామితధోత్పన్నః సత్వాన్నశ్చాప్యుదుత్తమం। ధామ్నోధామ్నా। అపామోషధీః। యదాపొరఘ్న్యాముంచంతు। మేతించావబృదా అనునీమంత్రములు ఆత్మాభిషేచనమందు వినియోగములై చెప్పబడెను. అటుపైని వేత్తయగు బ్రాహ్మణుడు మహావ్యాహృతులతోగూడ ప్రణవముచేతను దననుబవిత్రునిజేసికొనదగు నటుమీద నేర్పరియగునతడు గాయత్రిచేతను ఆపోహిష్ఠామయనుమూడుమంత్రములచేత నభిషేచనమొనర్చికొనవలె. ప్రతిబుక్కు నతిపవిత్రము. ఇదమాపోహావిమ్మతీ। దేవీరాప। ఆపోదేవా। ద్రుపదాదివ। శంనోదేవీ। ఆపోదేవీ। అపాంహిరసం। పునంతుమే। ఈమంత్రములు పావమాన్యములని జెప్పబడు నాపైని యఘమర్షణము ద్రుపదాయనునది యాబిమ్మట విధినతిక్రమించకుండ ప్రాణాయామము లేనియడల నంతర్జలమందు జపముజేయువలెను. లేక ప్రణవము ముమ్మారు జపించవలెను. లేక విష్ణువును స్మరించవలెనని కాశీఖండము.

అధీత వేదులగువారొనర్చు స్నానవిధిని జెప్పి వేదమంత్రములందధికార ములేనివారికనురూపమగు పద్మపురాణోక్త స్నానవిధినిగూడ జెప్పుచున్నారము.

భావశుద్ధియు నైర్మల్యము స్నానమును జేయునివానికి బుట్టవు. గాన స్నానము మొందుగా జెప్పబడెను. తోడితెచ్చినయుదకమందైన లేక జలాశయమందవగాహనస్నానమైనను జేయదగును. మంత్రవేత్త అష్టాక్షరీమూలమంత్రముచే తీర్థమును గల్పించుకొనవలెను. నియమముగలవాడగు శుద్ధుడు దర్భపవిత్రధారియై యాచమించి నాలుగుహస్తములు చతురముగల ప్రదేశమును గల్పించి చెప్పబోయ్యెడి మంత్రములచే నేర్పరి గంగనావాహనను జేయదగును. విష్ణుపాదమునందుంబుట్టితివి విష్ణుసంబంధురాలవు విష్ణువుచేగౌరవము జేయబడినదానవు. జన్మ మొదలు మరణపర్యంతమును నేజేసిన పాపములవలన రక్షించుము. జహ్నుపుత్రీ నాయు దేవునిచే జెప్పబడిన దివిభూమ్యంతరిక్షముల యందుండిన మూడుకోట్లనేబదిలక్షలతీర్థములు నీయందుగలవు. దేవతలయందు నందిని, నలినయని, బృందా, పృథ్వీ, శుభగా, విశ్వకాయా, శివా, సీతా, విద్యాధరీ, సుప్రసన్నా, లోకప్రసాధనీ, క్షేమ్యా, జాహ్నవీ, శాంతా, శాంతిప్రదాయినీయనియు నీపుణ్యనామములను స్నానకాలమున స్మరించినవానికిమూడురూపములై స్వర్గమర్త్యపాతాళములను బ్రవహించిన గంగ సాన్నిధ్యమును జేసును. హస్తసంపుటమందారునొకమారభిమంత్రించిన జలమును మూడైన నాల్గైన నైదైన యారునొకటియైన బర్యాయములు శిరమున సేచనమొనర్చదగును. విధానముచొప్పున మృత్తికనభిమంత్రించి యారీతిని స్నానమును జేయవలయునని మృత్తికాభిమంత్రణమును జెప్పుచున్నారము. ఓమృత్తికా శుద్ధిహేతువగు గుర్రపుపాదములచే నాక్రమించబడియును, రథసంచరణముచేతను త్రివిక్రమావతారమున విష్ణుపాదముచే స్పృశించబడియును, శుద్ధురాలవై సర్వధనములను ధరించుచున్న నీవీస్నానకర్మయందు నాశిరముచే ధరించబడినదానవై నాచేజేయబడిన పాపములను హరించుము. ఓమృత్తికా నీవు కృష్ణవర్ణము నూరుబాహువులునుగల వరాహావతారమునొందిన విష్ణువుచేతను బూర్వముద్ధరించబడితివి. నాశరీరమునధివసించి సకలపాపములను బోగొట్టుమా యోగ్యమగు వ్రతురాలా సర్వలోకోత్పత్తికిజననురాలా మీకొఱకు నమస్కారమౌగాక.

మూలమంత్రమున కేకవచనముగా నిర్దేశించుటచేతను ఆమంత్రము లేకుండ నుద్దేశమునకు సార్థకములేకపోవుటనుంచియు వారునొకమారభిమం

త్రించినయజ్ఞాస్థి విభూతిచేతనుగూడ స్నానముచేయవలెగాని తదితరమంత్రములు మాత్రమె గ్రహింపదగునని భ్రమనొందరాదు. మొదటిమంత్రముచేతను మృత్తునభిమంత్రించి యదిశరీరమున లేపనమొనర్చి యవగాహనస్నానమొనర్చవలెను. పురాణశ్రవణాధికారమన్నివర్ణములవారికిని గలుగుటచేతను కొందరికి మాత్రమె కలదనుప్రమాణము లేకుండుటనుంచియు నన్నిశాఖలవారికన్నివర్ణములకు నీస్నానవిధిసాధారణమైనది. వేదాధ్యయనములేనివారికి మంత్రాధికారములేనందున నీస్నానవిధిప్రశస్తము. గోమయలేపనముస్నాదరోగులకు ప్రశస్తమనియు నలక్ష్మీపరిహారమనియు శుద్ధికరము పుణ్యమనియు చరకమునదృష్టఫలముగూడ నగపరచెను. నదుముగట్టి స్నానముజేసుటచే గట్టినవస్త్రము జారకుండును, ... ... ... ... *

గంగాదిపుణ్యనద్యుదకములు పాపము రోగములు మొదలగువాటిని బోగొట్టునని శ్రుతిస్మృతిపురాణేతిహాసములవలన లోకవ్యవహారముచేతను గనపడుచున్నది. ఇంతియె కాదు- పుణ్యగిరిమొదలగు ధారలు అస్థులతోనున్న మృణ్మయపాత్రలనుదమజలములచేత నారునెలలకు శిలలనుజేయుచున్నవి. ఇది ప్రత్యక్షమువలన జెప్పుచున్నారము. ఆయాప్రదేశముల జలములయందనేకగుణములు గలిగియున్నవి.

నద్యాదిజలగుణములు.

నద్యాదులగుణములను ప్రత్యేకము మహర్షులుచెప్పిరి. అట్టివైద్యశాస్త్రరచనను జూపించుదుమనుమోదింతురుగాత.

గంగోదకము శీతము స్వచ్ఛమతిరుచిప్రదము పథ్యమగ్నిదీపనము పాపమును తృష్ణామోహములను బోగొట్టు నాహారపాచనమొనర్చును. ప్రజ్ఞనుగలిగించును. త్రిదోషములనుగొట్టును. లఘువయుండును. మనోహరము.

యమునానద్యుదకము పైత్యదాహశ్రమనివారకము, పాచనరోచనములను, వహ్నిదీపనమును, బలమును జేయును. వాతమును బుట్టించును.

నర్మదోదకము పిత్తకఫములను బుట్టించును. చులకనై, శీతలమై, రుచిగలదై, మధురమై, పథ్యమై యుండును.

సరస్వతీనదీజలము స్వాదు పవిత్రము రుచియును దీపనమును దేహకాంతియును జేయును. లఘువై సర్వరోగములను శమింపజేయును.

చంద్రభాగయమునానద్యుదకము కలుషితగుణసామ్యమునిచ్చును. శీతలము

డాహపిత్తములణచును వాతమును జేసును. మధుమత్యుదకమగ్నిదీపనము. ఈ నదియును చంద్రభాగయు కాశ్మీరదేశీయములు.

శతద్రు, విపాశ, సింధు- ఈమూడునదులయుదకములును శీతలము, లఘువు, స్వాదు, నిర్మలము, దీపనము, పాచనము. సర్వరోగములనుబోగొట్టును. బుద్ధిని మేధను బలము నాయువు నిచ్చును.

శోణభద్రయనునద్యుదకమత్యంతరుచినిజేయును. సంతాపమును, శోష ను శోషింపజేయును. వహ్నిదీపనము, పథ్యము. క్షీణించినశరీరమునకు పుష్టి నిజేసి బలమునిచ్చును. ... ... ... ...

తాపీవేత్రవతులనునదులయుదకములు కాంతిని తుష్టినిపుష్టిని యగ్నిదీప నముపాచనమును జేసును.మధురమైయుండును.మనుజులపానమునకుప్రశస్తము.

పయోష్ణియనునదీజలము రుచియు, పవిత్రము, లఘువు. పాపములను, సర్వరోగములను బోగొట్టును. బలకాంతులనిచ్చును.

వితస్తయనునద్యుదకము త్రిదోషములను తాపజాడ్యమును గొట్టును. ప్రజ్ఞను పుష్టిని బుట్టించును. లఘువు పథ్యమునై యుండును. ఈవితస్తయనునది కాశ్మీరదేశమందుండెను. ... ... ... ...

సరయూనదీజలము స్వాదై బలమును పుష్టియునిచ్చును.

గోదావర్యుదకము పైత్యరక్తపీడలను పాపమును తృషను కుష్ఠు దుర దలు మొదలగురోగములను బోగొట్టును. వహ్నిదీపనమును పాచనమునుగలి గించును. ... ... ... ... ...

కృష్ణానద్యుదకము పైత్యరక్తప్రకోపమును జాడ్యమును జేసును. పవి త్రము స్వాదునయ్యుండును.

కృష్ణవేణీజలము దీపనము పాచనము రుచ్యము స్వస్థమునయ్యుండును.

తుంగభద్రోదకము తరుచుగ స్నానమొనర్చెడివారలకు శైత్యముజేసు ను.కటుపిత్తరక్తమునుగలిగించును. స్నిగ్ధమైనిర్మలమైగురువై స్వాదయ్యుండును.

కావేరీజలము శ్రమను దద్రుకుష్ఠాదిరోగములను బోగొట్టును. మేధ ను బుద్ధిని రుచిని దీపనమును జేయును. స్వాదును లఘువునై యుండును.

పూర్వదేశమునబుట్టిన నదులన్నియును వాతకఫములను జేసును. పశ్చి మదేశోద్భవములు కఫవాతములను బోగొట్టును. పిత్తమును జేసును. నిర్మలోద

కములు శీఘ్రముగ నడచునవియును పశ్చిమసముద్రగాములునగు సకలనదులును పథ్యములు. ఇందుకు విపరీతములు రోగమును జేయును. రాతినిదగిలి యొరసిపడు నుదకములును హిమాచల మలయాచలముల బుట్టినవియునగు నదులు పథ్యములని చరకులు. ... ... ... ...

పశ్చిమాభిముఖములగు సకలనదులును తేలికగు నుదకములగుటచేతను పథ్యములు. పూర్వాభిముఖములు బరువగునుదకములగుటచేత ప్రశస్తములు గావు. దక్షిణాభిముఖములు సాధారణములగుటవలన విశేషదోషమును జేయవని సుశ్రుతము. ... ... ... ...

ప్రస్రవణోదకములు నిర్మలములు లఘువును మధురమునై రోచనమును దీపనమును జేయును. ... ... ... ...

పర్వతాగ్రమునందుండు నుదకము శ్లేష్మవాతములను జేయును. దుర్గంధమును పిచ్ఛలమును జేయును. పైత్యతిక్తములను హరించును. ఇంచుకంతయయుండుజలము శుక్లవృద్ధియు సుఖము దీపనము బలము లఘూష్ణమును జేయును. పైత్యకఫానిలములనుబోగొట్టును. * * * *

తటాకోదకము పైత్యమును కఫవాతములను శమింపజేయును. మధురము సమస్తరోగములందును మనోహరము. బలమును కాంతిని రుచిని బుట్టించును. మధురమయ్యుండును. ... ... ... ...

వాపియందుండునుదకము శ్లేష్మవాతములను పైత్యమును బోగొట్టును. శరీరాగ్నిని దీపింపజేయును. ... ... ... ...

కూపోదకము లఘువై దీపనమై బలప్రదమైయుండును. త్రిదోషములను వాటివలనబుట్టు సకలరోగములనుబోగొట్టును-సర్వకాలములందును పానార్హము.

ఆయా ప్రదేశజలముల జలకమాడిన దృష్టఫలమెటులగునటు లదృష్టఫలమును బుట్టును. సర్వజ్ఞులు సత్యవంతులు నియతవ్రతులు మునులు వారుచెప్పిన యదృష్టఫలములందును నమ్మకముంచవలెను. దీనికి హేతువు కాశీఖండమునందీయడుగున వ్రాసినటుల జెప్పబడెను.

భూమియందగు తీర్థములకు పుణ్యముగలుగుటకు హేతువును విను. శరీరమందగు కొన్నియవయవములకు పవిత్రతగలుగునని యటులసమ్మతింతురో అటువలెనే ఆయాభూప్రభావమువలన అద్భుతమునుంచి యుదకముయొక్క తేజముచేతను మునీంద్రులపరిగ్రహమునుండి తీర్థములకు పుణ్యత జెప్పబడినదని.

## వస్త్రధారణవిధిః

అథాతో వస్త్రధారణవిధిం వ్యాఖ్యాస్యామః॥ అథ స్నానానంతరం వస్యతే అనేనాంగమితి వస్త్రం వసఆచ్ఛాదనే తస్య ధారణప్రకారం బ్రూమః॥ స్నాత ఏవ సోష్ణీషే ధౌతవాససీ బిభృయాదితి విష్ణుః। ఉష్ణీషధారణం శిరోజలప్రచ్యవార్థమాచమనాత్ప్రాక్॥ శీతవాతోష్ణసంత్రాణం లజ్జాయా రక్షణం వరం। దేహాలంకరణం వస్త్రమితో ధార్యం సదా జనైః॥ దక్షిణోత్తరయోః కట్యోః కక్ష్యాం బధ్నాతి వై ద్విజః। నాభౌ చ వామకుక్షౌ చ పృష్ఠే చైవ యథాక్రమం॥ అష్టహస్తం నవం శ్వేతం సదశం ధౌతమంబరం। శుష్కం చ ధారయేద్విద్వాంత్సర్వకర్మసు పావనమితి వశిష్ఠః॥ నగ్నః కాషాయవాసాః స్యాన్నగ్నః కౌపీనకేవలః। నగ్నస్సంధితవస్త్రశ్చ నగ్నో నిర్దశవస్త్రక ఇతి హారీతః॥ దగ్ధం శీర్ణం చ మలినం మూషకోపహతం తథా। ఖాదితం గోమహిష్యాద్యైస్తత్త్యాజ్యం సర్వదా ద్విజైరితి యాజ్ఞవల్క్యః॥ అష్టహస్తం ద్వాదశాంగుళవితస్తిద్వితయపరిమితహస్తాష్టకదైర్ఘ్యం తద్ధారయితుం నాతివిస్తారం నతను రిత్యేవమర్థం। నవం ఛిద్రరహితమవయవాచ్ఛాదకం దర్శనీయం చ భవత్యేవ। శ్వేతవస్త్రధారణేనాతివదృష్టఫలమనువదంతి చరకాదయో మునయః॥ శ్వేతం దుకూలం మజ్జాసృగోజోబలవివర్ధనం। కఫకృత్పిత్తశమనం శ్రమతృడ్దాహనాశనం॥ సదశమచ్ఛిన్నవస్త్రధారణనియమం దర్శయితుం। ఉత వాససోదశాంఛి[illegible]ధాత్రీతి పిండసమర్పణే దశచ్ఛేదనమన్యేషు సదశస్యైవ ధారణమనుజ్ఞాతం। ధౌతం మలిననిరాసార్థం। శుష్కమార్ద్రవస్త్రధారణేన రుగ్ణో భవేదితి। కాషాయవసనాని యతీనాం న తు గృహిణాం। తస్మాదవిధినా కృతమకృతప్రాయత్వాన్నగ్నత్వం కేవలకౌపీనాచ్ఛాదికో అనాచ్ఛాదితకట్యాదిర్భవేదితి। కట్యతే ఆవ్రియతే వస్త్రాదినేతి కటిః। కట్యా వస్త్రావరణయోః। తస్మాదనావృతజఘనవాన్నగ్న ఏవ। సంధితవస్త్రం నామ కర్తయిత్వా సూత్రేణ సంధితం పాజామేతి పఠంతి తురుష్కాదయః। యోంతర్వస్త్రమనాదృత్య తదేవ కేవలం ధృత్వా దర్శయత్యదర్శనీయ్యావయవమితి నగ్నత్వగ్రహణం॥ దగ్ధ శీర్ణ మలిన మూషకోపహత గోమహిష్యాదిఖాదితధారణేన ద్రష్టౄణామరమ్యం చావయవదర్శనం దారిద్ర్యాదిసూచనం చ భవేదితి॥ ఏకవస్త్రో న భుంజీయాన్న కుర్యాద్దేవతార్చనం। న కుర్యాత్పితృకర్మాణి దానహోమజపాదికమితి స్కాందే॥ వికచ్ఛోనుత్తరీయశ్చ నగ్నశ్చాతంత్ర ఏవ చ। శ్రౌతస్మార్తం తథా కర్మ న నగ్నశ్చింతయేదితి భృగుః॥ ఉత్తరీయధారణేన శీతవాతోష్ణత్రాణ దేహాలంకరణం చ స్యాదితి॥ న రక్తముల్బణం వాసో న నీలం చ ప్రశస్యతే। మలాక్తం చ దశాహీనం వర్జయేదంబరం బుధ ఇతి నరసింహపురాణే॥ నీలరక్తం తు

తాంయది సమీపతోజయః॥ వామైశ్చపాదైరభితాడయంతో మహీం ప్రవేశాయ
భవంతిపత్యుః।సంధ్యాసుదీప్తామవలోకయంతో హేషంతిచేద్బంధపరాజయా
య। అతీవ హేషంతి కిరంతివాలాన్నిద్రారతాశ్చ ప్రవదంతియాత్రాం। రోమ
ప్యజోదీనఖరస్వనాశ్చ పాంసూన్గ్రసంతశ్చ భయాయదృష్టాః। ముహుర్ముహు
ర్మూత్రశకృత్కరోతి నతాడ్యమానోప్యనులోమయాయి। అకార్యభీతోశ్రువి
లోచనశ్చ శివంనభర్తుస్తురగో విధత్తె। సముద్గవద్దక్షిణపార్శ్వశాయినః పాదం
సముద్ధృత్యచ దక్షిణంస్థితాః। జయాయ శేషేష్వపి వాహనేష్విదం ఫలం య
థాసంభవమాదిశేద్బుధః॥ ఆరోహతి క్షితిపతౌ వినయోపపన్నో యాత్రాను
గోన్యతురగంప్రతిహేషదేచ। వక్త్రేణతుస్పృశతిదక్షిణమాత్మపార్శ్వం యోశ్వ
స్సపత్యురచిరాత్ప్రతనోతి లక్ష్మీం॥ ప్రద్వేషోయవసాంభసాం ప్రపతనం స్వే
దోనిమిత్తాద్వినా కంపోవావదనాచ్చ రక్తపతనం ధూమస్యవాసంభవః। అ
స్వప్నశ్చ నిశీథిరాత్రిషు దివా నిద్రాలసధ్యానితా సాదోదుర్మనసాం విచేష్టిత
మిదం నేష్టంస్మృతంవాజినాం॥ అవరోహణమన్యవాజినాం పల్యాణాదియుత
స్యవాజినః। ఉపవాహ్యతురంగమస్యవాకల్యప్త్యేవవిపన్నశోభనా॥ హాలాస్య
ఖండే॥ పాతేకందుకవద్ధిస్తౌచగిరివద్దేషారవేమేఘవన్నేత్రేనీరజవజ్జవేపవనవ
చ్చాస్ఫాలనే సింహవత్। విన్యాసే నటవన్ముఖేకులవధూవక్త్రాబ్జవద్వాజినాం
యేషాంతే భువిరాజవాహనపదే సంభావనీయాస్సదా॥ ఉపచితబలశోభాస్స
త్వసారైరుపేతాస్సురభితకుసుమాభాశ్శంఖమేఘాభినాదాః। బహువిధశుభవ
ర్ణాస్సంహతాంగాస్సురూపాశ్శుభగతిజవయుక్తావాహపర్యాస్సునేత్రాః॥ జీ
మూతవద్ఘోషనమేఘహేషిత స్స్యాద్వాస్యగంధో గజసింహగామీ। ప్రియశ్చ
మాత్స్యశ్చ విలేపనేచ సోప్యశ్వరాజో నృపవాహనస్స్యాత్॥ నిదానే॥ యద్గే
హాంగణభాగే హేషంతి హయాస్తు నిత్యశోమధురం। తద్గేహేనివసంతి శ్రీః కీ
ర్తిః పుష్టిరాయుశ్చ॥ క్రౌంచద్విపహారిఘనవద్ధేషంతి హయా రిపోర్వినాశాయ।
సౌభాగ్యాయచ సతతంశంఖవదంభోధివత్కీర్త్యై॥ గర్దభవద్వాయసవన్మార్జా

లవదుష్ట్రవచ్చకౌశికవత్। హేషంతివాజినో యది పత్యుర్నిత్యం భయంగదశ్చ
స్యాత్। మధురం క్రమోచ్చమద్ధృతవదన మవిస్పష్టదంతమనునాది। హేషితమి
హనాషణాంమచ్ఛిన్నం సకలసిద్ధిదంభర్తుః। కటుహీనతరమనిత్యం ఛిన్నమధో
ముఖమనాదివివృతాస్యం। పత్యురనిష్టదమాహు ర్యదపి స్యాదశ్రుకంప ధూమ
యుతం॥ సాదిలక్షణమాహ శాలిహోత్రః॥ దృఢాసనోర్ధతత్వజ్ఞో జితముష్టి
ర్నిరాలసః। అవిరాగీస్థిరశ్చాపి షడ్గైతేవాజివాహకాః। చిత్తంయోనైవజానా
తి తురగస్య సమాసతః। నవహంతి హయస్తస్య దండపాతేన తాడితాః। శనై

స్తువాహమేతత్పూర్వం పశుతుల్యంసమావిశేత్ । నవక్రో నచచోత్తానో నకు బ్జో నాప్యధోముఖః। నభవేత్సన్నగాత్రస్తు సభవేదశ్వవాహకః। స్థిరో యుధిర పాదశ్చ స్థిరోన్నతశిరాసనః। దక్షిణాదితురగస్య చాసనేద్భృశకస్సదా। అశ్వ వాహాస్సమాఖ్యాతాశ్శేషాస్స్యుర్భారదాయకాః॥ ఉత్క్షిప్తా శిథిలా తథోత్తర వతీ మందాచవైహాయసీ విక్షిప్తైకకరార్ధకం ధరసమోత్కృష్టావిభక్తా తథా।

అత్యుత్క్షిప్తతలోద్ధృతేఖలుతథావ్యాగూఢగోకర్ణకే వాహానాం కథితాశ్చతుర్ద శవిధా వల్గాప్రభేదా అమీ॥ ప్రేరణలక్షణం॥ వాహానాంప్రతివాహానాం షడ్వి ధం ప్రేరణంవిదుః। రాగవల్గకశాపార్ష్ణిప్రతోదరవభేదతః॥ స్రక్వాధరోష్ఠసిత

ఫేనలవాభిరామం ఫూత్కారవాయుపదమున్నతకంధరాగ్రం। నత్వోపకుంచి తముఖం నవరోహసాధ్యమశ్వంచతుష్కసమయే ముఖసిద్ధమాహుః॥ లఘ్వీమ ధ్యాచ దీర్ఘాచ జ్ఞాత్వైతా యోజయేత్క్రమాత్। వీధ్యస్తిస్రోధధారాణాం లఘ్వీమధ్యోత్తమాఃక్రమాత్। తాసాంస్యాద్ధనుషాంమానమశీతిర్నవతిశ్శతం। శ్రేష్ఠమధ్యోత్తమానంచ వాజినాం వీధికాస్స్మృతాః। నవాన్యాఃకథితా వీధ్యో దుష్టానాంక్రమణక్రమే। అన్యేషామపిసర్వత్ర గతిబాధ్యాత్సమీరితాః॥ సమో న్నతానా విషమాంబుకీర్ణాశుద్ధానతాగాత్రతృణవీరుహాఢ్యాం। స్థానుప్రకీర్ణోప లసంప్రకీర్ణాపాంస్వోన్నతోత్తానపదేతి వీధ్యః॥ సర్వవీధిషు యో వాజీ దృష్టశి క్షామశంకితః। తేనరాజారణేనిత్యం మృగయాయాంముదంవ్రజేత్॥ ఉరశ్చారీ శిరశ్చారి పృథులోబద్ధమానసః। ఆలీఢశ్శోభనైరంగైః ప్రత్యాలీఢస్తథాపరః॥ చలకిసలయపాదః కర్ణమష్ట్యేకదృష్టిశ్చలతి కటిదేశస్థానకే సంస్థితశ్చ। హ యహృదయమతిజ్ఞస్స్వానదండావపాతీ సఖలు తురగయోగ్యః పూజ్యతే పార్థి వేంద్రైః॥ హాలాస్యఖండే॥ ద్వాత్రింశదాయురశ్వానాం దశాశ్చ కథితా దశ। త్రిణివర్షాణిమాసౌద్వౌ దినానిద్వాదశైవహి। ఆయుషోదశమోభాగో దశాః ప్రోక్తాఃక్రమాద్దశ। మధ్యస్థాస్తత్ర షట్చైవ ప్రశస్తాస్స్యుర్దశాః క్రమాత్॥ ద శాస్వేతాస్వనురూపేణ ఫలమేషాంశుభాశుభం॥ జలధిమథనయోగం జగ్ముషఃప ద్మయోనేశ్శ్రీమజలకణసంఘాః ప్రోద్యతామారుతేన। ప్రచలదనలమధ్యంప్రా ప్తితాస్తే బభూవుర్హయఇహహి తేవై సంస్కృతావహ్నిజాతాః॥ కురుదేశ సముద్భవాహయాస్సమదక్రౌంచరవాస్సముచ్ఛ్రితాః। అతిదూరగతిక్షమాకృ శాస్సమదంతాఃకమలాచ్ఛలోచనాః॥ అతివేగయుతాసురూపవర్ణాబహుసాం ద్రయుతవాలకేసరాః। అతిచంచలపాదపల్లవా అపికాశ్మీరసముద్భవా హ యాః॥ పృథుపృష్ఠయుజామహాశనాః ఘనగంభీరరవానువాదినః। మృగరాజగ

మా బహుక్షమా ఇహబాహ్లీకభవా స్తురంగమాః॥ అతిదీర్ఘాయాః కంధ
రాఘనవాదాః కృశకుక్షిటాంఘ్రయః। బహుభారసహాశ్వ ప్రయా జవనా
ఘూర్జరదేశజాహయాః॥ ఘనశౌర్యయుజశ్చ చారువక్షః పరిణాహాః పృథుమస్త
కాస్స్యశాః। చపలాశ్చ చతుష్కగామినో భువి కాంభోజసముద్భవా హయాః॥
వినయోపచితామహాబలాః పతిభావానుగతా జవాన్వితాః। సమరేష్వవికంప
నా భువి పాంచాలసముద్భవా స్తురంగమాః॥ అసమాన గతి ప్రక్లృప్తిశీలాస్స
మగాత్రాః పృథుచంచలేక్షణాః। పతిరక్షణతత్పరామ్బుధే తనువాలా యవనో
ద్భవాహయాః॥ గతిషుస్వత ఏవశిక్షితాః పృథుకాయాఘనసింహనాదినః। అతి
దీర్ఘకృశోల్పకేసరాస్సితవక్త్రాశ్చ వనాయుజా హయాః॥ కుపితాస్స్వత ఏవ
తీవ్రభాగాః కలిఘోషాః పటవస్సముచ్ఛ్రితాః। ఉపకారవిదశ్చ రూపవంతో
భువి మేహాణసముద్భవాహయాః॥ సువిభక్తశరీరసంభవోరవణీయాశ్చసుల
జ్జితానవాః।మృదునాదయుజోతి వేగవంతో హయస్సింధుమహీతలోద్భవాః॥
జవసత్వయుతామహోదరాః పృథువక్త్రాః కరిరాజగామినః।అసితాఋజుదృ
ష్టయోపి తే హరయో మేతు సువీరదేశజాః॥ మధురస్వరనాదినో మహా జవస
త్వా బహుసూక్ష్మమస్తకాః। తనుదీర్ఘపదాః ప్రశస్తరూపా భువిసౌరాష్ట్ర
హయాస్సురోమజాః॥ అతిభీరయుతాశ్చ మాంసలాస్సదృశః కామవశంవదా
స్సదా। బహుభారభృతో మహాబలా భువి కాళింగహయామహోద్ధతాః॥ కు
టిలద్విజదృష్టిపృష్ఠవాలావికటత్వ్మాంగలధావనక్షమాః। పతిసౌఖ్యకృతో ఘనార
వా భువినేపాలమహీభవాహయాః॥ పటువేగయుతాస్సమున్నతాః పృథుకా
యాస్సమరేష్వకంపనాః। అతిమారగతిక్షమా హయాః ప్రధితా మాళవదేశ
సంభవాః॥ శతాంగుళసముచ్ఛ్రేదముత్తమాశ్వస్యకీర్తితం। తతష్షోడశభాగూ
నం ప్రమాణం మధ్యమస్యతు। మధ్యమాదష్టభాగూనం ప్రమాణంస్యాత్క
నీయసః। లలాటే పంకజంప్రోక్తం మూర్ధ్నిద్వావృషభౌస్మృతౌ। చామరౌ
పార్శ్వయోరుక్తౌ తౌధ్వజాఉపపార్శ్వయోః। శంఖావక్షసివిజ్ఞేయౌ ప్రోథా
గ్రేతు మణిస్స్మృతః।ఏతానిహదశావర్తనామాని మునయోవిదుః॥ అన్యలక్షణ
హీనోపి యఉక్తధ్రువసంయుతః। సవాజీ పూజ్యతేలోకే ధ్రువముచ్చైశ్శ్రవా
యథా। సర్వలక్షణయుక్తోపి యస్సిరోవృషవర్జితః। సపతిం పాతయేదాశు వి
ప్లవేనాత్రసంశయః। సర్వలక్షణయుక్తా యే యత్రతిష్ఠంతివాజినః। తస్యరాజ్ఞో
యశోలక్ష్మీర్విజయో విభవోధ్రువాః। రణేఖడ్గఖణత్కారభీషణైః పతిమవ్రణం।
స్వయంవృణోతి వీర్యశ్రీశుభ్రయా కీర్తిమాలయా॥

అశ్వావర్తాది లక్షణములును వాటియారోహణాదివిధియును.

గజలక్షణ లక్షితానంతరమునం దశ్వలక్షణారోహణాదికమును జెప్పుచున్నారము. ... ... ... ...

అశ్వారోహణముచేతను దేజము వయస్సును స్థైర్యమగును. జఠరాగ్ని ప్రదీపించును. దుర్మాంసమును బుట్టనివ్వదు. కఫశోఫరోగములను శోషింపజేయును. చమటను బుట్టించును. సంతోషమును జేయును. హృదయమందుండు పైత్యయుక్తరక్తమునకు ఓజస్సని పేరది యును గాంతియు నధికమగును. మనుజులకు కీర్తియును లక్ష్మీకరమగును.

భగంధర మూలశంక పైత్య మూత్రకృచ్ఛ్రరోగులకశ్వారోహణము ప్రయోగముకాదని చరకులు. ... ... ... ...

ఏబదైదంగుళములు మొదలుకొని గుఱ్ఱములప్రమాణమును వేరువేరుగ వివరించబడును. ... ... ... ...

నలుబదియంగుళముల ముఖపునిడువుగల గుఱ్ఱముత్తమోత్తమము. ముప్పదియారంగుళముల ముఖముగల గుఱ్ఱముత్తమము. ముప్పదిరెండంగుళముల ముఖముగలది మధ్యమము. ఇరువదెనిమిదంగుళముల ముఖముగలది నీచమని చెప్పబడుచున్నది. ... ... ... ...

గుఱ్ఱముల ముఖప్రమాణముచేతను సకలావయవముల ప్రమాణమును గల్పించబడును. ముఖముకొలతను త్రిరావృత్తముచర్చిన యౌన్నత్యమగపడును. శిరోమణిమొదలు పుచ్ఛమూలమువరకు కొలచిన ముఖమానముకంటె నాలుగురెట్లెచ్చియుండును. ఉదరముయొక్క చుట్టుకొలత ముఖమానముకంటె మూడురెట్లును మూడంగుళములధికముగనుండును. మీసములేనిముఖముగలదై మనోహర గంభీరోత్తుంగమగు నాసికయు పొడవునున్నతమును మెడయు ముఖమును- పొట్టిదియగు కుక్షియును వంగకనిలచియుండు చెవులును- శీఘ్రము తీక్ష్ణమునగు వేగమును- హంసవలె మేఘమువలె మనోహరరవము గలిగియతిమాత్రమునతిమృదువునుగాక విశేషబలమును మనోహరముచక్కని కాంతియు గంధమువర్ణమునుగలిగి శుభఫలమునిచ్చు సుళ్లుగలదియై యుండవలెను.

ఎడమకుడిభేదముచేతను సుడులు రెండువిధములు- తిరుగనవి పూర్ణాపూర్ణభేదముచే రెండువిధములు- ఆప్రకారముగానే దీర్ఘమని హ్రస్వమనియువియె రెండువిధములు. ఆడగుఱ్ఱముయొక్క మొగగుఱ్ఱముయొక్క దేహ

మన యెడమకుడి భేదమువలన చెప్పబడిన ఫలమును క్రమముగనిచ్చును. అవి కుడిని యాడుగుఱ్ఱమునకు మొగగుఱ్ఱమునకు యెడమను శుభాశుభఫలము నివ్వవు. అసుడులయొక్క ముఖములు క్రిందున మీదున అడ్డముగానుండిన ఫలభేదము గలిగియుండును. శంఖచక్రగదాపద్మ వేదిస్వస్తికప్రాసాదతోరణధనస్సులవలెను సర్వతోభద్రచక్రమువలె పుష్పమాల మత్స్యఖడ్గశ్రీవత్సములవలెనున్న సుడులు సుఖమును సుగమముగనిచ్చును. నాసికాగ్రమున లలాటమందగు యముకను కంఠమందు శిరమున సుడులు పుట్టిన గుఱ్ఱముత్తమము. హృదయమున భుజశిరముల గళమున పిరుదులను నాభిని కుక్షిని పార్శ్వాగ్రము లందున సుడులుండిన మధ్యమాశ్వమనబడును. ఫాలమున రెండుసుడులును శిరమున మూడుసుడులును బుట్టినగుఱ్ఱము పూర్ణ మగు హర్షమును జేసును. వెన్నుపూసయందు వకసుడి పుట్టినట్టాయనా ఆగుఱ్ఱమునకు సూర్యుడని పేరు. ప్రభువునకు అనేకగుఱ్ఱములను సంపాదింపజేసును. ఫాలమునం దెగుఱ్ఱమునకు మూడుసుడులు అడ్డుగాను ఉత్తరముగానుండునో యది త్రికూటసంజ్ఞకలదియై గుఱ్ఱముల వృద్ధి బొందించును. ఈప్రకారముగానే మూడుసుడులు కంఠమందు సమముగనుండిన యాగుఱ్ఱము రాజగృహమందున శ్రేష్ఠమైనదైయుండును. యేగుఱ్ఱము యొక్క గండస్థలములయందు రెండేసిచొప్పున సుడులుండునో దానిప్రభువుకు రాజ్యవృద్ధియును గీర్తియును గలుగును. కపోలమందొకసుడిమాత్రముండిన యశ్వము సర్వనామము కలదియై స్వామిని నశింపజేసును. కుడిచెక్కిలియందు సుడియుండిన క్షేమనేసంజ్ఞకలదియై ప్రభువుకు సౌఖ్యమొనర్చును. హృదయవామభాగమందాశ్రయించిన సుడి కూరమైనదై ధనక్షయమొనర్చును. వక్షస్థలముయొక్క రెండుభాగములనూ సమముగనుండు సుడులు యింద్రికములని పేరుగలిగి ప్రభువుకు రాజ్యవృద్ధిని జేసును. కర్ణమూలమున స్తనమధ్యమున సమముగ రెండావర్తములుండిన యవి విజయాఖ్య కలవియై యుద్ధకాలమున ప్రభువునకు ప్రకృష్టయశమునిచ్చును. భుజపార్శ్వములందావర్తములుండిన యదిపుణ్యాలక్షణసంజ్ఞకలదియై నానావిధ పుణ్యములను సుఖమును సతతము స్వామికి గలిగించును.

ముక్కుమధ్యను మూడైన యొకటియైన సుడులుండిన చక్రవర్తియనే పేరుగలదియై గుఱ్ఱము భూపాలమనుపేరనబిలువబడును. కంఠమునందొకసుడి శ్రేష్ఠముగబుట్టిన యిష్టసుఖములనిచ్చునదియె చింతామణి దీనికి దేవమణియనియును పేరొందును.

కంఠమునను ఫాలమున సవ్యముగనుండిన సుడులు శుక్లమనుపేరుగ

లవై వృద్ధిని గీర్తిని గలిగించును. అచటనే వక్రగతికలవియై గనబడిన నిశ్చయముగ స్వామిని నశింపజేసును. లేక దానైనజచ్చును.

జానువందుండిన సుడి ప్రవాసాయాసమును ప్రభువునకిచ్చును. గుర్రముయొక్క మెహానమందు సుడియుండిన ప్రభువుయొక్క సంపదకును జయమునకును నాశముదెచ్చును. పాయుస్థలమునకు పైని వెన్నుయముకకు చివర పృష్ఠభాగముయొక్క యముకలు రెండును కలసియుండిన స్థలమునకు త్రికమని పేరు. యచటసుడియుండిన ధర్మార్థకామములను నశింపజేసును. పుచ్ఛమూలమందుండు సుడికి ధూమకేతువయనిపేరు. ప్రభువునకనర్థమును జేసును.

పూర్వోదాహృతమైన త్రికమందును, గుహ్యమందును, పుచ్ఛమందును, ఆవర్తములుండిన యముని భయమును గలిగించును. పార్శ్వమందుండు సుడి మధ్యదండమనబడును. అదియె కేశపాశమందుండిన శతపదియనబడును. అంగుళప్రమాణమైన యతిదుష్టము అంగుళాధికమైనకొలది దుష్టతయు నధికమగును. కన్నీళ్లుపడుస్థలమున దవడలందు, చెక్కిళ్లందు, హృదయమందు, మెడను, పొత్తికడుపున, పిరుదులను, ఫాలాస్థి నందములను, మూపురమున, నాభిని, పాయుస్థలమున, దక్షిణకుక్షిని, కుడికాలున, సుడులుండిన యశుభము. గళమధ్యమున, పృష్ఠమధ్యమున, ఓష్ఠమునందు, కర్ణాంతమున, నేత్రాంతమున వామకుక్షియందూరువుల, ముందటికాళ్లయందును నుండు సుడులు శుభములు. ఫాలమందు వేరువేరుగా రెండు సుడులుండిన యవి చంద్రసూర్యసంజ్ఞ కలవియై శుభమిచ్చును. యవి పికాస లేకుండిన సుస్వఫలములు. రెండుసుడులును గలసియుండిన దుష్టఫలమిచ్చును. ఫాలమందావర్తత్రితయము కలసియుండక నూర్ధ్వాభిముఖమైయుండిన శుభమిచ్చును. గలసి రెండుసుడులుండినను దుష్టఫలమిచ్చును. ముకోణముగ ఫాలమందు సుడియుండిన దుఃఖమిచ్చును. శుభావర్తము గళమధ్యమునందొకటియుండిన సకలాశుభముల నివారించును. ఫాలమందధోముఖముగనూర్ధ్వముఖముగనుండు సుడులు శుభములు. స్తనమునకభిముఖముగనున్న సుడి శతపది యనగా జెరియది యత్యంతాశుభము. మెహానముయొక్క పశ్చాద్భాగమునందు సుడియుండినను స్తనములుండినను యశుభమగును. చెవివద్దనుండిన యొకసుడికి శృంగియనిపేరదినిందితము. కంఠమధ్యముయొక్క పార్శ్వమునదొకసుడియుండిన గుర్రమేకరశ్మియనబడును. పాదమందూర్ధ్వముఖముగనుండిన సుడిగల గుర్రము కీలోత్పాటియనబడునదియు నిందితము. శుభాశుభములగు సుడులొకగుర్రమునకే గలిగిన యది మధ్యమనబడును. ముఖము పాదములును తెల్లగనుండిన పంచకళ్యాణియందు రదియె

హృదయము భుజపార్శ్వములు పుచ్ఛము తెలుపైన యష్టమంగళమందురు. చి
త్రవర్ణము పచ్చని నల్లని వర్ణము నల్లని కర్ణములు కలదియైనను అంతటా వ
కృవర్ణమే కలదియైనను యాగుర్రము శ్రేష్ఠము. అందులోనంతట తెల్లనివర్ణ
ముగలది పవిత్రమైనదియు పూజ్యమైనదియునగును. వైడూర్యములవంటి నేత్ర
ములుకలదియై యున్నగుర్రము జపమంగళియనబడును. మిశ్రవర్ణమైన నొకవ
ర్ణమైన గలిగినను యతివికృతిలేక సుందరమై యగపడిన పూజ్యమగును. నల్లని
పాదములుగల గుర్రమును ఒకపాదముమాత్రము తెలుపుగలిగియుండినను నిం
ద్యము. పరుషమై కొంచెపు తెలుపగునదియును గాడిదెరంగు కలదియును నిం
ద్యము. తాలువులు జిహ్వయు ఓష్ఠము నల్లనైయుండినను శరీరమంతయు నల్ల
నిదై తోకమాత్రము తెల్లగనుండినను నిందితము. పాదమున్నతముగ నెత్తి
యుంచబడిన గమనముగలదియై మదగజవ్యాఘ్రమయూరహంసతిత్తిరపారా
వతమృగోష్ట్రవానరవృషభములవంటి గమనము గలిగిన యశ్వము శ్రేష్ఠము.
బాగుగమేసి శ్రమనొందిన హయము పిపాసాదికముచే పీడితముగాకుండిన శ్రే
ష్ఠగమనము గలిగినతురగోత్తమమని దెలియదగును. దీనికి తెల్లనితెలుకము ఫాల
మందుండి మరియొకరంగుగల దేహముగలదగునో ఆగుర్రము దళభంజియను
పేరుగలదియై యది విశేషనిందితము. రంగువలనబుట్టిన దోషములతో గూడి
యుండినను నునుపైనవర్ణము బలాధికమును శ్రేష్ఠగమనమును సుందరావయ
వములును గలిగి యతికౄరముగాకుండి సుడులుమొదలగువాటిచే దూషిత
మైనను సర్వము పూజింపబడును.

గుర్రము విశేషసవారీచేతను క్షీణించును- రోగములొందును- స
వారీలేకుండిన మందమై యందము చెడి సకలకర్మములందుండును- పోషణలో
తక్కువైనయుక్కుచెడును. అతిపోషణచే రోగియగును. గానమితముగపోషిం
పవలెను. శిక్షకుని నేర్పుకొలది సుగమన దుర్గమనములు గుర్రమునకుగలుగును.

జానువులక్రిందగు పాదాగ్రముమాత్రము చలింపుచు మరినేఅవ
యవములను జలింపకుండ స్థిరముగ దిన్నని శరీరముగలవాడై గూచుని త్రో
సువలె సమముగ బాగులను బట్టి తగినకాలములయందాయాయి ప్రదేశముల
నతితీక్ష్ణముగాకుండ కొల్లాదెబ్బలచే శిక్షించదగును. అరచిన కక్షములందున
త్రొట్రుపడిన పార్శ్వములందున భయపడిన కర్ణాంతములందు మార్గము త
ప్పించినడచునపుడు మెడయందు క్రోధయుక్తమైన బాహుమధ్యమున భ్రాం
తచిత్తముగలదైన యుదరమున యశ్వమును బాణ్ణులచే గొట్టబడు నితరస్థాన

ములందున గొట్టగూడదు. మరియును మతాంతరమును జెప్పుచున్నారము.

అరచిన భుజశరీరముల, తొట్రుపడిన పిరుందుల, భయపడునపు డును మార్గముతప్పినడచునపుడును వక్షస్థలమున, క్రోధమగపడునపుడు పుచ్ఛసమీపమున, భ్రాంతియందు జానుద్వయమునను గొట్టవలెను. గుర్రమును మాటిమాటికిని గొట్టుటచేత నకాలమున స్థలమును దప్పించియును గొట్టినందున విశేషముగ దోషములను జేయుచున్నది. ఆదోషములు గుర్రము జీవించువరకును విడువకుండును. దుష్టదండనమువలన దిరస్కృతుడగును. దండించకుండిన యవరోహణమే లేకపోవునని భార్గవులు. దండించుకాలమున మృదువగు నొక దెబ్బను గొట్టవలెను. మధ్యమాశ్వమును తీక్ష్ణముగ రెండుదెబ్బలు గొట్టవలెను. అధమాశ్వమును తీక్ష్ణమగు మూడుదెబ్బలు గొట్టవలెను. కూర్చుండబోయిన నిద్రయందున స్ఖలనమున దుష్టచేష్టయందు ఆడగుర్రమును జూచు నిచ్ఛగలిగినపుడు మాటిమాటికిరచుటందు భయములేక మొద్దైనపుడు శిక్షితమగు నడకను విడచిన చిత్తభ్రమబుట్టునపుడు గుర్రములకు నీపన్నెండుకాలములను గొట్టవలెను. భీతిగనుండిన మెడను భయపడునపుడు మేహనమున విభ్రాంతచిత్తముగలదగునపుడధరమున అరచునపుడును ఆడగుర్రమును జూచి వికృతి గనపరచినను భుజశిరముల భుజములందును నిద్రయందును గూర్చుండబోవునపుడును తుంట్లపైని దుశ్చేష్టలందును మార్గముదప్పినను ముఖమందున స్ఖలితమందున పిరుందులకు ముందు దుష్టముగ లేచినపుడు నేత్రసమీపమున మస్తాగుర్రము నన్నిస్థలములందును గొట్టవలెను.

పదాఱుపర్యాయములు గుర్రమును బలుకించుచు నన్నూరు మూరలుమట్టుకు బాజీజేసినది యుత్తమాశ్వము. ఇంతకంటె తక్కువగమనముగల గుర్రము హీనమైనది. గతిని శిక్షించుటలో నాలుగువేలమూరల పరిమితిమట్టుకు కావాత్రిప్పుట యుత్తమము. అందున సగము మధ్యమము. అందునసగము నీచము. నాలుగువందలమూరలు అల్పము. రెండువందలమూరలమట్టుకు కావా అత్యల్పము. కావా బాజీ మొదలైన గతులను నిత్యమును క్రమముగ వృద్ధినొందించిన యొకదినమునకు నూరామడనడచునటుల నుత్తమాశ్వమును తరిబీయతును జేయదగును. హేమంతర్తువున సాయంప్రాతఃకాలములందును వసంతశిశిరర్తువులను సాయంసమయమున గ్రీష్మశరదృతువుల ప్రాతఃకాలములందును సర్వదా గుర్రపుసవారీని జేయవలయును. వార్షికకాలమందును నిమ్నోన్నతభూములందును కొంచమైనను గుర్రపుసవారీని జేయగూడదు. గు

ర్రిముయోగ్యగమనము గలదియైన జఠరాగ్నియు బలము దార్ఢ్యము ఆరోగ్యము వృద్ధినొందును.

భారమువహించినట్టియు మార్గపరిశ్రమనొందినట్టియు గుర్రమును నింపాదిగా నడపించి సత్తుపిండియును పంచదారయును నేతిలో గలిపి తాగించవలయును. పచ్చపెసలైనను మినుములైనను దంచనివి నానబెట్టినవైన యుండినవైన దినుపింపవలయును. శరీరమెచట స్ఖలితము నొందినదో అచటను కొట్టవలెను. మార్గాయాసమునొందివచ్చినగుర్రముయొక్క సామానును విప్పి బలమును వృద్ధిబొందించుటకు ఉప్పునువేసిన గంజిని తాగించి చమటఆరేలాగున తలాయించి తరువాతను టంగును సామానును విప్పి కళ్లెమును తీసి బాగా మాలీషును జేసి పరాగముచేతను మెత్తనైయున్న స్థలమందున కట్టివెయ్యావలెను. తరువాత స్నానపానావగాహనములచేత జక్కగపోషించవలెను. అశ్వమునకు కల్లును అడవిగోవుల పాలును తాగించిన సర్వదోషముల హరించును. శక్తికొలది పాలునైనను ఉదకముచేతను కడగివేసిన నేతినైనను తాగించవలెను. నీళ్లుతాగించి దానాపెట్టి తత్కాలమందే సవారీచేసిన గుర్రమునకు శ్వాసకాసాదిరోగములు బుట్టును. గుర్రపుదానాకు యవలును శనగలును శ్రేష్ఠములు. ఉలవలు మధ్యమము. శిరిసెనగలు పెసలును నీచము.

ధారయని స్కందితమని రేచితమని ప్లుతమని ధారీతకమని వల్గితమనియు గుర్రపుగమనములారువిధములవి వేరు వేరుగ వివరించబడును తెంపులేక తేజముతో నడచు తేజగమనము ధారాగతియనియు మడమలచే యిషారాచేయబడి జల్దిగలదై దేనియందు గుర్రము భ్రాంతమై యగ్రపాదములచేతను మాటిమాటికి సూటిగ దాటిదాటి నడచుగమన మాస్కందితమనియు నించుకంతెగురుచు నడచునది యఖండరేచితమనియు నాలుగుపాదములచేత నెగురుచు నడచునది ప్లుతగతియనియు కాళ్లు మీదికి కదలించక వ్యక్తమౌనట్టుగాను శీఘ్రముగ నడచునది ధారీతకమనబడు నది రథ్యవహనమందు శ్రేష్ఠము. విశేషముగ చలింపజేయబడిన పాదములచేతను నెమలివలె యెత్తబడిన కంఠముకలదియై ఉ-ష్ట్యాలవలె నొప్పుచుండిన శరీరార్ధముగల గమనము వల్గితమనబడును వలితమనియు వల్గితమనియును పాఠభేదము కలదు. గుర్రముయొక్క స్వభావముచేసెనగు బలము తేజమనబడును. అదిరిపడుచుండుట కురజమనిపేరు. క్రోధమునకు తమస్సనిపేరు. ఇవిమూడును సహజగుణములు. ప్రేరణవినాగా శిక్షితమగు నగమనములందును తెంపులేక పెంపుగనడచిన యది సతతోద్ధితతేజమందురు. ... ... ... ...

కళ్లాయను కోళ్లాదెబ్బలు మడమపోటులు మొదలగు ప్రేరణచే బుట్టిన భయము స్ఫురితమనబడును. శతధనురర్ధశతధనుఃపరిమాణముచే నంత కంతకు తక్కువస్థలములో మెడయెత్తి కావాను తిరుగు నశ్వశ్రేష్ఠముయొక్క గతికి నర్ధపులాయితమని పేరు. నాలుగుకాళ్లతో యెగసి నడచిన యాగతికి ప్లవంగికయని జెప్పుదురు. తిరుగ దానినె ఉయ్యాలవలె నూగి నడచిన పులయందురు. సమముగ నాలుగుకాళ్లను యెత్తి ముందరకశ్వముగెంతినటులైన యది యర్ధధారయనియును పులయనియును జెప్పుదురు. పాదములను యెత్తి వంచి ముందరకుదాటక నొకస్థలమందుండినగతిని పులయని గొందరందురు. పులయందు మడమలచేతను గాఢప్రహారమొనర్చి బాగులు వదులుచేసి గుర్రమును సవారీకావలెను. ... ... ... ...

రెండునిడుపులోహశలాకలును పార్శ్వమున పన్నెండంగుళముల ప్రమాణముగల శలాకలు రెండును వాటిని గలిసియుండిన లోహకడియముల లోనుంచి దృఢములగు బాగులు ప్రేరణకు నాకర్షించుటకునుంచిన యది కళ్లే మనబడును. దానిచేత గుర్రమును వశమొనర్చికొనవలెను.

ముప్పదినాలుగువత్సరములశ్వములకు పరమాయువు. వృషభోష్ట్రములకు నిరువదైదువత్సరములు పరమాయువు. అశ్వోష్ట్రవృషభములకు బాల్యదశైదువత్సరములు- షోడశాబ్దపర్యంతము మధ్యవయస్సు- అపుని వృద్ధదశ- దంతోత్పత్తివలన వాటిరంగులనుబట్టియును వయస్సును దెలియదగును. గుర్రమునకు మొదటివత్సరమునం బారుదంతములు తెల్లగనుండును. ఎరుపునలుపును గలిగి దిగువదంతములు బొడమును.

మూడవవత్సరమున సదంశసంజ్ఞగల దంతములు రెండు బొడమి క్రమంబున నారవవత్సరమునకు నల్లబడును. తొమ్మిదివత్సరములకు పచ్చనగును. పన్నెండేళ్లకు తిరుగ తెల్లబడును. పదిహేనుదువత్సరములకు క్రమంబున గాజువలె గారబట్టును. పదునెనిమిదివత్సరములకు తేనెవలె పింగళవర్ణమగును. నిరువదొకవత్సరము మొదలిరువదినాలుగువత్సరములవరకు శంఖమువలె నుండును. అది మొదలిరువదేడువత్సరములవరకు ఛిద్రత బొడము నదియాదిగ ముప్పదేళ్లవరకు కదులుటొందవును. ముప్పదిమూడువరకు దంతపాతమగును. ముకురంధ్రమంధ్యమునందేగుర్రమునగు మూడుసుడులుండునో యదిపూర్ణాయువు గలదగును. అవితక్కువైన పూర్ణాయువు సంఖ్య తగ్గును.

వెనుకకాళ్లను విసరుట పెదివెలను వాయించడము పృష్ఠమును క

దల్చుట నీళ్లలోపడియుండుట నడచుచు పరుండుట వెనకకు నడచుట ముందర పాదములెత్తినిలచుట పామునాలుకవలె నాలుకను పైకిదీసుట వెలుగుబంటి వంటి రంగుగలుగుట నుదుటిబొట్టు ఛిద్రముగనుండుటయును గల్గు గుర్రము ను సంపాదించిన నింద్యులనుగా జేసును. గుర్రములవయవములందుదకమంద గు సుడులవలె రోమములుండిన వాటికి శుభాశుభఫలములను జెప్పుచున్నార మని శాలిహోత్రులు. గుర్రములకు రోమములవలన నదియందగు సుడులవలె జటామాంసివలె నల్లగన్నేరుపువ్వువలె ముత్తియపు చిప్పవలె బుట్టుచున్నవి. మరియు నితరాకృతులైగూడ బుట్టగలవు. వక్షస్థలమున రెండు శిరమున రెండు ముఖమున రెండు నాసారంధ్రముల రెండు నుదుటనొకటి పాయుస్థలమందొక టియును దశధృవావర్త్తములని శాలిహోత్రులు. మరియును హాలాస్యఖండ మున నీదశావర్త్తములను జెప్పి యివి సకలాశ్వములకును ప్రశస్తము లివిలేకుం డిన దుర్లక్షణములుకలవని జెప్పబడెను.

ఏగుర్రముయొక్క కంఠమందావర్త్తముండునో యది దేవమణియని జెప్పబడును. యజమానికి సంపదలనిచ్చును. వక్షస్థలమునందు నలుదిక్కులనా లుగు సుడులును మధ్యమందొకటియును సప్రదక్షిణముగనున్నసుడులు శ్రీవత్స మనబడు నట్టిగుర్రము రాజుకు సర్వార్థముల సాధించును. ఏగుర్రముయొక్క ఫాలమున రెండుసుడులుండునో ఆగుర్రమును సవారగు రాజు ధనధాన్యపు త్రవంతుడై శత్రువులను జయించుచుండును. నిచ్చెనమెట్లవలె నేగుర్రపుఫాలప ట్టికను మూడుసుడులుండునో ఆగుర్రముగల రాజు ధనధాన్యములుగలవాడై శత్రువులను జయించును. సవ్యమగు నాలుగావర్త్తములు లలాటమందుండిన గు ర్రము రాజును శీఘ్రముగ బుత్రవంతుని జేసును. రెండుకర్ణములందును సుడు లుండిన యవి వృషభములనుబేరుగలవగు నాగుర్రపు యజమానికి యలంకార ములనిచ్చును. ఇటువంటిశుభావర్త్తములచే చిహ్నితములగునవి యశ్వశ్రేష్ఠము లనబడును. ... ... ... ... ...

హయలీలావతియందున జెప్పినలక్షణము లీపైని జెప్పుదుము.

వక్షస్థలమునందున బుట్టిన యావర్త్తచతుష్టయము కంఠస్థమగు రోచ మానమునుగల గుర్రమునకు శ్రీవృక్షకియనిబేరు. అది యజమానునకు పుత్రపౌ త్రాభివృద్ధిని జేసును. ఊర్ధ్వరోమములుగల ముత్తియపు చిప్పలవంటి మూడు సుడులును రోచమానమను సుడియు నధిపతికి జయము గలిగించును. దేవమణి యను కంఠస్థమగు రోమావర్త్తమును పార్శ్వభాగములందుండు సుడులును యజమానికి సౌభాగ్యవృద్ధిని జేసును.

గారుడపురాణమున గుఱ్ఱపుకంఠదేశమున ముత్తియపుచిప్పవలె విస్తారమై యున్న సుడికి రోచమానమని పేరు. ఆగుఱ్ఱపుయజమాని దనశత్రువులను జయించునని జెప్పబడెను. ఏగుఱ్ఱముల ముఖమున త్రిశాఖ్యాకృతివలె మూడుసుడులుండునో ఆగుఱ్ఱపువారు యుద్ధమందు పరాజయమొందరనియును, అశ్వగళప్రదేశమున విడువబడిన ముత్తియపుచిప్పవలె సుడియుండిన సకలసంపదలనిచ్చుననియును, నాసారంధ్రమధ్యమున వికసించినపద్మమువలె సుడియుండిన గుఱ్ఱపుయజమాని సకలాభీష్టములననుభవించుననియును, [illegible] పార్శ్వమున చంద్రకళవలె వక్రమై సుడియుండిన చంద్రికమని దానికి పేరు. అదిసకలాభీష్టములనిచ్చుననియును, గుఱ్ఱపునేత్రాంతములందు [illegible] యుండు సుడులు ధనధాన్య చిరాయుష్య కీర్తి పుత్రపౌత్రాభివృద్ధిని [illegible] యును, ఏగుఱ్ఱముయొక్క ముఖమందగు సుడి పద్మమువలె విశాలముగనుండునో దానినవారు నిశ్చయముగ సకలభూమండలమునకధికారియగుననియు. గుఱ్ఱపుగర్భమున గంగావర్తమువలె బుట్టిన రోమజాలమునకు గంగావర్తమని పేరు. అది యజమానికి దుఃఖమును బోగొట్టుననియు నాభిసమీపమున దానికి [illegible] గాకుండ సుడులుండిన త్రివేణీసంగమమని పేరు. ఆగుఱ్ఱపువారు సతతము సుఖులైయుండుననియును గుఱ్ఱమునకు దశధృవులను తక్కువుండిన యల్పాయువు పూర్ణముగనుండిన పూర్ణాయువగుననియును, గుఱ్ఱపు [illegible] మూలమున జాజిమొగ్గవలె సుడియుండిన యజమానికి సకలసౌభాగ్యప్రాప్తియగుననియును జెప్పబడెను. ... ... ... ...

గారుడపురాణలక్షణములను జెప్పి దిరుగ శాలిహోత్రోక్తమును దెల్పుచున్నారము. ... ... ... ...

గుఱ్ఱపుబాహువులసుడులు మొలనూలువలెయుండిన యజమానికనేకాలంకారములును విజయమునిచ్చును. ... ... ...

హేలాస్యఖండమునందు దిరుగజెప్పబడినదేమనగా గళమధ్యమందుండి రెండుసుడులుగల గుఱ్ఱము దానియజమానికి క్షుద్దుఃఖములనిచ్చును. జంఘలయందు బుట్టిన నాలుగు సుడులు భయము బంధము మొదలగు విశేషదుఃఖములనిచ్చును. అధరోష్ఠమందుండావర్తము యజమానితల్లిని నశింపజేసును. గుఱ్ఱపుచంకలందుండు సుడులు యజమానిని యుద్ధమందున జంపును, ముక్కునందుండావర్తముముక్కుజెరచి మృత్యువునొందించును.

గండస్థలమందావర్తము భయమును రోగమును బుట్టించును. జాను

వులందుండావర్తము యజమాని సకలధనమును బోగొట్టును. ఇట్టియశుభావర్తములతోనుండినయశ్వములధమములని జెప్పబడును.

గారుడపు ణమందనువదించునవి విరుగవచించెదము. హృదయావర్తమైన సికయుందావర్తమైననుండిన గుర్రమెవరిగృహమందుండునో వారికి మృత్యుదేవతచే బనిలేకుండనదియె మరణమును జేసును. గుర్రపుబీజములందు జోమ్మిటీగతో సుడియుండిన యజమానికి సంకెళ్లను వేయించును. గుర్రపుగళమునందడ్డుగా ఛూరీవలె సుడియుండిన యజమానికత్తికను కోయించును. మూపురమున పృష్ఠమునందావర్తముండిన కుబేరునివంటి ధనికునైన నధనునిజేసును. ఏగుర్రముయొక్క వెన్నుముల్లును పృష్ఠమందెముకలును గలసినది త్రికమనబడును. దానియందుండు సుడికి ధూమకేతువువలె లేకకోరదువలె సుడియుండిన యజమానియొక్క బలమును బుత్రులను వాహనములను నశింపజేసును. జంఘలయందు పాశమువలె సుడియుండిన యాగుర్రపుయజమానికి కీర్తినాశను బంధనమును గలుగును. జఠరముపైని శత్య్యమను సుడియును జటామాంసివలె తిన్నగా జఠరమునకభిముఖముగ నుండిన యాగుర్రము యజమానికి దుఃఖాభివృద్ధిని జేసును. పద్మచామరచక్రతోమరదర్పణముకుళమణిచంద్రసదృశములును, శంఖవజ్రకలశాంకుశఖడ్గోల్లాభమత్స్యకలమ మంజరులవలె ముత్తియపుచిప్పరీతి ధ్వజము నదీభ్రమణనుభంగి నుండిన గుర్రమున కాయుర్వృద్ధియును యజమానికిష్టార్థమునుగూడ నిచ్చును. వామభాగమునందు వామావర్తము దక్షిణభాగమున దక్షిణావర్తమునుండిన గుర్రపు యజమానికి శుభమగును. విపరీతముగనుండిన విపరీతఫలమిచ్చును.

గుర్రములయొక్క కేశాంతమందు పాకుచుండిన సర్పమువలె సుడియుండిన భర్తను రోగినిజేసును. అలాగుననే లాంగూలశూలమును రోగిని జేసును. పృష్ఠమున జానువుల పొత్తికడుపున భుజశిరముల కనుబొమలపై చెక్కిళ్లనుండు గుర్రపుసుడులు దానియజమానికి దారిద్ర్యమిచ్చును.

హృదయమున గళమధ్యప్రదేశమున నాభిని బీజముల కన్నీళ్లుపడుస్థలముల గుర్రమునకు సుడులుండిన దానిభర్తకు మృత్యువునిచ్చును. జంఘలను కటిని పాయువునందు కర్ణమునందధరోష్ఠమున చంకలను సుడులుండిన గుర్రపుభర్తకు సతతము దుఃఖమునిచ్చును. మస్తకములు లేక నితరావర్తములుండినను ఆగుర్రమును యెల్లప్పుడును విడువదగును. దక్షిణకుక్షిని కంఠమున ముట్టెని లలాటాస్థిని మెడముడినిగల సుడులు పుడమిరేళ్లకు జయసంపత్కీర్తులభివృద్ధిని జేసును. ... ... ... ... ...

హాలాస్యఖండమునందు జెప్పిన వర్ణవిశేషముల జెప్పుచున్నారము.

శ్వేత రక్త పీత కృష్ణ మిశ్రవర్ణములైదు భేదములచే పృధివినశ్వము లుండును. ... ... ... ... ...

ముక్తాహారక్షీరశంఖచంద్రరజతతుషారములవలె శ్వేతాశ్వములుండును. లత్తుక దాడిమపుష్పసదృశములై రక్తవర్ణాశ్వములుండును. ఆడతుమ్మెద కోకిల నీలమేఘాంజనసదృశమై కృష్ణవర్ణాశ్వములుండును. దీప్తాగ్నివలె గోరోచనరీతి సువర్ణవర్ణాశ్వములుండును. ఈచెప్పబడు వర్ణములు గలసియుండినయశ్వములు మిశ్రవర్ణములనబడును.

అన్యవర్ణముగలగుర్రమునకు శ్వేతవర్ణము గలిగిన ప్రశస్తము. గుర్రము తెలుపైనను నలుపైనను కడుపుయందైన వక్షస్థలమునందైన యర్రనిరంగుగలిగిన ప్రభువునకు సౌభాగ్యమును యుద్ధమున జయమునిచ్చును. నల్లనిగుర్రమైనను యర్రనిగుర్రమైనను కడుపుయందు వక్షమున శిరమున సితవర్ణముగలిగిన యదివైజయికమనిపేరుగలదై ప్రభువునకుసకలకార్యసిద్ధియొనర్చును.

ఏరంగుగలగుర్రమైనను కడుపుయందు తెల్లనిరంగుగలిగిన బుత్రలాభమొనర్చును. వక్షస్థలమున దెల్లనిరంగుండిన గుర్రము దానిప్రభువుకు సంతోషము గలిగించును. కంఠమున దెల్లనిరంగుగలగుర్రము ధనమునిచ్చును. ముఖమున శ్వేతవర్ణముగలగుర్రము విజయములనిచ్చును.

పృష్ఠమందు ధవళిమగలగుర్రము సౌఖ్యమిచ్చును. వామపార్శ్వమందున నేత్రములందు నితరస్థలమున దెల్లనిరంగుగలగుర్రము కళత్రప్రాప్తిని జేసు నేగుర్రముయొక్క ముఖము పృష్ఠము వాలమును దెల్లనిదై యెల్లరకు దెల్లమిగనుండిన జయమిచ్చు నాగుర్రమును జయముకొరకు సేనాగ్రమందు నడపించదగును. ... ... ... ... ...

ఏతెల్లనిగుర్రముయొక్క శిరమత్యంతధవళమై గనపడునో యాగుర్రము సూర్యకాంతమనుపేరొంది ప్రభువునకు సర్వార్థములను సమకూర్చును. గుర్రముయొక్క నాభిమొదలుకొని యధోభాగను బాలసూర్యునివలెనుండి తదిరభాగము ధవళిమైనదియునైన వైజయికమనుపేరుగలదగును.

హయలీలావతియందు రంగుయొక్క భేదమువలన జాతిభేదమును జెప్పుచున్నారదియటులనిరేని- శ్వేత రక్త పీత కృష్ణమిశ్రములగు రంగులుగల గుర్రములు క్రమముగ బ్రహ్మ క్షత్ర వైశ్య శూద్ర సంకరజాతులని.

సకలావయవధవళమగు గుర్రము కర్కమనబడును. సకలావయవములు రక్తిమకలిగియుండిన గుర్రము శోణమటుల నల్లనిది హేమమనబడును. పీతవర్ణమంతటనుగలిగిన పింగళయనబడును. సర్వావయవములును దెల్లనైయున్న గుఱ్ఱము జయప్రదము. సర్వావయవములును నల్లనైయుండిన భయమిచ్చును. పాదమొకటి దెల్లనైయుండి తదితరగాత్రము వేరొకరంగుగనుండిన విషపాదియందురు విభర్తకు నిత్యము భయమిచ్చును. పిల్లివలె కాకిభంగి పాషాణరీతి గుడ్లగూబతో సరియగురంగుగల గుఱ్ఱము పాలకునకు భయమిచ్చును. నెవలి తీతిక చిలుకలవంటి మిశ్రరంగులుగల గుర్రములు శుభమును బొందించును. శ్యామలవర్ణముగల గుర్రముయొక్క ముఖమున దెల్లనిపుండ్రముగలదైన శ్రేష్ఠము. దెల్లనిగుర్రమునకొకచెవి నల్లగనుండిన యధికశ్రేష్ఠము. సకలావయవములును దెల్లనై చెవులెర్రనైన గుర్రము లోహితకర్ణమను బేరొంది సర్వాశ్వములలో నధికపూజ్యమగును. అశ్వనిదానమను గ్రంథమందున జెప్పిన లక్షణములను జెప్పుదుము. ఏరంగగు గుర్రమైనను ముఖమున శ్వేతపుండ్రముండిన సర్వార్థసౌఖ్యసంపన్నుని జేసును. పద్మ చామర కలశ ఛత్ర చంద్రోల్లాభముకుళాకృతిగల పుండ్రముండిన యశ్వమునకు చిరాయువై భర్తకు సకలాభీష్టముల నిచ్చును. ... ... ... ...

ఒకపాదముమాత్రము తెలుపైన విషపాది మూడుపాదములు తెల్లనముసలి తోకమాత్రము శ్వేతమైన విషపుచ్ఛము. కర్ణ పుచ్ఛ పద కేసరములు నల్లనై మిగిలిన గాత్రమంతయును స్వర్ణచ్ఛాయగలగుఱ్ఱమింద్రనీలమని పేరై రాజులకు సంపత్తిని విస్తరింపజేసునని ప్రసంగరత్నావళియను గ్రంథము. కంఠము నేత్రస్థానమును పొడవు పృష్ఠమునుంచు మొముకలు వెన్నుముల్లును వక్షస్థలమును విశాలము తాలువులు పెదివెలు నాలుకయు యెర్రనై చర్మము కేసరములు వాలము మృదువై యోగ్యమైన డెక్కల గతియును ముఖమును గలిగ చెవులు పెదివెలు తోకయును కురచై పిక్కలు తొడలును వర్తులాకృతియై ధవళమై సమమైన పఙ్క్తిగలిగిన దంతములుండి సుందరావయవసంధులుగలరూపముతోనుండిన గుర్రము శత్రుజయమును రాజుకిచ్చునని వరాహసంహిత.

వక్షస్థలము లలాటము పిరుదులును విస్తారముగను పృష్ఠ కర్ణ కుక్షి నాసికలు హ్రస్వముగ వాలములోమములు కేసరములు నధికముగ గళ నేత్ర శిరములు గొప్పవిగాను, పెదివెలు జిహ్వాయు శెలివెలును సూక్ష్మముగనుండిన గుర్రము ప్రశస్తమైనదని హాలాస్యఖండము. మూడవయవములు దీర్ఘములై

మూడుచోటులు పొట్టివై మూడుస్థములు వర్తులమై మూడుచాయలెర్రనివై మూడుయిుక్కలు నల్లనివై మూడు తెల్లనివై యుండిన గుర్రమంతటయునుఖూజ్యమని శ్రీమహాభారతమున.

ఏగుర్రమునకు మూడైన యొకటైనను యండకోశములుండిన స్తనములుండినను దంతములెక్కువతక్కువగలిగినను భయావహాముఖమైననుదూరముగ త్యజించదగును. చంకల నూరువుల పాయుమూలమున మేహనమున స్థూలములగు మడతలతోనొప్పునశ్వము ప్రశస్తము. అలాగుననే చంద్రాక్రుతిగలదియై నల్ల నెర్రిసిబిందువులతో ముఖపట్టాయుండకుండిన గుర్రము శ్రేష్ఠము. అరుణమైన చంద్రాకృతి మేహనమందున స్తనాంకురమువలె నశ్వముకుండిన దానియధికారి వంశాంకురమును తుంచివేసును. చెవులు ముందరికి వక్రములై వేర్లాడుట పెదివ పెద్ద శిరమధికమై వక్రములై తక్కువెక్కువై నల్లనివై మలినమగుదంతములును, కోతి పులి పిల్లి యలుక ముఖములవంటి ముఖమును యస్థిసంధులు మాంసములేనివై వెన్నుముల్లు దట్టమై పచ్చని రంగు విశేషముగలేని నేత్రములును దోషములివిగల గుర్రము యజమానికిని దనకును గష్టము గలిగించును. ... ... ... ...

గుర్రముయొక్క జ్వలనలక్షణమనగా మొకమల్‌యొక్క వున్నిచమకువలె చకచకలాడునది అట్టి జ్వలనము పాయుస్థానమునందు బైతకుస్థలమున కలిగినయడల శుభముకాదు. వామదక్షిణ పార్శ్వములయందట్టిజ్వలనముండిన బ్రశస్తము. అది సర్వావయవములందుండగూడదు గాని యీజ్వలనబిందువులను నల్లని చెమకను సర్వావయవములయందుండిన హర్షమొనర్చును. మేహనబీజములందుండు జ్వలనము క్షయమొనర్చును. ఉదరపాయువాలములందుండిన పరాజయమొదవును. ముఖమున శిరమున భుజశిరముల నాసికను జ్వలనముండిన జయమగును. పాదజ్వలనము ప్రభువుకు బంధనమొనర్చును. లలాటవక్షనేత్రభుజములందు ధూమమువలెనుండు చమకు పరాజయమగును. ఈస్థలములందు నేజ్వలనముండిన జయమగును. నాసాపుటమున యానాసికక్రిందున శిరమున నేత్రముల వాటికొలకులను రాత్రిజ్వలనమగపడిన జయమిచ్చును. పచ్చనెర్రనల్లని ధూమ్రవర్ణములలో చిలుకవంటి పచ్చనిరంగుగల జ్వలనముమాత్రము శ్రేష్ఠము. ... ... ... ...

హేషారవమనగా గుర్రపరుపు దానిలక్షణమును జెప్పుచున్నారము.

కొంగవలెనరచిన గుర్రపరుపు శత్రువువలె బాధించును. యజమానిక

భిముఖముగ మెడగదల్చక సాంద్రముగ సంతోషయుక్తమగునటుల మేసి గాి సకబళముతోనుండి యరచిన పూర్ణపాత్రయు పెరుగును. బ్రాహ్మణదేవతా చందనహేమఫలపుష్పముల శకునమువలె నిష్టద్రవ్యఫలాప్తి మొదలగునవి గలు గుటయే గాక జయము శీఘ్రముగ నగును.

ఎడమపాదములచే భూమిని దున్నుచు నరచినగుర్రము దానియజమా నిని మట్టిని గలపును. సంధ్యారాగములనుజూచుచు నరచు గుర్రము బంధము ను పరాజయమును పతికి గలిగించును. విశేషముగ నరచుచుండినను తోకను ద ర్పు గదల్చినను నిద్రనుండదత్యంతమాసక్తమైననుబతికిబ్రవాసమునుబ్రకటించును.

రోమములునూడ్చుచుండినను దీనస్వరమైనను తీక్ష్ణస్వరమైనను ధూళిని గ్రసించినను యజమానికి భయమును జూపించును. మాటిమాటికి మూత్రము లద్దియు వేయుచుండినను కొట్టిన వెనుకకు నడచినను కారణములేకనే భయ మొందిన యశ్రుపాతము గలిగిన యశ్వము దానియజమానికి మంగళమును జే యదు. కుడిపక్కను బరుండి యడముకాళ్లు ముడిచి దక్షిణపాదమునెత్తినటులై న యజమానికి జయమగును. మిగిలినవాహనములకు నీరీతినే దెలియదగును.

ఎజమాని సవారికావడమునకు వచ్చినపుడు నమ్రత కలిగి ముందునడు వనభిలాషకలదైయె నురివకగుర్రమును జూచి యరచినను ముఖముచేత తనకు డిపార్శ్వమును స్పృశించినను యట్టియశ్వము దానిభర్తకు శీఘ్రముగ సంప త్తిని గలిగించును. గడ్డి మేయ నీళ్లుద్రావ ద్వేషించిన బడుచుండిన గారణములే కనె చమటగలిగిన పలాకిన ముఖమునుండి రక్తము స్రవించిన ధూమము పుట్టిన ను నిశీథమందైనగూడ నిద్రలేకుండిన బగటిని బరుండిన యలసతగలిగి ధ్యానిం చుచుండినటుల నటించినను యట్టిగుర్రపుయజమానికనిష్టమగును. ఒకగుర్రపు సరంజామొక దానికిని కల్లైమనటులదగిలించిన యాపదను గలిగించును.

హాలాస్యఖండమున దియగజెప్పిన హయలక్షణములనగపరచెదము.

ఎగురుటలో బంతివలె, నిలుచుటలో స్థైర్యముచే పర్వతమువలె నర ుటందు గంభీరధ్వనిగల మేఘగర్జనమువలె, నేత్రములు పద్మదళములవలె, వేగమున వాయుగమనమువలె, కశాఘాతాది ప్రేరణముచే సింహమువలె, బాజీయందు నటునివలె, ముఖశోభయందు పద్మమువంటి కులస్త్రీముఖమువలె నుండిన యశ్వములీలోకమున రాజవాహనార్హములగుచు నెల్లప్పుడును రాజి ల్లును. వృద్ధిబొందించబడిన బలమును శోభయును తేజముయొక్క సారమును గలవై పరిమెళముగల పుష్పమువంటి కాంతిగలిగి శంఖ మేఘధ్వనివంటినాధము

నానావిధశుభవర్ణములును యథావస్థితావయవరూపశోభయును శుభగమనము జవమును జక్కని నేత్రములుండిన యవి శ్రేష్ఠాశ్వములు. మేఘవర్ణమును సాంద్రఘనగర్జనమును శ్రేష్ఠగంధమును గజమువలె సింహమువలె నడకయు నితరగంధాది లేపనమొనర్చినను మాత్స్యగంధముగల గుర్రము నృపయోగ్యమగును. ... ... ... ... ...

ఎవనిగృహాంగణమున నిత్యము మధురముగ గుర్రమరచిన యాతనికి సంపదయు కీర్తియును తుష్టియు పుష్టియును నష్టిలేక నిత్యముండును. క్రౌంచవలె గజముభంగి మేఘసింహములకీతిని గుర్రమరచిన శత్రుజయమగును. శంఖధ్వనివలె యరచిన సౌభాగ్యము. సముద్రఘోషవలె యరచిన కీర్తియును గలుగును. గాడిదె కాకి పిల్లి లొట్టిపిట గుడ్లగూబలవలె యరచిన గుర్రపు యజమానికి భయమును రోగమునగును. మధురమగునటుల క్రమముగ నధికధ్వనిని స్పష్టముగ దంతములగపడకుండ ముఖమెత్తియరచిన గుర్రము దానియజమానికవిచ్ఛిన్నసంతతినిచ్చును. తీక్ష్ణముగ హీనమగునటుల తెంపుగ నధోముఖముగలిగి నోరుదెరచి కన్నీళ్లతో కంపము కలిగి యరచిన గుర్రము దానియజమానికనిష్టముజేయునని యశ్వనిదానము.

శాలిహోత్రమందగు సవారుయొక్క లక్షణములను జెప్పుచున్నారము.

దృఢముగగూర్చుండువాడు, నడపించు నేర్పరి, వాగులుబట్టుటెరుగువాడు, అలసతలేనివాడు, విరాగములేనివాడు, స్థిరుడు వీరలు గుర్రమును సవారగుటకర్హులు. గుర్రముయొక్క హృదయమును దెలయనిసవారు శిక్షించినగుర్రమతనికి సవారీనివ్వదు. మొదట శిశువునువలె ముందుగ మెల్లమెల్లన నడపించదగును. వంకగానైన చాతానువెనుకకువిరచియైన వంగియైన నధోముఖుడైగాని డీలాగానైన గూర్చుండనివాడశ్వములను సవారగుటకు సమర్థుడు. కదలకుండ వంచని పాదములుకలవాడై స్థిరముగ ఛాతా యెత్తి దృఢముగ నుత్తమ గుర్రముపైని గూర్చుండువాడు వాహకుడు మిగిలినవాళ్లు గుర్రమునకు భారమాత్రులు కాని సవారులుగారు.

వాగులు మీదికి చిమ్మియును వదులుగాను మీదికి సమముగ బట్టియును సామాన్యముగబట్టుటయును బాజీనిమిత్తము పైకిబట్టుటయును వకనాతనె చిమ్ముట మెడయొక్క సగమునకు సమముగబట్టుట వేరువేరుగా నొక్కొక్కటెబట్టుట మిక్కిలియును జిమ్ముటర చేతనుయెత్తిబట్టుట ముఖమువంచుటకు దిగువ్వనకుబట్టుట గోకర్ణాకృతిగ బట్టుటయునను పదునాలుగువిధములనుగా వాగు

లపట్టులు దెలియదగును. అశ్వశిక్షకవిగీబట్టుట కోళ్లానుగొట్టుట హుంకరించుట మడమజేసుట గిలకను ధ్వనిజేసియును కళ్లెముచే ప్రేరణజేసుటయు నను నారువిధములచే ప్రేరణజేయదగును.

చెలివెల నధరమున శ్వేతఫేనబిందువుల విడచుటచే సుందరము ఫూత్కారవాయువు కలదియును మెడ మీదికెత్తి శిరము ఝుకాయించుచుండెడి ముఖమును కొత్తసవారు సవారీకి దతుప్పధమున సాధ్యమగు నశ్వమునకు ముఖసిద్ధాశ్వమని పేరు.

తొమ్మిదివిధములశ్వగమనవీధులని గొందరిమతము. దుష్టాశ్వశిక్షకావశ్యకమితరాశ్వములకునుగమనదార్ఢ్యార్థమని జెప్పుచున్నారు. అవియెట్టివనినసమమై యున్నతప్రదేశము నిమ్నోన్నతప్రదేశము నుదకపూర్ణము పాషాణాదిరహితమును నిమ్నమైన యగ్రప్రదేశము కలదియును పార్శ్వములందున్నతమగునదియు నెత్తుగాగలదియును సకలవీధులందెగుర్రము దృఢశిక్షితమందు నిశ్శంకగనుండునో ఆగుర్రము రాజులకు వేటయందును రణమందును సంతుష్టిని జేసును. ... ... ... ... ...

శోభనమగునవయవములచేతను వక్షస్థలము నేలకు తగులునటుల నడచునది శిరమును నేలకుతగులునటులనడచునది యున్నతముగ శరీరమును బెంచినడచునది వంగినడచునదియు నాలీఢమనియు సామాన్యగమనము ప్రత్యాలీఢమనియును జెప్పబడును.

పల్లవమువంటి పాదమును చెలింపజేయుచు నశ్వముయొక్క కర్ణమధ్యమందున బ్రసరింపజేయు దృష్టికలవాడును నడుముమీదకదలకుండ దృఢముగ గూర్చుండువాడును గుర్రపు హృదయము దానికిగల ముందుతలంపును స్థానమెరిగి కోళ్లాను జేసువాడును గుర్రపు సవారీకి తగినవాడు వానిని రాజన్యులు పూజింతురు. ... ... ... ... ...

గుర్రములకు ముప్పదిరెండువత్సరము లాయుర్దాయము పదియవస్థలు అవస్థ ౧కి వత్సరములు 3 మాసములు ౨ దినములు ౧౨ వీటిలో మధ్య నారు దశలు ప్రశస్తమైనవి. క్షేత్రానుసారముగ వీటికి శుభాశుభఫలమగును.

పూర్వము సముద్రమథనకాలమందరవిందభవుని శ్వేదబిందుసందోహము వాయువుచే దెలించుచున్న వహ్నిమధ్యమందు పొందించబడి యశ్వములై జన్మించెను. ఇందువలన హయములు వహ్నిసంభవములని చెప్పబడును.

కురుదేశమందుబుట్టిన గుర్రములు మదించినక్రౌంచములవంటి ధ్వని గ లిగి యతిదూరగమనమందు సామర్థ్యము శరీరమందు కార్శ్యము సమదంతత్వ ము తాబేళ్లవంటి కన్నులు కలవై యొప్పును.

కాశ్మీరదేశోద్భవములగు హయములు మిక్కిలి వేగము మంచిరూపము వర్ణము గలిగి సాంద్రమగు వాలము కేసరములును మిక్కిలి చంచలమగు పాద ములును గలవయ్యొప్పును.

బాహ్లీకదేశోత్పన్న హయములకు విస్తారము పృష్ఠభాగము కలుగును. అధికమగునాహారమును గంభీరమగు హేషాధ్వనులును సింహసమానమగు గమ నమును మిక్కిలి సహనమును గలిగియుండును.

ఘూర్జరదేశమందు జన్మించిన ఘోటకములతిదీర్ఘమయినారసమకంఠము లును, మేఘగంభీరధ్వనులును, కృశించి కుక్కుటసమానపదములును, అధికమ గు భారమును సహించునవియును, ప్లుతగతియందు ప్రియము గలిగి వేగవంత ములైయుండును. ... ... ... ...

కాంభోజదేశసంభవములగు వాహములు ఘనమగు శౌర్యము సుందర మగు వక్షము నధికమగు పొడవును గొప్పశిరస్సును చాంచల్యమును చతుర్విధ గమనములును గలిగి విలసిల్లును. ... ... ...

పాంచాలదేశజాతములగు హయములు నయవంతములై బలవంతము లగుచు పతిభావానుగతములై జవయుక్తములై యుద్ధమందు కంపములేక సొంపుమీరియుండును. ... ... ... ...

యవనదేశభవములగు గాంధర్వము లతులితగతిరచనాశీలములును స్వ ల్పవాలములును సమగాత్రములు నతిచంచలనేత్రములును సమరమునందు భ ర్తృరక్షణతత్పరములునై తేజరిల్లును.

వనాయువను దేశోత్పన్నమగు వాజులు తమంతట తాము శిక్షితములు విస్తారమగు శరీరము ఘనసింహనాదమువంటి హేషయు దీర్ఘములగు నేత్ర ములు స్వల్పమగు కేసరములు హాసభాసలగు వాస్యము గలిగి యుల్లసిల్లును.

హూణదేశభవములగు నశ్వములు కోపయుక్తములును స్వభావముచే తీవ్రగమనముగలవియును మనోహరమగు హేషలును దార్ఢ్యము సౌన్నత్యము నుపకారజ్ఞానమును సురూపమును గలిగి చెలంగును.

సింధుదేశసంభవములగు సైంధవములు సకలావయవసౌందర్యయుక్తములును యించుకవంచిన ముఖము గలిగి మృదునాదయుక్తమై యతివేగవంతములగును. ... ... ... ... ...

సౌవీరదేశభవములగు తురగములు జవము బలము గొప్పకడుపును విస్తారమగు ముఖమును గజరాజగమనమును నలువుగలిగి తిన్ననగుకన్నులును గలిగి యలరారును. ... ... ... ...

సౌరాష్ట్రదేశోత్పన్నములగు సప్తులు మధురస్వరనాదములు బహుజవసత్వవంతములతిసూక్ష్మమస్తకములాయతశరీరము నతిప్రశస్తరూపములై చూపరులకాహ్లాదముగనుండును. ... ... ... ...

కళింగదేశభవములగు రథ్యములతిభీతియుక్తమును స్థూలశరీరము నతికాముకములు బహుసంచారసహములును మహాబలయుక్తములై యొప్పును.

నేపాలదేశీయములగునశ్వములు వక్రములగు దంతములును దృష్టి వాలము పృష్ఠమును గలిగి నిమ్నోన్నతస్థలమందు పరుగిడుటకు సమర్థములై తమ ప్రభువుకు సౌఖ్యముజేయుచు మేఘగంభీరధ్వనులై తనరును.

మాలవదేశోద్భవములగు ఘోటములతివేగవంతము లత్యున్నతము లతిదృఢదేహము లకంపితము లతిదూరగమనసమర్థము లతిప్రసిద్ధములై కుతుకము జేయును. ... ... ... ... ...

ఉత్తమాశ్వములకు నూరంగుళములపొడవునందు పదియారవపాలు తక్కువగలవి మధ్యమాశ్వములందులో నెనిమిదిపాలు తక్కువగలది కనిష్ఠమని చెప్పబడెను. ... ... ... ...

సకలసులక్షణయుక్తములగు తురగము లేరాజుచెంగటమెలగు నారాజుకు కీర్తి లక్ష్మి విజయ విభవాతిశయములు ధ్రువములైయుండు రణమందు ఖడ్గఖనత్కారభీషణములగు వాద్యఘోషములతో వీర్యవిజయలక్ష్ములచే నతుతుండగు నాక్షితిపతిని శుభ్రమగు కీర్తిమాలికచే నలంకరించి స్వయమువరించును.

## వృషభలక్షణాదయః

పరిణాహోవృషముఖాదుదరేతు చతుర్గుణః। సకకుస్త్రిగుణోచ్ఛంతు సార్ధత్రిగుణదీర్ఘతా। సప్తతాలోవృషఃపూజ్యోగుణైరేభిర్యుతోయది। తస్యాపీనచలైర్మందస్నవో ధాహ్యాంగసుందరః। జాతిరూక్రస్సువృష్ట్యశ్చ వృషభశ్శ్రేష్ఠ

ఉచ్యతే। త్రింశద్యోజనగంతా వా ప్రత్యహం భారవాహకః। నవతాలశ్చ సుదృఢస్సుముఖోష్టః ప్రశస్యతే। వృషస్యాష్టౌ సితా దంతా చతుర్ద్ధర్భైఃఖిలాస్స్మృతా। ద్వావంత్యౌ పతితోత్పన్నౌ పంచమే బ్దేహితస్య వై। షష్ఠే తు యాంత్యౌ భవతస్సప్తమే తత్సమీపగౌ। అష్టమే పతితోత్పన్నౌ మధ్యమౌ దశనాఖలు। కృష్ణపీతసితారక్తశంఖాభాశ్చ ద్వికే ద్వికే। క్రమాదబ్దే చ భవతశ్చలనం పతనం తతః। ఉష్ట్రైస్స్వోక్తప్రకారేణ వయోజ్ఞానం తు వా భవేత్। నాసికాకర్షరజ్వా తు వృషోష్ట్రం వినయేద్భృశం॥ తీక్ష్ణాగ్రియస్సప్తఫాలస్స్యాదేషాం మలశోధనే। సుతాడనైర్వినేయా హి మనుష్యాః పశవస్సదా। సైనికాస్తు విశేషేణ సతతైర్వై ధృతదండతః। గజోష్ట్రవృషభాశ్వాః ప్రాక్ శ్రేష్ఠాస్సంభారవాహనే। సర్వేభ్యశ్చ శకటా శ్రేష్ఠా వర్షాకాలం వినా స్మృతాః॥ పరాశరః ప్రాహ బృహద్రథాయ గోలక్షణం యత్క్రియతే తతోఽయం। మయా సమాసశ్శుభలక్షణాస్తాస్సర్వాస్తథాప్యాగమతోఽభిధాస్యే॥ సాస్రావిలరూక్షాక్ష్యో మూషకనయనాశ్చ నశుభదా గావః। ప్రచలచ్చిపిటవిషాణాః కరటాః ఖరసదృశవర్ణాః। దశ సప్త చతుర్దంత్యః ప్రలంబముండాననా వినతపృష్ఠాః। హ్రస్వస్థూలగ్రీవా యవమధ్యా దారితఖురాశ్చ। శ్యావాతిదీర్ఘజిహ్వా గుల్ఫైరతితనుభిరతిబృహద్భిర్వా। అతికకుదాః కృశదేహా నేష్టా హీనాధికాంగ్యశ్చ। ఋషభోఽప్యేవం స్థూలాతిలంబవృషణశ్శిరాతతక్రోడః। స్థూలాశిరాచితగండస్త్రిస్థానం మేహతే యశ్చ। మార్జారాక్షః కపిలః కరటో వా న శుభదో ద్విజస్యేష్టః। కృష్ణోష్ఠతాలుజిహ్వః శ్వసనో యూథస్య ఘాతకరః। స్థూలశకృన్మణిశృంగస్సితోదరః కృష్ణసారవర్ణశ్చ। గృహజాతోఽపి త్యాజ్యో యూథవినాశావహో వృషభః। శ్యామకపుష్పచితాంగో భస్మారుణసన్నిభో బిడాలాక్షః। విప్రాణామపి నశుభం కరోతి వృషభః పరిగృహీతః॥ యే చోద్ధరంతి పాదాన్పంకాదివ యోజితాః కృశగ్రీవాః। కాతరనయనా హీనాశ్చ పృష్ఠతస్తేన భారసహాః॥ మృదుసంహతతామ్రోష్ఠాస్తనుస్ఫిజస్తామ్రతాలుజిహ్వాశ్చ। తనుహ్రస్వోచ్చశ్రవణాస్సుకుక్షయస్స్పృష్టజంఘాశ్చ। ఆతామ్రసంహతఖురా వ్యూఢోరస్కా బృహత్కకుదయుక్తాః। స్నిగ్ధశ్లక్ష్ణతనుత్వగ్రోమాణస్తామ్రతనుశృంగాః। తనుభూస్పృగ్వాలధయో రక్తాంతవిలోచనా మహోచ్ఛ్వాసాః। సింహస్కంధాస్తన్వల్పకంబలాః పూజితాస్సుగతాః। వామావర్తైర్వామే దక్షిణపార్శ్వే చ దక్షిణావర్తైః। శుభదా భవంత్యనడు

జంఘాభిశ్చైణకనిభాభిః। వైడూర్యమల్లికాబుద్బుదేక్షణాః స్థూలనేత్రవర్త్మాణః। పార్ష్ణిభిరస్ఫుటితాభిశ్చ స్తాస్సర్వేఽపి భారవహాః। ఘ్రాణోద్దేశే సవలి

ర్మార్జారముఖస్సితశ్చ దక్షిణతః। కమలోత్పలలాక్షాభస్సువాలధిర్వాజితుల్యజ వః। లంబైర్వృషణైర్మేషోదరశ్చ సంక్షిప్తవంక్షణాక్రోడః। నేయోభారాధ్వస హూ జవేశ్వతుల్యశ్చ శస్తఫలః। సితవర్ణః పింగాక్షః స్తామ్రవిషాణేక్షణోమ హావక్త్రః। హంసోనామశుభఫలో యూధస్య వివర్ధనః ప్రోక్తః॥ ఘూస్పగ్వా లధిరాతామ్రవంక్షణో రక్తదృక్కకుద్మీచ। కల్మాషశ్చస్వామినమచిరాత్కురు తే పతింలక్ష్మ్యాః। యోవాసితైకచరణో యథేష్టవర్ణశ్చ సోపి శస్తఫలః। మిశ్ర ఫలోపిగాత్రేస్యా యదినైకాంతప్రశస్తోసి॥ గావోదీనాః పార్థివస్యాశివాయ పాదైర్భూమింకుట్టయంతశ్చరోగాన్।మృత్యుంకుర్వన్త్యశ్రుపూర్ణాయతాక్ష్యః పత్యుర్భీతాస్తస్కరా నారువంత్యః॥ అకారణే క్రోశతిచేదనడ్వాన్ భయాయ రాత్రౌ వృషభశ్శివాయ। భృశంనిరుద్ధాయదిమక్షికాభిస్తదాశువృష్టిం సరమా త్మజైర్వా॥ ఆగచ్ఛంత్యో వేశ్మబంభారవేణ సంసేవంత్యో గోష్ఠవృద్ధ్యా గవాం గాః। ఆర్ద్రాంగ్యోవా హృష్టరోమ్ణః ప్రహృష్టా ధన్యాగావ స్స్యుర్మహిష్యో పి చైవం॥

## వృషభలక్షణాదులు.

అశ్వలక్షణలక్షితానంతరమునవృషభలక్షణములను జెప్పుచున్నారము.

వృషభముఖమానముకంటె చతుర్గుణముదరముయొక్క చుట్టుకొలత ముఖమానముయొక్క త్రిగుణము ముందరిడెక్కమొదలు మూపురమువర కు నెత్తుసాపు ముఖముయొక్క మూడున్నర గలిగియుండును. ఆరునొక్క డుగున్నతమైనను పైనిచెప్పినలక్షణములు కలిగియుండినను బొడ్డుయొక్క చల నముచేతను మందగమనముగలదియు బరువు బాగుగ మోయునదియు సుంద రావయవములు గలదియును యితరవృషభముల ధిక్కరించునదియు బలసిన దియునగు వృషభశ్రేష్ఠము పూజ్యమునగు. ముప్పదియోజనములు ప్రతిదినము ను బరువుతోనడచునదియును తొమ్మిదడుగులుపొడవుగలదియు మిక్కిలి దృఢ మైనదై యోగ్యమగు ముఖమును పెదెవలును గల వృషభము ప్రశస్తము. వృ షభముయొక్క దంతములెనిమిది- సంవత్సరములు నాలుగయ్యేవరకు పూర్తి యగును. ఐదవసంవత్సరమునకడలూడివచ్చును. ఆరవవర్షమున వాటిదగ్గిరదం తములూడివచ్చును. ఆరునొకవత్సరమునవాటిదగ్గిరవి రాలివచ్చును. ఎనిమిదవ వత్సరమున వాటిమధ్యదంతములూడి దిరుగ వచ్చును.

నల్లని పచ్చని తెల్లని యెఱ్ఱని రంగులు క్రమమున నాల్గవసాలుమొ దలుగలిగి రెండేసిపళ్లూడివచ్చును. లోటివిటమును పైనిజెప్పిన వృషభమువతె

నే వయస్సును తెలియదగును. వృషభోష్ట్రములను ముకుదాడు బొడిచి శిక్షించదగును. తీక్ష్ణమైన యినుముచేరచించిన యారునొకమూళ్లుగల దంతివచేత ను వీటిమలమును ప్రతిదినము దీసి యవికట్టెడి స్థలమును శోధించదగును. మనుష్యులను పశువులను దెబ్బలచేతను శిక్షించవలెను. సైన్యమందుండు గజాశ్వవృషభోష్ట్రములు నిత్యమును శిక్షించకుండిన పూర్వాభ్యాసమును మరచిపోవును. గజోష్ట్రవృషభాశ్వములు భారవహనమందు మొదటినుంచి శ్రేష్ఠములని గ్రహించవలెను. శకటము విశేష బరువు నేయుట కనుకూలము వర్షేతర కాలములందు. ... ... ... ...

పరాశరులవారు బృహద్రిసురికొరకు గోలక్షణములను జెప్పియుండిరి. వాటిసంక్షేపముగ జెప్పుచున్నారము. శిల్లోకను రక్తముగలిగిన నేత్రములుగలవియును మొలుకకళ్లవంటికళ్లు గలగిన యావులు శుభమునివ్వవు. కదులుచుండెడు కొమ్ములును సూక్ష్మముగను గలదియు కాకిగాడెదవంటి రంగు గలదియు నాలుగో కటికినాలుగుదంతములు గలవియును వంగినముఖమును కొమ్ములేనివియును నిమ్నమైనపృష్ఠభాగముకలవియును పొట్టిగవలము కలిగినకంఠమును సూక్ష్మముగునపుమును బద్ధలైనదెక్కలును కపిలవర్ణముతీక్ష్ణముగల జిహ్వయును కాలుగుత్తులు మిక్కిలియున్నను విశేషవలముగ మూత్రమును దేహము చిక్కియుండిన యు ప్రమాణముకంటె హీనాధికశరీరముగలగోవులు శ్రేష్ఠములు కావు. వృషభములకును పైలక్షణములు కూడను.

స్థూలములును వేలాడువృషణములును వృషభములకు గూడవు. ముందర జబ్బలమధ్యను నరములగపడుట యును గండస్థలములందు నరములుబయలుపడియుండుటయును మేహనమును మూడుగుంపులుగలగియుండినను పిల్లికళ్లు కపిలవర్ణములగు కళ్లు నల్లనిరంగుగల వృషభము ద్విజులకు కూడదు. నల్లనైపెదవియును తాలువుయును నాలుకయును గలవియు విశేషనిట్టూర్పు నిచ్చు వృషభము మందుమందను నశింపజేసును. విశేషముగ పేడకడెని వేయునదియును కొమ్ములచివరనుండలవలెనుండునది తెల్లనిరంగుగల కడుపును మిగిలినశరీరము నల్లనైనిరంగుగలిగియుండునది యునగు వృషభము స్వగృహోత్పన్నమైనను మందను నశింపజేయును గాన త్యజించదగును.

నల్లని లేక భస్మమువలెను లేకనరుణిమయును గల పూతపూసినదియును పిల్లికండ్లుకలదియునగు వృషభము ప్రతిగ్రహలబ్ధమై బ్రాహ్మణునివద్దనుండినను శుభమివ్వదు. కాడినైన బండినైన బూన్చినవృషభములు బురదనుంచి

కాళ్లుత్రోసినటులనడచినను పొట్టిమెడయును భయభ్రాంతనేత్రములు గలవైనను వెన్నుముల్లు మీదికగపడిన నట్టివి భారవహనయోగ్యములుకావు. మృదువై కలసియుండిన మెరసినగు పెదివెలును సూక్ష్మమగు పొత్తికడుపును మెరసిన దవడలును జిహ్వయును గలవి సన్నమై మృదువై వాలకుండ మీదికుండిన చెవులును మంచికడుపును స్పష్టమగుపిక్కలును కలిసియుండి మెరసినైన డెక్కలు గలవియును విశాలవక్షమును గొప్పమూపురమును నునుపై మృదువై సూక్ష్మమైయుండిన చర్మమును రోమములును మెరసినై సూక్ష్మమైన కొమ్ములును సన్నమై భూమినితగులుచున్న తోకయును రక్తిమగల నేత్రాంతముగలిగి గొప్ప నిట్టూర్పునిచ్చినవియు సింహమువంటిభుజశిరములును సూక్ష్మమును దళసరలేనిదియునగు గంగడోలును మంచినడకగలిగినదియునగు వృషభము పూజించబడును. వృషభమున కెడమవైపున దిరిగియుండి సుడు లెడమపార్శ్వమునందుండిన శుభమిచ్చును- లేడిపిక్కలవంటి పిక్కలుకలవియును శుభమిచ్చును.

వైడూర్యమల్లికాపుష్పబుద్బుదసమనేత్రములును స్థూలమగు రెప్పలును బద్దలుగాని మడమలును ఈచెప్పబడినలక్షణములన్నియునుగల వృషభము భారవహనయోగ్యము. నాసికమీద మడతలుండినను పిల్లిముఖమువంటిముఖము గలిగినను ఆముఖముయొక్కకుడివైపు తెల్లగనుండినను కలువలు కమలములు లక్కతోతుల్యమగురంగును మంచితోకయును గుఱ్ఱమువలె పరుగిడునదియునగు వృషభము శ్రేష్ఠము. మేకవంటికడుపు వ్రేలాడుబీజములు సంక్షిప్తమైన వక్షస్థలముకలదియును బరువుమోయుచు మార్గమును గుఱ్ఱమువలె జవముగలిగి నడచును. తెల్లనిరంగును పచ్చనికన్నులును మెరసినికొమ్ములు రక్తమగునేత్రాంతములు పెద్దముఖమునుగల వృషభమునకు హంసయనిపేరు. దానియజమానికి శుభమిచ్చును- మందను వృద్ధినొందించును. భూమినిస్పృశించువాలము వక్షమునకు దిగువముందర కాళ్లమధ్యనుండుస్థలమును కళ్లును మూపురమును యెఱ్ఱని దిగనున్నదగు వృషభము దానియజమానికి లక్ష్మీప్రాప్తిని జేసును.

ఏవృషభమొకకాలు తెల్లనై దేహమంతయు మరియొకవర్ణము కలదై యుండునో యావృషభము మంచిఫలమిచ్చును. బాగుగ తెల్లనిరంగుండగ మిశ్రవర్ణమైనను ప్రశస్తమగును. గోవులు దీనములైన రాజునకమంగళమును జేసును. పాదములచేతను భూమిని త్రవ్వుచుండిన దానియజమానికి రోగమును మృత్యువును జేసును. భయముగలవై కన్నీరులుగల కన్నులతోనుండిన తస్కరబాధను గలిగించును. కారణములేక రాత్రియందరచిన భయమగును. అటుల వృషభమరచిన శుభమగును. ఈగలచే శునకములచే నత్యంతమరికట్టబడినను

వృష్టిని జేసును. గృహమునుగూర్చి గోవులు బంభారవములచే వచ్చిన గోవృ ద్ధియగును. తడచినశరీరములందు పులకరించిన రోమములు గలిగి సంతోషయుక్తములైన గోవులు ధన్యములు. గేదెలును యిదేప్రకారము.

ఉష్ట్రారోహణ దుర్గుణాః

ఉష్ట్రారోహణమంగజోదయహరం సౌభాగ్యనిర్నాశనం సర్వాంగీణ రుజోపధాన నిలయం కష్టం కలిప్రేరణం। శ్లేష్మాటోపనివారణం గుదగదాప్రోద్వర్తనాయోగదం కుర్యాత్పైత్యవిజృంభణం జ్వలనకృత్స్వప్నేపి నో శస్యతే॥

లొటిపిటను సవారగుటచే రేతఃపతనమగును. సౌభాగ్యమును నశింపజేసును. సకలావయవములకు పీడజేసును. కలినిప్రేరణజేసును. శ్లేష్మమును బోగొట్టును. మూలశంకరోగమును గలిగించును. పాయుస్థానమందు మృదాదిలేపనమునకనర్హముజేసును. పైత్యరోగవృద్ధిని తాపమునుజేసును. గాన స్వప్నమందైన సవారీకాకూడదు.

శిబికారోహణగుణాః

సౌభాగ్యవర్ధనీ హృద్యా శిబికా రాజపూజితా। వాతపైత్యహరా చైవ నష్టవహ్నివివర్ధనీ। రాజరాజపదప్రాప్తేర్హేతుస్సర్వగుణాన్వితా॥ ఆందోళికారోహణమగ్నిదీప్తేర్వివర్ధనం కాంతికరం శ్రమఘ్నం। సముద్రపుత్రీనిలయం వదంతి కీర్తిప్రదం పుష్టివివర్ధనంచ॥

సౌభాగ్యవృద్ధినిజేసును. హృద్యము, రాజపూజితము, వాతపైత్యహరము, కృశించినజఠరాగ్నిని వృద్ధినిజేసును. రాజరాజపదప్రాప్తికి హేతువగును. సకలగుణములతోగూడియుండును. కాంతినిజేసును. శ్రమను బోగొట్టును. లక్ష్మీనివాసము, కీర్తికరము, దేహపుష్టిని జేసును. గావున శిబికారోహణము ప్రశస్తము.

రథారోహణ గుణాః.

మాంగళ్యం హృదయాహ్లాది శ్వేదనందీపనం సుఖం। వాతపైత్యహరం రూక్షం స్యందనారోహణం స్మృతం॥

రథారోహణము మాంగళ్యప్రదము- హృదయమును వికసింపజేసును. చెమటను బుట్టించును. జఠరోద్దీపనము సుఖమును జేసును. వాతపైత్యములను బోగొట్టును. దేహమునకు నునుపుజేసును.

## బలీవర్దవహన శకటయాన దుర్గుణాః

అథ బలీవర్దవాహ్యా శకటగుణాన్బ్రువే॥ విశేషాచ్ఛకటాద్యానమంగభంగకరం స్మృతమితి॥

గుఱ్ఱములను బూన్చిన యరదము గుణములను జెప్పితిమి- ఎడ్లనుబూన్చిన శకటారోహణగుణములను జెప్పుచున్నారము.

శకటారోహణముచేతను విశేషముగ నవయవములకు నొప్పిగలుగును.

### శిరోవేష్టనగుణాః

పవిత్రం కేశ్యముష్ణీషం వాతపరజోపహం। వర్షానిలరజోఘర్మహిమాదీనాం నివారణమితి సుశ్రుతే॥

శిరసుందుంచు పాగా మొదలైనవి వాతము నెండను పరాగమును బోగొట్టును. వర్షమును మంచు మొదలగువాటిబాధను వారించునని సుశ్రుతము.

### ఛత్రి దండ పాదత్ర ధారణ గుణాః.

పుణ్యం నేత్రహితం ఛత్రం వాతవర్షాతపాపహం। సౌభాగ్యకరణం లక్ష్మీప్రధానసిలయంభవేత్॥ స్యాత్పట్టవస్త్రావృతరవ్యఛత్రం మనోహరం కాంతికరం బలప్రదం। లక్ష్మీప్రియం నాతఃధూళివాతవినాశనం పట్టసహీశయోగ్యమితి చరకః॥ వర్షాతపాదిషు ఛత్రీ దండీ రాత్ర్యటవీషుచ శరీరత్రాణకామోవై సోపానత్కస్సదాచరేదితి విష్ణుపురాణే॥ శునస్సరీసృపవ్యాలవిషాణిభ్యోభయాపహం। శ్రమస్ఖలనదోషఘ్నం స్థవిరేవ ప్రశస్యతే॥ చక్షుష్యంచ తథాపథ్యం శ్రీకరం శోభనం మహత్। ఆయుష్యంచ యశస్యంచ పాదుకం సర్వదా శుచి॥ మాంగళ్యం సర్వదోషఘ్నం తుష్టిపుష్టియశస్కరం। చక్షుష్యమాతపంహంతి పాదత్రాణంచ జాయతే॥ చర్మావృతాంఘ్రిరక్షశ్చ కంటకాదిభయాపహః। తిమిరాతపపాషాణపీడాపరిహారిస్త్వధేచరకః॥ పాదరోగహరంవృష్యం రక్షోఘ్నం ప్రీతివర్ధనం। సుఖప్రచారమోజస్యం సదా పాదత్రధారణం। అనారోగ్యమనాయుష్యం చక్షుషోరుపఘాతకృత్। పాదాభ్యామనుపానద్భ్యాం సదా చంక్రమణం నృణామితిసుశ్రుతే॥

### ఛత్రిదండపాదత్రిధారణగుణములు.

ఛత్రధారణము పవిత్రము నేత్రములకు హితము వాతవర్షాతపముల వారించును. సౌభాగ్యమునుజేసును. లక్ష్మికి ప్రధానస్థానము. పట్టవస్త్రావృతరమ్యఛత్రము మనోహరము, కాంతిదము, బలమిచ్చునది, లక్ష్మికి ప్రియము,

ఎండతోగూడిన ధూళివాయువును బోగొట్టును. పట్టుపురాజుకు తగినదైయుం డునని చరకులు.

వర్షాతపములందు ఛత్రమును రాత్రియందటనము జేయుటలో దండ మును శరీరరక్షణేచ్ఛగలవాడు సర్వదా పాదుకలను ధరించి నడచునని విష్ణు పురాణము. తమకిచ్ఛగుతరహా పాదుకలు విశేషశోభనము, నాయుష్కరము, కీర్తికరము, శుచియొనర్చును. మాంగళ్యము సకలదోషములను బోగొట్టును. తు ష్టిని బుష్టిని జేయును. దృష్టికనుకూలము యెండబాధనుబోగొట్టును. చర్మావృ తపాదుకలు ముళ్లుమొదలగుబాధలను చీకటి యెండ రాళ్లవల్ల వచ్చు బాధల ను బోగొట్టుననిచరకులు. పాదత్రము పాదరోగములను బోగొట్టును. సర్పా దిదుష్టకీటమృగములకు భయమొనర్చును. పిశాచాదిపరిహారము సంతోషకరము సుఖముగ నడువనర్హము తేజమిచ్చును గాన సర్వదాధరించుమనియును జోడు లేకనడచుటచేనాయు రారోగ్యదృష్టులకులోపమును జేసుననియునుసుశ్రుతులు.

రత్నాద్యలంకారధారణగుణా స్తద్రత్నలక్షణ తత్ఫలానిచ.

రత్నాలంకృతిధారణం రతికరం లక్ష్మీవిలాసాస్పదం మాన్యం కామఫ లప్రదాయి సుభగం మాంగళ్యమాయుష్కరం। ఓజఃకాంతియశఃప్రభావజన నం దోషఘ్నమత్యుజ్వలం భూతోన్మాదభయప్రమక్లమవిషఘ్నేంద్రియత్వాప హం॥ క్రమేణ నవగ్రహప్రీతికరాణి రత్నాన్యాచ్యంతె॥ ఆదిత్యస్యతుపద్మరాగ మమలం ముక్తాఫలం శీతగోర్మాహేయస్యతు విద్రుమం మరకతం సౌమ్యస్య గారుత్మతం। దేవేజ్యస్యతు పుష్యరాగ మసురామాత్యస్య వజ్రం శనే ర్నీలం నిర్మలమన్యయోస్తు కధితే గోమేధవైడూర్యకే॥ మహాంబురాశౌ సరితి పర్వతే కాననేపివా। రత్నానామాకరంప్రాహు స్థానమాధేయగౌరవాత్॥ సింహళే తు భవేద్రక్తం పద్మరాగమనుత్తమం। అరుణపద్మవద్రాగో యస్య పద్మరా గః॥ పీతకాలపురోద్భూతం కురువిందమితిస్మృతం। అశోకపల్లవచ్ఛాయం మ ద్రేసౌగంధికంభవేత్। తుంబురుచ్ఛాయయానీలం నీలగ్రంధిచకీర్తితం॥ ఉత్తమం సింహళోద్భూతమధమం తుంబురూద్భవం। మధ్యయోర్మధ్యమం జ్ఞేయం మా ణిక్యం క్షేత్రభేదతః॥ ద్విచ్ఛాయం ద్విపదం భిన్నం కర్కశం లశునప్రభం। స మలంచ జడం ధూమ్ర మిత్యష్టౌ పరికీర్తితాః। ఛాయాద్వితయసంబంధం ద్వి చ్ఛాయం బంధునాశనం। ద్విరూపం ద్విపదం తేన మాణిక్యస్య పరాభవః। సం భేదం భిన్నమిత్యుక్తం శత్రుఘాతవిధాయకం। కర్కశం శర్కరాయుక్తం ప శుబంధువినాశనం। దుగ్ధేనేవ సమాయుక్తమశనం లశునప్రభం। మలబంధ్య మాయుక్తం సమలం సర్వదోషకృత్। రాగహీనం జడంప్రోక్తం ధాన్యం...

పరాధకృత్। ధూమ్రిం ధూమ్రిసమాకారం వైద్యుతం భయమావహేత్। ఏవం దోషయుతా నింద్యా మణయో మాల్యవర్జితాః। ఛాయాతుపద్మరాగస్య రక్తకోకనదప్రభాః। ఖద్యోతాగ్నిచకోరాక్షి కోకిలాక్షిసుసన్నిభా। స్నిగ్ధంగురుర్మాత్రియుక్తం రిక్తం స్వచ్ఛం సమాంశుపింగంచ। ఇతి కురుతే కళ్యాణం మాణిక్యం ధారయేద్యస్తు। మాణిక్యం మధురం స్నిగ్ధం వాతపైత్యప్రణాశనం। రత్నప్రయోగేషు వరం రసాయనకరం పరం॥

## పద్మరాగమణిగుణాః.

పద్మరాగగుణగణానామధకరోమి శ్రీగారుడోక్తం॥ సౌగంధికోక్తాఃకురువిందజాశ్చ మహాగుణాస్స్ఫాటికసంప్రసూతాః। బంధూకగుంజాస్సకలేంద్రగోపజపాశశాసృక్సమవర్ణశోభాః। భ్రాజిష్ణవో దాడిమబీజవర్ణాస్తథాపరే కింశుకపుష్పభాసః। సిందూరపద్మోత్పలకుంకుమానాం లాక్షారసస్యాపి సమానవర్ణాః। సాంద్రేతు రాగప్రభయాయుతా వై భవంతి లక్ష్యాస్స్ఫుటమధ్యశోభాః। భాగైశ్చ భాసా మనువేధయోగ మాసాద్య రశ్మిప్రకరేణ దూరం। పార్శ్వాణి సర్వాణ్యనురంజయంతి గుణోపపన్నాస్స్ఫటికప్రసూతాః। చకోరపుంస్కోకిలసారసానాం నేత్రావభాసాశ్చ భవంతి కేచిత్॥ అన్యే పునర్నాతి విపుష్పితానాం తుల్యత్విషః కోకనదోత్తరాణాం। ప్రభావకాఠిన్య గురుత్వయోగ్యైః ప్రాయస్సమానాస్స్ఫటికోద్భవానాం। ఆనీలరక్తోత్పలచారుభాసః సౌగంధికోత్థా మణయో భవంతి। కామంతు రాగం కురువిందజేషు సైవేహయాదృక్స్ఫటికోద్భవేషు। నిరర్చిషోంతర్బహులాభవంతి ప్రభావయంతోపి నతైస్సమస్తైః। యేవా రావణగంగాయాం జాయంతే కురువిందకాః। పద్మరాగసమం రాగం బిభ్రాణాస్సుస్ఫుటార్చిషః। వర్ణానుయాయిన స్తేషామనుదేశే తథాపరే। నజాయంతేపి యే కేచిన్మందవేగమవాప్నుయుః। తత్రైవ స్ఫటికోద్భానాం దేశే తుంబురసంజ్ఞికే। కాధర్మాణః ప్రజాయంతే స్వల్పమూల్యాహి తే స్మృతాః॥ వర్ణాధికం గురుత్వంచ స్నిగ్ధతా సమతాశ్రితా। అర్చిష్మత్తా మహత్తాచ మణీనాం గృహసంగ్రహాః॥ యే కర్కరాస్సిద్ధఘనోపయుక్తా దేశేషు జాతాః పరుషావివర్ణాః। న తేప్రశస్తా మణయో భవంతి సనాతనో యాతి గుణైస్సమస్తైః। దోషోపసృష్టంతు మణిం ప్రమాదాద్బిభర్తి యః కశ్చన కించిదేవ। తంశోకచింతామయమృత్యువిత్తనాశాదయో దోషగుణా భజంతే॥ కామం చారుతరాః పంచజాతీనాం ప్రతిరూపకాః। విజాతయః ప్రయత్నేన విద్వాంస్తానుపలక్షయేత్॥ కలశపురోద్భవసింహళతుంబురుదేశోద్భవముక్తపాణీయాః। శ్రీవర్ణ

కాశ్చ సదృశాః ద్విజాతయః పద్మరాగాణాం॥ తుషోపసర్గాత్కలశాభిధానమాతామ్రప్రభావాదపితుంబురుశ్చ। కార్ష్ణం తథా సింహళదేశజాతం ముక్తాభిధానం నభసస్స్వభావాత్॥ శ్రీపర్ణకం దీప్తివినాకృతత్వాద్ద్విజాతిలింగాశ్రయ ఏవ భేదః। యస్తాపికాం పుష్యతి పద్మరాగో యోగాత్తుషాణామివపూర్ణమధ్యః। స్నేహప్రదిగ్ధః ప్రతిభాతియశ్చ యోవామలో నప్రజహాతి దీప్తిం। ఆక్రాంతమూర్ధావ తథాంగుళీభ్యాం యఃకాళికాం పార్శ్వగతాం బిభర్తి॥ సంప్రాప్యచోత్క్షేపపదానువృత్తిం బిభర్తి యస్సర్వగతాం తథైవ। తుల్యప్రమాణస్యచ తుల్యజాతో యోవాగురుత్వేన భవేత్తుతుల్యః। ప్రాప్యాపి వజ్రాకరజాం స్వజాతిం లక్షేద్గుణత్వేన గుణేన విద్వాన్॥ అప్రణస్యతి సందేహే శిలాయాం పరిలేఖయేత్। స్వజాతకసముద్ధేన లిఖేద్వాపి పరస్పరం। వజ్రంవా కురువిందంవా సూచ్యతే నేన కేనచిత్॥

రత్నధారణగుణములు, నవరత్నముల లక్షణములు, ఆభరణ
ములు ధరించుటచేనగు ఫలములు మొదలగునవి.

రత్నాద్యలంకారములు ధరించుటచే దృష్టాదృష్టఫలములగునని చరకాదిమునులు చెప్పుచున్నారు. ... ... ... ...

రత్నాలంకారధారణము ప్రీతికరము లక్ష్మీప్రాప్తిహేతువు. పూజ్యము. సూర్యాద్యధిదేవతలవలన నిష్టప్రాప్తియు ననిష్టవారకమునగును. సౌభాగ్యము మంగళముల నాయుర్వృద్ధిని తేజమును కీర్తిని నోజస్సు సామర్థ్యమును బుట్టించును. దోషములనణచును. విశేషప్రకాశమును జేసును. భూతములవలన బుట్టెడి యున్మాదభ్రమను నలవిక విషభయక్షీణేంద్రియత్వమును బోగొట్టును.

సూర్యునకు పద్మరాగము, స్వచ్ఛమగు మౌక్తికము చంద్రునకు, కుజునకు పవడము, బుధునకు పచ్చ, గారుత్మతము గురునకు, శుక్రునకు వజ్రము, శనికి నీలము, గోమేధిక వైడూర్యములు రాహుకేతువులకు ప్రీతికరములు.

సముద్రమందు నదులందు గిరుల నరణ్యముల రత్నముల ఖనులుండును.

పద్మమువలె రక్తిమగలది పద్మరాగము సింహళద్వీపమున, పీతకాలమను పట్టణమందున కురువిందను, అశోకముయొక్క చిగురువంటిది సౌగంధికము మద్రమున, నల్లనితళుకుగలిగి తుంబురుచ్ఛాయయనుస్థలమున నీలగ్రంధి యనునదియును నాలుగుజాతులుకలవై బుట్టును. అందుత్తమము పద్మరాగము. అధమము తుంబురుయందుత్పన్నము. సౌగంధికకురువిందములు మధ్యమములు. స్థానభేదముచే నుత్తమాధమ మధ్యభేదములు వీటికి గలిగినవి. రెండురంగులును

రెండుస్థానములును గలవి భిన్నమైనవి గరుకుగలవి తెల్లయుల్లికాంతివలె నుం డునవి మలినయుక్తములు తళుకులేనిది ధూమ్రవర్ణముకలదయుననునీ యెనిమి దియును దోషములు.

రెండురంగులుగలది బంధునాశనము జేసును. రెండుస్థానములుకలది పరాభవమొనర్చును. బద్దలగునది శత్రువలన బాధనొందించును. గరుకు గలది పశువులను బంధువులను నశింపజేసును. తెల్లవుల్లికాంతివంటిది యశుభ మిచ్చును. మలినము సకలదోషములనుజేసును. తళుకులేనిది ధాన్యహానిని యప రాధమునుగూడ జేసును. ధూమ్రవర్ణము భయమునొందించును. ఈదోషముల తోనున్నమణులు మూల్యహీనములును నింద్యములును. పద్మరాగమణియొక్క ఛాయ రక్తపద్మమువలె మెరుగుడువురుగుభంగియు నగ్నిరీతి చకోర, కోయి ల, నేత్రములవలెనుండును.

సాంద్రమై బరువై వర్తులమై దోషరహితమై నిర్మలకాంతియంతటను జేయునదియైయుండిన మాణిక్యము మనోహరమును ధరించువారలకు మంగళ మగును. మాణిక్యము మనోహరము నునుపుగలది వాతపైత్యములను బోగొ ట్టును. రత్నప్రయోగములందు శ్రేష్ఠమత్యంతరసమృద్ధిని జేసును.

గారుడపురాణోక్తమగు పద్మరాగగుణములు.

సౌగంధికము కురువిందమును విశేషగుణములు కలవి. స్ఫాటికమందు బుట్టినవి మంకెనపువ్వువలె నెట్టగులివిందగింజరీతి నార్ద్రవురుగుభంగి చెవులవి ల్లిరక్తముతో సరియైె దాడిమబీజవర్ణమై మోదుగపువ్వువలె సిందూరము ప ద్మముత్పలము కుంకుమలత్తుకలతో తుల్యమై సాంద్రమగు రక్తిమతోగూడి స్ఫు టమైన మధ్యశోభ కలవి లక్ష్మీనివాసయోగ్యములు.

రత్నమధ్యమందగు రంధ్రమందునగూర్చిన సూత్రమంతటనురత్నకాంతి ని గలిగించి పార్శ్వమందుండు వస్తువులకు ప్రకాశను జేసెడి స్ఫటికోద్భవము లును చకోర పుంస్కోకిల సారసపక్షుల నేత్రతుల్యవర్ణములు గలవై కొన్ని యుండును. కొన్ని విశేషవికాసలేనివి రక్తోత్పలకాంతి కలిగియుండును. స్ఫటి కోద్భవములు బరువు కఠినముచేతను స్ఫటికసమములై యుండును. ఇంచుకన లుపుగలిగి మొట్టికలువలవలె నలరునవి సౌగంధికోద్భవములగుచున్నవి. స్ఫటి కోద్భవములయందెట్టి రాగమలరునో కురువిందజములం దట్టిరాగముల్లసిల్లును. పైకి కాంతి తక్కువగలిగి లోపలనధికమగు కాంతులతోనొప్పును. రావణగం

గయనుచోటవుట్టిన కురువిందకములు పద్మరాగసమరాగమును వహించి స్ఫుటకాంతులై యుండును. ఆయాదేశప్రాంతములందగునవి తద్దేశీయ రత్నకాంతులకు నించుకతక్కువగు రూపముగలవగుటవలన నించుకమూల్యమును తక్కువగును. వర్ణాధిక్యము గురుత్వము నునువు ఛాయలుగలుగుట రత్నములకు జన్మస్థానములనుబట్టి సమతగలిగియుండును.

ఏరత్నములొకచోటగరుగుగలిగియుండి నునువువిస్తారముండెనేని యాదేశీయములు శ్రేష్ఠములు. పరుషములై వర్ణహీనములై యుండునవి ప్రశస్తములుగావు. సనాతనమైన గుణముతో నాయాదేశరత్న మెడబాయకుండును. దోషయుక్తమగురత్నమును ప్రమాదముతోనెవడైన ధరించినవానికి శోకచింతామయమృత్యుశోకములు సంభవించును.

ఐదుజాతులగు పద్మరాగములలో కృత్రిమములు సుందరములై యుండును. గానలక్షణజ్ఞుడు ప్రయత్నముచే విజాతీయములనుపలక్షించి పరిత్యజింపదగును. కలశపుర సింహళ తుంబురు ముక్తాపాణి శ్రీవర్ణకమను నీనైదుదేశములందుత్పన్నములగునవి పద్మరాగములకు సమములై విజాతీయములై యుండును. కలశపురసంభవరత్నమధ్యమందుముకవంటిచిహ్నగలిగియుండును. తుంబురుదేశీయమందగునవి బరువుగలిగియుండును. సింహళదేశమందగునవి నలుపుగలిగియుండును. ముక్తాపాణికాకాశవర్ణముగలిగియుండును. శ్రీవర్ణకము దీప్తిలేకుండును. గాన నీచిహ్నములచే నివి విజాతీయములని తెలియవలెను.

ఏపద్మరాగమధ్యమందుముకకలిగినటుల చిహ్నమును ధరించినను నునుపుగలిగి నిర్మలమైన దీప్తిని విడిచిపెట్టినదయ్యెను రెండువ్రేళ్లచే రత్నోపరిభాగమాక్రాంతమయ్యుండిన దనకాళిమను పార్శ్వములయందేదిధరించునో నేది స్థలాంతరమునకు చిమ్మబడి మొదటనుండిన స్థలము మొదలనుసరించి సర్వగతమగు కాంతిని ధరించునో యేది జాతిరత్నముతో సమమగు దళము వెడల్పును బరువును గలిగియుండునో యదిజాతిరత్నమని తెలియదగును.

వజ్రఖనియందుంబుట్టినదానిగా సజాతీయగుణములు కలగినందున బోల్చదగును. అప్పటికిని సందియము దీరకుండిన శిలయందైనను సజాతీయముతోనైన నరుగదీయవలయును. వజ్రమైనను కురువిందమైనను పైనిచెప్పిన లక్షణములలో దేనిచేతనైన నిష్కర్ష జేయబడును.

ముక్తాఫలధారణవిధిః

అథముక్తాఫలధారణమనువదంతి చరకాదయో మునయః॥ మౌక్తికం

తు మధురంసుశీతలం దృష్టిరోగశమనం విషాపహం। రాజయక్ష్మ పరికోపనా శనం భేదకంభవతి వీర్యవృష్టిదం॥ శుక్త్యాముక్తైవమౌక్తికం ముచ్ఛుమోక్షదం।

చక్షుష్యం పవనాస్రపైత్యవిషజిత్సర్వేంద్రియాహ్లాదనం తృడ్దాహజ్వరమేహశోకశమనం శీతంశ్రమఘ్నంహితం। ధన్యంమంగళముత్తమం రతికరం సౌభాగ్యకాంతిప్రదం ముక్తాహారవిభూషణం తదఖిలం మూలంశశిప్రీతయే॥ నతు తామ్రభంశుద్ధమత్యంతముక్తం స్నిగ్ధంస్థూలం నిర్మలం నిర్వ్రణంచ। యస్తైధత్తె గౌరవం యత్తులాయాం తజ్జాతీయం మౌక్తికం సౌఖ్యదాయి॥ వ్రణరేఖాసమాయుక్తం విచ్ఛాయం స్ఫటికం యథా। తద్ధారణేన దారిద్ర్యం లక్ష్మీకీర్తిప్రణాశనం॥ వజ్రాణామివ మంజులసంజ్ఞాం విజ్ఞాయమౌక్తికానామస్యాః। సంఖ్యాయాస్సంవర్గం త్రిపదఘ్నం మణివిభాజితంచేచ్ఛవయః॥ అస్యార్థః॥ ఆదౌ గుంజాత్రయం మంజుళమితి వజ్రాణామివ విజ్ఞాయ తద్వర్గం కృత్వా త్రీణిపదాని త్రిపదం తేనఘ్నం వర్ధయిత్వా మణివిభాజితం మౌక్తికసంఖ్యాయా భాగహరణలబ్ధం యత్తచ్ఛవిరితి బోధ్యం॥

ద్విపభుజగశుక్తిశంఖాభ్రవేణు తిమిసూకరప్రసూతాని। ముక్తాఫలాని తేషాం బహుసాధుచ శుక్తిజంభవతి॥ సింహళక పారశీకిక సౌరాష్ట్రిక తామ్రపర్ణి పారశవాః। కౌబేరపాండ్యవాటకహైమాఇత్యాకరాహ్యష్టౌ॥ బహుసంస్థానాస్స్నిగ్ధాహంసాభాస్సింహలాకరాస్థూలాః। ఈషత్తామ్రాశ్శ్వేతాస్తమోవియుక్తాశ్చ తామ్రాఖ్యాః॥ కృష్ణాశ్శ్వేతాఃపీతాస్సశర్కరాః పారశీకికావిషమాః। నస్థూలానాత్యల్పానవనీతనిభాశ్చ సౌరాష్ట్రాః। జ్యోతిష్మంతశ్శుభ్రాగురవోతిమహాగుణాశ్చపారశవాః। లఘుజర్జరం దధినిభం బృహద్ద్విసంస్థానమపి హైమం। విషమంకృష్ణంశ్వేతం లఘుకౌబేరం ప్రమాణతేజోవత్।నింబఫలత్రిపుటధాన్యకచూర్ణాస్స్యుః పాండ్యవాటభవాః। అతసీకుసుమశ్యామం వైష్ణవమైంద్రం శశాంకసంకాశం। హరితాళనిభం వారుణమసితం యమదైవతంభవతి। పరిణతదాడిమగుళికాగుంజాతామ్రంచ వాయుదైవత్యం। నిర్ధూమానలకమలప్రభంచ విజ్ఞేయమాగ్నేయం॥ ఐరావతకులజానాం పుష్యశ్రవణేన్దుసూర్యదివసేషు। యేచోత్తరాయణభవాగ్రహణేర్కేందోశ్చ భద్రేభాః। తేషాంకిలజాయంతె ముక్తాఃకుంభేషు సరదకోశేషు। బహవో బృహత్ప్రమాణా బహుసంస్థానాఃప్రభాయుక్తాః। సుతవిజయారోగ్యకరామహాపవిత్రాధృతా రాజ్ఞాం। దంష్ట్రామూలేశశికాంతిసప్రభం బహుగుణంచవారాహం। తిమిజం మత్స్యాక్షినిభం బృహత్పవిత్రం బహుగుణంచ। వర్షోపలవజ్జాతం వాయు

స్కంధాశ్చ సప్తమాద్భ్రిష్టం। హ్రియతేకిల ఖాద్రిర్వైద్యుస్త్రిదివ్యప్రిభం మేఘసంభూతం। తక్షకవాసుకికులజాః కామగమాయేచ పన్నగాస్తేషాం। స్నిగ్ధా నీలద్యుతయో భవంతి ముక్తాఫలాస్యాంతే। శస్తేఽవనిప్రదేశే రజతమయే భాజనే స్థితేచయది। వర్షతి దేవోఽకస్మాత్తత్ జ్ఞేయం నాగసంభూతం। అపహరతి విషమలక్ష్మీం క్షపయతి శత్రూన్ యశోవికాసయతి। భౌజంగంన్నృపతీనాం ధృతమకృతార్ఘం విజయదంచ। కర్పూరస్ఫటికనిభం చిపిటం విషమంచ వేణుజం జ్ఞేయం। శంఖోద్భవం శశినిభం వృత్తం భ్రాజిష్ణురుచిరంచ। శంఖతిమివేణువారణవరాహభుజగాభ్రిగాణ్యావేధ్యాః॥ అమితగుణత్వాచ్చైషా మర్ఘశ్శాస్త్రేన నిర్దిష్టః॥ ఏతానిసర్వాణిమహాగుణాని సుతార్థసౌభాగ్యయశస్కరాణి। రుక్శోకహంతౄణిచ పార్థివానాం ముక్తాఫలానీప్సితకామదాని॥ సురభూషణం లతానాం సహస్రమష్టోత్తరంచతుర్హస్తం। ఇంద్రచ్ఛందో నామ్నా విజయచ్ఛంద స్తదర్ధేన। శతమష్టయుతంహారో దేవచ్ఛందో హ్యశీతి రేకయుతా। అష్టాష్టకోర్ధహారో రశ్మికలాపశ్చ నవషట్కః। ద్వాత్రింశతాతుగుచ్ఛోవింశత్యా కీర్తితేర్ధగుచ్ఛాఖ్యః। షోడశభిర్మాణవకో ద్వాదశభిశ్చార్ధమాణవకః। మందరసంజ్ఞోష్టభిః పంచలతాహారమిత్యుక్తం।సప్తావింశతిముక్తాహారో ముక్తానక్షత్రమాలేతి॥అంతరమణిసంయుక్తా మణిసోపానం సువర్ణగుళికైర్వా। తరళకమణిమధ్యం తద్విజ్ఞేయం చాటుకారమితి॥ ఏకావళీ నామయథేష్టసంఖ్యా హస్తప్రమాణా మణివిప్రయుక్తా। సంయోజితాయా మణినాతుమధ్యే యష్టీతు సా భూషణవిద్భిరుక్తా॥ నవదోషాగుణాష్షట్చ ఛాయాచత్రివిధామతా। చత్వారోస్యమహాదోషా స్సామాన్యం పంచకంస్మృతం। మౌక్తికస్యాపి రత్నస్య దోషాన్నవపరీక్షయేత్। జఠరంతు దరిద్రత్వం చార్పటం మరణం ధృవం। అవర్ణం విషమం రూక్షం భగ్నం విషమరంధ్రికం। నవర్ణకర్కశంచాపి మౌక్తికం పరివర్జయేత్। త్రికోణం విద్రుమచ్ఛాయం నీలచ్ఛాయం యథాకృతి॥ చర్పటం శుక్తిలగ్నంచ మౌక్తికం మృత్యుదంస్మృతం। సుసుగ్గురుశ్చ సుస్నిగ్ధం సువృత్తం నిర్మలం స్ఫుటం। పఠ్యంతే రత్నశాస్త్రేషు మౌక్తికస్యేవ షడ్గుణాః। మధుపీతసితత్వంచ ఛాయాచ త్రివిధామతా। సుశుక్లత్వం సువర్ణంచ ఋజు సూక్ష్మసుగంధ్రతా। సుకాంతిత్వంచ శస్యంతే ముక్తానాం సుమహాగుణాః। సితంవృత్తం గురుస్థూలం ప్రాణ రేఖావివర్జితం।ముక్తాఫలంసుతారం యచ్ఛుభంతద్ధారణాద్భవేత్॥

## ముక్తాఫలలక్షణ తద్ధారణఫలాని.

పద్మరాగగుణగణానంతరమున ముక్తాఫలలక్షణ తద్ధారణఫలములను జెప్పుచున్నారము.

మౌక్తికము మనోహరము శీతలము దృష్టిరోగవిషములను శమింపజేయును- క్షయరోగమునునశింపజేయును. బలపుష్టివివర్ధనము. శుక్తివలనముక్తమగునదిగావున మౌక్తికమనబడెను. ముచ్లుధాతువుకు మోచనమర్థము.

ముక్తాఫలము నేత్రారోగ్యకరము- వాతమును రక్తపైత్యమును విషమును పిపాసను దాహమును జ్వరమును మేహమును శోకమును శ్రమను శాంతింపజేయును. ఇంద్రియాహ్లాదకరము మంగళమురతికరమును సౌభాగ్యకాంతులను జేయును- చంద్రప్రీతికరము. నక్షత్రముభంగిని శుద్ధమై నునుపుగలిగి స్థూలమై నిర్మలమై గంట్లులేక బరువుగలిగినది జాతీయమగు మౌక్తికమది ధరించువారికి సౌఖ్యమిచ్చును.

గంట్లును రేఖలునుగలిగి కాంతిలేక స్ఫటికమువలెనుండు దాని ధరించిన లక్ష్మీకీర్తులు నశించి దరిద్రులగుదురు. వజ్రములకువలెను మంజులసంజ్ఞను దెలియదగును- మంజులమనగా గుంజాత్రితయపరిమితము దాని నాలుగింటగుణించిన యెడ్డు మూడుపాదములచే హెచ్చవేసి మౌక్తికమంజులములచే భాగముగొనినలబ్ధము చౌలగును. గజభుజంగ శుక్తి శంఖాభ్రవేణు మత్స్యారణ్యసూకరములవలన ముత్తియములు బొడము నందుశుక్త్యుద్భవము బహుళము శ్రేష్ఠము. సింహళ పారసీకసౌరాష్ట్రతామ్రపర్ణి పారశవ కౌబేర పాండ్యవాటకహైమములను నెనిమిదిముత్తియముల కాకరములు గొప్పవి నునుపు కలవి హంసలవలె భాసిల్లునవి సింహళసంభవములు. ఇంచుక యెరుపు గలిగి తెల్లనివై నలుపులేకనుండునవి తామ్రపర్ణిసంభవములు.

నల్లనివి తెల్లనివి పచ్చనివి యిసుకగలిగి నిమ్నోన్నతములై యుండునవి పారసీకభవములు. స్థూలములత్యల్పములునుగాక వెన్నవలెనున్నవగునవి సౌరాష్ట్రభవములు. ఛాయలుగలిగి శుభ్రములై బరువై మంచిగుణములు కలవి పారశవభవములు. చులకనై గరుగుగలిగి పెరుగువలె బరగి యురువుకలిగికలసి రెరడు ముత్తియములుగానుండునవి హైమములు. నిమ్నోన్నతములై కృష్ణశ్వేతవర్ణముగలిగి చులకనై తేజము గొప్పయును గలుగునవి కౌబేరములు. వేపకాయలవలె కోలనై మూడుజాయలుగలిగియును ధనియాలభంగినుండు చూరుముత్తియములు పాండ్యవాటభవములు. అగసిపువ్వువలె నల్లనగునది వైష్ణవము. చంద్రునివలెనలరునది మైంద్రము. హరిదళమువలె నొప్పునది వారుణము. కేవలము నలుపుగలుగునది యమదైవతము. పరిపక్వదాడిమబీజ గుంజాతామ్రమగునది వాయుదైవత్యము, పొగలేనివహ్నివలెను పద్మోదరమువలెనొ

ష్పునది యాగ్నేయము. ఐరావతవంశీయములై పుష్యశ్రవణర్క్ష యుక్తరవివారములందుత్తరాయణమున సూర్యచంద్రగ్రహణసమయముల జన్మించు గజకుంభములందును దంతకోశములందును ముత్తియములు బొడమునవి గొప్పప్రమాణములై మిక్కిలికాంతిగలిగియుండును. వీటినిధరించు రాజన్యులకారోగ్యమును పుత్రవిజయములనిచ్చు నతిపవిత్రములు. అడవిపందికొమ్ము మొదలబుట్టు ముత్తియములు చంద్రకాంతిగలిగి బహుగుణములై యుండును. మత్స్యములందు పుట్టినవి చేపకన్నువలె చెన్నుమీరి గొప్పవై పవిత్రమై బహుగుణమై యొప్పును. వడగండ్లవలె సప్తమవాయుస్కంధమువలన ముత్తియములు పుట్టును. మెరుపురంగుగలుగునామేఘజాతములగు ముత్తియములను గగనమందసురులపహరింతురు. తక్షకవాసుకి వంశీయులగు పన్నగులు కామగమనులు. వీరలవలన బుట్టినముత్తియములు నునుపు నలుపుగలిగియుండును. ప్రశస్తములగు భూమియందు రజతపాత్రనుంచిన వర్షించునపుడు దైవవశమువలన నందుపడు ముత్యములు బొడమిన యవి నాగసంభవములని తెలియదగును. ఇవి ధరించువారికి విషదారిద్ర్యశత్రుక్షయ మగుటయే గాక నక్షత్రార్థమైన యశోవిభవవంతుని జేయును.

మేఘోద్భవములగు మౌక్తికములు కర్పూరమువలె స్ఫటికమువలెను తెల్లనై బల్లపాటుగలిగి నిమ్నోన్నతములై యుండును. శంఖసంభవములు చంద్రునివలె కాంతిగలిగి వర్తులములై ప్రకాశించును. శంఖమత్స్యవేణుగజవరాహభుజగాభ్రములవలన బొడము మౌక్తికములు తెలియశక్యములుగాని బహుగుణములు గలవగుటవలన విలవబలుక నలవిగాదు. శాస్త్రములందున్ను నిర్ణయించబడలేదు.

ఈసకలమౌక్తికములును మహాగుణములు, ధనసంతాన సౌభాగ్యకీర్తికరములు. దుఃఖశోకములను హరించును. ఈముత్తియములను ధరించురాజులకు కోర్కెలు జేకూరును. అష్టోత్తరసహస్రసరములుగల ముక్తాహారము నాలుగుమూరలపొడవుగలది- దేవతలకలంకారమై యింద్రఛందమనియు నిందులో సగము విజయఛందమనియు జెప్పబడును. అష్టోత్తరశతసరములుగల హారము దేవఛందమనబడును. ఎనబదియొక్కసరములుగలది దేవఛందము. అరువదినాలుగుగలది యర్ధహారమనబడును. ఏబదినాలుగుసరములుగలది రశ్మికలాపమనబడును. ముప్పదిరెండుగలది గుచ్ఛమనబడును. ఇరువదిగలదియర్ధగుచ్ఛమనబడును. పదియారుగలది మాణవకమనబడును. పన్నెండుగలది యర్ధమాణవకమనబడును. ఎనిమిదిసరములుగలది మందరమనబడును. అయిదుసరములు గల

దియును హారమనబడును. ఇరువదియేడుముత్తియములుగలది నక్షత్రమాలయ నబడును. మధ్యమధ్యనితరములతోగూడినది మణిసోపానమనబడును. సువర్ణ గుళికాయుక్తమగునదియైన మణిసోపానమనబడును. గొప్పమణి మధ్యనుగల ది చాటుకారమనబడును. యథేష్టసంఖ్య మూరప్రమాణముగలది యితరమణు లు లేకనుండిన నేకావళియనబడును. మధ్యమణితోగూడుకొనిన ముక్తాహారము భూషణవేత్తలచే యష్టియనబడును. ముక్తామణులకు దోషములు తొమ్మిది-గు ణములారు. ఛాయలు మూడువిధములు. వీటికి మహాదోషములునాలుగు. ము క్తారత్నములకు సామాన్యదోషములగు తొమ్మిదింటిని బరీక్షించవలయును. జ ఠరమనెడుదోషము దారిద్ర్యకరము- చార్పటమనెడుదోషము మరణకరము. అ వర్ణము, విషమము, రూక్షము, భగ్నము, విషమరంధ్రకము, వివర్ణము, క ర్కశము ఈదోషములు గల మౌక్తికము పరిహరించదగును. ముక్కోణమై పగడపుఛాయగలిగి నల్లనిదై లేక బుట్టినట్లుండిన బల్లపాటుగలిగి శుక్తినంటిన మౌక్తికములు మృత్యుప్రదమని జెప్పబడును.

చక్కనికాంతి, బరువు, నునుపు, వట్రువనము, నైర్మల్యము, స్ఫుటత యీయారును రత్నశాస్త్రమందు మౌక్తికమునకు గుణములనుగా జెప్పబడె ను. తేనెవంటిరంగు, పచ్చనిరంగు, తెల్లనిరంగు నీఛాయలు మూడువిధములని చెప్పబడెను. మిక్కిలి తెలుపుగలిగి ఋజువై చిన్నరంధ్రముతోనుండి మంచిఛా యగలిగిన మౌక్తికము ప్రశస్తము. ఇవి మహాగుణములు. ధవళమై వృంతమై బరువుగలిగి స్థూలమై ప్రాణరేఖలు లేక మంచినీరుగలముత్తియమును ధరించి న శుభము సంభవించును.

### విద్రుమలక్షణాదయః

అథవిద్రుమలక్షణాని తద్ధారణగుణానిచ బ్రూమః॥ విశిష్టోద్రుమః వి ద్రుమః। మణ్యతే స్తూయతఇతిమణిః మణశబ్దే॥ శారాంగం దంతురం రూక్షం సూక్ష్మవక్త్రం సకోటరం। రూక్షకృష్ణం లఘు శ్వేతం ప్రవాళమశుభం త్యజేత్॥ ప్రకృష్టంవలతేప్రవాళం వలసంచరణే॥ పక్వబింబఫలాభాసం జపాకుసుమస న్నిభం। శుకతుండసమచ్ఛాయం ప్రవాళమతిశోభనం। శుద్ధంఘనంద్రుఢంవృత్తం స్నిగ్ధగాత్రం సురంగకం। సమంగళం శిరాహీనం ప్రవాళం ధారయేచ్ఛుభం॥ బాలార్కకిరణరక్తా సాగరసలిలోద్భవా ప్రవాళలతా । యా నత్యజతి రుచిం నిర్దోషాఘృష్టాత్సాస్మృతా జాత్యా॥ ప్రవాళో మధురామ్లశ్చ వాతపైత్యస్య దోషజిత్। వీర్యకాంతికరం స్త్రీణాం ధృతోమంగళదాయిచ॥ అతఏవధార్యం తే స్త్రీభిర్గళే॥ తత్రప్రధానం శశలోహితాభం గుంజాజపాపుష్పనిభం ప్రవి

ష్టం। సానీలకం దేవకరోమకంచ స్థానాని తేషాం ప్రభవంసురాగం॥ అన్యత్ర జాతంచ నతత్ప్రధానం మూల్యంభవేచ్ఛిల్పివిశేషయోగాత్॥ నిరతం ప్రవాళ రత్నం తులితంయది సార్ధసప్తసక్తైర్గుంజైః। ఖనిజంస్యాదిదమేకం విదితం నిష్కస్యమానమంఘ్రిత్రితయైః॥ అస్యార్థః॥ సార్ధద్విచత్వారింశద్గుంజతులితం ప్రవాళరత్నం ఖనిజమితిసంజ్ఞా తదంఘ్రిత్రితయం త్రిపాదభాగ త్రితయైః నిష్కమానంభవేత్॥

## విద్రుమమణిలక్షణాదులు.

ముక్తామణిధారణగుణములను వాటిలక్షణములను గనపరచి యనంతరమునవిద్రుమమణిధారణగుణములనుశుభాశుభలక్షణములనుజెప్పుచున్నారము.

విశిష్టమగు ద్రుమమగుటచే విద్రుమమనబడును. స్తోత్రము జేయబడునది గాన మణియందురు. మణధాతువు శబ్దమందు వర్తించును.

చిత్రవర్ణము, నిమ్నోన్నతము, పరుషము, సూక్ష్మమగురంధ్రము, బొజ్జ, కారునలుపు, చులకన, తెల్లనిమచ్చలును గలుగు ప్రవాళమశుభము గావున త్యజించదగును.

ఆరబండిన దొండపండువలె నలరి మందారపువ్వువలె చిలుకముక్కువలె నుక్కుమీరి యేకరంగుగల పవడము పరమశ్రేయమిచ్చును.

పరిశుద్ధము చిక్కనది దృఢమగునది కుదురగునది నునుపుగలిగి మంచిరంగుగలిగి నరములువలె రేఖలులేక జూడదగినపవడము ధరించదగినదగును.

తరుణతరణికిరణములవలె నరుణమై యబ్ధిసముద్భవమగు ప్రవాళలత నరగదీసినయరుణిమచెడకుండునది నిర్దుష్టము.

ప్రవాళము మధురామ్లరసములుగలిగి వాతపైత్యదోషహారము దృష్టినిగాంతిని జేయును. ధరించుస్త్రీలకు సౌభాగ్యమునుగూడనిచ్చును. గానస్త్రీలవశ్యము గళమున ధరించుదురు.

చెవులపిల్లిరక్తమువలె గురివిందగింజలవలె మందారపుష్పమువలె సెరపురంగుగలప్రవాళము ప్రధానము వీటికి ప్రభవస్థానములు, దేవకము, నీలకము, రోమకమునందుబుట్టినవి మెరుపుగలిగి యొప్పు నితరస్థానములందుబుట్టినవి ప్రధానములుగాకున్నను శిల్పవిశేషమువలన మూల్యము గలుగును.

ఆరున్నర యేడున్నర గురివిందగింజలయెత్తుగల ప్రవాళము ఖనిజమని దెలియదగుననుచునొకమతము. నలుబదిరెండున్నరగురివిందగింజలెత్తులో మూ

దుపాదము లెత్తు సిప్పర్మనబడును. దీనికే ఖనిజమని పేరనుచు రెండవమతము.

## మరకతరత్నలక్షణాదయః

అథ మరకతరత్నలక్షణాని తద్ధారణఫలంచవదామః॥ మరంమరణం విషనివారణే సతకత్యనేనేతి మరకతం వర్ణవ్యత్యాసేన తకహనహసనయోః। రమతేస్మిన్మనఇతి రత్నం॥ కల్మాషవర్ణశబలమస్నిగ్ధం శర్కరాయుతం। స్ఫుటితం రాగహీనంచ త్యజేన్మరకతం బుధాః॥ యచ్చైవాల శిఖండకోత్పలహరిత్కాన్తైశ్చభాసచ్ఛదైః ఖద్యోతేనచ బాలకీరవపుషా శైరీషపుష్పేణచ। ఛాయాభిస్సమతాందధాతి తదిదం నిర్దిష్టమాప్తోదితం జాత్యంరత్నవిధిః ప్రయత్నచతురం గారుత్మతం రంజయేత్॥ క్షిత్యంతరేతలేచైవ భాస్కరాభిముఖే స్థితం। రంజయేదాత్మనఃపార్శ్వం మహామరకతం స్మృతం॥ ఆమపైత్యహరం రుచ్యం పుష్టిదం భూతనాశనం। విషఘ్నం మధురం శీతం యుక్తం మరకతం బుధైః॥ జ్వరచ్ఛర్ది విషశ్వాసన్నిపాతాగ్నిమాంద్యనుత్। దాహకుష్ఠప్రశమనం దీపనం లఘుపాచనం॥ రచితోగరుడోద్గారమణిర్యస్యవిభూషణం। స్థావరంజంగమం తస్య విషంనిర్విషతాంవ్రజేత్॥ గారుడంగరుత్మతోజాతం మరకతమణేర్విషహారణహేతుర్గారుడపురాణేభిహితం॥ తద్యథా॥ దానవాధిపతేఃపిత్తమాదాయభుజగాధిపః। ద్విధాకుర్వన్నివవ్యోమ సత్వరం వాసుకిర్య్యయౌ॥ దానవాధిపతేర్బలాసురస్య తస్యావయవాఏవ సర్వం రత్నాన్యభవన్నితి గారుడాదిపురాణప్రసిద్ధిః॥ సతదా స్వశిరోరత్నప్రభాదీప్తేనభోంబుధౌ। రాజితస్సుమహానేకః ఖండసేతురివాంబుధౌ॥ తతఃపక్షనిపాతేన సహరన్నివరోదసీ। గరుత్మాన్పన్నగేంద్రస్య ప్రహర్తుముపచక్రమే॥ సహసైవ ముమోచ తత్ఫణీంద్ర స్సురసాయాం బహురత్నపాదపాయాం॥ మలయాచలగంధవాసితాయాం వరమాణిక్యగిరేరుపత్యకాయాం॥ తస్యపరిపాతసమనంతరకాలమేవ తద్భూఘనాన్మలయరత్నగిరేస్సమీపే। స్థానంక్షితే రుపపయోనిధిమేఖలం తత్ప్రీత్యప్రియం మరకతత్వమథాజగామ॥ తత్రైవకించిత్పతతస్తుపీతాముపేత్యజగ్రాహతతోగరుత్మాన్। మూర్ఛాపరీతస్సహసైవ ఘోణారంధ్రద్వయేనైవ ముమోచసర్వం॥ చకారాంగగర్భశుకకంఠశిరీషపుష్పఖద్యోత పృష్ఠనవశాద్వల శైవలానాం। వంశాంకురోత్పలభుజంగభుజాంచ తత్ర పాప్తత్విషో మరకతాశ్శుభదా భవంతి॥ పరిధమంశైవలాభంతు శంఖాభమపరంభవేత్। శిరీషకుసుమాభంచ చతుర్థం శుద్ధవర్ణకం। హరితచ్ఛవిమధ్యేతు కృష్ణచ్ఛాయా హ్యశోభనా। బ్రాహ్మణక్షత్రియోవైశ్యశ్శూద్రశ్చేతిచతుర్విధా। ఛాయాభేదాచ్చ విజ్ఞేయాచాతుర్వర్ణ్యక్రమేణతు॥ శంఖాభం నారీహస్తకాచకంకణవర్ణం॥ తత్రత్ర భోగీంద్ర భుజావి

ముక్తం పపాత పిత్తం దితిజాధిపస్య। తస్యాకరస్యాతిభవాంశదేశే దుఃఖోపలభ్యశ్చ గుణైశ్చ యుక్తః॥ తస్మిన్మరకతస్థానే యత్కించిదుపజాయతే। తత్సర్వంవిషవేగానాం ప్రశమాయ ప్రకీర్త్యతే॥ సర్వమంత్రౌషధగణైర్యన్న శక్యం చికిత్సితుం। మహాహిదంష్ట్రాప్రభవం విషం తేన ప్రశామ్యతి। తాన్యత్ర వ్యాప్య క్షేత్రే తత్ర యద్దేశే రూపవర్జితం। జాయతే తత్పవిత్రాణాముత్తమంపరికీర్తితం॥ అత్యంతహారితవర్ణం కోమలంచ విభేదజటిలంచ। కాంచనచూర్ణస్యాంతః పూర్ణమివ లక్షయేచ్చ యుక్తం। సంస్థానగుణైస్సమరాగం గౌరవేణ చవిహీనం।సవితుస్సకలం స్పర్శాచ్ఛాదయతి సర్వాశ్రయం తస్య॥ హిత్వాచ హారితభావం యస్యాంతర్విహితాభవేద్దీప్తిః। అచిరప్రభాప్రభాహతనవశాడ్వలసన్నిభా భాతి। యచ్చ మనసః ప్రసాదం విదధాతి నిరీక్ష్యమాణమతిమాత్రం। తన్మరకతం మహాగుణమితి రత్నవిదో మనోవృత్తిః। వర్ణస్యాతిబహుళత్వాద్యస్య స్యాంతస్స్వచ్ఛకిరణపరిధానం। సాంద్రస్నిగ్ధవిశుద్ధం కోమలబర్హప్రభాది సమకాంతి। చపలోజ్జ్వలయాకాంత్యా సాంద్రాకారో విభాసయా భాతి। తదపిచ గుణవత్సంజ్ఞామాప్నోతిహి యాదృశీపూర్వం। సకలకచోరం మలినం రూక్షం పాషాణశర్కరోపేతం। దగ్ధంచశిలాజతునాం మరకతమేవం విగుణం వదంతి శుద్ధాః॥ యత్సంబంధి శేషిత రమ్యం యన్మరకతాద్భవేత్। శ్రేయస్కామైర్న తద్ధార్యం క్రేతవ్యంహి కథంచన॥ భల్లాతకంపుత్రికాపత్త్రత్వంతు సమయోగతః। మణేర్మరకతస్యైతా లక్షణీయా విజాతయః। క్షౌమేణవాససా ఘృష్టాం దీప్తింజయతి పుత్రికా। మర్షణేనైవకాచస్య శక్యా కాచిద్విభావనా॥ కిస్యాచిదనేకరూపైర్మరకతమనుగచ్ఛతోపి గుణవర్ణైః। భల్లాతకరసానాంతు వైశద్య

ముపైతి వర్ణస్య॥ వర్ణానిముక్త్వా సంత్యన్యే యేచ కేచిద్విజాతయః। తేషాం సప్రతిబద్ధానాం ప్రభవస్త్యూర్ధ్వగామినీ। ఋజుత్వాచ్చైవ కేషాంచిత్కథంచిదుపజాయతే। తిర్యగాలోచ్యమానానాం సద్యశ్చైవప్రణశ్యతి। స్నానాచమనజప్యేషు హోమమంత్రక్రియావిధౌ। వరర్ధిగోహిరణ్యాదిమహద్భిస్సాధనాని చ। దేవపిత్రాతిథేయేషు గురూణాం పూజనేషుచ। బాధ్యమానేషు విషస్తద్దోషజాతైర్విషోద్భవైః। దోషైర్హీనం గుణైర్యుక్తం కాంచనప్రతియోజితం। సంగ్రామే విచరద్భిశ్చ ధార్యం మరకతం బుధైః॥ సంగ్రామే విచరద్భిర్బుధైః రత్నశాస్త్రజ్ఞైర్విద్వద్భిః మరకతం విషనివారణేనమరణనివారకం గారుడమణిం

కూటయోధిభిర్యదిసమరే విషలిప్తశస్త్రప్రయోగే తన్నివారణార్థం ధార్యమితి దర్శితం॥ తులయాపద్మరాగస్య యన్మూల్యముపజాయతే। లభతేప్యధికం త

స్మాద్గుణైర్మరకతం యుతం॥ యథాచ పద్మరాగాణాం దోషైరూల్యం ప్రహీయతే। తతోస్యాప్యధికాహానిర్దోషైర్మరకతో భవేదితి ॥ గుంజాద్వితయేన తులాతులితం యన్మరకతంభవేద్రతికః నిష్కపరిమాణమేతదరిత్యష్టద్వితయాకేన సంజాతం॥ గుంజాద్వయతులితం మరకతం రతికః షోడశరతికో నిష్కసమతులితం భవతి॥

## మరకతరత్నలక్షణాదులు.

పవడపుగుణములను జెప్పి మరకతరత్నలక్షణములను దానిధరించువారికగుఫలమును జెప్పుచున్నారము.

విషహాతులగువారిమరణమును నివారించునదిగావున మరకతమనబడును. తక ధాతువు హననార్థకము వర్ణవ్యత్యాసముచే శబ్దము నిష్పన్నమాయెను. దేనియందు సంతోషింతురో యదిరత్నము చిత్రవర్ణమైనునుపులేక యిసుకగలిగి పగుళ్లుగలిగి రాగములేని మరకతము విడువదగును. నాచు, నెమలిజుత్తు, ఉత్పలము, పచ్చరెల్లు, భాసమనుపక్షి రెక్క, మెరుగుపుపురుగు, చిలుకపిల్లశరీరము, శిరిశపుపువ్వు వీటితో సమానమగు కాంతులుగల మరకతము జాతియగురత్నమని పెద్దలచే జెప్పబడును. అరిచేతినైన భూమియందైన యీమరకతమును సూర్యాభిముఖముగనుంచిన యాభాగమంతయు రంజింపజేయునది మహామరకతమనబడును. ఈమరకతమందు పైత్యహరము రుచికరము పుష్టిప్రదము భూతనాశము విషఘ్నము మధురము శీతలము జ్వర వమనసన్నిపాత అగ్నిమాంద్య దాహకుష్ఠరోగములను శాంతింపజేయును. పాచనము- మరకతమన్నిశుభములను జేయును. ఎవరుగరుడపచ్చతోయుక్తమగు నలంకారమును ధరింపుదురో వారికి స్థావర జంగమవిషములు బాధించకుండును. గరుడపచ్చయనగా గరుత్మంతునివలన జాతమగునది. మరకతము విషహారమగుటకు గరుడపురాణమందు జెప్పబడెను. దాని వివరింపుచున్నాము. బలాసురుడను రాక్షసాధిపతి చేతికట్టును తీసికొని వాసుకి యాకాశమార్గమున నతివేగముగా జనుచున్న యతనిశరీరముచే నపుడాకాశము రెండుగా జేయబడెనట్లు కనబడెను. అప్పుడు వాసుకి శిరోరత్నముచే కాంతియుక్తమగు గగనము సముద్రమువలె నందు వాసుకి శరీరము కొంతమేర రచించిన సేతువువలె జూడబడెను. గరుత్మంతుడాసమయమున తనరెక్కలగాలిచే రెక్కలతో నాకాశము జక్కడుచునట్లు వేగముగా నేతెంచి యావాసుకియను పన్నగేంద్రుని దన్నునుపక్రమించెను. ఆదెబ్బలకు నిబ్బరములేక నారాక్షసుని పిత్తమును మలయాచలగంధముచే నలరారు మాణిక్యపర్వత ప్రాంతభూమియందనేకరత్నతరుసంకులమగు సుర

నయను ప్రదేశమందు విడిచిపెట్టెను. ఆచేదుకట్టు పడినకాలమందే మాణిక్యమలయ పర్వత ప్రాంతసముద్రతీరభూమిగుణమువలన మరకతత్వమును బొందెను. ఆపిత్తము పడునపుడు గరుత్మంతుడు కొంత తానపహరించి యందువలనమూర్ఛితుడై యది ముక్కున గ్రక్కున గ్రక్కుకొనెను. ఇందువలనపుట్టిన మరకతము గరుడపచ్చలనబడును. గరుత్మంతునిసంబంధముచే నీరత్నము బొడముటవలన నీవిషము నిర్విషముగా జేయుటకేమిసందియము.

చక్రవాకగర్భము శుకకంఠము శిరీషపుష్పము పచ్చికబట్టలను మెరుగుదుపురుగు పృష్ఠము నాచు పీటిభంగని రంగుగల మరకతములు శుభప్రదములు. నాచువలె రంగుగల మరకతముత్తమము. శంఖమువలె కాంతిగలది యనగా స్త్రీలుధరించు పచ్చగాజువంటిది రెండవతరము. శిరీశపుపువ్వువలె నుండునది మూడవది. కేవలము తెలుపుగలది నాలగవది. మధ్యయందు నల్లనిఛాయ లేకుండవలెను. ఈచెప్పిననాలుగుప్రకారములు బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రజాతులనబడును. ఛాయలును యీనాలుగువర్ణముల భేదములును దెలియవలెను.

ఆవాసుకిచేవిడువబడిన రాక్షసుని పిత్తమువలన పుట్టిన మరకతఖనులయందలి రత్నములు దుర్లభములు. ఆఖనులకు సమీపమున నేదిజన్మించిన నవియన్నియు విషశాంతికుపయోగించును. ఆఖనియందలి రత్నము సకలమంత్రౌషధములచేత నతిచికిత్సితమగు ఘోరసర్పములవిషమునయినను శాంతింపజేయును. ఆస్థానమందుబుట్టిన మరకతము రూపహీనమైనను విషశాంతిని జేయును. మిక్కిలి పచ్చనివర్ణము గలిగి బంగారుచూర్ణము లోపలికి బోసినట్లు పైకిపూతబూయుచు నితరగుణములుగలిగి యేకరంగుగలదై బరువులేక సూర్యకిరణస్పర్శమువలన కాంతిని వ్యాపింపజేయునది సర్వోత్తమము. ఆకుపచ్చరంగు లేకరత్నములో ఛాయలు దీప్తికలిగి తొలకరిమెరుపుకాంతిచే వ్యాప్తమగు పచ్చికబట్టవలె నొప్పునదియును మనస్సుకు చూచినమాత్రాన సంతోషముగలుగజేయునదియును మహాగుణమగు మరకతమని రత్నశాస్త్రవేత్తలు జెప్పిరి. అధికవర్ణము కలుగుటచే లోపలవెలపల కాంతిప్రసారముకలది నునుపును నిర్మలమును చిక్కనయును మృదువైన నెమలిపింఛముతో సమమగు కాంతియునుగల మరకతము శ్రేష్ఠము. చపలకాంతికలది గుణహీనసంజ్ఞకలదగును. కచోరంపుటాకువలె నంతటా కాంతికలదియు మలినమైనదియు పరుషమైనదియు నిసుకపాషాణముతో నుండునదియు కాలిపోయినదియు శిలాజితువంటి కాంతికలదియును ధరించరాదు.

మరకతమణికి జీడిబూసి కడగినతరువాత కనుపాపవలె రత్నమందగ

పించును. బొమ్మ రత్నవైపుల్యానుగుణమనుసరించి సజాతీయవిజాతీయలక్షణ ములనూహించవలెను. శుభ్రవస్త్రముచే తుడచిన నాబొమ్మ దీప్తి నొందును. కాచవిశేషమైతే శిలయందరగదీసిన యరుగును. గుణవర్ణా[illegible] రూపములచే మరకతముననుసరించిన దానికి జీడిరాసి కడిగితే జా[illegible]ను నిర్మలమ య్యుండు నితరము కాంతిహీనమగును. అకృత్రిమరత్న[illegible]చే కాంతిపో కయుండినను నిలువగాజూచిన కాంతి యడ్డుగా జూడబ[illegible]ను తగ్గిపోవును.

స్నానాచమనజపహోమమంత్రానుష్ఠానవిధులందును దేవపితృతిథిగు రుపూజలందును భూహిరణ్యాదులతోగూడ నీమరకతములుగూర్చిన మిగుల ఫ లమునిచ్చును. విషసంభవదోషజాలములచే విషమమగునపుడును యుద్ధమందు ను దోషములను బోగొట్టి గుణమునొందించు మరకతమును స్వర్ణమందు స్థా పించి ధరించినమేలగును. యుద్ధమందుధరించుట కూటయోధులు విషలిప్తబా ణములేసినందున నందువలన బీడరాకుండుకొరకని తెలియదగును.

సకలగుణములుగల మరకతము పద్మరాగమెత్తుగలది యాపద్మరాగ ముకంటె నధికమూల్యముకలదగును. దోషయుక్తమగు పద్మరాగమునకు మూ ల్యమెటులతగ్గునో మరకతము దోషయుక్తమైన నంతకధికమూల్యము తగ్గును. మరకతము రెండుగురివిందగింజలెత్తు రతియనబడును. పదియారురతులు ని ష్కమనబడును.

పుష్యరాగమణిగుణాదయః

అథ పుష్యరాగమణిగుణాన్ధారణఫలంచ వదామః॥ సుచ్ఛాయపీత గురుగాత్రసురంగసుద్ధం స్నిగ్ధంచ నిర్మలమతీవసువృత్తపీతం। యః పుష్యరాగ శకలం కలయేదభిజ్ఞః పుష్యత్యసౌ విశదకీర్తిమతీవ శౌర్యం॥ కృష్ణం బిన్ద్వంకి తం రూక్షం ధవళం మలినం లఘు। ద్విచ్ఛాయం శర్కరాగారం పుష్యరాగస్య దోషజం॥ భూషణం పుష్యరాగోద్ధం వాతజిద్దీపనం పరం। ఆయుశ్శ్రియంచ ప్రజ్ఞాంచ వీర్యం తత్కురుతే నృణాం॥ షట్కోణతా లఘుత్వంచ సమాష్టద ళతా తథా। తీక్ష్ణాగ్రత్వం నిర్మలత్వమిమేపంచగుణాస్స్మృతాః॥ స్వచ్ఛం వి ద్యుత్ప్రభం స్నిగ్ధం సౌగంధ్యం లఘురేఖనం। షడ్ధారం తీక్ష్ణధారంచ సుసౌ మ్యారం శ్రియంవదితి చరకః॥

అథ గారుడపురాణోక్తం దర్శయామః॥ ఆపీతపాండురుచిరాః ప్ర మాణతఃపుష్యరాగసంజ్ఞాస్తు। కారుండవనామ స్యాత్సఏవ యది లోహితోపే

తః॥ ఆలోహితస్తుపీతః పృచ్ఛకజస్సాధకస్సఏవోక్తః। ఆనీలశుక్లవర్ణః స్నిగ్ధస్సౌస్నానికస్సుగుణః॥ అత్యంతలోహితోయస్సఏవఖలు పద్మరాగస్స్యాత్। అపిచేత్సునీలవర్ణస్సఏవకథితశ్చ నీలస్సన్॥ మూల్యంవైదూర్యమణేరివ కథితం రత్నశాస్త్రవిదా। ధారణఫలమపి తద్వత్కింతుస్త్రీణాం శుభప్రదో భవతి॥

పుష్యరాగలక్షణాదులు.

మరకతరత్నగుణ తద్ధారణఫల లక్షణలక్షితానంతరమున పుష్యరాగ గుణ తద్ధారణఫలములను జెప్పుచున్నారము. పుష్యరాగము పచ్చనై మంచి కాంతిగలిగి శుద్ధమగు ఛాయలచే స్నిగ్ధమై వర్తులమగు కలశమును ధరించిన విశదమగు కీర్తిని శౌర్యమును బోషించును.

నల్లచుక్కలుగలిగి పరుషమై ధవళమై మలినమై చులకనై రెండురంగులుగలిగి యిసుకగలిగిన పుష్యరాగము దోషయుక్తముగావున విడువదగును.

పుష్యరాగభూషణమును ధరించిన దీపనమగును. ఆయుశ్శ్రీప్రజ్ఞా వీర్యములు వృద్ధినొందును. ఆరుకోణములు గలుగుట చులకనగుట నునుగునై మిడిదళముల్గలుగుట వాడిగల మొనలగుట నైర్మల్య మీయైదును పుష్యరాగమునకు గుణములని చెప్పబడెను. స్వచ్ఛమగు మెరుపుకాంతిగలిగి చులకనై చిన్నరేఖగలిగి సౌమ్యములగు నారంచులుగల పుష్యరాగము సంపత్తిఁజేయును.

ఈపైని గారుడపురాణోక్తపుష్యరాగలక్షణములను జెప్పుచున్నారము.

ఇంచుక పసపురంగుగలిగి పాండువర్ణముచే రుచిరమగునది పుష్యరాగమనబడును. అది యెర్రనికాంతికలదైన కౌరుండవనామకమగును. ఇంచుకంత మెరుపుగలిగి పచ్చనగునది పృచ్ఛకసంభవము సాధకమని చెప్పబడును. ఇంచుకనలుపుగలిగి తెల్లనై నున్ననై సుగుణముగలిగిన సుస్నానికమనబడును. మిక్కిలి యెర్రనగునదియే పద్మరాగమనబడును. కేవలము నలుపుగలుగునది నీలమని చెప్పబడును. మూల్యమును ధారణఫలమును వైదూర్యమణికివలెను పుష్యరాగమునకును రత్నశాస్త్రవేత్తలచే జెప్పబడెను- గాని స్త్రీలకు ధారణమువలన విశేషశుభమగును.

వజ్రలక్షణాదయః

అథ వజ్రలక్షణాని తద్ధారణఫలానిచ ప్రవదామః॥ యత్పాషాణతలే నికాషకషణోత్సంఘర్షణే నిష్ఠురే యచ్చాన్యోన్యోపలలోహముద్గరముఖై రేఖాన యత్యాహతం। యచ్చాన్యం నిజశీలనేన దళమేద్వజ్రేణవాభిద్యతే తజ్జాత్యం

తులితంవదంతి విబుధాచార్ఘ్యం మహానర్ఘ్యకం॥ చతుర్విధవజ్రగుణాన్యుచ్యం తే॥ విప్రస్సోపి రసాయనేషు బలవానష్టాంగపుష్టిప్రదో రాజన్యస్తు సృణాంవలీపలితజిన్మృత్యుంజయేదంజసా॥ ద్రవ్యాకర్షణసిద్ధిదస్తు సుతరాం వైశ్యోథ శూద్రోఽథవేత్సర్వవ్యాధిహరస్తదేషకథితో వజ్రస్యవర్ణైర్గుణః॥ వజ్రంచ సద్గుణోపేతం సర్వరోగాపహారకం। సర్వార్థసిద్ధిదం సౌఖ్యం దేవతావశ్యముత్తమం॥ గుంజాత్రయేణ యద్వజ్రం తులాయాం తులితంయది। మంజుళం నిష్కమానస్య తదేకాదశకం భవేత్॥ అస్యార్థః॥ గుంజాత్రితయతులితంవజ్రం మంజుళమితి రత్నశాస్త్రజ్ఞావదంతి। తదేకాదశం మంజుళం నిష్కకం భవతి॥

అథ గారుడపురాణోక్తలక్షణాని ప్రదర్శయామః॥ మహాప్రభావం విబుధై ర్యస్మాద్వజ్రముదాహృతం। వజ్రం పూర్వంపరీక్ష్యేయం తతోస్మాభిః ప్రకీర్త్యతే॥ హిమమాతంగసౌరాష్ట్రాః పౌండ్రకాళింగకోసలాః। వేణీతటాశ్చ సౌవీరా వజ్రస్యాష్టవిధాకరాః॥ ఆతామ్రా హిమశైలజాశ్చ శశిభా వేణ్యాస్తటోద్భాశ్శుభాః సౌవీరాస్తు సితాబ్జమేఘసదృశాస్తామ్రాశ్చ సౌరాష్ట్రజాః। కాళింగాః కనకావదాతరుచిరాః పీతప్రభాః కోసలా శ్శ్యామా పుండ్రభవా మతంగవిషయే నాత్యంతపీతప్రభాః॥ అత్యంతం లఘువర్ణతశ్చ గుణవత్పార్శ్వేషు సమ్యక్సమం రేఖాబిందుకళంకకాకపటలైస్త్రాసాదిభిర్వర్జితం। లోకేస్మిన్పరమాణుమాత్రమపి యద్వజ్రం క్వచిద్దృశ్యతే తస్మిన్నేవ సమాశ్రయో హ్యవితథశ్శ్రియోహ్యుదారంయది॥ వజ్రేషువర్ణయుక్తో దేవానామపి పరిగ్రహః ప్రోక్తః। వర్ణేభ్యశ్చ విభాగః కార్యో వర్ణాశ్రయాదివ ప్రోక్తః॥ హరిత సిత పీతపింగశ్యామాస్తామ్రాస్సుచ్ఛాయకారుచిరాః। హరివరుణశక్రహుతవహ పితృపతిమరుతాం శుభవహాః॥ విప్రస్యశంఖకుసుమస్ఫటికావదాతస్స్యాత్క్షత్రియస్య శశిరుద్రవిలోచనాభః। వైశ్యస్యకాలకదళీదళసన్నికాశశ్శూద్రస్య ధౌతకరవాలసమానదీప్తిః॥ ద్వావేవవర్ణౌ పృథివీపతీనాం సద్భిఃప్రదిష్టౌయదిసార్వజన్యౌ। యస్యాబ్జపావిద్రుమభంగశోణో యోవా హరిద్రావరసన్నికాశః॥ ఈశత్వాత్సర్వచిహ్నానాం గుణవత్సార్వవర్ణికం। కామతోధారయేద్రాజానత్వజోన్యః కథంచన॥ అథరోత్తరవృత్త్యాహి సాదృశ్యాద్వర్ణసంకరః। తతఃకష్టతరోవజ్రవర్ణానాం సంకరోమతః॥ నచ మార్గవిభాగమాత్రవృత్త్యా విదుషా వజ్రపరిగ్రహో విధేయః। గుణవద్గుణసంపదాంవిభూతిర్విపరీతో వ్యసనోదయస్యహేతుః॥ ఏకమపి యస్యశృంగం విమలితమవలోక్యతే విశీర్ణం। గుణవదపి తన్నధార్యం వజ్రం శ్రేయోర్థిభిర్భవనే॥ స్ఫుటితాశ్చ విశీర్ణశృంగదేశామలవర్ణైః పృషతైరుపేతమధ్యాః నహివజ్రభృతోపి వజ్రమాశు శ్రియమన్యాశ్ర

మలాంరిసాంచ కుర్యాత్॥ యస్త్వైకదేశక్షతజావభాసో యద్వా భవేల్లోహిత వర్ణచిత్రం। నతత్రకుర్యాద్విషమాణమూశు స్వచ్ఛందమృత్యోరపి జీవితాంతం॥ కోట్యఃపార్శ్వానిధారాశ్చ షడష్టౌ ద్వాదశేతిచ। ఉత్తుంగస్సమతీక్ష్ణాగ్రో వజ్రస్యాకరజాగుణాః॥ శతకోటిశుద్ధమమలం స్ఫుటతీక్ష్ణధారవర్ణాన్వితం లఘు సుపార్శ్వమతీతదోషం। ఇంద్రాయుధాం సువిస్తృతిస్ఫురితాంతరాళమేవంవిధం భువిభవేత్సులభం నవజ్రం॥ తీక్ష్ణాగ్రం విమలమపేతసర్వదోషం ధత్తే యత్ప్రియతతనుస్సదైవ వజ్రం। వృద్ధిస్తం ప్రతిదినమేతి యావదాయుశ్శ్రీసంపత్సుతధనధాన్యగోపశూనాం॥ వ్యాళవహ్ని విషవ్యాఘ్రతస్కరాది భయానిచ। దూరాత్తస్య నివర్తంతే కర్మాణ్యాథర్వణానిచ॥ యత్తు సర్వగుణైర్యుక్తం వజ్రం భవతి వారిణి। రత్నవర్గేసమస్తేపి తస్యధారణమిష్యతే॥ అణునాపిహిదోషేణ లక్ష్యాలక్ష్యేణ దూషితం। నశూన్యాద్దశమంభాగం వజ్రంభవతి వాసవ। ప్రకటానేకదోషస్య స్వల్పస్య మహతోపివా। సశూన్యా శతశోభాగో వజ్రస్యనవిధీయతే। అల్పదోషమలంకారే వజ్రంయద్యపి దృశ్యతే। రత్నానాంపరికర్మార్థం శూన్యం తస్య భవేల్లఘు॥ ప్రథమంగుణసంపదాహ్యుపేతం ప్రతిరత్నం సముపైతియచ్చదోషం। అమలాభరణేపి తస్యరాజ్ఞో గుణహీనోపి మణిర్నదూషణాయ॥ నార్యావజ్రమధార్యం గుణవదపిసుతప్రసూతిమిచ్ఛంత్యా। అన్యత్రదీర్ఘచిపిటత్రిశ్రాశ్చ గుణైర్విముక్తాశ్చ॥ ఆయసాపుష్యరాగేణ తథాగోమేధికేనచ। వైడూర్యస్ఫటికాభ్యాంచ కాచైశ్చాపి పృథగ్విధైః। ప్రతిరూపాణి కుర్వన్తి వజ్రస్యకుశలానరాః। పరీక్షా తేషుకర్తవ్యా విద్వద్భి స్సుపరీక్షకైః। క్షురోల్లేఖనశాలాభిస్తేషాంకార్యం పరీక్షణం। పృథివ్యాం యానిరత్నాః యేచాన్యే లోహధాతవః। సర్వాణి విలిఖేద్వజ్రం తచ్చతైర్నవిలిఖ్యతే। గురుతా సర్వరత్నానాం గౌరవాధారకారిణి। వజ్రతాం వైపరీత్యేన సూరయః పరిచక్షతే॥ జాతిరజాతిం విలిఖతి జాతిం విలిఖంతి వజ్రకురువిందాః। వజ్రో వజ్రం విలిఖతి నాన్యేన విలిఖ్యతే వజ్రం॥ సౌదామినీ విస్ఫురితాభిరామం రాజాయధోక్తం కులిశం దధానః। పరాక్రమోపాత్తపరప్రతాప స్సమస్తసామంతభువం భునక్తి॥

## వజ్రలక్షణాదులు.

ఇటుమీద వజ్రలక్షణమును తద్ధారణఫలమును జెప్పుచున్నారము.

పాషాణమందైన గీటురాయిపైనైన రాశిన యరగక నితరరత్నములచేనైన లోహముచేనైన గీసిన రేఖపుట్టకను సమ్మెటచే గొట్టిన భిన్నముగా

కుండినదియు సజాతీయముచేమాత్రము భేదింపబడునది విలువ నిర్ణయింపశక్యములేని వజ్రమని పెద్దలందురు.

చతుర్విధవజ్రలక్షణములను జెప్పెదము. బ్రహ్మజాతివజ్రము రసాయనములందు మిక్కిలి పుష్టిని జేయును. క్షత్రజాతివజ్రభస్మమును సేవించిన వార్ధకముచేనగు వలీపలితాదికమును జేయక నపమృత్యువును దొలగించును. వైశ్యజాతి ద్రవ్యాకర్షణసిద్ధిని జేయును. శూద్రజాతి సకలవ్యాధులను హరించును. సుగుణవజ్రము సర్వరోగాపహరము సర్వార్థసిద్ధిదము సౌఖ్యకరము దేవతావశీకరము. మూడుగురివిందగింజలెత్తు మంజుళమనబడు నివి పదునొకండైన నిష్కమనబడును.

ఇటుపైని గారుడపురాణోక్తలక్షణములను జెప్పుచున్నారము.

వజ్రము మహాప్రభావముకలదని పెద్దలచే జెప్పబడుటవలన ముందుగ వజ్రపరీక్షను జెప్పుచున్నారము. హిమవంతము మతంగపర్వతము సౌరాష్ట్రము పౌండ్రకము కళింగము కోసలదేశము వేణీతటము సౌవీరము నీ యెనిమిదియును వజ్రములకాకరములు. హిమశైలసంభవములించుకెరుపుగలిగి యుండును. వేణీతటోద్భవములు శశిప్రభచే శుభప్రదములగును. సౌవీరజములు పుండరీకములవలెనుండును. సౌరాష్ట్రజములు మెరపైయుండును. కాళింగములు బంగారువలె రంగుమీరును. కోసలజాతములు పచ్చనై యుండును. పుండ్రభవములు శ్యామాభములు. మతంగజాతములత్యంతపీతములు.

మిక్కిలిచులకనై వర్ణము గుణముసుగలిగి పార్శ్వములందు సమతచే లెస్సగనుండి రేఖాబిందుకళంకకాకపటలత్రాసాది దోషరహితమైనది యణుమాత్రమగు వజ్రమీలోకమందు సంభవించినను సకలశ్రేయములను గలుగజేయును. వజ్రములందు వర్ణయుక్తమగునది దేవతలకును పరిగ్రహయోగ్యమగును. వర్ణములవలన నీవిభాగము జెప్పబడును. ఆకుపచ్చనగునది సూర్యునకు తెల్లనిది వరుణునకు పసపుపచ్చనదింద్రునకు పింగళవర్ణమగ్నికి శ్యామలము యమునకు నెఱ్ఱనిది సకలదేవతలకు నిటులర్పించిన శుభావహమగును.

బ్రహ్మజాతి శంఖపుష్పస్ఫటికములవలె తెల్లనైయుండును. క్షత్రజాతి చంద్రాగ్నులభంగి తెల్లనై తీక్ష్ణమై యుండును. వైశ్యజాతి నల్లని పత్రములవలె నుండును. శూద్రజాతి ధౌతఖడ్గమువలె దీప్తమైయుండును.

క్షత్రియులకు మందారపుష్పమువలె నెఱ్ఱనగునదియును పసపువలె పచ్చనగునదియు నీరెండువర్ణములును ధార్యములని సజ్జనులచే జెప్పబడెను. స

ర్వచిహ్నములకును ప్రభువులగుటవలన గుణవంతములగు సన్నిరంగుల వజ్రములను యథేచ్ఛగా రాజులు ధరించదగు నితరులకట్లుధగదు.

ఉత్తమాధమవృత్తిచే సామాన్యమువలన వర్ణసంకరమగును గాన వజ్రవర్ణసాంకర్యము తగదు. సంపత్తి నడువడిమాత్రముచే వర్ణభేదము తెలియక వజ్రపరిగ్రహము జేయదగదు. వర్ణగుణానురూపమగు వజ్రమును ధరించిన మైశ్వర్యమగును. విపరీతమైన యశుభమిచ్చును. ఒకశృంగముగల వజ్రము నిర్మలమైనను శిథిలముగ గనుపడిన మిగులనెన్నిగుణములుండినను దాని ధరింపరాదు. పగిలి చిటిలిన మొనగలిగి మలినమగు చుక్కలు మధ్యమందున్న వజ్రమును ధరించిన లక్ష్మిబోవును. ఏవజ్రమునకొకపార్శ్వమందు నెరువుగలగినను నెట్టిని దానియందు చిత్రవర్ణముండినను దానిధరించినవారు స్వచ్ఛందమరణులగును మృత్యువాసన్నమగును.

అంచులుమొనలుదారలారైన నెనిమిదైన పన్నెండైన నుండి యున్నతసమతీక్ష్ణాగ్రముగలిగిన వజ్రముత్తమఖనిజమని దెలియదగును. పరిశుద్ధమై స్ఫుటతీక్ష్ణధారణమై వర్ణముగలిగి చులకనై సుపార్శ్వయుక్తమై దోషవిముక్తమై యిందుద్రనివజ్రచ్ఛాయలవలె లోపలచాయలుగలిగిన వజ్రము భూలోకమందు దుర్లభము తీక్ష్ణాగ్రము నిర్మలము నిర్దుష్టమునగు వజ్రము నెల్లప్పుడు ధరించువారలకు శ్రీసంపత్సుతధనధాన్యపశుసమృద్ధి యావజ్జీవముదినదినప్రవృద్ధమానమగును. సర్పవహ్నివిషవ్యాఘ్రతస్కరాదిభయము దూరమగును. అభిచారికములు శాంతించును. సర్వగుణయుక్తమగు వజ్రము సకలరత్నవర్గమందును ముఖ్యముగ ధరించదగును. దోషమణుమాత్రమైన గనుపడిన దశమభాగమైన వజ్రమందు వజ్రత్వముండదు. అనేకదోషములు కలిగినది గొప్పవజ్రమైనను శతాంశమైన వజ్రత్వ దానియందుండదు.

యోగ్యానేకరత్నాలంకృతియందల్పదోషవజ్రముండిన నాయలంకృతి శూన్యమై లాఘవమును దెచ్చును. గుణయుక్తమగువజ్రముతో గుణహీనమగు నితరరత్నములు స్థాపించబడిన యలంకారమును ధరించిన రాజుకు వజ్రగుణమువలన నితరరత్నదోషముల శుభమునివ్వజాలవు. పుత్రోత్పత్తినిగోరు స్త్రీచే గుణయుక్తవజ్రమైనను ధరించతగదు. వజ్రపుఅడ్డబాసమాత్రము స్త్రీ ధరించదగును.

గుణహీనులగు స్త్రీలు వజ్రములను ధరించవచ్చును. లోహము, పుష్యరాగము, గోమేధికము, వైడూర్యము, స్ఫటికము, కాచము వీటిచే నేర్పరులు

వజ్రిపత్రిశిరూపములను జేతురు. వీటియందు పరీక్షకులు తుకోల్లేఖనాదులచే జాగరూకులై పరీక్షించి కనుపెట్టదగును. భూమియందుగల సకలరత్నములు లోహములును వజ్రముచే తెగును. వజ్రము దేనిచేనైనను తెగకుండును. ఆ న్నిరత్నములకును గౌరవము బలువుచే గలుగును. వజ్రిము చులకనై గౌరవ మొందును.

ఏరత్నములైనను జాతిని జాతీయరత్నము గోసివేసును. వజ్రకురివింద ములు తమజాతిని గోసును. వజ్రమును వజ్రముమాత్రమే గోసివేసును.

మెరుపుభంగిని స్ఫురితమగు యథోక్తవజ్రమును ధరించురాజు పరాక్ర మముచే నితరరాజప్రతాపమపహరించి సర్వభూమండలము నేలును.

నీలరత్నలక్షణాదయః

అథ నీలరత్నలక్షణాదీన్వదామః॥ గురుత్వం స్నిగ్ధకాంతిత్వం సురంగం పార్శ్వరంజనం। తృణగ్రాహిత్వమిత్యేతే గుణాః పంచ ప్రకీర్తితాః॥ పటలం శర్కరామిశ్రం భేదత్రసరసంయుతం। మృత్తికాగర్భమిత్యేతే దోషా నీలస్య చోదితాః॥ నీలంసతిక్తకోష్ణంచ కఫపైత్త్యాసిలాపహం। యో దదాతి శరీరస్య శౌర్యమంగళదో భవేత్॥ అథ గారుడపురాణోక్తం దర్శయామః॥ అత్రైవసిం హళవధూకరపల్లవాగ్రవ్యాలూనబాలలవలీకుసుమప్రభాణి। దేశేపపాతదితిజ స్య నితాంతకాంతం ప్రోత్ఫుల్లనీరజసమద్యుతినేత్రయుగ్మం॥ తత్సంపపాత భ యశోభనవీచిభూషా విస్తారిణీ జలనిధే రుపకంఠభూమిం॥ తద్భిన్న కేతకవ నప్రతిమానరేఖా సాంద్రేంద్రనీలవరరత్నవలీవిభాతి। తత్రాసి తోభహలభృ ద్వసనాసిభృంగశార్ఙ్గాయుధాంగహరకంఠకలాయపుష్పైః॥ శుక్లేతరైశ్చకుసు మైర్గిరికర్ణికాయాస్తస్మిన్భవంతి మణయస్సదృశావభాసః। అన్యే ప్రసన్నపయ సఃపయసాంవిధాతురత్యిషశ్శిఖిగళప్రతిమాస్తథాన్యే। నీలీరసప్రభవబుద్బు దభాశ్చ కేచిత్కేచిత్తథాసమదకోకిలతుల్యభాసః॥ ఏకప్రకారవిస్పష్టవర్ణశో భనభాషిణః। జాయంతే మణయస్తస్మిన్నింద్రనీలామహాగుణాః। మృత్పాషాణ శిలావజ్రశర్కరాత్రాససంయుతాః। అభ్రికాపటలచ్ఛాయావర్ణదోషైశ్చదూ షితాః। తతఏవహిజాయంతేమణయస్తత్రభూరిశః। శాస్త్రసంబోధితధియస్తా న్సాశంసంతిసూరయః॥ ధార్యమాణస్య నేదృష్టాః పద్మరాగమణేర్గుణాః।ధా రణాదింద్రనీలస్య తానేవాప్నోతి మానవః॥ యథాచపద్మరాగాణాం జాతిక త్రితయంభవేత్। ఇంద్రనీలేష్వపి తథా ద్రష్టవ్యమవిశేషతః। పరీక్షాప్రత్యయే యైశ్చ పద్మరాగః ప్రకీర్తితః। తఏవప్రత్యయాదృష్టాః ఇంద్రనీలమణేరపి।యా

వంతంచక్రమేదగ్నిం పద్మరాగప్రయోగతః। ఇంద్రనీలమణిస్తస్మాత్క్రిమేతమ మహత్తరం। తథాపి నపరీక్షార్థం గుణానామితి శుద్ధయే। మణిరగ్నౌ నమాధే యః కథంచిదపి కైశ్చన। అగ్నిమాత్రపరిజ్ఞానే దాహదోషశ్చ దూషితః। సో నర్థాయ భవేద్భర్తుర్గ్నికర్తుః కారయేత్తథా॥ కాచోత్పలకరవీరస్ఫటికాస్తైవ పాబుధైస్సవైడూర్యాః। కథితావిజాతయఇమే సదృశా మణినేంద్రనీలేన। గురుభార తింభారా దేతేషాం నిత్యమేవ విజ్ఞేయా। కశ్చిద్యథావ దుత్తరవివర్ధ మానో విశేషేణ॥ ఇంద్రనీలో యథాకశ్చిద్భర్త్యోస్తామ్రివర్ణభం। రక్షుని యూ యథా తామ్రి కరవీరోత్పలావుభౌ। యస్యమధ్యగతాభాతి నీలాస్సేంద్రాయుధప్రభాః। తదింద్రనీలమిత్యాహుర్మహార్ఘం భువిదుర్లభం॥ యస్యవర్ణస్యభూయస్త్వే క్షీరే శతగుణే స్థితః। నీలతాభం భజేత్సర్వం మహానీలస్సఉచ్యతే॥ యత్పద్మరాగస్య మహాగుణస్య మూల్యంభవేన్మాషసమున్నితస్య। తదింద్రనీలస్యమహాగుణస్య సువర్ణసంఖ్యాతులితస్య మూల్యం॥ దశార్ధగుంజపరివదంతి మాష॥

## నీలరత్న లక్షణాదులు.

ఇటుమీద నీలరత్న గుణదోష ధారణఫలాదులను జెప్పుచున్నారము.

గౌరవమునున్నకాంతి చమకు పార్శ్వములను దనకాంతిచే బూయుట తృణమును బట్టుట నీరైదును నీలమునకు గుణములు. పటలము నిసుకగలుగుట పగులుట త్రాసముగలుగుట లోపలచెత్తయుండుటయును దోషములు. నీలభస్మము చేదు వేడి జేసును. త్రిదోషములను శమింపజేసును. శౌర్యమును సకలశుభములను జేయును.

గారుడపురాణోక్తనీలలక్షణములను జెప్పుచున్నారము. సింహళదేశకాంతాహస్తపల్లవాగ్రగలూనములగు లవలీకుసుమసమకాంతములై బలాసురుని నీలోత్పలకాంతములగు నేత్రములాదేశమందు బడెనవి సముద్రతరంగప్రసాదితములై తత్ప్రాంతభూతములందాకరములాయెను. ఆనేత్రములవలన కేతకీవనపఙ్క్తులవలె సాంద్రములగు నింద్రనీలరేఖలుత్పన్నములాయె నందు బలరాముని వస్త్రము, ఖడ్గము, తుమ్మెద, హరిశరీరము, హరకంఠ కలాయ పుష్పములు వీటిభంగి నీలకాంతిగలిగి రత్నములుత్పన్నములాయెను.

మరియు కొన్ని నీలపర్వతము నీలకంఠకంఠము నీరీరసమందగు బుడగ కోకిల వీటితోసమమగు కాంతులుగలవి బుట్టెను. స్పష్టమగు నేకవర్ణము చేభాసిల్లునవి నింద్రనీలములు యివి విశేషగుణవంతములు.

మృత్తిక పాషాణము శర్కరమగు నిసుక త్రాసము మేఘమువంటి పొర యివి ఛాయాదోషములును వర్ణములును గావున వీటిచేదూషితములై కొన్ని మణులచట విశేషముగ బుట్టును. శాస్త్రజ్ఞులగు విద్వాంసులు వీటినెన్నిక జేయరు.

పద్మరాగమును ధరించిన నేమిఫలమో యింద్రనీలము ధరియించిన న దియే యగును. పద్మరాగమునకువలె నీలమునకును జాతులు మూడు. పరీక్ష యును పద్మరాగమునకువలె జెప్పబడెను. అగ్నియందు పరీక్షార్థమై పద్మరా గమునూవలె నింద్రనీలమును జూడదగును గాని యటులొనర్చరాదు. దాహ దోషదూషితమగు నారత్నమును ధరించినవారికి నటులబరీక్షించిన వారికి నన ర్థమగును. ఉత్పలములవంటి కాచమును నల్లగన్నేరువంటి స్ఫటికములు నై దూర్యములు నింద్రనీలములతో సమముగ విజాతీయములై యుండును. భారము కాఠిన్యము నీలములకు ముఖ్యములని తెలియదగును. ఈ రెంటిలో బరువువిశేష ముగ నుండుట శ్రేష్ఠము.

ఈషత్తామ్రమును కరవీరోత్పలసన్నిభమునగు నింద్రనీలము ధరించద గును. ఏనీలముమధ్యనింద్రధనుః కాంతులు నీలరంగుతో జూడబడునో యది యిం ద్రనీలము దానివిలువకు కొలలేదు. భూమియందదిదుర్లభము. రత్నము స్వల్ప మై కాంతిచే శతగుణము గొప్పదిగ గనుపడుచుండి సంపర్కముగలవాటిని ద నరంగుచే నాచ్ఛాదించునది మహానీలమనబడును. మహాగుణమగు మాషమాత్ర పద్మరాగమునకు విలువ యెంతయగునో రెండుతులములయిరువది చిన్నము లుగల యింద్రనీలమున కంతవిలువ. మాషమనగా అయిదుగురువిందలెత్తు.

గోమేధికమణిగుణాదయః

అథ గోమేధికమణిగుణగణం కరిష్యామః॥ గోమేధికోమ్లముష్ణంచ వాతకోపవికారజిత్। దీపనం పాచనంచైవ కురుతే పాపనాశనం॥ కురంగం శ్వేతకృష్ణాంగం రేఖాత్రాసం క్షతం లఘు। ద్విచ్ఛాయం కర్కశాకారం గో మేధం తద్బుధస్త్యజేత్॥

గోమేధికమణిగుణాదులు.

నీలరత్నగుణములనుజెప్పి గోమేధికరత్నగుణాదులను జెప్పుచున్నార ము. గోమేధికభస్మము పుల్లనై వెట్టగలిగి వాతప్రకోపహరమై దీపనమొనర్చి పాచనమును జేయును. దీనిధరించిన పాపక్షయమగును. శ్వేతకృష్ణ కాంతులు రేఖలు త్రాసము క్షతములు గరుగును గలిగిన గోమేధికము ధరించతగదు.

## వైడూర్య రత్న లక్షణాదయః.

అథ వైడూర్యరత్నలక్షణాదీన్ వ్యాఖ్యామః॥ నీలాభ్రధూమసంకాశమీష
త్కృష్ణం శితంచయత్। వైడూర్యముత్తమం ప్రోక్తం రత్నశాస్త్రవిశారదైః॥
వైడూర్యమామ్లముష్ణంచ కఫమారుతనాశనం।గుల్మశూలప్రశమనం భూషణం
చ శుభావహమితి చరకః॥ అథ గారుడపురాణోక్తం దర్శయామః॥ వైడూర్య
పద్మరాగాణాం కథ్యతే లక్షణం కోవిదైః। పరీక్షాం బ్రహ్మణా ప్రోక్తాం వ్యా
సేన కథితా ద్విజాః॥ కల్పాంతకాల క్షుభితాంబురాశి నిర్హ్రాదకల్పా ద్దితిజ
స్య నాదాత్। వైడూర్యముత్పన్నమనేకవర్ణశోభాభిరామద్యుతివర్ణజీవం॥ అవి
దూరే విదూరస్య గిరేరుత్తుంగరోధసః। కామభూతికసీమాన తేనతస్యాకరో
భవేత్। తస్యనాదసముద్ధేన హ్యాకరస్సుమహాగుణః। అభూదుత్తరితో లోకే
లోకత్రయవిభూషణం॥ తస్యైవ దానవపతేర్నినదానురూప ప్రావృట్పయోద
రవదర్శితచారురూపాః। వైడూర్యరత్నమణయో వివిధావభాసాః తస్మాత్స్ఫు
లింగనివహాఇవ సంబభూవుః॥ పద్మరాగముపాదాయ మణేర్వర్ణాహి మేక్షి
తౌ। సర్వాంస్తాన్వర్ణశోభాభిర్వైడూర్యమనుగచ్ఛతి॥ తేషాంప్రధానం శిఖికం
ఠనీలంయద్వాభవేద్వేణుదళప్రకాశం। ఆతామ్రపద్మప్రతిమం శ్రియో మే ధన
ప్రదాస్తామణిశాస్త్రవిద్భిః॥ గుణవాన్వైడూర్యమణిర్యోజయతి స్వామినం వ
రైర్భాగైః। దోషైర్యుక్తాందోషాస్తస్మాద్యత్నాత్పరీక్షణం కార్యం। గిరిషు శిలా
జితాకాచస్ఫటికాశ్చ ధూమనిర్భిన్నాః। వైడూర్యమణేరేతే విజాతయ స్సన్ని
భాస్సంతి। విఖ్యాతంత్వాకోచం లఘుభారాభైస్తుషాలకం వింద్యాత్। గిరికా
చమదీప్తిత్వాత్స్ఫటకరవర్ణోజ్జ్వలత్వేన॥ యథేంద్రనీలస్య మహాగుణస్యసువర్ణ
సంఖ్యాకలితస్య మూల్యం। తదేవ వైడూర్యమణేః ప్రదిష్టం పలద్వయోన్మా
పితగౌరవస్య। జాత్యాస్తుసర్వే విమణిస్తుయాదృగ్విజాతయస్సంతిసమానవర్ణాః।
తథాపినానాకరణానుమేయః భేదప్రకారః పరమఃప్రదిష్టః। సుఖోపలక్ష్యశ్చ
సదావిచార్యోహ్యయంప్రభేదైర్విదుషానరేణ। స్నేహప్రభేదో లఘుతా మృ
దుత్వం విజాతిలింగంఖలు సర్వజన్యం॥ కుశలైశ్చ పూజ్యమానాః ప్రతిబద్ధాః
ప్రతిసత్క్రియాప్రయోగైః। గుణదోషసముద్భవం లభంతే మణయోంధాంతర
మూల్యమేవభిన్నాః। క్రిమశస్సమతీతవర్తమానాః ప్రతిబద్ధా మణయోనుకేన
యత్నాత్। యదినామభవంతి దోషహీనాః మణయ స్సద్గుణ మాప్నువంతి
మూల్యం॥ పలస్య దశమోభాగః ధరణః పరికీర్తితః। ఇతిమానవిధిఃప్రోక్తో ర
త్నానాం మూల్యనిశ్చయఇతి॥

## వైదూర్య లక్షణాదులు.

గోమేధికలక్షణలక్షితానంతరమందు వైదూర్యలక్షణాదులను జెప్పుచున్నారము. నీలాభ్రముతో ధూమముతో సమమై యించుకనలుపుగలిగి తెల్లనగు వైదూర్యముత్తమమని రత్నశాస్త్రవేత్తలచే జెప్పబడినది. వైదూర్యభస్మము పుల్లనై వెట్టజేసి కఫవాయువులను గుల్మశూలాదుల నిర్మూలనమొనర్చును. భూషణమందుంచి ధరించిన శుభపోషణమగునని చరకులు.

ఇటుమీదట గారుడపురాణోక్తవైదూర్యలక్షణవిచక్షణులమయ్యెదము. వైదూర్యపద్మరాగములవిషయమై బ్రహ్మచే జెప్పబడి వ్యాసులచే బ్రకటింపబడినదానిని రత్నలక్ష్మకోవిదులచే జెప్పబడెను.

ప్రళయకాలక్షుబ్ధాబ్ధిధ్వనిసమమగు బలాసురుని కంఠనాదమువలన ననేకవర్ణశోభలచే నభిరామమగు వైదూర్యముత్పన్నమాయెను. విదూరగిరికదూరముగా నున్నతమగు ప్రదేశమున ముందుగ నారాక్షసుని నాదమువలన లోకత్రయభూషణమై వైదూర్యముత్పన్నమాయె నిప్పటికిని తన్నాదానుకారి మేదురమేఘనాదమువలన ప్రతివార్షికసమయమందును మిణుగురులవలె మణులు భూమిని భేదించుకొని నానాకాంతులు కలవై యంకురించును.

పద్మరాగము మొదలగు నన్నిరత్నముల నెన్నికగలరంగుల నీవైదూర్యమనుసరించునందులో ప్రధానములు నెమలికంఠమువలె నీలమగునదియు వెదురాకురంగుగలదియును యించుకెఱ్ఱనగు పద్మమువలెనుండునదియు ధనప్రదాయకములుగావున నిట్టివైదూర్యము ధరించదగునని శాస్త్రజ్ఞులచే జెప్పబడెను.

గుణయుక్తమగు వైదూర్యమును ధరించిన స్వామి కగణితభోగములు గలుగును. దోషయుక్తమైన దోషించునుగాన యత్నముచే నీరత్నమును బరీక్షించదగును. శైలములందు శిలాజిత్కాచస్ఫటికములు ధూమమువలె శ్యామములై బాడము నివి వైదూర్యమునకు విజాతీయములు. యోగ్యరత్నవైపుల్యానుగుణలఘుభారప్రభలచేతను తుషాంకాదిదోషములవలనను విజాతీయములను దెలిసికొనదగును. గిరికాచము దీప్తిలేనిదగుటవలన స్ఫుటమగు కిరణప్రభలచే ప్రజ్వలించదుగాన నిటులపరీక్షించి పరిత్యజించదగును.

సువర్ణపరిమాణమహాగుణేంద్రనీలమునకు నిర్దిష్టమగు మూల్యము పణద్వయపరిమాణవైదూర్యమునకు నిర్ణయించదగును. జాత్యములగు సకలరత్నములును స్వసమానవర్ణములగు విజాతీయరత్నములతో గలసినను విమణిత్వమునొందవు. నానాసాధనములచే బోల్చదగిన భేదప్రకారము చక్కగ జెప్ప

బడెను. కుశలులగు విద్వాంసులచే నెల్లప్పుడు విచారణజేసిన సుఖముగ నిరీక్షించదగియున్నది. జీవిక గలుగుటయొక్క భేదము చులకదనము కోమలత్వమునన్ని విజాతీయములకిచ్చిచిహ్నము. కుశలులచేస్వజాతీయవిజాతీయములేర్పరుచబడుటవలన దెలియవలెను గాని రచనావిశేషముచే వీటిగుణదోషములు దెలియశక్యముగాక నన్నియు సత్కారము నేకరీతిని బొందుచుండును. మూల్యవిధియందు సదసన్మణులు విభిన్నములగును. రత్నములు వాడుకలో జేరియును నూతనముగ దేబడియును ధరింపబడుచుండును. యత్నమువలన నీటురీక్షను కుశలుడెవుడు జేయునో యపుడు సన్మణిగౌరవమును మూల్యమునొందును.

రత్నములకు మూల్యము నిర్ణయించునపుడు పలములోని దశమాంశము ధరణమనబడును.

శక్త్యానురూపం విదధీతధీమాన్భూషావిధిం విశ్వవిమోహనీయం । సువర్ణరత్నైః కలధౌతముక్తాఫలప్రవాళప్రముఖైర్ధనాఢ్యః॥ నిత్యంభూషణమంగళం రతికరం శ్రేయస్కరం కాంతిదం క్షీరాంభోనిధికన్యకావిలసితం క్రీడాపరోచ్చాలయం। ధార్యం మౌక్తికపద్మరాగమణిభి స్సన్నద్ధకుంభత్ప్రభావ్యాలిప్తాహతదిగ్వధూముఖతమస్తోమం సురాణాం ప్రియం॥ అలంబనీయస్య నరస్య కంఠే సందృశ్యతే కుందతుషారగౌరా। ఏకావళీహర్షితరోమసంఘా తనోతిలక్ష్మీమపి కాంతివృద్ధిం॥ ముక్తాఫలైరూర్జితశక్రనీలై ర్వ్యధోచితైర్నిర్మిత హారయష్టిః। సమీరపైత్యప్రశమం తనోతి నిత్యప్రసాదం నయనోత్సవంచ॥ సువర్ణరుద్రాక్షకృతామనోజ్ఞా మాలా మలానామపకర్షణాయ । హిరణ్యపద్మాక్షకృతా తథైవ ముక్తిప్రదా సంతతధారణేన॥ సువర్ణసూత్రం వితనోతి కాంతిమాయుఃపరార్ధ్యం విమలాం శ్రియంచ। భూతగ్రహక్షోభనివారణంచ వినిర్మితం మారుతపైత్యఘాతి॥ కర్ణాభరణమత్యంతం కామినీజనరంజనం। దాహహారిమనోహారి మనోభవనికేతనం। పవిత్రం పుణ్యజననమంగుళీయకధారణం। పవిత్రకరణం నృణామానందసుఖదాయకం। సైవ స్యాంగుళిముద్రాచ సర్వకాంతిం ప్రయచ్ఛతి। కామినీచిత్తసంమోహిన్యస్తముద్రాలిపిర్యతః। లావణ్యకాంతిజనకం సామ్రాజ్యపదముత్తమం। లావణ్యపోషణంకుర్యాద్విన్యస్తాపాదముద్రికా। సౌభాగ్యజననీదోషశోషణీ మనసః ప్రియా॥ మేఖలా నాభిమూలస్థా కింకిణీరత్నశోభితా। పైత్యమారుతయోర్మధ్యే సీమాసూత్రమివస్థితం॥ ముక్తావళీవిరచితాభినవైవధార్యా హారావళీ వితనుతేనిలరోగనాశం। దాహాదివృద్ధిశమనం వితనోతి పైత్యం హన్యాద్ద్వరం నయనయోరపిదోషజాతం॥ సమీక్ష్యసమ్యక్శిరసఃప్రమాణ మష్టాంగుళోచ్ఛేదకృతం కిరీటం। నవాంగుళింవా భు

వి భూపతీనాం శస్తంచ వక్ష్యామ్యథ తద్విధానం॥

తదర్ధవిస్తారకృతం ప్రశస్తం మాంగళ్యమేవంవిధినాకృతంస్యాత్। తదర్ధమానేనతువా నృపాణాం సద్భూషణానామయమేవమార్గః॥ సంపూజ్య రత్నాని నవగ్రహాంశ్చ శచీపతిం విశ్వసృజం బలీంద్రం। అగస్త్యమగ్నిం గజవక్త్రమగ్రే మాంకారయేద్రత్నవిభూషణాని॥ వజ్రైర్ముక్తైః పద్మరాగైశ్చ వజ్రైర్నీలైర్వజ్రైః పద్మరాగైశ్చ వజ్రైః। ఏకాకారాన్తిర్యగూర్ధ్వక్రమేణ లింగంత్వగ్రే శంకరం శోభనంతత్॥ రత్నాభరణమత్యంతంలక్ష్మీక్రీడాసరోవరం। కామ్యం సౌభాగ్యదం వృష్యం మాంగళ్యం రాజపూజితం॥

శక్త్యనురూపముగ ధనాఢ్యులు సువర్ణయుక్తముక్తాప్రవాళాది రత్నములతో నలంకారము సర్వజనాహ్లాదముకొరకు ధరించదగును. నిత్యమలంకారము మంగళరతిశ్రేయఃకాంతిలక్ష్మీకరత్వావహము గావున మౌక్తికపద్మరాగాదిమణిప్రభాపటల నిర్ధూతదిగంగనాముఖ తమస్తోమములగు మాణిదామాద్యలంకృతుడైన దేవతలకతిప్రియుడగును.

మల్లెమొగ్గలవలె నుల్లసిల్లు ముక్తాసరమొకటి యెవనికంఠమందు లంబమానమగునో ముక్తాసంపర్కరోమాంచకంచుకితుడగునతడు లక్ష్మీకాంతుల నొందును.

ముక్తాఫలేంద్రనీలములచే యథోచితముగ రచించినహారమును ధరించిన వాతపైత్యములుద్ధూతములగును. నేత్రోత్సవము మనఃప్రసన్నతయును గలుగును.

సువర్ణరుద్రాక్షకృతమగు మాలికను ధరించిన పాపనాశమగును. సువర్ణపద్మాక్షకృతమాలికనెల్లప్పుడును ధరించిన ముక్తిగలుగును. కేవలసువర్ణసూత్రమును ధరించిన నాయుఃకాంతిలక్ష్మీలాభములగును. భూతగ్రహక్షోభ వాతపైత్యదోషముల శోషించును.

కర్ణాలంకారము కామినీమనోరంజనము రతికరము దాహమణచును. అంగుళీయకధారణము పవిత్రము పుణ్యజనకము. పవిత్రాకారముగ ధరించిన యానందసంధాయకము. లిపిముద్రాంకితమగు నంగుళీయకము కాంతికరము- సామ్రాజ్యప్రదము. భగవత్పాదాంకిత ముద్రికైహికాముష్మికముల నిచ్చును.

చిరిఘంటలుగల మేఖల సౌభాగ్యమిచ్చును దోషములనణచును మనఃప్రీతిని జేసును. పైత్యమునకును వాయువునకును సీమాసూత్రమువలె సీమంతి

సులకుండును. ముక్తాహారము నవీనమే ధరించదగును- వాతరోగమును, దాహము, వాపులు నివిశమింపును- శైత్యమును జేయును- నేత్రరోగములను బోగొట్టును.

శిరః ప్రమాణమునుగొలచి యెనిమిదియైన తొమ్మిదియైన యంగుళములపొడవుగలకిరీటము భూపతులకు ప్రశస్తము దీనివిధానముజెప్పుచున్నారము.

పొడవులోసగమైన నందులోసగమైన విస్తృతిగల యంతరములు గలుగునట్లు రాజభూషణములకు జేయుట విధ్యుక్త మీమార్గము మంగళకరము.

రత్నములకు తదధిదేవతలగు నవగ్రహముల నిందుని బ్రహ్మను బలిం దునగస్త్య నగ్నిని వీరికిముందు గజవక్త్రుని భూషణారంభమున బూజించవలయును. వజ్రము గారుడము పద్మరాగము వజ్రము నీలము వజ్రము పద్మరాగము వజ్రము తిర్యగూర్ధ్వ క్రమముచేజతగూర్చిన రత్నపట్టికలు గలుగునట్లుగున రచించిన కిరీటముయొక్క యగ్రము లింగచిహ్నముగనుండిన యది సుఖప్రదము శోభనమగును.

రత్నాలంకారము లక్ష్మీక్రీడాసరోవరము కామ్యకరము సౌభాగ్యప్రదము మాంగళ్య వీర్య రాజపూజ్యతలనిచ్చును.

సుముహూర్త దుర్ముహూర్త తిథ్యాదివిధిఫలాని- శకునఫలానిచ.

శ్రీజనార్దనో భగవా న్కాలరూపీ పూర్వాదృష్టవశా ద్భవిష్యం మనుష్యాంస్తత్తదనుసరణకాలమేవ తదనురూపకర్మాచరితుం ప్రేరయతి దర్శయతి భావిభవశుభాశుభఫలం తదాజ్ఞాతుం మునయో బ్రువన్నాస్త్రిం జ్యోతిషం నామ వేదాంగం తజ్ఞాః రాజ్ఞాం ప్రియాస్స్యురితి సంక్షేపేణ తద్వదామః॥

గారుడే శ్రీమహాపురాణే షష్టితమోధ్యాయే సూతః॥ జ్యోతిశ్చక్రం భువోమానముక్త్వాప్రోవాచ కేశవః। చాతుర్లక్షజ్యోతిషస్య సారంయద్రాయ సర్వదః॥ శ్రీభగవానువాచ॥ కృత్తికాచాగ్నిదేవత్యా రోహిణీబ్రహ్మణస్మృతాః। ఇల్వలా సోమదేవత్యా రౌద్రం చాంద్ర ముదాహృతం। పునర్వసూస్తథాదిత్యం తిష్యశ్చగురుదైవతః। ఆశ్లేషాసర్పదైవత్యా మఘాచ పితృదేవతా। ఆర్యాశ్చపూర్వఫల్గున్య అర్యమ్ణశ్చ తథోత్తరాః। సావిత్ర్యశ్చ తథాహస్తా చిత్రాస్త్వాష్ట్రాః ప్రకీర్తితాః। స్వాతిశ్చవాయుదైవత్యం నక్షత్రం పరికీర్తితం। ఇంద్రాగ్నిదేవతాః ప్రోక్తా విశాఖా వృషభధ్వజ। మైత్రమృక్ష మనూరాధా జ్యేష్ఠా శాక్రీ ప్రకీర్తితా। తథానిబుతిదేవత్యో మూలస్తజ్జైరుదాహృతః। ఆ

వ్యస్తాషాఢపూర్వాతు ఉత్తరావైశ్వదేవతా। బ్రాహ్మీచైవాభిజిత్ప్రోక్తా శ్ర
వణో వైష్ణవస్స్మృతః। వాసవంతు తథా ఋక్షం ధనిష్ఠా ప్రోచ్యతే బుధైః। త
థా శతభిషం ప్రోక్తం నక్షత్రం వారుణం శివం। అజం భాద్రపదా పూర్వా అహి
ర్బుధ్న్యం తథోత్తరా। పౌష్ణంచ రేవతీ ఋక్షం అశ్వయుక్త్వాశ్వదైవతం। భ
రణ్యశ్చ తథా యామ్యాః ప్రోక్తాస్తే ఋక్షదేవతాః॥ బ్రహ్మాణీ సంస్థితా పూ
ర్వే ప్రతిపన్నవమీతిథౌ। మాహేశ్వరీ చోత్తరే చ ద్వితీయా దశమీతిథౌ। స్థితా
గ్నేయే చ కౌమారీ తృతీయైకాదశీతిథౌ। నారాయణీ చ నైఋత్యాం చతుర్థీ
ద్వాదశీతిథౌ। పంచమ్యాంచ త్రయోదశ్యాం వారాహీ దక్షిణే స్మృతా। ష
ష్ఠ్యాంచైవ చతుర్దశ్యాం ఇంద్రాణీ పశ్చిమే స్థితా। సప్తమ్యాం పౌర్ణమాస్యాం
చ చాముండా వాయుగోచరీ। యోగినీ సంముఖేచైవ గమనాది ప్రకాశయేత్।
అశ్వనీ మైత్రరేవత్యా మృగమూలపునర్వసూః। పుష్యం హస్తా తథా జ్యేష్ఠా ప్ర
స్థానే శ్రేష్ఠముచ్యతే। హస్తాదిపంచఋక్షాణి ఉత్తరత్రయమేవ చ। అశ్వనీ రో
హిణీ పుష్యా ధనిష్ఠా చ పునర్వసూ। వస్త్రప్రావరణే శ్రేష్ఠా నక్షత్రాణాం గ
ణస్స్మృతః। కృత్తికా భరణ్యాశ్లేషా మఘా మూలా విశాఖయోః। త్రీణి పూర్వా
తథా చైవ అధోవక్త్రాః ప్రకీర్తితాః। ఏషు వాపీతటాకాని కూపభూమిత్రణాని
చ। దేవాగారస్య ఖననం నిధానఖననం తథా॥ గణితం జ్యోతిషారంభం ధనీబి
లప్రవేశనం। కుర్యాదధోగతాన్యేవ అన్యాని చ వృషధ్వజ। రేవతీ చాశ్వనీ చి
త్రా స్వాతీ హస్తా పునర్వసూ। అనూరాధా మృగా జ్యేష్ఠాః ఏతే పార్శ్వము
ఖాస్స్మృతాః। గజోష్ట్రాది బలీవర్ద దమనం మహిషస్య చ। బీజానాం వపనం కు
ర్యాద్గమనాగమనాదికం। చక్రయంత్ర రథానాంచ నాగాదీనాం ప్రవాహనం।
పార్శ్వేషు యాని కర్మాణి కుర్యాదేషు చ తాన్యపి। రోహిణ్యార్ద్రా తథా పు
ష్యా ధనిష్ఠా చోత్తరాత్రయం। వారుణం శ్రవణంచైవ నవచోర్ధ్వముఖాస్స్మృ
తాః। ఏషు రాజ్యాభిషేకంచ పట్టబంధంచ కారయేత్। ఊర్ధ్వముఖాన్యభి
తాని సర్వాణ్యేషు చ కారయేత్। చతుర్థీ చాశుభా షష్ఠీ చాష్టమీ నవమీ తథా। అ
మావాస్యా పూర్ణిమా చ ద్వాదశీ చ చతుర్దశీ। సశుక్ల ప్రతిపచ్ఛ్రేష్ఠా ద్వితీ
యా చంద్రసూనునా। తృతీయా భూమిపుత్రేణ చతుర్థీ చ శనైశ్చరే। గురౌ శు
భా పంచమీ స్యాత్షష్ఠీ మంగళశుక్రయోః। సప్తమీ సోమపుత్రేణ అష్టమీ కుజభా
స్కరౌ। నవమీ చంద్రసౌరేణ దశమీ తు గురౌ శుభా। ఏకాదశ్యాం గురుశ్శు
క్రో ద్వాదశ్యాంచ పునర్బుధః। త్రయోదశీ శుక్రభౌమౌ భానౌ శ్రేష్ఠా చతు
ర్దశీ। పౌర్ణమాస్యాత్వమావాస్యా శ్రేష్ఠా చైవ బృహస్పతౌ। ద్వాదశీం దహతే
భానుశ్శశీచైకాదశీం దహేత్। కుజో దహేచ్చ దశమీం నవమీంతు బుధో ద

హేత్। అష్టమీం దహతే జీవ స్సప్తమీం భార్గవో దహేత్। సూర్యపుత్రో ద హేత్షష్ఠీం గమనాద్యాసు నాస్తివై। ప్రతిపన్నవమీష్వేవం చతుర్దస్యష్టమీషు చ। బుధవారేణ ప్రస్థానం దూరతః పరివర్జయేత్। మేషకర్కటకే షష్ఠీ కన్యాయాం మిధునేష్టమీ। వృషేకుంభే చతుర్థీచ ద్వాదశీ మకరేతులే। దశమీవృశ్చికేసింహే ద్వా ధనుర్మీనే చతుర్దశీ। ఏకాదశ్యాం నవప్తవ్యం బీజాదికీలమానవైః। విశాఖాత్రయమాదిత్యే పూర్వాషాఢాత్రయశ్శశీ। ధనిష్ఠాత్రయ భౌమేతు బుధేవై రేవతీత్రయం। రోహిణ్యాదిత్రయంశుక్రే శనౌ పుష్యత్రయం శివం। గురువారే వర్జయేచ్చ ఉత్తరాఫల్గునీత్రయం। మేషయోగేషు చోత్పాతః మృత్యురోగాదికంభవేత్। మూలేర్కశ్రవణేచంద్రః ప్రోష్ఠపద్యుత్తరే కుజః। కృత్తికాసు బుధశ్చైవ గురౌ రుద్రపునర్వసూ। పూర్వాఫల్గుణి శుక్రేచ స్వాతిచైవ శనైశ్చరే। ఏతేచామృతయోగాస్స్యుస్సర్వకార్యప్రసాదకాః॥ విష్కంభే ఘటికాఃపంచ శూలేసప్తప్రకీర్తితాః। షడ్గండేచాతిగండేచ నవవ్యాఘాతవజ్రయోః। వ్యతీపాతపరీఘేచ వైధృతేచ దినేదినే। ఏతేష్వృత్యుసుతాహ్యేషుసర్వకర్మాణివర్జయేత్। హస్తేర్కశ్చ గురుఃపుష్యే అనూరాధా బుధే శుభా। రోహిణీచ శనౌ జ్యేష్ఠా సౌమ్యం సోమేనవై శుభం। శుక్రేచ రేవతీజ్యేష్ఠా అశ్వనీమంగళే శుభా। ఏతేతు సిద్ధయోగావై సర్వదోషవినాశనాః। భార్గవే భరణీచైవ సోమే చిత్రా వృషధ్వజ। భౌమేచైవోత్తరాషాఢా ధనిష్ఠాచ బుధే హర। గురౌ శతభిషద్రుద్రీ శుక్రేవై రోహిణీతథా। శనౌచ రేవతీ శంభో విషయోగాః ప్రకీర్తితాః॥ పుష్యః పునర్వసూచైవ రేవతీ చిత్రయాసహ। శ్రవణంచ ధనిష్ఠాచ హస్తాశ్విని మృగస్తథా। కుర్యా చ్ఛతభిషాయాంచ జాతఃకర్మాణి మానవః। విశాఖాచోత్తరాత్రీణి మఘార్ద్రా భరణీతథా। ఆశ్లేషా కృత్తికారుద్రప్రస్థానే మరణప్రదాః॥ అజోక్షనక్రకన్యాఖ్యానకర్కి మత్స్యతులాః క్రమాత్। రవ్యాదితుంగానీచంతు తత్తత్సప్తమమాచరేత్। సింహస్యాధిపతిస్సూర్యశ్చంద్రఃకర్కటకేశ్వరః। వృషవృశ్చికయోర్భౌమః కన్యామిధునయోర్బుధః। ధనుర్మీనద్వయోర్మంత్రీస్తులావృషభయోర్భృగుః। మకరస్య ఘటస్యాపి నాయకస్సూర్యనందనః। కన్యారాహుగృహంప్రోక్తం కేతోశ్చ మిధునంతథా॥ మృగాహికపిమార్జాలశ్వానసూకరపక్షిణః। నకులో మూషకశ్చైవ యాత్రాయాం దక్షిణే శుభాః॥ భల్యాలాపఫలంవహ్న్యే లభే త్పూర్వే మహాఫలం। ఆగ్నేయే మోహసంతాపౌ మృష్టాన్నంచైవ పశ్చిమే। యామ్యేరోగమవాప్నోతి నైఋతౌ కలహాభవేత్। ఈశాన్యే మరణం ప్రోక్తం ఏతద్భల్లీఋతేః ఫలం॥ జంబుకోష్ట్రీశరాద్యాశ్చ యాత్రాయాం వామకే శుభాః। విప్రకన్యా శ

ఘోరరుద్ర శంఖభేరీవసుంధరా। దినస్త్రీపూర్ణకుంభానాం యాత్రాయాం దర్శనం శుభం॥ కార్పాసౌషధతైలంచ పంగ్వాంగారభుజంగమాః। ముక్తకేశో రక్తమాల్యం నగ్నాద్యశుభమీక్షణం। కృత్తికాదౌతు పూర్వేణ సప్తఋక్షాణి కేవ్రజేత్। మఘాదౌ దక్షిణే గచ్ఛేదనూరాధాదిపశ్చిమే। ప్రశస్తాచోత్తరే యాత్రా ధనిష్ఠాదిషు సప్తసు। అశ్వినీ రేవతీచిత్రా ధనిష్ఠాసమలంకృతా। మృగాశ్వచిత్రాపుష్యాశ్చ మూలహస్తౌ శుభాస్సదా। కన్యాప్రదానేయాత్రాయాం ప్రతిష్ఠాదిషుకర్మసు॥ శుక్రచంద్రౌచ జన్మస్థౌ శుభదౌచ ద్వితీయకౌ। శశాంకశుక్రజీవాశ్చ రాశౌచాథతృతీయకే। భౌమమందశశాంకార్కా బుధశ్శ్రేష్ఠశ్చతుర్థకే। శుక్రజీవౌ పంచమౌచ చంద్రః కేతుసమన్వితః। మందార్కేందుకుజాష్షష్ఠే గురుచంద్రౌచ సప్తమే। శుక్రజ్ఞావష్టమే శ్రేష్ఠౌ నవమస్థో గురుశ్శుభః। అర్కార్కిచంద్రాదశమే ఏకాదస్యఖిలాగ్రహాః। బుధోథద్వాదశేచైవ భార్గవస్సుఖదోభవేత్॥ సింహేనమకరశ్శ్రేష్ఠః కన్యాయాం మేషఉత్తమః। తులయాసమమీనస్తు కుంభేనసహకర్కటః। ధనుషావృషభశ్శ్రేష్ఠో మేషేణసహ వృశ్చికః। ఏతత్షడష్టకంప్రీత్యై భవత్యేవ నసంశయః॥ అభిషేకోగ్నికార్యంచ సూర్యవారే ప్రశస్యతే। సోమేతురంగోపయానం కుర్యాచ్చైవ గృహాదికం। సేనాపత్యం చౌర్యయుద్ధం శస్త్రాభ్యాసః కుజేస్మృతః। సిద్ధికార్యంచ మంత్రశ్చ యాత్రాచైవ బుధేస్మృతా। పఠనం దేవపూజాచ వస్త్రాద్యాభరణం గురౌ। కన్యాదానంగజారోహశ్శుక్రస్యాత్సమయస్త్రియః। స్థాప్యం గృహప్రవేశశ్చ గజబంధశ్శనౌ శుభః॥

సుముహూర్త దుర్ముహూర్త తిథి నక్షత్ర లగ్న భేదముచే నాయాయి
కర్మలొనర్చుటవలన గలుగు ఫలములు- శకునఫలములున్ను.

కాలరూపియగు శ్రీజనార్దనుడు సకలభూతములకును పూర్వాదృష్టవశమువలన శుభాశుభములగుటకు ప్రేరణజేసును. భావిశుభాశుభఫలములును జూపించును. దానిని దెలిసికొనుటకు మునులు వేదాంగమగు జ్యోతిషశాస్త్రమునుంబలికిరి. తజ్ఞులగు దైవజ్ఞులు రాజులకత్యంతప్రియులగుదురని సంక్షేపంబుగా నిచట బ్రశంసించెదము.

గారుడపురాణమందలి యరువదగు నధ్యాయమందు జ్యోతిశ్చక్రమును భూమానమును జెప్పి చాతుర్లక్షగ్రంథమగు జ్యోతిశ్శాస్త్రమందలి సారమును కేశవుండీశానునకుం జెప్పినదిచట జెప్పుదుము.

కృత్తికకగ్ని, రోహిణికి బ్రహ్మ, మృగశీర్షకు చంద్రుడు, ఆర్ద్రకీశు

డు, పునర్వసుకదితి, పుష్యమికి గురుడు, ఆశ్లేషకు సర్పములు, మఘకు పితరులు, పూర్వఫల్గునికి భగనామకుడు, ఉత్తరకర్యముడు, హస్తకు రవి, చిత్తకు త్వష్ట, స్వాతికి వాయువు, విశాఖకింద్రాగ్నులు, అనూరాధకు మిత్రుడు, జ్యేష్ఠకింద్రుడు, మూలకసురులు, పూర్వాషాఢకంబువులు, ఉత్తరాషాఢకు విశ్వేదేవతలు, అభిజిత్తుకు బ్రహ్మ, శ్రవణమునకు విష్ణువు, ధనిష్ఠకు వసువులు, శతభిషమునకు వరుణుడు, పూర్వాభాద్రకజపదము, ఉత్తరాభాద్ర కహిర్బుధ్న్యుడు, రేవతికి పూష, అశ్వినికశ్వినులు, భరణికి యముడు ఇట్లు నక్షత్రాధిపతులు వీరినామములానక్షత్రములకు చెల్లును.

ప్రతిపన్నవమి తిధులను బ్రహ్మాణి పూర్వదిశనుండును. ద్వితీయాదశములనుత్తరమందు మాహేశ్వరి, తృతీయేకాదశుల నాగ్నేయమున కౌమారి, చతుర్థీద్వాదశులను నైఋతియందు నారాయణి, పంచమీత్రయోదశులను దక్షిణమున వారాహి, షష్ఠీచతుర్దశులను పశ్చిమమందింద్రాణి, సప్తమీపూర్ణిమలను వాయుకోణమందు చాముండ ఆయాయి దేవతలకు సంముఖముగ గమనము యోగ్యము.

అశ్వన్యనూరాధా రేవతీమృగశీర్షామూలాపునర్వసూ జ్యేష్ఠా పుష్యహస్తానక్షత్రములు ప్రయాణయోగ్యములు. హస్తాదిపంచక ముత్తరత్రయ మశ్వని రోహిణీ పుష్యధనిష్ఠాపునర్వసులు వస్త్రధారణయోగ్యములు. కృత్తికాభరణ్యాశ్లేషా మూలావిశాఖా పూర్వత్రయములధోముఖనక్షత్రములు వీటియందు వాపీకూపతటాకతృణచ్ఛేదన దేవాగార నిధానఖనన గణిత జ్యోతిషారంభ ధనసంగ్రహ బిలప్రవేశములు చేయదగును.

రేవత్యశ్వని చిత్రాస్వాతీ హస్త పునర్వస్వనూరాధా మృగశీర్ష జ్యేష్ఠా నక్షత్రములు పార్శ్వముఖములు వీటియందు గజోష్ట్రమేష వృషభ మహిషశిక్షలును బీజావాపన గమనాగమన చక్రయంత్ర గజరథారోహణములు నింక పార్శ్వములందు జేయదగిన గర్మలన్నిటికిని యోగ్యములు.

రోహిణ్యార్ద్రధనిష్ఠోత్తరత్రయశతతారాశ్రవణములూర్ధ్వముఖనక్షత్రములు వీటియందు రాజ్యాభిషేకమును పట్టబంధమును ఊర్ధ్వముఖముగ నెత్తదగిన గార్యములన్నియును జేయదగును.

చతుర్థి, షష్ఠి, అష్టమి, నవమి, అమావాస్య, పూర్ణిమ, ద్వాదశి, చతుర్దశి యీతిధులశుభప్రదములు.

పాడ్యమీశుక్రవారము, విదియాసోమవారము, తదియామంగళవారము, చవితీశనివారము, పంచమీగురువారము, షష్ఠీకుజశుక్రవారములు, సప్తమీబుధవారము, అష్టమీకుజభానువారములు, నవమీసోమశనివారములు, దశమీ గురువారము, ఏకాదశీగురుశుక్రవారములు, ద్వాదశీబుధవారము, త్రయోదశీకుజశుక్రవారములు, చతుర్దశీభానువారము, పూర్ణిమా అమావాస్యా గురువారము ఈచెప్పినప్రకారము తిధివారములు గలసిన శుభకరము.

ఆదివారము ద్వాదశీ, సోమవారమేకాదశీ, కుజవారముదశమి, బుధవారము నవమి, గురువారమష్టమి, శుక్రవారము సప్తమి, శనివారము షష్ఠియు నిట్లుగలసిన దగ్ధయోగమగును. దీనియందు గమనాదులు వర్జింపవలయును. పాడ్యమి, నవమి, చతుర్దశి, అష్టమియు నీతిధులు బుధవారముతోగూడిన ప్రయాణము కూడదు.

షష్ఠియందు మేషకర్కటకములు, అష్టమియందు కన్యామిధునములు, చవితియందు వృషభకుంభములు, ద్వాదశియందు మకరతులలు, దశమియందు వృశ్చికసింహములు, చతుర్దశ్యేకాదశులయందు ధనుర్మీనములు బీజావాపనమునకనుకూలములుకావు.

విశాఘాత్రితయములాదివారమందు, పూర్వాషాఢాత్రయము సోమవారమందు, ధనిష్ఠాత్రయము కుజవారమందు, రేవతీత్రయము బుధవారమందు, ఉత్తరాఫల్గునీత్రయము గురువారమందు, రోహిణీత్రయము శుక్రవారమందు, పుష్యత్రయము శనివారమం దిట్లుగూడిన నుత్పాతయోగము లివి మృత్యురోగకరములు.

మూలార్కవారములు, శ్రవణేందువారములు, పూర్వాభాద్రోత్తరాకుజవారములు, కృత్తికాబుధవారములు, ఆర్ద్రపునర్వసు గురువారములు, పూర్వఫల్గునీ శుక్రవారములు, స్వాతీశనివారములు గూడిన నమృతయోగములు సర్వకార్యశుభప్రదములు.

విష్కంభమందైదుగడియలు, శూలమందేడుగడియలు, గండాతిగండములయందారు, వ్యాఘాత వజ్ర వ్యతీపాత పరిఘ వైధృతులయందు తొమ్మిది ఈగడియలు సర్వకర్మములయందును వర్జింపవలయును.

హస్తయునాదివారమును పుష్యమీ గురువారము ననూరాధయు బుధవారమును రోహిణీ శనివారమును జ్యేష్ఠాబుధసోమవారములు రేవతీశుక్రవా

రము జ్యేష్ఠాశ్వినులు మంగళవారము లిట్లు గలసిన యోగము సకలదోషముల నశింపజేయును.

శుక్రవారమున భరణి, సోమవారమున చిత్త, కుజవారమున నుత్తరాషాఢ, బుధవారమున ధనిష్ఠ, గురువారమున శతతార, శుక్రవారమున రోహిణి, శనివారమున రేవతి ఇవి విషయోగములు.

పుష్య పునర్వసు రేవతి చిత్తా శ్రవణ ధనిష్ఠా మృగాశ్విని హస్తా శత తారలయందు జాతకర్మను జేయదగును- విశాఖోత్తరాత్రయమఘార్ద్రాభర ణ్యాశ్లేషకృత్తికలయందున ప్రస్థానమొనర్చిన మరణమగును.

రవికి మేషము, చంద్రునకు వృషభము, కుజునకు మకరము, బుధునకు కన్య, గురునకు కర్కాటము, శుక్రునకు మీనము, శనికి తుల ఇవి యుచ్చస్థానములగుచున్నవి- వాటికారునొకటి నీచస్థలమని తెలియదగును.

సింహమునకు రవి, కర్కాటమునకు చంద్రుడు, మేషవృశ్చికముల కంగారకుడు, కన్యామిధునములకు బుధుడు, ధనుర్మీనములకు గురుడు, తులావృషభములకు శుక్రుడు, మకరకుంభములకు శనియు నధిపతులగుచున్నారు- రాహువుకు కన్య, కేతువునకు మిధునమును గృహములని తెలియదగును.

లేడి, పాము, కోతి, పిల్లి, శ్వానము, సూకరము, పక్షులు, ముంగి, యలుక ఇవి కుడివైపుకు నడచిన యాత్రయందు శుభమగును.

తూర్పుదిక్కున బల్లియరచిన మహాఫలము, ఆగ్నేయమున మోహాసంతాపములు, యామ్యమున రోగము, నైఋతియందు కలహము, పశ్చిమమున మృష్టాన్నప్రాప్తి, వాయవ్యమున భోజనసుఖము, ఉత్తరమున కలహనాశనము ఈశాన్యమున మరణము.

నక్క, లొటిపిట, గాడిద యాత్రయందివి యెడమకేగిన శుభమగును.

బ్రాహ్మణకన్యక, శవము, శంఖఘోషధ్వనులు, మృత్తిక, వారాంగన, పూర్ణకుంభములు ఇవి యాత్రయందగపడిన శుభమగును.

ప్రత్తి యౌషధమును, నూనె, చొట్టవాడు, బొగ్గులు, పాము, తలవిరియబోసికొనినవాడు, ఎఱ్ఱని పువ్వులను ధరించినవాడు, దిగంబరుడు, ప్రయాణమందగపడిన యశుభమగును.

కృత్తికాదిగనేడునక్షత్రములు ప్రాగ్దిశకును, మఘాదిసప్తర్క్షములు ద

ష్టిణదిశకు, అనూరాధాదిసప్తతారకములు పశ్చిమమునకును, ధనిష్ఠాదిసప్తక ముత్తరమునకు ప్రయాణమొనర్చిన శుభమొసంగును.

అశ్వనీ రేవతీ చిత్తా ధనిష్ఠ లలంకారధారణమునకు ప్రశస్తము. మృగశీర్షా చిత్ర పుష్య మూల హస్తా నక్షత్రములు కన్యాప్రదాన యాత్రాప్రతిష్ఠాకర్మలయందు శ్రేష్ఠములు.

జన్మమున ద్వితీయ్యమునను శుక్రచంద్రులు, చంద్రశుక్రగురులు తృతీయరాశిని, కుజ శని చంద్రార్క-బుధులు చతుర్థమందు, శుక్రగురులు చంద్రకేతువులును పంచమమందు, శని రవి చంద్ర కుజులు షష్ఠమమందు, గురుచంద్రులు సప్తమమందు, బుధశుక్రులష్టమమందు, గురుడు నవమమందు, రవి శని చంద్రులు దశమమందు, ఏకాదశమందన్నిగ్రహములును, బుధశుక్రులు ద్వాదశమందిట్లుండిన శుభమిత్తురు.

సింహముతో మకరము, కన్యతో మేషము, తులతో మీనము, కుంభముతో కర్కటకము, ధనస్సుతో వృషభము- మేషముతో వృశ్చికము యీషష్ఠాష్టకములు ప్రీతినిచ్చును- సందియములేదు.

అభిషేకమగ్నికార్యమును భానువారమందుత్తమము. సోమవారమందశ్వారోహణము- గృహప్రవేశము, సేనాపత్యము- యుద్ధము- చౌర్యము- శస్త్రాభ్యాసము- కుజవారమందు, సిద్ధికార్యము- మంత్రము- యాత్ర- బుధవారమందు, పఠనము- దేవపూజారంభము- వస్త్రాద్యాభరణము- గురువారమందు, కన్యాదానము- గజారోహణము- స్త్రీసమయము- శుక్రవారమందు, స్థాప్యము- గృహప్రవేశము- గజబంధము- శనివారమందును జేసినశుభమగును.

శ్రుత్యుక్తముహూర్తాన్యథబ్రూమః॥ సమానస్యాహ్నః పంచ పుణ్యాని నక్షత్రాణి చత్వార్యశ్లీలాని తాని నవ॥ అస్యార్థః॥ ఉదగయనాదయః ప్రసిద్ధాః। పుణ్యాహస్య హ్నోనవధావిభక్తస్యాయుజో భాగాః। ప్రాతస్సంగవమధ్యందినాపరాహ్ణసాయంశబ్దవాచ్యాః॥ పుణ్యనక్షత్రపరపర్యాయాః పంచ। సమానస్యాహ్నః పంచపుణ్యాని నక్షత్రాణి॥ మిత్రస్య సంగవః తత్పుణ్యం తేజస్ప్రహారితి శ్రుతేః॥ యుగ్మాస్త్వశ్లీలాని। చత్వార్యశ్లీలానీతి శ్రుతేః॥ కేచిత్కృత్తికాదివిశాఖాంతాని దేవనక్షత్రాణి పుణ్యాహాః। యాన్యేవ దేవ నక్షత్రాణి తేషు కుర్వీత। పుణ్యాహమేవకురుత ఇతి శ్రుతేః॥

అస్మిగ్ స్యాముష్మిగ్శ్చ యాంకామయేత దుహితరం ప్రియాస్యాదితి। తాం నిష్ట్యాయాం దద్యాత్। ప్రియైవభవతి। నేవతు పునరాగచ్ఛతి॥ అస్యా

ర్థః॥ నిష్ట్యాశబ్దః స్వాతీనక్షత్రం తస్మిన్నక్షత్రే దత్తా దుహితా పత్యుః పిత్రేమైవ భవతీత్యస్తి కశ్చిదర్థోవిశేషః పత్యుర్గృహే పునర్నాగచ్ఛతి నేయంనక్షత్ర నిందా। కింతు ప్రశస్త్యతిశయప్రదర్శనేన నక్షత్రస్తుతిరేవ॥

అభిజిన్నామనక్షత్రం ఉపరిష్టాదషాఢానాం। అవస్తాచ్ఛ్రోణాయై దేవాసురాస్సంయత్తా ఆసన్ తే దేవా తస్మిన్నక్షత్రే న్యజయన్తదభిజితో భిజిత్వం యంకామయేతానపజయ్యంజయేదితి। తమేతస్మిన్నక్షత్రే యాతయేత్। అనపజయ్యమేవ జయతి పాపపరాజితమివతు॥ ప్రజాపతిః పశూనసృజత। తేనక్షత్రం నక్షత్రమనుపాతిష్ఠంత। తే సమావంత ఏవాభవన్ తే రేవతీ ముపాతిష్ఠంత తే రేవత్యాం ప్రాభవన్। తస్మాద్రేవత్యాం పశూనాం కుర్వీత॥

ఇటుమీద వేదోక్తముహూర్తములను జెప్పుచున్నారము.

ఉత్తరాయణమందు శుక్లపక్షములో పగటిప్రమాణము తొమ్మిదిభాగములొనర్చి ౧- ౩- ౫- ౭- ౯ యీబేసిభాగములు పుణ్యనక్షత్రసంజ్ఞికములు- సకలశుభకార్యములకును యోగ్యములు. ౨- ౪- ౬- ౮ యీసరిభాగములన్నీ లసంజ్ఞికములిపి శుభకార్యములకర్హములు కావు.

కొందరు కృత్తికాది విశాఖాంతమువరకు దేవనక్షత్రములనియు పుణ్యాహములని యును బల్కుదురు.

విహితకామ్యకర్మలను గోరువారు స్వాతీనక్షత్రమందు కన్యాదానమును జేసిన యాకన్యయు భర్తకప్రియురాలై మగల పుట్టినింటికి రాదలంచదు. ఉత్తరాషాఢాచరమభాగమును శ్రవణపూర్వభాగమును గలసి యభిజిన్నక్షత్రమగును. దీనియందు దేవతలసురులతో దలపడి జయించిరి- గావునయభిజిన్నక్షత్రమున యుద్ధయాత్రజేసిన యతేయుండగువాడైన జయించుతురు.

బ్రహ్మ పశువులను రేవతీనక్షత్రమందున సృజించెను. గాన పశుసంగ్రహము రేవతీనక్షత్రమున జేసిన యభివృద్ధినొందును.

జాతక ప్రకరణమ్.

అథాతోస్య మునేర్నేన జాతకనిరూపణస్థాన ఫలాదీని వ్యాఖ్యాస్యామః॥

తిర్యక్పంచతతోర్ధ్వగాశ్చ లిఖితా రేఖాశ్చ రాశ్యాత్మకం చక్రం స్యాత్పురుహూతదిగ్గృహముఖాల గ్నాదిరాశిగ్రహాన్। సంలిఖ్యోదయచంద్రకారకపదార్థయాథాత్మ్యహోరా ఘటీద్రేక్కాణా నవ ప్రోక్తలగ్నకవశా త్తత్తత్ఫలం పశ్యతి॥

అడ్డుగీతలై దును నిడువుగీతలై దును లిఖించిన ద్వాదశరాస్యాత్మకంబగు చక్రంబగును నందు పూర్వోక్తగ్రహంబాదిగ మేషాదిరాసుల గ్రహంబుల లిఖింపవలయును. లగ్నకుండలి, వంశకుండలి, ఆరూఢకుండలి హోరాకుండలి, చంద్రకుండలి, ద్రేక్కాణకుండలులును వీటిచే నాయాయి ఫలములను జెప్పవలెను.

తన్వారోగ్యధనస్వసోదరజనన్యాందోళికాఘోటకక్షేత్రారామతటాకమందిరసుఖగాత్రీమాప్తబుధ్యాత్మజాః। ప్రజ్ఞాజ్ఞానసరస్వతీమతియశోరోగక్షయారిక్షతం జాత్యుద్వాహకళత్రరోగనిధనవ్యాధ్యాయురిష్టార్థయః॥

ద్రవ్యజ్ఞానపితృక్రియౌషధమనస్సౌభాగ్య దేవార్చనా జ్ఞారాజన్యక్రతు పుణ్యతీర్థసకలోద్యోగప్రతాపశ్రుతిః। క్షాంతిస్థానఫలాపవర్గవిభవానేకప్రతిష్ఠాశ్రమ ద్రవ్యస్వర్గఫలప్రభావ శయనీ పాపిబ్ధపుణ్యానిచ॥

జననలగ్నము తనుభావము నారోగ్యభావమనబడును. ద్వితీయము ధనభావము- తృతీయము సోదరభావము- చతుర్థము జననీ, వాహన, క్షేత్ర, మందిర, సుఖభావము- పంచమము బుద్ధి, పుత్రీ, జ్ఞాన, కీర్తిభావము- షష్ఠము రోగము, క్షయము, క్షతము, శత్రుభావమును- సప్తమము వివాహ, కళత్ర, భోగభావము- అష్టమము ఆయుర్మరణవ్యాధ్యరిష్టభావము- నవమము పితృసౌభాగ్యౌషధభావము- దశమము రాజ్య దేవార్చన క్రతు పుణ్యతీర్థాజ్ఞోద్యోగ ప్రతాపభావము- ఏకాదశము లాభభావము- ద్వాదశము వ్యయభావము.

రుద్రాత్రిత్మా సవితా పితాచ జననీశక్త్యాత్మకోచంద్రమా భౌమేందూగ్భవజీవశుక్రరవిజాస్తత్పంచభూతోద్భవాః।సత్వాజ్జీవకవీ దుజాశ్చ రజసో భౌమస్తమోజశ్శని స్సూర్యేందూ నతుమారకౌ నహితపౌ రంధ్రాధిపత్యేర్తితౌ॥

సూర్యుడు పితృకారకుడు, చంద్రుడు మాతృకారకుడు, భౌమ బుధ గురు శుక్ర శనులు పంచభూతకారకులు, గురుశుక్రబుధులు సత్వగుణకారకులు, అంగారకుడు రజోగుణకారకుడు, శని తమోగుణకారకుడు- బ్రహ్మయొక్క నేత్రమువలన సూర్యుడు, మనంబువలన చంద్రుడు, పంచభూతాంశలచే కుజ బుధ గురు శుక్ర శనులు బుట్టిరని సూర్యసిద్ధాంత గోళాధ్యాయము. సూర్యచంద్రులష్టమాధిపతులైనను మారకులును బాధకులును గారు.

సర్వే ద్వాదశ రాశయ స్సముదితా లగ్నాదిషట్కం తను ర్వామ్యాం పంచ తను స్త్రియా స్తదితరే షట్పోత్తరాంగం భవేత్। లగ్నం ప్రాణమయ

శ్చశిస్థభవనం దేహాంతయో స్తత్ఫలం భావాద్భావపతేశ్చ కారకవశా త్తత్త త్ఫలం నిశ్చితం॥

లగ్నము మొదలారు రాశులపర్యంతము పూర్వాంగమనియును మిగిలిన యారు రాశులునుత్తరాంగమనియునుసంకేతము- లగ్నము ప్రాణము- చంద్రుడున్నగృహము దేహము లీప్రాణదేహములయొక్క శుభాశుభములు భావభావాధిప భావకారకులవలనను చంద్రలగ్నాధిపతులవలనను గూడ జూడవలెను.

పూర్ణం పశ్యతి భానుజ స్త్రిదశమే భేపాదదృష్ట్యేతరే జీవోధీ నవమే ర్ధయా తదితరే భౌమశ్చతుర్థేష్టమే। సర్వే పాదవిహీనయాఖిలదృశా పశ్యంతి సర్వేస్తభం విత్తాయవ్యయవైరిణో నదదృశః ఖేటస్థితస్థానతః॥

శని తనకు తృతీయ దశమస్థానములను పూర్ణదృష్టిని జూచును. మిగిలిన గ్రహములు పాదదృష్టిని జూతురు. గురుడు పంచమ నవమములను పూర్ణదృష్టిని జూచును ఇతరగ్రహములర్ధదృష్టిని జూతురు. కుజుడు చతుర్థాష్టమస్థానములను పూర్ణదృష్టిని జూచును. ఇతరగ్రహములు త్రిపాదదృష్టిని జూతురు. సకలగ్రహములు సప్తమస్థానమును సంపూర్ణదృష్టిని జూతురు. ద్వితీయ వ్యయ లాభషష్ఠస్థానముల నేగ్రహములును జూడరు.

కేంద్రేత్రికోణగృహస్థితాః కవిగురుజ్ఞాఃపూర్ణమాయుర్బలం మధ్యాయుష్యమతోధనేచ సహజే లాభే దిశంతి స్థితాః। షష్టాష్టవ్యయభేషు సంస్థితఖగాస్స్వల్పాయు రన్యే తతః పాపాః కేంద్రసుతాష్టగా నశుభదా జాతస్య పుంసస్సదా॥

లగ్నచతుర్థసప్తమదశమములు కేంద్రసంజ్ఞితములు- పంచమనవమములు కోణసంజ్ఞితములు వీటియందు బుధ గురు శుక్రులుండగ జన్మించిన దీర్ఘాయువగును. ద్వితీయతృతీయలాభస్థానములందు వీరలుండగ జన్మించిన మధ్యాయువగును. వీరు షష్టాష్టమవ్యయములందుండిన యల్పాయువగును. రవి కుజ శని రాహుకేతువులు కూరులు వీరు కేంద్ర పంచమాష్టమములయందుండిన శుభము నివ్వరు.

స్వోచ్చస్వర్క్షసుహృత్త్రికోణగృహగాః కేంద్రోత్తమాంశాన్వితాస్స్వామ్యైర్వీక్షితయుక్తమధ్యమగతా మూలత్రికోణాశ్రితాః। భావారోహణ ఖేచరాశ్శుభకరాః కేంద్రత్రికోణాధిపా స్సంబంధేన పరస్పరం సుమశసం కుర్వంతి రాజోత్తమం॥

స్వోచ్చస్వక్షేత్ర మిత్రక్షేత్రకోణములయందును కేంద్రోత్తమాద్యంశలయందునుండి సౌమ్యగ్రహములచే జూడబడినను గూడినను సౌమ్యగ్రహమధ్యగతములైనను మూలత్రికోణములయందుండిన నుచ్చభావము నారోహించుచుండినను గ్రహమునకు బలమని చెప్పవలెను. కేంద్రకోణాధిపతులు పరస్పరసంబంధము గలిగియుండగ జన్మించిన రాజయోగమగును. మూలత్రికోణములనగా సూర్యునకు సింహము, చంద్రునకు వృషభము, అంగారకునకు మేషము, బుధునకు కన్య, గురునకు ధనస్సు, శుక్రునకు తుల, శనికి కుంభము.

నీచస్థాశ్చ పరాజితాస్త్వరిగతాః పాపేక్షితాః క్రాంత యుగ్మధ్యస్థాస్తగతాశ్చ వక్రవికలస్వర్భానుసంసర్గగాః। భావాంతస్థిత ఖేచరాశ్చ విబలాషష్ఠాష్టరిప్ఫాధిపాః కేంద్రాధీశ్వరకోణపేశ్వరయుతాస్తద్యోగభంగప్రదాః॥

నీచస్థానములయందున్న నస్తంగతులైనను శత్రుస్థానగతులైనను పాపేక్షితపాపయుక్తమధ్యగతులైనను వక్రపరాజితరాహుయుక్త లగ్నాంతస్థితులైనను షష్ఠాష్టవ్యయాధిపతులైనను గ్రహములు బలహీనులగుదురు. కేంద్రకోణాధిపతులతో విరుగలసిన యోగభంగమును జేతురు.

స్వోచ్చేదీప్తగృహేస్థితస్స్వభవనే వర్గోత్తమాంశే శుభో మిత్రస్థో ముదితస్సమేత్వతిసమే మూలత్రి[illegible]ణే సుఖీ। హీ[illegible]యుద్ధపరాభవశ్చ కుటిలో క్రూరశ్చ వక్రంగతో భీతి స్స్యాద్దత[illegible] రిపుగృహే ఖేటో [illegible] శ్చాస్తగః॥

దీనో నీచగతో భయా[illegible] ఇత్యేతావస్థాః క్రమాద్వ్యాః శా సూర్యేణాస్త మునుస్సమాగమఖగ [illegible] యుద్ధోన్ము[illegible]। ఖలా[illegible] [illegible] ముఖో ఖేటస్తు మృత్యుప్రదః పాపో[illegible] బలయుక్త[illegible] శుభం దృష్టం శుభో దుర్బలః॥

ఉచ్చయందు దీప్తావస్థ, స్వక్షేత్రవర్గోత్తమాంశ శుభ మిత్రక్షేత్రములందుండిన ముదితావస్థ, సమాతిసమక్షేత్రమూలత్రికోణములయందుండిన సుఖావస్థ, యుద్ధపరాభవవక్రక్రూరక్షేత్రములందైన హీనావస్థ, అతిచార శత్రుక్షేత్రములందుండిన భీతావస్థ, అస్తంగతుడనగా సూర్యయుక్తుడైన మృతావస్థ, నీచగతుడైన దీనావస్థ, ఇటుల పన్నెండవస్థలు చెప్పబడెను. సూర్యయుక్తుడును చంద్రకుజులతో యుద్ధోన్ముఖగ్రహమును రాహుకేతుయుక్తగ్రహమును మృత్యుప్రదులు. పాపగ్రహమైనను బలయుక్తుడైన శుభంబొనర్చు

ను. శుభగ్రహామైనను దుర్బలుఁడైలే దుష్టఫలమిచ్చును.

దుస్థానాని గతోఽరినీచగృహగశ్చాస్తంగతో వాపియద్భావేశోఽశుభయోగదృష్టిరహితే కూరైరాదియుక్తేక్షితః । నీచార్యంశగతః పరాజయహ్వత శ్చేత్తాతయానిద్యుతిస్త ద్భావస్య వినాశనం నిగదితం లగ్నాదిభావానాంక్రమాత్॥

ఏభావాధిపతిగాని దుస్థానగతుఁడైన శత్రునీచగతుఁడైన నస్తంగతుఁడైన శుభగ్రహయోగదృష్టిరహితుఁడై క్రూరగ్రహయోగదృష్టియుక్తుఁడగుచు నీచార్యంశగతుఁడై పరాజితుఁడైయుండిన నాభావమునకు నాశము చెప్పవలెను. తనుభావాదిభావములకు క్రమము.

యద్భావపతిస్త్రికోణగృహగః కేంద్రత్రిలాభాశ్రితో మిత్రోచ్చస్వగృహాంశయో ర్బలవతోత్పత్తో స్థిత స్సౌమ్యయోః। మధ్యస్థోపతిసోచ్చగేన నశుభైర్యుక్తస్థితో వా గ్రహ స్తత్తద్భావఫలస్య వృద్ధి మతులాం శీఘ్రం కరోతి క్రమః॥

ఏభావాధిపతి కేంద్రకోణధనలాభ తృతీయస్థానములందుండి మిత్రక్షేత్రోచ్చస్వక్షేత్రస్వాంశలయందుండి బలవచ్ఛుభగ్రహమధ్యగతుఁడై యుచ్చాదిబలయుక్తమగు శుభగ్రహములతో గూడుకొనియుండిన నాభావమునకు వృద్ధిగలుగు నిటులనన్నిభావములకును జూడదగును.

భావోభావపతిశ్చ కారకఖగస్సే పాపమధ్యస్థితాః పాపైశ్చాంకిభి రన్వితాశ్చ విబలా స్సౌమ్యైరయుగ్వీక్షితాః। తేషాం భాగ్యసుతాష్టధీవ్యయగతాః పాపాస్తదంశర్క్ష పాస్తద్భావే రిపునీచమూఢవిజితాశ్చేద్భావహానింవదేత్॥

ఏభావముగాని భావాధిపతిగాని కారకుడుగాని పాపమధ్య పాపయుక్తిగలిగి బలహీనులై సౌమ్యగ్రహదృష్టివీక్షణములులేక నీభావభావాధిపతులకు పంచమనవమవ్యయములందు పాపగ్రహములుండిన తత్తద్భావాధిపతులు శత్రునీచపరాజితులై తద్భావములందుండిన నాభావమునకు హాని గలుగును.

స్వక్షోచ్చాదిసుహృత్త్రికోణనిజతరాశ్యంశేషువర్గోత్తమే సౌమ్యైస్సాక్ష్యకరోథపాపఖచరోఽప్యేవం విధత్తే శుభం। యద్భేశస్థిత భాంశపాబలయుతాశ్చేద్భావపో లాభకృద్యత్రస్వర్క్ష గతో బలీ హితఖగస్సౌమ్యోపి తస్యార్థదః॥

ఏభావాధిపతిని సర్గపాపుఁడైనను స్వోచ్చక్షేత్రమిత్రకోణవర్గోత్తమములయందుండి సౌమ్యయుక్తుఁడైనశుభమును జేయును. ఏభావాధిపతియుండిన రాశ్యధిపతిగాని యంశాధిపతిగాని బలవంతులైన నాభావమునకు లాభము

గలుగును- లేక భావాధిపతి స్వక్షేత్రిమందుండి బలవంతుడైనట్టులైన వాడు నైసర్గికశుభుడుగాని పాపుడుగాని శుభమునే జేయును.

భాగ్యేకర్మణి తత్పతీ నివసతో వేక త్రవా వ్యత్యయే నాన్యోన్యార్ధ గతౌ నిరీక్షితయుతౌ తౌ రాజయోగప్రదౌ। ధీజాయాధనబంధుపైశ్చ సహితే తత్పద్గృహే సంస్థితౌ సంపత్సౌఖ్యకరౌ తయోర్నిధనలాభక్షాధిపత్యంవినా॥

భాగ్యరాజ్యాధిపతులు భాగ్యస్థానమందైన రాజ్యమందైన నొకచోట గూడినను వీరలు వ్యత్యయముగనైనను క్రమముగనైన నీస్థానములందుండినను నితరేతరాన్యగృహములందుండినను అన్యోన్యవీక్షితులైయుండినను రాజయోగమును జేతురు. మరియును వీరలు పంచమ సప్తమ ధన వాహన స్థానములందుండిన నీస్థానాధిపతులతో కూడుకొనినను సంపత్సౌఖ్యమును జేతురు. ఈ భాగ్యరాజ్యాధిపతులష్టమలాభాధిపతులైన యోగభంగమగును.

బాలోవృద్ధఖగోస్తగశ్చ విజితా పశ్య న్నపశ్యత్యసౌ శుక్లాశుక్లదినైశ్శుభాశుభదినైః పూర్వోన్ముఖాద్యుక్రమాత్। ప్రత్యగ్దృష్టియుతో దృశా సురగురుర్మందాయుతా శక్తిమాన్ మూర్ధస్థోపి భృగుశ్శనిశ్చ బలవా న్భౌమారిభేవా బలీ॥

గ్రిహము బాలుడు వృద్ధు పరాజితుడు నస్తంగతుడునై చూచినను జూడనట్టుల నిష్ఫలము. గురుడు శుక్లపక్షమందు వృద్ధత్వమునొందినను కృష్ణపక్షమునందు బాలత్వమునొందినను శుభప్రదుడగును. బలవంతులగు శుక్రశనులు మూర్ధస్థులైనను బలహీనులు కారు. అంగారకుడు శతృస్థానమందుండినను బలహీనుడుకాడు.

భావానాం ఫలకారకశ్చ విముఖా నైసర్గికాచ్ఛాదయ ద్భావై రన్వితభాంశపాపవితథా తద్భావతత్కారకౌ। యద్యత్కారకరాశిపోశుభఖగస్తత్ఫలధ్వంసకస్తద్వత్కారకయుక్తభావనివహం స్వల్పంఫలం కారయేత్॥

భావాధిపతి శుభుడగునపుడు ఛాదకసంబంధమువలన దోషుడైనప్పటికిని భావఫలమునిచ్చును. ఆభావమున కారకులును ఫలవిముఖులగుదురు- ఆభావకారకులలో నేయేకారకరాశ్యధిపతి పాపగ్రిహమైన యాయాయికారకఫలధ్వంసను జేసును- అలాగుననే కారకుడున్న భావములన్నియు స్వల్పఫలమును జేసును.

పూర్ణేంద్విజ్యశనిర్ధ్వజాస్స్వయుతభార్ద్విర్ద్వాదశచ్ఛాదకాదుష్టశ్చేద్ధిష

ణోపి రిప్పుభవనే శేషాః పురచ్ఛాదకాః। దృష్ట్వా క్షేత్రిగతేనవాశనిరుజా వ న్యోర్క్ష యుక్తేనవాసర్వేభావపభావకారకఖగా శక్తాః క్రమా ద్వ్యక్తదాః॥

పూర్ణచంద్రుడును, గురుడును, శని, కేతువులును, దమరున్నరాశికిద్వితీయ ద్వాదశరాసుల నాచ్ఛాదింతురు. గురుడు పాపుడై వ్యయమందుండినను మిగిలిన మూడుగ్రహములు ముందురాశినిమాత్రమాచ్ఛాదించెదరు. శనికుజులు క్షేత్రస్థునిచేగాని యన్యక్షేత్రస్థునిచేగాని జూడబడిరేనిబలవంతులగుదురు. సర్వభావాధిపతులు కారకులును బలవంతులైరేని జెప్పబడిన ఫలమిచ్చెదరు.

యద్భావధనర్క్ష సంస్థితఖగస్త్వచ్ఛాదకాఖ్యా స్మృతాస్త ద్భ్రాతృస్థలగోపి వేధకఖగస్తద్బంధుకో బంధకః। తద్రంధ్రే ప్రతిబంధకోత్ర సహితశ్చే ద్రంధ్రవృద్ధిక్షయే యద్భావధనాస్తభద్వయపతి స్తన్మారకాఖ్యా క్రమాత్॥

ఏభావమునకుగాని ద్వితీయమందున్నగ్రహము ఛాదకుడని చెప్పబడును. భావమునకు తృతీయమందున్న గ్రహము వేధకుడనబడును. భావమునకు చతుర్థమందున్న గ్రహము బంధకుడనబడును. భావమున కష్టమమందున్న గ్రహము ప్రతిబంధకుడనబడును. అష్టమస్థానముయొక్క వృద్ధిక్షయములం దేభావముయొక్క ద్వితీయ సప్తమాధిపతు లష్టమమందుండిరేని మారకులని జెప్పబడుదురు.

లగ్నాద్భాగ్యపకర్మపౌ యదితథా తద్భాగ్యకర్మాధిపౌ మానాద్భాగ్యపకర్మపౌ వరసమస్వల్పాధికారాః క్రమాత్। సంబంధత్రయసంస్థితౌ యదిబలావన్యోన్యకేంద్రాశ్రితౌ లగ్నాధీశ్వర రాశినాయకయుతౌ జాతో ధనీ భూపతిః॥

లగ్నముమొదలు భాగ్యరాజ్యాధిపతులును, భాగ్యముమొదలు భాగ్యరాజ్యాధిపతులును, రాజ్యముమొదలు భాగ్యరాజ్యాధిపతులును క్రమముగానుత్తమ మధ్యమస్వల్పాధికారములుగలవారు, వీరలు సహావస్థాన దృష్టిస్థాన సంబంధములు గలవారై పరస్పరమును కేంద్రములయందున్నవారై లగ్నరాశ్యధిపతులతో గలుసుకొనిరేని జాతకుడు ధనియును భూపతియగును.

జన్మర్క్షాగమనాడికా విఘటికా తత్తద్దశా త్తాడితా నాడ్యా షష్ఠిహతా యుతా విఘటికా తచ్ఛేద్యరాశిర్భవేత్। చాద్యంతాస్థితనాడికా విఘటికా బి భాజితో వత్సరాశ్శేషం ద్వాదశభిర్ధినైః ఖరుతుభిర్నిఘ్నంతుమాసాదికం॥

జన్మనక్షత్రముయొక్క శేషఘడియల నరువదింట గుణించి విఘటికలం

దుగలవి కృత్తికాది యిరువదియేడునక్షత్రములు తొమ్మిదింట పాల్గొనగా వచ్చిన శేషమున కొకటిమొదలు తొమ్మిదివరకు ౬ సూర్య- ౧౦ చంద్ర- ౭ కుజ- ౧౮ రాహు- ౧౬ జీవ- ౧౯ శని- ౧౭ బుధ- ౭ కేతు- ౨౦ శుక్రదశలగును. ఈరీతి నానక్షత్రదశావర్షములచేత నామొత్తమును గుణించి దాని నక్షత్రాద్యంతఘటికావిఘటికలయొక్క మొత్తముచేతను బాల్గొనగ వచ్చిన లబ్ధము వత్సరములగును- ఆ శేషము పన్నెండింటగుణించి తిరుగ నక్షత్రాద్యంతముచేతనే బాల్గొనగా వచ్చినది మాసములగును- ఆ శేషము దినములచేగుణించి బాల్గొనగా దినములు నీరీతినే ఘటికలచే విఘటికలచేతను గుణించి బాల్గొనగా ఘటికావిఘటికలు వచ్చును.

తత్త్వ్తేటదశాదశావినిహతా మాసాః పురోంకాభవే దత్యాంకం త్రిగుణం దినానిచ తథా వక్ష్యంతి చాంతర్దశాః। తద్భుక్తిస్తు దశాహతాచగస్త్రభిర్భక్తా దినాని క్రమాత్ ॥

ఏగ్రహముయొక్క మహాదశకంతర్దశకట్టవలెనోయామహాదశావర్షములంతర్దశావర్షములచేత గుణించ మొదటివి మాసములగును. కొసయంకెమూడింటగుణించగా దినములగును- ఆయంతర్దశామానమును దశావర్షములచే గుణించ నాల్గింట పాలుగొనగా వచ్చిన లబ్ధము విదశాదినములగును- శేషమురువదిచే గుణించి నాల్గింటపాలుగొనగావచ్చిన లబ్ధము ఘడియలగును.

తద్వర్గైర్నిహతా దినాని ఘటికా ద్వాభ్యాం విభక్తం ఫలం నాడ్యశ్శేషమతోథషష్టినిహతం చార్ధోయుతం తద్వతు। ద్వాభ్యాం భక్తఫలం వినాడ్యరభవం సూక్ష్మదశాభుక్తయస్త్వేవం ప్రాణదశా క్రమేణ విదితా స్సిద్ధాంతవిజ్ఞానిభిః॥

విదశాఘడియలను దశావర్షములచే గుణించి రెండింట పాల్గొనగా వచ్చిన లబ్ధము సూక్ష్మదశాఘడియలగును- శేషఘడియలరువదిచే గుణించి రెంటపాల్గొనగా విఘడియలు వచ్చును- ఈరీతినే సిద్ధాంతవేత్తలచేతను ప్రాణదశను దెలసికొనదగును.

కేంద్రాధీశ్వరకోణనాయకదశా శ్చాంతర్దశాశ్శోభనా స్సామాన్యాశ్చ ధనత్రిలాభభవనాధీశగ్రహాణాం దశాః। షష్ఠాష్టవ్యయ భావనాయక దశా కష్టా భవేయుస్సదా నేతుర్లగ్నమపేక్ష్య తత్తదధిపో తత్తద్దశాభుక్తిషు॥

కేంద్రకోణాధిపతులయొక్క దశలును వారియంతర్దశలును శుభప్రద

ములు- ధనతృతీయ లాభాధిపతులయొక్క దశాంతర్దశలు మధ్యఫలములు షష్ఠాష్టమవ్యయాధిపతులయొక్క దశలు కష్టఫలములు నగునని యడిగినవారి లగ్నమునబట్టి యాయాయి దశాభుక్తులందు జెప్పవలెను.

రాజాశ్రయణ ధర్మాః.

వినాజ్ఞయా విశంతంతు ద్వార్థస్సమ్యఙ్నిరోధయేత్ । నిర్దేశకాయవిజ్ఞాప్య తేనాజ్ఞప్తః ప్రమోచయేదితి భార్గవః॥ ప్రయాణకాలేచ గృహప్రవేశే వివాహకాలేపిచ దక్షిణాంఘ్రిం। కృత్వాగ్రతశ్శత్రుపురప్రవేశే వామం నిదధ్యాచ్చరణం నృపాలఇతి బృహస్పతిః॥ ప్రవిశ్య నగరీం లంకాం కపిరాజహితంకరః। చక్రేథ పాదం సవ్యంచ శత్రూణాం సతుమూర్ధనీతి శ్రీమద్రామాయణే॥ తస్మాద్రాజద్వారప్రవేశే దక్షిణపాదమాదౌ నిధాయ గచ్ఛేత్॥

రాజాజ్ఞలేకను బ్రవేశించువాని నెవనినైన ద్వారపాలకుడు రాజద్వారప్రవేశమును జేయనివ్వరాదు- తనపైయధికారికి దెలియజేసి వాని యాజ్ఞవలన విడువదగునని భృగువచనము.

ప్రయాణకాలమందు గృహప్రవేశమందు వివాహమందును దక్షిణాంఘ్రిని ముందుంచవలెను. శత్రుపురప్రవేశమున వామపాదము నుంచవలెనని బృహస్పతి,

శ్రీఆంజనేయులవారు లంకాపురప్రవేశమందు ముందుగ వామపాదన్యాసమును జేసిరది శత్రువులశిరమందుంచుటయని శ్రీమద్రామాయణమది గావున రాజద్వారప్రవేశమందు దక్షిణపాదమునుంచి నడువవలయును.

రిక్తహస్తేన నోపేయాద్రాజానం దైవతం గురు మిత్యాది వచనప్రమాణ్యాద్రాజదర్శనార్థం ఫలాన్యాదాయైవ గంతవ్యం॥ తత్ర గ్రాహ్యాగ్రాహ్యఫలాని వక్ష్యామః॥ తదుక్తం స్కాందె ధర్మఖండే॥ ఉపాయనాని సంగృహ్య జంబీరాదిపురస్సరం। జంబీరాత్కార్యసిద్ధిస్స్యాన్నారికేళాత్ఫలాధికం। ఃసిద్ధం కార్యనాశాయ పుష్పకరముకజాలకాః। ఉర్వారుకంచఖర్జూరం తిందుకం కదళీం త్యజేదితి॥

రాజును, దైవతమును, గురువును రిక్తహస్తముతో జూడబోగూడదు- గావున రాజదర్శనార్థము ఫలములను బట్టుకొని వెళ్లవలయునీవిషయమై గ్రాహ్యాగ్రాహ్యఫలములను జెప్పుచున్నారము.

కానుకగా నిమ్మపండ్లుమొదలగునవి స్వీకరించవలయు నందు నిమ్మపం

దు కార్యసిద్ధికరము. కొబ్బరిపండధికఫలప్రదము. వెలగపండు కార్యనాశము. పుష్పములు, పోకపండు, మొగ్గలు, దోసపండు, ఖర్జూరపుకాయలు, తుమ్మికపండు, అనటిపండు వీటినిత్యజించవలయునని స్కాందమందగు ధర్మఖండము.

తత్ర కృద్ధం రాజానంవా రాజతోషణార్థం తదాజ్ఞయా వివాదేకృతే ప్రత్యర్థినంవా శాంతియుక్తం కర్తు మాపస్తంబోక్తజపవిధిం వక్ష్యామః॥

సంవాదదేశంగత్వా ప్రత్యర్థినం ప[…]స్నాత్త రాంజపేత్॥ మంత్రః॥ తే వాచమాస్యాద్దద ఆమనస్యాగ్ హృదయాదధి యత్రయత్ర తే వా క్నిహితా తాం తతఆదధే॥అస్యార్థః॥ తేవాచం ఆస్యాత్। అసావిత్యనేన ఛాందసో లింగవ్యత్యయః। యద్వా తే వాచ ఆస్యం బధ్నాదితి। ఆమనస్యాం మనసిభవాం మనస్యాం మనసి వివక్షితాం ఆదధే। హృదయాదధి హృదయోపరియావాక్సా దధే। అన్యతోఽపి యత్రయత్ర తే వాగ్విహితస్తతస్తస్మాత్త్వదీయావాచం ఆదధే అపిదధామీత్యర్థః। ఇహచ సంబుధ్యా నామనిర్దేశః ప్రత్యర్థినఏవ॥ కృద్ధముత్తరాభ్యామభిమంత్రయేత విక్రోధో భవతి యది కృద్ధప్రత్యర్థీవా వ్యవహారద్రష్టాతునతో క్రోధశాంతింబాసావిచ్ఛతి తదాఉత్తరాభ్యామభిమంత్రయేత్॥ మంత్రః॥ యాతఏషరరాట్యాతనూర్మన్యోర్మృధ్రస్యనాశనీ। తాం దేవాబ్రహ్మచారిణో వినయంతు సుమేధసః॥ ౧ ॥ యత్తఏతన్ముఖేమతగుంరరాటముదివవిధ్యతి ఏతేక్రోధన్నయామసి గర్భమశ్వతర్యాఇవ॥ ౨ ॥ ఏతయోరర్థః॥ యాతఇతి॥ తేయాఏషారరాట్యా లలాటే భ్రూమన్యోస్తనోః క్రోధవేషః। భ్రుకుటిః వక్రత్వాదిః ఆతామ్రనేత్రత్వాదిః కపటగర్వత్వాది ర్మృధ్రస్య మృదునామైతతు తవ ప్రధానభూతం యన్మృదుత్వం తస్యనాశనీ। కృద్ధాహి మృదుత్వం జహాతి తాం మన్యోస్తనూదేవా బ్రహ్మచారిణః బ్రహ్మణి నేత్రేచ ప్రతిపాద్యంతే। దేవాః అపనయంతు। సుమేధసః సుప్రజ్ఞాః తథాచ కథంకారమేతేషాం యదత్ర తే వపుషి ముఖం అంతరే లలాటమధ్యే ఉద్విధ్యతివా కృద్ధం యమ్భ్రూం లలాటే నాడీనాంచ స్ఫురణం తదభిప్రాయమేతత్ యచ్ఛబ్దశ్రుతేస్తచ్ఛబ్దాధ్యాహారః। తం తేక్రోధం వినయామసి వినాశయామః। గర్భమశ్వతర్యాఇవ అశ్వతరీణాం గర్భగ్రహణం మరణహేతుః తతో వినేతవ్యఇత్యుపమానాదరః। ఏవంకృతే విక్రోధో భవతి। ఇత్యేతాభ్యాం కృద్ధమితరంవాభిమంత్రయేత అనేనచాభిమంత్రణేనకృద్ధో విక్రోధో భవతి। ఫలవిధిశ్చాయం నార్థవాదమాత్రం సూత్రకారేణ బద్ధత్వాత్॥

కోపయుక్తుడగు రాజునైన, రాజసంతోషార్థమై వారియాజ్ఞచే వివా

దయగుచుండ ప్రత్యర్థినైన శాంతియుక్తునిగా జేయుకొఱకు ఆపస్తంబోక్తము గు జపవిధిని వ్రాయుచున్నాము.

సంవాదస్థలమునకు వెళ్లి ప్రతిపక్షిని జూచుచు తేవాచ మనుమంత్రమును జపించవలయును. ప్రతిపక్షి కోపయుక్తుడైన యాతఏష యనునదియు, యత్త్రఏతస్మ్యఖేయనునదియు నభిమంత్రించిన కృద్ధులు విక్రోధులగుదురు.

ఈమంత్రములు ఫలవిధాయకములు గాని యర్థవాదమాత్రములుగావు. అటులగుటనే సూత్రకారునిచే నిర్ణయించబడెను.

యత్నేనోపచరేన్నిత్యం నాహమస్మీతి చింతయేత్। సమర్థయంశ్చ తత్పక్షం సాధుభాషేత భాషితమితి భార్గవః॥ ప్రవిశ్య సానురాగస్య చిత్తంచిత్తజ్ఞసమ్మతః। సమర్థయంశ్చ తత్పక్షం సాధుభాషేత భాషితం। తన్నియోగేనవా బ్రూయాదర్థం సుపరినిశ్చితం। సుఖప్రబంధగోష్ఠీషు వాదేవా వాదినాం మతం॥ విజానన్నపి మేధావీ భర్తుః క్షిప్తోత్తరం వచః। ప్రవీణోపిహి మేధావీ వర్జయేదభిమానితామితి కామందకే॥ ఆపద్యున్మార్గగమనే కార్యకాలాత్యయేషుచ। అపృష్టోపిహి తాన్వేషీ బ్రూయాత్కళ్యాణభాషితం। ప్రియం తథ్యంచ పథ్యంచ వదేద్ధర్మార్థకం వచః। సమానవార్తయాచాపి తద్ధితం ప్రగ్గయేత్సదేతి భార్గవః॥ దాక్షిణ్యయుక్తమశఠం సత్యం జన మనోహరం। అల్పాక్షరమనేకార్థం వాక్యం బ్రూహి మహామత ఇతి బ్రహ్మోత్తరఖండే॥ సత్యం బ్రూయాత్ప్రియంబ్రూయాన్నబ్రూయాత్సత్యమప్రియం। ప్రియంచ నానృతంబ్రూయాదేషధర్మస్సనాతనః॥ వాచ్యర్థానియతాస్సర్వే వాఙ్మూలావాగ్వినిస్సృతాః॥ తాంతుయస్తేనయేద్వాచం ససర్వస్తేయకృన్నరఇతి మనుః॥ నముఖ నేత్రయోర్వాపి లలాటేచ భ్రువోస్తథా। అన్యేష్వపిచగాత్రేషు దోషస్సంవిదితః క్వచిత్॥ అవిస్తరమసందిగ్ధ మవిలంబిత మద్రుతం। ఉరస్థం కంఠగం వాక్యం వర్తతే మధ్యమే స్వరే॥ సంస్కారక్రమసంపన్నా మద్రుతా మవిలంబితాం। ఉచ్చారయతి కళ్యాణీం వాచం హృదయహారిణీం। అనయాచిత్రయా వాచా త్రిస్థానవ్యంజనస్థయా। కస్యనారాధ్యతే చిత్తముద్యతాసేరరేరపీతి శ్రీమద్రామాయణే శ్రీరామచంద్రేణాజ్ఞాపితం॥ నశిరః కంపయేద్గాత్రం భ్రువౌ చాప్యక్షిణీతథా। తైలపూర్ణమివాత్మానం తత్తద్వర్ణే ప్రయోజయేత్॥ శంకితం భీతముద్ఘుష్ట మవ్యక్త మనునాసికం। కాకుస్వరం శీర్షగతం తథాస్థానవివర్జితం। విస్వరం విరసంచైవ విశ్లిష్టం విషమాన్వితం। వ్యాకులం తాలుభిన్నంచ పాఠదోషాశ్చతుర్దశ॥ మాధుర్యమక్షరవ్యక్తిః పదచ్ఛేదస్తథాత్వరా। ధైర్యం

లయసమర్థ్వంచ షడేతే పాఠకాగుణాఇతి శిక్షాయాం॥ ప్రవృత్తవాక్చిత్రకథః ఊహావాన్ప్రతిభానవాన్। ఆశుగ్రంథస్య వక్తాచ సవై పండితఉచ్యతే॥ అస్యార్థః॥ ప్రవృత్తవాక్। అకుంఠితవచనః। చిత్రకథో లోకకథాభిజ్ఞః। ఊహాతర్కః। ప్రతిభానం తత్కాలస్ఫూర్తిః॥ వాక్సంయమోహి నృపతే సుదుష్కరతమోమతః। అర్థవచ్చ విచిత్రంచ నశక్యం బహుభాషితుం॥ అభ్యావహతి కల్యాణం వివిధం వాక్సుభాషితా। సైవదుర్భాషితా రాజన్ననర్థాయోపపద్యతే। రోహతే సాయకైర్విద్ధం వనం పరశునాహతం। వాచాదురుక్తం బీభత్సం నసంరోహతి వాక్క్షతం॥ కర్ణినాళీకనారాచాన్నిర్హరంతి శరీరతః। వాక్శల్యస్తు ననిర్హర్తుం శక్యో హృదిశయోహిసః॥ వాక్సాయకా వదనాన్నిష్పతంతి యైరాహతశ్శోచతి రాత్ర్యహాని। పరస్యానామర్మసు తేపతంతి తాన్పండితోనావసృజేత్పరేభ్యః॥ నసాసభాయత్రనసంతివృద్ధా నతేవృద్ధా యేనవదంతిధర్మం। నాసౌధర్మో యత్ర నసత్యమస్తి నతత్సత్యం యచ్ఛలేనాభ్యుపేతం॥ సువర్ణపుష్పాం పృథివీం చిన్వంతి పురుషాస్త్రయః। శూరశ్చ కృతవిద్యశ్చ యశ్చజానాతి సేవితుం॥ అవ్యాహృతం వ్యాహృతాచ్ఛ్రేయ ఆహుస్సత్యంవదేద్వ్యాహృతం తద్ద్వితీయం। ప్రియంవదేద్వ్యాహృతం తత్తృతీయం ధర్మ్యంవదేద్వ్యాహృతం తచ్చతుర్థమితి శ్రీమహాభారతే॥ అస్యార్థః॥ అవ్యాహృతం మౌనం తతోపి శ్రేయః। సత్య వచనం సత్యమపి ప్రియంచేత్ తతోపి శ్రేయః తతోపి ధర్మ్యానుగతంచేత్ శ్రేష్ఠమిత్యర్థః॥ హిరణ్యభూమిలాభేభ్యో మిత్రలబ్ధిర్వరాయతః। అతోయతేత తత్ప్రాప్తౌ రక్షేత్సత్యం సమాహితఇతి యాజ్ఞవల్క్యః॥ సత్యవచనాన్మిత్రలబ్ధిరితి వశిష్ఠః॥ అసత్యాస్సత్యసంకాశాస్సత్యాశ్చాసత్యసంనిభాః। దృశ్యంతే భ్రాంతిజనకాస్తస్మాద్యుక్తం పరీక్షణమితి నారదః॥ సత్యంచ అప్రాణిహింసాకరమేవ ప్రాణిహింసాకరం సత్యమప్యసత్యప్రాయమేవ ధారణాద్ధర్మమిత్యాహుస్సత్యం ధారయతే ప్రజాఇతి విశేషస్మరణాత్ అపిచ॥ ఓమితి॥ సత్యంనేత్యనృతం తదేతత్పుష్పం ఫలంవాచో యత్సత్యం సహీశ్వరో కళ్యాణకీర్తిర్భవితా ఇతిశ్రుతిః॥ తిష్ఠేతిరాజా చుక్రోశ యాహియాహీతి రాఘవః। సుమంత్రస్య బభూవాత్మా చక్రయోరివచాంతరా॥ నాశ్రౌషమితి రాజానముపాలబ్ధోపి వక్ష్యసి। చిరందుఃఖస్య పాపిష్ఠ మితిరామస్తమబ్రవీదితి శ్రీమద్రామాయణే॥ అస్యార్థః॥ పునరాగమనానంతరం రాజా కిమర్థం మద్వాక్యేన స్థితోసీతి నిందితోపి నాశ్రౌషం తద్వచనమితి వక్ష్యసి కిమర్థమేవ మసత్యవచనం। తత్రాహ। చిరమితి దుఃఖస్య ఇదానీమనుభూయమానదుఃఖస్య చిరం విళంబః పాపిష్ఠం అతిదుస్సహమితి। ప్రాణినాముపకారాయ యథైవేహ

పరత్రచ। కర్మణామనసావాచా తదేవ మతిమాన్వదేదితి విష్ణుపురాణే॥ ననర్మ యుక్తమనృతంవదంతి నస్త్రీషురాజన్నవివాహకాలే। నగుర్వర్థే నాత్మనో జీవితార్థే పంచానృతాన్యాహురపాతకానీత్యుక్తం తస్మాదేవ శ్రీమహాభారతే॥ అలమతిప్రసంగేన వాగనుశాసనార్థేన॥

యత్నముచే నిత్యమును రాజును సేవించవలయును. తనకది నిత్యము గాదని తలంచవలెను. రాజవలంబించు పక్షమునే తానును స్థాపనము జేయ దగును. రాజు పలికిన పలుకును బాగున్నదనవలెనని భార్గవులు.

రాజసన్నిధిని బ్రవేశించి యనురాగయుక్తులగు వారిచిత్తమును దెలసి వారికి సమ్మతుడై వారివాక్యమును స్తుతిజేయుచు వారి యాజ్ఞచేతనైన లేక వారిపలుకునకు సముత్తరముగానైన నిశ్చితార్థమగు వాక్యమును బలుకదగును.

సుఖార్థమగు ప్రబంధగోష్ఠులయందైనను వాదమందైనను వాదిమతమును దెలసి తెలసినవాడైనను ప్రభువుచే నాక్షేపించబడి బుద్ధిమంతుడగు వాడుత్తరమిచ్చుటకు బ్రవీణుడైన నభిమానమును విడచి యాప్రభువునకు బ్రతికూలముగ బలుకదగదని కామందకము.

ఆపదవచ్చునపుడును రాజు చోరుచేమార్గమును దప్పునపుడును జేయదగినపనికి సమయమతిక్రమించునపుడు రాజుహితమును గోరినవాడు తన్నడుగకుండినను శుభకరమగు వాక్యమును బలుకదగును.

విననిష్టమగునట్టియు, సత్యమగునట్టియు, ముందుపయోగమగునట్టియు ధర్మార్థములను సమకూర్చు వాక్యమునే పలుకవలెను. సామాన్యమగు వార్తచేతనైనను రాజహితమును గోరవలసినదని భార్గవులు.

దయాయుక్తము, నబాధకము, సత్యము, జనమనోహర మల్పాక్షరములు గలిగి యనేకార్థములు గలదియునగు వాక్యమును బుద్ధిమంతులు పలుకవలెనని బ్రహ్మోత్తరఖండము.

సత్యమునుబలుకవలె నది ప్రాణిహితమై యుండవలెను. సత్యమైనను ప్రాణిహితముగానిది పలుకరాదు. ప్రియమైన నసత్యమును బలుకరాదనియు నిది ప్రాచీనధర్మమనియు మనువు.

ముఖమందు, నేత్రములందు, ఫాలమందు, కనుబొమలందితరావయవములయందును మాటలాడునపుడును వికృతిని గనుబరచకూడదు.

సందిగ్ధముగాకుండ సంక్షేపముగ నాలస్యములేకను త్వరలేకను వ్యా

దయమును కంఠమును బొందిన వాక్యమును మధ్యమస్వరమున బలుకవలెను.

వ్యాకరణయుక్తముగ త్వరయు నాలస్యము లేక మంగళప్రదమైన మనోరంజనము నర్పడి హృదయకంఠవాక్కులయందు బలుకదగిన చిత్రమగు వాక్యముచేతను తల్వారిచే నరకవచ్చినవాని చిత్తమైన హస్తమగాకుండజేసెదరి శ్రీరామచంద్రవాక్యము.

శిరమును శరీరమును కనుబొమలను నేత్రముల కదలింపజేయరాదు. ఘటములపూర్ణమగు ఘటమువలె తొణుకులేక నణకువచే శరీరమును యథాయోగ్యవర్ణముల బ్రయోగించి మాటలాడదగును.

శంకనుబొందుచు భీతినొందుచు కేకలుబెట్టుచు స్పష్టము గాకుండను ముక్కుతో మాట్లాడుట కాకోక్తి శీర్షగతముగ స్థానమును దప్పించి యుచ్చారణము చేయడము స్వరహీనముగ రసములేక ద్విత్వములు విడదీసియు విడదీయవలసినవి సంయుక్తము జేసియును విషమముగను బలుకుట తొలుప్పలను గదల్చుట యివి పదునాలుగువచనదోషములు.

మధురముగ నక్షరముల స్పష్టముగను పదవిభాగమొనర్చి త్వర లేక ధ్వనితాళయనుసరించి బలుకదగునవి యారుగుణములు.

మొరవబోవని వాక్యముగలవాడు లోకకథలను దెలిసినవాడు ఊహయు తత్కాలస్ఫూర్తియును గలవాడును గ్రంథముయొక్క శీఘ్రవక్తయును బండితుడనబడును.

వాక్సంయమమతిదుష్కరము. విచిత్రమును బ్రయోజనకారియునగు వాక్యమును విశేషముగ బలుకుట కష్టము. అలంకృతమైన బహువిధమగు వాక్యము మంగళమొనర్చును. దుష్టమగువాక్య మనర్థమునొందించును. బాణక్షతమగు కూడిపోవును, గొడ్డలిచేగొట్టబడిన వనము దిరుగ నభివృద్ధమగును- భయంకరమగు దుష్టోక్తులచేనగు క్షతము మానక మానవంతుని మనంబున కతిదుఃఖమునర్చును.

దేహముపైనినాటిన చిల్లకోలలను దీయవచ్చును- దుర్వాక్యరూపమగు ములుకులు గుండెను నాటుటచే దీసివేయవల్ల లేదు.

ముఖమునుంచిబయలుదేరి పరులమర్మములందునాటి వేటిచేత కొట్టబడి రాత్రిబగలును దుఃఖింపుదురో అట్టివాగ్బాణములను లౌకికవైదికజ్ఞానముగలవాడు పరులకొరకు బలుకరాదు.

కనుకూలించు వాక్యమును మతిగలవాడు బలుకుమని శ్రీవిష్ణుపురాణము.

హాస్యముకొఱకు, స్త్రీరక్షణమునకు, వివాహమొనర్చుటకు, గురుహితార్థము, తనజీవికకు హానికలుగునపుడు నీయైదుకాలముల నన్నృతమాడినను దోషముకలుగదని శ్రీమహాభారతమునందనుటకిది యొకారణము.

వాఙ్నియమబోధకార్థమై విశేషమునీపై జెప్పుటకుబనిలేదని చాలించితిమి.

ననర్మసచివైస్సార్ధం కించిదప్యప్రియం వదేత్। తేహిమర్మాణ్యభిఘ్నంతి ప్రహాసేనేవ సంసది॥ నైషాం దారేషు కుర్వీత మైత్రీం ప్రాజ్ఞః కదాచన। అంతఃపురచరాయేచ ద్వేష్టియానహితాశ్చయే। విదితేచాస్యకుర్వీత కార్యాణి సులఘూన్యపి। ఏవంవిచరతా రాజ్ఞి నక్షతిర్జాయతే క్వచిత్॥ గచ్ఛన్నపి పరాంభూమి మపృష్టో హ్యనియోజితః। జాత్యంధఇవ మన్యేత మర్యాదా మనుచింతయన్। నహిపుత్రం ననప్తారం నభ్రాతరమరిందమాః। సమతిక్రాంతమర్యాదం పూజయంతినరాధిపాః। యత్నాచ్చోపచరేదేనమగ్నివద్దేవవత్విహ। అనృతేనోపచీర్ణోహి హన్యాదేవ నసంశయః। యద్యద్భర్తానుయుంజీత తత్తదేవానువర్తయేత్। ప్రమాదమవలేపంచ కోపంచపరివర్జయేత్। సమర్థనాసు సర్వాసు హితంచ ప్రియమేవచ। సంవర్ణయేత్తదేవాస్య ప్రియాదపి హితం వదేత్॥ అనుకూలోభవేచ్చాస్య సర్వార్థేషు కథాసుచ। అప్రియంచాహితం యత్స్యాత్తదస్మైనానువర్ణయేత్। నాహమస్యప్రియోస్మీతి మత్వాసేవేతపండితః। అప్రమత్తశ్చ సతతం హితంకుర్యాత్ప్రియంచయత్। నాస్యానిష్టాని సేవేత నాహితైస్సహసంవిశేత్। స్వస్థానాన్నవికంపేత సరాజవసతిం వసేత్। అసూయంతిహి రాజానో నరాననృతవాదినః। తథైవ చావమన్యంతే నరాన్పండితమానినః। శూరోస్మీతి నదృప్తస్స్యాద్బుద్ధిమానితినాపునః। ప్రియమేవాచరన్ప్రాజ్ఞః ప్రియోభవతి భోగవాన్। ఐశ్వర్యంప్రాప్య దుష్ప్రాప్యం ప్రియం ప్రాప్యచ రాజతః। అప్రమత్తోభవేత్ప్రాజ్ఞః ప్రియేషుచ హితేషుచ। నచోష్ఠౌ నభుజౌ జానూ నచవాక్యం సమాక్షిపేత్। సదావాతంచ వాతంచ ష్ఠీవనంవాచరేచ్ఛనైః। హాస్యవస్తుషు చాప్యస్య వర్తమానేషు కేషుచిత్। నాతిగాఢం ప్రహృష్యేత నచాప్యున్మత్తవద్ధసేత్। నచాతిధైర్యేణచరేద్గురుతాంహి వ్రజేత్తతః। స్మితంతు మృదుపూర్వేణ దర్శయేదప్రమాదజం। లాభేన దర్శయేద్యస్తు నవ్యథేద్యోవమానితః। అసంమూఢస్య యోనిత్యం స రాజవసతిం వసేత్। రాజానం రాజపుత్రంవా సంవర్ణయతి యస్సదా। అమాత్యః పండితో భూత్వా సచిరం తిష్ఠతే ప్రియః। ప్రగృహీతశ్చ యోమాత్యో నిగృహీతశ్చ

కారజ్ఞైః। ననిర్వదతి రాజానం లభతే సంపదం పునః। ప్రత్యక్షంచ పరోక్షంచ గుణవాదీ విచక్షణః। ఉపజీవీ భవేద్రాజ్ఞో విషయేయోపివాభవేత్। యోవై గృహేభ్యః ప్రవసన్ ప్రియాణాం నానుసంస్మరేత్। దుఃఖేన సుఖమన్విచ్ఛేత్సరాజవసతిం వసేదితి ధౌమ్యః॥ రాజ్యసంబంధినః పూజ్యా స్సుహృదశ్చయథార్హతః। నృపాహూతస్తురంగచ్ఛేత్త్యక్త్వా కార్యశతంమహత్॥ మిత్రాయాపి నవక్తవ్యం రాజకృత్యం సుమంత్రితమితి భార్గవః॥ యద్యల్ప్యమైశ్చర్యేజానీయాన్నీచైస్తదపి కీర్తయేత్। కర్మణా తస్య వైశిష్ట్యం కథయేద్వినయాన్వితః। పరార్థం దేశకాలజ్ఞో దేశేకాలేచ సాధయేత్। స్వార్థంచ స్వార్థకుశలః కుశలేనార్థకారిణా। వేషభాషానుకరణం నకుర్యాత్పృథివీపతేః। సంపన్నోపి నమేధావీ స్పర్ధేత్తదనుతద్గుణైః। రాగాపరాగౌ జానీయాద్భర్తుః కుశలకర్మకృత్। ఇంగితాకారలింగాభ్యాం ఇంగితాకారతత్వవిత్। దృష్ట్వాప్రసన్నో భవతి వాక్యం గృహ్ణాతిచాదరాత్। దిశత్యాసనమభ్యాసే కుశలం పరిపృచ్ఛతి।వివిక్తదర్శనస్థానే రహస్యేచ నశంకతే। తదర్థాం తత్కృతాంచోచ్చైరాకర్ణయతి సత్కథాం। శ్లాఘ్యతే శ్లాఘనీయేషు శ్లాఘ్యమానంచ నందతి। కథాంతరేషు స్మరతి పృష్ఠ్యాప్తః కీర్త్యతే గుణాన్। సహతే పథ్యముక్తస్స న్ననిందామనుమన్యతే। కరోతివాక్యం తద్రక్తః తద్వచో బహుమన్యతే। వృద్ధౌప్రసన్నో భవతి వ్యసనే పరితప్యతే। రక్తస్యవా గుణాః ప్రోక్తా భృత్యేషు పృథివీపతేః। ఉపకారేషుమాధ్యస్థ్యం దర్శయత్యద్భుతేష్వపి। తత్కృతంకర్మచాన్యేన కృతమిత్యభిభాషతే। విపక్షముత్థాపయతి వినాశంచాప్యుపేక్షతే। కార్యేసంవర్థయత్యాశాం ఫలేచ కురుతేన్యథా। యద్వాక్యంమధురంకించిత్తదప్యర్థేన నిష్ఠురం। ఆచరత్యాత్మశంసాసు పరివాదంచ కేవలం। కోపోపి నసకోపాభః ప్రసాదోపిహినిష్ఫలః। హసత్యకస్మాత్త్యజతి రూక్షంచ సముదీక్షతే। విజ్ఞాప్యమానో వృత్త్యర్థం సహసోత్థాయగచ్ఛతి। ఆఘట్టయతి కర్మాణి శుచిర్నబహుమన్యతే।ఆపాదయతిమర్మాణిగుణాన్నబహుమన్యతే। సంభావయతి దోషేణ వృత్తిచ్ఛేదం కరోతిచ। సాధూక్తమపి యద్వాక్యం సమర్థయతిచాన్యథా। అపర్వణి కథాభంగం కరోతి విరసీభవన్। ఉపాస్యమానశ్శయనే సుప్తలక్షేణ తిష్ఠతి। యత్నేనారాధ్యమానోపి సుప్తవచ్చ విచేష్టతే। ఇత్యాదిచానురక్తస్య విరక్తస్యచ లక్షణాః॥

రాజుయొక్క రహస్యమంత్రులతో నేమియు నప్రియములు వలుకతగనటుల బల్కిన వారలునవ్వుచునె సభలయందు మర్మములనుగొట్టుచున్నారు.

ప్రాజ్ఞుడగువాడొకానొకప్పుడును రాజభార్యలతో మైత్రిని జేయరాదు. మరియు నంతఃపురచరులతో మైత్రియును ద్వేషమునుగూడ జేయరాదు. రాజు ద్వేషించినవానితో రాజుపైని ద్వేషముగ నున్నవానితో మైత్రి జేయతగదు. మిక్కిలి స్వల్పమగు గార్యమైనను రాజనుజ్ఞ నొందక నే జేయరాదిట్లు చరించినవాని కొకప్పుడును హాని గలుగదు.

ఉత్కృష్టస్థానమునకు వెళ్లినవాడైనను రాజు ప్రశ్న జేయక నియమించకయుండినపుడు మర్యాద నాలోచించి పుట్టుగ్రుడ్డివానివలె తన్ను దలంచుకొనవలెను.

శత్రునాశకుడగు రాజు మర్యాదనతిక్రమించి తన పుత్రపౌత్రభ్రాతలపైనను గౌరవమొనర్చరు గాన యత్నముచే నగ్నివలె దేవునివలె నుపాసన జేయదగును. అనృతముచేతను వృద్ధినొందినవానిని నిస్సంశయముగ గొట్టదగును.

ప్రభువే కార్యమందు దన్ను నియోగించునో ఆకార్యమందనువర్తించవలెను. ప్రమాదము గర్వము కోపమును విడువదగును.

రాజు సమర్థించు సకలకార్యములందును ప్రియమును హితమును వర్ణించదగును. అదియే రాజునకత్యంతప్రియమగుచున్నది. సకలప్రయోజనములందును రాజునకనుకూలుడగును. రాజుకొరకహితము నప్రియమునగునది వర్ణించకూడదు.

రాజునకు నేను ప్రియుడనుగానని సర్వదా తలంచుచు సేవించవలెను గాని వారియనుగ్రహమున్నదని ప్రమత్తుడైయుండరాదు. రాజునకేదిప్రియము హితమునగునది యాచరించదగును. రాజునకనిష్టమును సేవించరాదతనిశత్రువులతో గలసికొనకూడదు. తనస్థానమునుంచి చెలించగూడదిటులాచరించు నేర్పరి రాజునాశ్రయించవలెను.

అనృతవాదులనుగూర్చి రాజులసూయతపడుదురు. పండితాభిమానముగల మనుజులనుగూడ నవమానింతురు. శూరుడననిగాని బుద్ధిమంతుడననిగాని గర్వించగూడదు. రాజునకు ప్రియమాచరించుచు యతనికి ప్రియుడై భోగముల ననుభవించును.

పొందశక్యముగాని యైశ్వర్యమునొంది రాజునకు ప్రియుడై యతని ప్రియమందును హితమందును నప్రమత్తుడై యుండవలెను.

పెదవెలను, భుజములను, పిక్కలను, వాక్యమును చెలింపజేయరాదు,

ఉమియు నధోవాతమును వృథావాక్యమును సభయందాచరించరాదు. దేహ ప్రతిబంధముచే నాచరించవలసివచ్చినపైకివచ్చి మెల్ల మెల్లనయాచరించవలెను.

హాస్యవస్తుదర్శనాదికమందునుగూడ వెఱ్ఱివానివలె నధికధ్వనితో నవ్వరాదు. విశేషధైర్యముతో సంచరించరాదటులుండిన గౌరవమొందును. ప్రమాదమును బుట్టించని మృదువగు మందహాసమును హాస్యవస్త్వాదిదర్శనమున గనపరచవలెను.

లాభమందున సంతుష్టియు నవమానమున వ్యథయును గనపరచక మూఢుడుగాక యెవడుండునో వాడు రాజాశ్రయుడు గావలె. రాజునుగాని రాజపుత్రునిగాని సర్వదా వర్ణనజేయువాడు మంత్రియు పండితుడునై చిరకాలము ప్రియుడై యుండును.

మంత్రి తనను పరిగ్రహించినను నిగ్రహించినను నిందించక రాజహితమును గోరుచుండిన దిరుగ సంపద నొందును. ప్రత్యక్షపరోక్షములందు రాజగుణములను నేర్పరితనమున స్తుతియొనర్చువాడతనిచే బోషింపబడును.

ఎవడు దనగృహమును విడచి దననారిని దలచక కష్టపడుచు సుఖేచ్ఛగలవాడగునో వాడు రాజాశ్రయుడు గావలెనని ధౌమ్యుడు. రాజుయొక్క స్నేహితులు నౌకరులు మొదలగువారిని వారివారిదర్జానుసరించి గౌరవమును జేయదగును. రాజాజ్ఞ కాబడునపుడు నూరుగొప్ప ప్రయోజనములుండినను విడచి శీఘ్రముగ వెళ్లదగును.

చక్కగ నాలోచించి నిశ్చయించిన రాజకృత్యమును దనమిత్రులతోనైనను బలుకరాదని భార్గవులు. తానధికజ్ఞానముగలవాడైనను వినయముచే స్వల్పజ్ఞుడనని మనవినిజేసి తనతెలివిని దానొనర్చు ప్రయోజనమందే కనపరచవలెను.

దేశకాలములను దెలసి పరులకార్యములను సాధించునతడు కుశలుడై మంచిసమయమందు మనవినిజేయవలెను. తనకార్యమును మిక్కిలి కుశలుడగు రాజవల్లభునిచే నెరవేర్చుకొనవలయును.

తానెంతసంపన్నుడైనను రాజుననుసరించిన వేషమును భాష నవలంబించకూడదు. బుద్ధిమంతుడైనవాడు రాజగుణములతో స్పర్ధను దానుజేయదగదు.

కుశలములగు బనులుసేయుచు రాజుయొక్క రాగమును విరాగము

నింగితాకారచిహ్నలచే దెలియుచుండవలెను. భృత్యులయందనురక్తులగు ప్రభువులాభృత్యులను జూచి ప్రసన్నులగుదు రతనిపలుకు నాదరముచే గ్రహింతురు. సమీపమందునఁగూర్చుండ నాజ్ఞాపింతురు. కుశలమునడుగుదురు. వివిక్తస్థలమందును రహస్యములందున నాభృత్యుడుండుటకు శంకించరు. వాడు జేయుపనులను వాని గార్యములను నందరువినుచుండ స్వయముగ గొనియాడుదురు. అన్యులు గొనియాడిన యామోదింతురు. కథాంతరములందతని స్మరించుదురు. తత్కాలమందప్రియమైనను పథ్యమగువాక్యమును సహింపుదురు. వానిని నిందించిన యంగీకరించరు. వానియందనురక్తులుగావున వాడుజెప్పిన మాటను జేసి బహూకరింతురు. వానికి వృద్ధిగలిగిన సంతుష్టులగుదురు. కష్టము గలిగిన బరితపించుదురు. ఇట్లింగితాకారములచే రాజదయను దెలియవలెను.

విరక్తులగుప్రభువులగుణములు. భృత్యులద్భుతములగు నుపకారములు జేసినపుడును మాధ్యస్థ్యము గనబరచెదరు. వానిచే జేయబడు కార్యమన్యుడు జేసినట్లు బలుకుదురు. శత్రుత్వమును బ్రకటింతురు. వానికి వినాశమైన నుపేక్షింతురు.

కార్యమందాశను వృద్ధిబొందింతురు. ఫలకాలమందన్యథాజేతురు రోకప్పుడు మాటమధురమైన నర్థముచే నిష్ఠురమగునట్లు బల్కుదురు. తమ్ము స్తుతిజేసికొనునపుడు వాని నింద నగపరచెదరు. కోపమైన కోపమువలె నగపరచరనుగ్రహమైన నిష్ఫలముగ జేతురు. నిష్ప్రయోజనముగ నవ్వుదురు. ఎట్టబారి జూతురు. జీవనముకొరకు విజ్ఞాపనముజేయుచుండ శీఘ్రముగ లేచిపోదురు.

భృత్యుడొనర్చిన లోపభుసనుల నుద్ఘాటనముజేతురు. మంచిపనులను బహూకరించరు. మర్మములను బ్రకటింతురు. గుణముల నెన్నరు. దోషము నాపాదించెదరు. వృత్తిచ్ఛేదమును జేతురు. మంచిమాటలబలికిన నన్యథా సమర్థింతురు. ఆశ్రితుడుపన్యసించు కథలో నసమయమందు విరసులై రసభంగమును జేతురు. వానిచే నుపాసించబడుచు శయనమందు నిద్రించినట్లుండుదురు.

యత్నముచే నారాధించబడుచుండియు నిద్రితునివలె చేష్టింతు రివిమొదలగువాటిచే విరక్తప్రభులగుణములను దెలియవలెను.

కుసూలాది బ్రాహ్మణజీవికావిధిః.

కుసూలకుంభధాన్యోవా త్ర్యాహికాశ్వస్తనావపి। జీవేద్వాపి శిలోంఛేన శ్రేయానేషాంపరఃపర ఇతి॥ కుసూలాదయో యద్యప్యనవస్థితప్రమాణాః త,

ధాపి స్వకుటుంబపోషణే ద్వాదశాహపర్యాప్తధాన్యః। కుసూలధాన్యః। ష డహఃపర్యాప్త ధాన్యః కుంభధాన్యః। వల్లరీగ్రహణం శిలం। కణోపాదాన ముంఛకమితి పారిజాతాదౌ స్థితం। యాత్రామాత్రప్రసిద్ధ్యర్థం స్వైఃకర్మభి రగర్హితైః। అక్లేశేన శరీరస్య కుర్వీతధనసంచయం। ఋతామృతాభ్యాం జీవేత్తు మృతేనప్రమృతేనవా। సత్యానృతాభ్యామపివానశ్వవృత్త్యాకదాచన॥ ఋ తముంఛశిలంజ్ఞేయమమృతంస్యాదయాచితం। మృతంతుయాచితంభైక్షంప్రమృ తం కర్షణంస్మృతం। సత్యానృతంతువాణిజ్యం తేనచైవాపిజీవ్యతే। సేవాశ్వ వృత్తిరాఖ్యాతా తస్మాత్తాంపరివర్జయేత్॥ కుసూలధాన్యకోవాస్యాత్కుంభీ ధాన్యకఏవవా। త్ర్యైహైహికోవాపిభవేదశ్వస్తనికఏవవా॥ చతుర్ణామపి చైతే షాం ద్విజానాం గృహమేధినాం। జ్యాయాన్పరః పరోజ్ఞేయో ధర్మతో లోక జిత్తమ ఇతిమనుః॥

సత్యానృతంతువాణిజ్యం శ్వవృత్తిర్నీచసేవనం। వర్జయేత్తాంసదా వి ప్రో రాజన్యశ్చ జుగుప్సితాం॥ సర్వవేదమయోవిప్రస్సర్వదేవమయోనృపఇతి శ్రీమద్భాగవతేసప్తమస్కంధే॥ యాత్రేతి॥ యాత్రాప్రాణస్థితిః। శాస్త్రీయ కుటుంబసంవర్ధన నిత్యకర్మానుష్ఠానపూర్వక ప్రాణస్థితిమాత్రార్థం నభోగా ర్థం। స్వసంబంధితయా శాస్త్రవిహితార్జనరూపైః కర్మభిః ఋతాదివక్ష్యమా ణైః కాయక్లేశంవినా అర్థసంగ్రహంకుర్యాత్। కైః కర్మభిరిత్యత్రాహ। ఋ తామృతాభ్యామితి। అనాపదీత్యనువర్తతే। ఋతాదిభిరనాపది జీవేత్। సేవ యాత్వనాపదికదాచిన్న వర్తేత॥ అప్రసిద్ధత్వాదృతాదీనివ్యాచష్టే॥ ఋతమితి। అబాధితస్థానేషు పథివా క్షేత్రేషువా ప్రతిహతావకాశేషు యత్రయత్రౌష ధయోవిద్యంతే తత్రతత్రాంగుళీభ్యామేకైకంకణం సముంఛయిత్వేతి బోధా యనదర్శనాత్। ఏకైకధాన్యాదిగుడకోచ్చయస్సముంఛః। మంజర్యాత్మకానే కధాన్యోచ్చయనం శిలః ఉంఛశ్చ శిలశ్చేత్యేకవద్భావః। తత్సత్యసమాన ఫల త్వాదృతమిత్యుచ్యతే।అయాచితోపస్థితమమృతమివ సుఖహేతుత్వాదమృతం। ప్రార్థితంపునర్నిత్యం భిక్షాసమూహరూపం మరణపీడాజనకం స్మృతం। త థాచోక్తం॥ గతిర్భ్రంశోస్వరోహీనో గాత్రస్వేదోమహద్భయం। మరణేయా నిచిహ్నాని తాని చిహ్నాని యాచక ఇతి॥ ఏతచ్చ సాగ్నేర్గృహస్థస్య భైక్షమప క్వతండులాదిరూపం నతు సిద్ధాన్నం పరాగ్నిపక్వేన స్వాగ్నౌ హోమాన ర్హత్వాత్। కర్షణంచభూమిగతప్రచురప్రాణిమరణనిమిత్తత్వాత్ బహు దుః ఖఫలకం ప్రకర్షేణమృతమివ ప్రమృతం। సత్యానృతంత్వితి॥ ప్రాయేణ సత్యా

నృతవ్యవహారసాధ్యత్వాత్సత్యానృతం వాణిజ్యం కుసీదే అనాపదీత్యనువృత్తేరప్యయం కృతాన్యేతాని బోద్ధవ్యాని। యదాహ గౌతమః॥ కృషివాణిజ్యే స్వయంచాకృతే కుసీదంచేతి. సతు వాణిజ్యే శాస్త్రేణ సత్యానృతాద్యనుజ్ఞాతం। తేనచైవాపి జీవ్యత ఇతి చశబ్దేన వాణిజ్యకృషిసమవశిష్టత్వాత్కుసీదమపి గృహ్యతే। పూర్వశ్లోకోక్తా కృషి రేతచ్ఛ్లోకేచ వాణిజ్యం। సేవాతు దీనదృష్టిసందర్శన స్వామిగర్జన నీచక్రియాది ధర్మయోగాత్ శ్వ ఇవ వృత్తి రత శ్వవృత్తిరుక్తా తస్మాత్తాం ప్రకృతో బ్రాహ్మణస్త్యజేత్ శ్రుతిరోపి కుసూలధాన్యక ఇతి। కుసూలో వ్రీహ్యాగారం స్యాదిత్యభిధానికాః। ఇష్టకాసన్నిర్మితాగార ధాన్యసంచయో భవేత్ తేన నిత్యనైమిత్తికధర్మకృత్యపోష్యవర్గసహితస్య గృహిణో యావతా ధాన్యాదిధనేన వర్షత్రయం సమధికంవా నిర్వాహో భవతి తావద్ధనః కుసూలధాన్యక ఉచ్యతే। వర్షనిర్వాహోచిత ధాన్యాదిధనః కుంభీధాన్యః। ఈహా చేష్టా తస్యాంభవమైహికం త్ర్యహః పర్యాప్తమైహికం ధనం యస్యస త్ర్యైహైహికః। తథావా స్యాత్। శ్వోభవంశ్వస్తనం భక్తం తదస్యాస్తీతి మత్వర్థీయ ఠక్ కృత్వా సఞ్ సమాసః। తథావా భవేత్॥ యస్య త్రైహార్షికం భక్తం పర్యాప్తం భృత్యవృత్తయే। అధికం వాపి విద్యేత స సోమం పాతుమర్హతీతి మనుః॥ ప్రాత్యహికః క్రియాకుర్యాత్యస్యాన్నం వార్షికం భవేదితి యాజ్ఞవల్క్యః। ఏతత్ కార్ష్ణికా ర్థం కుసూలధాన్యకుంభీధాన్యసంగ్రహ మనుజ్ఞాతం చతుర్ణామపీతి। ఏషాంచతుర్ణామపి కుసూలధాన్యకాదీనాం బ్రాహ్మణానాం గృహస్థానాం మధ్యేయోఽనుత్తోఽపేక్షితః సశ్రేష్ఠో జ్ఞాతవ్యః యతోసౌ వృత్తిసంకోచధర్మేణ స్వర్గాదిలోకజిత్తమో భవతి॥

కుసూలాది బ్రాహ్మణజీవికావిధి.

కుసూలధాన్యుడు కుంభీధాన్యుడు త్ర్యాహికుడు అశ్వస్తనికుడు శిలోంఛవృత్తివంతుడునై జీవించవలెను. పూర్వపూర్వముకంటె నుత్తరోత్తరము శ్రేష్ఠము. కుసూలాములకు పరిమాణము లేకపోయినను పన్నెండుదినములనుట్టుకు తనకుటుంబపోషణపర్యాప్తధాన్యముగలవాడు కుసూలధాన్యుడు. ఆరుదినములకుతగిన ధాన్యముగలవాడు కుంభధాన్యుడు. త్ర్యాహికుడనగా త్రిదినపర్యాప్తధాన్యుడు. అశ్వస్తనికుడనిన నేకదినపర్యాప్తధాన్యుడు. శిలోంఛవృత్తివంతులనగా శిలము వెన్నులేరుట. ఉంఛమనగా గింజలేరుట. ఇట్లు బ్రతుకువారికి క్షేరన్ని పారిజాతాదిగ్రంథములందుండెను.

శరీరయాత్రామాత్రసిద్ధికి స్వకీయములగు ననింద్యకర్మలచేగన నాయా సనుగ ధనసంచయమును జేయదగు నిందుకు మనువుగారును శిలోంఛవృత్తుల చేనైన, నయాచితముగనైన, యాచనచేనైన, కృషిచేనైన, వాణిజ్యముచేనైన పూర్వపూర్వాభావమందుత్తరోత్తరముచే బ్రతుకదగును గాని సేవాజీవనము తగదు.

ఇటులధనమార్జించుట శాస్త్రీయ కుటుంబ సంవర్ధన స్వకర్మానుష్ఠాన ప్రాణస్థితిమాత్రమునకు గాని భోగార్థము గాదు. పైనిచెప్పిన వృత్తుల నాపద యందని సర్వత్ర జూచికొనవలెను.

కాయక్లేశములేనిదా గా సద్యసంగ్రహమును జేయవలయును. ఒకరియావరణలేనిచోట రాలినగింజలు వెన్నులేరికొనుట సత్యసమగుటచే ఋతమని సంజ్ఞ- యాచింపకనే సంభవించునది యమృతమువలె సుఖకరము గావున యది యమృతము.

యాచకునకు గతిమాంద్యము స్వరము హీనము శరీరమందు చెమట భయాధిక్యము గలుగును. గానమరణమంతను నీచిహ్నము లుండుటచే యాచనకు మరణసంజ్ఞ తగును.

ఈవృత్తులు సాగ్నికుడగు గృహస్థునకు గావున భైక్షమనగా తండులాదికముగాని సిద్ధాన్నము కాదు, పరాగ్నిపక్వాన్నము స్వాగ్నియందు హోమానర్హము.

కృషిచే భూమియందనేకజంతుమృతియగు గావున ప్రమృతమని పేరు. వాణిజ్యమందు సత్యానృతములుండును గాన సత్యానృతసంజ్ఞ కలదు.

అనాపదయందనుటచేత కృషివాణిజ్యములన్యులవలన జేయించదగునని గౌతములు. కృషివాణిజ్యములకంటె నితరము కుసీదము గావున కుసీదశబ్దమును వచనమందున వేరె జెప్పిరి. వాణిజ్యమనగా ధాన్యవస్త్రాదివిక్రయము. కుసీదమనగా హిరణ్యాము వడ్డీకిచ్చుట గాన భేదము.

నీచసేవ, దీనదృష్టి జేజూచుట, నీచక్రియాది నియోగమువలనను శునకముపలెను ఛీఛీ యని తనకనిష్టకృత్యమందున భర్జనను భర్త చేయుటనుంచియును శ్వవృత్తియని దీనికిపేరది వేదమయుడగు బ్రాహ్మణుడు దేవమయుడగు క్షత్రియుడీవృత్తిని బరిహరించదగునని మనువు- శ్రీమద్భాగవతమును.

కుసూలధాన్యుడనగా నిష్టకానిర్మితమగు కొట్టు దానియందు నిక్షేపనై మిత్తిక భృత్యాదిపోషణ పర్యాప్తధాన్యము మూడుసంవత్సరములకు గాని యధి

నృతవ్యవహారసాధ్యత్వాత్సత్యానృతం వాణిజ్యం కుసీదే అనాపదీత్యనువృత్తే
రస్వయం కృతాన్యేతాని బోద్ధవ్యాని। యథాహ గౌతమః॥ కృషివాణిజ్యే స్వ
యంచాకృతే కుసీదం చేతి- నతు వాణిజ్యే శాస్త్రేణ సత్యానృతాద్యనుజ్ఞాతం।
తేనైవాపి జీవ్యత ఇతి చశబ్దేన వాణిజ్యకృషి సమవశిష్టత్వాత్కుసీదమపి గృహ్య
తే। పూర్వశ్లోకోక్తా కృషి రేతచ్ఛ్లోకే చ వాణిజ్యం। సేవాతు దీనదృష్టిసందర్శ
న స్వామితర్జన నీచక్రియాది ధర్మయోగాత్ శ్వ ఇవ వృత్తి రత శ్వవృత్తిరు
క్తా తస్మాత్తాం ప్రకృతో బ్రాహ్మణస్త్యజేత్ [illegible]యోపి కుసూలధాన్యక ఇతి।
కుసూలో వ్రీహ్యాగారం స్యాదిత్యభిధానికాః। ఇష్టకాదినిర్మితాగార ధాన్యసంచ
యో భవేత్ తేన నిత్యనైమిత్తికధర్మకృత్యపోష్యవర్గసహితస్య గృహిణో యా
వతా ధాన్యాదిధనేన వర్షత్రయం సమధికం వా నిర్వాహో భవతి తావద్ధనః
కుసూలధాన్యక ఉచ్యతే। వర్షనిర్వాహోచిత ధాన్యాదిధనః కుంభీధాన్యః।
ఈహః చేష్టా తస్యాం భవమైహికం త్ర్యహైః పర్యాప్తమైహికం ధనం యస్యాస
త్ర్యహైహికః। తథా వా స్యాత్। శ్వోభవం శ్వస్తనం భక్తం తదస్యాస్తీతి మత్వ
ర్థీయమికం కృత్వా నఞ్ సమాసః। తథా వా భవేత్॥ యస్య త్రైవార్షికం భక్తం
పర్యాప్తం భృత్యవృత్తయే। అధికం వాపి విద్యేత స సోమం పాతుమర్హతీతి మ
నుః॥ ప్రాక్సౌమికీః క్రియాః కుర్యాద్యస్యాన్నం వార్షికం భవేదితి యాజ్ఞవల్క్యః।
ఏతత్కర్మాధికారార్థం కుసూలధాన్యకుంభీధాన్యసంగ్రహ మనుజ్ఞాతం చతు
ర్ణామపీతి। ఏషాం చతుర్ణామపి కుసూలధాన్యకాదీనాం బ్రాహ్మణానాం గృ
హస్థానాం మధ్యే యో యః శేషే పఠితః స శ్రేష్ఠో జ్ఞాతవ్యః యతోసౌ వృత్తిసం
కోచధర్మేణ స్వర్గాదిలోకజిత్తమో భవతి॥

### కుసూలాది బ్రాహ్మణజీవికావిధి.

కుసూలధాన్యుడు కుంభీధాన్యుడు త్ర్యాహికుడు అశ్వస్తనికుడు శిలోంఛవృత్తివంతుడునై జీవించవలెను. పూర్వపూర్వముకంటె నుత్తరోత్తరము శ్రేష్ఠము. కుసూలాదులకు పరిమాణము లేకపోయినను పన్నెండుదినములకు తనకుటుంబపోషణపర్యాప్తధాన్యముగలవాడు కుసూలధాన్యుడు. ఆరుదినములకుతగిన ధాన్యముగలవాడు కుంభధాన్యుడు. త్ర్యాహికుడనగా త్రిదినపర్యాప్తధాన్యుడు. అశ్వస్తనికుడనిన నేకదినపర్యాప్తధాన్యుడు. శిలోంఛవృత్తివంతులనగా శిలము వెన్నులేరుట. ఉంఛమనగా గింజలేరుట. ఇటులఁ బ్రతుకువారికి శ్రేష్ఠ్యమని పారిజాతాదిగ్రంథములందుండెను.

శరీరయాత్రామాత్రసిద్ధికి స్వకీయములగు ననింద్యకర్మలచేతనాయా సముగ ధనసంచయమును జేయఁదగు నిందుకు మనువుగారును శిలోంఛవృత్తుల చేనైన, నయాచితముగనైన, యాచనచేనైన, కృషిచేనైన, వాణిజ్యముచేనైన పూర్వపూర్వాభావమందుత్తరోత్తరముచే బ్రతుకదగును గాని సేవాజీవనము తగదు.

ఇటులధనమార్జించుట శాస్త్రీయ కుటుంబ సంవర్ధన స్వకర్మానుష్ఠాన ప్రాణస్థితిమాత్రమునకు గాని భోగార్థముగాదు. పైనిచెప్పిన వృత్తుల నాపద యందని సర్వత్ర జూచికొనవలెను.

కాయక్లేశముచే నాగా సస్యసంగ్రహమును జేయవలయును. ఒకరియా వరణలేనిచోట రాలినగింజలు వెన్నులేరికొనుట సత్యసమనుటచే ఋతమని సంజ్ఞ- యాచింపకనె సంభవించునది యమృతమువలె సుఖకరముగావున యది యమృతము.

యాచకునకు గతిమాంద్యము స్వరము హీనము శరీరమందు చెమట భయాధిక్యము గలుగును. గానమరణమందును నీచిహ్నము లుండుటచే యాచనకు మరణసంజ్ఞ తగును.

ఈవృత్తులు సాగ్నికుడగు గృహస్థునకు గావున భైక్షమనగా తండులాదికముగాని సిద్ధాన్నముకాదు, పరాగ్నిపక్వాన్నము స్వాగ్నియందు హోమానర్హము.

కృషిచే భూమియందనేకజంతుమృతియగు గావున ప్రమృతమని పేరు. వాణిజ్యమందు సత్యానృతములుండును గాన సత్యానృతసంజ్ఞ కలదు.

ఆపాపదయందనుటచేత కృషివాణిజ్యములన్యులవలన జేయించదగునని గౌతములు. కృషివాణిజ్యములకంటె నితరము కుసీదము గావున కుసీదశబ్దమును వచనమందున వేరె జెప్పిరి. వాణిజ్యమనగా ధాన్యవస్త్రాదివిక్రయము. కుసీదమనగా హిరణ్యము వడ్డీకిచ్చుట గాన భేదము.

నీచసేవ, దీనదృష్టి చేజూచుట, నీచక్రియాది నియోగమువలనను శునకమువలెను ఛీఛీ యని తనకనిష్టకృత్యమందున భర్జనను భర్త చేయుటనుంచియును శ్వవృత్తియని దీనికిపేరది వేదమయుడగు బ్రాహ్మణుడు దేవమయుడగు క్షత్రియుడీవృత్తిని బరిహరించదగునని మనువు- శ్రీమద్భాగవతమును.

కుసూలధాన్యుడనగా నిష్టకానిర్మితమగు కొట్టు దానియందు నిర్వాహైకత్రైమాసిక భృత్యపోషణ పర్యాప్తధాన్యము మూడుసంవత్సరములకు గాని యధి

కముగగాని గలవాడు- కుంభీధాన్యుడనగ నొకసంవత్సరమునకు తగినధాన్యము గలవాడు.

ఎవనికి మూడుసంవత్సరములపర్యంతమైన నధికమైన భృత్యజీవనపర్యాప్తధాన్యముండునో వాడె సోమపానమునకర్హుడని మనువు.

ఒకసంవత్సరమునకైన దగిన యన్నము గలవాడగ్నిష్టోమము జేయవలయునని యాజ్ఞవల్క్యులు. ఇట్లు యాజ్ఞకర్మాధికారముకొరకు కుసూలధాన్య కుంభిధాన్య సంగ్రహ మనుజ్ఞజేయబడెను.

కుసూలధాన్యుడు మొదలైన నలుగురిలో పైపైవాడు శ్రేష్ఠుడు వృత్తి సంకోచముచే ధర్మాభివృద్ధియగుటవలన స్వర్గాదిలోకములను జయించును.

చాతుర్వర్ణ్యానామాపద్వృత్తికథనం. కృషిశ్చ.

అథాపద్వృత్తింవదామః॥ సీదంశ్చేత్ప్రతిగృహ్ణీయా ద్బ్రాహ్మణేభ్యస్త ధాన్యపాత్। తతోపి వైశ్యశూద్రేభ్యశ్శంఖస్యవచనంతథే॥ అత్రబ్రాహ్మణేభ్యో న్యూనాచారేభ్యోపి ఆపదిప్రతిగృహ్ణీయాదితి తాత్పర్యం॥ అయాచితాహృతం గ్రాహ్యమపి దుష్కృతకర్మణః। అన్యత్ర కులపాషండపతితేభ్యస్తథాద్విషఇతి॥ క్షత్రియాదేస్తు యుద్ధాదయః ఆర్జనోపాయాః తథాచ గౌతమః॥ స్వామీరిక్థక్రయసంవిభాగపరిగ్రహాధిగమేషు బ్రాహ్మణస్యాధికంలబ్ధం విజితం క్షత్రియస్య నిర్విష్టం వైశ్యశూద్రయోః॥ మనురపి॥ సప్తవిత్తాగమా ధర్మ్యా దాయోలాభః క్రయోజయః। ప్రయోగః కర్మయోగశ్చ సత్ప్రతిగ్రహఏవచేతి॥ దాయోన్వయాగతం ధనం లాభో నిధ్యాదేః మైత్ర్యాదిలబ్ధస్యచ క్రయః ప్రసిద్ధః। ఏతేత్రయః చతుర్ణామపివర్ణానాం ధర్మ్యాః। జయధనం విజయత్వేన క్షత్రియస్య ధర్మ్యః॥ ప్రయోగోవృద్ధ్యర్థం ధనప్రదానం। కర్మయోగః కృషిర్వాణిజ్యంచ। ప్రయోగో వైశ్యస్యైవ। సత్ప్రతిగ్రహో విప్రస్యైవ॥ షట్కర్మసహితోవిప్రః కృషికర్మచకారయేదితి పరాశరః॥ షట్కర్మాణియాజనాదీని తైస్సహితోవిప్రః శిశూద్రకైశ్యాద్యైః కృషించకారయేత్। విప్రగ్రహణేనక్షత్రియస్యాప్యభ్యనుజ్ఞాతం॥ క్షత్రియోపి కృషింకృత్వా దేవాన్విప్రాంశ్చపూజయేదితి పరాశరేణోక్తత్వాత్। నచ యజనాదీనాం జీవనహేతుత్వాత్కథమనయాకృష్యేతినాచ్యం। కలౌజీవనపర్యాప్తయాజనాదీనాం దుర్లభత్వాత్॥ యత్తుమనునోక్తం॥ వైశ్యవృత్త్యాపి జీవంస్తు బ్రాహ్మణః క్షత్రియోపివా। హింసాప్రాయాం పరాధీనాం కృషింయత్నేన వర్జయేత్॥ కృషింసాధ్వితిమన్యంతె సా

వృత్తిస్సద్విగర్హితా। భూమిం భూమిశయాంశ్చైవ హంతి కాష్ఠమయోముఖమితి॥ తత్స్వయంకృతాభిప్రాయం। అన్యథామనోస్స్వవచనవిరోధాత్ స్వేనైవహి కృషిరభ్యుపగతా॥ ఉభాభ్యామప్యజీవంస్తు కథం స్యాదితి చేద్భవేత్। కృషిగోరక్షమాస్థాయ సజీవేద్వైశ్యజీవికామితి॥ నను కూర్మపురాణే స్వయం కృషిరభ్యుపగతా॥ స్వయంవాకర్షణంకుర్యాద్వాణిజ్యంవా కుసీదకం। తేనపాపీయసీంవృత్తిం కుసీదంచవివర్జయేదితి తదసత్। అస్యవచనస్య కుసీదనిందాపరత్వాత్। అతఏవ నారదః॥ ఆపత్స్వపిచకష్టాసు బ్రాహ్మణస్య నవార్ధుషికమితి॥ నను బృహస్పతిస్స్వయంకృషిమంగీచకార॥ కుసీదకృషివాణిజ్యం ప్రకుర్వీత స్వయంకృతం। ఆపత్కాలే స్వయంకుర్యాన్నైనసాయుజ్యతేద్విజఇతిబాఢం॥ కారయితురశక్తస్య తత్కర్తృకమాపత్కాలఇతివిశేషితత్వాత్। నను కారయితృత్వమప్యాపద్విషయమేవ అధర్మత్వాత్। విప్రస్య యాజనాదినా క్షత్రియస్య విజయదండాదినాచైవ ముఖ్యజీవనహేతుత్వాత్॥ హారీతస్తు॥ అశక్తస్తు భవేద్రాజా పృథివ్యాః పరిపాలనే। జీవేద్వాపి విశాం వృత్త్యా శూద్రాణాంవా యథాసుఖం॥ కృషిర్భృతిః పాశుపాల్యంసర్వేషాం ననిషిధ్యతఇతి॥ ఏవంతర్హ్యాపత్తారతమ్యేన వ్యవస్థా। విప్రక్షత్రియాణా మల్పాపది కారయితృత్వం అధికాపది కర్తృత్వమితి॥ ద్విజాతేః పరమోధర్మో వచనాని నిబోధత। గృహస్థోద్వివిధోజ్ఞేయస్సాధకశ్చాప్యసాధకః। అధ్యాపనం యాజనంచ పూర్వస్యాహుః ప్రతిగ్రహం। కుసీదకృషివాణిజ్యాః ప్రకుర్వీతస్వయంకృతం। కృషేరభావే వాణిజ్యం తదభావే కుసీదకం। ఆపత్కాల స్స్వయం జ్ఞేయః పూర్వోక్తోముఖ్యఇష్యతే। స్వయంవా కర్షణంకుర్యాద్వాణిజ్యంవాకుసీదకమితికూర్మపురాణే॥ అథవా యుగభేదేన వ్యవస్థాప్యతాం। యుగాంతరేషు కారయితృత్వమాపద్ధర్మః। కలౌ ముఖ్యధర్మః ప్రాధాన్యేనోపక్రమ్య పరాశరేణోక్తత్వాత్॥

కృషావర్జ్యాన్బలీవర్దానాహ॥ క్షుధితం తృషితం శ్రాంతం బలీవర్దంన యోజయేత్। హీనాంగం వ్యాధితం క్లీబం వృషం విప్రోనవాహయేత్॥ క్షుదాదయస్తల్లింగైరవగంతవ్యాః॥ హీనాంగం పాదవికలం। క్లీబం పుంస్త్వరహితం। కీదృశస్తర్హి బలీవర్దః కృషౌ యోజ్యతఇత్యతఆహ॥ స్థిరాంగంవిరుజం తృప్తం సునర్ధం షండవర్జితం। వాహయేద్దివసస్యార్ధం పశ్చాత్స్నానం సమాచరేదితి॥ స్థిరాంగం పాదాదివైకల్యరహితం। నిరుజో వ్యాధిరహితః క్షుత్తృష్ణాభ్యామపీడితః। సునర్ధః అహింసకః తృప్తః దర్పశ్రమరహితఇతి యావత్। షండఇతిభావప్రధానోయం నిర్దేశః। షండత్వవర్జితః। పుంస్త్వోపేతః శక్తఇతి

యావత్। దివసస్యార్ధం యామద్వయం పశ్చాత్స్నానం సమాచరేత్। బలీవర్దాన్ స్నాపయేదిత్యర్థః॥ తథాచహారీతః॥ స్నాపయిత్వానడుహోలంకృత్య బ్రాహ్మణాన్భోజయేత్ వాహనే విశేష అశ్వమేధికే దర్శితః॥ వాహయేద్ధుం కృతేనైవ శాఖయావాసపత్రయా। నదండేన నయస్త్యావా నపాశేనచవా పునః। క్షుత్తృష్ణాశ్రమిణం శాంతం నావాహయేద్వికలేంద్రియం। సుతృప్తిషితు భుంజీయాత్పిబేత్పితేషుచోదకం। అహ్నాపూర్వం ద్వియామంవా ధుర్యాణాం వాహనంస్మృతం। విశ్రామ్యేన్మధ్యభాగేనా భాగేవాంతేయథాసుఖం। యాత్రయాత్వరయానిత్యం సంశ్రమో యత్రవాధ్వని। వాహయేత్తత్ర ధుర్యాంస్తు నసపాపేనలిప్యతే। అన్యథావాహయన్నాజన్మాయుతం యాతిరౌరవం॥ రుధిరం వాహయంస్తేషాం యస్తుమోహాన్నరాధమః। భ్రూణహత్యాసమంపాపం తస్యస్యాత్పాండునందనఇతి॥ కార్యగౌరవాద్భాగవహనేన శ్రాంతాన్ క్షుధితాదీన్బలీవర్దాన్ కఠినతాడనేన కర్మణి పునఃపునఃప్రేరణేనాతీవపీడాంకరిష్యంతీతి తన్నివారణాయ రౌరవాదినరకప్రాప్తిర్భవేదితి భూతదయయాదర్శితం॥

బలీవర్దస్నానానంతరకర్తవ్యమాహ। వ్యాసః॥ జప్యందేవార్చనంహోమంస్వాధ్యాయంచైవమభ్యసేత్। ఏకద్విత్రిచతుర్విప్రాన్భోజయేత్స్నాతకాన్ద్విజః॥ యథాబలీవర్దశ్రాంతికృతదోషాపనయనాయ స్నాపనం ప్రాణ్యుపఘాతదోషాపనోదాయ యథాశక్తి జపహోమస్నాతకాదివిప్రభోజనమాజ్ఞాపితం॥

కృషౌ ఫలితధాన్యస్య వినియోగమాహ॥ స్వయంకృష్టే తదాక్షేత్రే ధాన్యైశ్చ స్వయమార్జితైః। నిర్వపేత్పంచయజ్ఞాంశ్చ క్రతుదీక్షాంచకారయేదితి॥ లబ్ధలాభః పితౄన్దేవాన్బ్రాహ్మణాంశ్చాపి పూజయేత్। తేతృప్తాస్తస్యతద్దోషం శమయంతి నసంశయఇతి కూర్మపురాణే॥ వృక్షాంశ్ఛిత్వా మహీంభిత్వా హత్వాతు క్రిమికీటకాన్। కర్షకః ఖలయజ్ఞేన సర్వపాపైః ప్రముచ్యతఇతినారదః॥ భూమింభిత్వౌషధీశ్ఛిత్వా హత్వా కీటపిపీలికాః। పునంతిఖలయజ్ఞేన కర్షకానాత్రసంశయః॥ యూపోయం విహితోమధ్యే మేదిర్నామహి కర్షకైః। తస్మాదతంద్రితో దద్యాదత్ర ధాన్యాదిదక్షిణాం। యోనదద్యాద్ద్విజాతిభ్యో రాశిమూలముపాగతః। సచోరస్సచపాపిష్ఠో బ్రహ్మఘ్నంతం వినిర్దిశేదితి॥ కర్షకస్య యజ్ఞః ఖలయజ్ఞో నిత్యం కామ్యమితి వచనద్వయబలాదవగమ్యతే। అకరణే ప్రత్యవాయాన్నిత్యత్వం। భేదనాదిజన్యపాపనివర్తకత్వాత్కామ్యత్వం॥ ఖలయజ్ఞస్య నిత్యత్వం శివపురాణే దర్శితం॥ అదత్వా కర్షకో దేవి యస్తుధాన్యం ప్రవేశయేత్। తస్యతృష్ణాభిభూతస్య దేవి పాపం బ్రవీమ్య

హం। దివ్యవర్ష సహస్రంతు దురాత్మా కృషికారకః। మరుదేశేభవేద్వృక్షస్స పుష్పఫలవర్జితః। తస్యాంతేమానుషోభూత్వా కదాచిత్కాలపర్యయాత్। దరిద్రో వ్యాధితో మూర్ఖః కులహీనశ్చ జాయతఇతి॥ దీనాంధకృపణపంగ్వాది పోషణార్థమాన్యశంసోక్తిరితి జ్ఞేయం॥

దాతవ్యస్య ధాన్యస్యపరిమాణమాహ॥ రాజ్ఞే దత్వాతు షడ్భాగం దేవానాంచైకవింశతిః। త్రింశద్భాగంతు విప్రాణాం కృషిం కుర్వన్నదోషభాగితి- శ్రీమహాభారతే శాంతిపర్వణిచ॥ షణ్ణామేకాం పిబేద్ధేనుం శతాచ్చమిథునం హరేత్। లబ్ధాచ్చసప్తమం భాగం తథాశృంగే కలాఖురే। సస్యాని సర్వబీజానా మేషసాంవత్సరీభృతిరితి॥ అస్యార్థః॥ షణ్ణాం ధేనూనాం రక్షకో ఏకస్యాః క్షీరం స్వవేతనం హరేత్॥ శతస్యరక్షకో వత్సై ఏకం గోవృషమిథునం వేతనం హరేత్॥ వాణిజ్యేతు లబ్ధాత్ సప్తమం ధనికాద్ధరేత్॥ సస్యానామపి సప్తమ మేవాంశం హరేత్॥ విద్యాశిల్పం భృతిస్సేవా గోరక్షా విపణిః కృషిః। ధృతిర్భైక్షం కుసీదంచ దశజీవన హేతవఇతిమనుః॥ అస్యార్థః॥ ఆపత్ప్రకరణా జ్జీవన హేతవఇతినిర్దేశాత్ ఏషాంమధ్యే యయావృత్త్యా యస్యానాపదిన జీవనం తస్యాపద్యభ్యనుజ్ఞాయతె యథాబ్రాహ్మణస్య భవతి సేవాది ఏవం శిల్పాదావపి జ్ఞేయం। విద్యా వేదవిద్యావ్యతిరిక్తా వైద్యతర్కవిషాపనయనాది విద్యా సర్వేషామాపది జీవనార్థం నదూష్యతి। శిల్పం గ్రంథయుక్త్యాదికరణం। భృతిః ప్రేష్యభావేన వేతనగ్రహణం। సేవా- పరాజ్ఞాసంపాదనం। గోరక్షా- పశుపాల్యం। విపణిః- వణిజ్యా। కృషిః- స్వయంకృతా। ధృతిః- సంతోషః తస్మిన్సది అల్పకేనాపి జీవ్యతే। భైక్షం- భిక్షాసమూహః। కుసీదం- వృద్ధ్యా ధనప్రయోగః స్వయంకృతోపి ఇత్యేభిః దశభిరాపది జీవనీయం॥ ఆపత్ప్రతీకారార్థం కృషి కుసీద భృత్యాదయోపి ధర్మత్వేనోక్తత్వాత్సర్వమనవద్య మితి వేద్యం॥

చాతుర్వర్ణ్యమునకు పద్వృత్తికథనము- కృషియును.

ఇటుపైనియాపద్వృత్తిని జెప్పుచున్నారము. దరిద్రుడై బ్రాహ్మణాది నాల్గువర్ణములవలనను బ్రతిగ్రహించవలయునని శంఖుడీశ్లోకమందు బ్రాహ్మణశబ్దగ్రహణమాపదయందాచారహీనులగుబ్రాహ్మణులవలనను బ్రతిగ్రహించవచ్చునని తాత్పర్యము.

అయాచితమైనను పాషండపతిత శత్రువులవలన గ్రహించరాదు. వీరలకంటె నితరులెట్టివారైన నయాచితముగ నిచ్చిన గ్రహించవచ్చును. క్షత్రియాదులకు యుద్ధాద్యార్జనోపాయములు గౌతములచే జెప్పబడెను. సప్త

బంధదాయము- క్రయము- అప్రతిబంధదాయము- పరిగ్రహము- నిధ్యాది ప్రాప్తి వీటియందున బురుషుడధికారి యగును.

ఇందున బ్రాహ్మణునకు ప్రతిగ్రహలబ్ధమధికము- క్షత్రియునకు విజయలబ్ధమధికము- వైశ్యశూద్రులకు గోపాలన భృతి సేవా భృతులవలన లబ్ధమధికము- మనువు నిటుల జెప్పెను.

సత్కర్మసహితుడగు బ్రాహ్మణుడాపదయందు కృషిని జేయించవలయునని బరాశరులు. షట్కర్మములనగా యజనాదులివిగలుగు బ్రాహ్మణుడు తుశూద్రషకులగు శూద్రులచే కృషిని జేయించవలయును. విప్రగ్రహణముచే క్షత్రియులకు ననుజ్ఞ జేయబడెను. క్షత్రియులును కృషిచే ధనమార్జించి బ్రాహ్మణులను బూజించవలెనని బరాశరులు.

యాజనాదిజీవనోపాయముగల బ్రాహ్మణునకు కృష్యనుజ్ఞ యెటుల జేయబడెననిన కలియందు జీవనపర్యాప్తయాజనాదికము దుర్లభమగుటవలన కృషికనుజ్ఞ జేయబడెను.

బ్రాహ్మణుడైనను, క్షత్రియుడైనను వైశ్యవృత్తిచేతను జీవించినను హింసాప్రాయమును పరాధీనమునగు కృషిని యత్నముతో విడువదగుననియును, నాగలిముఖమందుండు నక్కు భూమిని పెల్లగించి దానియందుండు కీటపిపీలికాదులను జంపును గాన కృషియోగ్యముగాదీవృత్తి సత్పురుషులచే నిందించబడినదనియును మనువుగారిచే నిషేధించబడె నిది స్వయంకృత కృషివిషయముగాని శూద్రులచే జేయించగూడదనిగాదటులైతే ఋతామృతములచే జీవించలేనివాడెట్లు జీవించవలెననిన కృషి గోరక్షణలను జేసి వైశ్యవృత్తిచేతను జీవించుమని మనువుగారు తిరుగ నాజ్ఞాపించిరి. ఓయీ కూర్మపురాణమున కృషి స్వయముజేయుటకంగీకరించబడినదిగదా- స్వయమె హాలకర్మమునైనను వాణిజ్యమైనను జేయుదగునుగాని విశేషపాపజనకమైన వృద్ధిజీవనము విడువవలెనని అదిమంచిదికాదు- ఈవచనము వృద్ధిజీవననిందాపరమైనదౌటవలన- నదిగాననే నారదులు కష్టమగు నాపదయందును బ్రాహ్మణునకు వృద్ధ్యుపజీవనము గూడదనిరి.

ఓయీ బృహస్పతి స్వయంకృషి నంగీకరించెను. వృద్ధియును, కృషియును, వాణిజ్యము నాపత్కాలమందు స్వయముగ జేసినను పాపయుక్తుడు గాడని యంగీకరించబడెను.

కృషినొనర్చుటకశక్తుడగువానికి నాపత్కాలమందు స్వయముగజేయుటకు విశేషానుజ్ఞ జేయబడెను. ఓయీ కృషిని జేయించుటయు నధర్మమగుటవ

లన నాపద్విషయమె బ్రాహ్మణునకు యాజనాదికమును, క్షత్రియునకు విజ యదండాదికమునుజీవన హేతువులగుటవలన- హారీతుడైతే భూపరిపాలనమం దశక్తుడగురాజు వైశ్యశూద్రవృత్తులచే యథాసుఖముగ జీవించవలయునని యును కృషియును, భృతియును పశుపాలనము నందరికి నాపత్కాలమందు నిషేధించబడదనియును జెప్పెను.

ఇటులైతే ఆపదతారతమ్యముచేత బ్రాహ్మణక్షత్రియులకు వ్యవస్థ జే యబడె నెటులనిన యల్పాపదయందు కృష్యాదికమును జేయించుటయును, అ ధికాపదయందున జేయుటయునని దెలియదగును.

బ్రాహ్మణజాతికి పరమధర్మమును దెలియజేయు వచనములనువినుడు.

గృహస్థు రెండుప్రకారములు సాధకుడనియు నసాధకుడనియు- అ ధ్యాపనము, యాజనము, ప్రతిగ్రహమును, సాధకునకును- స్వయముజేయువృ ద్ధియును, కృషివాణిజ్యములు, కృష్యభావమందు వాణిజ్యమును తదభావమం దు వృద్ధ్యుపజీవనమాపత్కాలమందిటులపూర్వపూర్వము ముఖ్యమని యసాధ కునకు జెప్పబడెను.

స్వయముగ కృషియైనను వాణిజ్యమైనను వృద్ధియైనను జేయవచ్చునని కూర్మపురాణము. ఇటులగాకయున్న యుగభేదముచేతనైన వ్యవస్థజేయ వచ్చును.

యుగాంతరములయందాపదలో కృష్యాదికము నితరులచే జేయించు టయును కలియుగమున స్వయముజేయుటయునని బరాశరులవారిచే కృషిప్ర ధానముగ జెప్పబడెను.

కృషియందు విడువదగు వృషభములను జెప్పుచున్నారము. క్షుత్పిపా సలయలయికనును, హీనమగుపాదములుగలదియు, రోగముతోనున్నయదియు, పుంస్త్వములేనిదియును దున్నరాను. ఎట్టివృషభములను కృషియందుంచవలెన నిరేని జెప్పుదుము. దృఢావయవములుగలిగి రోగములేక నీరుద్రావి మేతమేసి నవియు, రంకెలువేయుచు పుంస్త్వముగలిగినవియును రెండుయామములమట్టు కు దున్నవలెను. తరువాత వాటిని గడిగి యలంకరించి నిత్యశ్రాద్ధనిమంత్రితా ధిబ్రాహ్మణభోజనమును జేయించవలయునని హారీతులు.

హుంకారముజేయుచు గాని ఆకులతోనున్న జువ్వతోనైనశాశించిదున్న వలెగాని కర్రతో కొట్టి మునకాలుతో పొడచి త్రాడుతో త్రాసమొనర్చియు ను దున్నరాదు.

క్షుత్పిపాసలచేతను శ్రమనొందినది యలసినదియు నింద్రియహీనమై నదియును దున్నరాదు. ఎద్దులకు మేతవేసి నీరులు డాగించిన దరువాతను దా ను భుజించి పిపాసయును దీర్చుకొనవలెను. పగటి రెండుయామములమట్టుకే దున్నవలెను. మధ్యాహ్నమందైనను సాయాహ్నమందైనను మరల బనిజేయిం చకవిడువదగును.

త్వరితముగజేయుయాత్రకొరకు బండిని బూన్చిన బలీవర్దముల రెండు పూటలనడపించినను పాపమొందదు. అటులగాక రెండుపూటలను వహింపజే సిన రౌరవనరకమునకు వెళ్లును. వృషభములకు రక్తస్రావమగునట్లు కొట్టి వ హింపజేసిన భ్రూణహత్యతో సమమగు పాపము నొందునని యాశ్వమేధిక పర్వము.

క్షుత్పిపాసలుగలిగి శ్రమనొందినవృషభములను గార్యగౌరవముచే క ఠినమగు దెబ్బలవలన తిరిగిగిరిగి విశేషముగ పీడించుదురని దానినివారించుటకు రౌరవాదినరకప్రాప్తివారలకగునని భూతదయచే భయము గనబరచబడెను.

వ్యాసులవారు వృషభములను గడిగినతరువాతకృత్యమును జెప్పిరి. జ పము, దేవార్చనము, హోమము, స్వాధ్యాయపఠనము, ఒక రిద్దరిని ముగ్గురి నిగాని స్నాతకులగు బ్రాహ్మణులను భుజింపజేయుదగు. బ్రాహ్మణుడు వృష భములవలయికనొందించిన దోషనివారణకొరకు వాటినికడిగి సుఖింపజేయుమ నుట. భూమిని దున్నుటచే జచ్చు కీటపిపీలికాదులవలనవచ్చుపాపనివారణకు ద నశక్తికొలది జపహోమవిప్రభోజనాదికమాజ్ఞాపించబడెను.

ఇటులజేయు కృషిచే ఫలించిన ధాన్యమునకు వినియోగమును జెప్పు చున్నారము. తాము స్వయమును గృషియొనర్చి పండించినధాన్యమువలన పం చయజ్ఞములను క్రతుదీక్షను జేయదగును. పొందబడినయధికలాభముగలవాడు పితృదేవతలను బ్రాహ్మణులను బూజింపవలెను. వీరలు తృప్తులై కృషికృత జంతుహింసాదోషమును వారింతురని కూర్మపురాణము.

వృక్షములనుగొట్టి భూమిని భేదించి క్రిమికీటాదులను జంపిన కర్షకుడు కళ్లమందగు యజ్ఞమున సకలపాపములచే విడువబడునని కూర్మపురాణము. నారదస్మృతియు నిటులుండెను.

దున్నువారికి నాగలిమధ్యనుండు మేడి యూపమని జెప్పబడుచున్నది. అ దికారణముచే ధాన్యాదిదక్షిణను జాగరూకుడగుచు నివ్వవలెను. పండించిరా

శిబోసినవానివద్దికి వచ్చిన బ్రాహ్మణులకెవడివ్వడో వాడు చోరతుల్యుడును పాపిష్ఠుడు బ్రహ్మఘ్నుడునని దెలియదగును.

కర్షకునియజ్ఞము ఖలయజ్ఞమనబడు నేదిగున వ్రాసిన వచనద్వయమువలన నీయజ్ఞము నిత్యకామ్యకర్మగా దెలియబడుచున్నది. ఖలయజ్ఞము నిత్యమని శివపురాణమున జూపించబడెను. పండించిన ధాన్యమెవరికినివ్వక నత్యాశచే దనగృహమున నెవ్వడుబోసునో వాని పాపమును జెప్పెదమని యీశానుడు పార్వతికి నానతిచ్చెను.

దురాత్ముడగు నాకృషికారకుడు నిర్జలస్థలమున పుష్పఫలశూన్యవృక్షమై దివ్యవర్షసహస్రముండి యటుపై కాలక్రమమువలన దరిద్రుడును మూర్ఖుడు వ్యాధియుక్తుడు కులహీనుడునగు మనుజుడై బుట్టును.

ఇటులనుట దీనులు, గుడ్డివాళ్లు, చొట్టవాళ్లు, దరిద్రులు మొదలగువారిపోషణకొరకు దయచేసెనని దెలియుదగును.

ఇవ్వదగిన ధాన్యపరిమాణమును జెప్పుచున్నారము. రాజుకారవపాలు, దేవతలకిరువదియొకపాలు, ముప్పదింటనొకపాలు బ్రాహ్మణులకును వినియోగమొనర్చి మిగిలినది దనకుటుంబాది నిమిత్త ముపయోగింపజేయువాడు కృషిజేసి పాపమొందడని కూర్మపురాణము.

ఆరావుల సంరక్షించువానికొకధేనువుపాలును, నూరావులనుంగాచిన గాపుకొకవత్సరమునకొక గోవృషమిథునమును జీతముకొరకివ్వదగుననియును- వాణిజ్యమొకనిచే జేయించునపుడు వచ్చినలాభములో నారునొకపాలు ధని వానికివ్వవలెననియును- అటులనె కృషినిజేయు పాలికాపులకును బండించిన పంటలో నారునొకభాగమె సంవత్సరజీతమనియును శ్రీమహాభారతమందలి శాంతిపర్వమున.

వేదవిద్యకంటె నితరమగు వైద్యతర్క-విషనివారకవిద్యలు సకలవర్ణములకు నాపదయందు జీవికకుపయోగింపజేసుటచే పాపమొందరు. గ్రంథములచ్చుగూర్చుట, కవిత్వమొనర్చుట మొదలగు శిల్పమువలన- రాజుమొదలైనవారినాశ్రయించి వేతనమును బుచ్చికొనుటచే-నితరులాజ్ఞను చలాయించి జీవించుట- పశుసంరక్షణజేసి- వర్తకమొనర్చి- స్వయముజేసినకృషివలన- యథాలాభసంతుష్టినొంది- భిక్షువలన- వృద్ధ్యుపజీవనమువలన నీదశవిధవృత్తులచే నాపదయందు జీవించవలెను.

ఇందునొకదానిచే జీవనముగాకుండిన రెండవవృత్తి నవలంబించదగున

నిమనువు. ఆపన్నివారణకొరకు కృషికుసీద భృత్యాదుల నవలంభించుట ధర్మ మని జెప్పుటవలన పైగ్రంధమంతయు దోషరహితమని దెలియవలయును.

పంచయజ్ఞ విధిః.

అథ మధ్యందినకృత్యం॥ తన్మధ్యాహ్నసంధ్యావిధిశ్చ ప్రాగేవోక్తః॥

అథాహరహఃకర్తవ్య పంచమహాయజ్ఞవిధి రుచ్యతే॥ తేషాం స్వరూపమాహ గృహ్యకారః॥ అథాతః పంచయజ్ఞాః। బ్రహ్మయజ్ఞో దేవయజ్ఞో భూతయజ్ఞో పితృయజ్ఞో మనుష్యయజ్ఞశ్చేతి॥ యత్స్వాధ్యాయమధీతే స బ్రహ్మయజ్ఞః। యదగ్నౌ జుహోతి స దేవయజ్ఞః। యద్బలింకరోతి సభూతయజ్ఞః। యత్పితృభ్యోదదాతి స పితృయజ్ఞః। యన్మనుష్యేభ్యో దదాతి స మనుష్యయజ్ఞః। తానేతాన్యజ్ఞానహరహః కుర్వీతేతి॥

యజదేవపూజాసంగతికరణదానేషు-మహాఫలయజ్ఞత్వాన్మహాయజ్ఞాః పంచచతే మహాయజ్ఞాః పంచమహాయజ్ఞాః॥ అధ్యాపనం బ్రహ్మయజ్ఞఇతి కాత్యాయనేనోక్తత్వాద్వ్యాజనం। ప్రతిగ్రహాధ్యాపనోపయోగి స్వాధ్యాయావిస్మరణం దృష్టఫలం॥ స్వాధ్యాయేనార్చయేదృషీనితి మనూక్తమదృష్టఫలం॥

ప్రత్యహం వైశ్వదేవేన స్థావరజంగమరూపవిషాన్నప్రమాద్యైరన్నితి దృష్టఫలం॥ భోజ్యమన్నం పరీక్షార్థం ప్రదద్యాత్పూర్వ మగ్నయె। వయోభ్యశ్చ తతోదద్యాత్తతోలింగాని లక్షయేత్॥ ధూమార్చిర్నీలతావహ్నే శ్శబ్దస్ఫోటశ్చ జాయతే। అన్నేనవిషదిగ్ధేన వయసాం మరణంధ్రువమితి కామందకోక్తం ద్రష్టవ్యం॥

వైశ్వదేవస్తుకర్తవ్యః పంచసూనాపనుత్తయఇతి శాతాతపః॥ పంచసూనాస్తు॥ ఖండనీపేషణీ చుల్లీ ఉదకుంభీవ మార్జనీ। పంచసూనా గృహస్థస్య తాభిస్స్వర్గంనవిందతి॥ హోమైర్దేవాన్యథావిధీతిమనుః॥ పంచసూనాపనోదన దేవతాప్రీతిరదృష్టఫలం॥

పంచయజ్ఞవిధానము.

రాజధర్మానంతరమున మధ్యాహ్నకాలకృత్యమును జెప్పుచున్నారము. మాధ్యాహ్నికసంధ్యావిధి పూర్వమె జెప్పబడెను. ఇటుపైని ప్రతిదినముజేయదగు పంచమహాయజ్ఞవిధి జెప్పబడును. స్వాధ్యాయాధ్యయనము బ్రహ్మయజ్ఞమనియు, అగ్నియందున హోమమొనర్చునది దేవయజ్ఞము, బలినిజేజేయునది భూతయజ్ఞమనియు, పితృదేవతలకిచ్చునది పితృయజ్ఞమనియు, మ

నుష్యులకతిథిపూజజేయునది మనుష్యయజ్ఞమనియు నీయైదుయజ్ఞములును ప్రతిదినమొనర్చుమని గృహ్యకారకులు.

అధికఫలమిచ్చు యజ్ఞములౌటవలనమహాయజ్ఞములనబడును. యజధాతువు సంగతియందున సాధనమందున దానమందున వర్తించును. ఐదగు మహాయజ్ఞములౌటచేత పంచమహాయజ్ఞములనబడును. అధ్యాపనము బ్రహ్మయజ్ఞమని కాత్యాయనులు జెప్పుటవలన యాజనాధ్యాపనప్రతిగ్రహములకుపయోగమగు స్వాధ్యాయమును మరచిపోకుండుట దృష్టఫలము- స్వాధ్యాయముచే ఋషులనర్చించవలెనని మనువుజెప్పినది యదృష్టఫలము.

స్థావరజంగమరూపవిషమువలన ప్రమాదమును బొందకపోయెదరని వైశ్వదేవము దృష్టఫలముకొరకును జెప్పబడినది. ముందగ్నిలో భోజనమునర్చేడి పదార్థమును హోమముజేయవలెను. ధూమముగ జ్వాలలగబడి యగ్ని నల్లనిరంగుగలదై పెళపెళశబ్దములు బుట్టిన విషాన్నమనిగ్రహించదగుననియును, బలిహరణముకొరకు పక్షులకు వేసినయన్నమును దిని యవిజచ్చిన విషాన్నమని గ్రహించదగునని కామందకమందున జెప్పబడినది దానిజూడదగును.

కూరనుగోయుటచే నిళ్లుమొదలగునవి యలకుటచే పొయిలో కర్రలను గాల్చుటచే ఉదకములో- తుడుచుటచే కీటపిపీలికాదులు జచ్చును గాన యది పంచసూనమను దోషము గృహస్థునొందు- నందుచే స్వర్గమొందడనియు నీపంచసూనదోషనివారణకు వైశ్వదేవమును జేయవలయుననియును శాతాతపులు. విధినతిక్రమించక హోమముచేత దేవతులనారాధించుమని మనువు. పంచసూనదోషనివారణయును, దేవతాప్రీతియు నదృష్టఫలము.

బలిహరణప్రకారః

బలిహరణప్రకారమాహ శౌనకః॥ అథబలిహరణమేతాశ్చైవ కేవలాభ్యోద్భ్య ఓషధివనస్పతిభ్యో గృహాయ గృహదేవతాభ్యో వాస్తుదేవతాభ్యః ఇంద్రాయ ఇంద్రపురుషేభ్యో యమాయ యమపురుషేభ్యో వరుణాయ వరుణపురుషేభ్య స్సోమాయ సోమపురుషేభ్య ఇతి బ్రహ్మణే బ్రహ్మపురుషేభ్య ఇతి ప్రతిదిశం వాస్తుదేవతాభ్య ఇతి దివానక్తంసంచారిభ్యనక్తంరక్షోభ్య ఇత్యుత్తరతః। స్వధాపితృభ్య ఇతి ప్రాచీనావీతి శేషందక్షిణాయాందిశి నినయేదితి॥ దేవామనుష్యాః పశవోవయాంసి సిద్ధాస్సయక్షోరగదైత్యసంఘాః। ప్రేతాఃపిశాచాస్తరవ స్సమస్తా యేచాన్నమిచ్ఛంతి మయాప్రదత్తం॥ పిపీలికాః కీటపతంగకాద్యా బుభుక్షితాః కర్మనిబంధబద్ధాః। ప్రయాంతుతే తృప్తిమిదం

మయాన్నం తేభ్యోనివిష్టం సుఖినోభవంతు॥ యేషాం నమాతా నపితా నబంధుర్నైవాన్యసిద్ధిర్నతదాన్నమస్తి। తత్తృప్తయేన్నం భువిదత్తమేతత్తేయాంతు తృప్తిం ముదితాభవంతు॥ భూతానిసర్వాణి తథాన్నమేతద్దేహంచ విష్ణుర్నతతోన్యదస్తి। తస్మాదిదం భూతహితాయ భూమావన్నం ప్రయచ్ఛామి భవాయతేషాం॥ చతుర్దశాలోకగణా యఏష తత్రస్థితా యేఖిలభూతసంఘాః। తృప్త్యర్థమన్నంహి మయావిసృష్టం తేషామిదం తే ముదితా భవంతు॥ ఇత్యుచ్చార్య నరోదద్యాదన్నంశ్రద్ధాసమన్వితః। భువిభూతోపకారాయ గృహీ సర్వాశ్రయోయత ఇతివిష్ణుపురాణే॥ వైశ్వదేవ ప్రకరణోదాహృతార్థ శాస్త్రీయ విషాన్నజ్ఞానార్థమాదౌ కాకాదిబలినా దృష్టఫలజనకమపి దృశ్యతే॥ వాస్తుదిక్పత్యాదయో దేవాశ్చ సర్వే భూతగణాస్తృప్తింగతాస్సంతోగృహిణం శ్రేయోభిముఖం కుర్వంతీత్యదృష్టఫలజనకంచ బ్రూమః॥

## బలిహరణ ప్రకారము.

శౌనకులవారు బలిహరణప్రకారమును జెప్పుచున్నారు. కేవలోదకములకొరకు, సముద్రముకొరకు, ఓషధులకొరకు, వనస్పతులకొరకు, గృహములకొరకు, గృహదేవతలకొరకు, వాస్తుదేవతలకొరకు, ఇంద్రునికొరకు, నింద్రపురుషులకొరకు, యమునికొరకు, యమపురుషులకొరకు, వరుణునికొరకు, వరుణపురుషులకొరకు, సోమునికొరకు, సోమపురుషులకొరకు, బ్రహ్మకొరకు, బ్రహ్మపురుషులకొరకు, ప్రతిదిక్కునను న్న వాస్తుదేవతలకొరకు, పగటియందున రాత్రిచరించుదేవతలకొరకు, నటుపైని రాత్రిచరులగు రాక్షసులకొరకని ప్రాచీనావీతి గా స్వధాకారముతో పితృదేవతలకొరకు బలులనిచ్చి శేషమును దక్షిణదిశయందున వేయవలయును.

దేవతలు, సిద్ధులు, మనుష్యులు, పశువులు, పక్షులు, యక్షులు, సర్పములు, దైత్యులు, ప్రేతలు, పిశాచములు, కీటములు, ఎగురుచుండుపురుగులు, వృక్షములు, మొదలగు సర్వజంతువులు కర్మబంధబద్ధులై యాకలితోనుండి యన్నమునుగోరువారలు నాచేనుంచబడిన యన్నమును ననుభవించి తృప్తి నొందవలెనని వచించవలె.

ఇంతియెకాదెవరికితల్లియు, తండ్రియు, బంధువులు నన్నసిద్ధియు లేకున్నదో వారలకు నాచేనీయన్నము భూమియందుంచబడెనని కొంతయన్నముంచి దీనిచేవారలు తృప్తినొందుదురుగాక యనవలె- సర్వభూతములీయన్నము దేహము విష్ణువ్యతిరిక్తములుగావు. గాన భూతహితముకొరకన్నమును భూ

మియందు వాటిసంభవార్థముంచబడెను. పదునాలుగుభువనములందుండుభూతములతృప్తికై నాచేతనన్నముంచబడినవి. సంతుష్టిని భూతములొందుగాకయని యుచ్చరించి మనుష్యుడతిశ్రద్ధతో భూమియందన్నమివ్వవలెను. సర్వభూతములకాశ్రయుడు గృహస్థుడగుటవలనయని విష్ణుపురాణము.

వైశ్వదేవప్రకరణమునందుదాహరించిన యర్థశాస్త్రీయవిషాన్నమును దెలసికొనుటకు మొదట కాకబలిచేతను దృష్టఫలోత్పత్తికనబడుచున్నది. వాస్తుపురుషుడు దిక్పతులు మొదలగు దేవతలును సర్వభూతగణములును తృప్తినొందినవారలై గృహస్థుని శ్రేయమునకభిముఖునిజేతురని యదృష్టఫలోత్పత్తియును జెప్పుదుము.

## నిత్యశ్రాద్ధవిధిః

ఏకంతుభోజయేద్విప్రం పితౄనుద్దిశ్యచోత్తమః । నిత్యశ్రాద్ధం తదుద్దిష్టం పితృయజ్ఞోగతిప్రదఇతి కూర్మపురాణే॥ నిత్యంతావత్ప్రవక్ష్యామి అర్ఘ్యావాహనవర్జితం। అదైవంతద్విజానీయాత్పార్వణె తద్ధికీర్తితమితిమత్స్యపురాణె॥ నిత్యశ్రాద్ధేషు గంధాద్యైర్ద్విజానభ్యర్చ్య శక్తితః। సర్వాన్పితృగణాన్సమ్యక్సహైవోద్దిశ్య భోజయేత్। ఆవాహనస్వధాకారపిండాగ్నౌకరణాదికం। బ్రహ్మచర్యాదినియమో విశ్వేదేవాస్తథైవచ। నిత్యశ్రాద్ధే త్యజేదేతా న్భోజ్యమన్నం ప్రకల్పయేత్। దత్వాతు దక్షిణాం శక్త్యా నమస్కారైర్విసర్జయేదితి ప్రచేతాః॥ శ్రద్ధయాదీయతే అనేనేతి శ్రాద్ధం। నిత్యమహరహఃకర్తవ్యశ్రాద్ధంనిత్యశ్రాద్ధమిత్యుచ్యతె॥ నను నిత్యనైమిత్తికకామ్యభేదేన శ్రాద్ధం పిత్రాద్దేశేనావశ్యం పుత్రాద్యైః కర్తవ్యతా మకర్తౄణామధికప్రత్యవాయశ్చ । తత్కర్మణా పితౄణాం స్వర్గాదిప్రాప్తి స్తృప్తిశ్చ । కర్తౄణా మైశ్వర్యారోగ్యపుత్రపౌత్రస్వర్గాదిగతిశ్చాజ్ఞాపయంతి శ్రుతిస్మృతిపురాణేతిహాసాః॥ పితృపితామహప్రపితామహాదయః ప్రాప్తస్వీకశుభాశుభకర్మవశేన స్వర్గనరకౌప్రాప్నువంతి వసురుద్రాదిత్యరూపాన్ తానుద్దిశ్య పుత్రాదిభిర్బ్రాహ్మణానామంత్ర్య దత్తైరన్నపానవస్త్రహిరణ్యాద్యైర్బ్రాహ్మణాఏవ తృప్యంతి నపితాదయో నవసురుద్రాదిత్యాః। అస్తు సంభవేపి స్వయమనీశానాః కథంస్వర్గాదిఫలం తదాచరితానాం ప్రయచ్ఛంతీత్యాశంక్య తన్నిరాకరణపటూని వచనాని వదామః। ఏవంవిద్వాన్పితౄన్యజతె వసవో రుద్రా ఆదిత్యాశ్చాస్యప్రీతాభవంతీతి పైఠీనసిః। నహ్యత్ర దేవదత్తాదయఏవ శ్రాద్ధకర్మణి సంప్రదానభూ

తాః పిత్రాదిశబ్దైరుచ్యంతే। కింత్వధిష్ఠాతృవస్వాదిదేవతా సహితాఏవ యథా దేవదత్తాదిశబ్దైర్న శరీరమాత్రం। నాప్యాత్మమాత్రం। కింతు శరీరవిశిష్టా ఆత్మాన ఉచ్యంతే। ఏవమధిష్ఠానసహితాఏవ దేవదత్తాదయః పిత్రాదిశబ్దైరుచ్యంతే అతశ్చాధిష్ఠాతృదేవతా వస్వాదయః పుత్రాదిభిర్దత్తేనాన్నపానాదినా తృప్తాస్సంతా స్తానపి దేవదత్తాదీంస్తర్పయంతి కర్తౄంశ్చ పుత్రాదీన్ఫలేనసంయోజయంతి యదామాతా గర్భపోషణాయాన్యదత్తేన దౌహృదాన్నపానాదినా స్వయముపభుక్తేనతృప్తాసతీ స్వజఠర పితరగత మపత్యం తర్పయతి దౌహృదాన్నాదిప్రదాయినశ్చ ప్రత్యుపకారఫలేన సంయోజయతి తద్వద్వసవో రుద్రా అదితిసుతా ఆదిత్యా ఏతేపితరః పితృ పితామహ శబ్దవాచ్యా నకేవలం దేవదత్తాదయఏవ శ్రాద్ధదేవతాః శ్రాద్ధకర్మణిసంప్రదానభూతాః కింతు మనుష్యాణాం పితౄన్దేవదత్తాదీన్స్వయం శ్రాద్ధేన తర్పితాస్తర్పయంతి జ్ఞానతృప్త్యాతిశయయోగేన కించ నకేవలం పితౄం స్తర్పయంతి అపితు శ్రాద్ధకారిభ్య ఆయుఃప్రజాంధనంవిద్యాం స్వర్గంమోక్షంరాజ్యం సుఖాని స్వయం ప్రీతాః పితామహాః వస్వాదయః ప్రయచ్ఛంతి। తథాచ యాజ్ఞవల్క్యః॥ వసురుద్రాదితిసుతాః పితరశ్శ్రాద్ధదేవతాః। ప్రీణయంతి మనుష్యాణాం పితౄన్ఛ్రాద్ధేన తర్పితాః॥ ఆయుఃప్రజాంధనంవిద్యాం స్వర్గం మోక్షం సుఖానిచ। ప్రయచ్ఛంతి తథారాజ్యం నృణాంప్రీతాపితామహాః॥ దేవోయది పితాజాతశ్శుభకర్మానుయోగతః। తస్యాన్నమమృతంభూత్వా దేవత్వేప్యనుగచ్ఛతి। మర్త్యత్వేభోజ్యరూపేణ పశుత్వేచ తృణంభవేత్। శ్రాద్ధాన్నం వాయురూపేణ నాగత్వేతూపతిష్ఠతి। పానంభవతి యక్షత్వే గృధ్రత్వేచ తథామిషం। దనుజత్వే తథామాంసం ప్రేతత్వే రుధిరోదకం । మానుషత్వేన్నపానాది నానాభోగకరం తథేత్యాదిత్యపురాణే॥

నిమంత్రితబ్రాహ్మణేషు నిజపిత్రాదయోవసురుద్రాదిత్యరూపేణానాహ్యా ధ్యేయాః తేన సర్వాంతర్యామీ పితృరూపీ శ్రీజనార్దనః ప్రీతస్సన్ప్రియచ్ఛతి ఫలం పూర్వోక్త మదృష్టమితి నిర్దిష్టం శ్రుతిస్మృతిమతేన నిర్దుష్టం కృతం నాస్తికమతావలంబినాం దురుక్తిజ సంశయం సదుక్తిప్రత్యక్షప్రమాణానుమానైః॥

## నిత్యశ్రాద్ధవిధానము.

పితృదేవతలనుద్దేశించి యొకబ్రాహ్మణునకు నిత్యమును భోజనమును

జేయించుట నిత్యశ్రాద్ధమని జెప్పబడును. పితృయజ్ఞము గతినిగలిగించునని కూ
ర్మపురాణము.

నిత్యశ్రాద్ధమునకు అర్ఘ్యావాహనములు వసురుద్రాదిత్య దేవతలను జె
ప్పుటయునుబనిలేదు. పార్వణమందన్నియును గలుగవలెననిమత్స్యపురాణము.

నిత్యశ్రాద్ధమందున గంధపుష్పాదులచేతను దనశక్తికొలది సకలపితృగ
ణములనుద్దేశించి బ్రాహ్మణభోజనమొనర్చదగును. ఆవాహనము, స్వధాకా
రము, అగ్నౌకరణము, పిండదానము, బ్రహ్మచర్యముమొదలగు నియమము వి
శ్వేదేవారాధనయును, నిత్యశ్రాద్ధమున విసర్జించి భోజనార్హవస్తువులచే భు
జింపజేయవలెను. యథాశక్తి దక్షిణనిచ్చి నమస్కరించి బ్రాహ్మణుని బం
పించవలెనని ప్రచేతసులు.

శ్రద్ధచేనిచ్చునది గాన శ్రాద్ధమనబడును. నిత్యము ప్రతిదినమొనర్చదగు
శ్రాద్ధము నిత్యశ్రాద్ధమనిజెప్పబడును.

ఓయీ నిత్యనైమిత్తికకామ్యభేదముచేతను శ్రాద్ధమును పితృదేవతలను
ద్దేశించి పుత్రాదులచేతను జేయవలెనని జేయనివారికధికప్రత్యవాయమనియు
నాకర్మచే పితృదేవతలకు స్వర్గాదిలోకప్రాప్తియు తృప్తియు శ్రాద్ధకర్తలకు
నైశ్వర్యారోగ్యపుత్రపౌత్రస్వర్గాదికప్రాప్తియును శ్రుతిస్మృతిపురాణేతిహా
సములాజ్ఞాపించుచున్నవి.

తండ్రి, తాత, తాతతండ్రియు మొదలగువారు ప్రత్యేకము వారుజే
యు శుభాశుభకర్మలననుసరించి స్వర్గనరకములొందుదురు. వసురుద్రాదిత్య
రూపులగు పితృపితామహప్రపితామహులనుద్దేశించి బ్రాహ్మణులను బిలచి
పుత్రాదులచే వారికిచ్చు నన్నపానవస్త్రధనములచే బ్రాహ్మణులుమాత్రమే
తృప్తినొందుదురు గాని పితృపితామహప్రపితామహాదులుగాని వసురుద్రాది
త్యదేవతలుగాని తృప్తినొందరు. ఒకవేళ వారలకు తృప్తి సంభవించినను తా
ము స్వయమె స్వర్గాదిలోకములొందుటకు తృప్తులగుటకు నశక్తులగుటచేత త
మ్మునుద్దేశించి కర్మమును జేయువారలకు స్వయమెటుల పుత్రపౌత్రారోగ్యై
శ్వర్యస్వర్గాదికమివ్వగలరని శంకించి యాశంకను నివారించుటకు తగినవచన
ములను జెప్పుచున్నారము.

పూర్వోక్తమగు పితృదేవతలను బూజించినవారలకు వసురుద్రాదిత్యు
లు ప్రసన్నులగుదురని పైఠీనసులు.

ఈశ్రాద్ధకర్మమునందు పితృపితామహప్రపితామహాదులుమాత్రమే ము

ఖ్యులు గారు. ఇక నేమనిన వారలకధిష్ఠాతలగు వసురుద్రాదిత్య దేవతలతో గూడి యున్నవారలు ముఖ్యులు. ఎటులనిన పితృపితామహప్రపితామహ శబ్దములచే తను శరీరమాత్రము, ఆత్మమాత్రమును గాదు. మరియేమనిన శరీరములతో గూడిన యాత్మలకు జెప్పబడును. ఈప్రకారముగానే అధిష్ఠాన దేవతలగు వసురుద్రాదిత్యులతో గూడిన పితృపితామహ ప్రపితామహాదులు పితృశబ్దముచేతను జెప్పబడుదురు. అదిహేతువుచేతను పితృపితామహప్రపితామహాదుల కధిష్ఠాతృదేవతలగు వసురుద్రాదిత్యులు పుత్రాదులచే నివ్వబడిన యన్నపానాదికముచేతను తృప్తులైనవారై పితృపితామహప్రపితామహాదులను తృప్తి నొందింతురు. కర్తలగు పుత్రాదులకుగూడ నిహాముత్రఫలమునిచ్చెదరు. ఎటులనిన తల్లి గర్భిణియగునపుడు బంధుసుహృజ్జనులచే నివ్వబడిన యన్నపానాదిక మనుభవించి తానుతృప్తినొంది దనగర్భస్థజంతువునకును గూడ తృప్తినిజేయును. గర్భిణియగు తనకు నన్నాదులనిచ్చినవారలకు ప్రత్యుపకారమును జేయును. ఆలాగుననే వసురుద్రాదిత్యపితృదేవతలు తృప్తినొంది శ్రాద్ధకర్తల పితృపితామహాదులను జ్ఞానతృప్త్యతిశయయోగముచేతను తృప్తినొందించుటయేగాక శ్రాద్ధమునుంబెట్టినవానికినాయువును, సంతానమును, ధనమును, విద్యయును, రాజ్యసుఖమును, స్వర్గమును, మోక్షమునుగూడ నిచ్చెదరని యాజ్ఞవల్క్యులు.

శుభకర్మమును జేసి మృతుడైనతండ్రి దేవత్వమునొందినయడల శ్రాద్ధాన్నమమృతమగును. మనుజుడైబుట్టిన శ్రాద్ధాన్నము భోజ్యపదార్థరూపమై మరియునకేకభోగకరమై, పశుత్వమున తృణమై, సర్పశరీరమొందిన వాయువై, యక్షుడైన పానమై, గద్దైన రాక్షసుడైన మాంసమై, ప్రేతత్వమున రుధిరోదకమై తృప్తులను గావించునని యాదిత్యపురాణము.

నిమంత్రితబ్రాహ్మణులందు శ్రాద్ధకర్త తన పితృపితామహులను వసురుద్రాదిత్యరూపముచేతను ఆవాహనమును జేసి ధ్యానమును జేసినటులైన సర్వాంతర్యామియు పితృరూపియునగు శ్రీజనార్దనులు ప్రసన్నులై పూర్వోద్వాహృతమగు నదృష్టఫలమిచ్చునని శ్రుతిస్మృతిమతముచే నిర్దేశించబడెను.

నాస్తికమతావలంబులయొక్క దుష్టోక్తులచేబుట్టిన సంశయమును సదుక్తులుగల ప్రత్యక్షప్రమాణానుమానములచే దోషరహితమై జేయబడెను.

## దేవపూజావిధిః.

అథాతో పరమపురుషస్యాహరహఃపరిచర్యావిధిం వ్యాఖ్యాస్యామః॥ అథమాధ్యాహ్నికస్నానసంధ్యాబ్రహ్మయజ్ఞతర్పణానంతరమహరహః ప్రతి

దినం పరమపురుషస్య విష్ణోః పరిచర్యావిధి మారాధనప్రకారం క్రియాయోగం వ్యాఖ్యాస్యామః విశేషేణాభిధాస్యామః॥ తదుక్తమాగ్నేయపురాణే॥ అర్చనం సంప్రవక్ష్యామి విష్ణోరమితతేజసః। యత్కృత్వా మునయస్సర్వే పరం నిర్వాణమాప్నుయుః॥ అప్స్వగ్నౌ హృదయే సూర్యే స్థండిలే ప్రతిమాసు చ। ఏష్వేతేషు హరేస్సమ్యగర్చనం మునిభిస్స్మృతం॥ అగ్నౌ క్రియావతాం దేవో దివా దేవో మనీషిణాం। ప్రతిమాస్వల్పబుద్ధీనాం యోగినాం హృదయే హరిః॥ తస్య సర్వగతత్వాచ్చ స్థండిలే భావితాత్మనామితి॥

తథాచ కూర్మపురాణే॥ నవిష్ణ్వారాధనాత్పుణ్యం విద్యతే కర్మ వైదికం। తస్మాదనాదిమధ్యాన్తం నిత్యమారాధయేద్ధరిం। తద్విష్ణోరితిమంత్రేణ సూక్తేన పురుషేణ తు। నైతాభ్యాం సదృశో మంత్రో వేదేషూక్తశ్చతుర్ష్వపి। నివేదయిత్వా చాత్మానం విష్ణావమితతేజసి। తదాత్మానస్తత్ప్రశాంతస్తద్విష్ణోరితిమంత్రతః॥ అథవా దేవమీశానం భగవంతం సనాతనం। ఆరాధయేన్మహాదేవం భావయిత్వా మహేశ్వరం। మంత్రేణ రుద్రగాయత్ర్యా ప్రణవేనాథవా పునః। ఈశానేనాథవా రుద్రైస్త్ర్యంబకేన సమాహితః। పత్రైః పుష్పైరథాద్భిర్వా చందనాద్యైర్మహేశ్వరం। అథో నమశ్శివాయేతి మంత్రేణానేన పూజయేదితి॥

శ్రీరామచంద్రః॥ మమ పూజావిధానస్య నాంతోఽస్తి రఘునందన। తథాపి వక్ష్యే సంక్షేపాద్యథావదనుపూర్వశః। స్వగృహ్యోక్తప్రకారేణ ద్విజత్వం ప్రాప్య మానవః। సకాశాత్సద్గురోర్మంత్రం లబ్ధ్వా మద్భక్తిసంయుతః। తేన సందర్శితవిధిర్మామేవారాధయేత్సుధీః। హృదయే వానలే వాపి ప్రతిమాదౌ విభావసౌ। సాలగ్రామశిలాయాం వా పూజయేన్మామతంద్రితః। ప్రాతస్స్నానం ప్రకుర్వీత ప్రథమం దేహశుద్ధయే। వేదతంత్రోదితైర్మంత్రైర్మృల్లేపనవిధానతః। సంధ్యాదికర్మ యన్నిత్యం తత్కుర్యాద్విధినా బుధః। సంకల్పమాదౌ కుర్వీత సిద్ధ్యర్థం కర్మణాం సుధీః। స్వగురుం పూజయేద్భక్త్యా మద్బుద్ధ్యా పూజకో మమ। శిలాయాం స్నాపనం కుర్యాత్ప్రతిమాయాం ప్రమార్జనం। ప్రసిద్ధైర్గంధపుష్పాద్యైర్మత్పూజా సిద్ధిదాయకా। అమాయికోఽనువృత్త్యా మాం పూజయేన్నియతవ్రతః। ప్రతిమాదిష్వలంకారః ప్రియో మే రఘునందన। అగ్నౌ యజేత హవిషా భాస్కరం స్థండిలే యజేత్। భక్తేనోపహృతం ప్రీత్యా శ్రద్ధయా మమ వార్యపి। కింపునర్భక్ష్యభోజ్యాదిగంధపుష్పాక్షతాదిభిః। పూజాద్రవ్యాణి సర్వాణి సంపాద్యైవ సమారభేత్। చేలాజినకుశైస్సమ్యగాసనం పరికల్పయేత్। తతః ప్ర

విశ్య దేవస్య సంముఖేశుద్ధమానసః। తతోన్యాసంప్రకుర్వీత మాతృకాం బహి
రంతరాం। కేశవాదీంస్తతఃకుర్యాత్తత్త్వన్యాసం తతఃపరం। మన్మూర్తిపంజర
న్యాసం మంత్రన్యాసం తతో న్యసేత్। ప్రతిమాదావపితథా కుర్యాన్నిత్యమ
తంద్రితః। కలశంస్వపురోవామే క్షిపేత్పుష్పాణి దక్షిణే। అర్ఘ్యపాద్యప్రదా
నార్థం మధుపర్కార్థమేవచ। తథైవాచమనార్థంతు న్యసేత్పాత్రచతుష్టయం।
హృత్పద్మే భానువిమలాం మత్కళాం జీవసంజ్ఞితాం। ధ్యాయేత్స్వదేహ మఖి
లం తయావ్యాప్తమరిందమ। తామేవావాహయేన్నిత్యం ప్రతిమాదిషుమత్క
ళాం। పాద్యార్ఘ్యాచమనీయాద్యైస్స్నానవస్త్రవిభూషణైః। యావచ్ఛక్త్యోప
చారైర్వా హ్యర్చయేన్మామమాయయా। విభవేసతి కర్పూరకుంకుమాగరుచం
దనైః। అర్చయేన్మంత్రవిన్నిత్యం సుగంధకుసుమైశ్శుభైః। దశావరణపూజాం
వై హ్యాగమోక్తాంప్రకారయేత్। నీరాజనైర్ధూపదీపైర్నైవేద్యైర్బహువిస్త
రైః। శ్రద్ధయోపహరేన్నిత్యం శ్రద్ధాభుగహమీశ్వరః। హోమం కుర్యాత్ప్ర
యత్నేన విధినామంత్రకోవిదః। అగస్త్యేనోక్తమార్గేణ కుండేనాగమవిత్తమః।
జుహుయాన్మూలమంత్రేణ పుంసూక్తేనచవా బుధః। అథవౌపాసనాగ్నౌవా
చరుణా హవిషాథవా। తప్తజాంబూనదప్రఖ్యం దివ్యాభరణభూషితం। ధ్యా
యేదనలమధ్యస్థం హోమకాలే సదాబుధః। పార్షదేభ్యోబలిం దత్త్వా హో
మశేషం సమాపయేత్। తతోజపం ప్రకుర్వీత ధ్యాయేన్మాం యతవాక్స్మరన్।
ముఖవాసంచ తాంబూలం దత్త్వాప్రీతిసమన్వితః। మదగ్రే నృత్తగీతాదిస్తుతిపా
ఠాదికారయేత్। ప్రణమేద్దండవద్భూమౌ హృదయేమాంనిధాయచ। శిరస్యా
దాయమద్దత్తం ప్రసాదం భావనామయం। పాణిభ్యాం మత్పదే మూర్ధ్ని గృ
హీత్వా భక్తిసంయుతః। రక్షమాంఘోరసంసారాదిత్యుక్త్వా ప్రణమేత్సుధీః।
ఉద్వాసయేద్యథాపూర్వం ప్రత్యగ్జ్యోతిషి సంస్మరన్। ఏవముక్తప్రకారేణపూ
జయేద్విధివద్యది। ఇహాముత్రచ సంసిద్ధిం ప్రాప్నోతిమదనుగ్రహాత్। మద్భక్తి
యుక్తోయదిమామేవంపూజాం దినే దినే। కరోతి మమ సారూప్యం ప్రాప్నో
త్యేవనసంశయఇత్యాధ్యాత్మికరామాయణే॥

నను సర్వగతస్యాశరీరస్య ప్రతికృతిం లోహమృచ్ఛిలాకాష్ఠాదిభిః కృ
త్వార్చయిత్వా ధ్యాత్వా ఇహాముత్ర సంసిద్ధిం సారూప్యంచ లభేతేత్యుక్తం।
తద్విరుద్ధంప్రతిభాతీత్యాశంక్య నిరాలంబం నిష్కళమతీంద్రియం నిశ్చలమానసే
న ధ్యాతుం నసమర్థాభవంత్యహంమమేతి భ్రాంతా జనాః। సాలంబమనంతక
ళ్యాణగుణగణవిశిష్టం భక్తానుగ్రహార్థమంగీకృతలీలాగృహీత కోటికందర్పలా

వణ్యాం స్థిత్యుద్భవ ప్రళయహేతుమశేషజగదాశ్రయం ధ్యాత్వాభ్యర్చ్యహుత్వానన్యగేనమనసా తదాకారపరిణమితేన యుగపజ్జనిత విరక్తివివేకాభ్యాం తరంతి భవాంబుధిమిత్యాదా సాధనం శ్రుతిస్మృతిభ్యాముక్తం॥

యంసర్వేదేవానమంతి ముముక్షవో బ్రహ్మవాదినశ్చేతి మోక్షార్థినో బ్రహ్మవాదినశ్చ మర్త్యాస్సర్వే దేవాశ్చ లీలయా విగ్రహంకృత్వా భజంతి జగత్కారణమితి సర్వజ్ఞైశ్శంకరభగవత్పాదైర్వ్యాఖ్యాతా శ్రుతిః॥

అణోరణీయాన్మహతోమహీయా నాత్మాగుహాయాం నిహితోస్య జంతోః। తమక్రతుంపశ్యతి వీతశోకో ధాతుఃప్రసాదా న్మహిమాన మీశమితిశ్రుతిః॥ ప్రళయేఖిలవిశ్వతరో ర్బీజభూత మణీయా న్బ్రహ్మాండ లక్షకోటయోధిష్ఠానమభిప్రేత్య సృష్టేరనంతరం మహీయానాత్మా॥ తదుక్తం శ్రీవిష్ణుపురాణే॥ న్యగ్రోధస్సుమహానల్పే యథాబీజే వ్యవస్థితః। సంయమేవిశ్వమఖిలం బీజభూతే తథా త్వయి। బీజాదంకురసంభూతో న్యగ్రోధస్సుసముత్థితః। విస్తారంచ యథాయాతి త్వయాసృష్టం తథాజగదితి॥ అస్య సురనరాదిరూపస్య జంతోర్హృదయపుండరీకమధ్యే విద్యయోపలభ్యమానం నియామకం తం సంకల్పరహితం శమాదిగుణయుక్తోపురుషః తస్య జగద్విధాతృప్రసాదాత్సాక్షాత్కృత్య జన్మమరణాదిశోకరహితో భవతీతి విద్యారణ్యైర్వ్యాఖ్యాతా॥ చిన్మయస్యాద్వితీయస్య నిష్కళస్యాశరీరిణః। ఉపాసకానాంకార్యార్థం బ్రహ్మణో రూపకల్పనేతి రామతాపనీయోపనిషత్॥

భక్తిఃపరేశానుభవో విరక్తిరన్యత్రచైషత్రికఏకకాలః। ప్రపద్యమానస్య యథాశ్నతస్స్యుస్తుష్టిఃపుష్టిః క్షుదపాయోనుఘాసం॥ దురధిగమాత్మతత్త్వనిగమాయతవాత్తతనోశ్చరితమహామృతాబ్ధిపరివర్తపరిశ్రమణాః। నపరిలషంతి కేచిదపవర్గమపీశ్వర తే చరణసరోజహంసకులసంగవిసృష్టగృహాఇతి శ్రీమద్భాగవతే॥

## దేవపూజావిధానము.

మాధ్యాహ్నిక స్నానసంధ్యా బ్రహ్మయజ్ఞతర్పణానంతరమున ప్రతిదినమాచరించదగు విష్ణ్వారాధనక్రియాయోగమును జెప్పుచున్నారము.

ఏవిష్ణ్వర్చనమొనర్చి సకలజనులును మోక్షమొందుచున్నారో దానిక్రమమును జెప్పుచున్నారమనియు నుదకమున యగ్నిని హృదయమున సూర్యునియందు స్థండిలమున ప్రతిమను వీటిలో దనకిష్టమగు దేనియందైన హరిభావ

నను జేసి యర్చింపుడని మునులచే జెప్పబడెననియు, అగ్నియందు హోమకి్రి యావంతులకును, విద్వాంసులకు రవియందును, ప్రతిమయందల్పబుద్ధులకును, యోగులకు హృదయమున, భావనేచ్ఛగలవారికిస్థండిలమున బంధహారియగుప రమేశుడుసర్వగతుడౌటవలనభావించియర్చించవలెననియాగ్నేయపురాణము.

విష్ణ్వారాధనముకంటెనధికమగు వైదికము లేనందున దినాదిని మధ్యాహ్నమునన నిత్యమారాధించవలెహరిననియును, లేక సర్వలోకనియామకుడును, సనాతనుడును, షడ్గుణైశ్వర్యసంపన్నుడునగు మహాదేవుని భావనజేసి పూజించవలెననియును, తద్విష్ణోరనుమంత్రముచేతనైన, పురుషసూక్తముచేతనైన విష్ణ్వారాధనజేయవలె నీమంత్రములతో సమమగునవి నాలుగు వేదములందు లేవు, తద్విష్ణోరనుమంత్రమువలన తదాత్మయు తత్ప్రశాంతుడునగుచు నమితతేజస్సుగలవిష్ణువునకు తనయాత్మను సమర్పించుమనియు, లేకుండిన ప్రకాశకుడు నియామకుడు షడ్గుణైశ్వర్యసంపన్నుడు సనాతనుడు మహాదేవుడునగు మహేశ్వరుని భావనజేసి రుద్రగాయత్రీమంత్రము, ప్రణవము, రుద్రత్ర్యంబకము పంచాక్షరీమంత్రములచేతనైన నిశ్చలచిత్తుడైబిల్వాదిపత్రములచేత పుష్పములచేత నుదకముచేతనైన చందనము మొదలగువానిచే బూజించవలెనని కూర్మపురాణము.

శ్రీరామచంద్రులవారు లక్ష్మణులకుపదేశించిన పూజావిధి యధ్యాత్మరామాయణమున జెప్పబడినది జెప్పితిమి.

విష్ణ్వారాధనవిధి యమితమైయున్నది యైననది సంక్షేపించి విధినతిక్రమించకుండ జెప్పుదుము.

స్వశాఖోక్త ప్రకారముగ నుపనయనాదిసంస్కారములనొందిన ద్విజుడు సద్గురునివలన విష్ణుమంత్రోపదేశమునొంది భక్తిగలవాడై గురూపదిష్టమార్గముచేతను భగవంతుని సుబుద్ధిగలవాడారాధించవలెను.

హృదయమున నగ్నిని ప్రతిమను సూర్యుని సాలగ్రామశిలయందైనను తంద్రలేనివాడై హరిభావనజేసి పూజించవలెను. ముందుగ దేహశుద్ధికి వేదమంత్రములచే మృల్లేపనవిధానమువలన ప్రాతస్స్నానముజేసి నిత్యమగు సంధ్యాదికర్మను యధావిధిగ విద్వాంసుడు జేయదగును. అటుపైని కర్మసిద్ధికి సంకల్పమును మొదటజేసి గురుపూజను బరమేశభావనచే జేయవలెను.

సాలగ్రామాదిశిలలందు స్నపనము, ప్రతిమలందు మార్జనము, ప్రసిద్ధములగు గంధపుష్పాదులచే జేయు బూజ సిద్ధియొనర్చును.

ఉండియములేక నియమముచే భక్తిశ్రద్ధలుగలిగి భగవంతుని బూజించవ లెను. ప్రతిమలందలంకారము ప్రియము- హవిస్సుచేనగ్నిని, సూర్యుని స్థండిల మున బూజించవలె- భక్తిచేనుదకమర్పించిన బ్రసన్నుడగును. భక్ష్యభోజ్యగంధధూపపుష్పాక్షతలచే నర్చించిన సుప్రసన్నుడగునని జెప్పనేల.

పూజాద్రవ్యములన్నిటిని సంపాదించి ప్రారంభించవలె. దర్భాసనము మొదట, పైని వ్యాఘ్రకృష్ణాజినములలోనొకటి, దానిపైని వస్త్రమును వేసి దేవునికభిముఖముగ గూర్చుని నిర్మలాంతఃకరణుడై బహిరంతర్మాతృకలు నటుపై కేశవాదిన్యాసము, తత్వన్యాసమూర్తిపంజరమంత్రన్యాసములు దనయందును ప్రతిమాదికమందును నిత్యమును సావధానుడై జేయదగును.

తనకుముందు కలశమును వామభాగమున,పుష్పములను దక్షిణభాగమందుంచదగును. అర్ఘ్యపాద్యమధుపర్కాచమనములనిమిత్తము నాలుగుపాత్రలుంచవలెను.

జీవసంజ్ఞకలిగి సూర్యునివలె తేజోవంతమైన భగవత్కళను హృత్పద్మమున దనదేహమంతటను వ్యాపించునదిగాను ధ్యానించవలెను- అట్టి పరమేశుని కళనె నిత్యమును ప్రతిమాదులందావాహనజేయనగును. పాద్యార్ఘ్యాచమనస్నానవస్త్రవిభూషణాదులచేతను దనశక్తికొలది నమాయకుడై యుపచారములచేనర్చించవలెను. విభవముగలిగిన కర్పూరకుంకుమాగరు చందన బుష్పాదికము మంత్రములచే నిత్యమర్పించదగును.

ఆగమోక్తమగు దశావరణపూజను జేయువలెను. నీరాజన దీప ధూపములు నానావిధ భక్ష్యభోజ్యలేహ్యచోష్యములచే శ్రద్ధగలిగి యర్పింపదగు. శ్రద్ధచేనర్పించిన బరమేశుడనుభవించును.

అగస్త్యోక్త ప్రకారముగ నాగమజ్ఞుడగ్నిని కుండమందున మూలమంత్రముచే లేక పురుషసూక్తముతో హోమమాచరించవలె. లేక నౌపాసాగ్నియందు చరువు లేక హవిస్సుతోడను హోమము జేయదగును.

హోమకాలమున విద్వాంసుడగ్నిమధ్యమందు పన్నెండవవన్నెగలబంగరురంగుగల రంగని దివ్యాభరణభూషితుని ధ్యానించవలె. భగత్పార్షదుల కొరకు బలినిచ్చి హోమశేషమును సమాప్తిజేయదగు నటుపైని మౌనివై మంత్రమును జపించుచు దేవుని ధ్యానమొనర్చవలెను. తాంబూలాదికమిచ్చి సంతుష్టుడై నృత్తగీతస్తుతిపాఠాదికమును దేవసన్నిధిని జేయించదగును.

దండమువలె భూమినిబడి దండమర్పించి హృదయమున దేవుని ధ్యానిం

చి భావనామయుడగు దేవదత్తప్రసాదమును శిరమున ధరించి హస్తములచే భగవత్పదముల శిరమున గ్రహించి భక్తియుక్తుడై ఘోరమగు సంసారమువలన రక్షించుమని బలికి నమస్కరించవలెను.

పూర్వమువలె భగవత్కళను దనహృదయారోపణ జేయుటచేత నుద్వాసన జేయవలెను.

ఈప్రకారము శాస్త్రానుసారముగ బూజించిన నైహికాముష్మిక సిద్ధిని దైవానుగ్రహమున బొందును. భక్తియుక్తుడై శ్రీరామచంద్రుల నిత్యము బూజించిన నిస్సంశయముగ సారూప్యముక్తి నొందును.

ఓయీ సర్వాంతర్యామియు నశరీరుడునగు బరమేశుని బ్రతికృతిని లోహము, మృత్తిక, దారువులచే నొనర్చి ధ్యానించి నైహికాముష్మికసిద్ధియును సారూప్యమును బొందునని జెప్పబడెను. ఇది విరుద్ధముగ నగపడుచున్నదియని శంకించుకొని ఇంద్రియగోచరుడు గాక కళారహితుడై యాలంబనముకు రాని దేవుని నిశ్చలమనంబుచే ధ్యానము జేయుట కహంకారమమకారములచే భ్రాంతులగు జనులు సమర్థులుగారు.

హద్దులేని మంగళగుణసముదాయముగలిగి భక్తులననుగ్రహించుట కంగీకరించిన లీలచే గ్రహించబడిన కోటిమన్మథుల సౌందర్యము గలవాడును ప్రపంచపాలనసృష్టినష్టులకు కారణుడును సకలజగదాశ్రయుడునగు సాలంబనమూర్తి ధ్యానార్చనలను జేసి హోమమొనర్చి యతని యాకారముగ బరిణమించి యితరమ నొందని మనంబుచే నొకమారెబుట్టిన విరక్తిజ్ఞానమువలన దరించును సంసారార్ణవమునని శ్రుతిస్మృతులచే మొదటిసాధనము జెప్పబడెను.

మోక్షేచ్ఛగలబ్రహ్మవాదులును, సకలదేవతలును లీలచేతను విగ్రహమును జేసి భజించుచున్నారని శ్రుతికర్థమును సర్వజ్ఞులగు భాష్యకారులయిన శంకరాచార్యులవారానతిచ్చిరి.

ప్రళయమందఖిలప్రపంచవృక్షమునకు బీజభూతుడై యణుమాత్రమగుచు సృష్ట్యనంతరమున బ్రహ్మాండలక్షకోటులు విరాడ్రూపమున దాల్చె మహత్తులకు మహత్తరుడగునాత్మ- ఎటులనగా విష్ణుపురాణమందున జెప్పిన సాదృశ్యము జెప్పుదుము. సూక్ష్మమగు మఱ్ఱిగింజయందఖిలమగు వృక్షమణగియుండినట్లును, అబీజమంకురించి యధికమగు వృక్షమైనట్లును అట్టి సర్వజగన్నియామకుని సంకల్పరహితుని దేవమనుష్యరూపమగు జంతువుల హృదయపద్మమందు జ్ఞానముచేతబొందబడినవాడై యాజగన్నిర్మాణకుని యనుగ్రహముచేత

సాక్షాత్కారమొనర్చికొని జన్మమరణాదిదుఃఖరహితుడగుచున్నాడని యాజ్ఞికోపనిషద్వాక్యమునకర్థమును చెప్పిరి.

చిన్మయుడద్వితీయుడు నిష్కళుడశరీరియగు బ్రహ్మకు రూపమును కల్పించుట యుపాసకులయొక్క కార్యముకొరకని రామతాపనీయోపనిషత్.

ఈశ్వరునకు దేహబుద్ధిచే దాసుడను, జీవబుద్ధిచే నతనియంశము నేను ఆత్మబుద్ధిచే నతడే నేనని నాయొక్క నిశ్చలమతియని యుపనిషత్.

భక్తియు నీకానుభవమును విరక్తియు ప్రేమలక్షణభక్తిగలిగినవానికి మూడొందగలరెటువలెననిన, భోజనమొనర్చువానికి ప్రతిముష్టియందు నాకలి, దప్పిక, యవయవదార్ఢ్యము, సాకమారగునటులయనియు, కష్టముచేనైన బొందశక్యముగాని దేహాత్మతత్వముగలదో అనగా నేనీయొక్క యాథార్థ్యజ్ఞానముగలదో వానిని పరికాశింపజేసి ప్రాణులను తరింపజేయుటకు రామకృష్ణాద్యవతారములనంగీకరించిన నీయొక్క చరిత్రలనెడు విశేషామృతసముద్రపగాహనేముచేత పోగొట్టుకొబడిన యాధ్యాత్మికాది తాపత్రయశ్రమలు గలవారలు ఓయీశ్వరుడా నీయొక్క పాదపద్మసరస్సంబంధులగు హంసలనగా పరమహంసలు వారిసంగమువలన విడువబడిన దేహగేహాద్యనురాగముగలవారలై మోక్షమునైన గోరరని సుకృతులు భగవంతుని స్తుతి జేయుచున్నవని శ్రీమద్భాగవతము.

## అతిథిపూజావిధిః.

అథాతిథిపూజాపరనామకో మనుష్యయజ్ఞో నిరూప్యతే॥ ఆతిథ్యస్య మనుష్యయజ్ఞత్వమాజ్ఞాపయతి శ్రుతిః॥ యద్బ్రాహ్మణేభ్యోన్నందదాతి తన్మనుష్యయజ్ఞస్సంతిష్ఠత ఇతి॥ అతిథిలక్షణమాహ మనుః॥ ఏకరాత్రంతు నివసన్నతిథిర్బ్రాహ్మణస్స్మృతః। అనిత్యంహి స్థితో యస్మాత్తస్మాదతిథిరుచ్యత ఇతి॥ అస్యార్థః॥ ఏకరాత్రిమేవ పరగృహే నివసన్ బ్రాహ్మణోతిథిర్భవతి॥ అనిత్యావస్థానాన్నవిద్యతే ద్వితీయాతిథిరస్యేతి అతిథిరుచ్యతే॥ నైకగ్రామీణమతిథిం విప్రం సాంగతికం తథా। ఉపస్థితం గృహేవిద్యాద్భార్యా యత్రాగ్నయోపి వా॥ ఏకగ్రామనివాసినం లోకేషు విచిత్రపరిహాసకథాదిభిః సంగత్యా వృత్త్యర్థినం భార్యాగ్నియుక్తే గృహే వైశ్వదేవకాలోపస్థితమపి నాతిథిం విద్యాత్। ఏతేన భార్యాగ్నిరహితస్య ప్రవాసినోతిథిత్వమితిబోధితం॥ అప్రణోద్యోతిథిస్సాయం సూర్యోఢో గృహమేధినా। కాలే ప్రాప్తస్త్వకాలేవా నాస్యానశ్నన్గృహే వసేత్॥ సూర్యేస్తమితే గృహస్థేనాతిథిర్నప్రత్యాఖ్యేయః। సూ

ర్యేణోఽథః ప్రాపితః। రాత్రౌ స్వగృహాగమనాశక్తేః ద్వితీయ వైశ్వదేవకాలే ప్రాప్తః। అకాలేవా సాయంభోజనే నివృత్తేపి నాస్యగృహే అతిథిరనశ్నన్ వసేత్- అవశ్యమస్మైభోజనందేయం ప్రత్యాఖ్యానే ప్రాయశ్చిత్తగౌరవాద్ధోయమారంభః। అతిథిర్దివాన్యగ్రామమన్యగృహంవా గంతుం సమర్థోభవేత్తథా రాత్రిర్గమనాసంభవాదావశ్యం దేయం॥

అతఏవ విష్ణుపురాణే॥ దివాతిథౌతు విముఖే గతే యత్పాతకంనృప। తదేవాష్టగుణంప్రోక్తం సూర్యోఢే విముఖేగత ఇతి॥ ఆసనావసథౌ శయ్యా మనువ్రజ్యాముపాసనం। ఉత్తమేషూత్తమంకుర్యాద్ధీనే హీనం సమే సమం॥ యదిత్వతిథిధర్మేణ క్షత్రియో గృహమావ్రజేత్। భుక్తవత్సుచ విప్రేషు కామంతదపి భోజయేత్॥ వైశ్యశూద్రావపి ప్రాప్తౌ కుటుంబే తిథిధర్మిణౌ। భోజయేత్సహభృత్యైస్తౌ వానృశంస్యం ప్రయోజయన్॥ అదత్త్వాతు యఏతేభ్యః పూర్వం భుఙ్క్తే విచక్షణః। సభుంజానో నజానాతిశ్వగృధ్రైర్జగ్ధిమాత్మనః॥ దేవాన్నృషీన్మనుష్యాంశ్చ పితౄన్గృహ్యాశ్చ దేవతాః। పూజయిత్వా తతఃపశ్చాద్గృహస్థశ్శేషభుగ్భవేత్॥ మనుష్యయజ్ఞ మహరహఃకర్తవ్యతావశ్యక మకరణే ప్రత్యవాయంచ కథయిత్వా దృష్టఫలమదృష్టఫలం కథయంతి మన్వాదయః॥ విద్యాతపస్సమృద్ధేషు హుతం విప్రముఖాగ్నిషు। నిస్తారయతి దుర్గాచ్చ మహతశ్చైవ కిల్బిషాత్॥ ధన్యం యశస్యమాయుష్యం స్వర్గ్యం చాతిథిపూజనమితి మనుః॥ అస్యార్థః॥ విద్యాతపస్తేజస్సంపన్నవిప్రాణాం ముఖాని హోమాధికరణత్వేనాగ్నితయా నిరూపితాని హవ్యకవ్యాదిప్రక్షిప్తమిహలోకే దుస్తరాద్వ్యాధిశత్రురాజపీడాదిభయాన్మహతశ్చ పాపాదముత్ర నరకాత్త్రాయతే। ధనాయహితం ధనస్యనిమిత్తంవా ధన్యం ఏవం సుకీర్తిశ్చిరజీవనాదయోప్యాతిథిపూజనేన లభేదితి॥

అస్కన్నమవ్యథంచైవ ప్రాయశ్చిత్తైరదూషితం। అగ్నేస్సకాశా ద్విప్రాగ్నౌ హుతం శ్రేష్ఠమిహోచ్యత ఇతి యాజ్ఞవల్క్యః॥ అస్యార్థః॥ అగ్నేస్సకాశాదగ్నిసాధ్యాద్భూరిదక్షిణాద్రాజసూయాదేరపి విప్రాగ్నౌహుతం శ్రేష్ఠముచ్యతే। ఏతదస్కన్నం క్షరణరహితం అవ్యథం పశుహింసారహితం ప్రాయశ్చిత్తైరదూషితం ప్రాయశ్చిత్తాయాసరహితం యథాన్నపానదానేనప్రాణినామతీవ పుష్టిస్తుష్టిస్సృష్టానష్టిశ్చభవతి। తథైవ భూహిరణ్యాంబరభూషణగజాశ్వరథకన్యాదానైర్నభవతీతి ప్రత్యక్షం॥ అన్నంహి భూతానాం జ్యే

ష్టం తస్మాత్సర్వౌషధముచ్యతే అన్నాద్భూతాని జాయంతే జాతాన్యన్నేన వర్ధంతఇతిశ్రుతేరన్నదః ప్రాణదఇతి దృఢంవదామః॥ యత్పృథివ్యాంవ్రీహియవంహిరణ్యంపశవస్త్రియః। ఏకస్యాపినపర్యాప్తమిత్యాదిప్రమాణాన్యపిసంతి॥

వైశ్వదేవానంతరం ముహూర్తస్యాష్టమభాగ ప్రతీక్షణ మతిథ్యాగమనార్థమకృత్వా నభోక్తవ్యమిత్యుక్తమతిథియజ్ఞకరణావశ్యకద్యోతనార్థం మార్కండేయపురాణే॥ వైశ్వదేవంహి నామైతత్సాయంప్రాతరుదాహృతం। ఆచమ్యచ తతఃకుర్యాత్ప్రాజ్ఞో ద్వారావలోకనం॥ ముహూర్తస్యాష్టమం భాగముదీక్ష్యోహ్యతిథిర్భవేత్॥ అతిథిం తత్రసంప్రాప్త మన్నాద్యేనోదకేనచ। సంపూజయేద్యథాశక్తి గంధపుష్పాదిభిస్తథేతి॥

## అతిథిపూజావిధానము.

దేవపూజానంతరమునందతిథిపూజయను రెండవపేరుగల మనుష్యయజ్ఞము నిరూపించబడుచున్నది.

బ్రాహ్మణులకొరకన్నమునిచ్చుట మనుష్యయజ్ఞమాచరించుటయని శ్రుతి యాజ్ఞనిచ్చుచున్నది.

ఒకతిథిమాత్రమితరునిగృహమందుండు బ్రాహ్మణు డతిథియనబడునని యు నేకగ్రామవాసియగువాడు లోకమందగు విచిత్రపరిహాస కథాప్రసంగ సంగతిచేతను వృత్తినిగోరి భార్యయు, నగ్నియును గలవాడై వైశ్వదేవకాలమందితరుని యింటికి వచ్చినను యతిథియనబడడని మనువు.

భార్యయు, నగ్నియును సమీపమునలేక మరియొకగ్రామమునుంచివచ్చినవాడుమాత్రమె యతిథియని తాత్పర్యము. సూర్యాస్తమయమైనబిమ్మట వచ్చు నతిథికవశ్యమును భోజనము జేయించవలెను. పగలన్యగ్రామమైన మరియొకగృహమునకైన బోగలడు. రాత్రి వెళ్లజాలడు. పగటియందతిథి విముఖుడై గృహస్థునిచే నిరాకరించబడిపోవుటచేత వచ్చుపాపముకంటె నెనిమిదిరెట్లు రాత్రి నిరాకరించు గృహస్థునకు వచ్చునని శ్రీవిష్ణుపురాణము.

శయ్యాసనస్థలాదికమొసగుటలో నుత్తమ సమాధమ తారతమ్యములననుసరించి జరుపదగు- బ్రాహ్మణగృహమునకతిథిధర్మముతో క్షత్రియుడు వచ్చినటులైన యాగృహదంపతులు వెనుకకునుండి దనయింటికివచ్చిన బ్రాహ్మణులకు ముందు భుజింపచేసి యటుపైని క్షత్రియుని భుజింపచేయదగును. వైశ్యశూద్రులు బ్రాహ్మణకుటుంబమునకతిథిధర్మముగలవారై వచ్చిన బ్రాహ్మణక్షత్రియభోజనానంతరము దంపతులభోజనమునకుం బూర్వము భృత్యులతో

గూడ భుజింపజేసెదగు- గృహస్థుడు దయాళుడై పైనజెప్పిన యతిథి మొదలు భృత్యులవరకు భుజింపజేయక వారలనతిక్రమించిన దోషమును దెలియనివాడగుచు ముందుగ గృహస్థుడే భుజించినటులైన నాని నరకమున గెద్దలును కుక్కలును దినును.

పితృదేవర్షి మనుష్యగృహదేవతారాధనజేసి గృహస్థుడు శేషమును భుజింపవలెనని పంచయజ్ఞావశ్యకత్వమును మనువు జెప్పిరి. మనుష్యయజ్ఞమనుదినము జేయుట యావశ్యకమనియు నది జేయకుండిన ప్రత్యవాయి యగుననియును దృష్టఫలమదృష్టఫలమును మన్వాదులు జెప్పుచున్నారు.

విద్యాతపస్సులుగలిగిన బ్రాహ్మణులకు హవ్యకవ్యము లిచ్చినవాడు దనకష్టముల వ్యాధిశత్రుపీడరాజదండనలవలనగొప్పదోషములనుంచి తరించుచున్నారనియు- కీర్తికరము, అయుర్వృద్ధిప్రదము, స్వర్గదాయి, ధనప్రీతము,నతిథిపూజనమని మనువు.

విశేషదక్షిణగలిగిన రాజసూయాదియాగములకంటెను విద్యాతపస్సులుగల బ్రాహ్మణులకు హవ్యకవ్యములిచ్చుట శ్రేష్ఠము. ఎందుచేననిన- అతిథిపూజనమునందు పశుహింసాధికము లేదు. ఉరణరహితము విధినతిక్రమించినదను ప్రాయశ్చిత్తములు లేవనియును యాజ్ఞవల్క్యర్షి.

ప్రాణులకన్నపానదానములిచ్చుటచేనగు పుష్టియు, తుష్టియు, తృష్ణానష్టియును, భూమియు, స్వర్ణాంబర భూషణగజరథాశ్వ కన్యాదానముల గాదు- వాటిచే దృప్తినొందక యధికమునకాసింతురు.

భూతములకన్నమన్నిపదార్థములకంటె నతిశయమది హేతువుచే నన్నము సర్వౌషధమనబడును. అన్నభక్షణచేతనే శుక్లశోణితములై భూతోత్పత్తియగు నందువలనె దిరుగ శరీరాభివృద్ధియగునని యుపనిషత్తు. అటులగుటచే నన్నమిచ్చువాడు ప్రాణమిచ్చువాడని దృఢముగ మేము బల్కుదుము.

భూమియందుండన్నిపశువులు ధాన్యాదికము ద్రవ్యము స్త్రీలు నొకనికిచ్చునను దృప్తి లేదు. భోజనవస్తువులు దనపొట్టబట్టుటకంటె నధికమిచ్చినను బుచ్చుకొనజాలడు.

వైశ్వదేవానంతరమున ముహూర్తములో నెనిమిదవభాగము మట్టుకతిథివచ్చిన బిలచి యర్చించుటకు దనద్వారమున నిరీక్షించుమనియు నతనియన్నోదకగంధపుష్పాదులచే దనశక్తికొలది బూజించక గృహస్థు భుజించగూడదనియును మార్కండేయపురాణము.

## భోజనవిధిః.

అథాతో భోజనవిధిం వ్యాఖ్యాస్యామః॥ భోజనం భుక్తిః- భుజపాలనాభ్యవహారయోః- తస్యవిధిం వ్యాఖ్యాస్యామః॥ దక్షః॥ పంచమేచతథాభాగే సవిభాగో యథార్హతః। దేవపితృమనుష్యాణాం కీటానాంచోపదిశ్యతే। సంవిభాగం తథాకృత్వా గృహస్థశ్శేషభుగ్భవేదితి॥ సంవిభాగోవిభజ్యప్రదానం॥

సాయంప్రాతర్ద్విజాతీనా మశనం దేవనిర్మితం। నాంతరాభోజనం కుర్యాదగ్నిహోత్రసమోవిధిరితి మనుః॥ తస్మాద్విరహ్నామనుష్యేభ్యఉపహ్రియ్యతే ప్రాతశ్చసాయంచ తస్మాత్త్రిరహ్నః పశవః ప్రేరతే ప్రాతస్సంగవే సాయమితి యాజుషశ్రుతిః॥ అనడ్వాన్బ్రహ్మచారీచ ఆహితాగ్నిశ్చ తేత్రియః। అశ్నంతఏవ సిద్ధ్యంతి నైషాంసిద్ధిరనశ్నతాం॥ దివాచనభుంజీతాన్యత్రఫలమూలేభ్యఇత్యాపస్తంబః॥ భారవహనవేదాధ్యయన గురుశుశ్రూషాగ్నిపరిచర్యాక్షమార్థం క్రమాదేతే తుష్ట్యాశ్నంతః పుష్టాభవేయు రిత్యనుజ్ఞాతం॥ ఋషిభిర్ద్విరశనముక్తం విప్రాణామప్రవాసినాం। సతతం నిత్య మహనిచ తథా తమస్విన్యాసార్ధప్రహరయామాంతం॥ అహనీతి॥ సతిసంభవే పంచమభాగపరం దక్షదర్శనాత్॥ తమస్విన్యాం రాత్రౌ సార్ధప్రహరయామాంతః। అర్ధప్రహరసహితప్రథమప్రహరే। ఏవంచ మన్వాదావపి సాయంప్రాతశ్శబ్దౌ తదనుసారావ్యాఖ్యేయౌ॥ చరకస్తు॥ యామాదర్వాఙ్నభుంజీత యామయుగ్మం నలంఘయేత్। రాత్రియామాంతరే భుక్త్వా స్వపేద్యామద్వయం సుధీతి॥ దినప్రహరమధ్యే పూర్వోక్తప్రకృష్టకర్మాచరణప్రవచనేనప్రబోధితత్వాదుత అహన్యేవ పునర్బుభుక్షా జాయతేతిచ। యామద్వయాత్పూర్వంభోజనే సతి త్రియామాయాః పూర్వయామే భోక్తుం క్షుధా నోత్పద్యతఇతిచ। రజన్యాః ద్వితీయప్రహరకృతభోజనేన నిద్రాసమయస్యాజీర్ణంచ యామద్వయస్వపనాసంభవశ్చ। ఏతైరకాలకృతకృత్యైరుత్పద్యంతే వివిధారుజఇత్యాహారనిద్రావేళానియమం దర్శితవాన్॥ తదుక్తం సుశ్రుతే॥ సుఖముచ్చైస్సమాసీనస్సమదేహోన్నతత్పరః। కాలేసాత్మ్యం లఘుస్నిగ్ధంక్షిప్రముష్ణం ద్రవోత్తరం॥ బుభుక్షితోన్నమశ్నీయాన్మాత్రావద్విగతాగమః। కాలే భుక్తం ప్రీణయతి సాత్మ్యమన్నం నబాధతే। లఘుశీఘ్రం వ్రజేత్పాకం స్నిగ్ధోష్ణం బలవహ్నిదం। క్షిప్రం భుక్తం సమంపాకం యాత్యదోషం ద్రవోత్తరం। సుఖం జీవతి మాత్రావద్ధాతుసామ్యం కరోతిచ। అతీవాయతయామస్తు క్షపాయేష్వృతుషు స్మృతాః। తేషుతత్ప్రత్యనీకాఢ్యం భుంజీతపితరేవతు। యేషుచాపి భవేయుశ్చ ది

వసా భృశ [illegible] షుతత్కాలవిహితమపరాహ్ణే ప్రశస్యతే । రజ న్యో దివస [illegible] చాపి సమాస్మృతాః । కృత్వా సమమహోరాత్రం తేషు భుంజీ [illegible] ప్రాప్తాతీతకాలంవా హీనాధికమథాపివా । అ ప్రాప్తకాలే [illegible] రేహ్యాలఘావరః । తాంస్తాన్వ్యాధీనవాప్నోతి మర ణంవా నియచ్ఛతి । [illegible] కాలే భుంజానో వాయునోపహతేఽనలే । కృఛ్రాద్వి పచ్యతే భుక్తం [illegible] ంచ నకాంక్షతి । హీనమాత్రమసంతోషం కరోతిచ బ లక్షయమితి॥

## భోజనవిధానము.

దేవపూజానంతరమునందు భోజనవిధానమును జెప్పుచున్నారము. భుజధాతువునకు పాలనమును తినడమును అర్థము. దానివిధానమును విశేష ముగా తెలియఁజేయుచున్నాము. భోజనమునకై సిద్ధపరచిన యన్నమందైదవ భాగము దేవపితృమనుష్యకీటకాదులకు తదనుగుణముగా పంచిపెట్టుట సంవి భాగమనిపించుకొనును- గావున దేవాదులకు విభజించి గృహస్థు శేషించినప దార్థము ననుభవించవలయునని దక్షుఁడు.

సాయంప్రాతఃకాలములయందు ద్విజులకు రెండుమార్లు దేవతలచే నిర్మించబడినది. మరల మరల భుజించగూడదు. ఇటుల జరిగించిన భోజనమగ్ని హోత్రముజేయుటతో సమమైనవిధియని మనువు.

సాయంప్రాతఃకాలములయందు మనుష్యులకును ప్రాతస్సంగవసా యంకాలములయందు పశువులకును భోజనమని యాజుషశ్రుతి. వృషభమును బ్రహ్మచారియు నాహితాగ్నియు నీముగ్గురును దృఢముగ భుజించుచుండిన యుపయోగములేకుండిన గార్యమునకుపయోగించరు. పగలుభోజనమొకప ర్యాయమెతప్ప నితరకాలములయందు కందమూలఫలములకంటె నన్నము భ క్షించగూడదని యాపస్తంబులు.

వృషభము బరువుమోయుటకును బ్రహ్మచారి గురుశుశ్రూష జేయుట కాహితాగ్ని వహ్నిపరిచర్యనొనర్చుటకును తుష్టిగా భుజించినపుష్టిగలిగి యు పయోగించెదరని యనుజ్ఞ జేయబడెను.

ప్రవాసములేని బ్రాహ్మణులకు రెండుమారులు భోజనములు ఋషుల చే జెప్పబడెను. ఎల్లప్పుడును పగటియందును రాత్రియందును జామున్నరప ర్యంతము భోజనమునకు సమయమని నిర్ణయించబడెను- మన్వాదిస్మృతుల యందు సాయంప్రాతశ్శబ్దములకు దీనిననుసరించి వ్యాఖ్యానము సేయుదగును.

పగలు జామునకు లోనుగ భోజనముసేయుతగదు. రెండుజాముల నతిక్రమించదగదు. రాత్రియందు యామములోగా భుజించి పైని రెండుయామములు నిద్రించిన సుఖియగునని చరకుడనుఋషి. పగలుజామునకు లోనుగ భోజనముసేయుతగదనుట పూర్వోక్తమగు సత్కార్మాచరణమునకు వ్యవధి కలుగదనియును పగటియందె తినుగ నాకలి కలుగుననియును రెండుజాములకుపైని భుజించతగదనుట రాత్రి జామునకులోనుగ భుజించుటకు యాకలి కలుగదనియును రాత్రి రెండవజామున భుజించిన నిద్రజాలక యజీర్ణ ముత్పన్నమగుననియు నిట్లు సుప్తకాలభోజనాదులవలన నానారోగము లుత్పన్నమగునని యాహారనిద్రలకు కాలము నియమించబడెను.

ఇందుకు సుశ్రుతమందును జెప్పబడెను. సుఖముగ నున్నతాసనమందు సమదేహుడై కూర్చుండి యుక్తకాలమందు క్షుధానుసారముగ చులకదనము గలిగి చమురుగలిగి వేగముగజీర్ణించునట్టి వేడిగలుగు నన్నాదికమును ద్రవద్రవ్యముత్తరమందు గలుగునట్లుగ నాకలిగలవాడై మోతాదుగా పైనిజెప్పినశాస్త్రనియమితకాలము నపేక్షించక తత్కాలానుగుణముగ భుజించవలయునని జెప్పబడెను.

కాలమునందు భుజించునది ప్రీతినిబుట్టించును. సామ్యముగునన్నము బాధించదు. లఘుపదార్థము శీఘ్రముగ జీర్ణమగును. చమురుగలిగినది బలమును, వేడిగలుగునది జఠరమును వృద్ధిబొందించును. వేగముగ భుజించిన సమముగ పచనమగును. ద్రవోత్తరమైన దోషముగలుగకుండును. మోతాదువలన సుగమముగ జీర్ణించి సమధాతువును జేయును. రాత్రి యధికమగు కాలమందున ప్రాతఃకాలమందు భుజించవలయును. పగలధికమగు కాలమందరాహ్ణామందు భుజించవలయునని జెప్పుట స్వవ్యతిరిక్తఫలాదికమును భుజించిన యాచారకాండకు బాధించదు. అహోరాత్రములు సమమగుకాలమందు కాలమును విభజించి భుజించవలయును. ఆకలిలేకుండిన మిగుల నాకలిసహించినపిమ్మట భుజించుట అప్రాప్తకాలభోజనమనుపించుకొనునందువలన శరీరమందు లాఘవములేక ననేకవ్యాధులను బొందించును. లేక మృతినిబొందించును. ఉక్తాతీతకాలమందు భుజించిన వాయువుచే జఠరము గొట్టబడి కష్టమువలన నన్నమును జీర్ణింపజేయును. మరలభోజనము నపేక్షించకుండును. తుష్టిపుష్టులులేక బలమును క్షయింపజేయును.

పుణ్యగంధశ్శస్తమాల్యధారీచైవ నరేశ్వర। నైకవస్త్రధరో ధౌతపా

ణిపాదోమహీపతే। విశుద్ధవదనఃప్రీతో భుంజీతనవిదిఙ్ముఖ ఇతి శ్రీవిష్ణుపురాణేభి హితత్వాదనులేపనపుష్పధారణగుణానితల్లక్షణానిచవిశేషేణాభిధాస్యామః॥

చందనభేద తల్లేపనగుణాశ్చ.

చందనం ఘుసృణోపేత మీషత్కస్తూరికాయుతం। ఆదావుద్వర్తయే దంగం పశ్చాత్తంచ ప్రలేపయేత్॥

చందయతీతి చందనః చదిఆహ్లాదనే । కేస్తూయతఇతి కస్తూరీ ష్టుఞ్ స్తుతౌ॥ శ్రీఖండేన విలేపనం తనుభృతా మంగేష్వనంగోద్భవం క్రీడాలంపటచేతసా మతితరా మానందకందాంకురం। కక్షోరస్థల కంఠనాళ విగళద్దుర్గంధ నిర్నాశనం వర్ణ్యం వాతకఫాస్రపైత్యశమనం సౌభాగ్యదం మోహనం॥

లేపం చందనకర్దమేనరచితం సౌభాగ్యసంపత్కరం పుష్టిం సంతనుతే విసర్పకహరం పైత్యాస్రశోపంహరేత్। దాహోదేహగతిం నభిత్తి తరసా తత్తద్గుణం తద్గుణం శుద్ధైః పూర్వకృతై ర్విశిష్టమనుజైర్యుక్తం వినాలభ్యతే॥

అథాతస్సంప్రవక్ష్యామి ఋతుకాలానులేపనం। భోగినాం సౌఖ్యజననం దుఃఖదారిద్ర్యనాశనం॥ హిమాంబుసిక్తేన సుపేషితేన జాతీప్రసూనాద్యధివాసితేన। పాటీరపంకేన కృతప్రలేపో ప్రశస్యతే శారదదోషశాంత్యై॥ వసంతకాలే ఘుసృణేనయుక్తం కస్తూరికాచందనచారులేపః । అవాసితంచేన్నవమల్లికాభిస్త్రిదోషజిన్మన్మథజన్మభూమిః॥ హిమసలిలవిఘృష్టం చందనంచంద్రయుక్తం సురభితమతిహృద్యైర్మల్లికాద్యైః ప్రసూనైః। అపహరతిజనానాం తాపమాలేపమాత్రాన్నిఖిలమపి నిదాఘే కామసౌఖ్యం తనోతి॥ కృష్ణాగరుస్నేహవిమిశ్రితేన కస్తూరికాకర్దమమర్దితేన । కాశ్మీరపంకేన కృతప్రలేపో హైమంతికానాశు నిహంతిదోషాన్॥ వికృష్ణకృష్ణాగరుకుంకుమాద్యం కస్తూరికాచందనచారులేపః। పుష్పైస్సుధూపైఃపరివాసితంస్యా ద్వర్షాసు వాతాదినివారణాయ॥ చందనేన సహసూక్ష్మపేషితం కుంకుమం సమృగనాభిసాంకవం। లేపయేదగరుతైలవిమిశ్రం శీతకాలభవదోషశాంతయే॥

చందనం దేశభేదేన చతుర్విధముదాహృతం। శ్రేష్ఠంమలయజంతత్రమధ్యమం యవనోద్భవం। అధమం బర్బరోద్భూతం దుష్టం పాంచాలసంభవం॥ చతుర్విధలక్షణాన్యుచ్యంతే॥ మధువర్ణం కటుశీతలం మలయజం శ్రేష్ఠంచ తద్గ్రంధికం॥ ఆపీతచ్ఛవితిక్తశీతలగుణం తద్యావనం మధ్యమం॥ శ్వేతంచాద్రకవర్ణ తాంకలయతే తచ్చాధమం బర్బరం॥ దుష్టం క్లిష్టమగంధముష్ణమధురం పాంచాలదేశోద్భవం॥ యస్యచ్ఛేదేరుణస్స్నిగ్ధం ఖాదే తిక్తం సుగంధిచ। పీతంఘర్షేసి

తంశోషేతచ్ఛ్రేష్ఠం చందనం స్మృతం॥ ఖాదేతిక్తం కసేపీతం ఖండేరక్తం తు లాఘవః। గ్రంథికోటరసంయుక్తం షడ్విధం గంధముత్తమం॥ దుష్టలక్షణాని వదామః॥ నిస్సారం బర్బరం రూక్షం శ్వేతంలఘుశిలాతలే। నిర్గంధ మగ్నితోయాభ్యాం క్లిష్టం తద్దుష్టచందనం॥ పునశ్చందనగుణాన్బ్రూమః॥ శ్రీగంధం మేహకుష్ఠం క్రిమివిషనిచయం శ్లేష్మకండూనిహన్యాచ్ఛ్రమశ్వాస్యం దాహపైత్యప్రదర మరుచికం హంతి వాంతివ్రణఘ్నం। శ్రీఖండంస్స్వాదుతిక్తం శ్రమరుధిరహరం తీవ్రతాపజ్వరఘ్నం లక్ష్మీవాసం విసర్పిభ్రమమదశమనం శీతలం రాజపూజ్యం॥ దుష్టచందనమతీవపైత్యళం ప్లీహపాండు మదదాహకారిణం। తిక్తమల్పకటుచామ్లపైత్యకృద్వాతనాశనకరం బలహీనం॥

రక్తచందనమప్యాహుస్స్వాదుతిక్తం సుశీతలం। రక్తోద్రేకహరం హంతి పైత్యకోపం సుదారుణం॥

*చందనభేదములు వాటిలేపనగుణములు.

పవిత్రమగు గంధపుష్పమాలికలను ధరించి హస్తములను పాదములను గడిగి పరిశుద్ధముఖుడగుచు భుజింపవలయుననియు ఏకవస్త్రధరుండును అగ్న్యాదిదిదిజ్ముఖుండునై భుజించదగదనియు విష్ణుపురాణమందు జెప్పబడుటవలనచందనపుష్పధారణగుణములను లక్షణములనువిశేషముగ జెప్పుచున్నారము.

కుంకుమతోగలసిన చందనములో నించుకకస్తూరిగలిపి ముందుగ శరీరమున నలుగుబెట్టి యనంతరమందా చందనమును బూయవలెను. ఆహ్లాదమును గలిగించునదియని చందనశబ్దమునకర్థము- స్తుతిజేయబడునదియని కస్తూరీశబ్దమునకర్థము.

శరీరధారులకవయవములయందు చందనలేపనము మన్మథోద్దీపకమును రతిలంపటులకు మిగులనానందకరమును- బాహుమూలోరుమూలకంఠనాశములవలన గలుగు దుర్గంధముల నశింపజేయును. వాతమును, కఫమును, రక్తపైత్యమును శమింపజేయును. సౌభాగ్యప్రదమును, మోహకరమును, పుష్టికరమును, విసర్పాదిరోగకరమును, దేహతాపాపనోదమును. ఋతుభేదమువలన గుణవిశేషము గలిగించు నిట్టిచందనము పూర్వపుణ్యము గలుగు నుత్కృష్టులచే ననుభవింపబడును.

ఇంకఋతువులననుసరించి గంధలేపనవిశేషములను వ్రాయుచున్నారము. ఇది భోగవంతులకు సౌఖ్యజనకమును దుఃఖదారిద్ర్యవినాశనమును.

శరదృతువునందు పన్నీటితో గంధమురీసి జాజిపువ్వులు మొదలగువా

టిచే వాసితమగు మంచిగంధము పూయుట ప్రశస్తము.

వసంతర్తువున కుంకుమ కస్తూరియును గలిపి మల్లెపువ్వులచే వాసితమగు చందనపంకము బూసిన త్రిదోషశాంతినిజేసి మన్మథోత్పత్తిని జేయును.

గ్రీష్మర్తువునందు పన్నీటితో గంధమదీసి కర్పూరముగలిపి రక్తోత్పలాది కుసుమములచేత వాసితమైన చందనము ఆలేపనమాత్రముచేత జనులయొక్క నిఖిలమగు తాపమున్ను హరించి మన్మథసౌఖ్యమును జేసును.

హేమంతఋతువునందు కృష్ణాగరుసంబంధమగు నత్తరవుతో మిశ్రితమై కస్తూరీ కుంకుమపువ్వు వీటిచే మర్దితమగు చందనము బూసిన సకలదోషములను శోషింపజేయును.

వర్షర్తువునందు కృష్ణాగరుగంధమును కస్తూరీకుంకుమాదులతో గలిపి పువ్వులచేతను మంచిధూపములచేతను వాసితమగునది పూసిన వాతాదినివారణమగును.

శైశిరర్తువునందు హేమంతర్తూక్త చందనమందించుకంత జవ్వాది గలిపి బూసిన తత్కాలదోషశాంతికరమగును.

దేశభేదముచే జందనము నాల్గువిధములందు మలయజము శ్రేష్ఠము. యవనదేశోద్భవము మధ్యమము- బర్బరదేశసంభవమధమము. పాంచాలదేశజాతము దుష్టము. ఈనాల్గింటికి లక్షణములను జెప్పుచున్నారము.

తేనెరంగు చేదు చల్లదనమును గలుగునది మలయజమిది శ్రేష్ఠము. గుంపులును గలిగియుండవలయును.

పచ్చదనముచేదుగలిగిచల్లదనముగలయదియవనదేశభవముమధ్యమము.

తెల్లనిదియు నలుపురంగుగలదియు బర్బరదేశసంభవ మధమము.

వాసనలేక పరుషమై యుష్ణమై మధురమైయుండు చందనము పాంచాలదేశీయమిది దుష్టము.

ఏచందనకాష్ఠము ఛేదించిన నెరుపు చమురును గలిగియుండునో తినిన చేదుగలిగి సుగంధయుక్తమై యరగదీసిన పచ్చనై యుండిన తెల్లనై యొప్పు చందనము శ్రేష్ఠము.

మరియును తూచిన బరువుగలిగి గ్రంధికోటరయుక్తమగు చందనము త్తమమింకదుష్టలక్షణములను జెప్పుచున్నారము.

చేవలేక గరుగుగలిగి పరుషమై తెల్లనై చులకనై యగ్నియందు వేసిన యుదకముతో రాసిన నిర్గంధమై క్లిష్టమై యుండునది దుష్టచందనము.

మరియు చందనగుణములను జెప్పుచున్నారము. శ్రీగంధము పేహతు ష్ఠమును క్రిమివిషాదులను శ్లేష్మమును దురదలను పోగొట్టును. నేత్రములకు చల వజేయును. దాహము పైత్యము రక్తస్రావము అరోచకము వాంతి వ్రణము వీటిని శాంతింపజేయును. శ్రమను దుష్టరక్తమును తాపజ్వరమును బోగొట్టు ను. లక్ష్మీకరము శీతలము రాజపూజ్యము. దుష్టచందనముబూసిన పైత్యము స్త్రీ హపాండు మదదాహములను గలిగించును. తీక్ష్ణమై యించుక చేదు కలిగినది యామ్లపైత్యములను బుట్టించును. వాతమును బలమును బోగొట్టును.

రక్తచందనము స్వాదు, చేదు, చల్లదనమును గలిగి రక్తదోషమును, పైత్యప్రకోపమును బోగొట్టునని చెప్పబడును.

## జవాదీగుణాస్తల్లేపనవిధిశ్చ.

అధ జవాదిగుణాంస్తల్లేపనవిధించ వివిచ్యామః॥ శుద్ధా రాజకుమార భోగసుఖదా సౌభాగ్యపుష్టిప్రదా హృద్యా స్వేదమలాదిమోచనకరీ లావ ణ్యసంధాయినీ। దోషఘ్నీ శ్రమకుష్ఠదుర్మతిహరా కాంతామనోరంజనీ భూా తప్రేతపిశాచదర్పశమనీ శ్రేష్ఠా జవాదీస్మృతా॥ స్నిగ్ధోష్ణోమధురస్సతిక్తలవ ణస్స్యాందోః గురుః పిచ్ఛల స్స్వచ్ఛశ్శుక్లవివర్ధనో విషహరః కేశ్య స్సుగంధీశు భః। కండూకుష్ఠకఫానిలః క్రిమిహరః కాంత్యావహః పుష్టికృద్వశ్యో వర్ణబల ప్రదో మృగమదస్సౌభాగ్యలక్ష్మీకరః॥ జవాదిలేపనంకుర్యా ద్దేమంతే ప్రబలేపి చ। దాహమూలే శ్రవణయోర్నాభికంఠస్థలేషుచ। ఉత్తమాంగోత్తరోష్ఠేచ పాదాంగుష్ఠే ప్రలేపమేత్॥

## జవాదిలేపనవిధియు గుణములును.

జవాదిగుణములను దానిబూయురీతిని వివేచనము జేసెదము. జవాది పరిశుద్ధమైనది రాజులకు భోగసౌఖ్యమును జేయును. సౌభాగ్యపుష్టిప్రదమగు నది- మనోహరమగునది చెమటమొదలగు మాలిన్యములను బోగొట్టును. లా వణ్యమును జేయును. శ్రమ కుష్ఠ బుద్ధిజాడ్యము మొదలగు దోషములను నశిం పజేయును. స్త్రీమనోరంజకమై యుచి భూతప్రేతపిశాచాది దర్పములను శాం తింపజేయును. శ్రేష్ఠము. మరియును చమురుగలిగి వేడిమి మాధుర్యతిక్తరస ములును గలిగి చిక్కనై బరువుగలిగి కరడుగట్టి పరిశుద్ధమై శుక్లవృద్ధిని జేయు ను. విషహరము కేశసంస్కారయోగ్యము మంచిగంధముగలదై దురదలను శ్లేష్మమును వాతమును క్రిములను హరించును- కాంతిని జేయును.

వోత్పాదినీ॥ కస్తూరీకఫవాతరక్తశమనీ హృద్యాసుగంధప్రదా సౌభాగ్యప్రభ వా యశస్కరవతీ వశ్యా పరం బృంహణీవృష్యాకాంతికరీ శుభాశుభకరీలా వణ్యాలక్ష్మీకరీ యత్స్మాశోథవిషాపహా శ్రమహరా తిక్తా కుళుద్ధా సదా॥ కస్తూరీమదనోదయే మదకరీ వశ్యాపరం పిండికా వాతోస్రుక్కఫపైత్య పిత్త పిటకా కండూస్సదాహారిణీ। చేతఃకాంతిహరీ విషజ్వరహరీ కాంతామనోహారిణీ శ్రీ సౌభాగ్య యశస్కరీ మలహరీ లక్ష్మీకరీభూభుజాం॥ కస్తూరీ సురభిః కఫార్తి పిటకా కండూతివిధ్వంసినీ సౌభాగ్యామలదోష మోచనకరీ వృష్యా గురుః బృంహణీ। తేజఃకాంతివివర్ధనీ విషహరీ చేతోవికారాపహా వాల్యంపుష్టి యశస్కరీ జ్వరహరీ సౌలభ్యసంధాయికా॥ కస్తూరీ స్మరమందిరేచవసతిం ఫాలే గళే వక్షసి స్యాద్వాహ్వోః కుచమండలేచ కురుతే శోభాం కురంగీదృశాం। తద్వత్కుక్షికుచాక్షిసంధిషు పునస్సౌఖ్యార్థమేవంభజేత్తాంస్యాత్సర్వరుజాపహా న్నృపజనై ర్నిత్యం ముహుస్సేవ్యతే॥ కస్తూర్యండోతిసురభిః ప్రీతిపుష్టిబలావహః। వృష్యశ్శ్రిమక్లమహరః కఫానిలహరంపరం। మృగనాభిభవస్స్నిగ్ధశ్చ శికస్తూరికాన్వితః। మూర్ఛామదభ్రిమాలక్ష్మీ వాతపైత్యకఫార్తిజిత్॥ సుశీతంవాతఘ్నం క్రిమివ్రణహరం కుష్ఠశమనం సుగంధం పూత్యండం సుబలమసనోత్కాంతిమధికం। మనోజ్ఞోయంకండూశ్శమయతి పరం శుక్లమధికం శ్రియంకీర్తిం తేజః ప్రియమపి తనోత్యాశు విషనుత్॥

### పంచవిధకస్తూరీలక్షణములు వాటిగుణములును.

ఇటుపైని కస్తూరియొక్క గుణములు మొదలగువాటిని జెప్పుచున్నారము.

కేళికా- తిలకా- కుళుద్ధా- పిండకా- నాయికా యని యైదువిధములు కస్తూరి. క్రమముగా వీటిలక్షణములను జెప్పుచున్నారము.

కేళికయను కస్తూరి పూర్ణరూపమైయుండును. తిలకయనునది తిలలవలె నుండును. కుళుద్ధయనునది ఉలవలవలెనుండును. పిండకయనునది యులవలకంటె పెద్దపెద్దయుండలుగలిగియుండును. నాయికయనునది నింతకంటె పెద్దయుండలుగలదైయుండును. వీటిలో పూర్వపూర్వముకంటె నుత్తరోత్తరము శ్రేష్ఠము.

కామరూపదేశమందుబుట్టిన కస్తూరి నలుపుగలిగియుండును- ఇది యుత్తమము. నేపాళదేశమందు బుట్టినయది మెరుపుగలిగి యుండు నది మధ్యమము. కాశ్మీరదేశీయము కపిలవర్ణమదియధమము.

ఏకస్తూరి మొగలిపువ్వులవాసన పింజరవర్ణమును గలిగి చేదు, వగ్ర, వేడి, చులకదనము, మర్దించినపైని నునుపుగలిగి నిప్పుమీద వేసిన చిమిచిమిధ్వనితో కమురువాసనగలిగియుండునో యదిమంచివృగములవలన బుట్టినట్టిది శ్రేష్ఠమనియు దేవతలకు రాజులకును యోగ్యమనియు జెప్పబడెను.

ఏకస్తూరి చమురులేక పొగవాసనగలిగియుండునో యదియగ్నియందు వేసిన పిండివలెనుడికి యప్పుడే భస్మమగునో త్రాసుయందువేసిన చులకదనము ను మర్దించిన గరుగుగలిగియుండునో యది కృత్రిమమని జెప్పబడును. బుద్ధివంతులచే నది విడువదగినది.

బరువు, చిక్కన, రక్తవర్ణము, కరుకు, నిష్ఠురవర్ణముగలిగి వహ్నియందుంచిన భస్మమైనను లేక కాలిపోయినను కస్తూరి ప్రశస్తము గాదు. ఏకస్తూరి యుదకముతో గలిపి భస్మస్థలమందుంచి ముహూర్తమాత్రముజూచిన యుదకమును హరించి మెరుపుగలదైయుండిన నాకస్తూరి కృత్రిమజాతియని తెలియదగను. హస్తతలమందు జలముంచి యందు కస్తూరివేసి ముహూర్తమాత్రమైనపిమ్మట నాజలము పచ్చనదిగాకపోయిన యది కృత్రిమమని ప్రసిద్ధము.

అయినవిధములగు కస్తూరిగుణములను జెప్పుచున్నారము. కస్తూరి వగరు, చేదు, యుప్పన గలిగి యించుకంత వేడి, చులకదనము, నునుపు గలిగి మలబంధాదిదోషహారియై బలకరమై మృదువైయుండునది కేళియను కస్తూరి. ఇది వాతము, రక్తదోషము, క్రిమిదోషము, శోభరోగము, వమనము, విసర్పి మొదలగు చర్మదోషము, దురదమొదలగు దద్రుదోషములను, కృశత్వమును, క్షీణేంద్రియత్వమును బోగొట్టును.

కఫవాతరక్తములను శమింపజేయును- హృద్యము, మిక్కిలిగురుత్వమును జేయునది- శ్యామలకాంతినిజేయును- త్రిదోషహరము- సంపత్కరము- క్రిమినాశనము- చేదు, వగ్ర గలుగును. ఇదితిలకయనుకస్తూరి- సౌఖ్యమును, కీర్తిని, దయను, నేత్రోత్సవమును జేయును.

కిఫవాతరక్తములను బోగొట్టి మనోహరమై, సుగంధమై, సౌభాగ్యప్రదమై, కీర్తికరమై, వశీకరమై, గురుత్వముసేయునదియై, బలకరమై, కాంతిప్రదమై, శుభాశుభముల జేయునదియై శరీరశోభను గలిగించి కుష్ఠుశోభవిషాదులను హరించి శ్రమహరమై, చేదుగల కస్తూరి కుళుద్ధయనబడును.

పిండకయను కస్తూరి మదనోదయమందు మదకరము- వశంకరము- వాతరక్తకఫపైత్యపిటకకండూదిదోషములను హరించును. మనస్సునకు ప్రసన్నతనిచ్చును. విషజ్వరములను పోగొట్టును. స్త్రీలకు మనోహరము, సౌభాగ్యకీర్తి

కరము- మలనాశకము- రాజులకు లక్ష్మీకరమై యుండును. తేజఃకాంతులను జేయును- విషమునణచును- మనోవికారములమూరపరచును- యశఃపుష్టులను జేయును- జ్వరమును హరించును- సౌభాగ్యమునుగూర్చును- పిండయను కస్తూరి పరిమళముగలిగి కఫమును, దురదను, మాలిన్యదోషములను పోగొట్టును. సౌభాగ్యప్రదము- తుష్టికరము- విషహరము- తేజఃకాంతులను వృద్ధిబొందించును.

నాయికయను కస్తూరి పుష్టిని కీర్తిని ఆరోగ్యమును జేయును. లలాటమందును, గళమందును, వక్షస్థలమందును, బాహువులందును, కుచములయందును, ఊరుమూలమందును ధరించిన స్త్రీలకు శోభను జేయును. మరియును కుక్షి భ్రూమధ్యము మొదలగు స్థలములయందు ధరించు రాజులకు సుఖమును జేయును.

కస్తూరిపిల్లి పరిమళముగలిగి సంతోషమును పుష్టిని బలమును జేయును. శ్రమమును, శోషమును, కఫమును, వాయువును బోగొట్టును.

కస్తూరిచమురులో కర్పూరమును, కస్తూరియునుగలిపి సేవించిన మూర్ఛ, మదము, భ్రమము, అలక్ష్మి, త్రిదోషము మొదలగు పీడలను బోగొట్టును.

బూతిపిల్లిగడ్డ మేహవాతములను, క్రిములను, కురుపులను, కుష్ఠును శాంతింపజేయును. పరిమళముగలిగి బలమును కాంతిని బుట్టించును. శుక్లాభివృద్ధిని జేయును. తేజఃకీర్తి లక్ష్మీకరము- విషహరము.

అగరు తత్తైలగుణాస్తద్ధారణవిధిశ్చ.

కృష్ణాగ్రప్రధానమగరు మజ్జత్యంభసి లోహవత్। ఉత్తరేస్యాత్ప్రసంకాశం మధ్యమంతు విముస్వధాః॥ సుగంధం మధురం స్వేద మేదో దౌర్గంధ్యనాశనం। కటుతిక్తం గురుస్నిగ్ధం వాతఘ్నంచ కఫాపహం । శీతం నేత్రరుజం హంతి మాంగళ్యం కుష్ఠునుత్పరం॥ అగరువాతబలస్యవినాశనం కటుకతీక్ష్ణమయోష్ణమహో తిలం। ఘుస్ఫణసానుబలంచ సమీరజిత్సురుచిరం వ్రణశోధనరోపణం॥ కృష్ణాగరుశ్లేష్మహరం విష మేహహరం పరం। స్నిగ్ధం తిక్తం కటూష్ణంచ పవనామయనాశనం॥ దుర్గంధం హంతి తిక్తం సకటుకమగరు స్వేదమేదఃకఫఘ్నం శ్రోత్రే నేత్రేచ కుష్ఠే హితమనిలహరం స్నిగ్ధముష్ణం క్రిమిఘ్నం। తత్తైలం తీక్ష్ణముష్ణం సకటుకముదితం శ్లేష్మమేదోనిలఘ్నం హృద్యంకాసం నిహన్యాత్ త్రిక్రిమికులశమనం పైత్యరక్తాపహంచ॥ శశికస్తూరిసంయుక్తం శతపత్రాంబువర్ధితం । సుగంధమగరుస్నేహః కించిదుష్ణాస్రపైత్యజిత్॥ కక్షభాగే కంఠసంధౌ నాభౌ

కంఠుణయోరపి। స్వేదదౌర్గంధ్యనాశార్థమాలిపేదగరుద్రవం॥ హృష్య మాహ్లాదనం హృద్యం నిర్మలం శీతలం లఘు। గ్లానౌ పైత్యే కఫే దాహే హితం పుష్పోద్భవం జలం॥

## అగరును దానితైలగుణములును ధారణవిధియును.

కృష్ణాగరు యుదకమునందు యినుమువలె మునుఁగు నది శ్రేష్ఠము. ఆకువలె తేలినయగరు మధ్యమమని పెద్దలు సెప్పెదరు. పరిమళముగల్గి మనోహరమై స్వేదాదిదుర్గంధము నణచును. చేదు, వగ్ర, బలువు, నునుపును గల్గి వాతకఫములను హరించును. నేత్రరోగమును కుష్ఠును హరించును. కృష్ణాగరు శ్లేష్మమును, విషమును, మేహమును వారించును. క్రిములను బోగొట్టును.

ఈకృష్ణాగరుతైలము వెట్టజేయును. శ్లేష్మమును, మేదస్సును, వాయువును, శ్వాసకాసలను, రక్తపైత్యమును, క్రిములను నశింపజేయును.

కర్పూరము కస్తూరియును గలపి తామరపువ్వుల మకరందముతో గూర్చిన యగరుతైలము రక్తపైత్యమును హరించును. కక్షములందు, కంఠసంధులను, నాభియందు, నూరుసంధులందును చెమటవలనబుట్టిన దుర్గంధము నణచుటకు కృష్ణాగరుద్రవమును బూయవలెను.

పన్నీరు, కేవడా మొదలగు పుష్పరసములు సంతోషమును, శరీరోల్లాసమును, నిర్మలత్వమును, చల్లదనమును గలుగజేయును. శరీరము వాడిన పైత్యకఫదాహాదులయందును మిక్కిలి హితమై యుండును.

## కుంకుమభేదాస్తద్గుణాశ్చ.

అథకుంకుమభేదాంస్తత్తద్గుణాంశ్చవ్యాఖ్యాస్యామః॥ కుష్కాదశాయాం కుమితి కాయతే కుంకుమం॥ కుశబ్దే॥ కాశ్మీరజం బాహ్లీకసంభవంచ। నేపాళజం పారసిదేశజంచ క్రమేణ తల్లక్షణముచ్యతేథ॥

అతిరక్తం చిక్కణంచ కించిద్ధూమ్రాలాగ్రకేసరం। కల్హారగంధిసుస్నిగ్ధం శ్రేష్ఠంకాశ్మీరకుంకుమం॥ బాహ్లీకదేశసంజాతం కుంకుమం పాండువర్ణకం। మధుగంధయుతం తిక్తం మధ్యమం సూక్ష్మకేసరీ॥ నేపాళదేశసంభూతం హరిద్రాగంధికుంకుమం। అతిచిక్కణదూతామ్రమధురం సూక్ష్మకేసరం॥ ఆపాండురం ఖరంస్థూలం కేసరం మధుగంధిచ। పూర్వోక్తగుణతోహీనం పారసీకంచ కుంకుమం॥

పాకేస్వాదు రసేచతిక్తకటుకం స్నిగ్ధోష్ణతీక్ష్ణంరసం వృష్యంహృద్యతమం విషవ్రణహరం మేధ్యం త్రిదోషాపహం । ఆయుష్యం మదశోషకృఛ్రస్వనత్వగ్దృక్ఛిరోరోగజి త్కామ్యం శ్రీమతి వర్ణకాంతిబలకృ త్సౌభాగ్యదం కుంకుమం॥ కుంకుమం సురభితిక్తకటూష్ణం కాసవాతకఫకంఠరుజాఘ్నం । మూర్ధ్నిశూలవిషదోష మోచనం శోభనంచ తనుకాంతికరంచ॥ కుంకుమంజయతి పాండుమంధనం కండుకుష్ఠపిటకాదినాశనం। లింగపామరసదోషనాశనం దద్రుశోభపిటకాక్షిరుగ్రహం॥

## కుంకుమపువ్వుయొక్క భేదములును వాటిగుణములును.

కుంకుమపువ్వుగుణమును జెప్పుచున్నారము. ఎండినప్పుడు కుంకుమయని పలుకునదిగాన కుంకుమయనబడును. కాశ్మీర, బాహ్లీక, నేపాళ, పారసీక దేశములయందు బుట్టిన కుంకుమపువ్వు నాలుగువిధములు కలది.

వీటిలక్షణములను జెప్పుచున్నారము. కాశ్మీరదేశమునందగు కుంకుమపువ్వు మిక్కిలియెరుపు చిక్కన యించుకముతక పొడవుగల కేసరములు గలిగి యెఱ్ఱగలువవాసనతో చమురుగలిగియుండునది శ్రేష్ఠము.

బాహ్లీకదేశమునందగు కుంకుమపువ్వు పాండువర్ణముగలిగి మధుగంధము, చేదు, సన్నమగు కేసరములతోనుండును. ఇదిమధ్యమము,

నేపాళదేశమునందగు కుంకుమపువ్వు పసపుగంధము గలిగి మిక్కిలి చిక్కనై యెరుపు మధురము సూక్ష్మకేసరములు గలిగి పైనిజెప్పినదానికంటె తక్కువదయ్యుండును.

పారసీకదేశమునందు బుట్టినకుంకుమపువ్వు- పాండువర్ణము, పారుష్యము, స్థౌల్యము, మధుగంధముగల కేసరములతో నొప్పునది పూర్వోక్తమైన దానికంటె హీనము.

కుంకుమపువ్వును పరిపాకమునందు పరిమళము రుచియందు వెగటును, చేదును రసమునందు నునుపును, వెట్టయును మనోహరము- బలకరము- పవిత్రము- త్రిదోషహరము- ఆయుర్వర్ధనము- మద శోష మూత్రకృఛ్రస్వనరోగములను చర్మదృష్టిశిరోరోగములను బోగొట్టును. కోరతగినది- శోభను, మతిని, దేహకాంతిని, బలమును జేయునది.

పాండు కండూ కుష్ఠ కంతులను, లింగరోగములను, గజ్జిని, రసముల వలనబుట్టినదోషములను, దద్రుపొంగు నేత్రరోగములను బోగొట్టును.

## కర్పూరభేదాస్తద్గుణాశ్చ.

అనేకశాస్త్రాంతరతస్సారం సంగృహ్య యత్నతః। కర్పూరాది సుగంధానాం వర్గోత్ర సముదీర్యతే॥ కల్పతే సుఖాయ కర్పూరం। కృపూసామర్థ్యే॥

శశిప్రభం శంఖనిభం శ్యామం కృష్ణంచ పీతకం। కర్పూరం పంచధా వింద్యాత్కృతాకృతవిభేదతః॥ శాండిల్యమతే॥ పోతాశ్రయం భీమసేనం చంద్రభాసాహ్వయంతథా। ఈశావాసం రజఃపుంజం ఘనసారంచ జూటికం। హిమవాలం తుషారంచ హిమశీతలపిచ్ఛకే। ఇత్యాదీన్ప్రాహ శాండిల్యో భేదాన్కర్పూరజాన్బహూన్॥

పోతాశ్రయంతు కర్పూరం స్ఫటికాభం సుదుర్లభం। తథైవభీమసేనం చ విశుద్ధం పాండురప్రభం। చంద్రవద్భాసతే యస్తు చంద్రభాసం తదుచ్యతే। ఈశావాసంతుకర్పూరమీషత్పీతం సితంరజః। రజఃపుంజసమాభాసం రజఃపుంజం తదుచ్యతే। మనశ్శిలానిభాభాసం సుశ్వేతం ఘనసారకం। జూటికాఖ్యం భవేత్తద్వజ్జూటికాసదృశప్రభం। హిమవాలుకసంకాశం కర్పూరం హిమవాలుకం। తుషారాఖ్యంతు కర్పూరం తుషారకణికాకృతి। హిమవచ్ఛీతలాభాసం ప్రశస్తం హిమశీతలం। శుద్ధస్ఫటికవచ్ఛుభ్రం కర్పూరం పిచ్ఛికాహ్వయం। ఏతత్సమస్తం జానీయాత్పూర్వంపూర్వంగుణాధికం। తత్రాప్యన్యం భవేత్క్షుద్రం స్ఫటికాభం సుదుర్లభం॥

స్వచ్ఛం భృంగాభపత్రంలఘుతరవిశదం తోలనే తిక్తకస్స్యాత్స్వాదే శైత్యంసుహృద్యంబహుళపరిమళామోదసంబంధదాయి।నిస్నేహందార్ఢ్యపత్రం శుభతరమితిచేద్రాజయోగ్యంప్రశస్తం కర్పూరంచాన్యథాచేద్బహుతరవమనస్ఫోటదాయి వ్రణస్స్యాత్॥ కర్పూరం కటుతిక్తకం సుమధురం శీతం జ్వరచ్ఛేదనం చక్షుష్యం విశదం కఫాస్రవిషజిత్తృడ్దాహకృఛ్రప్రణుత్। కండూతిక్రిమిహృత్త్వతక్షయహరం కాంతిప్రదం శ్రీకరం జిహ్వాస్తంభగళగ్రహాస్యజడతాపైచ్ఛిల్యదౌర్గంధ్యజిత్॥ పీతం పోతాశ్రయం వశ్యం భీమ ఈశానవాశ్యకం। ఘనసారంచచీనీకమిక్కిరాచాష్టధా స్మృతం॥ ఘనసారం శ్వేతవర్ణమీశావాసంచ రక్తకం। పీతంచ పీతవర్ణంచ కృష్ణం పోతాశ్రయం తథా। వశ్యం గోధూమవర్ణంచ చీనికం తోయవర్ణకం। ఇక్కిరాక్షీరవర్ణంచ భీమసేనం తథైవచ॥

హిమస్తిక్తః ప్రాయః కటుమధురకృత్పీనసకరస్తృషాదాహంవాన్త్యాన్నయనజనితవ్యాధిశమనః। హితోసౌ పైత్త్యార్తేశ్వరదిచ నిదాఘే నతుహిమే వగ్రీష్మేచ్ఛేదీవీర్యం వితరతి రుచిం శ్యామలశశీ॥ అభ్రికాహ్వయశశీ వృషప్రద

శ్లేష్మశోపశమనస్సుశీతలః। అంగదాహశమనస్తృషాపహ స్స్వాదుతిక్తకటు కోస్రపైత్యహా॥ వశ్యాఖ్యకర్పూరమతిప్రసన్నం శ్లేష్మాపహం కాంతికరం లఘు స్యాత్। క్షారాన్వితం రేచనమగ్నికారి ఛర్దిఘ్నిహన్యా త్సుభగాతిగంధీ॥ భీమసేనతుహిమాంశురుజ్వలశ్శీతలశ్చరమధాతువర్ధనః। దాహమోహవమనస్తృషాపహః ఖాదనే కటురసస్సమంజసః॥ ఈశావాసశశీమదభ్రమహరస్తృష్ణాంగదాహాపహో శ్వేదోన్మాదవికారహో బలకరః కాసంజయేత్స్రంసనః। శోషవ్యాధిహరః క్రిమిక్షయకరః సౌభాగ్యసంవర్ధనో వృష్యః ప్రీతికరో మనోమలహరః పైత్యశ్రమోయచ్ఛతి॥ మేఘసారతుహినాంశురుజ్వలః పాశ్రయశః కటుకతిక్తకషాయకః। ఛర్దిపైత్యశమనోగ్నిదీపనశ్లేష్మదోహరతి సంతతం క్షయం॥ పుష్టిః క్షుష్ణమతో మదభ్రమహరస్స్వేదాస్రపైత్యాపహం జంతూనా మపజీర్ణవాంతిశమనశ్చీనీతివాచ్యశ్శశీ। తిక్తస్త్రీవ్రసమగ్రగంధజటిలశ్శుష్కకృతు యేయోజిత స్తత్ర్రద్యాతగదే దదాతి చలనం శూలాతికాసాన్హరేత్॥ అత్యుత్తమం చిక్కరనామధేయం కర్పూరమాష్టంభజితానరాణాం। త్రిదోషవైవర్ణ్యహరం క్రిమిఘ్నం నేత్రామయఘ్నం లఘుదీపనీయం॥ దగ్ధాఖ్యకర్పూరకముష్ణవీర్యం వాతాపహం శ్లేష్మహరం లఘూష్ణం। హేమంతకాలే హితమగ్నికారీ కర్పూరమిష్టం నవవీనసేషు॥ కర్పూరస్తరుదాహజిత్కాసనజిత్కంఠ్యం కఫచ్ఛేదకృత్తిక్తః పైత్యకరః ప్రసేకశమనం పైచ్ఛిల్యదౌర్గంధ్యజిత్। అటో పారుచివహ్నిసాదశమనో దంతస్థిగత్వాపహస్తృష్ణారోచకనాశనోనిలహరః పాశ్రయః ప్రమేహోవరః॥ కర్పూరం కటుతిక్తంచ మధురం శంఖామయఘ్నం పరం కృచ్ఛ్రఘ్నం విషదోషనాశనకరం కృష్ణాస్రపైత్యాపహం। చక్షుష్యం జ్వరదాహవేగశమనంఛర్ద్యర్తినాముత్తమం రక్తేష్ఠీవనసన్నిపాతశమనం లక్ష్మీకరం దేహినాం॥ కర్పూరం కఫవర్గశోషణకరం మేదఃకరం శ్రీకరం కండుఘ్నంచ సమస్తజంతునివహప్రధ్వంసనం సంసనం। నానారోగహరం గళగ్రహగదాప్రధ్వంసనం పైత్యహం జిహ్వాస్తంభహరం సతిక్తవిశదం దౌర్గంధ్యవైకల్యజిత్॥

తైలం కర్పూజాతం ప్రబలపవనజిత్త్రైత్యకృచ్ఛ్లేష్మహారీ మేదోఘ్నం భేదిహృద్యం క్రిమిహరమరుచిం కుష్ఠమష్టాదశంచ। కుర్యాద్వానద్యమానోద్భవసకలగదాన్హంతి రోగాన్సకృచ్ఛ్రాన్ దంతానాం చంచలానాం దృఢకరమనలోద్దీపనం కాంతిదంచ॥ రత్యుత్సాహకరం విశేషకలితావాచావిశాలోద్భవం శైత్యం ప్రీతికరం మహాబలకరంషణ్మాతృదోషాపహం। వాతశ్లేష్మనికృంతనం లపనదుర్గంధం హరత్యాఖిలం కర్పూరం శకలంతు సేవితమిదం భూపైస్సదా సేవ్యతాం॥

కర్పూరం పలమాత్రంచ మృణాలరసమర్దితం। అథవోత్పలజే యానం మర్దయేత్సుద్ధిర్భవిష్యతి॥

కర్పూరభేదములు వాటిగుణములును.

సకలశాస్త్రసారమును బ్రయత్నమున సంగ్రహించి కర్పూరము మొదలగు సుగంధవర్గము నిచట జెప్పుచున్నారము. సుఖముకొరకు కల్పించబడునది గాన కర్పూరమనబడును.

చంద్రునివలె, శంఖమువలె, శ్యామలమై, కృష్ణవర్ణమై, పచ్చనై పంచవిధములుగలిగి యకృతకృతకభేదముచే నుండును.

పోతాశ్రయమనియు, భీమసేనమనియు, చంద్రభాసమనియు, నీశావాసమనియు, రజఃపుంజమనియు, ఘనసారమనియు, జూటికమనియు, హిమవాలమనియు, తుషారమనియు, హిమశీతలమనియు, పిచ్ఛకమనియు శాండిల్యమతమున కర్పూరము పదివిధములు.

స్ఫటికనిభమై పోతాశ్రయముండు నది దుర్లభము. భీమసేనము నిర్మలమై తెల్లగనుండును, చందురునిచందమున యుందమైయుండు నది చంద్రభాసము. కొంచము పచ్చనై తెల్లనిరంగుగల రజము ఈశావాసము. రజముయొక్క పుంజమువలెనుండునది రజఃపుంజము. మనశ్శిలవలెనుండి తెల్లనైనది ఘనసారము. జెటలవలె నెరసినగునది జూటికమనబడును. ఇసుకవలెనుండునది హిమవాలుకము. మంచుకణికలవలెనుండునది తుషారము. హిమమువలె చల్లనైనది హిమశీతలము. శుద్ధస్ఫటికమువలె నచ్ఛమైనది పిచ్ఛలము. మొదటినుంచి శ్రేష్ఠమును గ్రహించదగును.

నల్లనిపత్రమందుంచిన దెల్లనై, తినినతిక్తమై, తూచిన చులకనై, శీతలమై, హృద్యమై, పరిమళమిచ్చును. చమురులేక గొప్పపలుకులు గలిగినటులైన శుభదాయకము- రాజయోగ్యమును. లేకుండిన వమనమును, పొక్కులను, వ్రణములను బొడమించును.

కర్పూరము చేదై, వెగటై, మనోహరమై, శైత్యమై, తాపమును బోగొట్టును, దృష్టిప్రసాదమును జేయును. నిర్మలముగనుండును. కఫమును, కన్నీళ్లగారుటను, విషబాధను, దాహమును, మంటలను, మూత్రకృఛ్రమును, దురదలను, పురుగులను నరుకును. క్షయను బోగొట్టును. కాంతిని శోభను జేయును. జిహ్వారోగ గళరోగ ముఖవివర్ణతలను చిక్కనగు కఫదౌర్గంధ్యములను గొట్టును.

పీతము, పోతాశ్రయము, వశ్యము, భీమము, ఈశానవాశ్యకము, ఘన

సారము, చీనీకము, ఇక్కిరయు నిది యెనిమిది విధములు. ఇందులో ఘనసారము తెల్లనిది. ఎఱ్ఱనిది ఈశావాశ్యకము. పచ్చనిది పీతము. నల్లనిది పోతాశ్రియము. వశ్యము గోధూమవర్ణకము. చీనీకము జలముతో సరియగు రంగుగలది. క్షీరవర్ణకమిక్కిరయనునది. భీమసేనము పాలరంగుగలదై యుండును. దీనిగుణము చల్లదనములేదు. వఱ్ఱయు నించుక మధురిమయును గలిగి పీనసను జేయును. అతిదాహము- పిపాసను నణచును. నేత్రరోగశాంతికరము. పైత్యరోగికి హితము. శరదృతువునందును, వేసవియందును హితము. హేమంతర్తువునందహితము. వ్రణశాంతికరము. వీర్యవృద్ధిని, కాంతిని జేయును. శ్యామలవర్ణమగు కర్పూరమిట్టిగుణములనే జేయును. అభ్రికమను కర్పూరము పచ్చనై యుండును. వీర్యకరము- శ్లేష్మప్రకోపశమనము- శీతలము- శరీరతాప పిపాసారక్తపైత్యహరము. చేదు వఱ్ఱ గలిగి స్వాదైయుండును. వశ్యమను కర్పూరము మిక్కిలి పరిసన్నము. కఫహరము- కాంతికరము. లఘువు ఉష్ణమై రేచకము. వమనహరము- మనోహరమగు వాసనగలిగియుండును. భీమసేనకర్పూరము ఉజ్వలము- శీతలము- వీర్యకరము- దాహమును, మోహమును, వమనమును శమింపజేయును. కటురసముగలిగియుండును. ఇది బహుప్రశస్తము. ఈశావాస్యమను కర్పూరము మదమును, భ్రమమును, పిపాసను, తనుతాపమును, చెమటను, ఉన్మాదమును, కాసను శమింపజేయును. బలమును జేయును. శోషరోగమును, క్రిములను, క్షయను బోగొట్టును. వీర్యమును, సౌభాగ్యమును, ప్రీతిని జేసి పైత్యమును భ్రమను హరించి మలహరమగును. ఘనసారమనునది ఉజ్వలము- తెరుపుగా వఱ్ఱ, వగరు, చేదును గలిగి తృష్ణ, పైత్యము, సంతతక్షయమును హరించి శ్లేష్మమును జేయును. చీనియను కర్పూరము తృష్ణను, మదమును, భ్రమను, చెమటను, రక్తమును, పైత్యమును, అజీర్ణమును, వాంతిని, శుష్కక్షయమును, శూలను, కాసను హరించి పుష్టిని వాతచలనమును జేసి చేదుగలిగి సమగ్రతీవ్రగంధముగలిగియుండును. ఇక్కిరయనునది అత్యుత్తమము- స్తంభనకారి- త్రిదోషహారి- లఘువు- దీపనము- నేత్రరోగహరము. వైవర్ణ్యమును శమింపజేయును. దగ్ధనామక కర్పూరము వీర్యమును, వాతమును, శ్లేష్మమును జేసి లఘువై, ఉష్ణమై హేమంతఋతువునందు హితము- దీపనము- నూతనపీనసలయందుపయోగము. తరువులను కాల్చుటవలనబుట్టు కర్పూరము దగ్గును, కఫమును, మేదస్సును, దుర్గంధమును, అతిసారమును శమింపజేయును. కంఠమునందు హితమై చేదై పైత్యకరమై అరుచిని, అగ్నిమాంద్యమును, దంతములపటిమను, పిపాసావాతమును హరించు

స. మేహములందు శ్రేష్ఠము.

సామాన్యముగా కర్పూరము చేదు, వగరు, యించుక మధురము. కళిరో గహరము- మూత్రకృచ్ఛ్రమును, విషదోషమును, పిపాసారక్తపైత్యములను, జ్వరమును, తాపమును, వమనమును, రక్తష్ఠీవననామకసన్నిపాతమును శమింప జేయును. లక్ష్మీకరము- నేత్రహితము- ఉత్తమమై యుండును.

మరియును కర్పూరము కఫవర్గమును, దురిదలను, క్రిములను, నానా రోగములను, పైత్యమును, కళిగ్రహమును, జిహ్వాస్తంభనమును, దుర్గంధము ను, వైకల్యాను శమింపజేసి మేదశకరము- లక్ష్మీకరము- రేచకము- నిర్మలము- చేదు గలిగి యొప్పును.

కర్పూరతైలాదికథనము.

కర్పూరతైలము ప్రబలగు వాతములను, శ్లేష్మమును, మేదోదోషమును, క్రిములను, అరుచిని, అష్టాదశకుష్ఠులను, మనుష్యులకు బాధకమగు కృచ్ఛ్రాది సకలరోగములను బోగొట్టును. పైత్యమును జేయును. విరేచనమొనర్చును. మ నోహరమగును. కదలు దంతములను గట్టిగజేయును. జఠరదీపనమును, కాంతి ని జేయును.

కర్పూరఖండము రత్యుత్సాహమును, వాగ్వైచిత్రిని బుట్టించును. శీత లము- ప్రీతికరము- బలకరము- మూత్రదోషములనారింటినణచును. వాతశ్లేష్మ ములను, ముఖదుర్గంధాదికమును బోగొట్టును. కావున కర్పూరశకలమును రా జులు నిత్యమును సేవింపవలయును.

పలమెత్తుకర్పూరము తామరతూళ్లరసముచేనైనను నల్లకలువదుంపర సముచేనైన నొకజాము మర్దించిన శుద్ధియగును.

యక్షకర్దమాదిగుణాదికథనమ్.

శ్రీఖండమష్టాదశభాగతస్స్యాత్కర్పూరపట్టీహరవేత్రభాగాన్। ఉశీర మంభోనిధిభాగతస్స్యాత్కుష్టంచ ముస్తాద్వితయైకభాగం। కస్తూరికాకుంకు మచంపకానాం భాగార్ధతో భోగవతాం ప్రసిద్ధం। కందర్పదర్పాంకురమంగ రాగం కందర్పకోపాదినివారణాయ॥

యుంజాత్పంచమభాగికం మృగమదం చాష్టాదశం కుంకుమం త్రింశ ద్భాగయుతం తథాగరు హిమస్యాష్టాంశమేకంశశీ। కర్పూరాగరుధూపతై లమథవా భాగార్ధమేకంపృథక్స్యాంసీకుష్ఠమురా శిలోద్భవనఖస్సైకంజవాద్యం

తథా॥ పిష్టాభాతి విలేపనంచ కథితం విశ్వాదికాతంబకం నామ్నావిశ్వవిమోహనాయ వనితాభోగాయ వాతాదిజిత్॥

పూత్యండకస్య కర్షార్ధం పలం హ్రీబేరజంరజః। కర్పూరమృగనాభ్యోశ్చ నిష్కార్ధంచ పృథక్పృథక్॥ జవాదినిష్కమానంచ కేతకీరజసాసహా। మేళయేత్సర్వగాత్రేషు లేపయేచ్చందనేన వా। సంమోహనాస్త్రం కథితం నారీణాం మదనాయతే। వీర్యవాన్భవతిక్షిప్రం సర్వదోషవివర్జితం। మదమూర్ఛాభ్రమహరం స్మృత్యోజోబలవర్ధనం। శ్వేదదౌర్గంధ్యవైవర్ణ్యశ్రమఘ్నమనులేపనం। తతోవిలేపనంకుర్యాద్దేవతాభ్యో నివేదితం। చందనాగరు కర్పూర కస్తూరీకుంకుమాదిభిః। శతపత్రాంబుసంమిశ్రం లేపనంశ్లక్ష్ణపేషితం। నరశ్చందనదానేన సర్వపాపైఃప్రముచ్యతే। తథాకర్పూరదానేన సర్వాన్కామాన వాప్నుయాత్। కస్తూరికాప్రదానేన యశస్వీ భువిజాయతే। చందనాగరుకర్పూరకస్తూరీకుంకుమాదికం। యక్షకర్దమఇత్యేతద్దానాత్సామ్రాజ్యమశ్నుతే॥

యక్షకర్దమే చందనాదీనాం భాగనిర్ణయస్తు॥ కస్తూరికాయా ద్వౌభాగౌ ద్వౌభాగౌ కుంకుమస్యచ। చందనస్య త్రయోభాగాశ్శశినస్త్వేకఏవహి॥

యక్షకర్దమాదుల గుణాదికథనము.

మంచిగంధము పదునెనిమిది భాగములు. కర్పూరము మూడుభాగములు. వట్టివేళ్లు నాలుగుభాగములు. చంగల్వకోష్ఠును తుంగముస్తలు రెండును నొకభాగము. కస్తూరి కుంకుమపువ్వు సంపెంగపువ్వాడి యరపాలు. ఈయంగరాగము కందర్పదర్పాంకురమని ప్రసిద్ధము. కందర్పప్రకోపాదినివారణమును జేయును.

ఐదవవంతుకస్తూరి, పదునెనిమిదవపాలు కుంకుమపువ్వు, ముప్పదవవంతు అగరు, ఎనిమిదవపాలు పన్నీరు, కర్పూరమొకపాలు, కర్పూర కృష్ణాగరులచేదీసినతైలమొకపాలైన యరపాలైన, జటామాంసి, చంగల్వకోష్ఠు, కచూరములు, శిలాజిత్తు, నఖచిప్పలు, జవాదియు ప్రత్యేక మొకొక్కపాలు. ఇవియన్నియును గల్పిన విశ్వవిమోహనమను నంగరాగమై భోగులకు రాగాస్పదము- వాతాదిరోగములనణచును.

కర్షార్ధము భూతిపిల్లిగడ్డ, పలమెత్తు వట్టివేళ్లపొడుము, కస్తూరీకర్పూరములు వేరువేరుగ నిష్కార్ధములు. జవాది నిష్కమును కేతకీరజముతో మేళనమొనర్చినదైన చందనముతో గలిపినదైన సర్వాంగవిలేపనము జేసిన సుందరీజనులకందమై కందర్పునివలెనుండును. దీనికి సంమోహనాస్త్రమని పేరు. మద

మూర్ఛాభ్రమలనణచును. స్మృతితేజోబలములను వృద్ధినొందించును. స్వేద దౌర్గంధ్యవివర్ణతలను విశేషముగ బోగొట్టును. సర్వదోషములను హరించును. వీర్యవృద్ధికరమునగుగావున చందనాగరుకస్తూరీకుంకుమాదులతో పద్మరసమిశ్రితముగు ననులేపనము దేవతానివేదితమొనర్చి యటుమీద శరీరమునందలదుకొనిన నైహికాముష్మికములు గలుగును.

చందనదానముచే సకలపాపనివర్తకుడగును. కర్పూరదానముచే కోర్కులనొందును. కస్తూరిదానముచే కీర్తివంతుడగును. చందనాగరు కస్తూరికుంకుమాదియుక్తమగు నీయక్షకర్దమదానమువలన సామ్రాజ్యపదస్థుడగును.

యక్షకర్దమమునకు చందనాదులభాగములెట్లంటిరేని కస్తూరి రెండు పాళ్లు, కుంకుమపువ్వు రెండుపాళ్లు, చందనము మూడుపాళ్లు, కర్పూరము కపాలు.

దేవయోగ్యపుష్పాణి తద్గుణాదయశ్చ.

అథసుమనోయోగ్యానిసుమాని తేషాం లక్షణధారణగుణాన్వదామః॥

కేశక్లేదశిరోరుజాం మలినసంతాపం విషాదం హరేద్దుర్గంధస్య వినాశనం భృశతరం స్వేదోదసంహారకం। చక్షుష్యం రతివర్ధనం సుఖకరం సంపద్యశోవర్ధనం పుష్పాణాం పరిధారణంచ కథితం కాంతామనోరంజనం॥

దేవయోగ్యపుష్పములు, వాటిగుణములు మొదలగునవి.

ఇటుమీద దేవతాయోగ్యములగు పుష్పవిశేషములను, వాటిలక్షణములను, ధారణగుణములను గణించుచున్నారము.

కేశక్లేదశిరోరోగమాలిన్యసంతాపదుఃఖములను హరించును. దౌర్గంధ్యమును బోగొట్టును. స్వేదదోషమణచును. నేత్రములకు హితము- రతివర్ధనము- సుఖకరము- సంపత్కీర్తులస్ఫూర్తిని జేయును. కాంతామనోరంజనముగావున పుష్పధారణమావశ్యకము.

యామార్ధం జాజిపుష్పం వహతి పరిమళం కౌటజం యామమాత్రం చాంపేయంచోత్పలంచ త్రిదినమపితథా కేతకీపంచరాత్రం। మల్లీపుష్పం ద్వియామం శతదళకుసుమం తత్త్రిరాత్రం ప్రసిద్ధం వాసంత్యా యూధికాయాసుమమపిఘటికాపుష్పభోగప్రమాణమ్॥

జాజిపువ్వు వాసన యరజాము. గిరిమల్లియలవాసన నొకజాము. సంపెగలు నల్లకలువలు వీటివాసన త్రిదినపర్యంతము. మొగలిపువ్వులవాసనైదు దినములు. మల్లెపువ్వులవాసన రెండుజాములు. పద్మములవాసన మూడు

దినములు. బండిగురివింద పుష్ప మొకగడియ నిటులన్నిటికి ననుభవముచే దెలియవలెను.

జాతిస్త్రిదోషాన్సకలాంగదాహాన్హరేత్సుగంధాతిశయా మనోజ్ఞా। సౌభాగ్యకాంతాజనమోహనీయా నివారయంతి నయనోద్ధరోగాన్॥

జాజిపుష్పము త్రిదోషహరము- సకలశరీరతాపమణచును. గంధాతిశయముచే మనోహరమయ్యుండును. సౌభాగ్యకరము. కాంతాజనమోహనీయము. నేత్రరోగముల నివారించును.

నవమాలికాప్రసూనం వాతామయహారి హృద్యమత్యుష్ణం। పైత్యప్రకోపతీక్ష్ణం యామార్ద్ధస్థాయి సౌరభస్ఫురణం॥

విరజాజియను పుష్పము వాతహరము. మనోహారి. పైత్యప్రకోపముచే మిక్కిలి తీక్ష్ణము జేయును. దీనివాసన యరజాముండును.

కేతక్యాః కుసుమం నిహంతి పవనం శ్లేష్మాణముష్మాలితం గంధంతద్వితనోతి కోపమధికం పైత్యస్యసంసేవనాత్। కాంతానాం హృదయారవిందసుఖదా సూర్యాంశుతుల్యప్రభా కందర్పోత్సవకేళికంద ఘుతులం భూపైస్సదాసేవ్యతే॥ కఫవాతామయశమనం స్నిగ్ధం శిరోరోగకండుఘ్నం। దీపితగంధస్ఫురణం యామం శుభకారి కేతకీకుసుమం॥

మొగలిపువ్వు వాతశ్లేష్మములనణచును. దీనిపరిమళముగొనుటచే పైత్యమధికమగును. కాంతాజనమనోరంజనము. తరణికిరణతుల్యప్రభ కలుగునది. మదనకదనకేళీకందము- గావున రాజులచే నందముగ సేవించబడును. మరియును కఫరోగ శిరోరోగ కండూరోగనివారణము.

నాత్యుష్ణగంధం సుఖమాతనోతి దృష్టిప్రసాదం వితనోతి శీఘ్రం। శిరోభ్రమం హంతి శరీరజాడ్యం ధృతిం విధత్తే శతపత్రపుష్పం॥

పద్మము మిక్కిలి యుష్ణగంధము గలిగియును సుఖమొనర్చి దృష్టిప్రసాదకారియగును. శిరోభ్రమియు శరీరజాడ్యముల నణచి ధైర్యమును స్థైర్యపరచును.

వీర్యంచోష్ణం మల్లికాయాః ప్రసూనం బల్యం హృద్యం దృష్టిపుష్టిం కరోతి। భూయోభూయో సేవ్యమానంప్రశస్తం నేత్రారోగ్యం రంజయేత్కేశజాలం॥

మల్లికాపుష్పము వీర్యవృద్ధికరముష్ణము- బలకరము- హృద్యము- దృష్టికి పుష్టినిజేయును. మాటిమాటికి నీపుష్పము ధరించబడిన కేశములకు ప్రసాదకరమగును.

పాటల్యాః కుసుమం మనోమలహరం పానీయదోషాపహం తృష్ణాదాహవినాశనం సుఖకరం శ్రేయస్కరం కాంతిదం। శ్లేష్మాణం తనుతే విశిష్టమతిభిస్సంసేవ్యతే సర్వదా పైత్యస్యోన్నతినాశనం సురభిళం స్త్రీసేవ్యమేతత్సదా॥ ఘనరసఘనదోషహరం తృష్ణాదాహాస్రపిత్తరోగహరం। స్నిగ్ధం శీతంచ హృద్యం సతతోద్గంధి పాటలీపుష్పం॥

పాటలీపుష్పము చిత్తమాలిన్యమును, పానీయదోషమును, పిపాసాదాహమును నశింపజేయును. సుఖమును, తేజమును, కాంతిని జేయును. శ్లేష్మము నణచును. పైత్యోద్రేకమును జేయును. బుద్ధిమంతులగువారిచే నీపుష్పము ధరింపదగును. సౌరభముగలది- గావున స్త్రీలవశ్యము ధరించవలెను.

చంపకః ప్రసవమిష్టసుగంధిం భూసురామరమహీపతియోగ్యం। వాతపైత్యశమనం ఖలు వృష్యం స్వర్ణవర్ణమపి పల్లపభూతం॥ చంపకపుష్పం చోష్ణం వాతశ్లేష్మాపహం హృద్యం। పైత్యప్రకోపతీక్ష్ణం యామాష్టకవర్తి మంజులామోదం॥

సంపెగపువ్విష్టమగు గంధము గలిగి దేవతలకును, బ్రాహ్మణులకును, రాజులకును యోగ్యము. వాతపైత్యశమనము- బలకరము- స్వర్ణవర్ణము- తుమ్మెదలను జంపును. ఎనిమిదిజాములు యోగ్యమైన పరిమళముగలిగియుండును.

సౌగంధికం హిమంస్వాదు తిక్తం నేత్రప్రసాదనం। సుగంధం శ్రీకరం హృద్యం వాతఘ్నం దాహనాశనం॥

ఇంచుక యెరుపును తెలుపునుగలిగియుండు కలువకు సౌగంధికమని పేరు. అది చలవనుజేయును. స్వాదు తిక్తమయ్యుండును. నేత్రములకుమనోహరమొనర్చును. సుగంధము లక్ష్మీకరమునై యుండును. వాతమును దాహమునణచును.

కరవీరోద్భవం పుష్పం శిరఃకండూనివారణం। నేత్రరోగహరం సేవ్యమానందకరణం స్మృతం॥ సేవ్యం త్రిదోషశమనం హృద్యం నేత్రప్రసాదకృత్పైత్యం। కరవీరజప్రసూనం యామాదధికగంధసంతానం॥

గన్నేరుపువ్వు శిరమందగు దురదను నేత్రరోగములను బోగొట్టును. సుఖమొనర్చును. త్రిదోషహరము- కొంచెము పైత్యమును జేయు నొకజాముకంటె నధికముగ పరిమళముండును.

పున్నాగకుసుమంహృద్యం చిత్తవిభ్రమనాశనం। శిరోభ్రమనజాడ్యాదిమపహంతి ప్రమేహనుత్॥ మస్తకనయనవికారాన్హన్యాత్పున్నాగపుష్పమనిలఘ్నం। పైత్యామహారి హృద్యం నాత్యుష్ణం యామవిస్ఫురద్గంధి॥

పొన్నపువ్వు మనోహరము- చిత్తభ్రమలననణచును. శిరోభ్రమణజాడ్యా

దులను, నేత్రరోగములను, ప్రమేహములను బోగొట్టును. వాయువును, పైత్యమును, ఆమమును హరించును. అత్యుష్ణమునుగాదొక జాముపరిమళముండును.

సురపున్నాగకుసుమం వాతపైత్యహరం లఘు। కేశ్యంచ సౌఖ్యజననం నేత్రాణాం విషనాశనం॥

సురపున్నాగకుసుమము వాతపైత్యములను, నేత్రవిషమును బోగొట్టును. లఘువు- సౌఖ్యమొనర్చును. కేశములకనుకూలము.

వకుళద్రుమపుష్పంచ శిరోరోగవినాశనం। వాతరోగప్రశమనం కాంతిసౌభాగ్యవర్ధనం॥ వృష్యం త్రిదోషశమనం శోణిత పైత్త్యామయాపహం శీతం। హృద్యం వకుళజపుష్పం షోడశఘటికాస్థిరామోదం॥

పొగడపువ్వు శిరోరోగములను వాతరోగములనణచును. కాంతిని సౌభాగ్యమును వృద్ధినొందించును. బలవర్ధనము- శోణితపైత్యముల నణచును. మనోహరము. పదియారుగడియలు స్థిరముగ పరిమళనుండును.

మాధవీసూనమత్యంతకఫమారుతనాశనం। భ్రమగోత్సవమత్యుష్ణంనారీణాం నేత్రసౌఖ్యదం॥ యూధికాకుసుమం సేవ్యం పవిత్రం ప్రాణినాం హితం। శ్రమక్లమహరం తాపవాతరోగవినాశనం॥ పవమానపైత్యకఫజాన్రోగానపహంతి మాధవీపుష్పం। స్నిగ్ధంహృద్యం శీతంకేశ్యం యామత్రయామోదం॥ శోణితపైత్యప్రవర ప్రముఖామయహారి యూధికాపుష్పం। స్నిగ్ధంహృద్యమనుష్ణం యామార్ధం ప్రిణుమేదురామోదమితి మతాంతరం॥

బండిగురివిందపుష్పము శోణితపైత్యములు మొదలగురోగముల నణచును. నున్ననై బలకరమై యుష్ణములేక ప్రాణులకు హితమై పవిత్రమగుచు శ్రమమును వాడుదలను హరించును. యామత్రియను పరిమళముండుననియు నాలుగుగడియలు పరిమళముండుననియును మతాంతరములు.

ఉత్పలస్య కుసుమం మనోహరం మేహపైత్యవమనం శమనంచ। మూర్ఛనక్లమవిదాహనాశనం శ్రీకరం వితనుతే ముఖకాంతిం॥ శీతంస్నిగ్ధగుణాఢ్యం చక్షుష్యం దాహపైత్యజూర్తిహరం। శ్రమరుధిరపైత్యశమనం కల్హారం త్రిదనసౌరభోన్మేషం॥

నల్లకలువపుష్పము మేహపైత్యవమనశమనము. మూర్ఛబాధను విదాహమునణచును. శీతము నున్ననై విశేషగుణములుగలదియై శోభాయుక్తముగ ముఖకాంతిని జేయును. కల్హారము దృష్టిప్రసాదకము- వాతపైత్యజ్వరవేగములనణచును. మూడుదినములు పరిమళముండును.

కమలం శీతలం స్వాదు రక్తపైత్యహారం లఘు। ప్రమేహ గుల్మశూలఘ్నం దేహసంతాపనాశనం॥

శతపత్రమను పద్మజాతిని బూర్వము జెప్పితిమి. ఇపుడు సామాన్యముగ పద్మగుణగణనను జేయుదుము. కమలము శీతలము- స్వాదు- లఘువు ప్రమేహములను, గుల్మశూలలను, రక్తపైత్యములను, దేహతాపమును బోగొట్టును.

నారంగజప్రసూనం కఫమారుతహారి నాతిపైత్యకరం। సుస్నిగ్ధమీషదుష్ణం సంతతసంసక్తసౌరభస్ఫురణం॥

నారంజిపువ్వు కఫమారుతముల నణచును. విశేషపైత్యమును జేయదు. ఇంచుకయుష్ణమించుకస్నిగ్ధము- సంతతమునుసౌరభముగలిగియుండును.

ఉశీరంజ్వరదాహార్తిక్షయమేహగదాపహం। పైత్యప్రకోపశమనం సౌగంధ్యం తోయవాసనం॥ వారివాంతిశమనం తృషాపహం దాహమోహ విషమజ్వరాపహం। దీపనం లఘుకషాయశీతలం రక్తపైత్యమతిసారనాశనం॥

వట్టివేళ్లు జ్వరమును దేహపీడను క్షయమేహ పైత్యప్రకోపములనున్ను శమింపజేయును. ఉదకయుక్తమై వాసనను బుట్టించును. దీనిరసము వాంతి పిపాసా దాహ మేహవిషమజ్వర రక్తపైత్యాతిసారములను దూరము జేయును. దీపనమై లఘువై శీతలమై వగరుగలిగియుండును.

కాలేయకం సర్వవిషాపహంచ శిరోక్షిరోగాస్త్రరతిశ్రమఘ్నం। సౌఖ్యప్రదం పైత్యహారంచ వృష్యం మనోహరంచామరసుందరీణాం॥

కస్తూరిపసపఖిలవిషములను, శిరోక్షిరోగములను, శ్రమను, పైత్యములను హరించును. సౌఖ్యబలవృద్ధిని జేయును. బృందారకసుందరులకును నమందానందమొనర్చును.

మరువంకటుతిక్తోష్ణం క్రిమికుష్ఠవినాశనం। త్రిదోషశమనం హృద్యం బల్యంచ శ్రీకరం మహత్॥

మరువము కటువు, తిక్తము, ఉష్ణము, క్రిమికుష్ఠనాశనము- త్రిదోషాపహము- హృద్యము- బలలక్ష్మీకరము.

ధ్యామస్యపత్రం కఫవాతహారీ రక్తాపహం గ్రాహిబలప్రదంచ॥

పచ్చాకు కఫవాతరక్తములను హరించును. బలముజేయును.

హేమంతే శతపత్రధారణమతశ్చాంపేయకం శైశిరే కేతక్యాః కుసుమం వసంతసమయే గ్రీష్మోదయే మల్లికా। మాలాపాటలజాతిపుష్పధరణం వర్షాగమే కథ్యతే సంసేవ్యే శరదాగమేచ కథితం పున్నాగరక్తోత్పలే॥

హేమంతర్తువునందు పద్మము- శిశిరఋతువునందు సంపెంగ- వసంత

మందు కేతకీకుసుమము- గ్రీష్మమందు మల్లికాకుసుమము- పాటలీ జాతి పుష్ప మాలికాధారణము వర్షర్తువందు- పున్నాగరక్తోత్పలములు శరదృతువునంది టులధరించవలయును.

భోజనప్రకరణమ్.

సుప్రక్షాళితపాణిపాదోఽపఆచమ్య శుచౌ సంవృతే దేశే అన్నముప సంగృహ్య కామక్రోధలోభమోహానపహత్య సర్వాభిరంగుళీభి శ్శబ్దముకుర్వ న్నాశ్నీయాదిత్యాపస్తంబః॥ ప్రశస్తరత్నపాణిస్తు భుంజీత ప్రయతోగృహీతి శ్రీవిష్ణుపురాణే॥ పాణిపాదప్రక్షాళనాచమనాభ్యాం యద్ధ్రష్టఫల ముత్పాద్యతే తద్దర్శితం పూర్వమాచమనప్రకరణే॥ శుచౌ సంవృతదేశేన్నభక్షణంతు మనో హ్లాదహేతుస్తద్దృష్టిపాతనజనిత బాధానివారణకారణంచ భవేదితి- కామ క్రోధలోభమోహాయుక్తస్స న్భుంజేద్యదన్నం పరిణామమేత్యూత రుచిస్తుష్టిః పుష్టిర్గోత్పద్యతే। క్రోధాదిపరవశచిత్తస్య తస్య రుచిగ్రహణాసంభవాత్। ఈ ర్ష్యాభయక్రోధపరిక్షతేన లుబ్ధేనరుగ్దైన్యప్రద్వేషయుక్తేనచ సేవ్యమానమ న్నం నసమ్యక్పరిణామమేతితిసుశ్రుతే॥ అశ్నీయాత్తన్మయోభూత్వా పూర్వం తు మధురంరసం। లవణామ్లౌ తథా మధ్యే కటుతిక్తాదికాంస్తతః॥ ప్రాగ్ద్ర వం పురుషోశ్నన్వై మధ్యే కఠినభోజనః। అంతేపునర్ద్రవాశీస్తు బలారోగ్యే న ముంచతీతి శ్రీవిష్ణుపురాణే॥ యది సర్వాంగుళీభిరన్నకబళ మాదాయాస్యే న్య సేన్నపతేత్తత్కణజాలమితస్తతః శబ్దంకుర్వన్నశ్నణే నేతరజంతువ దేవ హా యతయా కతకభాద్యనుకరణధ్వనిరుత్పద్యతఇతిచ॥ ప్రశస్తరత్నం గారుడాది స్థావరజంగమవిషనివారణాయాంగుళ్యాం ధృత్వా ప్రాశ్నీయాత్। మరకతమ ణిగుణగణనేఽస్య వివరణంకృతం ప్రాగేవ॥

యాతుధానాః పిశాచాః క్రూరాశ్చైవరాక్షసాః అన్నస్య స్వరసగ్ హరంతి మండలేవవినా। విప్రాణాం చతురశ్రముం త్రికోణం క్షత్రియాణాం వైశ్యానాం వర్తులగ్ం శూద్రాణామర్ధచంద్రకం గోమయేన మండలంకృత్వా పుష్టికర మాయుష్య భోక్తవ్యం॥ పాలాశపద్మకుటజమధూకకదళీదళైః। పుష్టికర మాయుష్యం రం యశస్కరం। కాసశ్వాసజ్వరహరం కదళీపత్రభోజనమితిగౌతమః॥ ఉన్మా దాదిరోగనివారణాయ గోమయవిలేపనం॥ తదుక్తం చరకే॥ అలక్ష్మీహరణం గోవిట్‌లేపకర్మణి శస్యతే। సర్వశుద్ధికరంపుణ్యం శస్తమున్మాదరోగిణామితి స కలదుర్గంధపరిహారపటుత్వే నాలక్ష్మీనిరసనేన లక్ష్మీకరంభవతీతి గోమయ విలే పనం శస్యతీతి శంసతి॥ పాలాశాదిపత్రభోజనగుణ స్స్వయమేవ గౌతమేనో

క్తత్వాన్నమయా ప్రతిపాదితః॥ ఉక్తపాత్రనిహితమన్నం సర్వాంతర్యామీ వి ష్ణురితివిశేషశేమప్యాపరిణమే దపోశానంచకారయేదిత్యాహ బ్రహ్మపురాణే॥ అన్నందృష్ట్వా ప్రణమ్యాదౌ ప్రాంజలిః కథయేత్తతః। అస్మాకం నిత్యమస్త్వే తదితిభక్త్యాథ వందయేత్॥ ఆపోశానంచ గృహ్ణీయాత్సర్వతీర్థమయంచయత్। అమృతోపస్తరణమసీతివిష్ణోరన్నమయస్యచ ఇతి॥ పూజయేదశనం నిత్యమద్యా చ్చైతదకుత్సయన్। దృష్ట్వాహృష్యేత్ప్రసీదేచ్చ ప్రతినందేచ్చ సర్వదా ఇతిమ నుః॥ భోజనాత్పూర్వమపోశానేన యద్దృష్టఫలముత్పద్యతే తద్దర్శితమాచమన ప్రకరణే తస్మాదస్మాభిః పునర్నోచ్యతే॥ పీయమాన హేజల త్వం అమృతం వినాశరహితం। ప్రాణదేవతాయా ఇదముపస్తరణమసి। యథా శయానస్య పుంసః మంచకస్యోపరితనం పటాది తద్వత్ప్రాణదేవతాయాః ఇదముపస్తర ణమితి వాజసనేయినః ప్రాణవిద్యాయాం ప్రాణదేవతాయాః బ్రహ్మణ స్త త్వమామనంతి॥

## భోజన ప్రకరణము.

హస్తములను పాదములను గడిగి శుద్ధాచమనముజేసి శుచియగు సా వరణస్థలమందు కామక్రోధలోభమోహరహితుడై సర్వాంగుళులతో శబ్దము లేకుండునట్లన్నమును భుజియింపవలయునని యాపస్తంబులు.

ప్రశస్తహస్తాంగుళీయకహస్తుడై నియమముతో గృహస్థుడు భుజింప వలయునని విష్ణుపురాణము.

కరపాదప్రక్షాళనాచమనములవలన నగు దృష్టఫలము నాచమనప్రకర ణమందగపరచితిమి. శుచియగు సావరణస్థలమందనుట చిత్తప్రసాద హేతువు- దుష్టదృష్టినివారణముకొరకును. కామక్రోధాదియుక్తుడై భుజియించిన యన్న ము జీర్ణించకయుండును. క్రోధాదిపరవశచిత్తుడగుటవలన రుచిగ్రహణము లే కయుండును గాన తుష్టి గాకయుండును.

ఈర్ష్యాభయక్రోధలోభదైన్యద్వేషయుక్తుడు భుజించిన యన్నము జీ ర్ణించకయుండుననియు సుశ్రుతము.

తన్మయుడై భుజింపవలయుననియును, ముందుగ మధురరసము నటు పైని మధురామ్లరసములును, కొసను కటుతిక్తాదిరసములను, ముందుగ ద్రవ యుక్తముగ్గను, మధ్యను కఠినపదార్థముల నంతమందు మరల ద్రవయుక్తము గను భుజించిన బలారోగ్యములను విడువక యుండునని విష్ణుపురాణము.

వేళ్లన్నియు జేర్చి కబలమును గ్రహించి గ్రసించుమనుట- వేళ్లన్నియు

గూర్చకయుండిన యన్నకణము లవతలవతల తూలిబడునని. శబ్దములేకయుండ భుజించుమనుట యన్నముభక్షించునపుడు కటకటయనుశబ్దము నీచజంతువుదిను నపుడువలె బొడము నది పార్శ్వవర్తులకసహ్యమైయుండును.

ప్రశస్తరత్నాంగుళీయకధారణమనగా గరుడపచ్చలు మొదలగునవి స్థాపించిన యుంగర మది ధరించుటవలన స్థావరజంగమవిషములన్నమందు గల సియుండినను దోషించకయుండునని. మరికతగుబాగణనమం దీవివరణమును జే యడమైనది.

యాతుధాన పిశాచక్రూరరాక్షసులన్నరసమును హరించుదురు గావు న దానివారించుటకు భోజనపాత్రముక్రింద మండలమునుజేయవలె నిదిబ్రాహ్మ ణులకు చతురశ్రము. క్షత్రియులకు ముక్కోణము. వైశ్యులకు వర్తులము. శూ ద్రులకర్ధచంద్రాకారమిట్లుగోమయముచే మండలము రచించి దానిపైని పా త్రముంచి భుజించవలయును. మోదుగ, తామర, అంకుడు, యిప్ప, అనటి వి టియాకులలో భుజించిన యాయుఃపుష్టియశస్కరము. కాస శ్వాస జ్వరహర మని గౌతములు.

గోమయముచేత మండలముసేయుటువల్ల నాదిరోగోత్పత్తి గాకయుం డునని- గోమయము సకలదుర్గంధములనణచును. కావున అలక్ష్మీహరము- స ర్వశుద్ధికరము- ఉన్మాదరోగశాంతికరము- పుణ్యప్రదమని చరకులు. పాలాశా దిపత్రభోజనగుణము గౌతములవారిచేతను జెప్పబడెను. కావున మాచేతను జెప్పబడలేదు.

పైనజెప్పబడెను పాత్రలయందుంచబడిన యన్నము సర్వాంతర్యామి యగు విష్ణువుయని విశేషబుద్ధిచేతను నమస్కరించి యాపోశనమును జేయదగు నని బ్రహ్మపురాణము.

అన్నమును జూచి దోసిలిబట్టి నమస్కరించి యాపోశనమును జేయద గునని బ్రహ్మపురాణము. అన్నమునుబూచి దోసిలిబట్టి నమస్కరించి మాకు ని త్యము గలుగవలయునని భక్తిచేతను బలుకవలయును.

సర్వతీర్థమయమగు నాపోశనము నమృతోపస్తరణమసి యను మనువుచే తను విష్ణోరన్నమయస్యచ అనుమంత్రముచేతను గ్రహించవలెను.

అన్నము నిత్యమును గౌరవపరచవలెను- నిందించరాదు. చూచి సంత సించి స్తుతియొనర్చదగునని మనువు. భోజనమునకుపూర్వమందాపోశనముచేత నేమిదృష్టఫలముత్పన్నమగునో యది యాచమనప్రకరణమున బ్రకటించబడె నందువలన మాచేతను దిరుగ బ్రకటించబడదు.

అమృతోపస్తరణమసి యను మంత్రమున కర్థమేమనిన- పానమొనర్చిన యోజలమా నీవు నాశరహితమగు ప్రాణదేవతకు అస్తరణమైతివి. ఎట్లుల శయనించు పురుషునకు మంచముపై యాస్తరణను వేయుచున్నారో అట్లులనే ప్రాణదేవతకు నీయాస్తరణ- అప్రకారమే వాజసనేయులు ప్రాణవిద్యయందు ప్రాణదేవతకు బ్రహ్మయొక్క తత్వమును గాను జెప్పుచున్నారు.

ప్రాణాహుతి విధిః.

అథ ప్రాణాహుతికల్పో వ్యాహృతిభి ర్గాయత్ర్యాభిమంత్ర్య ఋతం త్వాసత్యేన పరిషించామీతి సాయంపరిషించతి। సత్యంత్వర్తేన పరిషించామీతి ప్రాతరితి॥ అంతశ్చరతి భూతేషు గుహాయాం విశ్వతోముఖః। త్వంయజ్ఞస్త్వం వషట్కార ఆపోజ్యోతీరసోమృతం। త్వంబ్రహ్మ త్వం ప్రజాపతి రుద్రః భూర్భువస్సువరోం॥ అమృతోపస్తరణమసీత్యపఃపీత్వాథ దశహోతారం మనసానుద్రుత్యావదన్నగ్రస్తాయా త్ప్రాణాయస్వాహేతి గార్హపత్యమేవ తేనజుహోతి। అపానాయస్వాహేత్యన్వాహార్యపచనమేవ తేనజుహోతి। వ్యానాయస్వాహేత్యాహవనీయమేవ జుహోతి। ఉదానాయస్వాహేతి సభ్యమేవ తేన జుహోతి। సమానాయస్వాహేత్యావసథ్యమేవ తేన జుహోతీతి గోభిలః। ఏవం పంచమంత్రైః ప్రణవాద్యైః కర్తవ్యాః॥ తథాచ శౌనకః॥ ప్రణవాద్యాశ్చ స్వాహాంతాః నామ్నామంత్రైస్తునాదయేత్। జిహ్వయైవగ్రసేదన్నం దశనైర్నచసంస్పృశేదితి॥ జిహ్వయైవగ్రసనే విశేష ఆశ్వమేధికే దర్శితః॥ యథారసం నజానాతి జిహ్వాప్రాశాహుతీర్నృప। తథా సమాహితః కుర్యాత్ప్రాణాయామమతంద్రితఇతి॥ మౌనవ్రతం మహాకష్టం హుంకారేణ వినశ్యతి। తథాసతి మహాదోషస్తస్మాత్తన్నియతశ్చరేదిత్యత్రిణోక్తమౌనవ్రతం ప్రాణాహుతిపర్యంతమేవేత్యుక్తం॥ అనిందన్భక్షయన్నిత్యం వాగ్యతోన్నమకుత్సయన్। పంచగ్రాసా న్మహామౌనం ప్రాణాద్యాప్యాయనం నుహాదతి శ్రీవిష్ణుపురాణేభిహితం॥

ప్రాణాహుతులను బుచ్చికొను విధి.

వ్యాహృతులతో గాయత్రిచేత నభిమంత్రించి ఋతంత్వాసత్యేన పరిషించామి యని సాయమున- సత్యంత్వంర్తేన పరిషించామి యని ప్రాతఃకాలమున పరిషేచనమును జేయవలయును. అంతశ్చరతిభూతేషు గుహాయాం విశ్వతోముఖః। త్వంయజ్ఞస్త్వంవషట్కార ఆపోజ్యోతిరసోమృతం। త్వంబ్రహ్మ త్వం ప్రజాపతిరుద్రః భూర్భువస్సువరోం। అమృతోపస్తరణమసి। యనియుద

కమును దానము జేసి దశహోత్రమంత్రము నుచ్చరించకుండ మనంబున ధ్యా నింపుచు నన్నమునైదుమారులు బుచ్చికొనవలె నదియెట్లనిన- ప్రాణాయస్వా హా యనిగ్రహించుటచే గార్హపత్యమును హోమముచే గ్రసించినవాడగును. అపానాయస్వాహా యనిన నన్వాహార్యపచనమును- వ్యానాయస్వాహాయనిన నాహవనీయమును- ఉదానాయస్వాహా యనిన సభ్యమును- సమానాయస్వా హా యనిన నవసథ్యమును హోమమును జేసినవాడగునని గోభిలుడిట్లు పంచమం త్రములను ప్రణవాదికముగ నుచ్చరింపవలెననెను.

ఆదియందు ప్రణవము నంత్యమందు స్వాహాపదమును గలుగునట్లు తత్త న్మంత్రములచే గ్రసించినయన్నమును దంతములు దగలకనుండ జిహ్వచేతనే గ్రసించవలెనని శౌనకులు.

జిహ్వచే గ్రసించునపుడు జిహ్వకాయన్నరసము తెలియకుండునట్లు జాగరూకుడై ప్రాణవాయువులను నిలిపి పుచ్చికొనవలయునని యాశ్వమేధి కపర్వము.

హుంకారమాత్రముచే వ్రతహానియగు గావున మౌనవ్రతమతికష్టము. వ్రతభంగమైన మహాదోషము గావున నియతుడై మౌనమాచరించవలయునని యతిమతము ప్రాణాహుతిపర్యంతమేయని జెప్పబడెను.

అన్నమును నిందించక వాగ్యతుడై పంచగ్రాసములచేతను ప్రాణా ద్యాప్యాయనమును జేయదగునని విష్ణుపురాణము.

భోజనకాలకృత్యాని.

భార్యయాసహ నాశ్నీయాదవీర్యవదపత్యం భవతీతి వాజసనేయకే వి జ్ఞాయతఇతివశిష్ఠః॥ బ్రాహ్మణ్యా భార్యయాసార్థం క్వచిద్భుంజీతచాధ్వని। అ సవర్ణస్త్రియాసార్థం భుక్త్వాపతతి తత్క్షణాదితి బ్రహ్మపురాణే ॥ నాశ్నీయా ద్భార్యయాసార్థమితి మనువచనస్య కుల్లూకభట్టేన ఏకపాత్రభోజననిషేధమి తివ్యాఖ్యాతం। బ్రాహ్మణీపదం సవర్ణోపలక్షణం॥ నశిశూన్నిర్భత్సయన్ నాప్ర దాయ ప్రేక్షమాణేభ్యఇతి హారీతః॥

అశ్నాతి యో భృత్యజనస్య మధ్యే ఇష్టాన్నమేకో రసగృధ్నుబుద్ధిః। దీనైః కటాక్షై రభివీక్ష్యమాణో వ్యక్తం విషం హాలహలంచ భుక్తే ఇతి యమః॥ శిశుషుదీనేష్వశనమ్మృష్టం కామయమానేష్వదత్వాజఠరపిఠరపూరణం నకర్తవ్యం పిచండిలేన। ప్రాణిష్వనుకంపావశ్యం కార్యేత్యర్థః। ఉత దుష్టదృష్టి దోషవశాద్భుక్తం నపరిణామతీతి హాలాహలవ దదత్వా భుక్తమశనం భవతీ

త్యుక్తం। నానియుక్తో౽గ్రాసనంగచ్ఛేత్। నాగ్రాసనస్థఃప్రథమమశ్నీయాత్। నాధికందద్యాత్। నప్రతిగృహ్ణీయాదితిశంఖః। అతిథిసుహృద్బంధుష్వాదరవిధే యప్రదర్శనార్థ మగ్రాసనపూర్వాశనాధికదాననిషేధమాహృతం ॥ అన్నస్య జన్మకాలుష్యం దుష్పఙ్క్తించ నకుర్వేత్। గ్రాసశేషం నచాశ్నీయాత్ పీతశే షం పిబేన్నతు॥ అన్నస్యభక్షణయోగ్యధాన్యశాకాదేః కాలుష్యం। గ్రామోద కకర్దమాదికలుషస్థానోత్పత్తిస్థానవిచారణం భోజనకాలే నకర్తవ్యం। హే యద్రవ్యభక్షణస్మరణేన తదన్నంనపరిణామమేతీత్యర్థః॥ దుష్పఙ్క్తినించాపి త థాథవత్యేవ। గ్రాసపీతశేషాదిస్వీకారేణోచ్ఛిష్టాశీ స్యాదితిచోక్తం॥ దుష్ప ఙ్క్తినిషేధం దర్శయతిగౌతమః॥ అప్యేకపఙ్క్త్యం నాశ్నీయాత్సంబంధిస్వజ నైరపి। కోహిజానాతికింతస్య ప్రచ్ఛన్నం పాతకంభవేత్। ఏకపఙ్క్త్యుపవిష్టా నాం దుష్కృతించ దురాత్మనాం।సర్వేషాంతత్సమంతావద్యావత్పఙ్క్తిర్నభి ద్యతఇతి॥ పఙ్క్తిభేదప్రకారమపి సఏవాహ॥ అగ్నినా భస్మనాచైవ స్తంభేన సలిలేనవా। ద్వారేణచైవమార్గేణ పఙ్క్తిభేదో బుధైస్మృతః॥ యమోపి॥ ఉ దకంచ తృణం భస్మ ద్వారం పంథాస్తథైవచ। ఏభిరంతరితంకృత్వా పఙ్క్తి దోషోనవిద్యతఇతి॥ కోహిజానాతీత్యాదినా పాతకసందేహే ఏకపఙ్క్త్యాం నభోక్తవ్యమిత్యుక్తం। నిర్దోషత్వేతునిశ్చితేభోక్తవ్యమేవ। భస్మస్తంభాదినాచ పఙ్క్తిభేదాభిధానేపాతకినాపిసహ ఏకపఙ్క్త్యాంభోజనేదోషో నాస్తీత్యర్థః॥

## భోజనకాలకృత్యములు.

భార్యతోగూడి భుజించరాదటులైన బలహీనమగు సంతానమగునని వాజసనేయకమందు దెలియబడుచున్నదని వశిష్ఠులు.

బ్రాహ్మణులు సవర్ణస్త్రీతోగూడ మార్గమందో కానొకప్పుడు భుజింపవచ్చును- అసవర్ణస్త్రీతోభుజించినతత్క్షణమె పతితుడగునని బ్రహ్మపురాణము.

భార్యతోగూడి భుజించవలదను మనువచనమునకు కుల్లూకభట్టుచే నొకపాత్రయందు భోజననిషేధమని వ్యాఖ్యానము సేయపడెను. బ్రాహ్మణీప దమన్నివర్ణములవారికిని సవర్ణస్త్రీవిషయమై తగుననుట.

శిశువులను గసరుచు మెసవుచు వారుజూచుచుండనారలకు బెట్టకయుండదగదని హారీతులు.

భృత్యజనమధ్యమందు మృష్టాన్నమును చాపలబుద్ధియై దీనులై వారు జూచుచుండ నేదిభక్షించునో యది హాలాహలవిషమగునని వ్యక్తముగ యము డనెను.

దీనులై శిశువులు మృష్టాన్నమపేక్షించి జూచుచుండ నుదరంభరియై తానొకడే కుడువందగదనుట పాణులయందవశ్యము దయను జేయవలెనని యు నపేక్షితులగువారి దృష్టిదోషమువలన నాయన్నము జీర్ణించక విషసమ మాగునని.

ఇతరులచే కోరబడకనె తానగ్రాసనాసీనుడై యుండరాదు. ముందు భుజియించరాదు. వడ్డించువాడధికముగ బెట్టుటయును వాడుదినుటయును గూడదని శంఖస్మృతి.

అతిధులు, మిత్రులు, బంధువులు మొదలగువారికి యజమాని సేయు విశేషగౌరవముకొరకు మొదటనుగూర్చుండి ముందు భుజించుట యధికముగ గ్రసించుటయును దగదనుట.

ధాన్యాదిద్రవ్యము బుట్టిన స్థలదోషవిచారణ సంస్కారదోషములును పఙ్క్తియందుండు దుష్టవిమర్శయును భోజనార్థముగూర్చుండినతరువాత జేయ రాదు. గ్రాసపీతశేషములు బుచ్చికొనదగదు. అన్నోత్పత్తి దుష్పఙ్క్తినిందలు తగదనుట-భోజనములానర్చుచు నటులానర్చిన నాయన్నమసహ్యమై జీర్ణించ కయుండునని- గ్రాసపీతశేషస్వీకారముచే నుచ్ఛిష్టము దినువాడగునని మాను మనుట.

స్వజనసంబంధిజనులతోనైన నేకపఙ్క్తినిభుజించదగదెవనియందేమిప్ర చ్ఛన్నపాతకమున్నదోయని- ఏపఙ్క్తియందెట్టిపాతకియుండునోఆపఙ్క్తివా రందరునట్టివారగుదురు- కావున నగ్నిభస్మస్తంభజలద్వారమార్గముచే పఙ్క్తి వేరగు గావున నిటులదేనిచేనైన పఙ్క్తిభేదము జేసికొనవలెనని గౌతముని ప్ర కారమె తృణమైన నడ్డుజేసిన పఙ్క్తిదోషములేదని యముడును జెప్పెను.

ఘృ త గు ణాః.

నభుంజీతాఘృతంనిత్యం గృహస్థో భోజనద్వయం। పవిత్రమధహృద్యం చ సర్పిరాహురఘాపహమిత్యాదృష్టఫలముక్తం దేవలేన॥

చరకారదయస్తు దృష్టఫలమనువదంతీదం॥ ఆజ్యంపైత్యహరం మనోమ లహరం సర్వాగ్నిమాంద్యాపహం దోషఘ్నం జ్వరశోషణం వితనుతె వాతా పహంపుష్టిదం। మేధాతిస్మృతివర్ధనం బలకరం చక్షుష్యమాయుఃప్రదం వృష్యం కాంతికరం వయస్త్రిషుహితం వృద్ధేషుబాల్యేషుచ॥ జ్వరశోషణమిత్యత్ర పు రాణజ్వరేష్వేవ హితం నతుతరుణజ్వరేషు॥ గవ్యంఘృతం పవనపైత్యహరం నరాణాం బల్యం గుదాంకురహరం జఠరాగ్నికారి। ఉన్మాదపాండు గళశూల

విసర్పిచింతా భ్రాంతిం నిహంతి వినిహంతిచ మేహరోగాన్॥ గవ్యమాజ్యమతి ధాతువర్ధనం చాయురక్షిగదజిద్రసాయనం। క్షీణగర్భబలినాం ఉమేహితం వృష్యమత్యరుచిదోషవిషఘ్నం॥ సద్యస్తప్తం సర్వదోషాన్నిహంతి సర్పి శ్శస్త స్సర్వదేయంచ నృణాం। హృద్యం పథ్యం మేధ్యమాహు ర్గఘిష్ఠం వృద్ధేబాల్యేచాగ్నిదం కాంతికృత్స్యాత్॥

తేజోఽశితం త్రేధావిధీయతే। తస్య యస్థవిష్ఠోధాతు స్తదస్థి భవతి। యోమధ్యమస్సమజ్జా యోఽణిష్ఠస్సావాగితిఛాందోగ్యశ్రుతిః॥ తథా తేజోఽశితం। పురుషేణాశితం తేజః। తైలఘృతాది। త్రేధావిధీయతే।త్రిధాపరిణమతే। తస్యభక్షితతైలఘృతాదేః। యస్థవిష్ఠోధాతుః। స్థూలభాగః। తదస్థిభవతి। అస్థ్యుపచయంకరోతి। యోమధ్యమస్సమజ్జాభవతి। యోమధ్యమోభాగస్తదస్థ్యంతర్గతస్నేహాయుక్తమాంసవిశేషోభవతి। యోణిష్ఠస్సావాక్। య సూక్ష్మాంశస్సా వాగాప్యాయకః॥

## ఘృతముల గుణములు.

గృహస్థు ఘృతములేకను రాత్రిరి బగలును భుజించరాదు. పవిత్రము పాపహరము మనోహరమని దేవలునిచేత నదృష్టఫలము జెప్పబడెను.

చరకాదులీయదుగునవివరించుప్రకారము దృష్టఫలమును జెప్పుచున్నారు.

ఆజ్యము పైత్యమును, మనోమలమును, అగ్నిమాంద్యములను, దోషములను, వాతమును బోగొట్టును. పురాణజ్వరములను శోషించును. తరుణజ్వరములకనుకూలముగాదు. పుష్టినిజేయును. జ్ఞాపకశక్తిని, మేధను వృద్ధినొందించును. బలకరము- దృష్టిప్రసాదకము- ఆయుర్వృద్ధికరము. కాంతిని జేయును. బాల్య యౌవ్వన వృద్ధావస్థలయందును హితమగును. మూలశంకను, ఉన్మాదమును, పాండురోగమును, గళశూలను, విసర్పిరోగమును, చింతను, భ్రాంతిని, మేహరోగములను బోగొట్టును. సద్యోఘృతము ధాతువులవృద్ధినొందించును. క్షీణమగు గర్భబలముగలవారికి హితము- అరుచి దోషవిషములను బోగొట్టును.

పురుషునిచే భక్షించబడిన నేయి, నూనె మొదలగునవి మూడువిధములుగా నగుచున్నవి. ఆభక్షణజేసిన నేయి, నూనె మొదలగువాటియొక్క ఏవిశేషభాగముగలదో అది ఎముకను వృద్ధినిజేయుచున్నవి. ఏదిమధ్యభాగము గలదో యది ఎముకమధ్యమందుండు మూల్గనెడి చమురుతోనుండు మాంసవి

శేషమగును. ఏసూక్ష్మభాగము కలదో యది స్ఫుటవక్త్ర్యాద్యాదికమును గలుగజేయుచున్నది.

మాహిషం ఘృతమతీవశీతలం పైత్యహారి పవనప్రణాశనం। పాండుహృత్సురుచికామిలాపహం బృహణం తదతివహ్నినాశనం॥

గేదెనెయ్యి విశేషశీతలము- పైత్యమును, వాతమును, కామిలను, పాండులను హరించును. రుచిగలిగియుండును. పుష్టిని జేయును. జఠరాగ్ని నణచును.

ఆజం సర్పిః పథ్యముష్ణం కఫఘ్నం కాసశ్వాసానోగ్రరాజం నిహంతి। పైత్యోన్మాదం వాతగుల్మోదరాణి మందాగ్నిత్వం చాతిసారజ్వరఘ్నం॥ సర్పిర్హ్యజానాం మధురంచశీతం వాతేచ పిత్తేచ హితం లఘుస్యాత్। చక్షుష్యమిష్టం కఫకారినైవ వస్తేర్విశుద్ధించ కరోతి బల్యమితి మతాంతరం॥

మేకనెయ్యి మధురము- శీతలము- వాతపైత్యములందునహితము లఘువయ్యుండును. దృష్టిప్రసాదకము- కఫమును హరించును. పొత్తికడుపునకు శోధకము- బలకరమనియును మతాంతరము.

ఆవికం ఘృత మతీవ దుర్జరం శ్లేష్మకృత్పవనకారి పిత్తళం॥ అర్శోమూత్రవిబద్ధకృద్గదహరం వాతాపహం బృంహణం బల్యం గుల్మగుదాంకురప్రశమనం నేత్రామయే పూజితం। పైత్యోన్మాదవినాశనం శుచికరం ధాతుప్రదం కాంతిదం వృష్యం పూజ్యరసాయనం స్మృతికరం సౌఖ్యం ఘృతాపోశనం॥

గొఱ్ఱెనెయ్యి శ్లేష్మమును, వాతమును, పైత్యమును జేయును- విశేషముగ జీర్ణించకయుండును.

మూలశంక మూత్రబంధ వాత గుల్మ గుదాంకుర పైత్యోన్మాదముల బోగొట్టును. బల పుష్టి నేత్రారోగ్య రుచి శుచిత్వ ధాతువృద్ధి కాంతి స్మృతి సౌఖ్యములను గలుగజేయు నిట్టిఘృతాపోశనము రసాయనమయ్యుండును.

## నవనీతగుణాః.

నవనీతం నవంఘాతం సమ్యగ్విద్వాగ్నినాపచేత్। గోధూమచూర్ణతాంబూలదళంతక్రించ నిక్షిపేత్॥ పక్వం సుగంధివిశదం తద్ఘృతం చామృతోపమం॥ మదాపస్మారమూర్ఛామజ్వరకర్ణాక్షిరోగజిత్। పురాణం జయతి వ్యాధీన్ వ్రణశోధనరోపణం। పూర్వోక్తావధికంకుర్యాద్గుణాం స్తదమృతోపమం॥ ఏవంసంవత్సరాదూర్ధ్వం శతసంవత్సరావధి। యథోత్తరగుణాధిక్యం ఘృత

స్యాపరికల్పయేత్॥ నవజ్వరే కఫోద్రేకే ప్రమేహే సకలోదరే। ఆమాతిసారే ఛర్ద్యాంచ ఘృతపానం వివర్జయేదితి॥

వెన్నయొక్క గుణములు.

నవనీతమునుగడగి గోధూమపిండి తమలపాకు మజ్జిగ యందు వేసి మందాగ్నిని యందముగ గాచిన నేయి సుగంధముగలిగి నిర్మలమై యమృతమువలెనుండును. మదాపస్మార మూర్ఛామజ్వర కర్ణ నేత్రరోగములను పాతనేయి పరిహరించును. వ్రణమును గోయుటకు మాన్పుటకు నుపయోగించును. ఈ ప్రకారము సంవత్సరమునకంటెపైని నూరేళ్లమట్టుకంతకంతకు నేయి గుణాధిక్యముగలిగియుండును. జ్వరమంకురించినది మొదలుతొమ్మిదిదినములమధ్యయందును, కఫోద్రేకమందును, ప్రమేహమందును, సకలోదరములందును, ఆమాతిసారమందును, ఛర్దియందును ఘృతపానము విడువవలయును.

భోజనపరిమితిః.

అజీర్ణే భుక్తమశనం పరిణామం గతే మితం। కుర్యాత్ క్షీరాంత మాహారం నచపశ్చాత్పిబేద్దధి॥ జఠరంపూరయేదర్ధమన్నైర్భాగం జలేనచ। వాయోస్సంచరణార్థాయ చతుర్థమవశేషయేదితి బ్రహ్మపురాణే॥ జీర్ణేహితంమితంచాద్యాదిత్యాయుర్వేదే॥ భోక్తవ్యం సఘృతం సోష్ణం హితం పథ్యం మితం తథేతి వ్యాసస్మృతౌ॥ నాజీర్ణే భోజనంకుర్యాదితియమస్మృతౌ॥ అన్నం ప్రశస్తం పథ్యంచ ప్రోక్షితం ప్రోక్షణోదకైరితి (శ్రీవిష్ణుపురాణేధిహితత్వాత్ప్రోక్తస్వీకమన్నగుణాంశ్చ తదన్యోన్యమేళనేనోత్పన్నవికృతీశ్చ। తచ్ఛమనాన్నానిచ వ్యాఖ్యాస్యామః॥

భుజించుపరిమితిమొదలగునవి.

అజీర్ణమందు భక్షించినయన్నము జీర్ణమగుచునుండ మరల క్షీరాంతముగ మితాహారము జేయవలయును గాని పెరుగు కొసను బుచ్చికొనరాదు. జీర్ణమందు హితమగుదాని మితముగ భుజించవలయునని యాయుర్వేదము. తనకడుపును సగమన్నముచేత నుదకముచే పాతికయు నిండించి నాలవభాగము వాయుప్రచారముకొరకు విడువవలయునని బ్రహ్మపురాణము.

హితము మితము పథ్యము ఘృతయుక్తముగసంయుక వేడి గలిగిన పదార్థమును భుజించవలయునని వ్యాసులు. అజీర్ణమందు భుజించదగదనియముడు. ప్రశస్తమై పథ్యముగునన్నము మంత్రితోదకములచే ప్రోక్షించి భక్షించవలయు

నని విష్ణుపురాణము. కావున ప్రతిపదార్థగుణములను తదన్యోన్యమేళనోత్పన్న వికృతులను దచ్ఛాంతికరమగు పదార్థములను వివరింపుచున్నారము.

అన్నశబ్దనిర్వచనమ్.

అద్యతఇత్యన్నం। అత్తీత్యన్నమితివా॥ అద్యతేత్తి చ భూతాని తస్మాదన్నం తదుచ్యతఇతిశ్రుతేః॥ అస్యార్థః॥ అద్యతే సర్వైః ప్రాణిభిర్జీవనార్థం భక్షణయోగ్యవస్తూన్యన్నమితివదామః। సర్వాన్ప్రాణినోత్తి భక్షయతి సంహరతీత్యన్నం। సర్వేపిదేహా అన్నరసవైషమ్యాత్ప్రాదితరోగాదినా మ్రియంతఇతి లోకప్రసిద్ధం॥

అన్నశబ్ద నిర్వచనము.

తినబడుచున్నది గావునను తినుచున్నది గావున నన్నమనుపించుకొనును. అదధాతువునకు భక్షణమర్థము. ప్రాణులుజీవించుటన్నము భక్షింపుటవలననే గావున నన్నపరిణామమీశరీరము గావున నన్నముదినబడును. ఒకప్పుడన్నము విషమించి రోగాదిరూపమై ప్రాణులను సంహరించును గావున నన్నము ప్రాణులను దినుచున్నదనియును శ్రుత్యర్థము.

శాలిభేదా స్తద్గుణాశ్చ.

తత్ర శాలిగుణాన్బ్రూమః॥ శ్లాఘ్యంతే జనైరితి శాలయః। శాలృ శ్లాఘాయాం॥ కేదారావాతపిత్తఘ్నా గురవః కఫశుక్రలాః। కషాయాఅల్పవర్చస్కా- మధురాశ్చ బలావహాః॥ కృష్టక్షేత్రే కేదారే ఉత్పన్నధాన్యానామేతే గుణాః। దధాతి దేహమితిధాన్యం। డుధాఞ్ ధారణపోషణయోః॥ స్థలజాస్స్వాదవఃపిత్తకఫఘ్నా వాతవహ్నిదాః। కించిత్తిక్తాః కషాయాశ్చ విపాకే కటుకా అపి॥ స్థలజాః భూమౌ అకృష్టక్షేత్రే స్వయముత్పన్నానామేతేగుణాః॥ వాపితా మధురావృష్యా బల్యాః పిత్తప్రణాశినః। శ్లేష్మలాశ్చాల్పవర్చస్కా- కషాయా గురవోహిమాః॥

రాజాన్నంతు త్రిదోషఘ్నం సుస్నిగ్ధం మధురం లఘు। దీపనం బలకృత్పథ్యం కాంతిదం వీర్యవర్ధనం॥ మహారాష్ట్రేషు రాయభోగఇతి రాజాన్నమిత్యేవారధ్రేషు ప్రసిద్ధం॥

కృష్ణశాలిస్త్రిదోషఘ్నో మధురః పుష్టివర్ధనః। వర్ణకాంతికరో బల్యోదాహజిద్వీర్యవర్ధనః॥ కృష్ణశాలిర్గోదావరీతీరే ప్రసిద్ధః॥

రక్తశాలిస్తుమధురో లఘు స్నిగ్ధో బలావహః। రుచికృద్దీపనః పథ్యః పి

త్తదాహానిలాస్రజిత్॥ రక్తశాలిర్వరస్తేషు బల్యోవర్ణస్త్రిదోషజిత్। చక్షుష్యో మూత్రకృత్పథ్యశ్శుక్రలస్తృడ్జ్వరాపహః॥

ముండశాలి స్త్రిదోషఘ్నో మధురామ్లో బలప్రదః। రుచికృద్దీపనః పథ్యోముఖజాడ్యరుజాపహః॥ నిశ్శూకోముండశాలిః॥

మహాశ్శాలిస్స్వాదుర్మధురశిశిరః పిత్తశమనో జ్వరం జీర్ణందాహం జఠరరుజమప్యాపశమయేత్। శిశూనాం యూనాంవా యదతిరజసాంవాహితకరస్సదాసేవ్యస్సర్వైరనలబలవీర్యాణి కురుతే॥

సూక్ష్మశాలిస్తు మధురో లఘుపిత్తాస్రదాహనుత్। దీపనః పచనశ్చైవ కించిద్వాతవికారజిత్॥

సుగంధిశాలిర్మధురోతివృష్యపిత్తభ్రమాస్రరుచిదాహశాంతిదః।స్తన్యశ్చగర్భస్థిరతాల్పవాతదఃపుష్టిప్రదశ్చాల్పకఫశ్చబల్యః॥ గంధిశాలిరితిప్రసిద్ధః॥

తిరపోమధురస్స్నిగ్ధశ్శీతలోదాహపిత్తజిత్।త్రిదోషశమనోరుచ్యఃపథ్యస్సర్వామయాపహః॥మాసైర్జన్యస్త్రిభిస్స్యాత్సభవతితిరపఇతితల్లక్షణంజ్ఞేయం

షష్ఠికా సరజస్సోయం జ్ఞేయో మాసద్వయోద్భవః॥ గౌరోసీలష్షష్టికోయం ద్విధాస్యాదాద్యోరుచ్యశ్శీతలో దోషహారి। బల్యః పథ్యో దీపనో వీర్యవృద్ధింధత్తేచాస్మాత్కించిదూనోద్వితీయః॥షష్ఠికామాళవేచాంధ్రేచప్రసిద్ధాః॥

వ్రీహిర్గౌరోమధురరసకః పిత్తహారీ కషాయస్స్నిగ్ధో వృష్యః కృమికఫహరస్తాపరక్తాపహశ్చ। పుష్టింధత్తే శ్రమశమనకృద్వీర్యవృద్ధింవిధత్తే రుచ్యోత్యంతం జనయతిచ ముదం వాతకృన్మేచకోన్యః॥ వ్రీహిః వృష్వరణే। వృణాతి దేహమితి వ్రీహిః। గౌరశాలిహారిద్రఇతి ప్రసిద్ధః॥

వాగ్భట్టస్తు॥ రక్తోమహాన్సకలమస్తూర్ణకశ్శకునాహృతః। సురాముఖో దీర్ఘశూకో రోధ్రశూకస్సుగంధకః। పౌండ్రకః పుండరీకశ్చ ప్రమోదో గౌరశాలికః। లాంగలో లోహవాలాఖ్యః కర్దమశ్శాంతిభీరుకః। పతంగాస్తపనీయాశ్చ యేచాన్యే శాలయశ్శుభాః। స్వాదుపాకకరా స్స్నిగ్ధా వృష్యా బద్ధాల్పవర్చసః। కషాయానురసాః పథ్యా లఘవో మూత్రలా హిమాః॥

శూకజేషు వరస్తత్ర రక్తస్తృష్ణాత్రిదోషహా। మహాం స్తస్యానుకలమస్తంబోప్యనుతతఃపరే॥

యవకాహాయనాః పాంశు బాష్పనైషధకాదయః। స్వాదూష్ణా గురవస్స్నిగ్ధాః పాకేమ్లాశ్శ్లేష్మపిత్తలాః। సృష్టమూత్రపురీషాశ్చ పూర్వంపూర్వంచ నిందితాః॥ స్నిగ్ధోగ్రాహీ లఘుస్స్వాదుస్త్రిదోషఘ్నస్స్థిరోహిమః। షా

ష్టికో వ్రీహిషు శ్రేష్ఠో గౌరశ్చాసితగౌరతః॥ తతఃక్రమాన్మహావ్రీహిశ్చ స్థూలవ్రీహిముఖాస్తతః। కుక్కుటాండకలావాఖ్యపారావాతకశూకరాః। వరకో హావకో దాలచీనశారదదర్దురాః। గంధనాః కురువిందాశ్చ గురో రల్పాంతరాస్స్మృతాః॥

స్వాదురామ్లవిపాకోన్యో వ్రీహిః పిత్తకరో గురుః। బహుమూత్రపురీషోష్మా త్రిదోషశ్చైవ పాటలఇతి॥

రక్తో లోహితః। మహాన్మహాతండులః। కలమః అంతర్వేద్యాం కలం వేతి ప్రసిద్ధః। తూర్ణక శ్శీఘ్రపాకీ- ఆశ్వయుజఇతి కార్ష్ణేరే ప్రసిద్ధః। శకునాహృతః- గరుడాపరనామా॥ ఉక్తంచ॥ ద్వీపాంతరాత్సమానీతో గరుడేన మహాత్మనా। శకునాహృతశాలిస్స్యాద్గరుడాపరనామకఇతి॥ సారాముఖః కృష్ణతుణ్డాకారం తండులం। దీర్ఘశూకః- అత్యాయతశూకః। రోధ్రశూకో రక్తశూకః। సుగంధకో గంధశాలిః। పాండ్రకః పాండురశ్శాలిః। పుండరీక శ్శ్వేతోత్పలః। ప్రమోదః ప్రస్థోదకః- కమోదకఇతి ప్రసిద్ధః। గౌరశాలికః హారిద్రః। లాంగూల శ్శీరకృష్టభూమిజః। లోహవాలః అతికఠినతండులః। కర్దమః పంకజః। శీతభీరుకః శీతమాత్రనిష్పన్నః। పతంగః ఉష్ణనిష్పన్నః। తపనీయోల్పశీతజన్యః। త్రిదోషహేతి రక్తవిశేషణం। తద్గుణో మహాన్, తదను కలమః। నైషధకాదయఇత్యాదిశబ్దేన చంపకపత్రికాసంగ్రహః। యవకాఇత్యారభ్య నిందితా ఇత్యంత ఏకోగ్రంథః॥ శేషం స్పష్టం॥

రుచ్యాః పాచనదీపనా బలకరా వృష్యాస్త్రిదోషాపహా శ్శుక్రశ్లేష్మవివర్ధనా రుచికరా స్సందీపనాస్తర్పణాః। పథ్యా స్సర్వగజేహితా శ్శ్రమహారా క్షుత్తృట్ప్రమధ్వంసిన శ్శ్రేష్ఠా వ్రీహిషు షష్టికాః కలమకా రక్తా మహాశాలయఇతి సుషేణః॥

నీవారాణాం వ్రీహివర్గే పాఠమాహ ప్రయోగపారిజాతః॥ వాగ్భట్టస్తు తృణధాన్యవర్గే॥ తత్ర పూర్వస్యావయవసామ్య ముత్తరస్య గుణసామ్యం పాఠహేతుః గుణశ్చ॥ కాషాయమధురో రూక్షో నీవారః కఫపిత్తహృత్। గ్రాహీ లఘుర్బలహరో మునీనాం దేహధారకః॥ తృణధాన్యాని నీవారఇత్యమరః॥ నితరాం వ్రియంతే నీవారాః। వృఞ్ వరణే॥

## శాలిభేదములు వాటిగుణములును.

శ్లాఘించబడునుగావున శాలులనుపించుకొనును. శాలిధాతువునకు శ్లాఘనమర్థము. మడియందు పండినధాన్యము పైత్యమును బోగొట్టి గురుత్వము

ను, కఫమును, శుక్లమును బుట్టించును. సువాసన కొంచెపు తేజము మధురరస ముగలిగి బలవృద్ధిని జేసును. దేహమును బోషించును కావున ధాన్యమనబడును. డుధాఞ్ అనేధాతువునకు ధారణపోషణలర్థము.

అకృష్టభూమినిబుట్టినధాన్యము రుచిగలిగి పైత్యకఫహరములై జఠరమును వృద్ధినొందించి యించుకచేదు సువాసనయు మిగులబండిన కటువులై యుండును. విత్తనముజల్లి బండించిన వెదధాన్యము మధురము- బలపుష్టికరము- పైత్యహరము- శ్లేష్మకరము- తేజస్సు- గంధగురుత్వ శైత్యయుక్తములు.

రాజభోగాన్నము త్రిదోషహరము- నునువు- మధురము- లఘువు- దీపనము- బలకాంతివీర్యవర్ధనమై యుండును. మహారాష్ట్రదేశమందు రాయభోగమనియును- ఆంధ్రదేశమందు రాజభోగమనియును బ్రసిద్ధము.

నల్లబుడమధాన్యము త్రిదోషముల నణచును. మధురము- పుష్టికాంతిబలవీర్యకరము- దాహహరము. ఇదిగోదావరీతీరమున బ్రసిద్ధము.

రక్తధాన్యము మధురము లఘువు చమురుగలిగియుండును. బలమును గలిగించును. రుచిని జేయును. జఠరదీపనము- పథ్యము. పైత్యమును దాహవాతరక్తమును బోగొట్టును. దృష్టిప్రసాదకరము. మూత్రకారి- శుక్రవృద్ధిని జేయును. పిపాసను, జ్వరమును, త్రిదోషమును హరించును.

ముండశాలియనగా ముల్లులేనిధాన్యము- అది త్రిదోషములను బోగొట్టును. మధురామ్లము- బలమొనర్చును. రుచికరము- దీపనము- పథ్యము- ముఖరోగనివారకము.

మహాశాలియనునది పరిమళముగలిగి మధురమై చలువనై పైత్యమును, జీర్ణజ్వరమును, దాహమును, జఠరరోగములను ఒకదినముననె పోగొట్టును. శిశువులకు పిన్నవయసుగలవారికి అధికరక్తముండువారికిని హితవానర్చును. అందరిచేసర్వకాలము సేవించదగును. జఠరాగ్నిని,బల వీర్యములను జేయును.

సూక్ష్మధాన్యము మధురము- లఘువు- పైత్యరక్తదాహములను బోగొట్టును. దీపనపాచనములను జేసి కొంచెము వాతవికారములనుబోగొట్టును.

సుగంధిధాన్యము మధురము- విశేషబలకరము- పైత్యభ్రమమును రక్తమును అరుచిని దాహమును బోగొట్టును. స్తన్యగర్భస్థైర్యప్రదము- ఇంచుక వాతమును, కఫమును, పుష్టిని జేయును.

తిరపధాన్యము మధురము- స్నిగ్ధము- శీతలము- దాహపైత్యములను బోగొట్టును. త్రిదోషశమనము- రుచ్యము- పథ్యము- సర్వరోగహరము- మూడుమాసములకు పండునవి తిరపధాన్యమనుపించుకొను.

అరువదిరోజులకు ఫలించునది షష్ఠికము- అది గౌరము, నీలము అని రెండువిధములు- అందు గౌరము రుచ్యము- శీతలము- దోషహరము- బలకరము- పథ్యము- దీపనము- వీర్యవృద్ధికరము. నీలషష్ఠికమింతకంటె తక్కువది. షష్ఠికములు మాళవాంధ్రదేశములందు ప్రసిద్ధములు.

ఎఱ్ఱధాన్యము- మధురము- పైత్యహరము- కషాయము- స్నిగ్ధము- ధాతువృద్ధికరము- క్రిమి కఫ తాప రక్తహరము- తుష్టికరము- శ్రమాపహము- వీర్యవర్ధనము- రుచ్యము- మోదావహము- వాతకారి. నల్లధాన్య మింతకంటె తక్కువ. వృశ్ ధాతువునకు వరణమర్థము గావున దేహము నావరించునది వ్రీహియనబడును. ఈగౌరవ్రీహికి హరిద్రాధాన్యమని ప్రసిద్ధి.

వాగ్భటుడైతే. రక్తము, మహత్తు, కలమము, తూర్ణకము, శకునాహృతము, సారాముఖము, దీర్ఘశూకము, రోధ్రశూకము, సగంధకము, పౌండ్రకము, పుండరీకము, ప్రమోదము, గౌరశాలి, లాంగలము, లోహవాలము, కర్దమము, శాంతిభీరుకము, పతంగము, తపనీయము మొదలగు శుభమగు శాలిధాన్యములు స్వాదుగలిగి వేగము పచనమై చమరుగలిగి బలకరమై అమ్లరసము కలిగి తేజస్కరములై వాసన ననుసరించిన రుచికలిగి పథ్యములై చులకనై మూత్రకరములై చలువకలిగియుండును.

ముల్లుకలిగినవాటియందు రక్తధాన్యము శ్రేష్ఠము. దాహమును, త్రిదోషముననణచును. దీనికంటెననుకలమము శ్రేష్ఠము. దీనికంటెస్తంబముత్తమము.

యవకములు, హాయనములు, పాంశువ్రులు, బాష్పములు, నౌషధములు మొదలగునవి స్వాదును, పెట్టయును, బరువును, చమురునుగలిగి జీర్ణకాలమందామ్లరసము గలిగి శ్లేష్మపైత్యకరములై మూత్రపురీషోత్సర్గకారులైయుండును. వీటియందు పూర్వపూర్వము నిందితము. సకలధాన్యములందును షాష్టికములెఱ్ఱనివి. త్రిదోషహరములు గావున శ్రేష్ఠములు. అంతకంటె మహావ్రీహి కృష్ణావ్రీహి మొదలగునవి శ్రేష్ఠము. కుక్కుటాండకలావ పారావతక శూకర వరక ఉద్దాలక దాల చీన శారద దర్దుర గంధన కురువిందములు మొదలుగాగలవి క్రమముగ నొకటికంటెనొకటి శ్రేష్ఠము. అనగా బరువైన దానికంటె చులకనగునది శ్రేష్ఠము.

స్వాదుగలిగి పాకమందున బులుసైన వ్రీహి బరువు గావున పైత్యకరము- మూత్రపురీషములధికముగ విడిపించును. త్రిదోషమును జేయును.

రక్తమన నెఱ్ఱనిది- మహత్తన పెద్దగింజగలది- కలమమన నంతర్వేదియందు కలువయని ప్రసిద్ధము- తూర్ణకము వేగముగఫలించునది- యాశ్వయు

జమని కాశ్మీరమందు బ్రసిద్ధము. శాకునాహృతము గరుడునిచే ద్వీపాంతర మువలన దేబడునదిగాన గరుడమని రెండవపేరు గలిగియుండును. సారాము ఖము తెలుపును నలుపునుగలిగిన గింజగలధాన్యము. దీర్ఘశూకము పొడవగు ముల్లు కలది. రోధ్రశూకము ఎఱ్ఱనిముల్లు కలది. సుగంధము వాసనగలది. పౌండ్రికము పాండువర్ణమగునది. పుండరీకము తెల్లనిది. ప్రమోదము సంతో షమును జేయునది. గౌరశాలికము పచ్చనగునది. లాంగలము దున్నినభూమి యందున బండినది. లోహవాలము మిక్కిలి కఠినమగు గింజగలది. కర్దమము బురదవలనబుట్టునది. శీతభీరుకము మంచుమాత్రముచే పండునది. పతంగము వెట్టచేపండునది. తపనీయము ఇంచుకశీతముచే పండునది.

రుచ్యము- పాచనము- దీపనము- బలకరము- వృష్యము- త్రిదోషహర ము- శుక్లకఫకరము- రుచికరము- తృప్తికరము- పథ్యము- సర్వరోగములయం దును హితము- శ్రమహరము- వ్రీహిజాతియందు షష్టికధాన్యము, కలమము, రక్తనామకము, మహాశాలి ఇవి ఆరోగ్యకరములని సుషేణునిచే జెప్పబడెను.

నివరధాన్యము వ్రీహివర్గులో పారిజాతగ్రంథమందు అవయవసా మ్యముచే పఠించబడెను. వాగ్భట్టుడైతే తృణధాన్యవర్గుయందు గుణసామ్య ముచే జెప్పెను. నివరధాన్యగుణము కషాయము- మధురము- వెట్ట- కఫపై త్యహరము- చులకన- బలహరము- మునీశ్వరుల దేహధారణమాత్రోపయో గము. నీవారములు తృణధాన్యమని యమరము. మిక్కిలి యావరించును గా వున నీవారమనబడెను. వృఞ్ ధాతువుకు వరణమర్థము.

## గోధూమ గుణాః.

అథ గోధూమాః॥ గుధ్యతే పరివేష్ట్యత ఇతి గోధూమః॥ గుధపరివేష్టనే॥ వాగ్భట్టే॥ వృష్యశ్శీతో గురుస్స్నిగ్ధో జీవనో వాతపిత్తహా॥

గోధూమస్స్నిగ్ధమధురో వాతఘ్నః పిత్తదాహకృత్ । గురుశ్శ్లేష్మా మదో బల్యో రుచిరో వీర్యవర్ధనః। సంధానకారి మధురో గోధూమ స్థైర్య కృత్సరః॥ రాజనిఘంటౌ॥

స్నిగ్ధోన్యో లఘుగోధూమో గురుర్వృష్యః కఫాపహః। ఆమదోషక రో బల్యో మధురో వీర్యపుష్టిదః॥ వాగ్భట్టః॥

పథ్యా నాందీముఖీ శీతా కషాయా మధురా లఘుః ॥ దీర్ఘసూక్ష్మో గోధూమో నాందీముఖీ॥ భావప్రకాశే॥

గోధూమస్సుమనోపిస్యాత్త్రివిధస్సచకీర్తితః।మహాగోధూమఇత్యాఖ్యః

పశ్చాద్దేశాత్సమాగతః। మధూలీతు తతఃకించిదల్పా సా మధ్యదేశజా। నిశ్శూకో దీర్ఘగోధూమః క్వచిన్నాందీముఖాభిధః॥ శోభనం మన్యతే సుమనః। మనజ్ఞానే॥ యత్తు కఫశుక్రప్రదో బల్యఇతి గ్రంథాంతరే కఫకారిత్వముక్తం తన్నవీనవిషయం జ్ఞేయం॥

## గోధూమ గుణములు.

గుధధాతువునకు వేష్టనమర్థము గావునజిగటచేజుట్టుకొనునది గోధూమమనబడును. వృష్యము- శీతము- గురుత్వకరము- స్నిగ్ధము- జీవనము- వాతపిత్తహరమని వాగ్భట్టుడు.

మధురము- వాతహరము- పైత్యదాహకరము- గురుత్వ శ్లేష్మ బలమద రుచి వీర్యవర్ధనము- సంధానకారి- స్థిరకారి- రేచకమని రాజనిఘంటు.

చిన్నగోధుములు స్నిగ్ధము- గురుత్వకారి- వృష్యము- కఫహరము- ఆమదోషకరము- బలకరము- మధురము- వీర్యపుష్టిప్రదమునని వాగ్భట్టుడు.

నాందీముఖియను గోధుములు పథ్యము- శీతము- మధురము- లఘువు. సన్నమై కోలగింజగలగోధుమము నాందీముఖియనుపించుకొనును.

గోధుమము మనోహ్లాదకరము- అది త్రివిధము- పశ్చిమదేశమందుత్పన్నము మహాగోధూమ మనబడును. అంతకల్పమగు గింజలుగలది మధూలియనబడును అది మధ్యదేశీయము. ముల్లులేనిది దీర్ఘగోధూమనుందురు- కొందరు నాందీముఖియందురు. గ్రంథాంతరమందు కఫశుక్రములను జేసును- బలకరమనిజెప్పియున్నది. అది నూతనగోధూమవిషయమని దెలియదగును.

## యవ గుణాః.

అథ యవాః॥ రూక్షశ్శీతో గురు స్స్వాదు స్సరో విడ్వాతకృద్యవః। వృష్యస్థైర్యకరో మూత్రభేదః పిత్తకఫాన్జయేత్। పీనసశ్వాసకాసోరుస్తంభకంఠత్వగామయాన్॥ నిఘంటు॥

యవఃకషాయో మధురస్సుశీతలః ప్రమేహజిత్పిత్తకఫాపహారకః। అశూకముండస్తు యవో బలప్రదో వృష్యశ్చ నౄణాం బహువీర్యపుష్టిదః॥ న్యూనోయవా దనుయవఇతి వాగ్భట్టః॥

శీతః కషాయో మధురశ్చరూక్షో మేహక్రిమిశ్లేష్మవిషాపహశ్చ।పుష్టించవీర్యంచబలంచధత్తేపిత్తాపహోఽయం వేణుయవఃప్రశస్తః॥ వేణుయవఃవంశబీజం॥

## యవలయొక్క గుణములు.

ఇటుపైని యవలనుగూర్చిజెప్పుచున్నారము- యవలు కఠినము- శీతల

ము- స్వాదును- గురుత్వకారియు- జారుకలవియు- మలకారులు- వాతలము, వీర్యవృద్ధియు, స్థైర్యము నొనర్చును. మూత్రభేదియు- పిత్తకఫములను బో గొట్టును. పీనస కాస శ్వాసోరువాత కంఠదర్దురాది చర్మరోగములనణచును.

యవప్రమాణాల్పమగు యవలు కషాయములై మధురముగనుండును. మిక్కిలి శీతలము- ప్రమేహపరిహారియనియు- ముల్లులేని యవ బలకారియు- పుష్టిదము- వీర్యవృద్ధికరమనియును వాగ్భట్టుడు.

వెదురుబియ్యము శీతలము- నానారుచికరము- మధురము- కఠినము- మేహములను, క్రిములను, శ్లేష్మములను, విషమును గొట్టును. పైత్యహరము- పుష్టిని, తుష్టిని, వీర్యవృద్ధినిగూడ జేయును.

## యావనాల గుణాః.

ధవళో యావనాళస్తు గౌళ్యో బల్యస్త్రిదోషజిత్। వృష్యో రుచిప్రదశ్శీఘ్రః పథ్యో గుల్మవ్రణాపహః॥ తువరో యావనాళస్తు కాషాయోష్ణో విశేషకృత్। సంగ్రాహీ వాతశమనో విదాహీ శోషకారకః॥ రక్తశ్చ శారదో యావనాళస్తు శ్లేష్మలో గురుః। శిశిరో మధురో వృష్యో దోషఘ్నో బలపుష్టిదః॥

## జొన్నల గుణములు.

వర్తులములగు తెల్లజొన్నలు త్రిదోషములనణచి బలమొనర్చి వీర్యవృద్ధిని రుచిని కలిగించును. గుల్మములను వ్రణముల నణచును. వేగమైనది పథ్యమైనది. పచ్చజొన్నలు కషాయముగనుండి వెట్టజేయును. మలబద్ధకారి- వాతమును బోగొట్టును. విదాహమును శోషమును జేయును. శరత్కాలమందున బుట్టెడి ఎఱ్ఱజొన్నలు శ్లేష్మమును గురుత్వమును చలవను వీర్యవృద్ధిని జేయును. మధురము- బలపుష్టికరము- దోషములనణచును.

## శింబిధాన్యగుణాః.

ఉద్దాలా మధురా వృష్యా వాజినాం పుష్టికారకాః। వాతప్రకోపనా బల్యాః పిత్తఘ్నా నాగ్నిదీపనాః॥ అయం శింబిధాన్యం॥ ఉద్దాలకే మసూరాది శింబిధాన్యం విదుర్బుధాఇతి వాగ్భట్టేనోక్తత్వాత్॥

## శింబిధాన్యగుణములు.

ఉద్దాలకమనగా శింబిధాన్యము అది మధురము- వీర్యకరము- గుఱ్ఱములకు పుష్టినిజేయును. వాతమును బలమును వృద్ధినొందించును. పైత్యమణచును. జఠరదీపనమును జేయదు.

## ముద్గగుణా

కృష్ణముద్గస్త్రిదోషఘ్నో మధురో వాతనాశనః। లఘుశ్చదీపనః పథ్యో బలవీర్యాంగపుష్టిదః॥ ఆంధ్రే వాతలాశ్చాపథ్యాఏవ దేశవిశేషోత్పన్నాః వాతఘ్నాః పథ్యాఇతి జ్ఞేయాః॥ హరిన్ముద్గః కషాయశ్చ మధురః కఫపిత్తనుత్। రక్తమూత్రామయఘ్నశ్చ శీతలో లఘుదీపనః॥ తద్వచ్చ ధూసరోముద్గో రసవీర్యాదిషు స్మృతః। కషాయమధురో రుచ్యః పిత్తవాతవిబంధకృత్॥

### పెసలయొక్క గుణములు.

నల్లపెసలు త్రిదోషములను విశేషముగ వాతమును శమించును. లఘువు- దీపనము- పథ్యము- బలమును, వీర్యమును, అవయవపుష్టిని జేసును. ఆంధ్రదేశమందపథ్యములును- వాతములును- దేశవిశేషోత్పన్నములు పథ్యములును వాతనివారకములని దెలియవలెను.

పచ్చపెసలు కషాయములు- మధురములును- రక్తకఫపైత్యరోగముల నణచును. శీతలములు కొంచెము జఠరదీప్తిని జేసును.

తెలుపును నలుపును గలసిన రంగుపెసలు పచ్చపెసలువలెనే గుణమును జేసును. విశేషించి రసవీర్యపైత్యవాతవృద్ధిని జేసును.

## ఆఢకసూపగుణాః.

ఆఢకీతు కషాయాస్యాన్మధురా కఫపిత్తజిత్। ఈషద్వాతకరారుచ్యా విదలా గురుగ్రాహిణీ॥ ఆఢకీ కఫపిత్తఘ్నీ గ్రాహిణీ రక్తశీతలా। కషాయమధురా గుర్వీ జ్వరాతీసారనాశనీ। ప్రమేహఘ్నీ ఘృతే సిద్ధా త్రిదోషశమనీ లఘుః॥ సాచ శ్వేతా దోషలా లోహితాచ రుచ్యాబల్యా పిత్తతాపాపహంత్రీ॥ మధురశ్చాఢకీసూపో విష్టంభశ్శీతలో గురుః। సూపైర్వినా వృథా భోజ్యం న హృద్యం పుష్టికృన్నచ। శతశాకయుతంవాపి సహస్రరసయోగ్యపి॥

### కందిపప్పు గుణములు.

కందిపప్పు మధురము- మలబద్ధకారి- శీతలము- గురుత్వకారి. పప్పులేక ననేకరసయుక్తములగు నూరుకూరలచే నోటికింపౌనర్చినను సూటిగ పుష్టియును తుష్టియును జేయదు. కషాయమై కఫపైత్యములను జ్వరాతిసారములను ప్రమేహములను త్రిదోషములను నేయితో మెదపి మెసవిన లఘువై బోగొట్టును. తెల్లకందిపప్పు త్రిదోషకారి. ఎఱ్ఱనిది రుచి- బలకరము- పైత్యతాపమణచును.

### మాషగుణాః.

మాషస్స్నిగ్ధో బహుమలకరశ్శ్వసన శ్లేష్మకారీ వీర్యాణోష్ణో ఝడితి కురుతే రక్తపిత్తప్రకోపం। హన్యాద్వాతం గురుబలకరో రోచనో భక్ష్యమాణస్స్యాదగ్నిత్వం శ్రమసుఖవతాం సేవనీయో నరాణాం॥ సుఖవతామరోగిణాం॥ రాజమాషో నీలమాషో స్ఫుపమాషో వృషోచితః। కఫపిత్తహారో రుచ్యో వాతకృద్బలదాయకః॥

### మినుముల గుణములు.

మినుములు చమురుగలిగి రేచకములై శోషశ్లేష్మవీర్య బలోష్ణత్వముల ను రక్తపైత్యములను శీఘ్రముగ జేయును. వాతహరము- గురుత్వము- రుచినొ నర్చును. శ్రాంతులకు అశ్రాంతమరోగులకుపయోగ్యము.

రాజమాషములనగా నలుపులేనివి- బొబ్బర్లు లేక పచ్చమినుములందురు. ఇవికఫపైత్యముల నణచును. రుచిని వాతమును బలమును జేయును. అడవిమినుములు వెట్టజేసి కషాయములై విదాహము నుపుట్టించక కఫ పైత్యములను హరించి రుచిని వాతమును బలమును జేయును.

### చణకగుణాః.

చణ్యతేదీయతఇతి చణకః। చణశ్రాణనే॥ చణకో మధురోరూక్షో మేహజిద్వాతపిత్తకృత్। దీప్తివర్ణకరో రుచ్యో బల్య శ్చాధ్మానకారకః। చణకాశ్శీతలో రూక్షో పిత్తరక్తకఫాపహః। లఘుః కషాయో విషభీ వాతలో జ్వరనాశనః॥ ఆమశ్చణశ్శీతలరుచ్యకారీ సంతర్పణో దాహతృషాపహారీ। స్థౌల్యాశ్మరీదోషవినాశకారీ కషాయ ఈషత్కఫవీర్యకారీ ॥ సచాంగారేణ సంభృష్టస్తైలభృష్టస్తు తద్గుణాః। ఆర్ద్రభృష్టో బలకరో రోచనశ్చ ప్రకీర్తితః। శుష్కభృష్టోతిరూక్షస్స్యాద్వాతకుష్ఠప్రకోపనః॥ స్విన్నః పిత్తకఫంహన్యాత్సుప్తిక్షోభకరో మతః॥ కృష్ణస్తు చణకశ్శీతో మధురః కాసపిత్తజిత్। పిత్తాతిసారశమనో బల్యశ్చైవ రసాయనః॥ చణోగౌరస్తు మధురో బలకృద్రోచనఃపరః। శ్వేతో వాతకరో రుచ్యః పిత్తఘ్నశ్శిశిరో గురుః॥

### సెనగల గుణములు.

చణధాతువున కివ్వబడినదనియర్థము. చణకమనగా శనగదిమధురము. గట్టివాతపైత్యములను జేసును. దీప్తిని, వర్ణమును, రుచిని, బలమును, కడుపు పొంగును జేసును. మేహమును పిత్తరక్తకఫములను, జ్వరమును బోగొట్టును.

లఘువు- కషాయము- వాతలము- పచ్చిసెనగ శీతలము- రుచికారి- సంతాప తృపలను బోగొట్టును. మిక్కిలి తృప్తినిజేసును. స్థూలమగు రాళ్లుబుట్టెడిమూత్రరోగములను బోగొట్టును. రుచికలదియు నించుకంత కఫమును వీర్యవృద్ధిని జేసును.

ఆసెనగనిప్పులవేచినను తైలముచే వేచినను పచ్చివి వేచినను బలమును రుచిని బుట్టించును. ఎండిన సెనగలు వేచిన గట్టివై వాతకుష్ఠులను, ప్రకోపనమును జేసును. తడపబడినవి పైత్యకఫములను హరించును. నిద్రను నశింపజేసును. బోడిశెనగలు శీతలములు- మధురములు- కాసను, పైత్యమును, పిత్తాతిసారమును జయించును. బలకరము- రసవృద్ధిదము- పచ్చని సెనగలు మధురము- బలమును విశేషరుచిని బుట్టించును. తెల్లసెనగలు వాతకరములు- రుచి- చలవయైన గురుత్వముకలిగియుండును- పైత్యమణచును.

కుళుద్ధగుణాః.

అథ కుళుద్ధాః॥ కషాయస్స్వాదురూక్షోష్ణాః కుళుద్ధా రక్తపిత్తలాః। గ్రాహిణో లఘవస్తీక్ష్ణో విపాకామ్లా విదాహినః। పీనస శ్వాస కాసార్శో హిక్కాధ్మానకఫానిలాన్। హంతిశుక్లాశ్మరీశకృద్ధృష్టిదోషం తథోదరం। ఏతే కృష్ణాశ్చ శుక్లాశ్చ లోహితాశ్చ త్రిరూపిణః। ఏతేసమగుణాస్సర్వే వేదితా గుణవేదిభిః॥ అనాహమేదో గుదకీలహిక్కా శ్వాసాపహా శ్శోణితపిత్తకృచ్చ। కఫస్యహంతా నయనామయఘ్నా విశేషతో వన్యకుళుద్ధఉక్తః॥

అతుపాతువిషాముద్గా సతుపాతు విషాధకా। అభర్జితావిషామాషా చణకాస్సర్వతో విషః॥ ఏవం చణకానాం సర్వతో విషత్వేతి విశేషవిధినా తత్తద్రోగోపశమనార్థం యత్రయత్రోక్తం తత్రతత్రోపయుజ్యతే॥

ఉలవలగుణములు.

ఇటుమీద ఉలవలగుణములను జెప్పుదుము. కషాయము- మధురము. గట్టివెట్ట- రక్తపైత్యమును, మలబద్ధమును జేసును. లఘువు- విశేషపాకముచేత ను పులుసు గలుగును. విదాహమునుబుట్టించును. నాసికారోగ కాస శ్వాస మూలవ్యాధులను, హిక్కారోగమును, కడుపుపొంగును, కఫమును, వాతమును వారించును. శుక్లముతో రాళ్లు మూత్రమునబడు రోగమును, మలదోషమును, నేత్రరోగ ఉదరములనుగూడ బోగొట్టును. తెల్లని, ఎఱ్ఱని, నల్లని ఉలవలు సమానగుణముగలవందురు. అడవి ఉలవలు కడుపుపొంగును నెదదునబు

ట్టినరోగములను, మూలశంకను, ఎక్కిళ్లను, శ్వాసలను, విశేషముగ నేత్రరోగములను బోగొట్టును. పైత్యశోణితమును జేయును. కఫనివారకము.

పొట్టులేని పెసరపప్పు, పొట్టుతోనుండిన కందిపప్పు, వేచనిమినపపప్పు, శనగలెట్లుండినను విషమమగును. ఇటుల శనగలు విషప్రాయమని జెప్పినను విశేషవిధులచేత నాయాయిరోగనివారణ కాగలదని యెచటనెచట జెప్పబడినదో నాయాయిస్థలములందుపయోగమగును.

అతసీ బీజగుణాః.

అథాతసీ॥ అతసీ మదగంధాస్యా న్మధురా బలకారికా । కఫవాతకరీ చేషత్పిత్తహృత్పృష్ఠశూలనుత్॥ తథా। స్నిగ్ధామాస్వాదుతిక్తోష్ణా కఫపిత్తకరీగురుః। దృక్శుక్రహృత్కటుఃపాకే తద్వద్బీజం కుసుంభజం॥ పిత్తహృత్పిత్తకృదితి మతభేదం దర్శితం॥

అవిశగింజలగుణములు.

ఇటుపైని యవిశగుణములను జెప్పుదుము. అవిశగింజలు మదగంధము- మధురము- బలకరము- కఫవాతములను జేయును. కొంచముపైత్యమును పార్శ్వనొప్పిని బోగొట్టును. చమురుగలిగి యామమును బుట్టించును. స్వాదుగలిగియుండును. చేదును- వేడిమియును, కఫపైత్యములను, గురుత్వమును జేయును. నేత్రమందుండు తెల్పురోగములను బోగొట్టును. పాకమున వెగటగును. ఇటువలెనే కుసుంభబీజగుణములను దెలియదగును. కొంచము పైత్యమణచునని యును పైత్యమొనర్చుననియును మతభేదము.

మసూరగుణాః

మసూరో మధురశ్శీతస్సంగ్రాహీ కఫపిత్తజిత్ । వాతామయకరశ్చైవ మూత్రకృచ్ఛ్రహరోలఘుః॥

మొసరపప్పు మధురము- శీతలము- మలబద్ధకారి- కఫపైత్యములను జయించును. వాతరోగమును బుట్టించును. మూత్రకృచ్ఛ్రరోగములను గొట్టును. లఘువు.

తిలగుణాః.

అథ తిలాః॥ తిలస్స్నేహనే. తిలతి స్నిహ్యతీతి తిలః॥ ఉష్ణస్త్వచ్యో హిమస్పర్శః కేశ్యో బల్యస్తిలోగురుః। అల్పమూత్రః కటుఃపాకే మేధాగ్నికఫపిత్తకృత్। స్వాదుఃకషాయస్తిక్తశ్చ హృద్యశ్శోథవ్రణాపహః। శుక్లస్తిలశ్శ్లేష్మకృత్

త్తబలవర్ణకరో గురుః । కృష్ణస్తిలః ప్రమేహఘ్న ఆమఘ్నో దంతదార్ఢ్యకృత్॥ స్నిగ్ధో వర్ణబలాభివృద్ధిజననస్తన్యోనిలఘ్నోగురు స్సోష్ణః పిత్తకరోల్పమూత్రకరణః కేశ్యోతిపథ్యోవ్రణే। గాత్రేహి స్యాన్మధురః కషాయసహితస్తిక్తో విపాకో కటుః కృష్ణః పథ్యతమస్సితోల్పగుణదః క్షీణా స్తతోన్యే తిలాః॥ అన్యే జర్తిలాద్యాః॥ జర్తిలాతు వనోద్భవః । పిణ్యాకః కటుకో గౌర్వ్యః కఫవాతప్రకోపకృత్। గుడపాకే తిలస్స్నిగ్ధో మోదకశ్శోషణోగురుః । హృద్యం రుచికరం బల్యం వాతహం కఫపిత్తకృత్॥ తైలేనపక్వం తిలజంచ పిష్టం విష్టంభకృద్దుర్జరమగ్నిసాధనం। బల్యం కదోష్ణం కటుకం విపాకే తద్దూషణం తద్విహంతి నేత్రం॥ తస్మాత్తిలపిష్టం నసేవతేతి స్మృతిః॥

## నువ్వుల గుణములు.

ఇటుమీద తిలగుణములను జెప్పుదుము. తిల స్నేహనే యను ధాతువువలన చమురుచేత తడిపేవైనందున తిలలనబడును. నూనె శరీరమందున మర్దనా జేసిన వేడిగలుగును. శిరోజములకుబట్టించిన చలువయగును. బలకారి- గురుత్వమొనర్చును. మూత్రిలము- విశేషపాకమున వెగటగును. మేహమును, పైత్యమును జేసును. స్వాదును, కషాయమును, చేదును, మనోహరమునై యుండును. తెలుపులను, వ్రణములను బోగొట్టును. తెల్లనువ్వులు శ్లేష్మ పైత్య బల కాంతులను జేసును. నల్లనువ్వులు ప్రమేహమును, మూలశంకను, ఆమమును గొట్టును. దంతములకు దృఢము జేసును. వలిశలుమొదలగు వన్యము లిట్టిగుణములొనర్చలేవు. తిలపిష్టము గురుత్వమును, కఫవాతములను, ప్రకోపమొనర్చును. శిమ్మిలి చమురుగలిగ శోషింపజేసుటయును గురుత్వమును జేయును. మనోహరము- రుచికరము- బలదము- వాతహారి- కఫ పైత్యకరము. తైలపక్వమొనర్చిన తిలపిష్టము మలబద్ధము- జఠరదోషకారి- వేడిని జేసును. బలకరము- తమోవృద్ధిని జేసును. విశేషపాకమున వెగటగునదిదోషకారి- నేత్రదోషమునుబుట్టించును. అందువలన నేతిలపిష్టముభక్షణార్హముకాదనిస్మృతులు జెప్పుచున్నవి.

## సర్షపగుణాః.

అథ సర్షపాః॥ సరతిదేహంవ్యాప్నోతీతి సర్షపాః॥ ఆసురీకటుతిక్తోష్ణా వాతప్లీహార్తిశూలనుత్। దాహపిత్తప్రదో హంతి కఫపిత్తక్రిమివ్రణాన్॥ కటురసేనాసురస్త్రీవదనిష్టా ఆసురీ॥ రాజసర్షపకస్తిక్తః కటూష్ణో వా శూలనుత్। పిత్తదాహప్రదో గుల్మకండూకుష్ఠవ్రణాపహః। సిద్ధార్థః కటుతిక్తోష్ణా వాత

రక్తగ్రహాపహః। త్వగ్దోషశమనో రుచ్యో విషభూతగ్రహాపహః॥ సిద్ధః అర్థః ప్రయోజనం యస్య సిద్ధార్థః॥

**ఆవాల గుణములు.**

ఇటుపైని యావాలగుణమును జెప్పుచున్నారము. నల్లావాలు వెగటు, చేదు, వేడియును గలిగియుండును. వాతమును, బల్లలను, శూలను బోగొట్టును. దాహపైత్యమును బుట్టించును. కఫపైత్యమును కృములను వ్రణముల నణచును. వర్ణావాలు వాతశూలలను, గుల్మలను, కండువును, కుష్ఠవ్రణములను బోగొట్టును. తెల్లావాలు వెగటు, చేదును, వేడియును గలిగి వాతరక్తములను, గ్రహములను, త్వగ్దోషములను, విషమ్మును, భూతగ్రహములను గొట్టును. రుచింపజేసును. సిద్ధమగుప్రయోజనముగలదిగానసిద్ధార్థమని తెల్లావాలకు పేరు.

**తృణధాన్యగుణాః.**

అథ తృణధాన్యం॥ వాగ్భట్టః॥ కంగుకోద్రవనీవార శ్యామాకాది హిమంలఘు। తృణధాన్యం పవనకృల్లేఖనం కఫపిత్తహృత్॥ స్త్రీయాంకంగుప్రియంగూద్వే కృష్ణారక్తా సితాతథా। పీతా చతుర్విధా కంగు స్తాసాంపీతా వరా స్మృతా॥ కేన జలేన గచ్ఛత్యూర్ధ్వచ్ఛతీతి కంగుః॥ ప్రియాణ్యంగాన్యస్యసంతీతి ప్రియంగుః॥ కంగుస్తుభానసంధాన వాతకృద్బృంహణీగురుః। రూక్షాశ్లేష్మహరాతీవ వాజినాం గుణకృద్భృశం॥ చీనాకః కంగుభేదోస్తి సజ్ఞేయః కంగువద్గుణైః॥

శ్యామాకో మధురస్స్నిగ్ధః కషాయో మధుశీతలః। వాతకృత్కఫపిత్తఘ్న స్సంగ్రాహీ విషదోషనుత్॥

కోద్రవో మధురస్తిక్తః వ్రణినాం పథ్యకారకః । కఫపిత్తహరో రూక్షః మోహకృచ్ఛీతలోగురుః॥ కోరదూషస్తు కోద్రవ ఇత్యమరకోశాభిధానాత్కోరం రుధిరం దూషయతీతి కోరదూషః। దువవైతుమ్యే॥ వ్రణినాం రక్తాధిక్యే పూయశోణితాదికంభవతీతి తన్నివారణపటుఃకోద్రవః। తస్మాద్వ్రణినాం తద్భక్షణావశ్యకతాదర్శనాయ వ్రణినాం పథ్యకారకఇత్యుక్తం॥

వరకోమధురోరూక్షఃకషాయోవాతపిత్తకృత్।భగ్నసంధానకృత్కాందూబృంహణో గురుదీపనం॥ తుంగపిప్రియంగుర్మధురోబృంహణో వాతపిత్తకృత్॥ ప్రీణాతీతి రోగహరణేన ప్రియంగుః ప్రీఞ్తర్పణే॥

## తృణధాన్యగుణములు.

ఇటుపైని తృణధాన్యగుణములను జెప్పుచున్నారము. కొఱ్ఱలు నివ్వరధాన్యము అళ్లు సామలును చలవగలవియును లఘువైనవి. తృణధాన్యము వాతమును జేయును. లేహనము- కఫపైత్యములనణచును.

కొఱ్ఱలు నలుపు, తెలుపు, పచ్చన, ఎఱ్ఱన నాలుగువిధము లిందులో పచ్చనివి శ్రేష్ఠములు. తేజమును, సంధానమును, వాతమును, వృద్ధిని, గురుత్వమును, వేడిని జేయును. కఫమును గొట్టును. గుర్రములకు విశేషముగ గుణమును జేసును. కొర్రలలో చీనాకమనే జాతి గలదు అది కొర్రలవలె గుణమునర్చును.

సామ మాధుర్యము చమురు కషాయము చలవయునుగలిగి వాతమును జేయును. కఫపైత్యవిషదోషముల నణచును. మలబద్ధమును జేసును.

అళ్లు మాధుర్యమును చేమనుగలికి వ్రణరోగికి పథ్యమై కఫపైత్యముల నణచి కట్టిగలిగి మోహమును గురుత్వమును చలవను జేయును. వీటికి కోద్రవములనియు కోరదూషకములనియు పేరు. కోరమనగా రక్తము దానిని హరించునది కోరదూషకము గావుననే వ్రణరోగికి రక్తవృద్ధిలేకుండిన చీముపట్టకుండును. కావున వానికివి పథ్యమని జెప్పుదురు.

వరగలు మాధుర్యము- కాఠిన్యము- కషాయము- వాతకారిత్వమును గలిగియుండును. పెద్దకొఱ్ఱలు విరిగినవానినతుకుట- వృద్ధి- గురుత్వము- దీపనము- దురద- మాధుర్యము- వాతపైత్యకారిత్వమును గలిగియుండును.

## వాపితాదిధాన్యవిశేషగుణాః.

ధాన్యం వాపితముత్తమం తదఖిలం భిన్నోద్భవం మధ్యమం జ్ఞేయంయద్యదవాపితం తదధమం నిస్సారదోషప్రదం। దగ్ధాయాంభువిచోప్యతేపి విపినేయేవాపితాస్థాలయో యేచఛిన్నభవాభవంతి ఖలుతో విణ్మూత్రబంధప్రదాః॥ క్షారోదకసముత్పన్నధాన్యం సర్వరుజాపహం। స్వాదుశుభ్రోదకేజాతం ధాన్యం సర్వరుజాపహం॥ సుస్నిగ్ధమృత్తికోద్భూతం ధాన్యమోజోబలప్రదం। బలపుష్టిప్రభావఘ్నం వాలుకామృత్తికోద్భవం॥ నవధాన్యమభిష్యంది లఘుసంవత్సరోచితం। హ్యబ్దోషితం లఘుతరం త్రివర్షమబలంభవేత్॥

చణకాయవగోధూమాస్తిలా మాషా నవాహితాః। పురాణావిరసారూక్షా అహితాదుర్జరాబలాః॥ వాగ్భటః॥ నవంధాన్యమభిష్యంది సేవ్యం కే

దారజంచయత్॥ అభిష్యందీత్యన్వయః॥ లఘువర్గోషితం దగ్ధభూమిజం స్థలసంభవం। శీఘ్రజన్మతథాసూప్యసిస్తుషం యుక్త్యా భర్జితమితి॥

### వెద ఊడుపు మొదలగు ధాన్యవిశేషములయొక్క గుణములు.

వెదధాన్యములన్నియు నుత్తమములు. ఊడుపుధాన్యములన్నియు మధ్యమములు. విత్తనములు చల్లక పండిన ధాన్యములు నిస్సారములు గావున నవి యధమములు. అడవికాల్చినభూమియందును, కొర్నుభూమియందును, కోసివేసినతరువాత తిరిగిచిగిర్చిపండిన ధాన్యము మలమూత్రబంధదోషమును జేయును. ఉప్పునీటివలనఁబుట్టినధాన్యము సర్వరోగకరము. తియ్యనీటివలనఁబుట్టినధాన్యము సర్వరోగహరము. చిక్కనిభూమియందుత్పన్నధాన్యము తేజోబలప్రదము. ఇసుకభూమినిబుట్టినధాన్యము బలపుష్టిప్రభావములను బోగొట్టును. సంవత్సరములో బుట్టినధాన్యము లఘువై చిమిడిపోవును. వత్సరమునిలవగనుండినధాన్యము లఘుతరమై పథ్యమగును. మూడుసంవత్సరములుండిన ధాన్యములు బలహీనములగును.

సెనగలు యవలు గోధూమములు తిలలు మినుములు కొత్తవి పథ్యకరములు. పాతవి రసహీనములు. గట్టిపడియుండినజీర్ణము బలహీనమునొనర్చును. కావున హితములుకావు. వాగ్భట్టుడు కొత్తధాన్యము మడిలోబండినప సేవించిన చిమిడిపోవుటచేత నపథ్యమనెను. సంవత్సరముపాతగిలినధాన్యమును, గాలినభూమియందునబండినవియును, మెట్టునపండినవియును, వేగముబండినవియును, విత్తనముచల్లకపుట్టినవియును, మిక్కిలి యుమకలేనివియును, వేచబడునవియును లఘువులై యుండును.

### భృష్టధాన్యగుణాః.

యేకేచిద్వ్రీహయోభృష్టాస్తేలాజాఇతిసంజ్ఞితాః॥ ఉపలక్షణమేతత్॥ యేషాంస్యుస్తండులాస్తాని ధాన్యానిసతుషానిచ। భృష్టానిస్ఫుటితాన్యాహుర్లాజాఇతిమనీషిణఇత్యభిధానాత్॥ లాజాస్స్యుశ్ఛర్ద్యతీసారమేహమేదఃకఫచ్ఛిదః। కాసపిత్తోపశమనా దీపనా లఘవోహితాః॥ లాజాశ్చ యవధాన్యాశ్చ తర్పణీ పిత్తనాశనీ। గోధూమయావనాలోస్యాత్కించిదూష్ణాశ్చ దీపనాః॥ జవాస్తు నిస్తుషాభృష్టాస్స్ఫుటితాధానాఇతిస్త్రియాం। ధానాస్తు దుర్జరారూక్షాస్తృట్ప్రదా గురవశ్చ తాః। తథామేదకఫచ్ఛర్దినాశిన్యస్సంప్రకీర్తితాః। ధానాని భ్రాష్ట్రభృష్టాని యంత్రపిష్టాని సక్తవః॥ తత్ర॥ యవజాస్సక్తవశ్శీతా దీపనాల

ఘవస్సరాః। కఫపిత్తహరారూక్షా లేఖనాశ్చప్రకీర్తితాః। తేపిత్తా బలదావృష్యా బృంహణా భేదనాస్తథా। సర్పిణా మధురా రుచ్యాః పరిణామే బలావహాః। కఫపిత్తశ్రమక్షుత్తృడ్వ్రణనేత్రామయాపహాః। ప్రశస్తా ఘర్మదాహార్త్యధ్వవ్యాయామార్తశరీరిణాం॥

నిస్తుషైశ్చణకైర్భృష్టైస్తుర్యాంశైశ్చ యవైఃకృతాః। సక్తవశ్శర్కరాసర్పియుక్తాగ్రీష్మేతి పూజితాః॥ సక్తవశ్శాలిసంభూతా వహ్నిదా లఘవోహిమాః। మధురాగ్రాహిణో రుచ్యాః పథ్యాశ్చబలశుక్రదాః॥ అన్యాస్తత్తద్ద్రవ్యగుణాన్ఘనూనిశ్చించిద్విశేషతః। యావనాళాదిసంభూతాస్స్యజానీయాద్విచక్షణః॥ శాలయస్సతుషా ఆర్ద్రా భృష్టా అస్ఫుటితాశ్చ తాః। కుట్టితాశ్చిపిటాస్సమ్యక్తేస్మృతాః పృథుకాఇతి। పృథుకాగురవోవాతనాశనా శ్లేష్మలా అపి। సక్షీరా బృంహణా వృష్యాబల్యాభిన్నసరాహితే। అర్ధపక్వైర్యవైశ్చమీధాన్యైస్తృణభృష్టైశ్చ హోలాకః। హోలకోల్పానిలో మేదః కఫదోషత్రయాపహః। ముంజ త్వర్ధపక్వాయాయవగోధూమయోర్భవేత్। తృణాని లేనసంభృష్టా బుధైః ఉంబలి సాస్మృతా॥

వేపుడు ధాన్యగుణములు.

వ్రీహులు వేచబడిన పేలాలగును. అవి వాంతికి నతిసారమునకు మేహమునకు కొవ్వునకు కఫమునకు దగ్గుకుపైత్యమునకును శాంతికరములు. ఆకలిని లఘుత్వమును గలుగజేయును. యవలాజలు తృప్తికరములు- పైత్యహరములు. వేచిన గోధుమములు జొన్నపేలాలు నించుకంత వేడిజేసి యాకలిని బుట్టించును. వేపుడుధాన్యము అజీర్తికరములు- కఠినములు- దాహమును బుట్టించి గురుత్వమును జేయును. కొవ్వు కఫము వమనమును శాంతింపజేసును. బియ్యము మంగలమునవేచి తిరగటిని విసరిన సక్తుపిండియగు నందు యవలచేనగు పిండి శీతలము. దీపనము- లఘువు. రేచకము- కఫపైత్యహరము- వేడిజేసి యుదక విరేచనములకును. ఆసక్తుపిండి పైత్యకరము- బలప్రదము- వీర్యవృద్ధికరము నురవగు రేచకము- తృప్తికరము- మధురము- రుచికరము- జీర్ణమైనపైని బలావహము. కఫపైత్యమును, శ్రమను, క్షుత్పిపాసలను, వ్రణములను, నేత్రరోగములను హరించును. వేసవిచేనగు దాహమును మార్గాయాసమునొదలగు నార్తిగలవారికి హితము.

పొట్టులేకుండు శనగలు మూడువంతులు- యవలు నాలవపాలును వేచి విసరినపిండిలో నేయి, పంచదారయును గలపి మెసవిన వేసవిని విశేషహితవును జేసును. తెల్లనిబియ్యమునువేచి విసరినపిండి జఠరవృద్ధికరము. రుచికర

ము- లఘువు- శీతలము- మధురము- మలబద్ధకారి- పథ్యము. బలమును, శుక్లమును జేయును. మిగిలినజొన్నలు మొదలగు ధాన్యముల సక్తుపిండి వాటివాటి గుణములను జేయును గానియించుకంత లఘుత్వముగలిగియుండును. శాలిధాన్యము వానబెట్టి వేచి దంపిన యవి యటుకులనబడును అవి గురుత్వమును శ్లేష్మమును జేయును. వాతమునుహరించును. వీటిని పాలతో బుచ్చికొనిన నురువుగలిగి వీర్యవృద్ధిని, మలబద్ధమును జేయును. సగముపండిన శింబిధాన్యము గడ్డికాల్చిన మంటలో వేచినవి హొలకమనబడు నిది మేహవాతము గొవ్వును, కఫమును, శ్రమను హరించును. సగముపండిన యవలయొక్క గోధూమముల యొక్క వెన్నులు తృణాగ్నిచే వేచిన యవి రుంబీలనబడును.

## సిద్ధాన్న ప్రకరణం.

భక్తం లఘు పురాణస్య శాలేస్తచ్చిపిటో గురుః। క్వచిద్యోగప్రభావేన గుణాంతరమపీష్యతే॥ సుధౌతాంస్తండులాన్స్ఫీతాన్తోయంపంచగుణోపచేత్। తప్పకం ప్రస్రుతంచోష్ణం విదాహం గుణవత్తరం। భక్తం వహ్నికరం పథ్యం తర్పణం రోచనం లఘు॥ అధౌతమస్రుతం శీతం గుర్వరుచ్యం కఫప్రదం॥ ఉష్ణోదనశ్శ్రమదాహయ రక్తపిత్తమేహప్రదః పవనకృల్లఘుదీపనశ్చ॥ జలే చతుర్దశగుణే తండులానాం చతుఃపలం। విపచేత్స్రావయేన్మండం సభక్తోమధురో లఘుః। రసోదనోజ్వరహరో బల్యోవాతనిబర్హణః॥ స్థూలభక్తం హిమం స్వాదు హృద్యం పాచనదీపనం। ఆమశూలగ్రహణ్యర్శో హరం పుష్టిరుచిప్రదం॥ తండులాదావిసంయుక్తా లవణార్ద్రకహింగుభిః। యుక్తాశ్చ సలిలే సిద్ధా కృసరా కథితాబుధైః॥ కృసరాశుక్లాబల్యా గురుపిత్తకఫప్రదా। దుర్జరా బహువిష్టంభమలమూత్రకరీస్మృతా। మిశ్రైశ్శూకశ్శింబిధాన్యైరోదనో మిశ్రకోమతః॥ ఘృతే హరిద్రాసంయుక్తం మాషాణాం భర్జయేద్వటీః। తండులాశ్చాపి సిద్ధాంతాన్నైవపరివర్తయేత్। సిద్ధియోగం జలంతత్ర నిక్షిప్యకుశలః పచేత్। లవణార్ద్రకహింగుమాత్రయాతత్ర వినిక్షిపేత్। ఏషా సిద్ధిం సమాయాతా ప్రోక్తా తాపహరా బుధైః। భవేత్తాపహరీబల్యా వృష్యా శ్లేష్మాణమాచరేత్। బృంహణీ తర్పణీ రుచ్యా గుర్వీ తత్త్వగుణాస్మృతా॥ క్రియాసారే॥ నివేద్యకరణే ప్రోక్తా శ్రేష్ఠా ఆఢకతండులాః। తాంశ్చ నిర్ణిజ్య నిష్పీడ్య ప్రోక్షాంభః క్షాళయేద్బుధః। సార్ధాఢకప్రమాణంతు తండులానాం జలంస్మృతం। శుద్ధైస్సూక్ష్మైస్తారుభిశ్చ సుదీప్తైః పరిపాచితం। కేవలాన్నమితిప్రోక్తమిదమన్నం మునీశ్వరైః॥

పరమాన్నం హరిద్రాన్నం దధ్యన్నం కృసరోదనం। గుడోదనంచ ముద్గాన్నమిత్యన్నం షడ్విధం స్మృతం॥ తండులం త్రిగుణం దుగ్ధం దుగ్ధార్ధం జీవనీయకం। తదర్ధం గుడచూర్ణంతు పరమాన్నమితిస్మృతం॥ సంపక్వంతం మధితం గవ్యం తండులానాం చతుర్గుణం। ఈషద్ధరిద్రయాయుక్తం మరీచీజాతిసంయుతం। ఏతదుక్తం హరిద్రాన్నం సుపక్వం పాచితం తథా॥ మధురామ్లేనగోదధ్నా శుద్ధాన్నంతువిమిశ్రితం। తండులాద్విగుణేనైవ మరీచిక్షోదసంయుతం। లవణార్ద్రకసంయుక్తమేతద్దధ్యోదనం స్మృతం॥ తండులార్ధం ముద్గమిశ్రంవారిణా సహసంపచేత్। యుక్తం మరీచిచూర్ణేన తిలచూర్ణం వినిక్షిపేత్। ఇదం కృసరనామాన్న మిత్యాఖ్యాతం మునీశ్వరైః॥ పూర్వోక్తపాయసైర్వ్యంజాద్దుగ్ధార్ధం గుడఖండకం। తదర్ధమాజ్యం మోచాయాః ఫలమేతద్గుడోదనం॥ పూర్వోక్తపాయసవత్ తండులం త్రిగుణం దుగ్ధదుగ్ధార్ధజలయోగే దుగ్ధార్ధగుడం యోజయిత్వా పచేత్। ఇతరథా గుడోదనమితి సంజ్ఞానుపపత్తేః॥ తండులస్య త్రిభాగైకముద్గఖండేన మిశ్రితం। పక్వం యదేతన్ముద్గాన్న మాఖ్యాతంచ చతుర్ముఖ। వినాశుద్ధాన్నమన్యేషాం ప్రదద్యాద్భ్రాంతిణంబుధః। గుణానేషాం యథాయోగం విజానీయాద్విచక్షణః॥ భూతౌదనో దధినిశా సక్తులాజతిలాన్వితః। భూతాపహరణేయోగ్య మేనంప్రాహవిచక్షణః॥

అథక్షీరీ॥ శుద్ధేర్ధపక్వే దుగ్ధేతు ఘృతాక్తాంస్తండులాన్ క్షిపేత్। తేసిద్ధాక్షీరికాఖ్యాతా సాసితాజ్యయుతోత్తమా॥ క్షీరికాదుర్జరా బల్యా ధాతుపుష్టిప్రదాగురుః। విష్టంభినీ హరే చ్ఛీతా రక్తపిత్తాగ్నిమారుతాన్॥ నారికేళం తనూన్కృత్వా ఛిన్నం పయసి గాఃక్షిపేత్। సితాగవాజ్యసంయుక్తా తత్పచేన్మృదువహ్నినా। నారికేళోద్భవా క్షీరీ స్నిగ్ధా శీతాతిపుష్టిదా। గుర్వీసుమధురా వృష్యా రక్తపిత్తానిలాపహా॥

చమసీభర్జికాకృత్వా సుసూక్ష్మాస్తంతుసన్నిభాః। శుష్కాః క్షీరేణసంసాధ్యా భోజ్యా ఘృతసమన్వితాః। సేవికా తర్పణీబల్యా గుర్వీ పిత్తానిలాపహా। గ్రహణీ సంధికృద్రుచ్యా తాంఖాదేన్నాతిమాత్రయా॥ చమసీ పిష్టవర్తికేతి వామనః॥

## సిద్ధాన్నప్రకరణము.

పాతబియ్యపుఅన్నము లఘువు. అటుకులు గురుత్వమును జేసును. ఇవి వస్త్వంతర మేళనముచే గుణభేదమును గలిగించును. తెల్లనిబియ్యము కడిగివేసి మైనుపాల్లు నీళ్లుబోసి యుడికించి వార్చిన గంజి విదాహమణచి విశేషగు

ణమును జేసును. అన్నము జఠరవర్ధనము- పథ్యము- తృప్తిని రుచిని గలిగించు ను. కడగనిబియ్యముడికించి వార్చని యత్తెసరు చలవను, గురుత్వమును, రుచి ని, కఫమును జేయును. వేడియన్నము శ్రమను, మదహానిని, రక్తపైత్య మేహ ములను, వాతమును జేయును. లఘువు- దీపనము. నాలుగుభాగముల బియ్య ము, పదునాలుగువంతుల నీళ్లను వేసి వండి వార్చిన యన్నము మధురము- ల ఘువు. జావ జ్వరహరము- బలకరము- వాతనాశకము. పఘూళీయన్నము చ లువను, రుచిని, జీర్ణమును, దీపనమును, తృప్తిని జేసి యామశూలగ్రహణీమూ లశంకలను హరించును. బియ్యమును పప్పును గలిపి తగుమాత్ర ముప్పు నల్ల ము నింగువయును గూర్చి యుదకమందుడికించినది పులగమనబడును. ఇదిబలక రము- గురుత్వకరము- పైత్యకఫప్రదము- శీఘ్రముగ జీర్ణముగాక కడుపులో బరువుగనుండి విశేషమలమూత్రములను జేయును. వరిబియ్యము పెసర మొదల గు పప్పులును గలిపిజేసినయన్నము మిశ్రకయనబడును. పసపు మినపపప్పు లోవేసి రుబ్బి వటుకములు జేసి కడిగినబియ్యముతో కలిపి నేయినివేచి యవి పచనమగుటకు తగిననీళ్లనుబోసి యుప్పు అల్లము యింగువయును వేసి వండిన యది తాపహరమనబడును. బలమును, వృద్ధిని, శ్లేష్మమును, వీర్యవృద్ధిని, తృ ప్తిని, రుచిని, గురుత్వమును జేయును. శ్రేష్ఠములగు బియ్యము కుంచెడు ప దునారుమార్లు గడిగి వడచి ఆరుమానికెలనీళ్లను యసరుబెట్టి పరిశుద్ధమగు తృణముచే కట్టెలచే నగ్నిని ప్రజ్వరిల్ల జేసి వండిన యది కేవలాన్నమనబడును, ఇది దేవతానివేదనమునకు శ్రేష్ఠమని చెప్పబడెను.

పరమాన్నము, హరిద్రాన్నము, దధ్యన్నము, కృసరాన్నము, గుడా న్నము, ముద్గాన్నమనియును అన్నము ఆరువిధములు. ఇందులో బియ్యమునకు మూడురెట్లు పాలువేసి పాలలోసగము నీళ్లువేసి యందులో సగము బెల్లము వేసి చేసినది పరమాన్నము. సంస్కరించబడిన యావుమజ్జిగ బియ్యమునకు నాలుగురెట్లు యించుక పసపుతో కలిపి మిర్యములు జాపత్రిపొడుముగలిపి వం డిన హరిద్రాన్నమనబడును. మధురమగు నావుపెరుగించుక పులియబెట్టి పరి శుద్ధమగు నన్నముతో బియ్యమునకు రెండురెట్లుకలిపి యల్లమును మిరియముల గుండయు నుప్పునుగూర్చిన దధ్యన్నమనబడును. బియ్యము రెండువంతులు పె సరపప్పువకవంతును గలిపి యుదకముతో పచనముజేసి యందు మిర్యములపొ డి నువ్వులపొడియును గలపిన కృసరాన్నమనబడును. మొదటజెప్పిన పరమా న్నముతో పాలకుసగము బెల్లము దీనికిసగము నేయి యనటిపళ్లనుగలిపిన నద్ది

గుడోదనమనబడును. మొదటిదగుపరమాన్నము బియ్యమునకు మూడురెట్లు పాలును పాలకుసగము నీళ్లును నీళ్లకుసగము బెల్లమును గాక పాలకుసగమధికము వేసి పచనముజేసిన గుడాన్నమనబడును. ఇటులగాకున్న గుడాన్నసంజ్ఞ గాకపోవునని దెలియదగును. బియ్యమునకు మూడురెట్లు పెసరపప్పు వేసి చేసినది ముద్గాన్నము. విద్వాంసుడు శుద్ధాన్నముకంటె నితరాన్నములను దేవపిత్రతిథి నివేదనజేయకొకడును భుజింపరాదు. వీటిగుణములాయాయివస్తుమేళనమునుబట్టి గుణములనుదెలియదగును. పెరుగు, పసపు, సక్తుపిండి, పేలాలు, నువ్వులును గలిపినయన్నము భూతాపహరణయోగ్యమై భూతాన్నమనబడును.

పాలుసగము మరగనిచ్చి యందుననేయితోవేచిన బియ్యముబోసి పంచదార నేయి గలిపి పచనముజేసినది క్షీరికయనబడును. ఇది యజీర్తిని, బలమును, ధాతుపుష్టిని, గురుత్వమును, మలబద్ధమునుజేసి వాతమును, రక్తపైత్యమును, జఠరాగ్నిని హరించును. కొబ్బరికాయ సన్నముగకోరి యావుపాలలోవేసి పంచదార ఆవునేయియును గలిపి చిన్నమంటను వండినది నారికేళక్షీరియనబడును. ఇదివిశేషచలవను బుష్టిని గురుత్వమును వీర్యవృద్ధినిజేసి మధురమై రక్తపైత్యవాతములను హరించును.

పిండి నీళ్లనుగలిపి దారములవలె సన్నముగజేసి యండించి పాలలోవేసి నేయినిగలపి వండినది సేవికయనబడును. ఇది తృప్తిని, బలమును, గురుత్వమునుజేసి పైత్యమును హరించును. రుచికరము- సంధానకారియైనను గ్రహణిని బుట్టించును గాన యధికమును భుజించరాదు. దీనికి చమసీపిష్టవర్తికయనిగూడ నామాంతరము కలదు.

అథ సూపపచనప్రక్రియాం వ్యాఖ్యాస్యామః॥ దాలీతుసలిలేసిద్ధాలవణార్ద్రకహింగుభిః। సంయుక్తాసూపనామ్నిస్యాత్కథ్యంతే తద్గుణాస్సథ॥ సూపోవిష్టంభకోరూక్షశ్శీతస్తు సవిశేషతః। నిస్తుషో భృష్టసిద్ధస్తు లాఘుపంసుతరాంవ్రజేత్॥ వాగ్భట్టః॥ విశేషాదాఢకీసూపస్స్యాదుర్విష్టంభకృద్గురుః॥ప్రక్షిప్తేద్ఘృతంతస్మిన్సాచితం భక్షయేన్నరః॥ బల్యంస్యాదాఢకీసూప మితిచ॥ సారంభోజనసారం సారం సారంగలోచనాధరతః। పిబఖలువారంవారం నోచేన్మృథాభవతిసంసారః॥ పిత్తజ్వరార్తిశమనం లఘుముద్గయూషం సంతాపహారి తదరోచకనాశనంచ। రక్తప్రసాదనమిదం యదిసైంధవేన యుక్తంసదా పిబతు సర్వరుజాపహారి॥ వనముద్గోద్గయూషస్తు శిరోభ్రమణపిత్తకృత్। కుళు

ద్ధయూషశ్శ్లేష్మఘ్నం చామాదం శూలనాశనం॥ యూషః కృష్ణకుళుద్థోద్ధం లఘుః పాషాణభేదకృత్। రోచనం కఫవాతఘ్నం పిత్తకృత్క్రిమిశూలహా॥ నిష్పావయూషో విషహృత్తస్య స్యాత్పిత్తకృద్గురుః॥ చణస్య యూషం మధురం కషాయం కఫాపహం వాతవికారహంతృ। శ్వాసోర్ధ్వకాసామయపీనసానాం కరోతినాశం బలదీపనంచ॥ అసితచణకయూషం దాహనాశం విధత్తే ప్రబలమహితలోద్ధం సర్వమేహప్రణాశం। దహనమరిచియోగా ద్వాతరోగాపహారీ విదళమతివిపక్వం సర్వదోషాపహారీ॥

ఇటుపయిని సూపపచనప్రక్రియను జెప్పుచున్నారము. పప్పు నీళ్లతో నుడికించి యందుప్పు నింగువ నల్లమును గలపిన నది సూపమనబడును. దీనిగుణము మలబద్ధము, కడుపులోగట్టి చలువయును జేసును. పొట్టుదీసినదియు వేచినదియు మిక్కిలి లాఘవమునుజేయును. కందిపప్పు రుచి- మలబద్ధమును గురుత్వమును జేయును. ఈపప్పుయందు నావునేయి గలపి పచనముజేసి యది పుచ్చికొనవలెను. ఇది నీరువలె పలచగాజేసిన కట్టనబడును. ఇది భోజనసారము- సారంగలోచనల యధరముకంటె సారమై రుచిగలిగించును. కావున ప్రతిదినమందును బుచ్చికొనుము- లేకుండిన నీసంసారము నిస్సారము. పెసరకట్టు లఘుతరమై పైత్యజ్వరము నార్తిని సంతాపము నరుచినిశమింపజేయును. రక్తమును బాగొనర్చును. దీని సైంధవలవణముతోగూర్చి బుచ్చికొనిన సకలరోగములను హరించును. అడవిపెసలకట్టు శిరోభ్రమణమును పైత్యమును జేయును. ఉలవకట్టు శ్లేష్మమును, ఆమమును, శూలలను కొట్టును. నల్లఉలవకట్టు లఘువు- పాషాణభేది- రుచికరము- కఫవాతనాశకము- పైత్యకారి- క్రిమిశూలహారి. అనపకట్టు విషమునుహరించును. పైత్యగురుత్వకారి. సెనగకట్టు మధురము- కషాయము- కఫవాతవికారహరము- శ్వాస, కాస, పీనసనాశనము- బలదీపనకరము. నల్లసెనగకట్టు దాహహరము- సకలమేహములనణచును. చిత్రమూలము మిరియమును గలపిన సకలరోగములను హరించును. వీటిగుగ్గిళ్లు సకలదోషనివారకము.

గోధూమాధవళాఢ్యాతా కుట్టితాశ్శోషితాస్తతః। పోక్షితాయంత్రనిష్పిష్టా శ్చాలితాస్సమితాస్మృతాః॥ వారిణా కోమలంకృత్వా సమితాం సాధుమర్దయేత్। హస్తలాలనపాతస్య ల్లోప్త్రి సమ్యక్ప్రసారయేత్ ॥ లోప్త్రి ఉండాఇతిభాషయా॥ అధోముఖఘటస్యైతాం విస్తృతాం ప్రక్షిపేద్బహిః। మృదునా వహ్నినా సాధ్యా సిద్ధోమండకఉచ్యతే। దుగ్ధేన సాజ్యఖండే

న మండకం భక్షయేన్నరః। అథవా సిద్ధమాంసేన సతక్రవటకేనవా। మండ
కో బృంహణో వృష్యో బల్యో రుచికరో భృశం। పాకేపి మధురో గ్రాహీ
లఘుర్దోషత్రయాపహః॥

సమితాం సర్పిషాభృష్టాం శర్కరా పయసి క్షిపేత్। తస్మిన్ఘనీకృతే
న్యస్యేల్లవంగమరిచాదికం। సిద్ధైషా లప్సికాఖ్యాతా గుణానస్యా వదామ్య
హం। లప్సికా బృంహణీవృష్యా బల్యాపిత్తానిలాపహా। సిద్ధా శ్లేష్మకరీ గుర్వీ
రోచనీ తర్పణీపరా॥

శుష్కగోధూమచూర్ణేన కించిత్పుష్టాంచ పోలికాం। తత్పచేత్స్వేదయే
త్కృత్వా భూయోంగారేపి పాచయేత్। సిద్ధైషాపోలికాప్రోక్తా గుణా
నస్యాఃప్రచక్ష్మహే। రోటికాబలకృద్రుచ్యా బృంహణీధాతువర్ధనీ। వాతఘ్నీ
కఫకృద్గుర్వీ దీప్తాగ్నీనాం ప్రశస్యతే॥

శుద్ధగోధూమచూర్ణంతు సాంబు గాఢం విమర్దయేత్। విధాయ వటు
కాకారం నిర్ధూమాగ్నౌ శనైఃపచేత్। అంగారకర్కటీహ్యేషా బృంహణీ
శుక్రలాలఘుః। దీపనీకఫకృద్బల్యా పీనసశ్వాసకాసజిత్। అంగారపోలికా శ
స్తా విధూమాంగారపాచితాః। లఘ్వ్యో బలకరా వృష్యా దోషఘ్నా వహ్ని
దీపనాః। తావద్గర్జతివగ్గోత్ర భక్ష్యాణాం శ్లాఘ్యతేధికం। ఉష్ణోష్మసర్పిషాభు
క్తా యావన్నాంగారపోలికా॥

యవజా రోటికారుచ్యా మధురావిషదాలఘుః। మలశుక్రానిలకరీ బ
ల్యా హంతి కఫామయాన్। పీనసశ్వాసకాసాంశ్చ గుదో మేహగలామయాన్॥

చూర్ణం యచ్ఛుష్కమాషాణాం చమసీసాభిధీయతే।చమసీరచితారో
టీ కథ్యంతెబలభద్రికా।రూక్షోష్మావాతలాబల్యాదీప్తాగ్నీనాం ప్రయోజితా॥

మాషాణాం దాలయస్తోయస్థాపితాస్త్యక్తకంచుకాః। ఆతపే శోషి
తా యంత్రపిష్టాస్తాధూమసీస్మృతాః। ధూమసీంచితాసైవ ప్రోక్తా ఝర్ఝరి
కాబుధైః। ఝర్ఝరీ కఫపిత్తఘ్నీ కించిద్వాతకరీ స్మృతా॥

చాణక్యా రోటికా రూక్షా శ్లేష్మాపిత్తాస్రసద్గురుః। విష్టభిన్నాచ చ
క్షుష్యా తద్గుణా తిలశష్కులీ॥

దాలీ సంస్థాపితా తోయే తతోపహృతకంచుకా। శిలాయాం సాధు
సంపిష్టా పిష్టికాకథితాబుధైః। మాషపిష్టికయాపూర్ణగర్భా గోధూమచూర్ణ
తః। రచితా రోటికాసైవ ప్రోక్తా వేఢణికాబుధైః॥ గోధూమచూర్ణఘనవేష్టి

తమూషముద్గపిష్టం సుపక్వ మతివేఢణికం వదంతి। తంభక్షయే దతిబలం లభతే మనుష్య స్తైలేనవాధ సుఘృతేన సుగంధినావా॥ భవేద్వేఢణికాబల్యా వృష్యా రుచ్యానిలాపహా। ఉష్మా సంతర్పణీ గుర్వీ బృంహణీ శుక్రలాపరం। భిన్నమూత్రమలాస్తృప్త మేదఃపిత్తకఫప్రదా।గుదకీలార్దితశ్వాసంపక్తిశూలానినాశయేత్। ఘృతేన వాలితా సైవ వటోరీతి ప్రకథ్యతే । వటోరీ తద్గుణా కించి ల్లఘ్వీచ రుచికృత్పరా॥

తెల్లని గోధూమములు కడగి దంచి యండించి తిరిగీకడగి యండించి విసరి కోడిన యది సమితమనబడును. ఆసమితను నేయివేసి నీరుబోసి మర్దించి చేతులతో వుండజేసి యగిరించిన లోప్తియనబడు ననగా వుండ యది కుండబోర్లించి దానిపైనుండజేసి మృద్వగ్నిచేతను పాకమొనర్చిన పచనమై మండకమనబడును. దానిని నేయి పాలతో గలిపి భక్షించవలెను. లేక వండిన మాంసముతోనైన మజ్జిగతోనైన బుచ్చికొనదగును. మండకము పుష్టివీర్యవృద్ధికరము- బలకారి- విశేషరుచికరము- పాకమైనను మధురము- మలబద్ధకారి- లఘువు- దోషత్రయనివారకము.

సమితను నేయితోవేచి పంచదారగలపిన పాలలోవేసి యది గట్టిపడినపిమ్మట నందులో లవంగములు మిర్యమును వేసి పచనమొనర్చిన లప్తికయనబడును. ఇది వృద్ధిని వీర్యమును బలమును జేసును. పైత్యవాతహరము. శ్లేష్మమును, గురుత్వమును, రుచిని, తృప్తిని గలిగించును.

ఎండిన గోధూమపిండి తడిపి పలచగా రొట్టెజేసి పెనముమీద కొంచము వెచ్చజేసి నిప్పులమీద పచనముజేయవలెను. ఇది పోళికారోటికయనబడును. బలమును, రుచిని, వృద్ధిని, ధాతుపుష్టిని, కఫమును, గురుత్వమునుజేసి వాతమును హరించును. ఇవివిశేషజఠరముగలవారికి ప్రశస్తము.

పరిశుద్ధమగు గోధూమపిండి నీళ్లతోగలపి గట్టిగమర్దించి వడియముల వలె జేసి పొగలేని నిప్పులపై నునచి పచనముజేసిన యంగారకర్కటి యనబడునిది వృద్ధిని, శుక్లమును, లఘుత్వమును, దీపనమును, కఫమును, బలమును జేసి పీనస శ్వాస కాసరోగములను జయించును. పొగలేని నిప్పులపైని గాల్చినరొట్టె ప్రశస్తము- లఘుత్వమును, బలమును, వీర్యమును, జఠరమును జేసి దోషములను హరించును. ఈయంగారపోలిక వేడినేయిలో ముంచి యెంతపర్యంతము భక్షించడంతపర్యంతమే సకలభక్ష్యముల శ్లాఘనమొనర్చును.

యవపిండిరొట్టె రుచ్యము- మధురము- గళరోగ మేహ కఫ పీనస శ్వాస కాస మద విషహరము. లఘువు- మల శుక్ల వాత బలకరము.

మినుములు యండించి విసరిన పిండి చనుసియనబడును. దీనిచే జేసినరొట్టె బలభద్రికయనబడు నిది గట్టిని, వేడిని, వాతమును, బలమును, దీపనమును జేయును.

మినపపప్పు నీటిలోవేసి మాటిమాటికి నూటిగ పొట్టుబోగడగి యండించి తిరగటని విసరిన యది ఘామసియందురు. దీనిచే నొనర్చిన రొట్టిక ఝర్ఝరికందురు. ఇది పైత్యహారి- కించిద్వాతకారి.

సెనగరొట్టియ గట్టి శ్లేష్మమును రక్తపైత్యమును బోగొట్టి గురుత్వమును, మలబద్ధమును, నేత్రహితమును జేయును. నువ్వులువేసి జేసిన చక్కిలము నీగుణమునే జేసును.

మినపపప్పు నానబెట్టి పొట్టుబోగడగి రాతిమీద నూరినది పిష్టికయనబడు నది పూర్ణమువలె లోపలనుంచి గోధూమపిండి పైనిపొదిగించి జేసిన రొట్టె వేఢణికయందురు. ఇటువలెనే పెసరపప్పు మినపపప్పును పూర్ణముంచిన రొట్టికతివేఢణికమనబడు నిది బలకరము. నేయితోనైన నూనెతోనైన బుచ్చికొనిన రుచి వీర్యోష్మ తృప్తి గురుత్వ వృద్ధులను జేసి వాతమును గొట్టి మలమూత్ర మోచనమొనర్చి కొవ్వునణచి పైత్యకరమై మూలశంక శ్వాస శూలముల నశింపజేయునిది నేయితో వేచిన వటోరయనబడి లాఘవమును రుచిని జేయును.

ధూమసీరచితాహింగుహరిద్రాలవణైర్యుతా। జీరకాస్వర్జితాభ్యాంచ తమాకృత్యచ వేల్లితాః। పర్పటాస్తే సదంగారభ్రిష్టాః పరమరోచకాః। దీపనాః పాచనారూక్షాగురవఃకించిదీరితాః। ముద్గాన్నైతద్గుణాఃప్రోక్తా విశేషాలఘవస్మృతే। చణకస్యగుణైర్యుక్తా పర్పటాశ్చణకోద్భవాః। స్నేహభ్రిష్టాశ్చతేసర్వే భవేయుస్మృత్యనాగుణైః। లఘవః పర్పటామ్రచ్యాః కఫఘ్నా శాలిసంభవాః॥

మాషాణాం పిష్టికాం యుక్తాం లవణార్ద్రకహింగుభిః। కృత్వా విదభ్యాద్వటికా స్తాస్తైలె విపచేచ్ఛనైః। విఘుషా-వటికాబల్యా బృంహణాపిష్యవర్ధనాః। వాతామాపహారారుచ్యా విశేషాచ్ఛర్దితాపహాః। విబంధభేదినశ్లేష్మ కారిణోత్పన్నిపూజితాః। సంచూర్ణ్యనిక్షిపేత్తత్రైభృష్టహింగుచజీరకం। లవణం తత్రై వటుకాన్నకలానపి మజ్జయేత్। శుక్రిలస్తత్రైవటుకో బలకృద్రో

చకోగురుః। విబంధహృద్విదాహీచ శ్లేష్మలః పవనాపహః॥ తక్రేంపిష్టమరీచి హింగుమిళితం కుస్తుంబరీసంయుతం యుక్త్యావఘ్ఞితమర్ధశేషమపరే భాండే సుధూపావృతే। పక్వ్యావతత్రి మనోహరాంశ్చ వటుకాస్తేషాం రుచిర్మార్దవం స్వాదుత్వంచ సుసౌరభం గుణగణం వేత్తిస హి విశ్వేశ్వరః॥ కాంజికేషు వినిక్షిప్యవటుకామాషసంభవాః। వాతఘ్నారోచనాహృద్యాః కఫపిత్తప్రకోపనాః। ఆమ్లికాం స్వేదయిత్వాతు జలేనసహమర్దయేత్। తన్నీరే కృతసంస్కారే వటుకాన్మజ్జయేత్కృతీ। ఆమ్లికావటుకాస్తేషు రుచ్యా వహ్నిప్రకోపనాః॥ చించాతోయే విమిశ్రా గుడలవణయుతాః పిత్తమేతే నిహంతి తృష్ణా మూర్చ్ఛాభిఘాతజ్వరజఠరహరాః క్షుద్రరోగాపహాశ్చ। లాజీచూర్ణేన మిశ్రాః కఫపవనహరా రోచకా దీపనాస్స్యు ర్మందాగ్నిధ్వంసకాశ్చానిలవిషశమనా భుక్తమన్నంపచంతి॥ మాషాణాంపిష్టికాహింగులవణార్ద్రకసంయుతాః। తథా విరచితా వస్త్రే వటుకాస్సాధుశోషితాః। తలితాస్తప్తతైలేవా ఘృతేవాసుప్రలోహితాః। వటుకస్యగుణైర్యుక్తా జ్ఞాతవ్యా రుచిదా భృశం॥ కూష్మాండార్ద్రకమరీచైర్జీరకసింధూద్ధమేధికాసహితైః। పిష్టై ర్మాషదళోద్ధైర్విహితావటుకాశ్చ యోగిభిస్సత్యాః॥ కూష్మాండకవటీ జ్ఞేయా పూర్వ్వవద్వటుకాగుణాః। విశేషా పిత్తరక్తఘ్నీ లఘ్వీచ కథితా బుధైః॥ నిస్తుషైర్ముద్గమాషైశ్చ కూష్మాండమజ్జసంయుతైః। శుష్కాశ్చవటుకాః పక్వా రుచ్యారోచకనాశనాః॥

ఆర్ద్రకరామఠసైంధవజీరకయుక్తమహాకృతికాస్సతిలాః। అంబుజబంధుకరైః కఠినా తిలతైలభృతా రుచిదావటుకాః॥ కూష్మాండమజ్జామిళితైస్సత్వక్సితైస్సజీరకైః॥ పటుభిశ్శుష్కరలవటుకాశ్శుద్ధాంగారవిపాచితాలఘవః। ఆర్ద్రకజీరకరామఠధనికాభ్యాం శ్లేష్మనాశనా రుచ్యాః॥ కృతాశ్చ నింబకుసుమైస్సతిలైః పటుసంయుతైః। వటుకాః కఫపిత్తఘ్నా కృమివ్రణవినాశినః॥ కృతాశ్చవజ్రవల్లీ తిలరామఠలవణజీరకైర్వటుకాః। స్పష్టపురీషా సద్యోర్శోఘ్నా గుల్మవహ్నిమాంద్యహరాః॥ ఏవంసూరణవటుకాం కుర్యాత్ తద్గుణాంస్తద్వత్। పక్వామలకఫలానాం పిష్టాన్ప్రిష్టతండులైస్సతిలైః। చూర్ణకృతైశ్చలవణైస్సహింగుభిశ్శాకబింబసంసృష్టైః। లఘువశ్చకృతాస్తు వటుకాః పిత్తహరం త్వాపహరంతి మేహంచ। చక్షుష్యాస్తిరుచ్యా వృష్యా దోషఘ్నజరరాగ్నికరాః॥ కదళీకుసుమక్షోదే జీరకైస్తిలమిశ్రితైః। మరీచిక్షోదలవణై రేకధ్యాం వటుకాః కృతాః। తైలభ్రష్టా రుచికరాః పిత్తలా వాతనాశనాః॥ శాలిపిష్ట దధిఖండసంయుతా దధ్నఏవ వటుకాస్తథాకృతాః। ఘూరవాతశమనా రుచిప్రదాః

పిత్తరోగమపహంతి దారుణం॥ ముద్గానాం వటికాస్తద్వద్రచితాస్సాధితాస్తథా। పథ్యారుచ్యాస్తతో లఘ్వ్యో ముద్గసూపగుణాస్స్మృతాః। దుర్జరాలఘవో రుచ్యా చణకాదికృతా అపి। స్థాల్యాం ఘృతేవా తైలేవా హరిద్రాహింగుభర్జయేత్। అవలేహనసంయుక్తం తక్రం తత్రైవ నిక్షిపేత్। యేషా సిద్ధా సమరిచా కధితా కధికాబుధైః। కధికా పాచనీరుచ్యా లఘ్వీ వహ్నిప్రదీపనీ।కఫానిలవిబంధఘ్నీ కించిత్పిత్తప్రకోపినీ॥ అతిపక్వాఘవ్యంతాకఫలైశ్చ తిలమిశ్రితైః। మరీచిక్షోదలవణైర్హింగుజీరకమిశ్రితైః। పైత్యలావటుకారుచ్యా స్నేహభ్రిష్టాశ్చదీపనాః॥ దాలయశ్చణకానాంతు నిస్తుషా యంత్రపేషితాః। తచ్చూర్ణం వేశనంప్రోక్తం పాకశాస్త్రవిశారదైః॥ వటుకావేశనస్యాపి కధికాయాం నిమజ్జితా। రుచ్యావిష్టంభజననీ బల్యా వృష్టికరీ స్మృతా॥ ఏవమన్యేపి యేకేచిద్భృష్ట్యావేశనసంభవాః। తద్గుణాస్తేపి బోద్ధవ్యా యుక్త్యా పాకవిశారదైః॥

మినపచాయపప్పుపిండిలో నింగువ పసపు ఉప్పు జీలకఱ్ఱ సజ్జాకారమును నీళ్లతోగలపి పలచగా వత్తినవి పర్పటములందురు- ఇవి మంచినిప్పులపైని గాల్చిన మిక్కిలి రుచిని దీపనమును పాచనమును గురుత్వమును జేసును. పెసరపిండితోజేసిన పర్పటములు పైనిజెప్పిన గుణమునుజేసి లఘుత్వమును జేయును. సెనగపిండి పర్పటములు సెనగగుణమునే జేయు నివి యన్నియును చమురునవేచిన మధ్యమగుణములు. బియ్యపుపిండితో జేసిన పర్పటములు రుచిని లఘుత్వమునుజేసి కఫమునుహరించును. వీటికాంధ్రభాషలోనప్పడములందురు.

మినపపిండిలో నుప్పు నల్లము నింగువయును గలపి పెట్టిన వడియములు యండనెండించి చమురులో మెల్లనవేచి బుచ్చికొనిన బలవృద్ధివీర్యములను శ్లేష్మమును జేసును. వాతామవమనతాపములను హరించును. విరేచనకారి- విశేషజఠరాగ్నిగలవారలకు హితము. వేచిన యింగువ జీలకఱ్ఱయు నుప్పును గలపిన మజ్జిగలో వేచినవడియములుంచి బుచ్చికొనిన శుక్లవృద్ధి బలమును రుచిని గురుత్వమును రేచనమును దాహశ్లేష్మములనుజేసి వాతమునుహరించును. సెనగపిండి మిర్యము యింగువ కొతిమిరియును గల్పిన మజ్జిగను విరిగిపోకుండ సగముగ మరిగించి రెండవకుండలో పోగిచి దీనిలో ప్రశస్తమగు వేచిన వడియములు వేసిన యావడియముల రుచిని మార్దవమును పరిమళిగుణములను విశ్వేశ్వరుడే దెలసికొనవలెను. కాంజికమందునవేసిన మినపవడియములు వాతహారము- రుచికరము- హృద్యము- కఫపైత్యప్రకోపము. చింతపండు వెచ్చజేసి కలపి పెట్టిన పులుసులో వడియములు వేచి పోగచినవి యామ్లికావటుకములు రుచి జఠరవృద్ధికరములు. బెల్లము నుప్పును గలసినబులుసులోని వడియ

ములు పైత్యపిపాసమూర్ఛాజ్వరమును జఠరమును క్షుద్రరోగములను హరించును. పేలపిండితో గలపిన వడియములు వాతము నరుచి నగ్నిమాంద్యమును విషమును హరించి భుజించినయన్నమును జీర్ణింపజేయును. మినపపిండి యల్లము నింగువయు నువ్పును గలపి వస్త్రమందు వడియములుంచి యెండించి మరగిన నేయినైన నూనెనైన నెట్లగవేచిన యవి పైనిజెప్పినగుణములనే జేయును. బూడిదగుమ్మడికోరు అల్లము మిర్యపకాయలు జీలకఱ్ఱయు నుప్పు మెంతులును నానబెట్టి పొట్టుదీసిన మినపపప్పుతో కలపి రుబ్బి జేసిన వడియములు రోగులచే భక్షించదగు నివియును పైనిజెప్పిన గుణమునే జేయును. శాంతికరము- పైత్యరక్తహరము- లఘుకరము- అటువలెనే చాయపెసరపప్పుతో కలపిపెట్టిన గుమ్మడివడియములు రుచికరములు- అరుచినిగొట్టును.

అల్ల మింగువ సైంధవలవణము జీలకఱ్ఱయు గలపి పొట్టుతీసిననువ్వుల పిండి తాళేలులవలెవడియములుబెట్టి యెండించి వేచిబుచ్చికొనిన యవిరుచికరములు. బూడిదగుమ్మడుత్వక్కు, బీజములు, కోరును, జీలకర్ర, యింగువ, అల్లము, ఉప్పును గలపి వడియములుబెట్టి యెండించి నిప్పులపై గాల్చిన యవి లఘుకరములు. అల్లము జీలకర్ర యింగువ వేపపువ్వు నువ్వులును గలపిపెట్టిన వడియములు కఫపైత్యక్రిమివ్రణశాంతికరములు. నువ్వులు యింగువ యుప్పును జీలకర్ర గలపి నల్లేరు రుబ్బి పెట్టినవడియములు రేచకములు మూలశంక గుల్మ మందాగ్ని యనువాడె నశించును. ఈప్రకారముగానే కందతోకలపిపెట్టినవడియములు పైనిజెప్పినగుణముతే జేయును. పండినయుసిరికాయలు వేచి నబియ్యము నువ్వులు చూర్ణముజేసి యుప్పు నింగువయును గలపి చంద్రబింబాకృతిగబెట్టినవడియములు లఘుకరములు- పైత్యమును మేహమును హరించును. నేత్రహితము- రుచి- వీర్యజఠరాగ్నికరములు- దోషహరములు. అనటిపువ్వు రుబ్బి జీలకర్రయు నువ్వులు మిరియపకాయలును నూరినముద్దయు నుప్పును గలపిపెట్టినవడియములు నూనెలోవేచి బుచ్చుకొనిన రుచినిబుట్టించి పైత్యమును బెంచి వాతమణచును. వరిపిండి పెరుగువిల్లలతోకలపి పెట్టినవడియములు ఘోరవాతపైత్యములనుగొట్టి రుచినిబుట్టించును. అటువలెనే పెసరపిండితో బెట్టిన వడియములు పథ్యము- రుచ్యము- లఘువునై పెసరపప్పుగుణమునే జేయును. సెనగపిండిమొదలగువాటితో జేసినవడియములు లఘువై అజీర్ణమును జేయును. కిలముబట్టని తపేలాయందు నూనెతో లేకనేయితో పసపు నింగువయును గలపి వేచి చిక్కని మజ్జిగబోసి మిర్యమువేసి గాచినది కధికయనబడు నిధిషా

చకము- రోచకము- లఘువు- దీపనము- కఫవాత మలబంధహారము. ఇందుక
పైత్యమును జేయును. మిక్కిలిపండిన వంగపండు తరిగి నువ్వులు నిర్యపముద్ద
యు నువ్వు నింగువ జీలకర్రయును గలపిరుబ్బి పెట్టినవడియములు పైత్యలము
లనబడు నివి చమురుతోవేచిన దీపనములు- రుచ్యములు- సెనగచాయపప్పు వి
సిరినపిండి వేశనమనబడును. దీనివడియములు కధికలోవేసిన రుచ్యము- మల
బంధబలపుష్టికరము- ఈపిండితో జేసిన భక్ష్యములన్నియు నితరవస్తుమేళనము
చే గుణవిశేషమును దెలియదగును.

సమితాంమర్దయేదాజ్యే జలేనాపిచసన్నయేత్। తస్యాస్తు వటుకం కృ
త్వా పచేత్సర్పిషి నీరసం। ఏలాలవంగకర్పూరమరీచాద్యైరలంకృతాం। మజ్జ
యిత్వా సితాపాకే తతస్తంచ సముద్ధరేత్। అయంప్రకారస్సంసిద్ధో మంట
ఇత్యభిధీయతే। మంటస్తు బృంహణోవృష్యో బలస్సుమధురోగురుః। పిత్తానిల
హరోరుచ్యో దీప్తాగ్నీనాం సుపూజితః। సమితాశర్కరా సర్పిర్మిశ్రా అప
రేపియే। ప్రకారాఅమునాతుల్యాస్తేపిచైతద్గుణాస్మృతాః॥ అపరే శంఖపా
లాదయః॥ తల్లక్షణముచ్యతే॥ మర్దవస్సమితాంసిద్ధాం కృత్వా కుర్యాచ్చ పోలి
కాం। శృంగాటాకృతికాం కుర్యాత్ఖండశస్తాం పచేద్ఘృతే। మజ్జయేచ్చ సితా
పాకే తతస్తేతు సముద్ధృతాః। శంఖపాలఇతిప్రోక్తాః పాకశాస్త్రవిశారదైః॥
గోధూమపర్పటాస్సాజ్యసమితాఘృతభర్జితాః। కుట్టితాశ్చాలితా శ్శుద్ధశర్క
రాభిఃమిశ్రితాః। తస్మింశ్చాన్తేక్షిపేదేలాలవంగమరిచానిచ। నారికేళం సక
ర్పూరం చారబీజాన్యనేకశః। ఘృతాక్తసమితాపుష్టరోటికా రచితాతతః। త
స్యాంతత్పూరణం న్యస్య కుర్యాన్ముద్రాం దృఢాం సుధీః। సర్పిషిప్రచురేతాం
తు సుపచేన్నిపుణోజనః। ప్రగారజ్ఞైః ప్రకారోయం సంయావఇతి కీర్తితః।
మంటకేన సమోజ్ఞేయస్సంయావోపిగుణైర్జనః॥ ఘృతాఢ్యయా సమితయా కృ
త్వాలంబపుటం తతః। లంబగోషణకర్పూరయుతయా సితయాయుతం। ప
చేదాజ్యేనసిద్ధైషా జ్ఞేయా కర్పూరనాళికా। సంయావసదృశీచైవ గుణైః క
ర్పూరమాలికా। సంయావసదృశీరుచ్యో గుణైఃకర్పూరనాళికా॥ లఘురపిచక
ర్త్రీ ఫేనికాతిప్రశస్తా బలవతిలఘుజీర్ణా ఛర్దినాశంకరోతి। విదలతిముఖధర్మం
చామ్లపిత్తం విదాహం జఠరభరణయోగ్యాగోధుమైస్సంప్రయుక్తా॥ గుర్వ్యో
తిబృంహణాస్స్నిగ్ధా బల్యా శుక్లకరాస్మృతాః। స్త్రీషు హర్షం ప్రయచ్ఛంతి
మాషపిష్టకసంభవాః॥ సమితావేశనేజీరకహింగుమరీచియోజతే। ఘృతాక్తేజ
లసంయుక్తే పీరస్యోపరివేష్టితే। ఘృతేనవాథతైలేన భర్జితా పూరికా భవేత్।

పూరికాబృంహణాస్స్నిగ్ధావృష్యాపిత్తానిలాపహాః॥ ఘృతపాచితఇత్యర్థాత్।
మధురాస్తైలపాకిన్యో గుర్వ్యశ్లేష్మానిలాపహాః। ఇత్యుత్తరత్రవిధానాత్॥
మాషముద్గాదిచూర్ణైశ్చ మాషపిష్టైశ్చసంభృతా। జలేఘూపరిసంపక్వా సు
రూపాస్యురవంతికాః॥ ఇయమేవ స్నేహపాకే చండారికేత్యుచ్యతే॥ తద్గుణా
శ్చ॥ వృష్యారోచనదీపనీ బలకరా గుర్వ్యభిష్యందినీ సద్యస్తర్పణకారిణీ
రసవతీ శ్లేష్మప్రవృద్ధిప్రదా। ఘూరాదాహవిబంధగుల్మశమనీ పిత్తాస్రవిచ్ఛే
దినీ స్నేహేనాపి సుపూరితాచసతతం భక్ష్యాచచండారికా॥ ఘృతపూరంబల
కరం వృష్యం మధురశీతలం। హంతివాతం రక్తపిత్తం శ్లేష్మలంచ విశేషతః॥ స
మితాయా ఘృతాక్తాయాం లోప్త్రీంకృత్వావవేల్లయేత్। ఆజ్యేతాంభర్జయే
త్సిద్ధాం శష్కులీఫేణివద్గుణాః। శష్కులీమధురా స్నిగ్ధా రుచ్యా శ్లేష్మవివ
ర్ధనీ। వాతఘ్నీ బృంహణీగుర్వీ వీర్యేణోష్ణావిదాహినీ॥ అత్యుచ్ఛ్రితాస్తు గో
ధూమగోలకాః పరిపాచితాః। వాతఘ్నా మధురాస్నిగ్ధా వృష్యా బలవతాం
హితాః॥ రుచ్యావాతహరాబల్యా మాషాపూపాస్తు బృంహణాః। శుక్లవృద్ధి
కరాస్నిగ్ధా శస్తావ్యాయామశాలినాం। స్థూలాస్స్యుర్వర్తులాఃకుబ్జాస్సచ్ఛిద్రా
స్స్నేహపాచితాః। పిష్టాపూపారుచికరా గురవః కఫపుష్టిదాః॥ ముద్గానాం
ధూమసీసమ్యగ్గోలయేన్నిర్మలాంబునా। కటాహస్య ఘృతస్యోర్ధ్వం సఝ్ఝరం
స్థాపయేత్తతః। ధూమసీంతుద్రవీభూతాం ప్రక్షిపేజ్జర్ఝరోపరి। పతంతీబింద
వస్తస్మాత్తాంసుపక్వాం సముద్ధరేత్। సితాపాకేన సంయోజ్య కుర్యాదుక్తేన
మోదకాన్। లఘుగ్రాహీ త్రిదోషఘ్నస్స్వాదుశీతరుచిప్రదా। చక్షుష్యో జ్వర
హృచ్ఛల్యస్తర్పణో ముద్గమోదకః। ఏవంప్రకారకాంకుర్యాద్బేసవేనాపిమోద
కాః। తేబల్యా లఘువశ్శీతాః కించిద్వాతకరాస్తథా। విష్టంభినో జ్వరఘ్నాశ్చ
పిత్తరక్తకఫాపహాః। ఏవమేవప్రకారేణ మాషజాఅపి మోదకాః। కించిత్సమ
గుణామాషైః రత్నమోదకసంజ్ఞికాః॥ ఘృతాక్తయాసమితయా కృత్వాసూ
త్రాణి తానితు। నిపుణోభర్జయేదాజ్యే ఖండపాకేనయోజయేత్। యుక్తేన
మోదకాన్కుర్యాత్తేగుణైర్మంటకాయథా॥ నూతనంఘటమాదాయ తస్యాం
తఃకుశలోజనాః। ప్రస్థార్ధపరిమాణేన దధ్నామ్లేన ప్రలేపయేత్। ద్విప్రస్థాం
సమితాంతత్ర దధ్యమ్లం ప్రస్థసంమితం। ఘృతమర్ధశరావంచ ఘోలయిత్వా
ఘటేక్షిపేత్। ఆతపే స్థాపయేత్తావద్యావద్యాతి తదమ్లతాం। తతస్తత్ప్రక్షి
ప్యత్వాతేసచ్ఛిద్రేభాజనేనతత్। పరిభ్రామ్యపరిభ్రామ్య తత్సంతప్తేఘృతేక్షి
పేత్। పునఃపునస్తదావృత్య విదధ్యాన్మండలాకృతిం। తాంసుపక్వాం ఘృతా

చ్ఛగంధము, మహాశాకము, హరణ్యము, పలాండువు, లతార్కి, పరాకికా, గృంజనము, యవనేష్టము పదివిధములై పలాండుజాతియుండునని సుశ్రుతము నజెప్పుటచేత నివి భక్షించిననరుడు ప్రత్యవాయియగును. గృంజనమనగా గంజాయి ఆకు- దీనిచూర్ణమును కంఠశుద్ధికొరకు గాయకులున్ను, మదముజేయుటకు ముదముతో పణ్యముదితలున్ను భక్షించెదరు. లేక గాజరియనుదుంపైన నగునని మాధవాచార్యులవారనిరి. ఉల్లిపాయలు భక్షించిన స్త్రీవ్యసనమతిశయించునని కామవ్యాపారమును తగ్గించుటకు నభక్ష్యమని చెప్పుట. అమేధ్యస్థలమున బుట్టినదాని నభక్ష్యమనుటకు హేతువును శౌచప్రకరణమున బ్రకటం జేసితిమి.

## ఉపదంశాః.

అథోపదంశాః॥ తత్ర॥ స్వాద్వమ్లం విశదంహృద్యం తీక్ష్ణోష్ణం భక్తరోచనం। స్నిగ్ధం సుగంధం నారంగం బల్యం శ్లేష్మానిలక్రిమీన్। జయేదరుచిసప్లీహక్రిమాన్సుర్వగ్నికృత్సరం॥ జంబీరంస్వాదమ్లతీక్ష్ణం సుగంధం దత్తహర్షణం। దీపనం రోచనం భక్తం పాచనం ముఖశోధనం। తృష్ణాశూలకఫక్లేశఛర్దిశ్వాసకృమిప్రణుత్। వాతశ్లేష్మవిబంధఘ్నం వర్ణ్యం బలకరంపరం॥ మధురోమధుజంబీరశ్శిశిరః కఫపిత్తజిత్। తుష్టికృత్తర్పణోవృష్య శ్ళ్రమతృడ్దాహదోషజిత్ ॥ అమ్లం కందూకంనింబూకం గుల్మశ్లేష్మామవాతజిత్। వర్ణ్యంరుచ్యగ్నికృత్పక్వం కంఠరుక్ఛర్దికాసజిత్॥ బాలం త్రిదోషాస్రకరం మధ్యం తాదృగ్విధం భవేత్॥ సహకారఫలంబల్యం కషాయామ్లం కఫప్రణుత్। వాతపిత్తహరంరూక్షం పీనసారుచికృద్గురు॥ ఉదామ్రమ్రం బాలమత్యుష్ణం కటుపాకే సమీరజిత్ । కఫపిత్తహారంరుచ్యం కదుష్ణం రక్తశోషణం॥ లవణామ్రఫలంరుచ్యం దీపనం వాతనాశనం। శ్రమక్లమహరం హృద్యం మదమూర్ఛాప్రలాపజిత్ ॥ మావికామ్లాకషాయోష్మా కంఠ్యావాతబలాస్రజిత్ । రుచ్యాగ్నిదీపనీజ్ఞాన్యా వ్రణే కంఠామయే హితా॥

## ఊరగాయలగుణములు.

ఇటుపై నూరగాయలను జెప్పుచున్నారము. ఊరగాయ పుల్లనైనది స్వాదు- విషహరము- హృద్యము- వెట్టజేయును- అన్నమును రుచింపజేయును. నారింజ ఊరగాయ సుగంధము- స్నిగ్ధము- బలకరము- శ్లేష్మవాతక్రిమి ప్లీహరుచిశ్రమహరము- గురుత్వకారి- జఠరమును వృద్ధిబొందించి విరేచనమును జేయును. నిమ్మకాయ ఊరగాయ పుల్లన- వెట్ట- సుగంధము- దత్తహర్షము- దీ

పనము- రుచికరము- అన్నమును జీర్ణింపజేయును- ముఖమునుశుద్ధిపరచును. పిపాసాశూలకఫశ్రమఛర్దిశ్వాస క్రిమిహరము- వాతశ్లేష్మ మల బంధహరము- కాంతిబలకరము. తియ్యనిమ్మపండూరగాయ మధురమై- చల్లనై- కఫపైత్యహరమై- తుష్టి పుష్టి వీర్యవృద్ధియును జేసి శ్రమపిపాసాదాహదోషకరము. పెద్దనిమ్మపండూరగాయ పుల్లనై గుల్మశ్లేష్మాశ్మవాతకంఠరోగ ఛర్దికాసలనుగొట్టి కాంతి రుచి జఠరములను వృద్ధిబొందించును. నేతనిమ్మకాయఊరగాయ త్రిదోషకరము- మధ్యమమట్టిగుణమునే జేయును. తియ్యమామిడి ఊరగాయ బలకరము- వగరు- పులుసు- త్రిదోషహరము. పీనసగురుత్వరుచికరము. పుల్లమామిడి లేతఊరగాయ మిక్కిలివెట్టజేసి కటువై వాతకఫపైత్యములనుహరించి రక్తమును బోషింపజేయును. మాగాయ రుచ్యము- దీపనము- వాతహరము- శ్రమక్లేశమదమూర్ఛాప్రలాపహరము- హృద్యము. మావికయనునది పుల్లనై వగరుగలిగి వెట్టజేసి కంఠమునుబాగుజేసి వాతబలరక్తములను బోగొట్టి రుచ్యగ్నిదీపనమై వర్ణమునుజేయును- వ్రణరోగికి గళరోగికి హితము.

## మాంసప్రకరణమ్.

అథ మాంసభక్షణవిధిం వ్యాఖ్యాస్యామః॥ అథేతి సిద్ధాన్నసూపభక్ష్యదశవిధశాకవివేచనానంతరమితి॥ మన్యతే బలకరమితి మాంసం మనజ్ఞానే॥ తదుక్తం శ్రీమహాభారతే॥ నమాంసాత్పరమంకించిద్రసతో విద్యతేభువి। కృశక్షీణాభితప్తానాం గ్రామ్యధర్మరతాత్మనాం। అధ్వనాకర్శితానాంచ నమాంసాద్విద్యతేపరం। సద్యోవర్ధయతేప్రాణాన్ పుష్టిమగ్ర్యాందదాతిచ। నభక్ష్యోభ్యధికఃకశ్చిన్మాంసాదస్తి పరంతపేతి॥ యద్వా ఇహలోకే యస్య మాంసమశ్నామి పరలోకే సమాం భక్షయిష్యతీతి ఏతన్మాంసశబ్దస్య నిరుక్తిం పండితాః ప్రవదంతీతి మనురాహ॥ తద్యథా॥ మాంసభక్షయితాముత్రయస్యమాంసమిహాద్మ్యహం। ఏతన్మాంసస్య మాంసత్వం ప్రవదంతి మనీషిణఇతి॥

నను ప్రాణిహింసాతోన్యత్ర మాంసం నోపపద్యతే। తస్మాతాపితృనిషిక్తశాతీవహేయ శోణిత శుక్లమేళన శరీరమేవ తస్మాన్మాంసభక్షణవిష్యాపక్రాంతి రత్యంతాపాయప్రతిపాదికేతి బ్రూమస్తథాచ శ్రుతిస్మృతయః। నమాగ్ సమశ్నీయాదితిశ్రుతిః॥ నాకృత్వా ప్రాణినాం హింసాం మాంసముత్పద్యతేక్వచిత్। నచప్రాణివధస్స్వర్గ్యస్తస్మాన్మాంసం వివర్జయేత్॥ సముత్పత్తించమాంసస్య వధబంధౌచదేహినాం। ప్రసమీక్ష్యనివర్తేత సర్వమాంసస్యభక్షణాత్॥ వర్షేవర్షేశ్వమేధేన యోయజేత శతంసమాః। మాంసానిచ నఖా

దేద్యస్తయోః పుణ్యఫలం సమం॥ ఫలమూలాశనైర్మేధ్యైర్మున్యన్నానాంచభోజ
నైః। నతత్ఫలమవాప్నోతి యన్మాంసపరివర్జనాత్ ॥ అనుమంతా విశసితా ని
హంతా క్రయవిక్రయీ। సంస్కర్తాచోపహర్తాచ ఖాదకశ్చేతి ఘాతకాఇతి
మనుః॥ సర్వాన్కామానవాప్నోతి హయమేధఫలంతథా। గృహేపి నివసన్వి
ప్రో మునిర్మాంసవివర్జనాదితి యాజ్ఞవల్క్యః॥

తర్హి స్యాద్వైదికపశుహింసాయాగశ్రాద్ధాతిథిభోజనేష్వధర్మ్యః। కిం
చ భృత్యానాంచావశ్యభరణీయానాం వృద్ధమాతాపిత్రాదీనాం భరణాయ
కుంభసంభవేనాంభోధ్యంభస్తంభితకుక్షింభరేణ సాక్షాద్భర్గాంశభవేనమృగ
యాక్రియాకారీతి మన్వాద్యుక్తేరనర్థాభవేత్। ప్రవాహానాదితయా నిత్యం ప
శుయాగాదివిధిం సర్వత్ర సర్వంసహాయాం బ్రాహ్మణేష్వార్యావర్తాంతర్వ
ర్తిబ్రహ్మావర్తాదిదేశావస్థితగౌడేష్వతిథిశ్రాద్ధాదికామనయాద్యాప్యశ్నంతఃప
శ్యామః ప్రత్యక్షం। తస్మాదవిధానేన యో మాంసం ఖాదతి సమృతస్సన్ య
న్మాంసం తేనభక్షితం తైఃప్రాణిభిః పరలోకే స్వరక్షణాక్షమః ఖాద్యదఇతి
మాంసశబ్దనిర్వచనమనూక్తేః। దేవతాతిథిశ్రాద్ధాదిష్వభ్యర్చ్య శాస్త్రానుజ్ఞా
తమృగమత్స్యపక్షిణాం మాంసపురోడాశం భక్ష్యమేవ। కింతు దేవతాద్యుద్దే
శమంతరేణ స్వజఠరపిఠరపూరణార్థమేవ మాంసభక్షణాదత్రైవ ప్రత్యవాయో
హీనాయుగ్గదీభవతీత్యేవశ్రుతిస్మృతయో జ్ఞాపయంతి॥ యదగ్నీషోమీయంప
శుమాలభతే వార్త్రఘ్నఏవాస్య సతస్మాద్వాశ్యం॥ అస్యార్థః॥ అగ్నీషోమీ
యం అగ్నీషోమదైవత్యం పశుం ఆలభతే హంతీతియత్ తత్ అస్య యజమా
నస్య వార్త్రఘ్నః పాపహారీ తస్మాత్ తస్మాత్కారణాదేవావశ్యం భక్షణా
ర్హం అగ్నీషోమీయపశ్విడామాంసభక్షణీయమితి యాజుషశ్రుతిః॥

ప్రోక్షితం భక్షయేన్మాంసం బ్రాహ్మణానాంచకామ్యయా। యథావి
ధినియుక్తస్తు ప్రాణానామేవచాత్యయే॥ ప్రాణస్యాన్నమిదంసర్వం ప్రజాప
తిరకల్పయత్। స్థావరంజంగమంచైవ సర్వం ప్రాణస్యభోజనం॥ యజ్ఞాయజ
గ్ధిర్మాంసస్యేత్యేషదైవోవిధిస్మృతః। అతోన్యథాప్రవృత్తిస్తు రాక్షసోవిధిరు
చ్యతే॥ క్రీత్వా స్వయంవాప్యుత్పాద్య పరోపకృతమేవవా। దేవాన్పితౄంశ్చా
ర్చయిత్వా ఖాదన్మాంసంనదుష్యతి। నాద్యాదవిధినామాంసం విధిజ్ఞోనాపది
ద్విజః। జగ్ధ్వాహ్యవిధినా మాంసం విధిజ్ఞో నాపది ద్విజః। జగ్ధ్వా హ్యవిధినా
మాంసం ప్రేత్యతైర్నాద్యతేఽవశః। నతాదృశంభవత్యేనో మృగహంతుర్ధనా
ర్థినః। యాదృశంభవతి ప్రేత్య వృథామాంసానిఖాదతః। నియుక్తస్తు యథా
ధి

న్యాయ్యం యో మాంసం నాత్తి మానవః। స ప్రేత్య పశుతాం యాతి సంభవా నేకవింశతిం॥ అసంస్కృతాన్పశూన్మంత్రైర్నాద్యాద్విప్రః కదాచన। మంత్రైస్తు సంస్కృతాన్నద్యాచ్ఛాశ్వతం విధిమాస్థితః। యావంతి పశురోమాణి తావత్కృత్వోహ మారణం। వృథా పశుఘ్నః ప్రాప్నోతి ప్రేత్య జన్మని జన్మని। యజ్ఞార్థం పశవస్సృష్టాస్స్వయమేవ స్వయంభువా। యజ్ఞోస్య భూత్యై సర్వస్య తస్మాద్యజ్ఞే వధోఽవధః। ఓషధ్యః పశవో వృక్షాస్తిర్యంచః పక్షిణస్తథా। యజ్ఞార్థం నిధనం ప్రాప్తాః ప్రాప్నువంత్యుత్సృతీః పునః। మధుపర్కే చ యజ్ఞే చ పితృదైవతకర్మణి। అత్రైవ పశవో హింస్యా నాన్యత్రేత్యబ్రవీన్మనుః। ఏష్వర్థేషు పశూన్హింసన్వేదతత్త్వార్థవిద్ద్విజః। ఆత్మానంచ పశూంశ్చైవ గమయత్యుత్తమాంగతిం। బభూవుర్హి పురోడాశా భక్ష్యాణాం మృగపక్షిణాం। పురాణేష్వపి యజ్ఞేషు బ్రహ్మక్షత్రసవేషు చ। గృహే గురావరణ్యే వా నివసన్నాత్మవాన్ద్విజః। నావేదవిహితాం హింసామాపద్యపి సమాచరేత్। యా వేదవిహితా హింసా నియతాస్మింశ్చరాచరే। అహింసామేవ తాం విద్యాద్వేదాద్ధర్మో హి నిర్బభౌ। యో హింసకాని భూతాని హినస్త్యాత్మసుఖేచ్ఛయా। స జీవంశ్చ మృతశ్చైవ న క్వచిత్సుఖమేధత ఇతి మనుః॥ ప్రాణాత్యయే తథా శ్రాద్ధే ప్రోక్షితం ద్విజకామ్యయా। దేవాన్పితౄన్సమభ్యర్చ్య ఖాదన్మాంసం న దోషభాగితి యాజ్ఞవల్క్యః॥ సంయావం కృసరం మాంసం శష్కులీ పాయసం తథా। ఆత్మార్థం న ప్రకర్తవ్యం దేవార్థంతు ప్రకల్పయేత్। అభక్షయన్వృథా మాంసమమాంసాశీ భవత్యుత। ప్రజానాంహితకామేన త్వగస్త్యేన మహాత్మనా। ఆరణ్యాస్సర్వదైవత్యాః ప్రోక్షితాస్తపసా మృగాః। విధినా వేదదృష్టేన తద్భుక్త్వేహ న దుష్యతి। యజ్ఞార్థే పశవస్సృష్టా ఇత్యపి శ్రూయతే శ్రుతిః। అతోన్యథా ప్రవృత్తానాం రాక్షసో విధిరుచ్యతే। క్షత్రియాణాంచ యో దృష్టో విధిస్తమపి మే శృణు। వీర్యేణోపార్జితం మాంసం యథా భుంజన్న దుష్యతి। ఆరణ్యాస్సర్వదైవత్యాః ప్రోక్షితాస్తపసా మృగాః। అగస్త్యేన పురా రాజన్మృగయా యేన పూజ్యతే। నాత్మానమపరిత్యజ్య మృగయా నామ విద్యతే। సమతాముపసంగమ్య భూతం హన్యతి హంతి వా। అతో రాజర్షయస్సర్వే మృగయాం యాంతి భారత। న హి లిప్యంతి పాపేన న చైతత్పాతకం విదురితి శ్రీమహాభారతే అనుశాసనికపర్వణ్యుక్తం॥

యత్తూక్తం పారాశరీస్మృతివ్యాఖ్యాతృభిర్మాధవాచార్యైర్మాంసభక్షణనిషేధస్తు నిషిద్ధప్రాణిహింసాపూర్వకమాంసభక్షణవిషయః। నతు క్రయా

విహాస్త్రమాంసభక్షణవిషయః। ప్రాణివధనిందాపూర్వకనిషేధస్మరణాదితి। తదవిహితరమణీయం। యస్మాత్క్రయకారిసత్వే ఘాతుకవిక్రేతారో భవంతి తస్మాత్స్నేహాత్స్వరసపరయాణా ప్రాణివధజనితదోషిణో భవంత్యేవ క్రేతారోయథా॥ అనుమంతా విశసితా నిహంతా క్రయవిక్రయీ। సంస్కర్తాచోపహర్తాచ ఖాదకశ్చేతిఘాతకాః॥ వాక్యాత్ ప్రాణినాం హింసాం మాంసముత్పద్యతే క్వచిత్ ఇత్యాది పూర్వోదాహృత మానవోక్తినిర్బోధన యిష్యామః॥

## మాంసప్రకరణము.

సిద్ధాన్నమాంసభక్షణవిధినిషేధవివేచనముచేసినపిమ్మట మాంసభక్షణవిధిని జెప్పుచున్నారము. బలకరమని ప్రియపడుచున్నది గావున మాంసమంటబడును. మరణానుభవమునకు జ్ఞానమర్థము. శ్రీమహాభారతమునందిట్లు జెప్పబడెను. మాంసముకంటెను రుచిగలపదార్థములేదు. కృశించినవారికి క్షీణించినవారికి మార్గాయాసముపొందినవారలకును మాంసముకంటె విశేషబలకరములేదు. భక్షించుటమాత్రముచేతను బలపుష్టులను వృద్ధిపొందించును. మరియు నిహలోకమందేమృగమాంసము నేను భక్షించుచునో నానిమాంస మామృగము పరలోకమందు భక్షించునని మాంసశబ్దనిర్వచనము. మాం అనగా నన్ను సః నావేదినబడినమృగము పరలోకమునందు భక్షించునుగావున మాంసశబ్దార్థమిటులని మనువచనము.

ఓయీ ప్రాణిహింసజేయకుండ మాంసము సంభవించదు. ఈమాంసము తలిదండ్రుల శోణితశుక్లమేళనమువలన బుట్టి పెరిగిన శరీరముగావున మాంసమును భక్షించవిధించుట మిక్కిలియపాయమునుబొందించుటగ దాను నిన జెప్పుచున్నారము. ఇందుకు శ్రుతిస్మృతులు- మాంసము భక్షించకూడదని యజుర్వేదము- ప్రాణిహింసజేయకుండ మాంసముబ్బదు- ప్రాణివధవలన స్వర్గములేదు- గావున మాంసమును వర్జింపవలయును- మాంసము పుట్టుగను న్న ఆమృగమును కట్టిపట్టి కొట్టి హింసించుటను జూచి బుద్ధిమంతుడు మాంసభక్షణనుండి మళ్లవలయును. నూరుసంవత్సరములు నూరశ్వమేధములుజేసిన వానిపుణ్యమున్ను మాంసమునువర్జించినవానిపుణ్యమున్ను సమమనియును- మృగమును జంపుటకనుమతించినవాడును జంపినవాడును కోసినవాడును కొన్నవాడును అమ్మినవాడు నప్పగించినవాడును వండినవాడును దినినవాడును వీరందరును జంపినవారేయని మనువచనములు.

బ్రాహ్మణుడు గృహమందే యుండి మాంసమును వర్జించి మునివృత్తితోనుండిన నన్నూర్ల యశ్వమేధఫలమును నొందునని యాజ్ఞవల్క్యవచనము. అయితే యజ్ఞమందును శ్రాద్ధాదికమందును పశుహింస అధర్మజనకమగును. మరియును దనచే బోషింపదగిన భృత్యవృద్ధమాతాపితృ ప్రముఖుల బోషించుటకు చులికితజలధిసలిలుడు నలికవిలోచనాంశసంభవుడగు నాకుంభసంభవుడు వేటాడెనని విందుము. ఇట్లు శిష్టాచారమునకును మన్వాదిశాస్త్రములకును విరుద్ధముగనుండెను. ప్రవాహరూపముగ ననాదిగా పశుయాగమును జేయుచుండిరి. ఆర్యావర్తాంతర్వర్తి బ్రహ్మావర్తాది దేశమందుండు గౌడపండితులు అతిథిశ్రాద్ధాదిహేతువుగ నిప్పటికిని మాంసమును స్వీకరించుచుండిరి. వీటిని ప్రత్యక్షముగ జూచుచుంటిమి. ఇవి విరుద్ధముగాదు. అవిగావున మాంసభక్షణ జేయదగదను మన్వాదివచనములు శాస్త్రవిధిలేకుండా భక్షించదగదనుట-గాన దేవపిత్రాద్యర్చనకై శాస్త్రమున జెప్పబడిన మృగమత్స్యపక్షిమాంసములను సంపాదించి దేవతాదులకొసగి శేషమును భక్షించదగును. కేవలముదరపూరణార్థ మతిజిహ్వాచాంచల్యముచే విధినతిక్రమించి మాంసమును భక్షించిన నాయుష్యహానియును రోగోత్పత్తియును మిక్కిలి ప్రత్యవాయమగుననియును శ్రుతిస్మృతులు జెప్పుచున్నవి. ఎట్లనిన- అగ్నిషోమీయపశువును జంపుట యజమానుని పాపమును జంపుట గావున నగ్నిషోమీయ పశ్వాదామాంసమవశ్యము భక్షించదగునని యజుర్వేదము. దేవాదిపూజానిమిత్తము ప్రోక్షితమగుమాంసమును భక్షించదగును. ఈస్థావరజంగమప్రపంచమంతయును ప్రాణసంరక్షణమునకై భోజనముగ బ్రహ్మచే నిర్మింపబడెననియును యజ్ఞశేషము భక్షింపవలెననియును వైదికమగు విధి జెప్పబడినది. ఇంతకంటె నితరకారణములచే మాంసభక్షణమాసురవిధియని జెప్పబడుచున్నది. మాంసమును కొనియైనను తానుగొట్టి తెచ్చియైనను పరులచే నివ్వబడినదైనను దేవపిత్రాద్యర్చనము జేసి భక్షించిన దూష్యముగాదు. ఇట్టి విధినతిక్రమించి మాంసమును దినదగదు. విధిలేకుండగ నేమృగమాంసము నెవఁడు భక్షించునో వాఁడా మృగముచే నరకమునందు వశుఁడై భక్షింపబడును. ధనమునకై మృగముల వేటజూచు కిరాతునికైనను వృథామాంసమును భక్షించినవానిదోషమంత లేదనగా వృథామాంసాశికి కిరాతునికంటె నధికదోషమని తెలియదగును. విధిచే నియుక్తుడై యజ్ఞాదులయందు న్యాయమగు మాంసము నెవఁడు భక్షింపడో వాఁడిరువదియొక జన్మమందు పశువై పుట్టును. మంత్రములచే పవిత్రమగు మాంసమును భక్షింపదగు నట్లుగాని వాని నాపదలేకుండ దినదగదు. వృథాపశుహింసను జేసిన

వాడా పశురోమము లెన్నిగలవన్ని జన్మములందు పశువులై పుట్టి యటుల మరణమునొందుచుండును. బ్రహ్మచే యజ్ఞమునకై పశువులు సృజింపబడెను. యజ్ఞమీసర్వప్రపంచాభివృద్ధికగునుగావున యజ్ఞమందలివధ వధగాదు. ఓషధులు, పశువులు, పక్షులు, వృక్షములు, తిర్యగ్జంతువులును యజ్ఞమందు మరణమునొంది యూర్ధ్వగతినొందును. మధుపర్కమునందును యజ్ఞమునందును పితృదైవతకర్మములందును పశుహింస గూడునని- ఇతరమగు నశాస్త్రీయహింస గూడదనియును- పూర్వోక్తకర్మలందు పశుహింసను జెప్పు వేదముయొక్క యథార్థవేత్తయగు ద్విజుడు దనను నాపశువుల నుత్తమగతిని బొందించుననియును భక్షకార్హమగు నాపశువుల పురోడాశములు ప్రాచీన యజ్ఞములందును బ్రహ్మక్షత్రయజ్ఞములందును విసియుక్తములాయెను. బ్రహ్మచర్యగార్హస్థ్యవానప్రస్థాశ్రమములందుండు ద్విజుడు వేదవిహితముగానిహింసనాపదయందైనను జేయనగదనియును వేదవిహితమగు హింస యీచరాచరప్రపంచమందు నియతమైనదిగావున దాని నహింసయని దెలియదగును.

వేదమువలనగదా ధర్మముప్రకాశించుట. ఎవడఘాతుకములగు భూతములను దనసుఖమునకై హింసించునో వాడు జీవించియుండినను మృతప్రాయుడేను- వాడేలోకమందున్నను సుఖమునొందడని మనువు. ప్రాణాత్యయాపదయందును, శ్రాద్ధమందు బ్రాహ్మణేచ్ఛచేతను, దేవపితృతర్పనలందును ప్రోక్షితమాంసమును భక్షించినవాడు దోషమునొందడనియును యాజ్ఞవల్క్యస్మృతి.

పైనివ్రాసిన గోధూమపిండిచే జేయబడిన సంయావమనుభక్ష్యమున్ను, పులగము, మాంసము, చక్కిలము, పాయసము నాత్మార్థమై వండరాదు. దేవతాదులకొరకు వండదగును.

వృథామాంసమునుభక్షించినవాడువమాంసాశియగును- ప్రజలహితవునుగోరినయగస్త్యులవారిచేత నరణ్యమందగు సకలదైవత్యమృగములున్ను ప్రోక్షించబడెను. వేదదృష్టమగు విధిచేతను మాంసభక్షణమును జేసి దూషించబడడు. పశువులు యజ్ఞార్థమై సృజింపబడినవని వేదమువినబడుచున్నది. ఇతకంటె నన్యముగ నడచిన యది రాక్షసవిధియనబడును. క్షత్రియులకు జెప్పబడిన విధి నీవు వినుము. తనశక్తివలన సంపాదించిన మాంసమును భుజించిన దూషించబడడు. సర్వదైవత్యములగు నారణ్యమృగము లగస్త్యులవారిచే పూర్వమందుప్రోక్షించబడెను. వారిచేనవుడు వేట ప్రశస్తికెక్కెను. తననుపదచి వేటయన్నదిలేదు. గాన సమతనొంది యోగ్యుడు ఘాతహింసజేయును. వాటిచే హింసించబడునుగావున రాజర్షులెల్ల వేటలందు సిట్లు సమబుద్ధి జేతురు.

గావున చాపముచే లేపము పొందరిది పాపమనియును పెద్దలు సెప్పిరనుచును శ్రీమహాభారతము వానుశాసనికపర్వము.

మాంసభక్షణనిషేధము ప్రాణిహింసాపూర్వకమైన మాంసభక్షణవిషయముగాని క్రయాదిప్రాప్తమాంసభక్షణవిషయముకాదని పరాశరమాధవమునందును జెప్పబడినది. యిదివిమర్శించనివారికి రమ్యమై తోచును. ఎందువలననంటె- కొనువారుంటే అమ్మువారును చంపువారు మొదలగువారును గల్గెదరు- అదికారణమువలన సాక్షాత్తున్ను పరంపరచేతనున్ను ప్రాణివధవలనపుట్టినదోషమును కొనిమాంసమును దినువారును బొందగలరు. పైనివ్రాసిన మనువచనములందు విక్రేతాదులకును దోషమును జెప్పియున్నది.

అథభక్ష్యాభక్ష్యమృగపక్షిమత్స్యమాంసాన్ప్రవక్ష్యామః॥

పాఠీనరోహితరాజీవసింహతుండశకులవర్జం। సర్వమత్స్యమాంసాశనే త్రిరాత్రముపవసేత్। సర్వజలజమాంసాశనేషు చ। ఖరోష్ట్రకాకమాంసాశనే చాంద్రాయణం కుర్యాత్। ప్రాశ్యాజ్ఞాతం సూనాస్థం శుష్కమాంసం చ। క్రవ్యాదమృగపక్షిమాంసాశనే తప్తకృచ్ఛ్రం। కలవింక ప్లవ చక్రవాక హంస రజ్జువాల సారస దాత్యూహ శుక శారికా బక బలాక కోకిల ఖంజరీటాశనే త్రిరాత్రముపవసేత్। ఏకశఫోభయదంతాశనే చ। తిత్తిరికాక పింజల లావక వర్తికా మయూరవర్జం। సర్వపక్షిమాంసాశనే చాహోరాత్రమితి విష్ణుస్మృతౌ॥ క్రవ్యాదాన్ శకునీన్సర్వాంస్తథా గ్రామనివాసినః। అనిర్దిష్టాంశ్చైకశఫాంష్టిట్టిభం చ వివర్జయేత్। కలవింకం ప్లవం హంసం చక్రాంగం గ్రామకుక్కుటం। సారసం రజ్జువాలం చ దాత్యూహం శుకశారికే। ప్రతుదాన్ జాలపాదాంశ్చ కోయష్టినఖవిష్కిరాన్। నిమజ్జతశ్చ మత్స్యాదాన్ సౌనం వల్లూరమేవ చ। బకం చైవ బలాకాం చ కాకోలం ఖంజరీటకం। మత్స్యాదాన్విడ్వరాహాంశ్చ మత్స్యానేవ చ సర్వశః। యో యస్య మాంసమశ్నాతి స తన్మాంసాద ఉచ్యతే। మత్స్యాదస్సర్వమాంసాదస్తస్మాన్మత్స్యాన్వివర్జయేత్॥ మాద్యతి మాంసజిహ్వక్షయా మత్స్యః। మదీహార్థగ్లసంయోః॥ పాఠీనరోహితావాద్యౌ నియుక్తౌ హవ్యకవ్యయోః। రాజీవాన్సింహతుండాంశ్చ సశల్కాంశ్చైవ సర్వశః॥ పాఠీనపృష్ఠమున్నమ ఇతితి పాఠీనః। భక్ష్యతయా శాస్త్రే పఠ్యత ఇతి వా పాఠీనః। పఠవ్యక్తాయాం వాచి। మత్స్యానాం కవచప్రాయాస్థూలాత్వక్శకలః తద్యోగాచ్ఛకల్కీ। రాజీః పంక్తిరస్యాస్తీతి రాజీవః। పద్మవర్ణో వా రాజీవః। రోహితత్వాద్రోహితః॥ నభక్షయేదేకచరానజ్ఞాతాంశ్చ మృగద్విజాన్। భక్ష్యేష్వపి సముద్దిష్టాన్సర్వాన్పంచనఖాంస్తథా। శ్వావిధం శల్యకం గోధాం ఖడ్గకూర్మశశాం

స్తథా। భక్ష్యాన్పంచనఖేష్వాహు రనుష్ట్రాంశ్చైకతోదతఇతి మనుః॥ యేషా
మ్యా॥ ఆమం మాంసం యేభక్షయంతి తేక్రవ్యాదాస్తాన్సర్వాన్గృధ్రాదీన్పక్షి
ణోవర్జయేత్। తథాగ్రామవాసినశ్చ పక్షిణః పారావతాదీన్॥ తథాచ శ్రు
తౌ॥ కేచిదేకశఫాభక్ష్యత్వేన నిర్దిష్టాః। తథాచోష్ట్రాదాడబమాలభేత తస్యచ
మాంసమశ్నీయాదితి॥ కేచిద్వ్యాపిద్దా రాసభాదయస్తేషాం మాంసంపరివర్జ
యేత్। యేపియజ్ఞాంగత్వేన విహితాస్తేషామపి యజ్ఞఏవ మాంసభక్షణం న
సర్వదా। టిట్టిభాఖ్యంచ పక్షిణం వర్జయేత్। కలవింకం చటకం తస్యగ్రామా
రణ్యోభయవాసినఏవ నిషేధః। అరణ్యస్యాప్యభక్ష్యత్వార్థం జాతిశబ్దేన ని
షేధః। ప్లవాఖ్యం పక్షిణం తథా। హంస చక్రవాక గ్రామకుక్కుట సార
స రజ్జువాల దాత్యూహ శుక శారికాఖ్యా న్పక్షిణో వర్జయేత్। వక్ష్యమా
ణ జాలపాద నిషేధేనైవ హంస చక్రవాకయోరపి నిషేధసిద్ధౌ పృథఙ్నిషే
ధోస్యైషా మాపది జాలపాదానాం వికల్పార్థః। సచ వ్యవస్థితో విజ్ఞేయః।
ఆపది భక్ష్యో నత్వనాపది ఇచ్ఛావికల్పస్య రాగతఏవ ప్రాప్తేః। గ్రామకు
క్కుటేతు గ్రామగ్రహణ మారణ్యకుక్కుటాద్యనుజ్ఞానార్థం। నత్వేతద్వ్యతి
రిక్త గ్రామవాసివికల్పార్థం। ఆపదర్థే గతప్రయోజనం భవతి। వాక్యాంత
రగతవిశేషావధారణపరత్వస్యాన్యాయత్వాత్।ప్రతుదానితు।ప్రతుదాంశ్చం
చ్వాక్షిప్యయేభక్షయంతి దార్వ్యాఘాటాదీన్ జాలపాదానీతి।జాలాకారపాదా
న్శరారిప్రభృతీన్। కోయష్ట్యాఖ్యం పక్షిణం నఖవిష్కిరాన్నఖైర్వికీర్య యేభ
క్షయంతి తానభ్యనుజ్ఞాతారణ్యకుక్కుటాదివ్యతిరిక్తాన్ శ్యేనాదీన్। తథానిమ
జ్య యేమత్స్యాన్ ఖాదంతి తాన్మద్గుప్రభృతీన్। సూనామారణస్థానం తత్ర
స్థితం యన్మాంసం భక్ష్యమపి వల్లూరం శుష్కమాంసం ఏతాని వర్జయేత్॥ బ
కంచైవేతి। బకబలాకా ద్రోణకాక ఖంజనాన్ తథా మత్స్యాదాన్పక్షివ్యతిరి
క్తాన్నక్రాదీన్విడ్వరాహాంశ్చ విడితివిశేషణ మారణ్యసూకరాద్యనుజ్ఞానార్థం।
మత్స్యాంశ్చ సర్వాన్వర్జయేత్॥ మత్స్యభక్షణనిందామాహ॥ యో యస్యేతి॥
యోయదీయంమాంసంఖాదతి సతన్మాంసాదః। ఏవం పరముపదిశ్యతే। యథా
మార్జారో మూషికాదః మత్స్యాదః పున స్సర్వమాంసభక్షకత్వేన వ్యపదే
ష్టుంయోగ్యః తస్మాన్మత్స్యాన్నఖాదేత్॥ ఇదానీంభక్ష్యమత్స్యానాహ॥ పాఠీ
నరోహితావితి। పాఠీనరోహితౌ మత్స్యభేదౌ భక్షణీయౌ హవ్యకవ్యయోర్ని
యుక్తావితి సమస్తవక్ష్యమాణభక్షణనిషిద్ధోపలక్షణార్థం। తేనప్రాణాత్యయా
దావదోషః। తథా రాజీవాఖ్యాన్సింహతుండాంశ్చ సశల్కాంశ్చ సర్వాన్వక్ష్య
మాణలక్షణోపేతానద్యాత్॥ మేధాతిథి గోవిందరాజౌతు। పాఠీనరోహితౌ

ద్దైవపిత్రాదికర్మణి నియుక్తా వేవాదనీయా। నహ్యన్యథా। రాజీవసింహతుండస శల్కామత్స్యాస్తు హార్యకవ్యాఖ్యా మన్యత్రాపి భక్షణీయా ఇత్యాచక్షతుః॥ న తన్మనోహరం। పాఠీనరోహితౌ శ్రాద్ధనియుక్తౌ శ్రాద్ధభోక్త్రైవ భక్షణీయౌ। నతు శ్రాద్ధకర్త్రాపి। రాజీవాదయో హవ్యకవ్యఖ్యా మన్యత్రాపి భక్ష్యా ఇత్యస్యాప్రమాణత్వాత్। మన్వంతరైశ్చ రోహిత పాఠీన రాజీవానాం తుల్యత్వేనాభిధానాత్॥ తథాచ శంఖః॥ రాజీవాస్సింహతుండాశ్చ సశల్కాశ్చ తథైవచ। పాఠీనరోహితౌ చాపి భక్ష్యామత్స్యేషు కీర్తితాః॥ యాజ్ఞవల్క్యః॥ భక్ష్యాః పంచనఖా శ్వావిద్గోధాః కచ్ఛపశల్యకాః। శశశ్చ మత్స్యేష్వపితు సింహతుండకరోహితాః। తథా పాఠీన రాజీవ సశల్కాశ్చ ద్విజాతిభిః॥ హారీతః॥ సశల్కాస్మత్స్యాన్న్యాయోపపన్నాన్భక్షయేదితి॥ ఏవంచ। భోక్త్రైవాద్యౌ నకర్త్రాపి శ్రాద్ధే పాఠీనరోహితౌ। రాజీవాద్యాస్తథా నేతి వ్యాఖ్యానమునిసమ్మతా॥ రాజీవాద్యాః నిత్యభోజనే శ్రాద్ధభోజనేచ భక్ష్యా ఇతి మాధవః॥ నభక్షయేదితి। ఏకాకినః ప్రాయేణచరంతి సర్పాదయః తాననేకచరాంస్తథా ఉక్తభిన్నానపి నామజాతి భేదేనావధార్య విభాగతశ్చ మృగపక్షిణో న్యజ్ఞాయంతే తాన్ప్యత్యేష్వపి సముద్దిష్టానితి సామాన్యవిశేషనిషేధాభావేనభక్ష్యపక్షినిషిద్ధాన్పక్ష్యేష్వేవ సముద్దిష్టాంశ్చ తథా సర్వాన్పంచనఖాన్వానరాదీన్నభక్షయేత్॥ అత్ర ప్రతిప్రసవమాహ॥ శ్వావిదమితి శ్వావిధం సేధాఖ్యం పక్షిభేదకం శల్యకం తత్సదృశం। స్థూలలోమానం తథా గోధాగండక కచ్ఛపశశాన్పంచనఖేషు భక్ష్యాన్మన్వాదయః ప్రాహుః। తథా ఉష్ట్రవర్జితానేకతస్త్యోషితాన్। పంచనఖాశ్చ శల్యకశశశ్వావిద్గోధాఖడ్గకచ్ఛపా ఉభయతోదతకేశలోమైకశఫ కలవింక ప్లవ చక్రవాక హంసాః। కాకకంకగృధ్రశ్యేన జలజా రక్తపాద తుండా గ్రామ్యకుక్కుట సూకరా ధేన్వనడుహౌ చాపన్నదావసన్న వృథామాంసాని బక బలాక టిట్టిభమాంసాని తథా నక్తంచరా అభక్ష్యాః॥

ఇటుమీద భక్ష్యాభక్ష్యమృగపక్షిమాంసములను జెప్పుచున్నారము.

పాఠీనములు, రోహితములు, సింహమువంటిముఖముగలవి, పొలుసుగలవిగాక మిగిలినమత్స్యములలో దేనిదినినను త్రిరాత్రోపవాసమును జేయదగును. జలమందుబుట్టినయన్నిటిమాంసములున్ను గాడిదె, లొటిపిట, కాకము వీటిమాంసమును భక్షించిన చాంద్రాయణము జేయువలయును. జంతువేదో

తెలియుటకవకాశములేకుండ కటికవానివద్దనుండి తెచ్చినమాంసమున్న, మాంసమును తినుమృగపక్షిమాంసమున్ను భక్షించిన విప్రుడు కృచ్ఛ్రమును జేయవలయును. పిచ్చిక, నీటికోడి, చక్రవాకము, తెల్లనిచాలనేపక్షి, హంసము, సారసము, భరతపక్షి, నల్లనిమెడగలిగినకోళ్లను, చిలుక, కొంగ, బెగ్గోల్లి, కోకిల, కాటుకపక్షి వీటిమాంసభక్షణము చేసిన మూడుదినములుపవసింపవలయును. ఒకడెక్కయును క్రిందను మీదను దంతములుంగలుగువాటిని దినినను నిదియె ప్రాయశ్చిత్తము.

క్రౌంచ. కపింజలపక్షి, లావుకపిట్ట, పూరేడుపిట్ట, నెమలిపిట్టయును దప్ప మిగిలినపక్షులమాంసమును భక్షించిన యొకదినముపవాసమును జేయుమనిస్మృత్యర్థము. మాంసమునుభక్షించుపక్షులన్నిటిని, గ్రామమందుండువాటిని, భక్ష్యములలో జెప్పబడనివాటిని, యొకడెక్కగలవాటిని, తీతువపిట్టను తినరాదు. పూర్వోక్తకలవింకాదులను, ముక్కునబొడుచుకొనితినునవియును, వ్రేళ్ల మధ్యనంటు చర్మములుగల బాతులుమొదలగునవియును, గోళ్లచేదువ్వి మేయునవియును, నీటమునిగిమత్స్యములను భక్షించునవియును, కటికవానిదగ్గి మాంసమును, ఎండబెట్టినమాంసమును, కొంగను, బెగ్గురును, మాలకాకిని, ఎట్రింటెను, మత్స్యములనుభక్షించుపక్షులను, ఊరబందిని, ముందు జెప్పబడునవి గాక శేషించినమత్స్యములను వర్జింపవలయును. ఏజంతువుమాంసమునేజంతువు దినునో దానిని దినువాడాజంతువుదినెడు మాంసమునుగూడ దిను నట్లు గాన మత్స్యమెల్ల మాంసములను దిను నందువలన మత్స్యములను వర్జింపవలయును. మత్స్యములలో పాఠీనరోహితములు హవ్యకవ్యములందు నియుక్తులకు భక్షణయోగ్యములని ముందుగ జెప్పబడె నటువలెనే రాజీవములను, సింహతుండమువంటిముఖముగలవాటిని, పొలుసుగలవాటిని భక్షించదగును. నిత్యభోజనమునందును, శ్రాద్ధభోజనమందును రాజీవాదులను భక్షింపవచ్చునని మాధవాచార్యులనిరి.

పుష్టమైనపృష్ఠములుకలదిలేక శాస్త్రములందుభక్ష్యమనిఖరించబడునది పాఠీనము. పఠధాతువు వ్యక్తవచనమందు వర్తించును. శరీరమందు కవచమువలె బలిసిన చర్మము పొలుసడిగలది సశల్కము. రాజీయన బంక్తి యదిగలది రాజీవము. లేక పద్మవర్ణముకలదియును. ఎఱ్ఱనిరంగుగలది రోహితము. ఏకాకిగా సంచరించుదానిని సామాన్యవిశేషనిషేధములేకుండ భక్ష్యములలో జెప్పబడిన నజ్ఞాతమృగపక్షులను వానరాదిపంచనఖములను భక్షించరాదు.

పంచనఖములయం దాలుగు, ఏదుబంది, ఉడుము, తాబేలు, చెవులపిల్లి ఈ యైదును, గొందరిమతముచే ఖడ్గమృగమును భక్షించదగుగాని పంచనఖములన్నియు నుభక్షించతగదు. ఏకదంతపంక్తి గలవాటినుష్ట్రములను భక్షించతగదు. పచ్చిమాంసమును దిను గృధ్రములు మొదలగునవి క్రవ్యాదములు. గ్రామమందుండు పావురము మొదలగునవి నిషిద్ధములు. వేదమందొంటిడెక్కలుగు లొటిపిట, గుఱ్ఱము మొదలగునవి యజ్ఞీయములుగా జెప్పబడుటవలన భక్ష్యములని గొందరందురు. ఏయజ్ఞమం దేదిపశువో దానిమాంస మాయజ్ఞమందుగాని సర్వదా భక్ష్యముగాదు. పిచ్చిక గ్రామ్య మారణ్యము రెండువిధములివి నిషేధము. జాలపాదశబ్దముచే హంసచక్రవాకములకు నిషేధము సిద్ధముగుచుండ మరల హంసచక్రములని జెప్పుట వీటికంటె నితరములగు జాలపాదములనొకప్పుడాపదయందు భక్షించదగునని వైకల్ప్యముకొరకీ యవస్థాపదయందునేగాని యనాపదయందునగాదు. గ్రామకుక్కుటమును నిషేధించుటవలన యరణ్యకుక్కుటము భక్ష్యమని దెలియవలెను. గ్రామ్యములగు పక్షులు మొదలగునన్నిటికని నిషేధమేను. కాళ్లచే దువ్వుకొని పొడుచుకొని దినువాటిలో ననుజ్ఞాతారణ్యకుక్కుటము నెమలి మొదలగునవిదప్ప నన్నిటికిని నిషేధము. సౌనమనగా కటికవానింటనున్నది. భక్ష్యమైన నట్టిమాంసము వర్జించదగును. అభక్ష్యమాంసమందులో కలుపుచున్నాడని నిషేధము. వల్లూరమనగా యెండినమాంస మది తినదగదనుట దీనియందు క్రిములు పుట్టియుండునని బక, బలాక, ద్రోణకాక, ఖంజన, జాలపాదాదుల, నక్రాదులను, విడ్వరాహాదులను భక్షించదగదనుట హేయమాంస క్రిమిమలాదులనివి దినునుగాన వీటిని దినినవాడు క్రిమిమలాదికమును భక్షించినవాడగునని యును వచనమువలన నిషేధించబడెను. విడ్వరాహశబ్దములో విటు అనే శబ్దముచే నరణ్యవరాహమునుభక్షించదగుననుట.

అథ భక్షణయోగ్యమృగపక్షిమత్స్యమాంసగుణాన్వదామః॥

జాంగలంచ తథానూపం సాధారణమితి త్రిధా। మాంసమాహుర్భేదేన గురులాఘవభేదతః॥ సుస్వాదుపాకపలలం పలలం హారిణ్యా పిపాపహంస్యాన్మనసఃప్రియంచ। విబద్ధవిణ్మూత్రహరం సుగంధిపుష్టిప్రదం శీతలమామనంతి॥ ఐణేయం మధురంమాంసం కషాయం తిక్తతాన్వితం। విపాకే కటుకంచాపి వాతపైత్త్యకఫాపహం। కషాయమధురో రూక్షస్తృష్ణాపైత్త్యజ్వరాపహః। బద్ధకృద్రోచనంబల్యో శుక్లరక్తవివర్ధనః॥ రూక్షానిలోదరవికారజగు

ల్మ్రాగనాశం కరోతి చ పునః కటుకో విపాకే। గ్రాహీ కషాయమధురః కఫపై
త్త్యహర్తా శీతశ్చ నో బలకరో వితనోతి వహ్నిం॥ ఆజం స్యాత్పలలం సమీరణ
హరం దుర్నామనిర్నాశనం పైత్త్యఘ్నం కఫశోషణం వితనుతే కాయాగ్నిసం
దీపనం। హృద్యం గుల్మహరం కషాయమధురం శ్వాసంచ కాసం జయేచ్ఛూలా
ధ్మానబహూదరాదిషు హితం కార్తివ్యవస్థాజితం॥ బలదం బృంహణం వృష్యం
శ్రమఘ్నమనిలాపహం। వన్యవారాహపిశితముష్ణం గురురుచిప్రదం॥ మేదస్థౌ
ల్యం మూత్రలం స్వాదుయుక్తం పైత్త్యంహన్యాద్దివారాహమాంసం॥ వాతా
దిదోషత్రయనాశనం తౌ బలావహస్తిక్తకటుప్రదశ్చ। శోభాగ్నిమాంద్యజ్వ
రతీవ్రనాశస్సైవ్యస్సదా శ్వావిదతీవసౌఖ్యం॥ జాపకస్య తథామాంసం విపా
కే కటుకం తథా। క్రిమికుష్ఠహరం బల్యం వాతఘ్నం క్షయనాశనం॥ ఖడ్గమాం
సం కఫఘ్నంచ కషాయమనిలాపహం। పిత్ర్యం పవిత్రమాయుష్యం బద్ధమూ
త్రవిమోచనం॥ రుచిప్రదం పుష్టిసుఖావహంచ దీప్తాగ్నిశుక్లంచ కరోతి బల్యం।
గిరిప్రవర్త్యాఖికమాంసభక్షణం కరోతి పుంసాం గురుమేధబుద్ధిం॥ గోధా కషా
యమధురా విపాకే విషనాశనీ। వాతపైత్త్యప్రశమనీ శుక్లదా బలవర్ధనీ। సర్వ
రోగేషు పథ్యాచ నిశిదృష్ట్యావరోధహా॥ గోధా పూర్వవిరోధితాతిమధురా
లఘ్వీ విధత్తే శ్రమం వాయోః పైత్త్యవినాశనీ కఫహరా ధీపుష్టిసంవర్ధనీ। హృ
ద్యాసర్పవిషాదిసేవనతయా నిష్ఠా సదాసేవనే కైశ్చిత్సర్వవిరోధినీతి కథితా
సైషా విపాకేకటుః॥ అశ్వసీదేవతాప్రోక్తమితిప్రోక్తంమహర్షిభిః। మేధ్యంచ
మధురంస్నిగ్ధం కౌర్మ్యం పైత్త్యహరం గురు॥ దుష్టేన దుష్టస్య విషైస్తతస్య త
థాతిసారక్షయరోగిణాంచ। బాలస్యచైవాధికమేదురస్య మాంసంసదా తత్ప
రివర్జనీయం॥ పైత్త్యశ్లేష్మవికారేషు సరక్తేషు కపింజలః। మందవాతేషు పథ్యం
స్యాత్త్రైత్యేచ మధురంలఘుః। అక్షిరోగహరశ్చైవ యక్ష్మహా బలకృత్సదా।
నాతిపథ్యం కేకిమాంసం సపైత్త్యం కర్ణరోగకృత్। నభుంజీయాత్సదా ధీమా
న్వ్యాధికే కఫవాతనుత్॥ దూర్వాశ్యామలదీర్ఘకంధలసితశ్చూడాభిరామో మ
హాన్ నేత్రశ్రోత్రవయస్స్వరోదయకరో సామాన్యపథ్యం శిఖీ। హేమంతే శి
శిరే వసంతసమయే సేవ్యో విషాపహోర్యసౌ సోష్ణేసౌ ఘనకాలఘర్మశరదాం
ఘసేత్రిషు నేష్టః క్వచిత్॥ నాతిహృద్యో లఘుః పథ్యో బలోపచయవర్ధనః। స్ని
గ్ధోష్ణమధురో వృష్యో వాతహావర్తవస్మృతః॥ తిత్తిరస్తేష్వపివరో మేధాగ్ని
బలవర్ధనః। గ్రాహీపైత్త్యానిలహరస్సన్నిపాతహరః పరం॥ పరం సమస్తేషువ
దంతి తిత్తిరిం సరక్తతుండం శశివక్త్రభాసురం। మేధాగ్నిశుక్లాది బలాదికార
ణం త్రిదోషవైవర్ణ్యహరం విబంధనుత్॥ హృద్యో లఘుః కాననకుక్కుటస్యా

త్రైత్యాపహారీ మరుతాంనిహంతి। సరాగచిత్రో మధురో విపాకే గాత్రిమ్యా
త్తుకించిత్పరిభిన్నగాత్రః॥ లావుకః కషాయోమధురో లఘుశ్చాగ్నివివర్ధనః। విపా
కే కటుకః పథ్యో సన్నిపాతానిలేవరం॥ లావాశ్చతుర్ధా బలవర్ణవృత్తాః కో
ష్ఠాగ్నిదాస్స్వాదురసాః కషాయాః। ఛిందంతి దోషత్రితయప్రకోపం పథ్యా
మనోజ్ఞాః కటుకా విపాకే॥ నానావర్ణసమాయుక్తః కాంతః పారావత
స్స్మృతః। తన్మాంసం రక్తపిత్తఘ్నం కఫమేదోవివర్ధనం॥ కురవస్స్నిగ్ధమధురో
గురుశ్లేష్మవివర్ధనః। శ్వాసకాసహరశ్శీతః క్షయఘ్నోగిరివర్తకః। వాసపైత్య
జ్వరాన్హంతి రాజయోగ్యః ప్రకీర్తితః॥ శితాశిత ఇవాంగేషు గోనర్దో నీలతుం
డకః। వాతపిత్తహరో రుచ్యః కఫహా వహ్నిదీపనః॥ స్థూలస్సపిచ్ఛిలః కించిత్స
మీరణనిబర్హణః। గురుర్వృష్టికరో హృద్య స్స్వాదుక్ర స్నేహినీ శిఖీ॥ మత్స్యా
స్తు ద్వివిధాఃప్రోక్తా నాదేయాశ్చ సముద్రజాః। శంబూకాజలజామీనాఃపా
ఠీనాద్యాశ్చ సింధుజాః। రక్తపైత్యహరా స్స్నిగ్ధా మధురా వాతనాశనాః।
స్వాదుపాకాః కఫంకుర్యుర్యుష్ణవీర్యా భవంతిచ। లవణా మధురాః పాకే ర
సాస్స్వాదేవ మాత్రిశాః॥ కుష్ఠమేహక్రిమికరాః కించిద్వృష్యాస్సముద్రజాః।
మత్స్యాస్స్నిగ్ధాశ్చ వృష్యాశ్చ బహుదోషాఃప్రకీర్తితాః। లోహితప్రవరస్తే
షాం చిలిచీమత్స్యయోర్వరః॥ పాఠీనయుగ్మమపి దేహబలంప్రకుర్యాదామం
త్రిదోషమచిరేణ నిహంతి కృచ్ఛ్రం। యత్క్రింగిలో బలకరో వితనోతి వహ్నిం
మేహార్శసాంప్రశమనం జ్వరహారిరుచ్యః॥ శ్లేష్మలాస్సరసిసంభవా గురుస్స్వా
దువృష్యసరసామరుత్ప్రభాః। మాతలాశ్చ హసనప్రదాస్సదా స్నేహశు
క్రరుధిరప్రదాస్స్మృతాః॥ మహాహ్రదేషూద్భవిన స్స్వల్పహృద్యా మహాబ
లాః॥ నద్యోద్భవా స్తేసువృషా కఫఘ్నాః రూక్షా నిలఘ్నా గురుపైత్యకారిణః।
వృష్యాస్సదా నిర్ఝరగాస్తు మేధ్యా శ్చక్షుష్చిరాయుర్బలప్రదాశ్చ॥ వాపీ
జాతాస్సర్వరోగోద్భవాయ స్నిగ్ధావృష్యా మాత్రలా శ్లేష్మలాశ్చ। పాకే
చామ్లే పైత్యలాశ్చాగ్నిమాంద్యం కుష్ఠం కుర్యుర్గుల్మరోగప్రమాంద్యం॥

### భక్షణయోగ్య మృగపక్షిమాంస గుణములు.

మాంసము జాంగలమనియనూపమని సాధారణమనిమూడువిధములు. అందడవిమృగపక్ష్యాదిమాంసములు జాంగలములు- అనూపమనగాజలసంబంధము గలిగి జలప్రాంతసంచారినుగలవాటి మాంసము- సాధారణమన నన్నిచోటులయందుగు వాటిమాంసము. మాంసమొకటియైన గౌరవలాఘవభేదముచే గుణభేదముగలదు. దప్పిమాంసము పచనముజేసినది స్వాదు- విషహారము- మ

వోత్సాదకరము- మలమూత్రబంధహారి- సుగంధి పుష్టి- శీతలమును జేయును.

లేడిమాంసము, మధురము- యించుకచేదుతోగూడినవగరు- పాకమందు కటువు గలిగి వాతపైత్యకఫములనుహరించును. చెవులపిల్లి మాంసము వేడిచేతను వాతముచేతనుబుట్టినయుదరవికారములు గుల్మలను నశింపజేసి పాకమందు వర్రిగలిగి మలబద్ధకారియై వగరుతోగూడినమాధుర్యముగలదియై కఫపైత్యములను హరించి చలవను, బలమును, జఠరాగ్నిని జేయును.

మేకమాంసము వాతమును, దుర్నామకుష్ఠులను, పైత్య కఫములను, గుల్మశ్వాసశూలాధ్మాన వివిధోదరములను నశింపజేయును. కాఠిన్యము కలది వలెనుండి హృద్యమై జఠరాభివృద్ధిని జేసును. ఇది బహుపూజితము.

అడవిపందిమాంసము బలమును, వృద్ధిని, వీర్యవృద్ధిని, వేడిని, గురుత్వమును, రుచినిజేసి శ్రమను, వాతమును హరించును. మరియును క్రొవ్వును స్థౌల్యమును, మూత్రమును, స్వాదును జేసి క్షయరోగమును, పైత్యమును, మలబంధమును బోగొట్టును. ఆలుగుమాంసము త్రిదోషహరము- బలప్రదము- చేదును, వర్రియును గలది- శోభను, అగ్నిమాంద్యమును, తీవ్రజ్వరమును శాంతింపజేయును. సదా సేవించదగినది- సౌఖ్యమునుజేయును. ఏదుబందిమాంసము పాకమందు కటువై క్రిమి కుష్ఠవాత క్షయరోగములను హరించి బలమును జేయును. ఖడ్గమృగమాంసము వగరు- కఫమును, వాతమునుజేసి పవిత్రము- ఆయుష్కరము- పితృప్రీతికరము- మూత్రబంధవిమోచనము.

కొండగొఱ్ఱెయమాంసము రుచిని, పుష్టిని, సుఖమును, దీప్తాగ్నిని, శుక్లమును, బలమును, గురుత్వమును, మేధాబుద్ధులను జేసును.

ఉడుముమాంసము వగరుతోగూడిన మధురము- పాకమందు విషనాశనము- వాతపైత్యహరము- శుక్లబలవర్ధనము- సర్వరోగములందును పథ్యము- రేసీకటినిగొట్టును. ఉడుము జూడగా నసహ్యమైయుండును. మిక్కిలి మధురము- చులకన- శ్రమను జేయును. త్రిదోషములనుహరించును. బుద్ధిని, పుష్టిని జేసును. సర్వవిషములనుహరించేదగుటవలన హృద్యమై నిత్యసేవకుపయోగి. ఇది కొందరిచేతను సర్వరోగములకును విరోధియనియు పాకమందు కటువనియు జెప్పబడెనని ఋషులనినమాట. తాబేటిమాంసము పవిత్రము- మధురము- స్నిగ్ధము. పైత్యహరము- గురువు. కుష్ఠురోగి, విషహతుడు, అతిసారక్షయరోగులు, బాలుడు, మిక్కిలి క్రొవ్వుగలవాడు వీరిచేనీమాంసమువర్జింపవ

లయును. కపింజలమాంసము పైత్యశ్లేష్మరక్తవికారములందును మందవాతమందును పథ్యము- మధురము- లఘువు. నెమలిమాంసము నేత్రరోగములు రాజయక్ష్మను గొట్టును. బలమును జేయును. మిక్కిలి పథ్యముకాదు. పైత్య[illegible]క్తము- కర్ణరోగకారి. బుద్ధిమంతుడీమాంసమ్ము నెల్లప్పుడును దినరాదు. వర్షకాలమందు కఫవాతములను హరించును. దూర్వములభంగిని శ్యామలమై పొడవుగల కంఠముచే శిఖచే నేత్రములకును, శ్రోత్రములకును ప్రియమగు రూపమును, స్వరమునుగలుగు నీనెమలిసామాన్యపథ్యము. హేమంతశిశిరవసంతములందు సేవించినవిషహరమగును. వేడిగలుగును. దీనిని గ్రీష్మవర్షశరదృతువులందు భక్షించతగదు. పూరేడుపిట్టమాంసము విశేషహృద్యముగాక లఘువై పథ్యమై బలమును, వీర్యమును వృద్ధినొందించి స్నిగ్ధమై మధురమై వాతహరమైయుండును. వీటియందు కౌంజుపిట్ట శ్రేష్ఠము. బుద్ధిని, జఠరాగ్నిని, బలమును వృద్ధినొందించును. మలబంధకారి- పైత్యవాతసన్నిపాతహారి. ఎఱ్ఱనిముక్కు తెల్లనిముఖము గలుగునిది సమస్తపక్షులందును బ్రశస్తమైనది. మేధను, శుక్లమును, జఠరాగ్నిని వృద్ధిబొందించును. త్రిదోషమును వైవర్ణ్యమును బోగొట్టును. అడవికోడి హృద్యమై, లఘువై, పైత్యవాతహారియై, పాకమందు మధురమై, గ్రామ్యకుక్కుటముకంటె కొంచము చిన్నశరీరముగలిగి మెరువు రంగుపై చిత్రవర్ణముగలిగియుండును.

లావుకపిట్ట వగరు- మధురము- లఘువు- జఠరవృద్ధికరము- పాకమందు కటువు- సన్నిపాతవాతరోగములందు పథ్యము. లావుకపిట్టలు నాలుగువిధములు. బలమును, వర్ణమును జేసును. నానావర్ణములుగల పారువాపిట్టమాంసము రక్తపైత్యహరము- కఫమును, కొవ్వును జేయును. కురువపక్షిమాంసము స్నిగ్ధము- మధురము- గురువు- శ్లేష్మవర్ధనము- శ్వాసకాసక్షయహరము- శీతలము- ఇదిపర్వతమందుండుపిట్ట. గువ్వపిట్టమాంసము వాతపైత్యజ్వరహరము- రాజయోగ్యమనిజెప్పబడినది. పక్షిశరీరమందు తెల్లని నల్లని రంగుగలిగియుండును. ముక్కునల్లనైయుండును. నేలనమలిపిట్టమాంసము వాతపైత్యకఫహరము- రుచ్యము- జఠరదీపనము- ఇంచుకవాతమును గొట్టి గురుత్వమును, బుష్టినిజేసి హృద్యమై స్వాదైయుండును. మరియు నీపక్షి చిక్కనై స్థూలమైయుండును.

మత్స్యములు సముద్రమందుండునవియును నదులందుండునవియును రెండువిధములు. శంబూకము నదియందుబుట్టిన మీనపాఠీనాదులు రక్తపైత్యక్షమును హరించి స్నిగ్ధములై మధురములై వాతహరములై పాకమందు స్వా

రి, ధనియాలు వీటిచూర్ణము నిమ్మకాయపులుసును గలిపి యామునక్కలను ప ట్టించి నేయిలో వేచిన సుగంధము గలుగును. అప్పుడు చక్కగ పచనమైనదని తెలియవలయు నిది పూర్ణమనబడును. దీనిని పూర్ణముగనుంచి గోధూమపిండి పైనిపొదిగి మరల నేయియందునవేచిన శ్వంగాటకమాంస మనబడు నిది రుచి వృద్ధి బలగురుత్వ వీర్యవృద్ధులను జేసి త్రిదోషములను హరించును.

సిద్ధమాంసపురిసము రుచ్యము- శ్రమ శ్వాస క్షయవాతపై త్యహరము- బలహీనులకు తృప్తిని, జఠరవృద్ధిని జేయును. స్మృతిని తేజమును జేయును. జ్వరముచే క్షీణించినవారికి వక్షస్థలమున నరుకునొందినవారికి స్వరహీనముగల వారికి నేత్రశ్రోత్రబలమునుగోరువారికిని నిది ప్రశస్తము.

మేక మొదలగువాటిమాంసమును ఖండములనుగాగోసి యింగువ వేచి యగుసిన్నుగడగి యుల్లి పాయముక్కలు ముందుగా నేయిలోవేచి యామీ ద నందులో నామాంసమును మృద్వగ్నిని వేచి మసాలాలనుగలపి పక్వముగుని టి పిమ్మమున, రుచిని, బలమును జేయు నీమాంసమును శాకపాకములను జెప్పువారనేకరచనలు జేయుదురు. మాంసపచనమందుల్లిగలయుట సాత్వి కాతికాంతవిషయమని తెలియదగును.

మాంసపచనప్రకారములు జెప్పబడె నింకబహుప్రకారములు గలవు- గ్రంథవిస్తరభీతిచే నిచట వ్రాయలేదు.

అన్నమశితం త్రేధావిధీయతే। తస్య యస్థవిష్ఠో ధాతుస్తత్పురీషంభవతి। యోమధ్యమస్తన్మాంసం యోణిష్ఠస్తన్మనఇతి ఛాందోగ్యశ్రుతిః॥

పురుషుడు భుజించినయన్నమును జఠరమందలి కడుపులోనుండు దేహాగ్ని ముచే పచనమైనదియై మూడువిధములనుగా నేర్పరుపబడుచున్నది- ఆఅన్నము యొక్క స్థూలభాగముగలదో యది మలమగుచున్నది- ఆఅన్నముయొక్క మధ్యభాగమేదిగల దో యది రసము మొదలగునవి క్రమముగ నగుచు మాంసమగుచున్నది. సూక్ష్మముగు వి గిలినయన్నరసము నాడులయందు ప్రవేశించి వాగింద్రియము మొదలగు సర్వేంద్రియ బలము ను సంపాదించును. మనస్సుకు పుష్టినిజేసి మనస్సుద్వారా ఇంద్రియములు విషయములనొం ది ప్రారబ్ధకర్మానుభవమునొందునని శ్రుతి-

## పానకగుణాః

అథ పానకాన్ప్రవక్ష్యామః॥ జలేనశీతలేనైవ ఘోలితా శ్వేతశర్క రా। ఏలాలవంగకర్పూరమరీచైశ్చ సమన్వితా। శర్కరోదకమాఖ్యాత శ్శుక్ర లం శిశిరం పరం। బలంరుచ్యం లఘుస్వాదు వాతపిత్తాస్రనాశనం। మూర్ఛా ఛర్దితృషాదాహజ్వరశాంతికరంపరం॥

ఆమ్రమామ్రం జలస్విన్నం మర్దితం దండపాణినా । శీతాశీతాంబుసంయుక్తం కర్పూరమరిచాన్వితం। ప్రపానకమిదం శ్రేష్ఠం భీమసేనేననిర్మితం। సద్యోరుచికరం బల్యం శీఘ్రమింద్రియతర్పణం॥

అమ్లికాయాఃఫలంపక్వం మర్దితం వారిణావృతం । శర్కరామరిచోన్మిశ్రం లవంగేందుసువాసితం। అమ్లికాఫలసంభూతపానకం వాతనాశనం।పిత్తశ్లేష్మకరం కించిత్సురుచ్యం వహ్నిబోధకం॥

భాగైకం నింబుజంతోయం షడ్భాగం శర్కరోదకం। లవంగమరిచోన్మిశ్రం పానకం పానకోత్తమం॥ నింబూఫలభవంపాన మత్యమ్లం వాతనాశనం । వహ్నిదీప్తికరం రుచ్యం సమస్తాహారపాచనం॥ శిలాయాం సాధుసంపిష్టం ధాన్యకం వస్త్రగాలితం । శర్కరోదకసంయుక్తం కర్పూరాది సుసంస్కృతం। నవీనే మృణ్మయే పాత్రే స్థితం పిత్తహరం పరం॥

## పా న క గు ణ ము లు.

ఇటుమీద పానకములను జెప్పుచున్నాను. చల్లని నీరు వడపోసి యందు తెల్లని పంచదారయు నేలాలవంగకర్పూర మరీచిసహితముగ గలిపిన నిది శర్కరోదకము శుక్లకరము- బలకరము- శీతలము- విరేచనకారి- రుచ్యము- లఘువు- స్వాదు-వాతపిత్తహరము- మూర్ఛాతృష్ణాదాహజ్వర శాంతికరము.

పచ్చిమామిడికాయ నుదకములో నుడికించి కరిగిన సారి పంచదారతో చల్లనినీళ్లయందు గలిపి కర్పూరమరీచి యుక్తముగా చేసిన నిది ప్రపానక మనబడు భీమనిర్మితము శ్రేష్ఠమిది సద్యోరుచికరము- బల్యము- శీఘ్రముగ నింద్రియతృప్తిని జేయును.

చింతబొట్టలుడికించి నీళ్లలో గట్టిగా పిసికి వడపోసి పంచదార మిర్యమునుగలపి లవంగములు కర్పూరముచే వాసితముజేసిన నిది యమ్లికాఫలపానకము. వాతహరము- పైత్యశ్లేష్మకరము- ఇంచుకరుచ్యము- జఠరదీపకము.

ఒకవంతు నిమ్మపళ్లరసము ఆరువంతులు పంచదారపానకము లవంగమరీచిమిశ్రితమందు జేసిన నిది పానకోత్తమము- నింబూసంభవమగుటచే పులుసై వాతహరము- జఠరదీప్తికరము- రుచ్యము- సకలాహారపాచకము. రాతిమీద ధనియాలునూరి వడపోసి పంచదారపానకములో గర్పూరాదులచే సంస్కరించి కొత్తకుండలో బోసిన నది పైత్యహరము.

ఆపఃపీతాస్త్రేధావిధీయంతే తాసాం యస్థవిష్ఠోధాతుస్తన్మూత్రం భవతి యో మధ్యమస్తల్లోహితం యోఽణిష్ఠస్సప్రాణః ఇతి ఛాందోగ్యశ్రుతిః॥

పురుషునిచే పానముసర్చిన యుదకములు మూడు ప్రకారములగుచున్నవి. అందులో నేదిగొప్ప భాగము గలదో యది మూత్రమగుచున్నది. మధ్యభాగము రక్తమగుచున్నది. ఏది స్వల్పభాగమో యది ప్రాణములకు తృప్తిని జేయుచున్నది.

క్షీరగుణాః

అథక్షీరపరిశంసా॥ విదాహీన్యన్నపానాని యాని భుంక్తేహిమానవః। తద్విదాహప్రశాంత్యర్థం భోజనాంతే పయః పిబేత్ । సద్యశ్శుక్రకరం సాత్మ్యం సర్వకాలే శరీరిణాం । జీవనం బృంహణం బల్యం మేధ్యం వాజీకరంపరం।వయస్థాపకమాయుష్యం సంధికారిరసాయనం। విరేకవాంతివస్తీనాం తుల్యమోజోవివర్ధనం। జీర్ణజ్వరే మనోరోగే శోభమూర్ఛాభ్రమేషుచ । గ్రహణ్యాం పాండురోగేచ దాహేతృషిహృదామయే। శూలోదావర్తగుల్మేషువస్తిరోగేగుదాంకురే।రక్తపిత్తేతిసారేచయోనిరోగేశ్రమేక్లమే। గర్భస్రావేచసతతంహితంమునివరైస్స్మృతం॥ బాలవృద్ధక్షతక్షీణక్షుద్వ్యవాయకృశాశ్చయే। తేభ్యస్సదాతిశయితహితమేతదుదాహృతం॥ ఇతిపయస్సామాన్యగుణాః॥

అథ పయోవిశేషగుణాః॥ గవ్యంక్షీరం పథ్యమత్యంతరుచ్యం స్వాదుస్నిగ్ధం పిత్తవాతామయఘ్నం। కాంతిప్రజ్ఞాం బుద్ధిమేధాంగపుష్టిం ధత్తేస్పష్టం వీర్యవృద్ధిం విధత్తే॥ తథా॥ స్వాదుపాకరసం స్నిగ్ధమోజస్యం ధాతువర్ధనం। వాతపిత్తహరంవృష్యం శ్లేష్మలం గురుశీతలం। ప్రాయఃపయోత్రగవ్యంతు జీవనీయం రసాయనం। క్షతక్షీణహితంమేధ్యం బల్యంస్తన్యకరం సరం। శ్రమభ్రమమదాలక్ష్మీకాసశ్వాసాతితృట్క్షుధాం । జీర్ణజ్వరం మూత్రకృచ్ఛ్రం రక్తపిత్తంచ నాశయేత్॥ క్షీరంహితం శ్రేష్ఠరసాయనంచ క్షీరంవపుర్వర్ణబలాయుషంచ। క్షీరంహి చాక్షుష్యకరం నరాణాం క్షీరం కవోష్ణం జ్వరనాశనంచ॥ ఇతిసుషేణోక్తవర్ణసామాన్యేన గవ్యగుణాః॥

అథ వర్ణవిశేషగుణాః॥ గవాం సితానాం వాతఘ్నం కృష్ణానాం పిత్తనాశనం। కఫఘ్నం రక్తవర్ణానాం కపిలానాం త్రిదోషనుత్॥ గవాం వివిధవర్ణానాం వాతపిత్తహరం గురు । పయః కర్బూరవర్ణానాం ప్రాయః పీనసకారణం॥

అథావస్థావిశేషేణ గుణాన్వదామః॥ ఘృష్టిక్షీరంతువాతఘ్నం మధ్యమాయాస్తు పిత్తహృత్। ప్రవృద్ధాయాశ్చ కఫహృదవత్సాయా రసాయనం॥ ఏవమారోగ్యకరమపి దేవపిత్రాదికార్యేష్వయోగ్యమితి మనురాహ తద్వచనమగ్రే దర్శయిష్యామః ప్రసూతిదోషాద్యత్క్షీరం పాకే విగ్రంధితంభవేత్। తత్పీయూషమితిఖ్యాతం సర్వదోషకరం గురు। విభేదీమూత్రలం వృష్యం మధు

తి రక్తామయంకురుతే॥ మధురంత్రిదోషశమనం క్షీరం మధ్యప్రసూతానాం। లవణం మధురం క్షీరం విదాహజనకం చిరప్రసూతానాం॥ గుణహీనం నిస్సారం క్షీరం ప్రథమప్రసూతానాం। మధ్యేవయసాం రసాయన ముక్తమిదం దుర్బలంతు వృద్ధానాం॥ తాసాం మాసత్రయాదూర్ధ్వం గుర్విణీనాంచ యత్పయః। తదాహి లవణం క్షీరం మధురం పిత్తదోషకృత్॥ స్యాన్నిర్జలం శ్రుతం యద్ధి త్రిషడష్టావశేషితం। యథాశ్రుతం సమసారం గురుబల్యతమంపయః। అర్ధావశిష్టం పానంస్యాత్త్రిభాగం లేహకంభవేత్। షడ్భాగం పుష్టికామేతి శర్కరాస్యాదథాష్టమే। తదేవాతిశ్రుతంసర్వంగురుబృంహణముచ్యతే। దర్వ్యాంతరాపరోధత్వాత్సరత్వాచ్చానుపానతః। క్షీరం భుక్త్వోత్తరం పథ్యం దీపనం మలశోధనం। రక్తపిత్తానిలఛర్దిమూర్ఛాహిక్కాపహారిచ। ఖండేనసహితందుగ్ధం కఫకృత్పవనాపహం। శితాశితోపలాయుక్తం శుక్రలం త్రిమలాపహం। సగుడం మూత్రకృఛ్రఘ్నంపిత్తశ్లేష్మకరంపరం॥ తథా॥ క్షీరం సాత్మ్యాజ్జీవనంజన్మదంస్యాత్తద్ధారోష్ణంగవ్యమాయుష్యముష్ణం। ప్రాతస్సాయంగ్రామ్యధర్మావసానే భుక్తైఃపశ్చాదాత్మ్యసామ్యంకరోతి॥ వర్జయిత్వా స్త్రియస్స్తన్యమామమేవహి తద్ధితం। ధారోష్ణమమృతంక్షీరం విపరీతమతోచ్యతే। అనిష్టగంధమల్పంచ వివర్ణం విరసంచయత్। వర్జ్యంసలవణం క్షీరం యచ్చవిగ్రథితంభవేత్। రాత్రౌక్షీరం నభుంజీయాద్యదిభుంజీతనస్వపేత్। యదిస్వపేత్తదాయుస్తస్మాత్క్షీరం దివాశ్రుతం॥ రాత్రౌక్షీరంనభుంజీయాదితియత్ తత్ప్రాతఃప్రభృత్యుషితక్షీరస్యైవ నతుసాయంతనదుగ్ధస్య॥ ధారోష్ణమమృతంపథ్యం ధారాశీతం త్రిదోషకృత్। శృతశీతం త్రిదోషఘ్నం శృతోష్ణంకఫపిత్తజిత్॥ అజావికం పథ్యతమం శృతోష్ణ మాజంపయోవా శృతశీతమేవ। ధారాసుశీతం మహిషం పయశ్చ ధారోష్ణమేతద్రుచికృచ్చగవ్యం॥ పిత్తఘ్నం మాహిషం క్షీరం వాతఘ్నం చావికంపయః। వాతపిత్తహరంగవ్యం త్రిదోషఘ్నమజాపయః॥ యద్యప్యావికంక్షీరం నింద్యమేవ తథాప్యజాక్షీరమిశ్రంచేద్గ్రాహ్యమిత్యుక్తం॥ ప్రాయః ప్రాభాతికం క్షీరం గురువిష్టంభిశీతలం। రాత్రేస్సౌమ్యగుణత్వాచ్చ వ్యాయామవిరహాత్తథా। దివాకరాభితప్తానాం వ్యాయామానిలసేవినాం। వాతపిత్తహరంచైవ చక్షుష్యం చాపరాహ్ణికం। ముహూర్తపంచకాదూర్ధ్వం క్షీరంభజతివిక్రియాం। తదేవ ద్విగుణేకాలే విషవద్ధంతిమానవం। ఏషాం నసాత్మ్యం క్షీరేణ పీతంచాధ్మానకారకం। తేషామర్ధజలేదత్వా నాగరంపిప్పలీయుతం। ఆవర్తయేత్క్షీరశేషం తత్పీత్వాసుఖమేధతే॥ స్నిగ్ధత్వాద్గౌరవాజ్జాడ్యాత్త్రికాలం నపిబేత్పయః। సమాగ్నిరపి కించాన్యో మందాగ్నిర్విషమేపివా। త

ష్ణాగ్ని నాశువాతఘ్నం ద్వికాలమపిమాహిషం। తస్యధారోష్ణ చేదగ్నిర్యదా తే న నసించతి॥ అథౌరస్యవిశేషగుణాః॥ తత్ర మాహిషస్య॥ మాహిషం బలవ ర్ణౌజో నిద్రాశుక్రబలప్రదం। తీక్ష్ణాగ్ని శమనంస్వాదు రసపాకేచవృష్టిదం।వ్యా యామశ్రాంత దేహస్య శ్రమఘ్నమనిలాపహం। ఛాగమస్యాపివృద్ధస్య స్త్రీ షుకామప్రదాయకం। బలినస్తరుణస్యాపి విశేషాచ్ఛాగ నాయకం॥ అథాజ స్య॥ అజానామల్పకాయత్వాత్కటుతిక్తని షేవణాత్।నాత్యంబు పానాద్వ్యా యామాత్సర్వవ్యాధిహరం తథా॥ అజమగ్నిబలకృత్తు కాసశ్వాసహృత్కఫ హారం పరమంతత్। రక్తపిత్తహారమప్యతిసారే రక్తజేచ కథితంహితమేతత్॥ గోదుగ్ధత స్స్యాద్దధికం గుణేషు క్షీణేషు నీహోషుచపథ్యముక్తం। స్థూలాజదు గ్ధం కథితం పయోభ్యస్సూక్ష్మాజదుగ్ధం త్వహ కించిదుక్తం॥ వర్జ యేదమ్లలవణ యుతం కస్తూరాదిత్యవ్యతః॥ ఇదంతుదృష్టఫలం అతఏవ లవణయుతం క్షీరం గో మాంససమమితిధర్మశాస్త్రేషూక్తం॥

క్షీ ర గు ణ ము లు.

ఇటు మైని క్షీరప్రశంసను జేసెదను. అన్నపానాదులేవి గర్భకాపకర ములయ్యుండునో వాటికొరకు భోజనాంతమందు పాలును బుచ్చికొన వలయును. పాలు పుచ్చికొనినపుడె శుక్లవృద్ధిని సమధాతువును జేయును. మరి యును పాలు జీవనహేతువు- వృద్ధికారము- బల్యము- పవిత్రము- పుష్టికరము- వయస్థాపకము- ఆయుష్యకరము- సంధానకారి- విరేచన వమనోపవాసముల తో గర్భదోషశోధనము తేజోవర్ధకము- జీర్ణజ్వర మనోవ్యథా శోభమూర్ఛా భ్రమ గ్రహణీ పాండు దాహ పిపాసా హృద్రోగ శూల దావర్త గుల్మ వ స్తిరోగ మూలశంకా రక్తపైత్యాతిసారి యోనిరోగ శ్రమ క్లమ గర్భస్రావ ములయందును, బాల వృద్ధ క్షత క్షీణ క్షుద్వ్యథాతిక్షీణులగువారికిని మిక్కిలి హితవును జేయునని మునులచే జెప్పబడె నివి క్షీరసామాన్యగుణములు.

ఇటుమీద క్షీరవిశేషగుణములను జెప్పుచున్నారము. ఆవుపాలు ప థ్యము- మిక్కిలిరుచ్యము- స్వాదు మెరుగను దెచ్చును. వాతపైత్యహారము- కాం తిప్రజ్ఞా మేధాబుద్ధిపుష్టివీర్యవృద్ధులను జేయును. మరియును కాగినవి స్వాదు మిసిమిగలిగి తేజము ధాతువృద్ధి గురుత్వమును కఫమునుజేసి నరుకులుగలవారి కిని క్షీణదేహులకును హితవు. శ్రమను భ్రమను మదము నలక్ష్మిని కాసశ్వాస పిపాసాక్షుద్మూత్రకృఛ్రజీర్ణ రక్తపైత్యములను హరించును. ఇంచుక వేడిగలి

గ పాలుబుచ్చికొనిన నేత్రహితమై జీర్ణజ్వరమును హరించునని సుషేణునిచే జెప్పబడినది. శ్వేతపీతాదిసర్వవర్ణసాధారణముగ జెప్పబడెను.

ఇటుపైని వర్ణవిశేషమును జెప్పుచున్నారము. నల్లనిగోవు పాలు వాతహరము. తెల్లనిగోవుపాలు పైత్యహరము. ఎఱ్ఱనిగోవుపాలు కఫహరము. కపిలగోవుపాలు త్రిదోషహరము. నానావర్ణములుగల గోవుపాలు తరుచుగ పీనసము జేయును.

ఈపైని వయోవిశేషముచేతను గుణవిశేషమును జెప్పుచున్నారము.

మొదటియీతపాలు వాతహరము- మధ్యవయస్సులోనున్న గోవుపాలు పైత్యహరము- ముసలావుపాలు కఫహరము- వత్సలేనిదానిపాలు రసాయనమైనను దేవపిత్రాదికార్యములయందు యోగ్యముని మనువచనముచే యుందగపరచెదను. ప్రసూతిదోషముచే పాలు గాచిన గట్టిపడునది పియ్యూషమనబడె సకలదోషములను, గురుత్వమును, విరేచనమును, మూత్రవృద్ధిని, జఠరమాంద్యమును జేసి మధురమయ్యుండును- గాని నిది పుచ్చికొనదగదిందరు మనువచనము- ఈనినపదినాళ్లలోని గోక్షీరమును లొట్టపిటపాలును గుఱ్ఱముమొదలగు ఒంటిడెక్కగలనాటిపాలును గొఱ్ఱెయపాలును పొర్లుచున్నగోవుపాలను వత్సలేనిగోవుపాలును నపేయములని- పొర్లుచున్నగోవు ఋతుమతియగుటచే దానిపాలు నింద్యమని హారీతుడు.

ఏడవదినముమొదలు మాసపర్యంతము నాపాలు నవి విరిగిననీళ్లును మోరటమందురవి వేడిని గురుత్వమును జేయును. పక్వమైనవిరుగుపాలముద్ద కిలాటకమనిపించుకొనును. పచ్చిపాలు విరిగినముద్ద క్షీరశాకమనబడును. పెరుగు చేనైనను పాలు తోడుబెట్టి యది గట్టిబడిన మీద మంచిబట్టను గట్టిన ద్రవము పోవునది తక్రపిండమనబడును. పైనివ్రాసిన పియ్యూష కిలాటక క్షీరశాక తక్రపిండములు వీర్యమును వృద్ధిని గురుత్వమును శ్లేష్మమును జేసి హృద్యములై వాతపైత్యములనుహరించును. మంచిజఠరము గలవారికిని నిద్రలేనివారికని వ్యాయామాసక్తులకు నివి మిక్కిలి పూజితములు. అనుకూలముగ గాచినపాలు ధాతువృద్ధిని గురుత్వము నామమును జేయును. మిగులగాచినవి విశేషగురుత్వము జేయును. పితికిన వేడి చల్లారనిపాలమృతము- పాలకు నాలవభాగము నీళ్లు గలపి యవిహరించునట్టుగ గాచిన పాలుత్తమము- సకలరోగహరము- బలపుష్టివీర్యప్రదము. పాలలో సగమువంతు నీళ్లుగలపి పాలుమిగులునట్లు గాచినం క్షీరపాకమునకిది ముఖ్యవిధి. ఈక్షీరము పూర్వాహ్ణమందు ధాతువృద్ధి నగ్ని

వృద్ధిని జేయును. మధ్యాహ్నమందు బలకరము- రతికరము- మూత్రకృచ్ఛ్రాది శమనము. బాల్యమందు జఠరవర్ధనము. యౌవనమందు బలకరము. వార్ధకమందు వీర్యకరము. రాత్రియందనేకదోషశమనము గాన సర్వదా క్షీరము సేవ్యము. పూర్వాహ్ణమందు గోక్షీరము నపరాహ్ణమందు గేదెపాలును బుచ్చుకొనవలయును. క్షీరము పంచదారతోగలపి జఠరాగ్నిగుణముగ బుచ్చుకొనదగును. క్షీరమారుగడియలలోపున గాచకుండిన వికృతినొందును నాలస్యముగ పాలుండిన జఠరవికారాదిదోషములను గలిగించును. రాత్రి నిలవయున్న పాలు విషతుల్యమగును. కఫములేని జీర్ణజ్వరము క్షీణత్వము గల [illegible]రికి క్షీరమమృతోపమము. తరుణజ్వరితునకిది విషమువలెదోషించును. కాచి చల్లార్చిన పాలు పైత్యహరము. వేడిపాలు కఫహరము. పచ్చిపాలు మలబద్ధాదిదోషములను జేయును. ధారోష్ణమమృతమని దీని విశేషమును పైని వ్రాసియుంటిమి. మతాంతరముచే ధారోష్ణగోక్షీరము పాండు కామిలా కరిపాద దాహ దుష్టరక్త కృశత్వాతికృచ్ఛ్రాదులను శమింపచేయునని- పచ్చిపాలెన్నడును బుచ్చుకొనరాదు- బుచ్చుకొనిన లవణ పిష్ట కషాయ ముద్గ కోశాతకి కందఫలాదులతో గలపి పుచ్చుకొనగూడదు. ఆవు మేక వీటి మునటియీతపాలు వేడి, పైత్యమును, దాహమును, రక్తరోగమును జేయును. మధ్యవయసుగలదాని పాలు మధురము త్రిదోషహరము. చిరకాలమునకీనిన దాని పాలు చప్పతోగలసి మాధుర్యము గలిగ [illegible]హము నును బుట్టించును. తొలిచూలి దాని పాలు నిస్సారము- గుణహీనము. మధ్యమవయస్సుగలదానిపాలు రసాయనము. వృద్ధగోవుపాలు దుర్బలము [illegible] మూడునెలలైన దాని పాలును, చూలుదాల్చిన దానిపాలు నుప్పనై మధురమై పైత్యదోషమును జేయును. నిర్జలముగ యుకుండ మూడు నాలు గవనిమిషభాగము శేషించునటుల గాచిన క్షీరము సారమై గురువై బల్యతమమై యుండును. అర్ధావశిష్టమును పానమనియు, త్రిభాగావశేషమును లేహ్యకమనియు, షడ్భాగావశిష్టము పుష్టికామమనియు, యష్టభాగావశిష్టము శర్కరాఖ్యమనియు చెప్పబడు నిటుల మిగులగాచిన క్షీరము గురుత్వమును వృద్ధిని జేయును. ద్రవ్యాంతరముతో విరోధములేకుండును. కావున భోజనానంతరమున క్షీరపానము జేయవలయును. పథ్యము-దీపనము-మలశోధనము-రక్తపిత్త వాతచ్ఛర్దనమూర్ఛాహిక్కాపహరము. చక్కెరపంచదారతోగలసిన పాలు వాతహరము- కఫకరము- నైనా పటికపంచదారలతోగూడినపాలు శుక్లవృద్ధిని జేసి దోషత్రయమును హరించును. బెల్లముతోగూడినది మూత్రకృచ్ఛ్రమును హరించి పైత్యశ్లేష్మమును జేయును. క్షీరము సాక్షాజ్జీవనము సంతానకారణము- ధారోష్ణగ

వ్య మూయుష్కరము ఉష్ణము- ప్రాతస్స్నాయంకాలములందును మైథునానంతర భోజనానంతరములందును పింగుల గుణమును జేయును. స్త్రీస్తన్యమువినా మిగిలినవాటిపాలన్నియును ధారోష్ణమైన నమృతప్రాయమగును- గాన నదితప్త పాలామమును జేయును. మరియు నుప్పుగలిసినదియు ననిష్టగంధము వైవర్ణ్యము రుచిలేకుండుట తోడుకుంపుటయును గలిగినపాలు వర్జించదగును.

రాత్రియందు క్షీరమును బుచ్చికొనదగదటులానర్చిన నిద్రించరాదు. నిద్రించిన నాయువు క్షయమగునను నిషేధము పగటిపాలు రాత్రి బుచ్చికొనినగాని రాత్రిపితికిన పాలకుకాదు. కావున నే ధారోష్ణమమృతమని ధారాశీతము త్రిదోషకరమనియును జెప్పబడెను. కాచిచల్లార్చినపాలు త్రిదోషహరము. ఇంచుక వేడియు శీతముగల పాలు కఫపైత్యహరము. మేక గొఱ్ఱెల పాలు వేడిచల్లారకుండిన పథ్యము. కేవలము మేకపాలు వేడిచల్లారినను పథ్యమే. పితికిన వేడిచల్లారిన మహిషీక్షీరము ధారోష్ణమగుగోక్షీరమును శ్రేష్ఠము. గేదెపాలు పైత్యహరము. గొఱ్ఱెపాలు వాతహరము. గోక్షీరము వాతపైత్యహరము. మేకపాలు త్రిదోషహరము. గొఱ్ఱెయపాలు త్రిదోషహరిమైనను మేకపాలతోగలసిన పేరమగునని యిచట జెప్పబడెను. తఱచుగా పగటిపాలు గురుత్వమును, మలబద్ధమును, శీతమును జేయును. రాత్రియందు వ్యాయామములేనందున గురుత్వమును జేయును. పగలుగోవులు వ్యాయామము వాయుసేవయును గలిగి సూర్యకిరణతప్తములగుగాన రాత్రిపాలు వాతపైత్యహరము- చక్షుష్యము- పథ్యము. అపరాహ్ణమందు పితికినపాలు నిటుల గుణమును జేయును. పదిగడియలకుపైని నిలవయున్న పాలు వికృతనొందు నిరువదిగడియలపర్యంతము నిలవయున్నవి విషమువలె చంపును.

ఎవరిదేహమునకు పాలుపడక కడుపుపొంగునో వారలు పాలలోసగము నీళ్లుకలిపి శొంఠి పిప్పళ్లును తగుమాత్రము వేసి క్షీరము మిగులునటులగాచి పుచ్చికొనిన సుఖమగును. పాలు మిసిమి గురుత్వము జడత్వమును గలవగుటవలన మూడువేళలందును పానము సేయగూడదు- ఇవి విశేషజఠరముకలవారికైనను గూడదు. మందాగ్ని విషమాగ్నియును గలవారికి కూడదని వేరె చెప్పనక్కరలేదు. తీక్ష్ణమగు జఠరముగలవారికి రెండుకాలములయందు గేదెపాలైన సేవించవచ్చునేమనుచేతననిన తీక్ష్ణజఠరముచే ధాతువులు హరించబడును. కావున వారికివ్వదగును. గేదెపాలు బలవర్ణతేజోనిద్రాశుక్లప్రదము- తీక్ష్ణజఠరశమము- స్వాదు- రసపాకమందు పుష్టిప్రదము- అలసినవారికి శ్రమహరి

ము, వాతహరము, నిషా్కమునకును వృద్ధునకును స్త్రీవాంఛాప్రదము. బల వంతునకును, తరుణునకును విశేషకామప్రదము. మేక చిన్నశరీరముకలదై క టుతిక్తాహారమొనర్చి యల్పజలపానముజేసి యధికవ్యాయామముగలది గావున దీనిపాలు దాహహరము. అగ్నిబలకరము. క్షయ, కాస, శ్వాస, కఫ, రక్త, పిత్తహరము. రక్తాతిసారమంటినను హితము. మిగులచిక్కిన మేకపాలు గో క్షీరముకంటె పథ్యము. స్థూలమగుమేకపాలకంటె శ్రేష్ఠము. పులుసునుప్పును గలసినక్షీరము కుష్ఠాదిరోగకారి- ఇదిదృష్టఫలము. ధర్మశాస్త్రములందున లవ ణయుక్తక్షీరము గోమాంససమమని జెప్పబడెను.

## క్షీ ర మి తాృ ణి.

సహకారఫలంచైవ గోస్తనీమాక్షికం ఘృతం। నవనీతం శృంగబేరం పి ప్పలీమరిచానిచ॥ సితాపృథుకసింధూత్థపటోలా నాగరాభయా। క్షీరేణసహ శస్యంతె వర్గేషు మధురాదిషు॥ ఆమ్లేష్వామలకంపథ్యం శర్కరామధురేషుచ। పటోలశ్శాకవర్గేషు కటుకేష్వార్ద్రకంభవేత్। కషాయేషుయవాశ్చైవ లవణే షుచ సైంధవం॥ కౌరంగకైస్తిత్తిరిభిర్మయూరైః కపింజలైశ్ఛాగశశాది మాంసైః। సేవేత్పయఃకామమిదంచ పథ్యం శిరోక్షిరోగాన్ప్రబలాన్సదా హరేత్॥

## క్షీ ర మి త్ర ము లు.

ఇటుపైని క్షీరమునకనుకూలించు వస్తువులను జెప్పుచున్నారము.

మామిడిపండు, ద్రాక్షాఫలము, తేనియ, ఘృతము, వెన్న, అర్ద్ర కము, పిప్పలి, మరీచి, పంచదార, అటుకులు, సైంధవలవణము, చేదిపొట్ల, శుంఠి, కరక్కాయ ఇవి పాలతోగలసిన శ్రేష్ఠము. పుల్లనివాటియందుశిరికా య, మధురములందు శర్కర, శాకవర్గమందు చేదిపొట్ల, వక్కలవాటియందర ల్లము, వగరుగలవాటియందు యవలు, ఉప్పులయందు సైంధవమును, క్షీర ముతోగలసిన దోషములేదు. మరియును లేడి, కౌంజు, నెమలి, కపింజలము, మేక, చెవులపిల్లి, వీటిమాంసములతో పాలుగలసిన పథ్యము, శిరోనేత్రరో గహరము.

## క్షీ ర వి రో ధి ద్ర వ్యా ణి.

శాకామ్లఫలపిణ్యాకకులుద్ధలవణైస్సహ। సౌవీరదధిమిశ్రంచేత్ప్రాయః క్షీరం విరుధ్యతే॥ మత్స్యమాంసగుడముద్గమూలకైః కుష్ఠమావహతి సేవితం పయః॥ శాకజాంబవసురాదిసేవితం మారయత్యబుధమాశుసర్పవత్॥ నైకం

చ పయసాక్ష్యియాత్సర్వంచోష్ణం ద్రవార్ద్రకం। మూలకాద్యాహరితక్యా స్తైల పిణ్యాకసర్షపాః॥ కపిత్థం జంబు జంబీరపనసం మాతులుంగకం। వాసంకరీరం ఖదిరం కదళీచామ్ల దాడిమం। ఫలమిద్యగ్విధంచాన్యత్తద్వద్బిల్వఫలాన్యపి। క్షీరే విరుద్ధాన్యేవంచ సహాసై భుజ్యతేయది। బాధిర్యమాంద్యవైవర్ణ్య మూకత్వం వాధమారణం॥ ప్రకరణేస్మిన్సౌరాపిణ్యాకాదిగ్రహణం క్షీరవిరుద్ధద్రవ్య గణనార్థమేవ నతుభక్షణార్హద్రవ్య ప్రబోధనార్థం॥ ధర్మఖండే॥ అలాబుం శిగ్రుకంచైవ రక్తమూలకమేవచ। ఉపోతకీం బహుబీజాం దూరతః పరివర్జయేత్॥ తత్రైవ॥ అలాబుంవర్తులాంచైవ రక్తంశిగ్రుకమేవచ। మూలకం రక్తమూలం చ దూరతః పరివర్జయేదిత్యుక్తత్వాదుభయోర్మధ్యే శ్వేతమూలకమేవ క్వచిద్దేశేషు స్వీకారః॥

## క్షీరవిరోధిద్రవ్యములు.

ఈపైని క్షీరమునకు విరోధించు పదార్థములను జెప్పుదుము.

శాకము, చింతపండు, తెలగపిండి, ఉలవలు, ఉప్పు, రేగుబండు, సౌవీరము, పెరుగు వీటితోగలసినపాలు తరుచుగా విరోధించును. మత్స్యమాంసములు, బెల్లము, పెసలు, ముల్లంగి, వీటితోగలసినపాలు కుష్ఠును బుట్టించును. శాకము, నేరేడుబండు, బెల్లముతోను ఇప్పపువ్వులతోను అన్నముతోను వండిన సారాయి, ఇవి పాలతోగలసిన పాముకాటువలె జంపును. పైని జెప్పినవాటిలో నొకదానినైన పాలతోగలపి పుచ్చుకొనదగదు. ముల్లంగిమొదలైనవియును, నూనియు, తెలగపిండే, యావ, వెలగపండు, నేరేడుపండు, నిమ్మపండు, పనసపండు, దబ్బపండు, వెదురకంజ, రేగుబండు, అనటిపండు, పుల్లదాడిమఫలము, మారేడుబండు, ఇటువంటి మరికొన్నిపదార్థములును చెముడు, గుడ్డి, వివర్ణత్వము, మూగి, లేదా మరణమైనను గలుగును. ఈప్రకరణమందు సారాయి తెలగపిండి మొదలగువాటిని జెప్పుట క్షీరమునకు విరుద్ధద్రవ్యములయొక్క సంఖ్యకొరకుగాని భక్షణద్రవ్యములని బోధించుటకు గాదు. ధర్మఖండమునందు ఆనపకాయ, ములగ, ఎఱ్ఱనిదుంపగలముల్లంగి, బహుబీజములుగల బచ్చలి, ఇవి భక్షణార్హములు గావనియు, మరియు నచటనే గుండ్రనియానపకాయ; ఎఱ్ఱని ములగ, ముల్లంగి, ఎఱ్ఱని ముల్లంగియు, దూరముగ విడువుమని జెప్పుటవలన తెల్లనిముల్లంగిని కొన్నిదేశములలో స్వీకరించుచున్నారు.

## దధిగుణాః.

అథ దధిగుణాన్ప్రవక్ష్యామః॥ తచ్చావస్థాభేదేన పంచవిధం॥ ఆదౌమందం తతస్స్వాదు స్వాద్వమ్లంచ తతఃపరం। అమ్లం చతుర్థమత్యమ్లం పంచమం దధి పంచధా॥ క్రమేణ తల్లక్షణాన్యథా॥ మందందుగ్ధవదవ్యక్తరసం కించిద్ఘనంభవేత్। మందంస్యాత్సృష్టవిణ్మూత్రం దోషకృద్యవిదాహకృత్। యత్స్యాద్ఘనతాంయాతి వ్యక్తస్వాదురసంభవేత్। అవ్యక్తామ్లరసం తత్తు స్వాదు విజ్ఞేయం దాహ్యృతం। స్వాదుస్యాదత్యభిష్యంది వృష్యం మేదఃకఫాపహం। వాతఘ్నం మధురంపాకే రక్తపిత్తప్రసాదనం। స్వాద్వమ్లం స్వాదు మధురం కషాయానురసంభవేత్। స్వాద్వమ్లస్యగుణాజ్ఞేయాస్సామాన్యదధివజ్జనైః। యత్తిరోహితమాధుర్యం వ్యక్తామ్లత్వం తదమ్లకం। అమ్లంతుదీపనంపిత్తరక్తశ్లేష్మవివర్ధనం। అత్యమ్లం దీపనంరక్తపిత్తదృష్టికరంపరం। దధ్యవస్థమసంప్రాప్య దుగ్ధావస్థామతీత్యచ। అంతరావర్తియత్ప్రోక్తం మందంతచ్చ త్రిదోషలం। విదాహస్సృష్టవిణ్మూత్రమపథ్యం మేహకృష్ఠకృత్॥ ఇతిపంచవిధదధిసామాన్యగుణాః॥

అథ గవ్యదధిగుణాః॥ తత్రాపిచాపిశీతంచ దీపనం బలవర్ధనం। వాతఘ్నంమధురంరూక్షం దధిగవ్యం మనోహరం॥ అరోచకే పీనసమూత్రకృచ్ఛ్రే శీతజ్వరే తద్విషమజ్వరేచ। దుర్నామరోగగ్రహణీగదేచ గవ్యంప్రశస్తం దధి సర్వదేవ॥

అథ ఋతువిశేషే సామాన్యతో దధిగుణాః॥ శరద్గ్రీష్మే వసంతేషు నిందితందధిదోషకృత్। హేమంతే శిశిరే తచ్చ వర్షకాలేబలప్రదం॥

అథ మాహిషస్య॥ విపాకేమధురంరూక్షం రక్తపిత్తప్రసాదనం। బలసంవర్ధనంచైవ విశేషాన్మాహిషందధి। స్నిగ్ధంమధురంశీతంచ బలవర్ణకరంపరం। వృష్యంభేదకరంస్వాదు శ్రమఘ్నం వాతనాశనం॥ మాహిషందధిమహాబలస్కరం వహ్నిమాంద్యకరమాశుకుర్యాత్। తత్ప్రయుజ్యకటుకైరవచూర్ణం మాహిషంచ లఘుతాముపయాతి॥

అథాజస్య॥ దధ్యాజం కఫవాతఘ్నం లఘూష్ణం నేత్రదోషకృత్। దుర్నామశ్వాసకాసఘ్నం రుచ్యందీపనపాచనం॥ దధ్నోర్మండో గురుర్వృష్యో విజ్ఞేయో బలవర్ధనః। దధిత్వసారం రూక్షంచ గ్రాహివిధ్వంసివాతలం। దీపనీయంలఘుతరం సకషాయం రుచిప్రదం॥ లవణమరిచసర్పిశ్శర్కరాముద్గధాత్రీ కుసుమరసవిమిశ్రం చైవమద్యాత్తు నిత్యం। నచశరది వసంతే నోష్ణకాలేన

రాత్రౌ నదధికఫపకారే పిత్తరోగ తథాద్యాత్॥ ఏలాసైంధవశర్కరా మరిచక్రైగ్రాతిభిర్గుడైస్సర్పిషా పథ్యంస్యాద్జ్వరముద్గసూపసహితం సంసేవనీయం దధి। నైవోష్ణంబహుపిచ్ఛలంచ నశరద్గ్రీష్మవసంతే హితం పిత్తాసృగ్జ్వర కుష్ఠదం భ్రమకరం వీసర్పదంచాన్యధా॥ దధిరాత్రిషునిషిద్ధం రాజకాచూర్ణయుక్తం కఫహారమతిలఘుం వహ్నిసంధుక్షణంచ। తుహినశిశిరకాలే సేవనీయం చపథ్యం భవతిసదృశశర్కరా యూషవాసస్త్వవాంశ్చ॥ సగుడదధిసుశోష్ణం ఘాతవస్త్రైరసమ్యగ్వ్యవతీకరవిలాసైగ్రాలితం ధూపితంచ। శిశిరకిరణవిశ్వాజాజియూష్మణముశత్రిం త్వధికశరవిలాసైస్సేవనీయం హితంచ॥ మధురంభక్షయేచ్ఛ్రేత మత్యమ్లం వర్జయేత్సదా। మధురం దధిరోగఘ్నం మత్యమ్లం రోగకారణం॥

### దధిగుణములు.

ఇటుపైని పెరుగు గుణములను జెప్పుచున్నారము.

పెరుగవస్థాభేదముచే నైదువిధములు గలదైయున్నది. మందము, స్వాదు, స్వాద్వామ్లము, ఆమ్లము, అత్యామ్లమిట్లైదువిధములు. క్రమముగ వీటిల గుణములను జెప్పుచున్నారము.

మందము క్షీరమువలె నవ్యక్తరసమై యించుక తోడుకొని యుండు నిది మలమూత్రవిమోచనకారి- దోషత్రయమును, విదాహమును జేయును. ఏది చక్కగా గట్టిపడి వ్యక్తమైన స్వాదురసమును గలిగి యుండునది స్వాదు నామకమిదివీర్యవృద్ధిని, మేదస్సును, రక్తవృద్ధిని, వాతమును, ఆమమును జేసి మధురమై కఫమును గొట్టును. పాకమందు రక్తపైత్య పరిసాదనును జేయును.

ఇంచుకపులుసుగలిగి మధురమై సువాసన ననుసరించిన రసము గలది స్వాద్వమ్లమనబడునిది సామాన్యదధిగుణమునే జేయును. ఏది మాధుర్యమణచి వ్యక్తమగు నామ్లరసముగలదైయుండునో యదియామ్లమనబడును. దీపనము, పైత్యరక్తశ్లేష్మములను వృద్ధినొందించును. మిక్కిలి పులిసినది యత్యామ్లమనబడునిది దీపనము రక్తపైత్యదృష్టికరము. గ్రంథాంతరమున క్షీరావస్థను విడిచి దధ్యవస్థనొందనిదనియు పూర్వోక్తగుణములకంటెనపథ్యము- మేహాకుష్ఠకారి.

ఆవుపెరు గతిశీతలము- దీపనము- బలకరము- వాతహారము- మధురము- మనోహరము. అరుచి పీనస మూత్రకృఛ్ర శీతజ్వర విషమజ్వర దుర్నామరోగగ్రహణులయందావుపెరుగు ప్రశస్తము- శరద్గ్రీష్మవసంతర్తువులందు

పెరుగు శోషకారి గావున నిందితము. హేమంతశిశిరవర్ష ఋతువులందు బలకరము

గేదెపెరుగు మధురము- వీర్యకరము- రక్తపైత్యములను నిర్మలముగ జేయును. విశేషించి బలమును వృద్ధి బొందించును. మరియును మిసిమి గలిగి శీతలమై, కాంతికరమై, మలబంధమును, వాతమును నశింపజేయును. శుంఠి, పిప్పలి, మిర్యములు గలపిన గుణత్వమును జేయకుండును.

మేకపెరుగు చులకనై వేడిజేసి నేత్రదోషమును, దుర్నామ శ్వాసకాసలను హరించును. రుచ్యము దీపనము- పాచనము. పెరుగుమీఁదిమీగడ గురుత్వమును, వీర్యమును, బలమును జేయును. మీగడదీసినపెరుగు వేడిజేసి దీపనమై, రేచకమై, లఘుతరమై, రుచిగలిగియుండును.

ఉప్పు, మిర్యములు, ఘృతము, శర్కర, పెసరపప్పు, ఉశిరికపప్పు, పుష్పరసమును గల్పినపెరుగు నిత్యమును బుచ్చికొనదగును. శరద్వసంత గ్రీష్మకాలముల, రాత్రిని, కఫవికృతిని, పైత్యరోగమున పెరుగును బుచ్చికొనరాదు.

ఏలకులు, సైంధవలవణము, పంచదార, మిర్యములు, ఉశిరికపప్పు, బెల్లము, నేయి, మంచిపెసరపప్పును గల్పిన పెరుగును బుచ్చుకొనదగును. పథ్యమువల్లను. వేడిది విశేషచికిత్సవిధిన్ని శరద్గ్రీష్మవసంతముల హితకరముకాదు. పైత్యరక్తకఫభ్రమయు విసర్పియనురోగమును పైనజెప్పిన వస్తువులతో గలపి పుచ్చికొనకుండిన వచ్చును.

పెరుగు త్రికటుకచూర్ణము నల్లావాలచూర్ణమును గలపిన కఫనాశహరము- జఠరవృద్ధికరము. పంచదారయు, పెరుగును గలపి శుభ్రముగు వస్త్రమునందు ఘూర్ణితముజేసి పోసిచి కర్పూరము శుంఠి జాజికాయ వీటిచూర్ణముతో గలపినది సేవించదగును.

తియ్యనిపెరుగు చలవజేయును గావున భక్షించదగును. సకలరోగములను హరించును. పుల్లనది సర్వరోగములను జేయును గావున వర్జింపవలయును.

శిఖరిణీలక్షణం.

అర్ధోదకం సుచిరపర్యుషితంచ దధ్నః ఖండస్య షోడశపలాని శశిప్రభస్య। సర్పిఃపలం మధుపలం మరిచిసర్జపయోః పలేద్వే శుంఠ్యాపలార్ధమపిచార్ధపలం చతుర్ణాం॥ శ్లక్ష్ణేసరోజనయనావ్యృదపాణిఘృష్టా కర్పూరచూర్ణ సురభీకృతభాండసంస్థా। ఏషావృకోదరకృతా సరసాంరసాలా యాస్వాదితా భగవతా మధుసూదనేన॥ రసాన్ ఆలాతీతి రసాలాః॥

ఆదాయమాహిషమమ్లమంబురహితం దధ్యాఢకం శర్కరాం శుభ్రాం ప్రస్థయుగోన్మితాం శుచిపటే కించిచ్చ కించిత్క్షిపేత్। దుగ్ధం చార్ధ్యఘటేన మృన్మయనవస్థాల్యాం దృఢం స్రావయేదేలాబీజలవంగచంద్రమరిచైర్యోగ్యైశ్చ తద్యోజయేత్॥ ఏషా యేనవసంతవర్జితదినే సంసేవ్యతే నిత్యశస్తస్యాస్యాదతి వీర్యవృద్ధిరనిశం సర్వేంద్రియాణాంబలం॥ గ్రీష్మేతథా శరదియేరవిశోషితాంగా / యేచపరిమత్తవనితాసురతాతిఖిన్నాః। యేచాపి మార్గపరిసర్పణశీర్ణగాత్రాస్తేషామియం వపుషిపోషణమాశుకుర్యాత్॥

త్రింశత్పలాని దధ్నశ్చ త్వగేలార్ధపలం తథా। మధ్వాజ్యస్య పలార్ధం చ మరిచానాం పలార్ధకం। పలాన్యష్టౌ చఖండస్య పటే శుక్లేచ ధారయేత్। కర్పూరవాసితేభాండే ఛాయాయాం స్థాపయేదిదం। ఏషాశిఖరిణీయుక్తాపిబేత బలవర్ధనీ। సదాపథ్యానియోజ్యాచ క్షీణేదేహేచపుష్టిదా। ఆయుఃప్రవర్ధినీచైవ సర్వరోగప్రమర్దినీ॥

సుజాతం దధిసంయోజ్య వస్త్రేబధ్వా సుపీడితం। నానావృక్షఫలారంభం కుర్యాదతిమనోహరం। కపిత్థమాతులుంగైలా సారివార్ధ్రికబీజకైః। శర్కరాశుంఠిసాముద్రిమరీచైరేకసంయుతైః। యుతం దధిరసం శ్రేష్ఠం సుఘృతం శోధితం పటైః। లవణేనసమాయుక్తా శిఖరిణ్యమృతోపమా। రసాలా సర్వరోగఘ్నీ రక్తపిత్తనిబర్హిణీ। దీపనీ బృంహణీస్నిగ్ధా మధురా శిశిరా సరా। రక్తపిత్తతృషాదాహాన్ప్రతిశ్యాయే వినాశయేత్॥

నారంగం దాడిమంస్యాత్పలమధుకయుతం మాతులుంగస్య తోయం ద్రాక్షాతోయం సమాంశం గుడదధిసహితం శర్కరారాజిమిశ్రం। శుభ్రేపట్టేచఘృష్ట్వా మరిచకసహితం సైంధవంవాప్యతద్వన్నిష్పీడం సర్వమేతద్భవతి శిఖరిణీ రాజభోగ్యైకయోగ్యా॥

మాతులుంగసితాజాజీ మరీచార్ద్రికనాగరైః। కర్పూరసలిలైర్యుక్తా దధిపర్యుషితైస్సమా। రసయోగేషు సర్వేషు బదరస్య సమస్యచ। నాగరస్యరసోన్మిశ్రా రసాలామృతోపమా। అచ్ఛేపటేచ సంఘృష్టావాతరోగనిబర్హిణీ। చంద్రామృతస్రావిణీయం నామ్నాశిఖరిణీమతా॥

మాతులుంగకపిత్థామ్లతింత్రిణీకామ్లదాడిమైః। శర్కరారాజిసంయుక్తైశ్శుచిపట్టేనియోజితం। నాగరం మరిచం జాజీచతుర్జాతకభూస్తృణైః। సుయుక్తార్ద్రికసంయుక్తా రసాలాసామృతోపమా। సర్వరోగప్రశమనీ దాహ

పిత్తనిబర్హిణీ॥ రక్తోద్రేకకరీపథ్యా సర్వవాతానులోమనీ। ఏషాశిఖరిణీరమ్యా సుషేణేనవినిర్మితా॥

దధిసర్పిగుడైర్లాజీ నాగరార్ద్రకయోజితైః। సచతుర్జాతఘృష్టైశ్చ రసాలైః సామృతోపమా। సర్వక్షయప్రశమనీ సర్వార్తిసారవాశనీ। సుషేణదేవేనకృతా రసాలైః సామృతోపమా॥

ద్వాత్రింశత్పలసంమితం దధిపలాన్యష్టౌచ ఖండంపలస్యార్ధంచేన్మరిచస్య తేనతులితం యుక్తంత్వగేలాదయం। మధ్వాజ్యంచయుతం తదర్ధమిలితైస్సంశోధితైర్యోజితా భాండేస్యాద్ధిమవాసితా శిఖరిణీ శ్రీకంఠభోగ్యాగుణైః॥

చతుర్వ్రీహిగుంజమేకం చతుర్గుంజంచచిహ్నకం। దశచిహ్నం తథానిష్కంచ నిష్కంచ కర్షకం। చతుఃకర్షంపలంచైవ కుడుపంచ చతుఃపలం। చతుఃకుడుపంప్రస్థమేకం చతుఃప్రస్థం తదాఢకం। ద్వావాఢకశివం సంఖ్యా ద్రోణంచాపి శివద్వయం॥

అథసరస్య మస్తునశ్చ గుణాః॥ దధ్నస్తూపరియోభాగో దధిస్నేహసమన్వితః। సలోకేసరఇత్యుక్తో దధ్నోవారితుమస్త్వితి॥ సరస్స్వాదుర్గురుర్వృష్యో వాతవహ్నిప్రణాశనః। శ్లేష్మవస్తిప్రమథనః పిత్తశ్లేష్మవివర్ధనః॥ స్రోతశ్శుద్ధిం విధత్తే ప్రకటయతిరుచిం దీపయత్యాశువహ్నిం కృత్వా శుద్ధింమలానాం జరయతిచహఠాచ్ఛుక్రమన్నం విచిత్రం। ఉష్ణంచామ్లంకషాయం లఘుసరథిరసం శూలవిష్టంభహారీ శ్రేష్ఠం మస్తుప్రశస్తంకఫపవనరుజా దుష్టమూత్రగ్రహేషు॥

శిఖరిణీలక్షణము.

చాలాపులిసిన గట్టి తెల్లని పెరుగు పదియారుపలములలో సగము నీళ్లు కలపి యొకపలము ఘృతము, తేనెయొకపలము, మిర్యములావాలు రెండుపలములు, శుంఠియర్ధపలము, ఏలకులు ఆకుపత్రికము దాల్చిణీచెక్క నాగకేసరములు వీటిచూర్ణమర్ధపలమును గలపి సన్నపుబట్టలో సుందరీజనహస్తారవిందములచే మందమందముగ జిందునట్లు మర్దించి యధికర్పూరచూర్ణముచే వాసితమగు కుండలోనుండజేసిన యుత్తమమైన శిఖరిణీ- మధుసూదనునిచే వాస్వాదించబడినది. మిక్కిలి రుచికలిగినది.

గేదెపెరుగు గట్టిది పుల్లనిది యుదకము కలియకుండ కుంచెడులో శుభ్రమగు పంచదార రెండుమానికెలు గలపి నిర్మలవస్త్రమందు దించుకొంచుక చే

యించు పైనుంచికుండలో పాలుబోయుచు మృద్ఘటమును పరివించునటుల వస్త్రఘాలితముజేసి ఏలకులు, లవంగములు, కర్పూరము ఏవీచూర్ణమందులో గలపిన నిది వసంతర్తువుగాక మిగిలినదినములయందెల్లప్పుడును సేవింపదగును. వీర్యవృద్ధికరము- సకలేంద్రియములకు బలమును గలిగించును. గ్రీష్మ శరదృతువులందును యెండచేవాడినవారికిని మత్తకామినీ సురతాతిఖిన్నులకును మార్గాయాసశిథిలీకృతాంగులకును ఈశిఖరిణి శరీరపోషణమును జేయును.

పెరుగుముప్పదిపలములు, దాల్చినీచెక్కయు నేలకులు నొకపలము, నేయి తేనియ పలములోసగము, మిర్యములును పలములోసగము, చక్కెరపంచదార యెనిమిదిపలములు, తెల్లనిబట్టలోకట్టి కర్పూరముచేవాసితమగు క్రొత్తకుండలో నుంచవలసినది. ఈశిఖరిణి బలకరమును పథ్యము- క్షీణదేహులకు పుష్టిప్రదము- ఆయుఃప్రదము- సర్వరోగహరము.

మంచిపెరుగు బట్టను మూటగట్టి యందున నానావిధపుష్పరసములు, ఫలరసములు, వెలగపంటిగుజ్జును, దబ్బపంటిపులుసు. అల్లపుముక్కలు, పంచదార, శుంఠి, యుప్పు, ఏలకులు, మిర్యములు, వీటితో గూర్చిన యావెంటను వస్త్రమందు ఘాలితముజేసిన లవణయుక్తశిఖరిణి యందురు- ఇది యమృతోపమము- రసాలవాలము- సర్వరోగహరము- రక్తపైత్యహరము- దీపనము- వృద్ధికరము- మెరుగునుజేయును. మధురము- శీతలము- రేచకము- పిపాసాదాహములను రొంపను హరించును.

నారింజి, దాడిమపండ్లరసము, తేనియ, దబ్బపంటిరసము, ద్రాక్షారసము నివిసమభాగములుగూర్చి గుడము, శర్కర, పెరుగు ఇవి యంతయును శుభ్రమగువస్త్రమందుంచి మర్దించి సైంధవలవణము, మిర్యపుపొడియును గలిపిన నీశిఖరిణి రాజభోజ్యక యోగ్యము.

దబ్బపంటిరసము, పంచదార, జాజికాయ, మిర్యములు, అల్లము, శుంఠి, కర్పూరజలము వీటితోసమమగు తొలినాటిపెరుగు పైనివ్రాసిన శుంఠి రేగుబండంతనూరి గలిపి శుభ్రవస్త్రమందు ఘర్షించిన నిది సకలపౌష్టికములందు నుత్తమమై సర్వరసాలవాలమై యమృతోపమై వాతరోగహరమై చంద్రామృతస్రావిణియనిచే ప్రసిద్ధమైన శిఖరిణి.

దబ్బ, వెలగ, చింతపండువులును, దాడిమరసము, పంచదార గలిపి, శుభ్రవస్త్రమందు వడకట్టి శుంఠి, మిర్యము, జాజికాయ, దాల్చినీచెక్క, ఏ

సరవద్ఘ్జితం। పాదోదకముదస్విత్తత్తక్రిమర్ధజలం భవేత్॥ సరవన్నిర్జలంమథితం
ఘోలం అసరవత్తన్నిర్జలం తన్మథితసంజ్ఞి మిత్యర్థః॥ అథతద్గుణాః॥ ఘోలం
మారుతపిత్తహారిమథితం శ్వాసాపహం శ్లేష్మహృత్పిత్తశ్లేష్మవి — త్స్యాదస్విదధి
కం తక్రం త్రిదోషాపహం। మందాగ్నావరుచౌ తృష్ణైవసీనరామన్యేషు రోగే
ష్వపి శ్రేష్ఠంతక్రమిదం వదంతి మునయస్తేనోక్తము పాణినాం॥ యథాసు
రాణామమృతంప్రధానం తథా నరాణాం భువితక్రమాహుః। అమ్లేనవాతం
మధురేణపిత్తం కఫంకషాయేన నిహంతిసద్యః॥ గవ్యంతుదీపనంతక్రం మేధ్యం
వృష్యం త్రిదోషజిత్। మాహిషం శ్లేష్మలం తక్రం లఘు దోషత్రయాపహం।
గుల్మార్శోగ్రహణీశోఫపాండ్వామయవినాశనం॥ తక్రంత్వజావిప్రభవం నసే
వ్య మనిష్టగంధం త్రిషుబాహ్యపథ్యం॥ స్వాదువృష్యంరుచికరం శ్లేష్మలం పిత్త
నాశనం। అమ్లతక్రంపవనజిత్పిత్తశ్లేష్మప్రకోపనం। తక్రం తల్లవణోపేతం దీ
పనంగ్రహణీగదే। తక్రంలవణహీనంయద్గ్రహణ్యర్శో వికారకృత్। వాతేమ్లం
సైంధవోపేతం స్వాదుపిత్తే సశర్కరం। కఫేపిత్తే తథాతక్రం వ్యోషక్షారస
మన్వితం॥ స్థౌల్యంకరోతి హరతేనిలమేతదేవ యున్నోష్ణతాముపగతంను కదా
చిదేవ॥ సహనవనీతంఘోలం మథితంకథయంతి సగుణం సుధియః। చిరమథితం
మథితం పునరుత్పత్తికరం నరస్య దోషాణాం॥ నైవతక్రంక్షతే దద్యాన్నోష్ణ
కాలేనదుర్బలే। నమూర్ఛాభ్రమదాహేషు నరోగేరక్తపిత్తకే॥ తక్రమామం
కఫంహంతి కోష్ఠేకంఠే కరోతిచ॥ భాండస్యమధ్యే దధి సంనిధాయ దండస్య
యంత్రేణ శనైర్ప్లుతంతత్। తోయేనసిక్తం మథితంక్రమేణ పాత్రేణ తక్రం
దశధావదంతి॥ దశవిధతక్రలక్షణాన్యుచ్యంతే॥ మథితమిశ్రితఘోషం బాడబం
కాలశేయం కరమథితముదశ్విత్తక్రదండాహతంచ। అతిమిశ్రితమిత్యస్యాత్ప్రి
యశః ప్రాహురార్యా దశవిధమరుచిఘ్నం తక్రభేదం ప్రశస్తం॥ క్రమేణత
ల్లక్షణాన్యుచ్యంతే॥ పానీయేనవినా కృతం మథితమిత్యర్థాంబునోదశ్విత్తం త
క్రంపాదయుతాంబునా ద్విగుణితం దండాహతంకథ్యతే। పాదంవారిచసార్ధ
పాదదధినా తత్కాలశేయాహ్వయం ఘోషాఖ్యం సమసార్ధపాదసలిలైఃపా
దైస్త్రిభిర్మిశ్రితం॥ పాదాంశేనచ బాడబోతిమిశ్రితం పాదద్వయేనాంశేన ద
ధ్యంభస్సమమేవ పాణిమథితం సర్వంచ దోషాపహం॥ ఉదశ్విదథఘోషఘ్నం
మథితంపైత్యనాశనం। తక్రం కఫహరం శ్లేష్మఘ్నం దీప్రం దండాహతం భవేత్।
కాలశేయం హరేన్మేహం ఘోషకం గ్రహణీమదం। వాతజిత్పాణిమథితం మి
శ్రితాఖ్యం త్రిదోషజిత్। బాడబం సర్వదోషఘ్నం మిశ్రితాతివినాహజిత్। క్ర
మేణలాఘవం తేషాం రూక్షౌత్తక్రం త్రిదోషజిత్। పీనసశ్వాసకాసానాంస్ని

గ్ధమేవ ప్రశస్యతే। పక్వంతక్రం సదా సేవ్యం లఘుపైత్యక్షయాపహం। శీతకాలేగ్నిమాంద్యేచ కఫోద్రేష్వామయేషుచ । దోషయుక్తజ్వరేచైవ ప్రాజ్ఞస్తక్రం ప్రయోజయేత్॥ జీర్ణజ్వరే యక్ష్మణి కామిలాయా మామాతిసారగ్రహణీగదేషు। ప్రమేహగుల్మోదరజాతశూలే తక్రంపిబేన్నిత్యమరోచకేషు॥ తన్నస్తు తక్రేణసముద్భవంతి ప్రతీపవిధ్వంసనమామనంతి॥ సాత్రోవిరోధే పిబతేలఘుస్త్వాద్యైస్తంభితోస్త్వాన్నిహంతి రోగాన్॥ హేమంతే శిశిరే పిబంతి మథితం తక్రంవసంతేబుధా నైదాఘేదధి తోయదస్వ్యుదదితం స్యాద్ఘోషకం ప్రావృషి। మాషంస్యాన్మిళితం ఘనాంతసమయే తత్కాలశే గుంయథా తోయం షడ్వృతుమ్రషితం ప్రమిళితం స్యాత్తక్రపానక్రమః॥ యథేష్టం భుంక్ష్వ మాషైషిస్త్రక్రం సలవణంపిబ। తస్యోపరిజలంకించిన్నతస్యోపరికించన॥

## మజ్జిగయొక్క లక్షణములు, గుణములున్ను.

మజ్జిగ నాలుగువిధములని సుషేణుడు చెప్పెను. అవి ఘోలమనియు మథితమనియు నుదస్విదనియు తక్రమనియును. పైనీళ్లు బోయక సరముతో గూడ గిలకబట్టినది ఘోలము. సరము తీసివేసి మథించినది మథితము. పెరుగునకు నాలవపాలు నీళ్లు వేసి మథించినది యుదస్వి. పెరుగులో సగమునీళ్లుబోసినది తక్రము.

ఘోలము వాతపైత్యహరము. మథితము శ్వాసశ్లేష్మహరము. ఉదస్వి పైత్యశ్లేష్మహరము. తక్రము త్రిదోషహారి. మందాగ్ని యరుచియును గలవారికిని సకలరోగములందును శ్రేష్ఠమని మునులచే జెప్పబడెను గానప్రాణులకు హితమిది. దేవతలకమృతమెట్లుప్రధానమో మనుష్యులకీతక్రము భూమియం దట్లుప్రధానమైనది. మజ్జిగ పుల్లనిదైన వాతమును, మధురమైనదైన పైత్యమును, ఇంచుకవగరుగలిగిన కఫమును హరించును. ఆవుమజ్జిగ పవిత్రము- వీర్యకరము- త్రిదోషహరము. గేదెమజ్జిగ శ్లేష్మకర మించుక దోషత్రయమును హరించును. గుల్మమూలశంకా గ్రహణీరోగపాండురోగములను నశింపజేయును. మేకగొఱ్ఱెలమజ్జిగ యనిష్టగంధముగుటవలన సేవ్యముగాదు. త్రిదోషవర్ధనము. పుల్లనిమజ్జిగ స్వాదువీర్యరుచికరము- వాత పైత్య హరము- పైత్యశ్లేష్మములను బ్రకోపింపజేయును- ఈతక్రము లవణయుక్తముగ సేవించిన గ్రహణిరోగులకు హితమై దీపనమగును. లవణహీనమైన మజ్జిగ గ్రహణి మూలశంకావికారములను జేయును.

వాతరోగమందు సైంధవలవణముతో గూడిన పుల్లనిమజ్జిగ, పైత్యరోగమందు పంచదారతో గూడిన తియ్యనిమజ్జిగ, కఫపైత్యములందు శుంఠి, పిప్పలి, మిర్యములు, యవక్షారము వీటితో గలిసినది హితము. ఇది శరీరమును బెంచి వాతమును హరించును. మజ్జిగ యెప్పుడును వెచ్చజేయరాదు. వెన్నతీయక గిలకపట్టిన మజ్జిగ గుణముకలది. మజ్జిగజేసి తిరిగి కొంతసేపటికి మధించినది సకలదోషములను బుట్టించును. మజ్జిగ గాయము గలవానికి దుర్బలునకు ఉష్ణకాలమందును మూర్ఛాభ్రమదాహరక్తపైత్యములందు నివ్వరాదు. మజ్జిగామమును కఫమును హరించును. కంఠమందించుక కఫమును బుట్టించును.

కుండలో పెరుగుండజేసి కవ్వపుయంత్రముచే నీళ్లుబోసి మధించిన తక్రము పదివిధములందురు. ౧. మథిత, ౨. మిళిత, ౩. ఘోష, ౪. బాడబ, ౫. కాలసేయ, ౬. కరమథిత, ౭. ఉదస్వి, ౮. తక్ర, ౯. దండాహత, ౧౦. అతిమిళిత లని. ఇవిపదియు నరుచిని బోగొట్టును. వీటిలక్షణములను క్రమముగ జెప్పుచున్నారము. నీళ్లుబోయక మధించినది మథితము. సగము నీళ్లు బోసినది యుదస్వి. పాతికనీళ్లుబోసినది తక్రము. రెండురెట్లు నీళ్లుబోసినది దండాహతము. రెండువంతుల పాతికనీళ్లు బోసినది కాలసేయము. రెండువంతులనర నీళ్లు బోసినది ఘోషము. మూడువంతులముప్పాతికనీళ్లు బోసినది మిళితము. ఒక పాతికనీళ్లుబోసినది బాడబము. రెండుపాతికెలనీళ్లుబోసినది అతిమిళితము. పెరుగు నీళ్లు సమముగానుంచి హస్తముచే మధించినది కరమథితము. ఇది సర్వదోషాపహరము. ఉదస్వి అభిఘాతశమనము. మథితతక్రములు పైత్యహరములు. దండాహతము జఠరప్రదము. కాలసేయము మేహహరము. ఘోషము గ్రహణీవారకము. కరమథితము వాతహరము. మిళితము త్రిదోషహారి. బాడబము సర్వదోషశమనము. మిళితముకంటె విదాహనివారకము. క్రమముగ నొకటికంటె నొకటిలాఘవముగలిగియుండును. రూక్షమగుటవలన తక్రము త్రిదోషహరము.

పీనసశ్వాసరోగులకు మిసిమిగలది శ్రేష్ఠము. వెచ్చజేసినది చులకనగును గావున పైత్యక్షయరోగహరము. శీతకాలమందును, కఫరోగమందును, అగ్నిమాంద్యమందును, విషమజ్వరమందును మజ్జిగనివ్వతగదు.

జీర్ణజ్వర రాజయక్ష్మ కామిలామూతిసార గ్రహణీ ప్రమేహ గుల్మోదర శూలారోచకములందు మజ్జిగ సేవించవగును.

పెరుగుమీదినీళ్లు మజ్జిగతో సమముగా జెప్పుచున్నారు. నాడీవిషనుము సంభవించినపుడు యిది చులకనై మలబద్ధమేహాది రోగములను హరించును.

రేచకమగును. హేమంతర్తువునందు శిశిరర్తువందు మధితమును, వసంతర్తువందు తక్రమును, గ్రీష్మర్తువందుదశ్విని, వర్షర్తువందు ఘోషకము, శరదృతువందు మిళితమును, కాలసేయమును, ఆరు ఋతువులయందును పెరుగుమీది నీళ్లును, ప్రమిళితమును పానముజేసిన పుష్టికలుగును. ఓయిమనుష్యుడా యథేష్టముగా భుజింపుము. భయపడకుము. లవణయుక్తముగ తక్రమునుపానమును జేయుము. ఆపైని యించుకజలపానము జేయుము. అటుపై నేమియును పానముజేయరాదు.

## నవనీతప్రకరణమ్.

అథ నవనీతగుణాన్వదామః॥ నవనీతం నవంవృష్యం శీతవర్ణం బలాగ్నికృత్। సంగ్రాహివాతపైత్యాసృక్షయార్శోజ్వరకాసజిత్। చక్షుష్యంబాలవృద్ధానాం ప్రశస్తం సౌకుమార్యకృత్। గుర్వభిష్యందిచక్షుష్యం నవనీతం చిరోద్ధృతం। సక్షారంకటుకామ్లంచ త్వచః కుష్ఠనివారణం। క్షీరోద్భవంతుసంగ్రాహి రక్తపైత్యాక్షిరోగజిత్। నవనీతం గవాం వృష్యం తేజోధాతువివర్ధనం। త్రిదోషశమనంగ్రాహి శిశూనాం పరమౌషధం। క్షయకాసార్తితాపఘ్నమగ్నిదీప్తికరంపరం॥ మాహిషం నవనీతంతు వాతశ్లేష్మకరంగురు। పైత్యదాహశ్రమహరం పాండుశూలవినాశనం॥ అజానాంనవనీతంతు క్షయ కాస ప్రమేహజిత్। గుల్మార్శశూలకండూఘ్నం జ్వరపాండువినాశనం॥ అజీర్ణే వాతరోగేచ కఫకుష్ఠాదరేషుచ। మూర్ఛాఛర్ది శిరోరోగే నవనీతం పరిత్యజేత్॥

## నవనీతప్రకరణము.

అనంతరమందు వెన్నగుణమును జెప్పుచున్నారము. నవనీతమగు నవనీతము తెల్లనైయుండి వీర్యవృద్ధిని, బలమును, జఠరాగ్నిని, మలబంధమును జేసి వాతపైత్యరక్తక్షయ మూలశంకోదర కాసములను హరించును. వెన్న బాలులకు వృద్ధులకును ప్రశస్తము. నేత్రారోగ్యకరము, సౌకుమార్యమును జేయును. నిలవవెన్న గురుత్వమును, మూత్రవృద్ధిని, నేత్రారోగ్యమును జేయును. ఇదిక్షారముతో కటుత్రయముతో గూడిన చర్మగతకుష్ఠుల బోగొట్టును. పాలతో తీసినవెన్న మలబంధమునుజేసి రక్తపైత్య నేత్రరోగములను హరించును. ఆవువెన్న బలతేజోధాతువర్ధనము- త్రిదోషశమనము- మలబద్ధకారి- శిశువులకు విశేషమగు నౌషధము. క్షయకాసపీడలను తాపమునుగొట్టును. విశేషముగ జఠరదీపనము జేసును. గేదెవెన్న వాతశ్లేష్మములను గురుత్వమును జేసును. పైత్యదాహములను శ్రమను పాండుశూలలను గొట్టును. మేకవెన్న క్షయను

శ్వాసప్రమేహరోగమును, గుల్మార్శశూలకండూజ్వర పాండువ్రణలను గొట్టును. అజీర్ణమందు వాతరోగమందు కఫకుష్ఠోదర మూర్ఛా ఛర్ది శిరోరోగములందును వెన్నభక్షించరాదు.

శర్కరాది మధురద్రవ్య గుణాః॥

శర్కరాచ తథాఖ్యాతా దాహతృష్ణాస్రపైత్త్యనుత్। జ్వరం పైత్త్యకృతంహంతి విశేషాచ్ఛుక్రవర్ధనీ॥ ఖండాభిధానా సితశర్కరేయం పైత్త్యప్రధానాన్వినిహంతిరోగాన్। శుక్లప్రవృద్ధిం తనుతే విశేషాత్స్నిగ్ధానిలఘ్నీ బలవర్ణకారీ॥ సుధాఖ్యశర్కరాబల్యా రుచ్యగ్నిబలవర్ధనీ। త్రిదోషజాత రక్తామహతకుష్ఠజ్వరాపహా। సితార్త్రిహృద్బలకరీ ఉన్మాదే కామిలాగదే। మదాత్యయేచ మూర్ఛాయాం స్మృతిభ్రంశే శిరోభ్రమే। పాండ్వామయే పైత్త్యగుల్మే ప్రదరేచ ప్రశస్యతే॥

చక్షుష్యం ఛేదకృద్దాహవిషహాధ్మార్త్రిపైత్త్యజిత్। తృష్ణా హిక్కాక్రిమిఛర్ది శ్వాసకాసాతిసారజిత్। వ్రణశోధనసంధాన రోపణం వాతళం మధు॥ వల్మీకసంభవక్షౌద్రం స్వర్ణవర్ణంచ గ్రాహికం। అంజనేషుచ సర్వేషు శస్తం పైత్త్యహరం లఘు॥ ఇక్ష్వాకుకారసంభూతం మదపైత్త్యానిలాపహం। బల్యంశుక్లకరంహృద్యం శ్లేష్మఘ్నం వహ్నినాశనం॥ బృంహణం నూతనక్షౌద్రం క్రిమిపైత్త్యహరం పరం। మేధాస్థౌల్యాపహం గ్రాహి పురాణం మాక్షికం మతం॥ శిలోద్భవం క్షౌద్రమామ్లం పైత్త్యఘ్నంక్రిమినాశనం। ఛర్దహిక్కాజ్వరాన్హంతి వ్రణశోధనరోపణం॥

మధుపాకవిధిః॥

అథ మధుపాకలక్షణం వదామః॥ మధ్వష్టభాగంజలమేకభాగం నిష్కప్రమాణం రజనీచ పథ్యా। తోయావసానం విధివద్విపాచ్యం నిధాపయేత్పాకవిధిక్రమోయం॥

పంచదార మొదలగు మధురద్రవ్యగుణములు.

సాధారణశర్కర- దాహ తృష్ణ రక్తపైత్త్య పైత్త్యజ్వరములను గొట్టును. శుక్లవృద్ధిజేసును. పటికపంచదార- పైత్త్య ప్రధానరోగములనుగొట్టి విశేషముగ శుక్లవృద్ధినిజేసి మెరుగునుగలిగించి వాతమునుహరించి తనుకాంతిని, బలమును జేయును. చీనాపంచదార- బలవర్ధనము రుచికరము జఠరాగ్నిదీపనము- త్రిదోషములవల్ల బుట్టే రక్తామములను, కుష్ఠును, జ్వరమును గొ

ట్టును. చక్కెర- పంచదార ఆయాసమును హరించును. బలమును జేయును. ఉన్మాదకామిలా మదాత్యయమూర్ఛా స్మృతిభ్రంశ శిరోభ్రమ పాండు పైత్య గుల్మప్రదర రోగములందు ప్రశస్తము.

తేనియ- నేత్రారోగ్యకరము- విరేచకము- దాహమును, విషమును, కడుపుపొంగును, పైత్యమును, పిపాసా హిక్కా క్రిమి ఛర్ది శ్వాస కాసాద్యతిసారములను జయించును. వ్రణములను బాగుజేయును. వాతమును జేయును.

పుట్టతేనె- బంగారపుఛాయగలిగి సకలాంజనములందు ప్రశస్తమై పైత్యహరమై లఘువై యుండును.

చెరుకురసమువలన జేసిన తేనె మలపైత్యవాతములను హరించును. బలశుక్లకరము- హృద్యము- శ్లేష్మజఠరవహ్నినాశనము.

క్రొత్త తేనియ వృద్ధిని జేసి క్రిమిపైత్యహరమై యుండును. పాత తేనియ బుద్ధికి బాగుజేయును. రాళ్లవలనబుట్టిన తేనియ పులుసుగలిగి పైత్యక్రిమిహారిమై యుండును. ఛర్దిహిక్కాజ్వరహరమై వ్రణశోధనము జేసి మానుచును.

## తే నె వం డు రీ తి.

ఇటుపైనిమ్మను పాకలక్షణమును జెప్పుదుము. తేనియ యెనిమిదివంతులు, జలమొకవంతు, పసపు కరక కాయపొడుము పదిచిన్నములును వేసి నీళ్లు హరించునట్టుకును మరిగించియుంచవలెను.

## ఇక్షుభేదా స్తద్గుణాశ్చ॥

నేపాళశ్శతపర్వాచ కాంతారః పౌండ్రకస్తథా। ఇక్షుకః పావకశ్చైవ షడ్విధాః పరికీర్తితాః॥ నేపాళోఽతిశ్రీవర్ణశ్చ శతపర్వాచ కృష్ణకః। కాంతారః పీతవర్ణశ్చ పౌండ్రకోరక్తకస్తథా। ఇక్షుకశ్శ్వేతవర్ణశ్చ పావకోధూసరస్తథా॥

నేపాళం మధురంక్షారం రక్తపైత్యవిదాహనుత్। క్రిమిక్లమహరం హృద్యం భ్రమోద్రేకనివారణం॥ శతపర్వాక్రిమిఘ్నంచ వాతశ్లేష్మకరో గురుః। పైత్యోన్మాదహరో బల్యః కాంతిదో దేహవర్ధనః॥ కాంతారస్య రసః పథ్యో లఘుః కించిద్విదాహనుత్। పౌండ్రకో గురుపైత్యఘ్నో బృంహణో మధురోలఘుః। కఫమాత్రకరస్స్నిగ్ధో భుక్త్వ్యాంతే వాతరోగకృత్॥ ఇక్షుస్స్వాదుస్స్వాదుపాకోఽనిలఘ్నస్స్నిగ్ధశ్శ్వేతోనాశయేద్రక్తపైత్యాన్। భేదీ వృష్య

మూత్రలశ్లేష్మకారీ వాయుంకుర్యాత్సేవితో భోజనాంతే॥ పావకస్య రసశ్శీతో లఘుస్స్వాదురసోగురుః। శ్రమక్లమహరో హృద్యః పైత్యశోణితనాశకః॥ సర్వేషామిక్షుజాతీనాం రసః పర్యుషితోగురుః। ఉన్మాదమదపైత్యఘ్నో విషదోషహరః పరం॥ కుష్ఠప్రమేహమందాగ్నౌ జ్వరశోథభగంధరే। ఉదరోద్ధకఫోద్రేకే గుల్మేచేక్షుంవివర్జయేత్॥ అపూరితక్షురసోన్మాదే ధాతుక్షీణేచ దుర్బలే। మూత్రకృచ్ఛ్రే క్షయేచాక్ష్ణే రక్తపైత్యే హితంసదా॥

## చెరుకులభేదమును వాటిగుణములును.

నేపాళము, శతపర్వము, కాంతారము, పౌండ్రకము, ఇక్షుకము, పావకము. చెరుకిట్లారువిధములుగా జెప్పబడినది. నేపాళము మిశ్రవర్ణము. శతపర్వము కృష్ణవర్ణము. కాంతారము పీతవర్ణము. పౌండ్రకము రక్తవర్ణము. ఇక్షుకము శ్వేతవర్ణకము. పావకము ధూసరవర్ణము.

నేపాళము మధురమై, కారమై, రక్తపిత్తవిదాహశ్రమక్లమభ్రమోద్రేకహరమై, హృద్యమైయుండును. శతపర్వముక్రిమిపైత్యోన్మాదహరము. వాతశ్లేష్మగురుత్వబలదేహకాంతివర్ధనము. కాంతారము పథ్యము- లఘువు- విదాహహరము. పౌండ్రకము గురుత్వకారి- పైత్యహరము- వృద్ధికరము- మధురము- లఘువు, కఫమూత్రమును జేసును. స్నిగ్ధము భుక్త్యంతమందు వాతకరము. ఇక్షుపాకమందు రుచిగలిగి వాతశ్వేతరక్తపైత్య హరమై స్నిగ్ధమై రేచకమై వీర్యమూత్రశ్లేష్మకారియగును. భోజనాంతమందిది వాతమును జేయును. పావకముచల్లనై లఘువై స్వాదురసముగలిగి గురువై శ్రమక్లమపైత్యరక్తనాశనమై యుండును. అన్నిచెరుకులరసములును మరునాటికి నిల్వగానున్నది గురుత్వకారియై యున్మాదమదపైత్యవిషదోషహరమై యుండును. చెరుకురసము కుష్ఠప్రమేహమందాగ్ని జ్వరశోథ భగంధరోదరకఫోద్రేకగుల్మలయందు వర్జింపవలయును. ఉన్మాదధాతుక్షయ దౌర్బల్య మూత్రకృచ్ఛ్ర క్షయ రక్తపైత్యాధ్మానములందు చెరుకురసము హితము పథ్యము.

## తైలభేదాస్తద్గుణాశ్చ॥

అథ తైలభేదాంస్తద్గుణాంశ్చ వదామః॥ తైలంమహాతిలజమాశుసమీరజాతమభ్యంజనేహరతి పామవ్రణంకఫంచ। హృద్యంసుకాంతికర ముష్ణమతిప్రశస్తం షణ్మాసతోపి శిశుగాత్రవివర్ధనంచ॥ తైలంకృష్ణతిలోద్భూతం వాతక్రిమివిషాపహం। ఆనుప్రవాహికంహంతి శూలగుల్మోదరాపహం। కించిల్లో

హితవర్ణానాం తిలానాంతైలముత్తమం। మధురంశీతలంహృద్యం కాంతిదం వీర్యవర్ధనం॥ కటుతైలం సర్షపస్య తీక్ష్ణోష్ణం వాతానిలాపహం। గుల్మకుష్ఠ క్రిమీన్ హంతి హ్యమపైత్యకరంపరం। కర్ణశూలాదికంహంతి బలదంకఫశుక్లజిత్। సేవనాదవరంతైలం లేపనాద్వరముచ్యతే॥ అక్షిరోగే జ్వరేకుష్ఠే విషశోషే భగంధరే। ఉన్మాదేచ స్మృతిభ్రంశే తైలపానంవివర్జయేత్॥

## తైలభేదములును వాటిగుణములును.

ఇటుపైని తైలభేదములను వాటిగుణములను జెప్పుచున్నాము. పెద్దనువ్వులనూనియ తలంటుకొనిన శీఘ్రముగ వాతమును హరించును. గజ్జిని, వ్రణములను, కఫమును హరించి హృద్యమై కాంతికరమై వేడిజేసి యారుమాసములపర్యంతము శిశుదేహవర్ధనమై యుండును. నల్లనువ్వుల నూనియ వాతక్రిమివిషామపరివాహశూలగుల్మోదరములను హరించును. కొంచెమెఱ్ఱనగుఱువ్వులు గలనూనియయుత్తమము. మధురము-శీతలము-హృద్యము-కాంతివీర్యవర్ధనము.

ఆవాలతైలము వేడిజేసి వాతగుల్మకుష్ఠక్రిమికర్ణశూల కఫశుక్లములను హరించును. పైత్యమునుబలమును జేయును. సేవించుటకు తగదు. లేపనమునకు శ్రేష్ఠము. నేత్రరోగజ్వరకుష్ఠవిషశోష భగంధరోన్మాద స్మృతిభ్రంశములందు తైలపానమును వర్జింపవలయును.

## నారికేళోదక గుణాః.

నారికేళోదకంస్నిగ్ధం స్వాదువృష్యంహిమం లఘు। తృష్ణాపిత్తానిలహరం దీపనంవస్తిశోధనం। శ్రమఘ్నం బృంహణంబల్యం సూతికానాం పరంహితం॥ ఇతిసామాన్యనారికేళోదకగుణాః॥ నారికేళస్యయత్తోయం పురాణం పిత్తవర్ధనం। తన్నైవతరుణంతోయం పిత్తఘ్నం క్రిమినాశనం। బాలస్య నారికేళస్య కటునా కేహమంజలం। ఈషత్కషాయమధురం పక్వస్యోష్ణంసరంగురు। స్నిగ్ధాదయో గుణాస్త్వన్యే సమాస్యుర్బాలపక్వయోః॥ నారికేళసలిలంఖలుబాల్యే శీతలంగ మధురందరిపాకే। పిత్తపీనసతృషాస్రవిదాహ శాంతిశోష శమనం సుఖదాయి॥ పక్వమేతదపి కించిదపేబాక్తం పిత్తకారి రుచిరంమధురంచ। దీపనం బలకరం గురువృష్యం వీర్యవర్ధనమిదం ప్రవదంతి॥

అథాస్యసేవనకాలః॥ నారికేళాంబు భుక్తేఃప్రాగ్గల్మాని సదనాద్విహృత్।అతఃపరంనపేయంస్యాత్సేందుతచ్ఛీతలం హితం॥ ఋయోగ్రావాసాధ్వగమాతిభావ్యవ్యవాయవాతాతపపీడితానాం। వ్యాయామినాం వాతకఫోత్థగాణాం యన్నారికేళాదుదకం ప్రశస్తం॥

## నారికేళోదకగుణములు.

కొబ్బరికాయనీళ్లు స్వాదు- వీర్యవృద్ధికరము- శీతలము- లఘువు- పిపాసా పైత్యవాతశ్రమహరము- దీపనము- గర్భశోధనము- వృద్ధి- బలకరము. మూత్రకారోగమందు హితము. ఇదిసామాన్యముగ్గ నారికేళజలగుణము. నిలవకొబ్బరికాయనీళ్లు పైత్యకరము. లేతకొబ్బరికాయనీళ్లు పైత్యశ్రమహరము- శీతలము- ఇంచుకవగరుగలమధురము. పండుకొబ్బరికాయనీళ్లు వెటజేసి రేవకమై గురుతరమై యితరగుణములను లేతకొబ్బరికాయనీళ్లవలెను జేయును. లేతకాయనీళ్లు శీతలము. సగముముదిరినకాయనీళ్లు పైత్యపీనసపిపాసారక్తదోషవిదాహశ్రమశోషశమనము- సుఖకరము. పండుకాయనీళ్లు పైత్యకరము- బలకరము- దీపనము- గురుతరము- వీర్యవృద్ధికరము.

ఇటుపైని నారికేళజలసేవనకాలములను జెప్పుచున్నారము. భోజనమునకు ముందుగ కొబ్బరికాయనీళ్లు గుల్మములనుబుట్టించును. కావునపానము సేయదగదు. ఆజలము కర్పూరయుక్తమైన శీతలము- వాతము. క్షయరోగి, పైత్యదేశవాసి, మార్గస్థుడు, వ్యవాయముచే నెండచే వాతరోగముచే పీడితులగువారును, వ్యాయామముచే నలసినవారును, వాతకఫరోగులునగువీరికి నారికేళోదకము ప్రశస్తము.

## శతపత్రాంబుకరణమ్.

శతపత్రాంబుసహసా రక్తపిత్తగ్రహాపహం। మూర్ఛాతిత్రాసశమనం దాహతృష్ణాభినాశనం। కుట్మలంశతపత్రాణాం విష్ణుతం తత్రనిక్షిపేత్। జలంసప్తపలంపాత్రే రౌప్యకే వంశసత్కృతే। తామ్రజేవాధ తస్యోర్ధ్వదోలాయంత్రే నివేశ యేత్। రౌప్యపాత్రం తమూర్ధ్వంతు పశ్చాద్రౌప్యశరావయా। ఆచ్ఛాద్య తన్ముఖంరుధ్వా సమంతాత్పాచయేచ్ఛనైః। మృద్వగ్నినామహూర్తంతు పశ్చాదుద్ధృత్య తజ్జలం। రౌప్యపాత్రస్థితంవిద్యాన్నేవపుష్పరసోవరః। సుశీతలస్సుగంధశ్చ గ్రీష్మే వర్షాత్యయేతథా। రాజ్ఞాం దాహప్రశాంత్యర్థం షింకేదంగంభిషగ్వరః। రసకృద్దాహశాంత్యర్థం గులాబపరమాభిధః। పుష్పద్రవః పుష్పసారః పుష్పస్వేదశ్చ పుష్పదః। పుష్పనిర్యాసకశ్చైవ పుష్పాంబుజవదాహ్వయః॥ పుష్పద్రవస్సురభిశీతకషాయగొల్మదాహశ్రమార్తి వమిమోహముఖామయఘ్నః। తృష్ణార్తిపిత్తకఫదోషహరస్సరశ్చ సంతర్పణశ్చిరమబోచకహారకశ్చ॥ శతపత్రీతుసుమనీ సుశీతాతీవవల్లభా। సౌమ్యగంధా శతద

లా సువృత్తా శతపత్రికా। శతపత్రీహిమాతిక్తా కషాయా కుష్ఠనాశనా।ముఖస్ఫోటహరా రుచ్యా సురభిః పిత్తదాహనుత్॥

శతపత్రిజలమును జేసెడు ప్రకారము.

శతపత్రిజలము రక్తపైత్యమూర్ఛాకంపదాహపిపాసావారణము. ఏదుపలముల జలము రజితపాత్రమందైనను తామ్రపాత్రమందైన నునిచి యందులో వికసించిన తామరమొగ్గలు వేసి దానిపైనొకరజితపాత్రము వ్రేలగట్టి ఆపాత్రముఖమందు ఒకవెండితటుకు కప్పి క్రిందిపాత్రములోనుంచి మీదిపాత్రముదుకురంధ్రమునకొకవెదురుగొట్టమమర్చి యూర్ధ్వాధోభాగములయందావిపైకిబోకుండ నాచ్ఛాదించి మందాగ్నిచే పచనముజేసి రెండుగడియలైనబిమ్మట తీసి పైరజతపాత్రిలోచేరిన జలము పుష్పరసమనబడును. దీనిని గులాబనియందురు. ఇది శీతలము- సుగంధము- గ్రీష్మర్తువందును శరదృతువందును రాజులకు దాహోపశాంతికొరకు వైద్యుడు శరీరమందు జల్లవలయును. పుష్పద్రవము పుష్పసారము పుష్పస్వేదము పుష్పదము పుష్పనిర్యాసకము పుష్పాంబుజమునునివియారుపేర్లు దీనికిగలవు. ఈపుష్పద్రవము పరిమళము గలిగి శీతలమై ఇంచుకవగరై గుల్మదాహశ్రమార్తివమన మోహముఖామయపిపాసాపైత్యకఫహరమై రేచకమై తృప్తికరమై యరుచిని హరించును. ఇంచుకంతచేదుగలిగి కుష్ఠముఖస్ఫోటహారమై యుండును.

శరత్కాలోదక పానగుణాః.

శరదివర్షోదకంపరిగృహ్యవత్సరంపిబేత్। ప్రాయశశ్శరది గంగాజలం వర్షతియతస్తతోప్యపర్యుషితంభవతి తదుక్తం సుశ్రుతే। గాంగ మాశ్వయుజే మాసి ప్రాయశోవర్షతీతి ఇదమేవాదృష్టసలిలం॥ అదృష్టసలిలాభావే వాహ్యం యత్నాత్సుయుక్తితః। అగ్నౌ ప్రతపనం యద్వా సూర్యరశ్మిప్రతాపనం। ప్రశస్తతేతి తత్రేయం పిండనిర్వాపణం తథా। క్షుద్రజంత్వభిముష్టస్య ఘనవస్త్రేణశోధనం। పుష్పైరనిష్టగంధస్య పాటలాద్యైశ్చవాసనం। లవంగోశీరకర్పూరకోష్ఠకస్తూరిచందనైః। చూర్ణితైర్వాసితంవారి సుగంధంసర్వదోషజిత్॥ చంద్రకాంతోద్భవంవారి పిత్తఘ్నం విమలం లఘు॥ క్రిమికీటకపత్రపంక శంఖతృణలూతావిషదుర్గసంగమంచ। నపిబేన్మతిమాన్నజాతుతోయం యదిపీతం విదధాతిరోగమాశు॥ పార్శ్వశూలే ప్రతిశ్యామే వాతదోషే నవజ్వరే। హిధ్మాధ్మానాదిదోషేషు శీతాంబుపరివర్జయేత్॥ ధాతుక్షయే రక్తవికారదోషే వాంతిప్రమేహే విషవిద్రధిషు। జీర్ణజ్వరే శోధలసన్నిపాతే జలం ప్రశ

స్త్రంశుభ్రతశీతలంతత్॥ గుల్మార్శోగ్రహణీషుశేషు జఠరేమందానలేధ్మానకేశో ఫేపాండుగదేగళవ్రణగదేమేహచనేత్రామయే।వాతారుచ్యతిసారకే కఫగదే కాసేప్రతిశ్యాయకే ఉష్ణంవారిసుశీతలంశృతహిమంస్వల్పంప్రదేయంజలం॥

అథోష్ణోదకగుణాః॥ పథ్యందీపనపాచనం లఘుతరం సశ్వాసకాసాప హం హిధ్మాధ్మానవజ్వరప్రశమనం శ్లేష్మాపహారివాతజిత్। సంశుద్ధోదర వస్తిశుద్ధికరణం హ్యాత్పార్శ్వశూలాపహంగుల్మారోచకపీనసే నిగదితంకంత్యం శృతోష్ణంజలం॥ తప్తంపాదః పాదభాగేనహీనం పథ్యంప్రోక్తం వాతజాతా మయఘ్నం। అర్ధాంశోనం నాశమేద్వాతపిత్తం పాదప్రాయం తత్తుదోషత్రి యఘ్నం॥ హేమంతేపాదహీనం పాదార్ధోనంచ శారదే। ప్రావృట్వసంతశి శిరగ్రీష్మేష్వర్ధావశేషితం॥ తప్తందివాజాడ్యముపైతినక్తం నక్తంచతప్తం య దివాపివారి। దివాపినక్తంచ నృభిస్తదాలం యుక్తంజలం తప్తమతోగృహీతం॥ అపనయతిపవనదోషం దలయతికఫమాశు నాశయత్యరుచిం। పాచయతి చా న్నమనలం శృష్ణాతి నిశీథపీతముష్ణాంభః॥ పానీయం నతుపానీయం పానీయే న్యప్రదేశజే। అజీర్ణేక్వథితేచామే పక్వేజీర్ణేపి నేతరత్॥ అజీర్ణే ఇతి శేషః॥ అ త్యంబుపానాన్నవిపచ్యతేన్నమత్యంబుపానాచ్చ సఏవదోషః। తస్మాన్నరో వ హ్నివివర్ధనాయ శనఃశనర్వారి పిబేన్నభూరి॥ తప్తాయఃపిండసంయుక్తం లోష్ఠసిర్వాపితంజలం। సర్వదోషహరంపథ్యం సదా నైరుజ్యకారకం॥ పానీ యంప్రాణినాంప్రాణాన్నిశ్వసేత్తద్ధిజన్మయం। అతోత్యంతనిషేధేపి నక్వచి ద్వారివార్యతే॥ తృషితో మోహమాయాతి మోహాత్ప్రాణా న్విముంచతి। త స్మాత్సర్వబల్యందాతవ్యం నక్వచిద్వారివార్యతే॥ క్షుధాసంశుష్కహృత్కంఠ శుద్ధిరన్నంతుజీర్యతి। స్నిగ్ధంయుక్తంచ యద్భుక్తం తత సంతర్పణం భవేత్॥ వాసితంనూతనైఃపుష్పైః పాటలీచంపకాదిభిః। పథ్యంసుగంధహృద్యంచ శీత లాంబుసదాపిబేత్॥ గ్రీష్మేశరది పాతవ్యం స్వేచ్ఛయా సలిలం నరైః। అన్య థాకల్పమేవైతద్వాతశ్లేష్మభయాత్పిబేత్॥ అన్నేనాపి వినా జంతుః ప్రాణా న్సంధారయేచ్చిరం। తోయాభావే పిపాసార్తస్సద్యః ప్రాణైర్వియుజ్యతే॥

శరత్కాలోదక పానగుణములు.

శరత్కాలమందు రజితపాత్రలో నన్నము గట్టిగ పిడచజేసి యుంచి యుదివర్షముగురియుచుండ యెత్తుగలచోటనునచిన గురియువర్షమువలన య న్నము నల్లబడక చెదిరిపోకయుండిన నావర్షజలము గంగాజలమని తెలియవ లయును. అట్టిజలము వర్షించునపుడు మేడలపయిని శుభ్రమగు వస్త్రము నా

లుగుచెంగులు బిగియగట్టి యందులోవర్షించి క్రిందికి స్రవించు జల మొకరజిత పాత్రయందైనను సువర్ణపాత్రయందైనను బట్టి నిలవజేసి తిరిగి శరత్కాలప ర్యంతమది పానముజేసిన రోగోత్పత్తి కాదని వైద్యశాస్త్రమందు జెప్పబడెను. దీనినదృష్టసలిలమని జెప్పుదురు. నిలవజేసినజలము మరునాటికి పర్యుషితదో షమునొందు నాదోషమీజలమునకు లేదు. ఇదిగంగాజలమగుటవలన పర్యుషి తములేదని సుప్రసిద్ధము. శరదృతువందు గంగాజలము తరుచుగా వర్షించున ని సుశ్రుతమందు ధన్వంత్రివచనము.

ఈయదృష్టజలము సంభవించకుండిన బావినీళ్లగ్నిచే గాచినవైనను సూర్యరశ్మిచే తపింపజేసినవైన పానముజేయదగును. చిన్నపురుగులుగలిగి క లుషమైన జలము వడపోసిన శుద్ధమగును. పాటలపుష్పములుమొదలగువాటిచే దుర్గంధమును బోనడచి లవంగములు, వట్టివేళ్లు, కర్పూరము, చెంగల్వకో ష్ఠు, కస్తూరి, చందనము వీటిచూర్ణములచే సుగంధము గలుగజేసిన జలము స ర్వదోషములను జయించును.

చంద్రకాంతమణులు స్రవించిన నీరు పైత్యహరము- నిర్మలము- లఘు తరము. చిన్నపురుగులు, పెద్దపురుగులు, ఆకులు, బురద, నత్తగుల్లలు, సాలె పట్టు, పొత్తిచెట్టు మొదలగువిషవృక్షములుగల వనములనుంచి వచ్చుజలమును బుద్ధిమంతులొకప్పుడును పానముజేయదగదు. శీఘ్రముగ నీజలము రోగము నుబుట్టించును. పార్శ్వశూల, పీనస, వాతరోగము, తరుణజ్వరము, కడుపు పొంగు మొదలగు దోషములందు చల్లని నీళ్లను వర్జింపవలయును.

ధాతుక్షయము, రక్తవికారదోషము, వాంతిప్రమేహము, విషదోష ము, మలబంధము, జీర్ణజ్వరము, సన్నిపాతము, యీరోగములందు కాచిచ ల్లార్చినజలము హితము. మరియును గుల్మమూలశంకాగ్రహణీ క్షయమందా గ్ని శోఫాధ్మానపాండు గళవ్రణ మేహనేత్రరోగ వాతారుచి కఫకుష్ఠపీనస రోగములందును కాచిచల్లార్చినజలము స్వల్పముగ పానముజేయదగును.

ఉష్ణోదకగుణములు. వేడినీళ్లు పథ్యము- దీపనము- పాచనము- లఘు తరము- శ్వాసకాసహిధ్మాధ్మాన తరుణజ్వర శ్లేష్మవాత హృదయ పార్శ్వ శూల గుల్మారోచక పీనసకంఠరోగములయందు కాచిచల్లార్చక మోతాదు వేడినీళ్లు హితము. గర్భశోధనమగును. నాలగవవంతు హరించునట్లు గాచిన నీళ్లు వాతరోగములందును, సగముహరించునట్లు గాచినవి వాతపైత్యరోగ ములందును, మూడువంతులుహరించినట్లుగాచినవి త్రిదోషరోగములందును

హితమై ఆయాయురోగములను హరించును. హేమంతర్తువందు నాలగవపాలు హరించినదియును, శరదృతువందు మూడువంతులు హరించునట్లు గాచినదియును, వర్షావసంతశిశిరగ్రీష్మర్తువులందు సగము హరించునట్లు గాచినవియును శ్రేష్ఠము. పగలు గాచిననీళ్లు రాత్రియందు జాడ్యముసేయును. రాత్రి కాచినజలము పగటికి జాడ్యకరము. కావున పగటికి పగలును రాత్రికి రాత్రియును నీళ్లు గాచవలయును. రాత్రివేడినీళ్లు పానముజేసిన వాత కఫారుచిదోషములను హరించి యన్నమును పచనముజేసి జఠరమును వృద్ధినొందించును. అజీర్ణమునందు జలమును పానముసేయతగదు. ఆమదోషము శమించి యజీర్ణముపక్వమైనపైని పానముజేయదగును. అత్యంబుపానముచేతనునంబుపానముచేకుండినను నన్నము జీర్ణించదు. కావున జఠరవృద్ధికొరకు మాటిమాటి కించుకించుక జలమునుబుచ్చికొనవలయును. కాల్చినయినపగుండు నీళ్లలోవేసి యానీళ్లను బుచ్చికొనిన సకలదోషములను హరించును. పథ్యమగును. ఎల్లప్పుడును నిరోగమును జేయును. జలము ప్రాణులకు ప్రాణధారకముగావున ఎట్టివిషేషమందైన నొకప్పుడును జలమును పానమునుజేయకుండజేయరాదు. పిపాసచే మూర్ఛబుట్టును. మూర్ఛచే ప్రాణములను విడుచురు. కావున స్వబలానుగుణముగ జలమునివ్వవలెను గానివారింపదగదు. ఆకలిచే నొండిన హృదయకంఠస్థానములశుద్ధిని జేయును- సుఖముగనన్నమును పచనమును జేయును. ఘృతాదియుక్తముగ భుజించినయన్నమీజలముచేతనే తృప్తిని జేయును. నూతనములకు పాటలీచంపకాదిపుష్పములచే వాసితమగు జలము పథ్యము హృద్యము గావున నిట్టిశీతలజలమెల్లప్పుడును పానముసేయవలయును.

గ్రీష్మశరదృతువులందు స్వేచ్ఛగా జలపానము సేయదగును. మిగిలిన కాలమందు వాతశ్లేష్మభయమువలన స్వల్పముగ పానముసేయవలయును. అన్నములేకున్నను జంతువులుదకముచే ప్రాణధారణముసేయుచుండును. జలములేకున్న పిపాసాపీడచే నరుడె ప్రాణములు బోవును.

### కాష్ఠవిశేషేణ తాపితవారిగుణాః.

గంధర్వహస్తకాష్ఠైస్తు తప్తం వారిప్రదూషితం। అలక్ష్మీనాశనంపిత్తదోషాణాంచ ప్రసాధనం। భల్లాతకస్య కాష్ఠైస్తు తప్తంయచ్చ శుభోదకం। వాతశ్లేష్మహరంపథ్యం వీర్యతేజోవివర్ధనం। పాలాశోదుంబరోద్భూతకాష్ఠైస్తప్తంచవారియత్। వ్రణకండూహరం చాసృగ్బలవీర్యవివర్ధనం। జంబూవటాస్రశైఃకాష్ఠైస్తప్తం వారి తటాకజం। మేధాబలప్రదంవీర్యకారిదోషవినా

శనం| బదరీసంభవైః కాష్ఠైస్తప్తం వాపీసముద్భవం| కఫవ్యాప్తచనిర్దిష్టం దోషా
ణాంచవినాశనం| కాష్ఠైః ఖదిరజైస్తప్తం రక్తపిత్తవినాశనం | ఆప్యాయనక
రం గ్రీష్మే శ్లేష్మ కృతత్పరం జలం| కదంబనింబజైస్తప్తం కాష్ఠైర్వారిసముద్భవం|
పథ్యం దోషహరం కండూరక్తపిత్తవినాశనం | ధాత్రీదారుసముద్భూతకాష్ఠై
స్తప్తం చయజ్జలం| వాతపిత్తహరం శ్లేష్మరసాయనకరం పరం| కర్కంధుదారు
సంభూతకాష్ఠైస్తప్తంచ యజ్జలం| జఠరాగ్నేః ప్రవర్ధనం సుశ్రుతేన ప్రభాషి
తం|| శలకీశాకనిర్యాసకాష్ఠైశ్చాపి పృథక్పృథక్| తప్తం విర్ఘ్నగజం వారి త
దోగ్రాజ్జనయేన్నహూన్| వహ్నైశ్చార్జునకాష్ఠైశ్చ సతతం తాపితంజలం| బ
లమేధాయుర్జనకం మైత్రేయేణ పరిభాషితం||

ఆయాజాతికర్రలచే కాచిన జలగుణములు.

ఆమదపు కఱ్ఱలచే గాచినజలము అంత్ర్యహరము- ఆమపైత్యదోషశమ
నము. నల్లజీడికఱ్ఱలచే కాచినజలము వాతశ్లేష్మహరము- పథ్యము- వీర్యతేజో
వర్ధనము- మోదుగమేడికర్రలచే గాచిన జలము వ్రణకండూహరము- రక్తవీ
ర్యవర్ధనము. నేరేడుమఱ్ఱికఱ్ఱలచే గాచిన తటాకజలము మేధాబలవీర్యప్రద
ము- దోషహరము. రేగుకర్రలచే గాచిన బావినీళ్లు కఫదోషహరము. చంద్ర
కర్రలచే గాచినజలము రక్తపైత్యశమనము- గ్రీష్మఋతువందు శ్లేష్మము- ఆప్యా
యనము. కదంబనింబకాష్ఠములచే గాచినజలము పథ్యము- దోషహరము- కం
డూరక్తపైత్యహరము. ఉశిరిక కఱ్ఱలచే గాచిన జలము రక్తపైత్యశమనము-
శ్లేష్మరసాయనము. తామరకాడలచే గాచినమూతినీళ్లు వాతపైత్యహరము- శ్లే
ష్మరసాయనము. కర్కంధువను బదరీభేదకాష్ఠములచే గాచినజలము జఠరాగ్ని
వృద్ధిబొందించునని సుశ్రుతునిచే జెప్పబడెను. పుప్పి గుంపులుకట్టినది జిగురు
గలకఱ్ఱలచే గాచిన శలవేటిజలము బహురోగములబుట్టించును. మర్రి మద్ది క
ర్రలచే గాచినజలము బలమేధాయుష్కరమని మైత్రేయులవారిచే జెప్పబడెను.

సవిషాన్నపరీక్షా.

ఓదనోవిషవాన్సాంద్రో యాత్యవిస్రావ్యతామిషః | చిరేణపచ్యతే ప
క్వో భవేత్పర్యుషితోపమః|| మయూరకంఠతుల్యోష్మా మోహ మూర్ఛాప్ర
సేకకృత్| హీయతే గంధవర్ణాద్యైః క్లిద్యతే చంద్రికాదిభిః|| వ్యంజనాన్యా
సుశుష్యంతి ధ్మాతక్వాధానితత్రచ| హీనాతిరిక్తాపికృతా శ్యామాదృశ్యేతనైవ
వా| ఫేనోర్ధ్వరాజిసీమంతం తంతుబుద్బుదసంభవః| విచ్ఛిన్నా శిరసా రాగాః
గాఢవాశ్శాకమాంసిషం| నీలా రాజీరసే తామ్రా క్షీరేనధిష్టదృశ్యతే| శ్యా

షూపీతాసితాతశ్రీ ఘృతేపానీయసంభవా । వసామజ్జాశ్చ తద్వచ్చ కపిలా ఛాదరాజీవర్ధీ। శాళీమద్యాంభయోః క్షౌద్రహారిత్త్రైలేరుణోపమా। పాకః ఫలానామామానాం పక్వానాంపరికోపనం। ద్రవ్యాణామార్ద్రశుష్కాణాంస్యాదామ్లాని వివర్ణ్యతే। మృదూనాంకఠినానాంచ భవేత్స్పర్శవిపర్యయః। మాల్యానాంస్ఫుటితాగ్రత్వం మ్లానింగంధాంతరోద్భవం। శ్యామమండలతా వస్త్రే శాంతనంతంతుపక్ష్మణాం। ధాతుమౌక్తికచగ్రామశ్మదశాదిము మలక్తతా। స్నేహస్పర్శప్రభాహానిసప్రమత్వంచ మృణ్మయె। విషద శ్శ్యావశుష్కస్యో విలక్షో పీత్యతేదిశః। స్వేదవేపధు మాశ్రిత్య భీతస్సన్ జృంభతే బహు। ప్రాప్యాన్నం సవిషంత్వగ్నిరేకావర్తస్స్ఫుటత్యపి। శిఖికంఠాభ ధూమార్చి రనర్చిర్వోగ్రగంధవాన్। మ్రియంతే మక్షికాః ప్రాశ్య కాకః క్షామస్వరో భవేత్। విక్రోశంతిహి దృష్ట్వైవ శుకదత్యూహశారికాః । హంసః ప్రస్వరతి మ్లానిర్జీవంజీవస్య జాయతె। చకోరస్యాక్షిరక్తత్వం క్రౌంచస్య స్యాన్మదోదయః। కపోతపరభృద్ధ్వాంక్షచక్రవాకాజహత్యసూన్। ఉద్వేగంయాతి మార్జారశ్శకృన్ముంచతివానరః। ఇత్యన్నంవిషవజ్జ్ఞాత్వా త్యజేదేవంప్రయత్నతః।యథాతేనవిపద్యేరన్నపిక్షుద్రజంతవః। మయూరపృషతోత్సర్గే నభవంతిభుజంగమాః। తస్మాన్మయూరపృషతో భవనే నిత్యముత్సృజేత్। శుకశారికాభ్యాం గరాజాదీన్ విషాన్నాదిపరీక్షార్థమపి గృహేగృహస్థాః పాలయంతి॥

### విషయుక్తాన్న పరీక్ష.

విషముతోఁగూడినయన్నము గట్టిదిపలచబడును. వేగముగ జీర్ణముగాదు. పక్వమగునన్నము పర్యుషితాన్నమువలెనుండును. నెమలికుత్తుకతోఁసమమగునుబ్బకలిగియుండును. మోహము మూర్ఛ చమటయును బుట్టును. స్వభావమగు గంధమును వర్ణమును హీనమైయుండును. పదునుగలిగియుండును. అన్నముపైని నెమలికన్నులవలె గనపడుచుండును. కూరలు వేగముగ నెండిపోవును. చెదిరినరసముగలవైయుండును. స్వభావవికారముకంటె హీనమైన నతిరిక్తమైన వికారముగలిగియుండును. నలువుగ గనబడుచుండి మరల గనబడకుండును. పైకినురుగుగట్టి యదిమార్గమువలె గనబడుచుండును. తీగెలుసాగును. బుద్బుదములుబుట్టును. కోసినచోట నెఱ్ఱబడియుండును. మాంసమైనను శాకమైనను ఖండితమైనట్లుగనపడును. ఎఱ్ఱనిజీరలు పాలయందును పెరుగుయందును గనబడును. నల్లనిపచ్చనిజీరలు మజ్జిగయందుగనబడును. నేయియందు జలబిం

దువులు పడినట్లుండును. వసామజ్జాదిమాంసవిశేషము కపిలవర్ణమై యుండు ను. ఓషధులుద్రవించుచుండును. ఉదకమందును మద్యమందును నలువు గనబడు ను. తేనియయందు ఆకుపచ్చనిరంగగపడును. తైలమందెరుపురంగగపడును. పచ్చిఫలములు వండబడినట్లుండును. పండినవి ప్రకోపించియుండును. ఆర్ద్రశుష్కములగు ద్రవ్యములు ఫులిసి వివర్ణములైయుండును. మృదువులు కఠినములు, కఠినములు మృదువులైయుండును. పుష్పమాలికలకొనలు బద్ధలై వాడి పరిమళము విపరీతమైయుండును. వస్త్రమందు నల్లనిమండలాకృతులు గనబడుచుండును. కమ్మికొనసునందు తంతువులకొనలు వాడిగలిగియుండును. బంగరు మొదలగుధాతువులు మౌక్తికములు చర్మములు రాళ్లు పత్రములు వీటియందు మాలిన్యమంటినట్లగబడును. మృణ్మయ పాత్రలందు చమురు దగిలినట్లుండి కాంతిహీనమై గనబడును.

విషముబెట్టినవానిముఖము నల్లనై శుష్కమైగనబడును. చెమటబట్టి వణకుచు భీతుడై మాటిమాటికావలించుచుండును. విషయుక్తాన్నమగ్నిగుండుబడిన సుడివలెనొకమారుదిరిగి చిటిలిపోవును. నెమలిమత్తుకనో నుముకు బాగ గలిగిన జ్వాల వహ్నియందగపడును, లేదా ఉగ్రగంధముగలిగి జ్వాల లేకుండును. ఈగలీవిషయుక్తాన్నముదినిజచ్చును. కాకముదినిహీనస్వరముకలదగును. శుకదాత్యూహశారికాదిపక్షులు విషయుక్తాన్నమును జూచినమాత్రముననే విశేషముగనరచును. హంసవిశేషస్వరమును జేయును. చాతకముచాడియుండును. చకోరమునకు నేత్రమెరబడును. క్రౌంచమునకుమదముబుట్టును. పావురము, కోకిల, మాలకాక, చక్రవాకము ఇవి ప్రాణములనువిడచును. పిల్లి భయమునొందును. వానరము పురీషమునువిడుచును. ఇట్లు విషయుక్తాన్నమును బక్షిమృగములవలన దెలసి క్షుద్రజంతువులైన నాయన్నమును దినకుండుచోటను జూచి త్యజించవలెను. నెమలిని దుప్పినిజూచి సర్పములు భీతినొందును. కావున వీనియును గృహమందు రెంటిని విడచుచుండవలెను. శుకశారికాఖ్యంగరాజాది పక్షులను విషాన్నాదిపరీక్షార్థమై గృహస్థులు పెంచి గృహమందుంచవలెను.

విరుద్ధద్రవ్యాణి తత్ప్రశమనానిచ.

విశేషాస్సుయసామత్స్యమత్స్యేషుచ చిలిచిమః। చియతేలియతేచిలిచిమః। చిశ్చగునే। లిజ్ఞైవశే। మాత్రేయాసేవితంద్రవ్యం హంతిరోగాంస్తదుద్భవాన్। నిషేవ్యమాణంతలశో విషమప్యమృతాయతే। హీనాతిమాత్రతశమనమాస్నచయకోపనం। భజతేవిషరూపత్వం తుల్యాంశే మనుసర్పిషి। ...

మ్లరససంయోగే మధురీభవతితద్రసాత్ । ఉత్తుండక్యాస్తిందుకేన తిక్తతామధు
రాయతే॥ తిందుకస్యాన్యపక్వక॥ ఉత్తుండకీ కాకతిక్తా॥ ఆర్ద్రికాక్షాయతే శుంఠి
సంస్కారేణలఘుఃసీ। లఘుభ్యోప్యపిహి సక్తుభ్యో గురవస్సక్తుపిండకాః । శా
లిపిష్టేగరీయస్త్వం గోధూమాదపిగచ్ఛతి। లఘుఃపిత్తహరోలాజో వ్రీహితో
గురుపిత్తలాత్। సంగ్రాహిణో లఘూర్ముద్గాత్ కుల్మాసోభేదనోగురుః। ఆమం
గ్రాహితరంతక్రం తద్వికృత మన్యథా । గుడతోయాచ్చ సుతరాం మూత్రి
లంగురుపానకం। గరీయోగుడదధ్యుక్తం రసాలావాతశుక్రిలా । దండాదిమథ
నాద్దధ్నో గురుణశ్చాతిశోఫహాత్। అనుద్ధతస్నేహమపి తక్రంశోఫహరంలఘు।
సర్పిస్స్నిగ్ధతరంహంతి నార్ద్రితంనవనీతవత్। చక్షుష్యోప్యపిహి గోధూమ స్తైలప

క్వస్తుదృష్టిహా॥ మూలకంవోషజననం సిద్ధంతుసదవోషలం। ఉష్ణం విషీభవత్యే
వ విషఘ్నమపి మాక్షికం। దుగ్ధాజనస్థాదాత్రిశ్లాఘ్లా దోషలాచపిజాయతే।
శ్లక్ష్ణఃపిష్టోఘనోలేపశ్చందనస్యాప దాహకృత్। మేధ్యస్తిలస్స్వర్శశీతో మేధ్యం
తైలంస్వలోహిమః। తస్యైవ శ్లేష్మకారిత్వం నతైలస్య స్వలస్యవా । దధ్నశ్చవ
యథుకారిత్వం నతక్రనవనీతయోః। భూమిసాత్మ్యం దధిక్షీరం కరీరం క్షురు
వాదిషు। విషఘ్నునాపిపయసా దేహేహేర్వ్యర్థతేవిషం। స్థూలస్థవిరబాలాదా
వమనాద్యా నిషిధ్యతే। వాతహృత్యేపి మార్ద్వీకా ఖర్జూరీకోష్ఠవాతకృత్ । దృ
ష్టేస్సర్వేహిమంద్రవ్యం శోత్రాస్యోష్ణంతుపూజితం। పయస్స్వాదుసం శీతం
విపరీతం తతోదధి। కాలేనజాయతేఽస్మాత్క్షీరివచ్చ ఘృనర్ఘృతం। పయోదధిచ
వాతఘ్నం అజాతంవాతలంతుతత్। ఋతువ్యన్యో రసేష్వన్యో రౌక్ష్యస్నేహ
బలక్రమః। రసాయనంకాచపాత్ర్యాం సద్యఃపర్యుషితావిషం॥

అథాపథ్యశమనం॥ నారికేళఫలేథతండులమధ్యో క్షీరం రసాలే హితం
జంబీరోద్ధసోఘ్నుతేసముచితాసర్పిస్తు మోచాఫలే, గోధూమేషుచ కర్కటీ
హితతమా మాసాత్మ్యమే కాంజికం నారంగే గుడభక్షణంచ విహితం పిం
డాలకంకోద్రవే॥ పిష్టాన్నే సలిలం ప్రియాళుయుతజే పథ్యాహితా మాషజే
ఖండక్షీరభవేచ తక్రముచితం కోష్టాంబుకోలామ్లకే మాత్స్యేచూతఫలంత్వ
జీర్ణశమనం తోయంతు మద్యత్యయే తైలంపౌష్కరజే కటుప్రశమనం శేషం
తుబుధ్యాజనేత్॥ తథా॥ పనసేకదళం కదళేనఘృతం ఘృతపాకవిధావపి
జంబురసః। తదుపద్రవశాంతికరం లవణం లవణేపిచ తండులవారిపిబం॥ నారి
కేళఫలతాళబీజయోః పాచనంసపది తండులంవిదుః। తేవదతిమునయోధతం
డులాన్ క్షీరవారిపరిపాచయేదితి॥ దాడిమామలకతాళతిందుకీ బీజపూరలవ

రీఫలానిచ। క్వాథకేనన నపాచయేత్తదా పాకమేతి వకుళస్యబీజతః॥ మధూ
కమాలూరన్యపాదనానాం పరూషఖర్జూరకపిత్థకానాం। పాకాయపేయుంపి
చుమందబీజం సిద్ధార్థకోహంతిచ బీజపూరం॥ అమ్రాతకోదుంబరపిప్పలానాం
ఫలానిచప్లక్షవటాదికానాం। స్యశ్మర్మిణో పర్యుషితోదకేన సౌవర్చలేనామ్రఫ
లస్యపాకః॥ సౌవీరంఫలమపిచోష్ణవారి హన్యాత్ప్రాచీనామలకమపీహరాజి
కైకా॥ నాగరంహంతి బిల్వాజాంబవం శర్కరా పచతి తింత్రికీఫలం। జీరకంప
చతివాతులోద్భవం పాచయేన్మధురికాక్షపిత్థజం॥ పనసకామలకీఫలపక్తయే ఛ
జతసర్జతరోరపిబీజకం। సకలమప్యుదితానుదితంఫలం ప్రపచతి ప్రస్రుతం క
టుతిందుకం॥ ఆర్ద్రామ్రబీజం పనసస్యపక్త్యై రసాలపక్త్యై ఘనరావబీజం॥ ఘ
నరావస్తండులీయకః॥ అపూపపక్త్యై సజలాయవాని సాత్రైశ్చిసుక్తా పృథుక
ప్రపక్త్యై। పాలంకికా కేంబుకకారవల్లీ వార్తాకవంశాంకుర మూలకానాం॥
ఉపోదకాలాబుపటోలకానాం సిద్ధార్థకో మేఘరవస్యపక్త్యై। పటోలవంశాం
కురకారవల్లీ ఫలాన్యలామాతఫలానిజగ్ధ్వా॥ క్షారోదకం బ్రహ్మతరోర్నిపీయ
భోక్తుంపునర్వాంఛతి తావదేవ॥ వాస్తూకసిద్ధార్థకచుంచశాకం ప్రయాతి స
ద్యః ఖదిరేణపాకం। యథాగుడస్సూరణనాగరంగౌ తథాలుకం తండులవా
రిహంతి॥ పత్రాణిపుష్పాణి ఫలానియాని మూలాని పూర్వం నమయోదితాని।
శాకానిసర్వాణ్యుపయాంతి పాకం క్షారేణ తాన్యేవతిలోదరేణ॥ కాంజికం
హిలవణాన్వితం శృతం పిష్టపాచనికమాదిశంతిహి। సర్పిరేవ యవసూకసం
యుతం మాంసపాచనమథోష్ణవారిణా॥ శ్యామాకనీవారతిలాతసీనాం నిష్పాం
వకంగూయవషష్టికానాం। మంథేనవాకీనకులుద్ధబించా వాకాయపేయుంతి
లత్రైలమేకం॥ గోధూమమాషోహరిమంథముద్గా యవాన్ సతీనాంకితవోనిహన్యా
త్॥ సతీనోలంకః॥ కితవోదుత్తూరః॥ యన్మాతులుంగీఫలమేతిపాకం తుషేణసో
యం లవణానుభావః। కర్పూరపూగీఫలనాగవల్లీ కాశ్మీరజాతీఫలమేతినాశం॥
కస్తూరికాతిల్లకనాభిరేవ జలంపచత్యంబుసముద్రఫేనః। నింబూఫలేనాథయ
వోషణేన తక్రేణవా సర్పిరుపైతిపాకం॥ తైలానిసర్వాణి తిలాదిజాని ప్రయాం
తిపాకం కిలకాంజికేన॥ శృంగిబేరరసరావకేవలః క్షారతోపమథవా పలాశ
జం। ఇక్షువంరస ముదస్యతితీక్ష్ణమగ్నివేశమునినేదమీరితం॥ మాహిషే పయసి
సింధుజంయథా సైంధవకృసరపక్తయేతథా। కాంజికంచ విదురన్నపక్తయే
శీలయంతి జఠరాన్నపక్తయే॥ కిమత్రచిత్రంచ సమాంసమత్స్యభోజీసుఖీస్యా
త్పరిపీయసక్తూన్। ఇత్యద్భుతం కేవలవహ్నిపక్వమాంసేనమత్స్యైఃపరిపాకమే

తి॥ కపోతపారావతనీలకంఠకపింజలానాం పిశితాని జగ్ధ్వా । కాసస్య మూలం
పరిపీయ పిష్టం జనస్సుఖీ స్యాద్బహుశో హి దృష్టం॥ కోష్ణేన మండేన గతాం ప్రయా
స్తు వ్యోస్మైరసాలాపరిపాకమేతి। శుంఠీసతీనస్యాత నాగరంగజంబీరయోః కో
ద్రవకో నిహంతి ॥ జీరామిరాచందనగైరికాభ్యాం నశ్యంతి తజ్జా అపి యే వికా
రాః॥ వటో బేసవా శైర్లవంగేన ఫేనీ శమం పర్పటశ్శిగ్రుబీజేన యాతి । కసా
మూలతో లడ్డుకాపూపయోస్స్యాద్విపాకో భవేచ్ఛష్కులీమండయోశ్చ॥ శ్వావి
ద్గోధాగండకాశ్చ। తత్తైలాద్యావక్షార తోయలకూర్మాదయోపి। మార్గామత్స్యా
పాత్ప్రయుసంయాతి పాకం సాముద్రిగ్రివ్యారనాశం సుఖాయ॥ తప్తం త
ప్తం హేమవాతారమగ్నౌ వారంవారం క్షిప్తమంభస్తథైతత్ । పీత్వా తో
యం దీర్ఘకాలోపపన్నకుంభోజీర్ణం శీఘ్రమేవం జహాతి॥ కూశ్మాండకంచ త్రి
పుసీఫలంచ కర్కారుశీనాతకయోః ఫలంచ । నిహంతి సద్యో హి కరంజబీజం ర
సైర్యదావారిణి మూలమేకం॥ శుంఠీధాన్యం వారిదా హంతి సద్యస్తాంస్తానా
మప్రిద్భవానుద్వికారాన్। స్నేహాజీర్ణం రోగిణాం ముద్గచూర్ణం హన్త్యమ్ల
స్తాహంతి వైరోచకానాం॥ ముఖం దహ్యాతే చూర్ణకేన పత్రిమా దాద్యదానాగవ
ల్లిదళస్సేవపుంసః। సితా తైలపోపిగక్త స్తస్త్రివృత్తో పృథక్తస్య గండూషరూపోప
దిష్టః॥ ఉష్ణేన శీతం శిశిరేణకోష్ణమమ్లేన చ క్షారగణో గుణాఢ్యః। స్నేహేన తీక్ష్ణం
వమనాతియోగే సితాహితా స్యాదితి కాశిరాజః॥ శీతోదకం చాస్యజరోగహా
రి నారీపయశ్చాంజనరుగ్విదారి । ఏలోదకం ధూమగదేషుశస్తం ధాత్రీఫలం
చాతివిరేచనార్తౌ॥ కూశ్మాండకస్య స్వరసో గుడేన పీతో మదం కోద్రవజం ని
హంతి॥ యథానిపీతం సితయాసమేతమున్మత్తమత్త్వమపాకరోతి । శీతాం
బు పీత్వా వకులేన వాపి పిప్పల్యా పూగీమదముజ్జహాతి ॥ కపోతం సార్షపస్నేహ
భర్జితం పరివర్జయేత్ । ఉష్ణైర్నభోంబుభిః క్షౌద్రపాయసం కృసరాచితం॥
రంభాఫలం త్యజేత్తక్రం దధిబిల్వఫలాన్వితం। దశాహామషితం సర్పిః కాంస్యే
మధుఘృతేసమే॥ కృతాన్నంచ కషాయంచ పునరుష్ణీకృతం త్యజేత్ । ఏకత్రబ
హుమాంసాని విరుధ్యంతే పరస్పరం॥ పృథుకానాంతు లవణం చిత్రిమూలమ
థాపి వా। ముద్గస్య తక్రమేవ స్యాత్కూష్మాండం గుడదోషజిత్॥ అజీర్ణాన్న
వికారస్య తక్రం సర్షపమేవ వా। తైలహింగ్వో కేతకీ స్యాత్తాంబూలం సూరణ
స్య తు। పనసస్య తు శుంఠీ చ తైలం వా తిలసంభవం। ఇక్షోశ్శుంఠీకషాయస్స్యా
త్పన్నీరం లికుచస్య చ। ఖర్జూరాణాం భృంగరాజమణూనాం చందనం స్మృతం।
అజామాంసస్య తు ప్రోక్తం జాతీఫలరసం బుధైః । శలాటో రామ్రవృక్షస్య త
క్రింసలవణః స్మృతం। యవాగూం శశమాంసస్య సర్షపస్య ఘృతం స్మృతం।

తిం(త్రిణ్యాస్తు నిశాచూర్ణం తండులోదకమేవవా। దధ్యుపర్యంబువాదేయంత్రయాణాంచ పృథక్పృథక్। రంభాఫలస్యానురిచం మెంతీనాంతు వక్షీం పిబేత్। ఏవంద్రవ్యగుణాన్ జ్ఞాత్వా కాలేకుర్యాత్తు భోజనం । భోజనాగ్రే సదా పథ్యం లవణార్ద్రకభోజనం। అగ్నిసందీపనం రుచ్యం జిహ్వాకంఠవిశోధనం॥ లవణంసైంధవం॥ ఆహారింపద్విధం చోష్యం పేయం లేహ్యం తథైవచ। భోజ్యం భక్ష్యం తథాచర్వ్యం గురువింద్యాద్యథోత్తరం॥ చోష్యం ఇక్షు దాడిమాది। పేయం క్షీరాదిః। భోజ్యం పోలికాదిః। భక్ష్యం లడ్డుకాదిః। చర్వ్యం శష్కులాదిః॥ నాతిసుహితో అమృతాభిధానమసీత్యుపరిష్టా దపః పీత్వా ఆచాంతః పునరాచమ్య దక్షిణపాదాంగుష్ఠే పాణినిశ్రావయేత్॥ అంగుష్ఠమాత్రఃపురుషో హ్యంగుష్ఠంచసమాశ్రితః। ఈశస్సర్వస్యజగతః ప్రభుః ప్రీణాతి విశ్వభుగితి బోధాయనః॥ సుహితః తృప్తః॥ దధిక్షీరఘృతైర్భుక్త్వా ప్రభూతైర్వ్యంజనైస్తథా। ఉష్ణోదకై ర్ధాన్యచూర్ణైః కరౌ శ్మశ్రూణి శోధయేదితివృద్ధశాతాతపః॥ మాంసమత్స్యతిలమధుసంస్పృష్టం ప్రాశ్యాపఉపస్పృశ్యాగ్నిమభిస్పృశేదితి బోధాయనః॥ ఏవంభుక్త్వా సమాచామన్గండూషగ్రహపూర్వకం। భోజనే దంతలగ్నాని నిహృత్యాచమనం చరేత్। కుర్యాదనిర్హృతంతద్ధి ముఖస్యానిష్టగంధితాం। దంతలగ్నమనిర్హార్య్య లేపమన్యే తదంగవత్। నతత్ర బహుశః కుర్యాద్యత్నం నిర్హరణంప్రతి॥ బహుదంతసంఘర్షణేన దంతానాం విరళత్వం స్యాదితి॥ విష్ణుదత్తంయథైవాన్నం పరిణామశ్చవై యథా। సత్యేన తేన మద్భుక్తం జీర్యత్వన్నమిదంతథా॥ అగస్త్యిరగ్నిర్బడబానలశ్చ భుక్తంమయాన్నం జరయత్వశేషం।సుఖంచమేతత్పరిణామసంభవంయచ్ఛత్వరోగంమమచాపి దేహం॥

## విరుద్ధద్రవ్యములును వాటిశాంతులును.

పాలతో మత్స్యములను బుచ్చుకొనరాదు- అందులో చిలీచీమమనునది విశేషముగగూడదు. విషము మాత్రకట్టుచేసి పుచ్చుకొనిన దానివలన బుట్టినదోషములనుగూడ హరించును. విషమైనను తిలప్రమాణము మొదలభ్యసించిన యమృతమువలె గుణముజేయును. కొంచమైన నధికమైన నది వాతప్రకోపమును జేయును. తేనియ, నేయి సమముగ గలిపిన విషమగును. క్షారము పులుసు నీరెండునుగలసి తత్క్షణము పుచ్చుకొనుటకు రుచిగలిగియుండును. తుమ్మికపళ్లు, గురిజపళ్లును గలిపి పుచ్చుకొనిన చేదు మధురమగును. అల్లమువలన శుంఠిపుట్టును. సంస్కారముచే చులకనైయుండును. సక్తు లఘువై యుండును. అదియుండలుజేసిన గురుత్వముజేయును. గోధూమముకంటె వరిపిండి గు

రుత్వము జేయును. వ్రీహులు పైత్యమును గురుత్వమును జేయును. అవి పేలాలా నర్చిన లఘుతరమై పైత్యము నణచును. మలబంధకారియై లఘుత్వము కలిగిన పెసలకంటె నడవిమినుములు గురుత్వమును జేసి విరేచనము జేయును. మజ్జిగామమును మలబద్ధమును జేయును. దీనిని సంస్కారవిశేషమొందించిన బలమును జేయును. వట్టిబెల్లపునీళ్లకంటె మరికొన్ని వస్తువులు గలిపిన పానకము గురుతరమై మూత్రకారియగును. బెల్లము పెరుగును గలిపిన గురుత్వమును జేయును. రసాలవాతకారియై శుక్లవృద్ధిని జేయును. గురుత్వమును శోఫను జేయును. కవ్వముచే మథించిన పెరుగుకంటె వెన్నదీయకుండినను తక్రము శోఫహారము-లఘుతరము. మిసిమిగలిగిన నేయి వెన్నవలెను పీడగలవాడిని బాధించదు.

గోధూమములు నేత్రారోగ్యకరములైనను వీటిచేనగు తైలపక్వములు దృష్టిహరములగుచున్నవి. ముల్లంగి దోషములను పుట్టించునదియైన నదిపచనమైన దోషమును జేయదు. తేనియ విషహరమైనను కాచిచల్లారినది విషమగును. దుష్టపాత్రయందుంచిన ద్రాక్షాపండు దోషమును జేయును. మెత్తనిమంచి గంధపుమైపూతయైనను సాంద్రముగ బూయబడిన దాహకారియగును. పవిత్రమైనతిలలు శీతలస్పర్శగలవైనను పవిత్రమగు తైలము స్వలము- శీతలము- ఆదిలలకే శ్లేష్మకారిత్వముగాని తైలమునకైనను స్వలమునకైనను లేదు. పెరుగు బ్బును బుట్టించెడిదైనను తక్రనవనీతములకు లేదు. భూమితో సమానమగు గుణము పెరుగుపాలు వెదురుమొలక మరువము మొదలగువాటియందగపడును. పాలు విషహరమైనవైనను వీటిచేతను పాముశరీరమందు విషము వృద్ధి నొందును. స్థూలశరీరులకు, వృద్ధులకు, వమనాదిరోగులకు తొమ్మిదవసంవత్సరము మొదలు పదారవవత్సరముల వయస్సుగలవానికిని పాలుగూడదు. తేనియ వాతహరమైనదైనను ఖర్జూరముతో గలసి గర్భపాతము జేయును. స్పృశింపబడినను జూడబడినను చల్లనగు ద్రవ్యము కర్ణమునకు ప్రాజీతమై యుష్ణమై యుండును. క్షీరము మధురసము శీతలము- దీనికి విపరీతమగు గుణమును పెరుగు జేయును. పెరుగువలన బుట్టిన నేయి మరల పాలవలెనే గుణమును జేయును. పాలును పెరుగును వాతహరము- నూతనప్రసూతయగు దాని పాలు వాతకరము.

ఒకద్రవ్యమే ఋతుభేదముచేతను కొన్ని ద్రవ్యములు రసభేదముచేతను వేడి, చమురు, బలమును క్రమముగ గలిగించును.

ఇటుపైని యుపథ్యకాంతిని జెప్పుచున్నారము. కొబ్బరికాయకు బియ్యాము- మామిడిపంటికి క్షీరము- నేయికి నిమ్మపంటిరసము- అనటిపండికి నేయి-

గోధూమములకు దోసకాయ- మాంసమునకు గంజి- నారింజకాయకు బెల్లము- అల్లకు పెండలము- ఉప్పుపిండికి నీళ్లు- పాలపండుకు కరక్కాయ- మినుములకు పటికి పంచదార- పాలకు మజ్జిగ- రేగుపంటిరులుమకు వేడినీళ్లు- చేపలకు మామిడిపండు- తేనియకు నీళ్లు- తామరతూళ్లకు సూదియ- పనసపంటి కనటిపండు- అనటిపంటికి నేయి- నేయికి నిమ్మకాయరసము-నిమ్మకాయకు ఉప్పు- ఉప్పుకు కడుగు- కొబ్బరికాయ తాటిముంజలకు బియ్యము- బియ్యమునకు పాలైన నీళ్లైన- దాడిమపండు, ఉసిరికాయ, తాటిపండు, తుమ్మికపండు, తురంజీదబ్బ, లవలీఫలము వీటికి పొగడగింజలు- ఇప్పపువ్వు, మారేడుపండు, పాలపండు, ఈతపండు, ఖర్జూరము, వెలగపండు వీటికి వేపగింజలు నూరి పుచ్చుకొనేది. తురంజీదబ్బకుమాత్రం తెల్లావాలు.

ఇప్పపువ్వు, బొడ్డకాయలు, రావికాయలు వీటికి జువ్విగాయలు. మామిడిపంటికి వేడినీళ్లతో సౌవర్చలవణము. రేగుపంటికి వేడినీళ్లు, పాతఉశిరికపప్పుకు గాజిక. మారేడు నేరేడు పండ్లకు శుంఠి. తుమ్మికపండ్లకు పంచదార. పగడపంటికి జీలకఱ్ఱ. వెలగపంటికి తేనియ. పనస ఉశిరికపండ్లకు సర్జతరుబీజములు. మరికొన్ని చెప్పబడని ఫలములకును త్రికటుకము పచ్చిమామిడిగింజ. పనసకాయకు చిల్లగింజలు. మామిడిపంటికి అప్పములకు ఖురాసానీ వామునీళ్లు. ఇవియె అటుకులకును. వంకాయ వెదురుకంజ ముల్లంగి వీటికి బచ్చలి. చేతపొట్లకు ఆనపకాయ. చిల్లికి తెల్లఆవాలు. పొట్లకాయ, వెదురు మొలక, కాకరకాయ, మామిడికాయ వీటికి బ్రహ్మదండిక్షారముదకముతో బుచ్చికొనిన జీర్ణమగును. చక్రవర్తికూర, ఆవకూర, చంచలికూర ఇవి కాచుపనిన జీర్ణించును. కందకు నాగరంగమునకును బెల్లము. ఆలుదుంపలకు కడుగు. పత్రపుష్పఫలమూలములు భేదించి చెప్పబడకుండినను శాకములని చెప్పుటచే కూరకుపనికివచ్చేవన్నియునని తెలియదగును. ఆయాజీర్ణకారి ద్రవ్యక్షారము నూనియతో బుచ్చికొనిన నన్నియు జీర్ణమగును. తరవాణి యుప్పుతో మరిగించి పుచ్చికొనినపిండి జీర్ణమగును. యవముళ్లు నేయిలోవేసి మరగించి యానేయి వేడినీళ్లలోవేసి బుచ్చికొనిన మాంసము జీర్ణించును. చామలు నివరధాన్యములు పువ్వులు అగసివిత్తనములు అనువులు గంటెలు యవలు షష్టికాలు వీటియన్నమును ఉలవలు చింతపండు యివి నూనియద్రావిన జీర్ణించును. గోధూమములు మినుములు బొబ్బర్లు పెసలు వీటికి పుష్మెత్రగింజలచే వమనము చేయించిన దోషించవు. తురంజీదబ్బకునుప్పు- కర్పూరము పోకచెక్క- తమలపాకు

కుంకుమపువ్వు జాజికాయ కస్తూరి వీటికి యిందుపుగాయ సముద్రఫేనమును నీళ్లతోబుచ్చుకొనవలయును. నిమ్మకాయ యవగంజి మజ్జిగ నిందులోనేదైన నేయినిజీర్ణింపజేయును. నువ్వులుమొదలగువాటిచమురు తరవాణిచే జీర్ణించు ను. అల్లపురసమైనను మోదుగక్షారము జలముతోనైన బుచ్చుకొనిన చెరుకు సంబంధమైనద్రవ్యములన్నియు జీర్ణించునని యగ్నివేశమునివచనము. గేదెపా లుప్పుచేజీర్ణించునట్లు సైంధవలవణముచే పులగము జీర్ణించును. అన్నమునకు తరువాణి- మత్స్యమాంసములకు సత్తుపిండి మరియు మత్స్యములకు ఖర్జూరిదగ ల్చినిప్పులపైనిగాల్చినకేవలమాంసము- గువ్వ పారువము నెమలి కపిం జలము వీటిమాంసమునకు గాజుచెట్టువేరును నీళ్లతోనూరి పుచ్చుకొనేది. మామిడి పంటికి శుంఠి పిప్పలి మిరియాలు- ఇందుక వేడిగల పెరుగుమీదనీళ్ల చేపాలు జీ ర్ణించును. నారదబ్బ జంబీరఫలములకు శుంఠి- చందనము జేగురు జీలకఱ్ఱయు ను అరికన్నమును జీర్ణించును. చేదిపొట్ల శేపవారము- లవంగముచే ఫేణీ- ము లగగింజలచే నప్పడము- పిప్పలిదుంపచే లాడూలు నప్పములు చక్కిలములు మడిగలు. ఆలుగు ఉడుము గండకీమృగములమాంసమునకు చిత్రమూలపువేళ్ల తైలము. అడవిపంది తాబేలు మొదలగువాటి మాంసమునకు యవాక్షారము. పాయసమునకు పెసరకట్టు. తరవాణికి ఉప్పు. ఉదకమువలనబుట్టిన యజీర్ణ ము చిరకాలమగునుదకా జీర్ణము వెండియైన బంగారమైన గాల్చి జలములో వే సి యవిచల్లార్చి పుచ్చుకొనిన శమించును.

గుమ్మడికాయ, గ్రంథితగరము, దోసకాయ, సీనాతకము ఇవి కాగు గింజరసమైన దానివేరురసమైనను బుచ్చుకొనిన జీర్ణించును. శుంఠి, ధనియాల కషాయము సకలామవికారములను శమింపజేయును. చమురువలనబుట్టిన య జీర్ణము పెసరపిండిచేబోవును. తుంగముస్తలరోచకమునుశమింపజేయును. త మలపాకునసున్నమెక్కువై నోరుమండిన పంచదార నూనియ రేగుశింజలచూ ర్ణమును గలపిన జలమును గండూషణజేసిన శమించును. చల్లనిదానికి వేడిది వేడిదానికి చల్లనిది, క్షారమునకు పులుసు- వట్టివేరు నూనియ- దోషులకు పంచ దారయును హితమని దివోదాసుడను కాశీరాజనిరి.

ముఖరోగములకు చల్లని నీళ్లు- నేత్రరోగమునకు చనుబాలు- ధూమా జీర్ణమునకు యేలకులరసము- అతివిరేచనార్తునకు పుశిరికాయ- పుల్లగుమ్మడి కాయరసమును బెల్లమును గలిపి పుచ్చుకొనినవారికన్నము జీర్ణించును. ఈగు మ్మడిరసమె పంచదారనుకలిపి పుచ్చుకొనిన నుమ్మెత్తకాయవికారమణచును.

పొగడగింజలు నూరి చల్లని నీళ్లను గలిపి త్రాగిన పోకచెక్కవికారమణగును. ఆవనూనియందు వేచిన కపోతమాంసమును, వెచ్చజేసినవర్షోదకమును, తేనియ పానసము, పులగముతో గలిపినదియును, మజ్జిగ యనటిపండును గలిసినది, మారేడుగాయతో కలిసిన పెరుగును, పదిదినములు కంచుపాత్రలో నిలవయున్న నేయి, సమముగాగలిపిన మధుఘృతములు, చల్లారినయన్నమును, కషాయములును, మరలవెచ్చజేసినవి వర్జింపవలయును. మృగపక్షిమాంసములొకటిగాగూర్చినవి భుజించిన విరోధించును. అటుకులకు ఉప్పైనను చిత్రమూలమైనను, పెసలకు మజ్జిగ, బెల్లమునకు గుమ్మడికాయ, అన్నాజీర్తికి మజ్జిగయు నావయు, తైలమునకు ఇంగువనకు మొగలియాకుల రసము, కందకు తాంబూలము, పనసకు శుంఠియైనను, నూనియైనను, చెరుకునకు శుంఠికషాయము, నిమ్మకాయకు పన్నీరు, ఖర్జూరమునకు భృంగరాజము, అనువులకు చందనము, మేకమాంసమునకు జాజికాయరసము, మామిడికాయకు నువ్వుతో మజ్జిగ, చెవలపిల్లిమాంసమునకు గంజి, ఆవకు నేయి, చింతపండుకి పసపైనను,కడుగైనను, పెరుగుమీదినీళ్లుఅయినను, అనటిపండుకి మిర్యము, మెంతులకు వాటిమషి, ఇట్లు ద్రవ్యగుణములనుదెలసి కాలమందు భుజింపవలయును. భోజనాదియందెల్లప్పుడు సైంధవలవణము నల్లమును గలిసిన భోజనము పథ్యము, అగ్నిసందీపనము, రుచ్యము, జిహ్వాకంఠవిశుద్ధికరము.

ఆహారమాఱువిధములు- అందు చోష్యము చెరుకుముక్కలు, దాడిమగింజలు మొదలగు చప్పరించి పీల్చునవి. పేయము క్షీరాదికము. భోజ్యము రొట్టెలు మొదలగునవి. భక్ష్యము లడ్డూలు మొదలగునవి. చర్వ్యము చక్కిలములు మొదలగునవి.

తృప్తుడై యుత్తరపరిషేచనమునిమిత్తముదకము పుచ్చుకొని వేడినీళ్లతో వరిపిండి వేసి హస్తమును మీసములను గడగి మత్స్య మాంస తిల సర్షపాదికము దంతములందు చిక్కుబడును గావున నవి శోధించి గండూషముచే ముఖశుద్ధిజేసి యటుపైని రెండుమారులాచమనమునుజేసి తనదక్షిణ పాదాంగుష్ఠమందు హస్తముతోనుదకమునువేసి యంగుష్ఠమాత్రుడగు పురుషుడంగుష్ఠము నాశ్రయించియుండును. జగదీశ్వరుడు విశ్వభోక్త జగత్తును తృప్తిని బొందించుచున్నాడు. ఇట్లు సమంత్రముగ భావనజేయవలయును. ముఖమందు దౌర్గంధ్యము లేకుండుటకు పళ్లుకుట్టిశోధించవలెను గాని విశేషముగ దంతపీడను జేసిన పళ్లు మొదలుముపకి జబ్బుజేయునని. ఈయన్నము భగవంతునిచే నివ్వబడినది. అది

రక్తాదిధాతురూపముగుటయు నతనిచేతనే గావున సత్యస్వరూపుడగు నావైశ్వానరరూపముగల భగవంతునిచేతను నేను దినినయన్నము జీర్ణించుగావుత. అగస్త్యులు అగ్ని బడబానలము నాచేతినబక్షిన యన్నము జీర్ణింపజేతురు గావుత యని బ్రార్థింపవలయును.

పథ్యాపథ్యాభ్యాసత్యాగప్రకారః.

పాదేనాపథ్యమభ్యస్తం పాదపాదేనవాత్యజేత్, నిషేవేత హితం తద్వదేకద్విత్ర్యంతరీకృతం, అపథ్యమపిహి త్యక్తం శీలితం పథ్యమేవవా, సాత్మ్యాసాత్మ్యం వికారాయ జాయతే సహసాన్యథేతి॥ అయమర్థః॥ అభ్యస్తం అభ్యాసాత్సాత్మ్యతాం యాతం। అపథ్యం పాదేన చతుర్థాంశేన పాదపాదేన షోడశాంశేనవా త్యజేత్॥ హితం పథ్యం తద్వత్ । అపథ్యత్యాగవత్ నిషేవేత్। యావతాఅంశేన పథ్యం త్యక్తం తావతాఅంశేన పథ్యంభజేదిత్యర్థః। నిత్యసేవ్యస్యాహారస్య యామాత్రా తస్యాః అపథ్యేన యోంశ్యానాంశః తం పథ్యేన పూరయేదితి। ఏతదుక్తంభవతి। యదా పాదోనత్యాగః క్రియతే తదా ప్రథమేహని అపథ్యస్య త్రయఃపాదాః పథ్యస్యైకః। ద్వితీయే చత్వారోప్యపథ్యస్య తృతీయే ప్రథమవత్ । ఇత్యేకాంతరీకరణం । చతుర్థే ద్వౌ పథ్యస్య ద్వావపథ్యస్య పంచమషష్ఠయోస్తృతీయవత్। సప్తమే చతుర్థవత్। ఇతి ద్వ్యంతరీకరణం। అష్టమేత్వపథ్యస్యైకః త్రయఃపథ్యస్య।నవమదశమైకాదశేషు సప్తమవత్। ద్వాదశేష్టమవత్। ఇతి త్ర్యంతరీకరణం। త్రయోదశే చత్వారోపి పథ్యస్య చతుర్దశేద్వాదశవత్। పంచదశే త్రయోదశవత్ । ఇతిపాదేనాపథ్యత్యాగపూర్వపాదేనాపథ్యాభ్యాసే క్రమః పాదపాదేన త్వభ్యాసే ఏకద్విత్ర్యంతరీకరణస్య పంచకత్వే ఆవృత్తిః। తతఏకోత్తరీకరణం। ఏవంత్రిషష్ఠిదివసైష్షోడశాః పూర్యంతే। ఇతిపాదపాదేన॥ మాత్రాయోగిక్రియాదేశే కాలావస్థాదిభేదతః। తతస్తతో యతోదృష్టా స్తేతే భావాస్తథాతథా॥ హితాహితత్వేప్యైక్యతస్మియమోస్మాదనిశ్చితః॥

పథ్యాపథ్యాభ్యాసత్యాగప్రకారము.

అనంతరమందు పథ్యాపథ్యములయొక్క అభ్యాసముచేసే క్రమమును విడచుక్రమమును జెప్పుచున్నారము.

అభ్యసింపబడిన సమానత్వముబొందిన యపథ్యవస్తువను నాల్గవవంతు చేతనైనను పదియారవవంతుచేతనైనను విడువవదగును. హితమునపథ్యమునవి

డచునటులనే సేవించవలయును. ఎంతయంశముచే నపథ్యము విడువబడినదో అంతయంశముచేత పథ్యమును పూర్తి సేయవలయును. ప్రతిదినమును బుచ్చికొనెడి పదార్థపరిమాణ మెంతో దానియొక్క అపథ్యముచేత నేతక్కువవంతు కలదో ఆవంతును పథ్యాంశముచేతను పూర్తి సేయవలయును. ఈయంశమునే వివరించెదను. ఎపుడు నాల్గవవంతు విడవబడుచున్నదో అపుడు మొదటిరోజున యపథ్యముయొక్క మూడువంతులున్ను పథ్యవస్తువయొక్క ఒకవంతును రెండవరోజున నాల్గవవంతులును అపథ్యవస్తువయే మూడవరోజున మొదటిదినమువలెనే- ఈలాగున నేకాంతరీకరణము. నాల్గవరోజున రెండువంతులు పథ్యమును రెండువంతులపథ్యము నైదారుదినములయందు మూడవదినమువలెనే యేడవదినమునందు నాల్గవరోజువలెనే- ఈలాగున ద్వ్యంతరీకరణక్రమము. ఎనిమిదవవాసరమున నపథ్యమొకటియును పథ్యముమూడును. తొమ్మిది, పది, పదునొకండవదివసములయందు యేడవనాటివలెనే- పన్నెండవరోజున ఎనిమిదవరోజువలెనే- ఈలాగున త్ర్యంతరీకరణక్రమము. పదమూడవరోజున నాలుగువంతులును పథ్యముయొక్కయె పదునాల్గవరోజున పన్నెండవరోజువలెనే- పదియేనవదినమున పదమూడవరోజువలెనే- ఈలాగున నాల్గవవంతపథ్యత్యాగపూర్వకపథ్యగ్రహణక్రమము. పదియారవవంతున నభ్యాసవిషయమైయేకత్వత్ర్యంతరీకరణమునకు అయిదొంటయందావృత్తి. అటుతరువాత నొక్కొక్కటి యావృత్తి సేయుట. ఈలాగున నరువదిమూడుదినములచేతను పదియారువంతులు పూర్తి కాబడును.

శరీరారోగ్యమునకౌషధస్వీకారముచేతనుపథ్యాభ్యాసాది క్రియలచేతను దేశకాలావస్థాదిభేదములవలన క్రమముగ నాయాయి శరీరదార్ఢ్యాదిభావములగుపడుచున్నవి. ఇటులనపథ్యాశనమున ఔషధసేవను జేయకుండుటవలన శరీరదార్ఢ్యము తప్పును.

తాంబూలవర్గః.

భూయోపాచ్యాచమ్య కర్తవ్యం తతస్తాంబూలభక్షణమితి మార్కండేయః॥ పూగీఫలంపైత్యహరం ప్రధానం విరేచనీయం లఘుదీపనంచ। ఈషచ్చమాధుర్యరసేన యుక్తం జాడ్యాపహం వస్తివిశోధనంచ॥ చందాపురాద్యుద్భవంపూగం కఫఘ్నం మలశోధనం। కటుస్వాదుకషాయంచ రుచ్యం దీపనపాచనం॥ ఆంధ్రదేశోద్భవంపూగం కషాయం మధురం పరం। వాతజిద్రక్తజాడ్యఘ్నమీషదామంకఫాపహం॥ పశ్చిమార్ణవదేశేతు క్రముకం పత్రమేవచ। కఫ

మారుతకోపంచ మందాగ్నిక్రిమివర్ధనం॥ ద్రావిడోద్భవపూగాని వృష్యాణి మధురాణిచ। కించిద్వాతప్రకోపాని పత్రం తద్గుణమాదిశేత్॥ ఘోంటా కటుకషాయోష్ణా కఠినారుచికారిణీ। మలవిష్టంభశమనీ పైత్యకృద్దీపనీచసా॥ హృద్యస్స్వాదుసుఖావహస్సతుపరం స్నిగ్ధోపిపైత్యాపహో వాతఘ్నః క్రముకః కఫప్రశమనస్సంతర్పణశ్చకరణః। వృష్యః పైత్యబలాపహస్సుకఠినో యోషా గురుస్థూలకస్సంభిన్నే శశమాంసకాంతిసుభగో భేదీలఘుస్సంమతః॥ ఆర్ద్రింపూగం కషాయం ముఖమలశమనం కంఠశుద్ధిం విధత్తే రక్తామశ్లేష్మపిత్తప్రశమన ముదరాధ్మానహానింకరస్యా। శుష్కాంకం చామయఘ్నం రుచికర ముదితం పాచనం రోచనంస్యాత్తత్ప్రాయస్తాపయుక్తం యదిజడ ముదితం పాండుపైత్యామయఘ్నం॥ వన్యంపూగఫలం మహోరతిహరం కుర్యాదతిశ్లేష్మకం సహ్యాంనైవభక్షేద్విరేచనకరం మోహంముహుఃకారయేత్॥ క్రముకంత్రితయాస్మాసాత్పత్రాత్పత్రం సమాగతం। చూర్ణంత్రిరాత్రం సంత్యక్త్వా తాంబూలంభక్షయేన్నరః॥ ఏవంచేత్పూగానాం తైక్ష్ణ్యం పర్ణానా మామదోషం చూర్ణస్యోగ్రత్వం శామ్యతీతి॥ ఖండీకృతం వ్యపోత్తాగ్రైః కషాయం యత్సఖండిభిః। కర్పూరాద్యైః ప్రసూనైశ్చ వాసితం తచ్చ భక్షయేత్। నోచేద్దంతస్య శైథిల్యం భవేద్దంతవిఘట్టనాత్। కర్ణరోగ శిరోరోగా హనుస్రంసస్తు జాయతే॥ అఖండిత పూగభక్షణేన కీటభక్షణమపి క్వచిద్భవేత్॥ పూగశ్చేన్మృగనాభిసంగభరిత స్తద్వాసితం భక్షయేత్కర్పూరేణ తథైవ దేవకుసుమైర్గంధైరసైః కైస్తథా। తస్మాత్కాలశరీరదేశవికృతింజ్ఞాత్వాచ తద్భక్షణం పానీయాదిసమస్తవస్తుకరణం చోపాధిభేదాద్భవేత్॥

## తాంబూలవర్గము.

శుద్ధాచమనానంతరమందు తాంబూలభక్షణమును జేయవలయునని మార్కండేయులు. పోకచెక్క పైత్యహరము- విరేచనకారి- లఘువు- దీపనము- ఇంచుకమధురము- జాడ్యహరము- గర్భశోధనము. నందాపురిపోకలు- కఫహరము- మలశోధనము- ఇంచుకవట్టుగలిగిన మధురము- సుగంధము- రుచ్యము- దీపనము- పాచనము. ఆంధ్రదేశపుపోక- వగరుగల మధురము- వాతము- రక్తజాడ్యము- ఆమము- కఫము- వీటినిహరించును. పశ్చిమసముద్రతీరదేశమందగు పోకయును తమలపాకును వాతకఫప్రకోపమును మందాగ్నిని క్రిమిని బుట్టించును. ద్రవిడదేశమందగు పోకలు తమలపాకులును వీర్యవర్ధనము- మధురము- ఇంచుకవాతప్రకోపకరము. గొంటుచెక్క- వట్టి,వగరు,వేడి, కాఠిన్య

ము, రుచియును గలిగి విరేచకమై పైశ్యకారియై దీపనమై యుండును.

వట్టిగవాము- హృద్యము- స్వాదు- సుఖకరము- స్నిగ్ధము- త్రిదోషహరము- తృప్తికరము- వీర్యకరము- కఠినము- స్థూలము- బరువుగ లది చెవులపిల్లి రక్తమువలె కర్తరించిన నెత్తురంగుగలిగియుండును- విరేచనకారి- సర్వసమ్మతము. పచ్చిపోక వగరు- ముఖమాలిన్యహరము- కంఠశుద్ధికరము- రక్తామశ్లేష్మపైత్యోదరములను, కడుపుపొంగును హరించును. ఎండుపోక- కంఠరోగశమనము- పాచనము- రుచికరము- పాండుపైత్యహరము. అడవిపోక మనస్తుష్టిని జేయక శ్లేష్మకరమై రేచకమై మూర్ఛను బుట్టించును. మూడుమాసములు పాతబడినపోకయును పదేనురోజులు నిలవజేసిన తమలపాకులును మూడుదినములు నిలవయున్న సున్నమున్ను తాంబూలమునకు ప్రశస్తము. ఇటులజెప్పుట వలనతో కస- పసరు- పొగరు అణగునని. పోకచెక్కలు కర్తరించి యగ్రములు లేకుండ నలిపి కర్పూరము లవంగాదులచే వాసితమగు తాంబూలమును భక్షింపవలయును. ఇటులగాకున్న కఠినమగు పోకలు కొరకుటచే దంతములకు శైథిల్యమును కర్ణరోగ శిరోరోగాదులను అంగుటికి వరపును గలుగును. పోకచెక్కలు కర్తరించకుండిన యందుగల కీటములనుగూడ భక్షించును.

పోకచెక్కలు, కస్తూరి, కర్పూరము, లవంగములు, మరియును గంధపుద్రవ్యములతోగలిపి దేహదేశకాలానుగుణముగ తగిన వస్తుమేళనముతో భక్షింపవలయును. ఇటుల జలముమొదలగు వస్తువులను దేశకాలపాత్రములనను సరించి సేవించిన యారోగ్యమగును.

అథ తాంబూలవల్లీదళం వ్యాఖ్యాస్యామః॥ తాంబూలీదళమాస్య పిచ్ఛిల మలప్రాగ్భూతదుర్గంధజిత్సర్వం తిక్తకషాయముష్ణవిషదం శ్లేష్మానిలఘ్నంపరం। సద్యశ్ఛేదితభక్షణం ముఖరుజాజాడ్యాపహం దోషకృద్దాహారోచకరక్తదాయి మలకృద్విష్టంభికాంతిప్రదం॥ కృష్ణంవర్ణం పర్ణముష్ణంకషాయం ధత్తేజాడ్యం వక్త్రదాహంమలంచ। శుభ్రం పర్ణం శ్లేష్మవాతామయఘ్నం పథ్యం రుచ్యం దీపనంపాచనంచ॥ కర్పూరవల్లిజమేతత్ప్రమోదం మధురాలఘు। సక్షారదీపనీచోష్ణా శ్లేష్మఘ్నీరోచనీపరా॥ సక్షారంకటుదీపనంరుచికరం సౌభాగ్యసంపత్కరం వర్ణ్యంప్రీతివివర్ధనం లఘుతరం వక్త్రామయధ్వంసనం। కామోద్దీపనకృత్సుగంధివిశదం కర్పూరవల్లీదళం పథ్యంవాతకఫాపహం సుకృతిభిర్భూపైస్సదా సేవ్యతాం॥ తాంబూలవల్లీదళనంచ సాంద్రం సుశ్వేత హేమాభవతి వహాఖ్యం। వారాహకర్ణప్రతిమం సురక్త దేశోద్భవాహ ద్వివిధామయఘ్నం॥

కర్పూరగంధోదకభావితం తత్తాంస్యే కరండైకనపూరితంచ। విజ్ఞానవత్యాః
కరపల్లవేన సుభక్షితం సౌమ్యదిశిప్రశస్తం॥ భక్షణంచూర్ణపర్ణస్య లక్ష్మీహానిర్ధ
నక్షయం। క్షీణపర్ణస్య శైథిల్యం గ్లానంచకురుతేగదాన్॥ పర్ణాగ్రం పర్ణమూ
లంచ చూర్ణపర్ణం ద్విపర్ణకం। శీర్ణపర్ణం జరత్పర్ణం వర్జయే ద్బుద్ధిమాన్నరః॥
పర్ణమూలేభవేద్వ్యాధిః పర్ణాగ్రే పాపసంభవః। చూర్ణపర్ణం హరత్యాయు
శ్శిరాబుద్ధివినాశనీ॥ తాంబూలవల్లీచ్ఛదనాని సమ్యగ్విశోధితాని క్రముకీఫలాని।
చూర్ణంతుశుద్ధం మిళితం సమస్తం తాంబూలమిత్యేతదుదాహరంతి॥ ఏకపూ
గం పంచపర్ణం చూర్ణం నిష్పావమాత్రకం। కర్పూరేణ తదర్ధంస్యాత్తక్కోలం
త్రిచతుష్టయం। లవంగకుసుమంతద్వత్సార్ధంజాతీకాఫలం। క్రమేణ భక్షయే
ద్వ్యాప్యంస్తాంబూలం సర్వదోషజిత్॥ పూగాంతర్గతకీటస్తు గళగండగదాన్న
యేత్। పర్ణాంతర్గతకీటస్తు ముఖరోగానరోచిచ। చూర్ణస్యసూక్ష్మం పాషా
ణం సేవితంచాశ్మరీభవేత్। తస్మాత్పర్ణాదిశుద్ధించ కుర్యాత్తాంబూలభక్షణం॥
తాంబూలసేవాం విధినా విదధ్యాద్భుక్తేఃపురస్తాదిహసప్తపత్రం। భుక్త్వాథవా
సప్తశయీత మర్త్యో ద్విసప్తసేవాం నితరాం నిశాసు॥ పూగాధిక్యంతు పూ
ర్వాహ్ణే మధ్యాహ్నే చూర్ణముత్కటం। రాత్రౌచ పత్రబాహుళ్యం తాం
బూలంభక్షయేన్నరః॥ రాగోభవేత్పూగదళేసమానే విరాగతా పూగఫలాధి
కత్వే। చూర్ణాధికేచాస్యసుగంధహానిస్సౌరభ్యమాస్యే బహుళేపలాశే॥ తత్ఖ
ల్యంసేవితంరూక్షమరుచిర్వహ్నినాశనం। అపథ్యం పీనసశ్వాసపాండుకృత్ప్ర
ప్రమేహకృత్। పాండుత్వం దంతదౌర్బల్యం బాధిర్యంచాక్షిరోగతా। వాతపై
త్యప్రకోపస్స్యాత్తాంబూలస్యాతిసేవనాత్॥ ఆదౌవిషోపమంప్రోక్తంమధ్యే దీపన
పాచనం। అమృతప్రతిమంచాంతే త్రిధా తాంబూలలక్షణం॥ విష్టంభి శూలా
ర్తిహరం క్రిమిఘ్నం హృద్యం సుగంధం వదనే దదాతి। దంతోష్ఠ రాగం
కురుతే నరాణాం రోగాతురాణామపి దీపనంస్యాత్॥ కామంప్రదీపయతి రూ
పమభివ్యనక్తి సౌభాగ్యమావహతి వక్త్రసుగంధకారి। పూజ్యం కరోతి కఫ
జాంశ్చ నిహంతిరోగాంస్తాంబూలమేవ పరమంచగుణంకరోతి॥ ఉత్పత్తిర్నాగ
లోకే వహతి పరిమళం వాతపైత్యప్రభేదీ శృంగారే కామదూతీ రతిఫలసమ
యే సర్వకాలేషు భోగ్యం। దంతాన్స్నిగ్ధాంకరోతి స్ఫుటమణికిరణానుకారంకుమా
రక్తరేఖాంస్తాంబూలంశ్రీనివాసం తవవసతుముఖే యావదర్కేందుతారం॥ లా
లాస్రుతింపాండురవర్ణహాస్యే దంతాదిదౌర్బల్యముపైతిజంతుః। విజృంభణం వ
క్త్రగళామయానాంనిశాసు తాంబూలముఖస్యనిద్రా॥ స్వాపంకృత్వా జలంపీ
త్వారతింకృత్వాఫలాదికం। భుక్త్వాక్షణంసమాశ్వాస్య తాంబూలంభక్షయేత్సు

ధీ॥ ఫలపత్త్రైస్సురాధీశబ్రహ్మావిష్ణుమహేశ్వరాః। తాంబూలదానకృత్త్రైపా స్తస్మాత్తద్దానముత్తమం॥ సుపత్రైః సుపూగేన సుచూర్ణేన సమన్వితం। సుబ్రాహ్మణాయ తద్దత్వా తాంబూలంఖాదయేన్నృధఃఇతి వశిష్ఠః॥ సభాప్రవేశే శయనే వివాహే క్రతౌచయుద్ధే జననేప్రయాణే। గ్రామప్రతిష్ఠాదిషు దేవకార్యే తాంబూలదానం పరమం ప్రశస్తం॥ క్షీరంకపిత్థం పనసం ఫామ్రం ఫలంకదళ్యాశ్చ తిక్తేక్షుఖండం। మద్యంచయూషంచ రసంకషాయం ఘృతస్య పానం మధునారికేళం। పీత్వా విజహ్యాద్ఘటికాం నిషిద్ధకాం తాంబూలమాత్రేవిషమంవదంతి॥ ప్రకరణేస్మిన్మద్యగ్రహణం తాంబూలవిరుద్ధద్రవ్యగణనార్థమేవ నతు పేయార్హద్రవ్యమితిబోధనార్థం శూద్రస్యాప్యపేయత్రవణాత్ ॥ మద్యమాంసప్రియంనిత్యం నీచకర్మానువర్తినం। తంశూద్రం వర్జయేద్విప్రశ్శ్వపాకమివదూరత ఇతి పరాశరః॥ తాంబూలం పాండుమేహప్రకటిత నయనోన్మాద తృష్ణాతురాణాం సంశుద్ధక్షీరపీతశ్రమనుదవిషప్రైత్యాప్రశోభాస్వితానాం। మూర్ఛాశేసారక్తఘ్నపిప్రివరవనిముహః దేహదాహార్దితానాం త్వద్గోపాస్నృతీనాం కుయుగదవిషసర్పర్దితానాం నపూజ్యం॥

ఇటుపైని తాంబూలలక్షణములు జెప్పుచున్నారము. తమలపాకు వోటజ్వరమునగట్టుటను దౌర్గంధ్యము మొదలగువాటిని బోగొట్టి సంచుకతేదు వగరు వేడికలిగి నిర్మలమై శ్లేష్మవాతహరమై యుండును. అప్పుడుగోసిన పచ్చాకు ముఖరోగమును జాడ్యదోషమును దాహమును అరుచిని రక్తదోషమును మలబంధమును జేసి కాంతినణచును. నల్లనిరంగు కు వేడజేసి వగరై జాడ్యకరమై నోరునొంచించును. తెల్లటచిగురు శ్లేష్మవాతహరము పథ్యము - రుచ్యము - దీపనము. కర్పూరవల్లిదళము సంతోషమును జేయును. మధురమును లఘువు కారము కలిగి దీపనము - ఉష్ణము - శ్లేష్మఘ్నము - రుచికరము. ఉప్పునవల్లియును కలిగి దీపనము రుచికరము సౌభాగ్యసంపత్కరము వర్ణ్యము శ్రీవర్ధనము లఘుతరము ముఖరోగశమనము కామోద్దీపనము సుగంధము పథ్యము వాతకఫహరము విశదకరము ఇట్టికర్పూరవల్లిదళము రాజులచే సేవించబడునుగావు. ఎఱ్ఱభూమియందుబుట్టిన తమలపాకు దళసరి తెలుపు సువర్ణకాంతియైనసునుగులిగి వరాహకర్ణాకారమై సౌమ్యరసమై వివిధరోగములనుహరించును. కర్పూరగంధోదకముచే భావితము కంచుడబ్బిలో తాంబూలమట్టియుంచి యౌవనైశ్వర్యముగల స్త్రీహస్తపల్లవముచేనివ్వబడి యుత్తరదిగభిముఖుడై భక్షించుట ప్రశస్తము. సున్నముంచినయాకుసుభక్షించిన లక్ష్మీనాశనియు ధనక్షయమునగును. వాడి

పోయిన చిరిగిపోయిన పత్రిములను భక్షించిన రోగములను జేయును. పర్ణాగ్రమును మూలమును సున్నముంచిన యాకును రెండాకులొకమారు శీర్ణ జీర్ణ పర్ణములను బుద్ధిమంతుడు వర్జింపవలయును. పర్ణమూలము వ్యాధికరము. పర్ణాగ్రము పాపజనకము. చూర్ణపర్ణ మాయుష్యహారము. పర్ణమందగు నరములు బుద్ధినాశకరములు. స్వచ్ఛమగు తాంబూలిదళములను, చక్కగా శోధింపబడిన పూగీఫలములను పరిశుద్ధమగు సున్నమును గూర్చబడిన తాంబూలమగును. ఒకపోకయు నైదాకులు సనపగింజంతసున్నము నందులో సగము కర్పూరము మూడునాలుగులెక్కోలములన్నియులవంగములు సున్నములోనాల్గవపాలు జాజికాయయును గలిసిన తాంబూలము సకలదోషహారము గావున విద్వాంసుడిట్లుభక్షించును. పోకచెక్కలోనిపురుగు గళగండరోగమును బుట్టించును. పర్ణమందుండు కీటము ముఖరోగకరము. సున్నమందుండురాయి యశ్మరీరోగమునుబుట్టించును. కావున పర్ణాదిశుద్ధిని జేయవలయును. భోజనమునకు పూర్వమందైన నపరమందైనను నేడేనిపత్రములు భక్షించవలయును. రాత్రియందు పదునాలుగాకులు సేవించవలయును. చెక్కలధికముగ పూర్వాహ్ణమందును సున్నమధికముగ మధ్యాహ్నమందును ఆకులధికముగ రాత్రియందును తాంబూలమునుభక్షించవలయును చెక్కలాకులు సమముగనుండినరక్తిమకలుగును. చెక్కలధికమైన రక్తిమ లేకుండును. సున్నమధికమైన సుగంధము పోవును. పర్ణములధికమైన సుగంధమధికమగును. మూడును సమముగనుండిన రుచికలుగును. ఈతాంబూలము ప్రాతఃకాలమందు సేవించిన వేడిని రుచిని అగ్నిమాంద్యమును వీర్యహానిని పీనసశ్వాస పాండుమూత్రకృచ్ఛ్ర ప్రమేహ రోగములను జేయును. విస్తరించి తాంబూలమును సేవించిన శరీరము తెల్లబడును. దంతపటిమతగ్గును. చెముడు నేత్రరోగము వాతపైత్యప్రకోపమునగును. తాంబూలమునమలి మొదటిరసము విషసమముగావున నుమియవలెను. మధ్యమరసము దీపనము పాచనము. అంత్యరసమమృతసమము మలబంధమును శూలను క్రిములను హరించును. హృద్యము. ముఖసుగంధకరము. దంతములకు నోష్ఠములకును రక్తిమను బుట్టించును. రోగాతురులకును దీపనమగును. కామోద్దీపకము- రూపప్రకాశకము- సౌభాగ్యముఖసుగంధకారి. కఫాదిరోగహారి. కావున తాంబూలము మిక్కిలి గుణకరము.

నాగలోకమందుపుట్టి పరిమళమునువహించి పైత్యహరమై శృంగారరసమందు కామదూతియై రతికాలమందు ఫలరూపమై సర్వకాలములందును

భోగ్యమై దంతములకు కెంపులవలె నింపుజేసి కుంకుమవంటి రక్తరేఖలు పెద వులందొదవజేసి లక్ష్మీనివాసయోగ్యమగు తాంబూలము ముఖమందు పైని చె ప్పబడిన కాలములందుండుగావుత. తాంబూలము ముఖమందుండగ నిద్రించి న చొంగబడుటయును ముఖమందు పాండువర్ణమును దంతములకు దౌర్బల్య మును ముఖకంఠరోగోత్పత్తియును జేయును గావున నట్లు సేయరాదు.

ఇందుకనిద్రించి లేచి జలపానముసేసి క్రీడించి ఫలాదులను భక్షించి క్ష ణమాత్రము విశ్రమించి తాంబూలమును భక్షించవలెను. ఆకులును పోకలును గలిసినతాంబూలదానముచే బ్రహ్మవిష్ణుమహేశ్వరులు తృప్తులగుదురు గావున మంచిపర్ణములు చెక్కలు సున్నముతో యోగ్యమగు బ్రాహ్మణులకు ముందు గా తాంబూలమిచ్చి బుద్ధిమంతుడు తాంబూలమును భక్షింపవలయును.

సభయందు శయనమందు వివాహములందు క్రతువులందు యుద్ధమందు పుత్రాదిజన్మమందు ప్రయాణమందు గ్రామాదిప్రతిష్ఠాకాలమందు దేవకార్య మందును తాంబూలదానము ప్రశస్తము.

పాలు వెలగ పనస మామిడి యనటిపండ్లను చెరుకులను మద్యమును క ట్టు రసాయనము కషాయము ఘృతమును తేనియను నారికేళమును బుచ్చికొని నయనంతరము తాంబూలము విషమగును గావున నొకగడియ విలంబమును జే సి యామీదను భక్షింపవలయును. ఈతాంబూలప్రకరణమందున మద్యగ్రహ ణము తాంబూలవిరుద్ధద్రవ్యగణనముకొరకుమాత్రమెగాని పానముచేయదగు ననుటగాదు. శూద్రుడైనను మద్యపానమొనర్చిన చండాలునివలె వానివర్జింపు మని పరాశరస్మరణమువలన నత్యంతనిషేధముగలదు.

పాండుమేహనేత్రరోగోన్మాదపైత్యరక్తశోషామూర్ఛాతిసారమూత్ర కృఛ్ర ప్రదర వమన దేహదాహ తృష్ణాశోషాపస్మార క్షయవిషోపద్రవ విసర్పిపీ డితులగువారికిని పిపాసాతురులకును క్షీరపానముజేసినవారికిని శ్రమ మదావి ష్టులకును తాంబూలమర్హముగాదు.

అథ తాంబూలచూర్ణప్రశంసా న్ప్రవక్ష్యామి॥ చూర్ణం శంఖాశ్మశం బూకశుక్తిమౌక్తికజంస్మృతం। క్షారం సలవణం శంఖచూర్ణం కాయాగ్నివర్ధ నం। మేదోవిశోషణం రూక్షం క్రిమిఘ్నం శ్లేష్మవర్ధనం। అత్యుష్ణం తీక్ష్ణకటుకం చూర్ణంచాశ్మభవంలఘు। పిత్తప్రకోపనంరూక్షం విశేషాచ్ఛ్లేష్మనాశనం। చూ ర్ణంశంబూకజంభేదిరూక్షోష్ణం శ్లేష్మనాశనం। తీక్ష్ణోష్ణం శుక్తిజం చూర్ణంరో

చనంలఘుదీపనం। ముక్తాఫలోద్భవంచూర్ణం వాతజం పైత్యశూలజిత్॥

ఏలాచందన శేవ్యవాలుకలవంగాజాతికస్తూరికా చామంతీ శశిముక్తకుం కుమశశీతకోలమాంసీమధు। ఏతచ్చూర్ణసమాంశఖాదిరయుతం హైమాంబునాపేషితం ముద్గంమాత్రవటీకృతంవితనుతే తాంబూలగాగోదయం॥ స్త్రీసంభావణభూషణం గుణతరం స్త్రీణాంమనోహారిణాం లావణ్యాం కురుతే సధాతుజనితం రాజ్ఞాంసదా సేవితం॥ అశ్వారోహే తథామార్గే రతికాలే తథాతపే। తృష్ణిపాసాధికే దోషే తాపేచంద్రం ప్రశస్యతే॥ సర్వాంగవాతేశోభే చ మందాగ్నౌ దుర్దినే తథా। హనుగోగశిరోరోగే మృగనాభిఃప్రశస్యతే॥

ఇటుపైని తాంబూలచూర్ణ ప్రశంసను విశేషముగ జెప్పుచున్నారము- శంఖము రాయి గుల్ల ముత్యపుచిప్ప ముత్యపుచూరు. ఈవైయెదింటివలనబుట్టినది సున్నమని చెప్పబడినది.

శంఖచూర్ణము క్షారలవణములుగలిగి జఠరాగ్నివర్ధనమొనర్చును. మేదస్సును శోషించును. ఖారము. క్రిములనుబోగొట్టును. శ్లేష్మమునుజేసును. రాతిసున్నమతివేడిజేసును. తీక్ష్ణముగు కటువు- లఘువు- పైత్యవర్ధనము- ఖారము- విశేషముగ శ్లేష్మమును బోగొట్టును. గుల్లసున్నము విరేచనకారి- ఖారము- శ్లేష్మనాశనము- ముత్తియపుచిప్పసున్నము తీక్ష్ణోష్ణము- రోచనము- లఘువు- దీపనము. ముత్తియపు సూరు సున్నము వాతమువలన బుట్టిన పైత్యశూలలను గొట్టును.

ఏలకులు చందనము శేవ్యము వట్టివేళ్లు లవంగములు జాజికాయ కస్తూరి తెల్లచామంతి కర్పూరము తుంగముస్తలు కుంకుమపువ్వు పెద్దయాలకులు తక్కోలపుట్లు జటామాంసి యష్టిమధుకము యివిసమభాగములు వీటితోసమము కాచుబెట్టి పన్నీటితో మర్దనాజేసి పెసరగింజలంతేసిమాత్రలుజేసి తాంబూలముతో భక్షించిన లావణ్యముగలిగియుందురు. స్త్రీలకుమనోహరుడగును. ధాతువృద్ధికరము గావున రాజులెల్లప్పుడును సేవించదగియుండును.

పచ్చకప్పురము అశ్వారోహణమందును మార్గమందును రతికాలమందును తృష్ణిపాసాధిక్యమందును తాపమందును తాంబూలముతో సేవించదగును.

కస్తూరి సర్వాంగవాతమందును శోఫరోగమందును మందాగ్నియందును మేఘచ్ఛన్నదినమందును దవడలు పట్టుజేసినపుడును శిరోరోగమందును తాంబూలముతో బుచ్చికొనదగును.

## భోజనానంతర కృత్యాని.

అథాహశ్శేషకృత్యం వ్యాఖ్యాస్యామః॥ అథేతి ఇద్ధం నిరూపితభోజనా
నంతరమహశ్శేషేణ కర్తుం యోగ్యం కృత్యం కర్తవ్యజాతం మన్వాది స్మృత్యు
క్తం వ్యాఖ్యాస్యామః। విశేషేణాభిధాస్యామః॥ భుక్త్వాచసుఖమాస్థాయ తద
న్నం పరిణామయేత్। ఇతిహాసపురాణాద్యైష్షష్ఠసప్తమకౌ నయేత్॥ అష్టమే
లోకయాత్రాచ బహిస్సంధ్యా తతః పునరితి దక్షః॥ బుద్ధివృద్ధికరాణ్యా
శు ధన్యానిచ హితానిచ। నిత్యం శాస్త్రాణ్యవేక్షేత నిగమాంశ్చైవ వైది
కాన్॥ యథాయథాహి పురుష శ్శాస్త్రం సమధిగచ్ఛతి। తథాతథా విజానా
తి విజ్ఞానంచాస్య రోచతఇతి మనుః॥ అస్యార్థః॥ శీఘ్రం బుద్ధివృద్ధిజనకాని త
థాధన్యాని ధనాయహితాః తథాహితాని దృష్టోపకారాణి తథా వేదార్థా
వబోధకాన్నిగమాఖ్యాంశ్చ గ్రంథాన్నిత్యమవేక్షేత పర్యాలోచయేత్। తదు
క్తాచరణేన పురుషార్థచతుష్టయప్రాప్తిర్భవతీత్యాజ్ఞాపితవాన్॥ యథాయథేతి॥
యస్మాద్యథాపురుషశ్శాస్త్రం సమ్యగభ్యస్యతి తథాతథాపి విశేషేణజానాతి శా
స్త్రాంతరవిషయమపిచాస్య విజ్ఞానం రోచతే తద్బలంభవతి ॥ పురుషార్థచతుష్ట
యావాప్తి హేతుభూతశాస్త్రాణ్యేకనసాధిని ప్రదర్శయామః॥ విద్యాహ్యనం
తాశ్చకలాస్సంఖ్యాతుంనైవశక్యతే। విద్యాముఖ్యాశ్చ ద్వాత్రింశ చ్చతుష్షష్టికలా
స్స్మృతాః।యద్యస్యాద్వాచికంసమ్యక్కర్మవిద్యాభిసంజ్ఞికం। శక్తో మూకోపి
యత్కర్తుం కలాసంజ్ఞంతు తత్స్మృతం। ఉక్తంసంక్షేపతో లక్ష్మవిశిష్టంపృథగు
చ్యతే। విద్యానాంచకలానాంచ నామానితుపృథక్పృథక్। ఋగ్యజుస్సామ చా
థర్వా వేదాఆయుర్ధనుఃక్రమాత్। గాంధర్వశ్చైవ తంత్రాణి ఉపవేదాః ప్రకీ
ర్తితాః। శిక్షావ్యాకరణంకల్పో నిరుక్తంజ్యోతిషంతథా। ఛందష్షడంగానీమాని
వేదానాంకీర్తితానిహి। మీమాంసాతర్కసాంఖ్యాని వేదాంతోయోగఏవచ। ఇ
తిహాసాఃపురాణాని స్మృతయోనాస్తికంమతం। అర్థశాస్త్రం కామశాస్త్రం త
థాశిల్పమలంకృతిః। కావ్యాని దేశభాషాచ స్వరోక్తిర్యావనం మతం। దేశాది
ధర్మాద్వాత్రింశ దేతావిద్యాభిసంజ్ఞితా॥ మంత్రబ్రాహ్మణయో ర్వేదనామప్రో
క్తం ఋగాదిషు। జపహోమార్చనంయస్య దేవతాప్రీతిదంభవేత్। ఉచ్చారా
న్మంత్రసంజ్ఞంసద్వినియోగిచబ్రాహ్మణం। ఋగ్రూపాయత్ర యేమంత్రా యా
దృశోర్ధర్చశోపివా। యేపాదమాత్రం సఋగ్భాగా సమాఖ్యానంచ యత్రవా।
ప్రశ్లిష్టపఠితామంత్రా వృత్తగీతివివర్జితాః। ఆధ్వర్యవం యత్రకర్మ త్రిగుణం య
త్రపాఠనం। మంత్రబ్రాహ్మణయోరేవ యజుర్వేదస్సఉచ్యతే। ఉద్గీథం యస్య

శస్త్రాదేర్యత్ర తత్సామసంజ్ఞకం। అథర్వాంగిరసో నామ హ్యుపాస్యోపాసనాత్మకః। ఇతి వేదచతుష్కంతు ఉద్దిష్టంతుసమాసతః॥ విందత్యాయుర్వేత్తి సమ్యగాకృత్యౌషధిహేతుతః। యస్మిన్నృచశ్చోపవేద స్సచాయుర్వేదసంజ్ఞికః। యుద్ధశస్త్రాస్త్రవ్యూహాదిరచనాకుశలో భవేత్। యజుర్వేదోపవేదోయం ధనుర్వేదస్తుయేనసః॥ స్వరైరుదాత్తాదిభిర్మైస్తంత్రీకంఠోద్ధితైస్సదా। సతాలైర్గానవిజ్ఞానం గాంధర్వోవేదఏవసః।వివిధోపాస్యమంత్రాణాంప్రయోగాస్సువిభేదతః।కథితాస్సోపసంహారాస్తద్ధర్మనియమైశ్చ షట్। అథర్వణాంచోపవేదస్తంత్రరూపస్సఏవహి। స్వరతఃకాలతస్థానాత్ప్రయత్నానుప్రదానతః। సవనాద్యైశ్చసాశిక్షావర్ణానాంపాఠశిక్షణాత్। ప్రయోగోయత్రయజ్ఞానాముక్తో బ్రాహ్మణశేషతః। శ్రౌతకల్పస్సవిజ్ఞేయస్స్మార్తకల్పస్తథేరః। వ్యాకృతాప్రత్యయాద్యైశ్చ ధాతుసంధిసమాసతః। శబ్దాయత్రవ్యాకరణమేకద్విబహులింగతః। శబ్దనిర్వచనంయత్రవాక్యార్థైకార్థసంగ్రహః। నిరుక్తం తత్సమాఖ్యానా ద్వేదాంగంశ్రోత్రసంజ్ఞకం। నక్షత్రగ్రహగమనైః కాలోయేనవిధీయతే। సంహితాభిశ్చ హోరాభిర్గణితైర్జ్యోతిషంహితత్। భ్యరస్తుజన్మగిర్లాత్తైర్యద్యాస్యత్రపరిమాణతః। కల్ప్యంతే ఛందశ్శాస్త్రంతద్వేదానాం పాదరూపధృక్। యత్రావ్యవస్థితాచార్థకల్పనాదివిభేదతః। మీమాంసావేదవాక్యానాం సంజ్ఞాయశ్చప్రకీర్తితః। భావాభావపదార్థానాంప్రత్యక్షాదిప్రమాణతః।సవివేకోయతస్తర్కః కాణాదాదిమతంచతత్। పురోషోడశప్రకృతయోవికారాష్షోడశేతిచ। తత్త్వాదిసంఖ్యావైశిష్ట్యాత్సాంఖ్యమిత్యభిధీయతే। బ్రహ్మైకమద్వితీయంస్యాన్నానానేహాస్తికించన। మాయికం సర్వమజ్ఞానాద్భాతి వేదాంతినాం మతం। చిత్తవృత్తినిరోధస్తు ప్రాణసంయమనాదిభిః॥ తద్యోగశాస్త్రం విజ్ఞేయం యస్మి న్ధ్యానసమాధితః। ప్రాగ్వృత్తకథనంచైకరాజకృత్యమిహోదితః। యస్మిన్న ఇతిహాసస్స్యాత్పురావృత్తస్సఏవహి। సర్గశ్చప్రతిసర్గశ్చ వంశోమన్వంతరాణిచ। వంశానుచరితంయస్మిన్పురాణం తద్ధికీర్తితం। వర్ణాదిధర్మస్మరణం యత్ర వేదావిరోధకం। కీర్తనం చార్థశాస్త్రాణాం స్మృతిస్సాచ ప్రకీర్తితా। యుక్తిర్బలీయసీయత్ర సర్వంస్వాభావికంమతం।కస్యాపినేశ్వరఃకర్తా నవేదానాస్తికంహితత్। శ్రుతిస్మృత్యవిరోధేన రాజవృత్తాదిశాసనం। సుయుక్త్యార్థార్జనంయత్ర హ్యర్థశాస్త్రంతదుచ్యతే। శశాదిభేదతఃపుంసామనుకూలాదిభేదతః। పద్మిన్యాదిప్రభేదేన స్త్రీణాంస్వీయాదిభేదతః। తత్కామశాస్త్రంసత్త్వాదేర్లక్ష్మ యత్రాస్తి చోభయోః। ప్రాసాదవప్రమారామగృహవాప్యాదిసత్కృతిః। కథితాయత్రతచ్ఛిల్పశాస్త్రముక్తంమహర్షిభిః। సమస్యానా

దికత్వేనసారూప్యాదిప్రభేదతః । అన్యోన్యగుణభూషాతు వర్ణ్యతేలంకృతిశ్చ
సా। సరసాలంకృతాదుష్టశబ్దార్థంకావ్యమేవసత్। విలక్షణచమత్కారబీజం ప
ద్యాదిభేదతః। లోకసంకేతతోర్థానాం సంగ్రాహివాక్యసైకికీ । వినాకౌశలశా
స్త్రీయసంకేతైః కార్యసాధికా । యథాకాలోచితావాగ్వ్యవసర్గోక్తిశ్చ సా
స్మృతా। ఈశ్వరఃకారణంయత్రాదృశ్యోస్తిజగతస్సదా।శ్రుత్యాదిభిన్నధర్మాణా
స్తి యత్రతద్యావనంమతం। కల్పితశ్రుతిభూలోకమూలో లోకైర్ధృతం సదా।
దేశాదిధర్మస్సజ్ఞేయో దేశేదేశే కులేకులే॥

పృథక్పృథక్తు విద్యానాంలక్షణంసంప్రకాశితం।కలానామపృథగ్నామ
లక్షణానీహకేవలం। పృథక్పృథక్క్రియాభిర్హి కలాభేదస్తుజాయతే।యాంయాం
కళాంసమాశ్రిత్య తన్నామ్నాజాతిరుచ్యతే। హావభావాదిసంయుక్తంనర్తనంతు
కళాస్మృతా। అనేకవాద్యవికృతౌ జ్ఞానంతద్వాదనే కళా । వస్త్రాలంకారసం
ధానం స్త్రీపుంసోశ్చ కళాస్మృతా । అనేకరూపావిర్భావకృతిజ్ఞానం కళా
స్మృతా। శయ్యాస్తరణసంయోగ పుష్పాదిగ్రథనంకళా । ద్యూతాద్యనేక క్రీ
డాభిరంజనంతు కళాస్మృతా । అనేకాసన సంధానైః రతేర్జ్ఞానం కళా స్మృ
తా । కళాసప్తక మేతద్ధి గాంధర్వే సముదాహృతం । మకరందాసవాదీనాం
మద్యాదీనాం కృతిః కళా । శల్యమూలాహృతౌ జ్ఞానం సిరావ్రణ వ్యధే క
ళా । పానాదిరస సంయోగాన్నాది సంపాచనం కళా । వృక్షాదిప్రసవారో
ప పాలనాదికృతిః కళా। పాషాణధాత్వాది దృతి స్తద్భస్మకరణం కళా।
యావదిక్షువికారాణాం కృతిజ్ఞానం కళాస్మృతా । ధాతుసాంకర్య పార్థక్య
కరణంతు కళా స్మృతా । సంయోగా ద్యపూర్వవిజ్ఞానం ధాత్వాదీనాం కళా
స్మృతా । క్షారనిర్హాసనం జ్ఞానం కళాసంజ్ఞంతు తత్స్మృతం । జ్వరాది రోగ
శాంత్యర్థ మౌషధాదికృతిః కళా । కళాదశక మేతద్ధి హ్యాయుర్వేదాగమేషు
చ । శస్త్రసంధాన విక్షేపః పదాది న్యాసతః కళా । సంధ్యాఘాతాకృష్టిభే
దై ర్మల్లయుద్ధం కళా స్మృతా । బాహుయుద్ధంతు మల్లానా మశస్త్రం ము
ష్టిభి స్స్మృతం । మృతస్య తస్య న స్వర్గో యశో నేహాపివిద్యతే। బలదర్పంవినా
శాంతం నియుద్ధంయశసే రిపోః। నకస్యాపీత కుర్యాద్వా ప్రాణాంతం బాహు
యుద్ధకం। కృతప్రతికృతై శ్చిత్రైర్బాహుభిశ్చ సుసంకటైః। సన్నిపాతావధూతై
శ్చ ప్రమాదోన్మథనైస్తథా। కృతంనిపీడనంజ్ఞేయం తన్ముక్తిస్తు ప్రతిక్రియా। కలా
భిలక్ష్యే దేశేయంత్రాద్యస్త్రనిపాతనం।వాద్యసంకేతతో వ్యూహరచనాదికళా
స్మృతా। గజాశ్వరథగత్యాతు యుద్ధసంయోజనంకళా। కళాపంచక మేతద్ధి ధ

నుర్వేదాగమేష్ఠితం। వివిధాసనముద్రాభి ర్దేవతాతోషణంకళా। సారథ్యంచ గజాశ్వాదేర్గతిశిక్షాకళాస్మృతా। మృత్తికాకాష్ఠపాషాణధాతుభాండాదిసత్క్రియా। పృథక్కళా చతుష్కంతు చిత్రాద్యాలేఖనంకళా। తటాకవాపీప్రాసాదసమభూమిక్రియాకళా। ఘటాద్యనేకయంత్రాణాం వాద్యానాంతు కృతిఃకళా। హీనమధ్యాదిసంయోగవర్ణాద్యై రంజనంకళా। జలవాయ్వగ్నిసంయోగ నిరోధైశ్చ క్రియాకళా। నౌకారథాదియానానాం కృతిజ్ఞానంకళాస్మృతా। సూత్రాదిరజ్జుకరణవిజ్ఞానంతు కళాస్మృతా। అనేకతంతుసంయోగైః పటబంధః కళాస్మృతా। వేధాదిసదసజ్జ్ఞానం రత్నానాంచకళాస్మృతా। స్వర్ణాదీనాంతుయాథాత్మ్యవిజ్ఞానంచ కళాస్మృతా। కృత్రిమస్వర్ణరత్నాది క్రియాజ్ఞానం కళాస్మృతా। స్వర్ణాద్యలంకారకృతిః కళాలేపాదిసత్కృతిః। మార్దవాది క్రియాజ్ఞానంచర్మాణాంతుకళాస్మృతా। పశుచర్మాంగనిర్హారక్రియాజ్ఞానంకళాస్మృతా। దుగ్ధదోహాదివిజ్ఞానం ఘృతాంతంతుకళాస్మృతా। సీవనేకంచుకాదీనాం విజ్ఞానంతుకళాస్మృతా। బాహ్వాదిభిశ్చ తరణం కళాసంజ్ఞంజలేస్మృతం। మార్జనం గృహభాండాదేర్విజ్ఞానంతు కళాస్మృతా। వస్త్రసంమార్జనంచైవ క్షురకర్మకళేహ్యుభే। తిలైరండాదిస్నేహానాం కళానిష్కాసనే కృతిః। సీరాద్యాకర్షణే జ్ఞానం వృక్షాద్యారోహణేకళా। మనోనుకూలసేవాయాః కృతిజ్ఞానంకళాస్మృతా। తృణవేణ్వాదిపాత్రాణాం కృతిజ్ఞానం కళాస్మృతా। కాచపాత్రాదికరణవిజ్ఞానంతుకళాస్మృతా। సంసేచనంసంహరణం జలానాంతు కళాస్మృతా। లోహాదిభిస్సారశస్త్రాస్త్రకృతిజ్ఞానంకళాస్మృతా। గజాశ్వవృషభోష్ట్రాణాం పల్యాణాదిక్రియాకళా। శిశోస్సంరక్షణేజ్ఞానం ధారణే క్రీడనేకళా। సుయుక్తతాడనజ్ఞానమపరాధిజనేకళా। నానాదేశీయధర్మాణాం సుసమ్యగ్లేఖనం కళా। తాంబూలరక్షాదికృతివిజ్ఞానంతు కళాస్మృతా। ఆదానమాశుకారిత్వం ప్రతిదానం చిరక్రియా। కళాస్వేతౌగుణౌ జ్ఞేయౌ ద్వేకళే పరికీర్తితే। చతుష్షష్టికళాహ్యేతాస్సంక్షేపేణ నిదర్శితాః॥ గ్రంథాంతరకళాభేదాంశ్చ వదామః॥

అథేతిహాసాగమౌచ కావ్యాలంకారనాటకం। గాయత్వంచ కవిత్వంచ కామశాస్త్రం దురోదరం। దేశభాషావిధిజ్ఞానం లిపికర్మచవాచికం। సర్వాణి చావధానాని సర్వశాస్త్రంతు శాకునం। సాముద్రికం రత్నశాస్త్రంరథాశ్వగజకౌశలం। మల్లశాస్త్రం సూదకర్మభూరుహాణాంచదోహదం। గంధవాదో ధాతువాదః ఖన్యావాదోరసస్యచ। జాలవాదోగ్నిసంస్తంభః ఖడ్గస్తంభోజలస్యచ। వాచస్తంభో వయస్తంభో వశ్యాకర్షణమోహనం। విద్వేషణోచ్చాటనంచమా

రణం కాలవంచనం। పయసిప్లవచాతుర్యం పాదుకాసిద్ధిరేవచ। వాక్సిద్ధిర్ఘుటికాసిద్ధిరైంద్రజాలికమాదిచ। అంజనం పరదృష్టేస్తు వంచనం స్వరవంచనం। మణిమంత్రౌషధానాంచ సిద్ధయశ్చోరకర్మచ। చిత్రలోహాశ్మమృద్దారువేణుచర్మాంబరక్రియాః। అదృశ్యకరణి ద్దూతికరణీ మృగయాగతిః। వాణిజ్యంపాశుపాల్యంచ కృషిరాసవకర్మచ। లావకుక్కుటమేషాదియుద్ధకారకకౌశలం। చతుష్షష్టికళాశ్చైతాః కళావిద్భిః ప్రకీర్తితాః। ననిశాకరవజ్జాతు కళావైకల్యమాత్రతః। ప్రకాశతేసగాంమధ్యే బుధవర్త్మనిసంస్థితః॥

వయోబుద్ధ్యర్థవాగ్వేషశ్రుతాభిజనకర్మణాం। ఆచరేత్సదృశీంవృత్తి మజిహ్మమశఠాంతథా॥ అస్యార్థః॥ వయఇతి॥ వయోబాల్యయౌవనాది। బుద్ధిర్నైసర్గికీ లౌకికవైదికవ్యవహారేషు। అర్థోవిత్తంగృహక్షేత్రాదిః। వాక్భాషణం। వేషోవస్త్రమాల్యాదివిన్యాసః। శ్రుతంపురుషార్థశాస్త్రశ్రవణం। అభిజనంకులం। కర్మవృత్త్యర్థప్రతిగ్రహాదిః। ఏతేషాంవయఃప్రభృతీనాం సదృశీ ముచితాం వృత్తిమాచరేత్ స్వీకుర్యాత్। యథావృద్ధస్యోచితాం నవయౌవనోచితాం। ఏవం బుద్ధ్యాదిష్వపియోజనీయం। అజిహ్మమవక్రాం। అశఠామనృతాం॥ అహింసా సత్యమస్తేయం శౌచమింద్రియనిగ్రహః। దానందమోదయాక్షాంతిస్సర్వేషాం ధర్మసాధనమితియాజ్ఞవల్క్యః॥ ఇంద్రియార్థేషుసర్వేషు నప్రసజ్యేతకామతః।అతిప్రసక్తించైతేషాం మనసా సన్నివర్తయేత్। క్షత్రియంచైవసర్పంచ బ్రాహ్మణంచబహుశ్రుతం। నావమన్యేతవై భూష్ణుః కృశానపికదాచన। ఏతత్త్రయంహిపురుషం నిర్దహేదవమానితం। తస్మాదేతత్త్రయం నిత్యం నావమన్యేత బుద్ధిమాన్। నాత్మానమవమన్యేత పూర్వాభిరసమృద్ధిభిః। ఆమృత్యోశ్శ్రియమన్విచ్ఛేన్నైనాంమన్యేతదుర్లభాం। మంగళాచారయుక్తానాం నిత్యంచ ప్రయతాత్మనాం। జపతాంజుహ్వతాంచైవ వినిపాతోనవిద్యతే। యద్యత్పరవశంకర్మ తత్తద్యత్నేనవర్జయేత్। యద్యదాత్మవశంతుస్యాత్తత్తత్సేవేతయత్నతః। సర్వంపరవశందుఃఖం సర్వమాత్మవశంసుఖం। ఏతద్విద్యాత్సమాసేన లక్షణంసుఖదుఃఖయోః। యత్కర్మకుర్వతోఽస్యస్యాత్పరితోషోఽంతరాత్మనః। తత్ప్రయత్నేన కుర్వీత విపరీతంతు వర్జయేత్। అధార్మికోనరోయోహి యస్యచాప్యనృతం ధనం। హింసారతశ్చయోనిత్యం నేహాసౌసుఖమేధతే॥ అస్యార్థః॥ అధర్మేణవ్యవహరతీత్యధార్మికః। శాస్త్రప్రతిషిద్ధాగమ్యాగమనాద్యనుష్ఠాతాయోమానుషః। యస్యచసాక్ష్యవ్యవహారనిర్ణయాదౌ మిథ్యాభిధానమేవధనోపాయః।అసత్యమభిధాయోత్కోచధనంయోగృహ్ణాతీత్యర్థః। యశ్చ పరహింసాభిరతః నాసావిహ

లోకే సుఖయుక్తోవర్తతే। తస్మాదేతన్నకర్తవ్యమితినిందానిషేధః॥ నసీదన్నపి ధర్మేణ మనోఽధర్మేనివేశయేత్। అధార్మికాణాంపాపానా మాశుపశ్యన్విప ర్యయం। నాధర్మశ్చరితోలోకే సద్యఃఫలతి గౌరివ। శనైరావర్తమానస్తు కర్తు ర్మూలానికృంతతి। యదినాత్మనిపుత్రేషు నచేత్పౌత్రేషు నప్తృషు।నత్వేవతుకృ తోధర్మఃకర్తుర్భవతినిష్ఫలః॥ అస్యార్థః॥ యది స్వయంకర్తుర్దేహధనాదినాశం ఫ లంనజనయతి త దా తత్పుత్రేషునోచేత్తత్పౌత్రేషుజనయతి నతునిష్ఫలఏవభవతి। నన్వన్యకృతస్యకర్మణః కథమన్యత్రఫలజనకత్వం॥ ఉచ్యతే॥ పుత్రాదినాశస్యాపి తుఃక్లేశహేతుత్వాచ్ఛాస్త్రీయత్వాచ్చాస్యార్థస్యనావిశ్వాసఃకార్యః॥ అధర్మే ణైధతే తావత్తతోభద్రాణిపశ్యతి। తతస్సపత్నాన్జయతి సమూలస్తు వినశ్యతి తిమనుః॥ శుచిరాస్తిక్యపూతాత్మా పూజయేద్దేవతాస్సదా। దేవతావద్గురుజ నమాత్మవచ్చ సుహృజ్జనం। ప్రణిపాతేనచగురూన్సతోనూచానచేష్టితైః। కుర్వీ తాభిముఖాన్భృత్యై దేవాన్సుకృతకర్మణా। సద్భావేనహరేన్మిత్రం సంభ్రమే ణచబాంధవాన్। స్త్రీభృత్యాన్ప్రేమదానాభ్యాం దాక్షిణ్యేనేతరాన్జనాన్। అ నిందాపరవృత్తేషు స్వధర్మపరిపాలనం। కృపణేషుదయాళుత్వం సర్వత్ర మధు రాగిరః। ప్రాణైరప్యుపకారిత్వం మిత్రాయాఽవ్యభిచారిణే। గృహాగతేపరిష్వం గశ్శక్త్యాదానం సహిష్ణుతా। స్వసమృద్ధిష్వనుత్సేకః పరవృద్ధిష్వమత్సరః। నా న్యోపతాపివచనం సర్వద్వంద్వసహిష్ణుతా। బంధుభిర్బంధుసంయోగస్స్వజనేచ తురస్రతా। తచ్చిత్తానువిధాయిత్వమితివృత్తంమహాత్మనాం॥ సనాతనేవత్మని సాధుశిష్టతామయంహిపంథా గృహమేధినాంమతః। అనేనగచ్ఛన్నియతం మ హాత్మనా మిమంచలోకం పరమంచవిందతి॥

## భోజనానంతర కృత్యములు.

పూర్వోక్తమగు భోజనానంతరమందుమిగిలిన పగటిలో జేయదగినకృ త్యమును మన్వాదులుసెప్పినప్రకారము విశేషించిచెప్పుచున్నారము.

భోజనమొనర్చి సుఖముగగూర్చుండి యాయన్నమును జీర్ణింపజేయవల సినది. ఇతిహాసపురాణగోష్ఠితో ౨౧ గడియమొదలుకొని ౨౪ గడియల పర్యం తమును గాలమునువెళ్లించి పైని సంధ్యాకాలపర్యంతమును యథేచ్ఛగా లోక యాత్రను నడపి యనంతరమందు సాయంసంధ్యాకృత్యమును జేయదగునని ద క్షుడు. బుద్ధినివృద్ధినొందించునవియును ధనార్జనసాధనములును దృష్టఫలోపకా రములగు శాస్త్రములును వేదార్థగ్రంథములు నెంతమట్టుకీశాస్త్రములను జూ చుచునుండునో అంతమట్టుకు తెలివిగలిగిపురుషుడనుభవముకలవాడగునని మనువు.

పురుషార్థచతుష్టయమునొందుటకు హేతువులగు నాశనసాది శాస్త్రములను గనపరచుచున్నాము.

విద్యలనంతములు కళలసంఖ్యలు ఇందులో ముఖ్యములగు విద్యలు ముప్పదిరెండు కళలరువదినాల్గని జెప్పబడెను.

ఏదివాచకమగు కర్మో యదివిద్యాసంజ్ఞికము. మూగివాడైనను జేయుటకర్హమగునది కళాసంజ్ఞికము- సంక్షేపముగ వేరువేర నీవిద్యలకునుకళలకును నామములను చిహ్నములతోడ జెప్పుచున్నాము.

ఋగ్యజుస్సామాథర్వణవేదములు నాలుగు, ఆయుర్ధనుర్గాంధర్వతంత్రములు నాలుగును- వరుసగా నుపవేదములు. శిక్షా,వ్యాకరణ,కల్ప,నిరుక్త,జ్యోతిష,ఛందస్సులు ఈయారును వేదములకంగములు. మీమాంసా, తర్క, సాంఖ్య, వేదాంత, యోగశాస్త్రములును, ఇతిహాస పురాణ స్మృతి స్వాభావిక మత నాస్తికమతార్థశాస్త్ర కామశాస్త్ర శిల్పాలంకార కావ్యములును దేశభాషలన్నియును స్వరోక్తియును యావనమతము దేశాటధర్మము నీముప్పదిరెండును విద్యాసంజ్ఞికములు.

మంత్రబ్రాహ్మణములు రెంటికిని ఋగాది వేదనామము జెప్పబడెను.. జపహోమమము అర్చనమును దేవతాప్రీతికరమై దేనియుచ్చారణవలన నగుచుండునదిమంత్రసంజ్ఞికమును దానివినియోగమును దెలియజేయునది బ్రాహ్మణము.

ఏవేదమందు మంత్రములు పాదార్ధలతో ఋగ్రూపములై యుండునో వేటికిప్రయోజనము హౌత్రమగుచున్నదో యది ఋగ్వేదము. వృత్తగీతి వర్జితములై ఏవేదమందలి మంత్రములు కల్పి పఠించబడుచున్నవో అధ్వరకర్మ దేనికి ప్రయోజనమో మంత్రబ్రాహ్మణములు గలసిన యది యజుర్వేదము. యజ్ఞమందు శస్త్రాదికములౌద్గాత్రము దేనికిప్రయోజనమో యది సామవేదము. అథర్వాంగిరసమను వేదముపాస్యదైవము నుపాసించుమంత్రములుకలది. సంక్షేపముగ నిట్లు వేదచతుష్టయముద్దేశించబడెను. ఆకారౌషధాది హేతువులవలన నాయువుదేనియందున దెలియబడుచున్నదో యది ఋగ్వేదమునకు నుపవేదమగు నాయుర్వేదము. యుద్ధశాస్త్రవ్యూహాది రచనాకౌశలముదేనిచే దెలియబడునది యజుర్వేదోపవేదమగు ధనుర్వేదము. ఉదాత్తాదిస్వరధర్మములచే వీణయందును గాత్రమందును తాళయుక్తముగ గానజ్ఞానము దేనిచేనగు నదిగాంధర్వమనువేదము. నానావిధములగు నుపాస్యమంత్రముల ప్రయోగములు భేద

ముగానుపసంహారములతో నారుప్రకారములుగలిగి నియమాది ధర్మయుక్తము గునదియథర్వణవేదోపవేదము తంత్రమని చెప్పబడును. ఉదాత్తాదిస్వరములు ఏకమాత్రాదికాలము తాల్వాదిస్థానములు స్పృష్టాది చతుర్విధాభ్యంతరప్రయత్నములు వివారాద్యేకాదశవిధబాహ్యప్రయత్నములు వీటివలన ప్రాతిస్వవాదులతో వర్ణములపాఠమును శిక్షణము దేనియందుగలదో యది శిక్షయనబడును. బ్రాహ్మణము పరిశిష్టముగలిపి యజ్ఞములకు ప్రయోగము దేనియందు చెప్పబడుచున్నదో యది శ్రౌతమని స్మార్తమని ద్వివిధమగు కల్పమనబడును. ధాతువులు, సంధులు, సమాసములు, వీటివలన ప్రత్యయములతోగూడ ఏకద్విబహువచనలింగభేదముతో శబ్దములు దేనియందు నిరూపించబడుచున్నవో యదివ్యాకరణమనబడుచున్నది.

దేనియందుశబ్దములకర్థము నిర్ణయించి వాక్యార్థసంగ్రహము జేయబడుచున్నదో యదినిరుక్తమనబడును. నక్షత్ర గ్రహగమనాదులచే కాలము దేనివలన విధించబడుచున్నదో సంహితాహోరాగణితాదులతో నదిజ్యోతిషమనబడును. భగణ యగణ రగణ సగణ తగణ జగణ నగణ మగణ గురు లఘుభేదములచే ఋక్పాదాదిప్రమాణము దేనియందు కల్పించబడుచున్నదో యది ఛందస్సుయనబడును.

వేదవాక్యములకు యజ్ఞములందు విధిభేదమువలన దేనియందర్థకల్పనావ్యవస్థ సేయబడునో యది మీమాంసాశాస్త్రము. భావాభావపదార్థములకు ప్రత్యక్షానుమానోపమానశాబ్దప్రమాణములవలన దేనియందు వివేకయుక్తముగు తర్కము సేయబడుచున్నదో యది కాణాదిమతమైన తర్కశాస్త్రము. పురుషుడు అష్టప్రకృతులు షోడశవికారములు యిట్టి తత్వాదులసంఖ్యతోకూడుకొనుటవలన సాంఖ్యశాస్త్రమనబడును. అద్వితీయబ్రహ్మమొకటయెగాని యీప్రపంచమందించుకన్నైన నానావేదజ్ఞానమువలన మాయకమగు సర్వమును భాషించుచున్నదిది వేదాంతమతము.

ప్రాణాదివాయుధారణాదులవలనను ధ్యానసమాధులవలనను చిత్తవృత్తుల నిరోధించడము దేనివలన దెలియబడుచున్నదది యోగశాస్త్రము.

ఒకరాజు కృత్యమును దేనియందు మిషగాజేసి పూర్వవృత్తాంత కథనము జేయబడుచున్నదో యది ఇతిహాసము. సృష్టి,లయము, వంశము, మన్వంతరములు, వంశానుచరితములు దేనియందు జెప్పబడునది పురాణము. బ్రాహ్మ

గాదివర్ణధర్మముమొదలగు ధర్మములు దేనియందు వేదావిరోధముగ జెప్ప బడునదిస్మృతియనబడును దేనియందు యుక్తిబలవత్తరమై యుండునో సర్వ మున్స్వభావముచేనగుచున్నది దేనికీనీశ్వరుడు కర్త గాడు వేదములబద్ధములు ఇట్లు దేనియందుజెప్పబడు నది నాస్తికశాస్త్రము. శ్రుతిస్మృతులకు విరోధము లేకుండునట్టి లెస్సగు యుక్తిచే రాజవృత్తాదిశాసనమును ధనార్జనమును దేనియందుజెప్పబడు నది యర్థశాస్త్రము. శశాదిభేదముగల పురుషుల కనుకూలముగ పద్మిన్యాదిస్త్రీభేదములలో స్వీయాదిభేదములనుభయులకు సాత్వకాదిభావములును మొదలగునవి దేనియందువివరించబడునది కామశాస్త్రము. మేడలు కోటలు తోటలు వాప్యాదులు లెస్సగా రచియించుప్రకారము దేనియందుజెప్పబడు నది శిల్పశాస్త్రము.

సమన్వ్యానాధికత్వముచే సాయూప్యాదిభేదమువలన నన్యోన్యగుణభూషావర్ణనము దేనియందు చెప్పబడు నది యలంకారశాస్త్రము. సరసాలంకారయుక్తములగు శబ్దార్థముల విచిత్ర చమత్కారకారణముగ పద్యాది భేదమువలన నిర్దుష్టముగ దేనియందు రచించబడు నది కావ్యము. లోకసంకేతమువలన నర్థసంగ్రహముగల వాక్కు దేశభాష. కౌశలశాస్త్రీయ సంకేతములు లేకుండ కార్యసాధకమగు యథాకాలోచితమగు వాక్యమవసరోక్తి. దేనియందు ఈశ్వరుడు కారణమనియు జగత్తులోగనుపడనది లేదనియును వేదములకువ్యత్యాసముగలిగియుండునట్టి యవనమతము. కల్పించబడిన వేదలోకమూలమగు ధర్మము లోకులచే నెల్లప్పుడును ప్రతిదేశమందును ప్రతికులమందును జేయబడునది దేశాదిధర్మము.

వేరువేర ముప్పదిరెండువిద్యలకును లక్షణములు ప్రకాశింపజేయబడె నింక నరువదినాల్గుకళలకు నామలక్షణములు వేరువేర నీగ్రంథమందులేవు. పృథక్క్రియలచే కళాభేదమగుచున్నది. ఏయేకళ నాశ్రయించి యేజాతీయుడు నాజాతికాకళానామము జెప్పబడును. హావభావాదియుక్తమగు నర్తనముకళయనబడును. ౧. అనేకవాద్యవికృతిగల తద్వాదనమందలి జ్ఞానము కళ. ౨. స్త్రీపురుషులకు వస్త్రాలంకారసంధానము కళ. ౩. అనేకరూపావిర్భావకరణమందగుజ్ఞానము కళ. ౪. శయ్యాస్తరణాది సంయోగముగల పుష్పాదిగ్రసనమందగు జ్ఞానము కళ. ౫. జూదము మొదలగు నాటలచే మనోరంజనము కళ. ౬. అనేకాసనసంధానముతో రతిజ్ఞానము కళ. ౭. ఈయేడుకళలును గాంధర్వవేదమందు జెప్పబడెను

మకరందము, ఆసవము, మద్యము మొదలగువాటిని జేయు నేర్పుకళ- ౮. చిల్లబాణములంగములందు గాడిన సవి తీసి సరము లందగు వ్రణములను వ్యథ లేకుండబాగు సేయుట కళ. ౯. పానాదిరససంయోగము అన్నాదిపచనజ్ఞానము కళ, ౧౦. వృక్షములకు పుష్పములుగలుగజేయుట, మొక్కలువేయుట, వాటిని పోషించుటయుందలినేర్పుకళ. ౧౧. పాషాణములు గింజలు మొదలగునవి తెచ్చి వాటినిభస్మముచేయునేర్పు కళ. ౧౨. చెరుకుపానకము శే ననేకప్రకారములుగ పంచదారమొదలగువాటినొనర్చునేర్పు కళ. ౧౩. సువర్ణాది ధాతువులను సంక్రమింపజేయుటకును మరలవిభజించుటకును నేర్పు కళ. ౧౪. అన్యోన్య సంయోగముకంటె పూర్వమందగు ధాత్వాదిజ్ఞానము కళ. ౧౫. క్షారములుజేయునేర్పుకళ. ౧౬. జ్వరాదిరోగశాంతికొరకౌషధాదికల్పనము కళ. ౧౭. ఇవి పది యాయుర్వేదోదితములు.

శస్త్రసంధానను తత్ప్రయోగము ఆలీఢాది పదన్యాసము నెరుగుటకళ. ౧౮. శరీరసంధులయందు బొడచుట ఆకర్షణము మొదలగువాటిచేసగు మల్లయుద్ధజ్ఞానము కళ. ౧౯. మల్లులకు శస్త్రములేకుండ ముష్టికూర్పాదులచేనగు బాహుయుద్ధమునందు మృతులైన స్వర్గములేదు. ఈలోకమునందుకీర్తియునులేదు. బలదర్పములేకుండ తీక్ష్ణమగుబాహుయుద్ధము కీర్తికొరకు శత్రువునికై తలపగూడదు. తలపబడినబాహుయుద్ధము ప్రాణాంతమగును. కఠినములగు బాహువులచే జేసినదానికి బ్రతిజేయుచు డాయుచు బాయుచు చిత్రముగనొకరినొకరు దూలింపుచు మొత్తుచు నెత్తివేయుచు జేయబడిన పీడవలన విముక్తియే బ్రతిక్రియ.

చూడబడినప్రదేశములందగు లక్ష్యయంత్రములందు శస్త్రనిపాతనముకళ. ౨౦. వాద్యసంకేతనమున వ్యూహవిరచన కళ. ౨౧. గజాశ్వరథగతులతో యుద్ధమొనర్చుట కళ. ౨౨. ఈమైదుకళలును ధనుర్వేదమందు జెప్పబడెను.

నానావిధములగు నాసనముద్రాదులచే దేవతాతోషణము కళ. ౨౩. సారథ్యమును గజాశ్వాదిగమనశిక్షయునుకళ. ౨౪. మట్టి కఱ్ఱ రాయి సువర్ణాదిధాతువులు యీనాలుగింటిచేతను భాండాదిరచనాజ్ఞానము వేరువేరనాల్గుకళలు. ౨౮. చిత్రాద్యాలేఖనముకళ. ౨౯. తటాకవాపీప్రాసాదసమభూమిక్రియకళ. ౩౦. గడియారముమొదలగు యంత్రములను వీణామృదంగాది వస్తువులనురచించుజ్ఞానముకళ. ౩౧. నీలపీతాదివర్ణములయోగముచే లేతమధ్యమ గాఢములగు రంగులుజేయునేర్పు కళ. ౩౨. ఉదకము వాయువు నగ్ని వీటిసంయో

గనిరోధాదులచే జేయుపనికళ. ౩౩. వాడలు రథములు మొదలగు యానముల రచన కళ. ౩౪. సూత్రములు మొదలగు రజ్జువులను రచించుటకళ. ౩౫. అనేకతంతుసంధానముచే పటనిర్మాణము కళ. ౩౬. రత్నములకు రంధ్రములు వేయుట వాటి సదసద్జ్ఞానము కళ. ౩౭. సువర్ణాదుల యథావస్తుజ్ఞానము కళ. ౩౮. కృత్రిమస్వర్ణరత్నాదిక్రియాజ్ఞానము కళ. ౩౯. స్వర్ణాద్యలంకార రచనకళ. ౪౦. లేపాదిసత్కారము చర్మమార్దవక్రియాజ్ఞానము కళ. ౪౧. పశ్వాదులశరీరమువలన చర్మమునుదీయు నేర్పుకళ. ౪౨. పాలుపిదుకుట మొదలు నేయిగాచువరకును నేర్పు కళ. ౪౩. అంగరఖా మొదలయునసకలముగు కుట్టుట కళ. ౪౪. జలమందు బాహ్వాదులచే తేలుచుటకళ. ౪౫. గృహభాండాది మార్జనజ్ఞానము కళ. ౪౬. వస్త్రసంమార్జనము కళ. ౪౭. క్షురకర్మజ్ఞానముకళ. ౪౮. నువ్వులామదములు మొదలగువాటిచమురును దీయుటకళ. ౪౯. దున్నుటమొదలగువాటిజ్ఞానముకళ. ౫౦. వృక్షాద్యారోహణజ్ఞానముకళ. ౫౧. మనోనుకూలసేవాజ్ఞానము కళ. ౫౨. గడ్డి వెదుళ్లు మొదలగువాటిచే పాత్రలను రచించుజ్ఞానముకళ. ౫౩. లాంతరులు మొదలగు కాచవస్తురచనాజ్ఞానముకళ. ౫౪. నీరుకట్టుట తీయుటయందగు నేర్పుకళ. ౫౫. లోహాదులచే సారములగు శస్త్రాస్త్రములరచించుట కళ. ౫౬. గజాశ్వవృషభోష్ట్రముల పైని వేయు ఝూల్ చాజ్గామా మొదలగునవి కట్టు నేర్పుకళ. ౫౭. శిశువులను సంరక్షించుటకళ. ౫౮. ఎత్తుకొనుటాడించుట కళ. ౫౯. అపరాధినియుక్తముగ గొట్టు నేర్పు కళ. ౬౦. నానాదేశీయులధర్మములను జక్కగవ్రాయుటకళ. ౬౧. తాంబూలపు పట్టీలనుగట్టు నేర్పుకళ. ౬౨. పుచ్చికొనుటలో శీఘ్రకారిత్వముకళ. ౬౩. ఇవ్వడమందు చిరకారిత్వముకళ.౬౪. ఇవియరువదినాలుగుకళలు సంక్షేపముగ జెప్పబడెను.

గ్రంథాంతరమందలి కళాభేదములను జెప్పుచున్నారము. ఇతిహాసము, ఆగమము, కావ్యాలంకారనాటకము, గాయకత్వము, కవిత్వము, కామశాస్త్రము, ద్యూతము, దేశభాషావిధిజ్ఞానము, సకలలిపులనువ్రాయుట, చదువుట, అవధానములన్నియును, సర్వశాస్త్రములును, శకునశాస్త్రము, సాముద్రికము, రత్నశాస్త్రము, రథాశ్వగజారోహణాది కౌశలము, మల్లయుద్ధశాస్త్రము, పాకశాస్త్రము, వృక్షదోహదము, గ్రంథవాదము, ధాతువాదము, గనులను దెలియుశాస్త్రము, రసజ్ఞానము, జలసంబంధమగువాదము, అగ్నిస్తంభనము, ఖడ్గస్తంభనము, జలస్తంభనము, వాక్స్తంభనము, వయస్తంభనము, వశ్యము, ఆకర్షణము, మోహనము, మారణము, విద్వేషణము, ఉచ్చాటనము,

కాలవంచనము, నీటిలో జేలియుండుట, పాదుకాసిద్ధి, వాక్సిద్ధి, ఘటికాసిద్ధి, ఇంద్రజాలము, అంజనము, పరదృష్టివంచనము, స్వరవంచనము, మణిమంత్రౌషధసిద్ధులు, చోరకర్మ, చిత్రరుక్షు, లోహక్రియ, శిలాక్రియ, మృత్క్రియ, దారుక్రియ, వేణుక్రియ, చర్మకర్మ, వస్త్రరచన, అదృశ్యకరణి, దూతీకరణి, వేట, వాణిజ్యము, పశుపాలనము, కృషి, ఆసవకర్మ, లావ కుకుటమేషాది యుద్ధకరణకౌశలము ఇవి అరువదినాలుగు కళలు కళావిదులచే జెప్పబడెను. కళావైకల్యముచే సత్సభామధ్యమందు చంద్రునకీవలెను బుధునకు ప్రకాశత కలగదు.

శ్రేయస్సాధన కృత్యములు.

బాల్యయౌవనాదివయస్సు, లౌకికవ్యవహారములయందు నైసర్గికమైన బుద్ధి, గృహక్షేత్రాదిధనము, వక్తృత్వము, వేషము అనగా కులానుసారము ప్రతిగ్రహాదికర్మ, వీటికి ఉచితమైన వృత్తిని బుద్ధిమంతుడు స్వీకరించవలయును. ఎటులనిన ముసలివాడు యౌవనముగలవాని వృత్తి నాచరించిన నుచితముగాదు. ఇటుల బుద్ధ్యాదులయందు యోజించవలయును. అట్టివ్యాపారము వక్రములేక మాత్సర్యముగాకనుండవలయును. అహింస, సత్యము, చౌర్యము లేకుండుట, శుచిత్వము, ఇంద్రియ నిగ్రహము, దానము, దమము, దయ, సహనము, ఇవిసకలమైనవారికిని ధర్మసాధనము లని యాజ్ఞవల్క్యులు.

సర్వేంద్రియవిషయములందును కామమువలన నాసక్తుడు కాకూడదు. కానవిషయాసక్తిని మనస్సుచే మళ్లింపవలయును. క్షత్రియుని, సర్పమును, బహుశ్రుతబ్రాహ్మణుని యవమానించదగదు. వీరునీరసించియున్నను యవమానించినవారిని దహించుదురు. కావునబుద్ధిమంతుడు వీరినియవమానించగూడదు.

పూర్వమందగు తనలోపమునుజెప్పి తననుదానవమానించుకోదగదు. ఆమరణాంతము లక్ష్మీప్రాప్తిని గోరుచుండవలయును గాని లక్ష్మీదుర్లభమనియూహింపదగదు. మంగళాచారములనుజేయుచు నియతచిత్తుడై జపహోమాదులను జేయువారికి వినిపాతములేదు. ఏయేకర్మపరాధీనమైయుండునో దానిని విడువవలయును. ఆత్మవశమగుదానిని బ్రయత్నముచే జేయవలయును. సర్వమును బరవశము దుఃఖము. ఆత్మవశము సుఖము.

సంగ్రహముగా సుఖదుఃఖలక్షణము నిదిగాదెలియవలయును. ఏకర్మజేసిన నంతరాత్మసంతోషించునో దానిని జేయవలయును. అటులగానిదానిని వర్జింపవలయును. అనృతపరుడు, అధార్మికుడు, హింసారతుడగువాడును సుఖ

మునొందదు. తానుక్షీణించియుండినను ధర్మయుక్తమగు మనస్సు నధర్మమందు పెట్టతగదు. అధార్మికులగు పాపకర్ములదుఃఖమును జూచుచునుండునుగదా- అధర్మమాచరించబడి యప్పుడె గోవువలెనుఫలించదు. మెల్లన తిరిగితిరిగి వచ్చి యధర్మకర్తయొక్క మూలచ్ఛేదమును జేయును. అధర్మముజేయువానియందా ఫలముకనపడకుండిన బుత్రులయందైన పౌత్రులయందైన మునిమనమలయందైన సయధర్మఫలమగు కష్టము నగపడునుగాని వ్యర్థముగాదు. ఒకడుచేసిన పాపఫలమొకడనుభవించునాయనిన బుత్రాదులకువచ్చిన కష్టములు తండ్రికి దుఃఖహేతువులగుటవలనను శాస్త్రీయమగుటచేతను ధీనియందవిశ్వాసము జేయదగదు. అధర్మముచే వర్ధమానుడై శుభములనొంది శత్రువులనుజయించినను సమూలముగ నశించుననిమనువు. కావున నధర్మాచరణముగూడదు.

శుచిర్భూతుడై యాస్తిక్యముచే పూతాత్ముడై దేవతలనెల్లప్పుడు బూజింపవలయును. దేవతలబూజించునట్లు గురుజనులనారాధించవలయును. తనవలెను మిత్రజనమును బరామర్శింపవలయును. నమస్కారముచే గురువులను సదాచారకృత్యములచే సత్పురుషులను సత్కర్మచే దేవతలను సద్భావముచే మిత్రులను సంభ్రమముచేబాంధవులను ప్రేమదానములచే స్త్రీలను భృత్యులను, దాక్షిణ్యముచే నితరజనులను ఐశ్వర్యమునుగోరువాడు తనకభిముఖులనుగా జేయవలయును. పరులవ్యాపారమందు నిందగూడదు. స్వధర్మమునుబరిపాలించుట దీనులయందు దయ సందర్భయుడలను వాఙ్మాధుర్యము మంచిమిత్రునకు ప్రాణములచేనైన నుపకారముచేయుట ఇంటికివచ్చినవానిని మన్నించి యథాశక్తి గానిచ్చుట సహనశీలత్వము తననైశ్వర్యమున్నప్పుడు గర్వించకుండుట పరుల వృద్ధికినోర్చుట ఇతరులకుపీడాకరముగ మాటలాడకుండుట సుఖదుఃఖాదిద్వంద్వములనుసహించుట బంధువులతోబాంధవ్యమునెరపుట సుజనులయందు సమత సజ్జనచిత్తానుసరణముగ నడచుట నివియావత్తును మహాత్ములవ్యాపారముగావున సనాతనమగు నీమార్గమందు లెస్సగా గృహస్థులు నడువవలయును. ఈ మార్గముగా నడచిన యిహపరసౌఖ్యముల నొందుదురు.

దివాష్టభాగకృత్యమ్.

అష్టమేలోకయాత్రాచ బహిస్సంధ్యా తతఃపునరితి దక్షోక్తదినస్యాష్టమభాగకృత్యంచవదామః॥ లోక్యతే ఆలోక్యత ఇతి లోకః। లోకృదర్శనే। లోకశబ్దేన శిరఃపాణ్యాద్యంగసంస్థానవిశేషయుక్తం తిర్యగ్వ్యతిరిక్తం మనుష్యాది

ప్రాణిమాత్ర ముచ్యతే । లోకైర్యాత్రా లోకయాత్రా సుహృజ్జనై రుద్యానాదివనవిహరణమిత్యయావత్॥ తదుక్తం॥ గహనాని విసర్జయన్విశుద్ధం బహిరుద్యానవనం సమభ్యుపేయాత్ । విహరన్మధురం వయోనురూపైర్నచ మాద్యేద్విషయోపభోగరోగాత్॥ నవంవయోహరం వపుర్వరాంగనాస్సఖాః కలావిశేలవల్లకీస్వనః। ధనానిసర్వం విఫలంసుఖైషిణో వినావిహారోపవనాని దేహినాం॥

దినాష్టమభాగకృత్యములు.

దినముయొక్క యెనిమిదవభాగమందు లోకయాత్రనొనర్చి యటుపైని సాయంసంధ్యావందనమును వెలుపలనొనర్పవలెనని దక్షోక్తదినాష్టభాగకృత్యమును జెప్పుచున్నారము.

చూడబడేదికాగా లోకము లోకృ అనేధాతువుదర్శనార్థముకలది. లోకశబ్దముచేతను శిరస్సు హస్తము మొదలగు నవయవవిశేషములుగల తిర్యగ్వ్యతిరిక్తమగు మనుష్యాదిప్రాణిమాత్రమని బలుకబడుచున్నది. లోకులచేతను జేయబడుయాత్ర లోకయాత్ర యనగా స్నేహితులతో నుద్యానాదివనవిహరణమని నిశ్చయార్థము. అదిచెప్పబడేనది యెటులనిన- దుర్గమములగు వనములను విడచి పరిశుద్ధములగు బాహ్యోద్యానముల నొందవలెను. వయోనురూపులగు వారితో మనోహరముగ విహరించుచు విషయభోగములనుంచి మదించగూడదు. నూతనమగు మనోహరమైనవయస్సు చక్కనిరూపము శ్రేష్ఠమైనస్త్రీలు కళావేత్తలగుసఖులు మనోహరమగు వీణాధ్వని సకలధనములును సుఖేచ్ఛగల దేహులకు విహరించదగు నుపవనములు లేకుండిన విఫలములు.

వృక్షాయుర్వేదః.

శ్రీదంతులూరి నారాయణగజపతిరాజ విరచితం శాస్త్రం । వృక్షాయుర్వేదాఖ్యం వితనోతు ముదం సదా విదుషాం॥

నను మనుజానాం బాహ్యాంతరేంద్రియవతాం సుఖదుఃఖ మనుభవతాం పంచమహాభూతవికారసముదాయాత్మక శరీరిణామివ వృక్షాణా మాయుర్వేదోక్తిః కథమిత్యాశంక్య వదామః॥

హితాహితంసుఖందుఃఖ మాయుస్తస్యహితాహితం । మానంచ తచ్చ యత్రోక్త మాయుర్వేదస్సఉచ్యతఇతిచరకే॥ అస్యార్థః॥ హితంచ అహితంచ ద్వయోస్సమాహారఇతి హితాహితం। హితమహితం సుఖందుఃఖంచేతి చతుర్విధ మాయుః । వర్ధనరక్షణభేదాద్ద్వివిధమేవా శైథిల్యజనకాహారాచారభేషజాదికం

తులవకషాయము, మోదుగ, మద్ది, తక్కిలి చెట్లచెక్క కషాయము ఉప్పునీళ్లను బోసిన వెంటనే పుష్పఫలములు రాలిపోవును. నానావిధమైన రంగుల చేకూర్చబడిన దుంపగల కలువయొక్క కాడ తంతువచేతను ఘటనజేసి నేయి, తేనియయును పూసి విత్తనము పాతిన ఆయారంగులుగల పుష్పములను పుష్పించును. గేదెపేడయును మూత్రమును గలిపి కలువగింజలు తడిపి యేడుదినములు యెండించి పాతిన గన్నేరుచెట్టు అగును. గుమ్మడు వంకాయ పొట్లవిత్తనములు వసలో నానబెట్టి పాతి వసోదకముచే తడిపిన సర్వకాలమును గింజలు లేని గొప్పకాయలను గాచును.

వృంతాకబీజము నేయి తేనియచేతను దడిపియుంచి గోమయముచే బూయబడిన గుమ్మడికాయను దొలిచి యందున వేసి యాగుమ్మడిపండు పండిన తరువాత నాబీజములను దీసి పాతినను విశేషముగ ఫలించును. మందారచెట్టు దొలిచి గుమ్మడిలతను దానినుండి దీసి మృత్తికను గోమయమును అచ్ఛాదించి యుదకమును చెట్టుకు బోయుచుండిన యెల్లప్పుడును కాచును. పందిరక్తము కొవ్వుచేతను తడిపి ఉలుదుగింజల తైలముచే భావనజేసిన యాముదపు గింజ పాతిన కాకరకాయ కాయును. గాడిద గుఱ్ఱముల దైలయందుంచి కాల్చబడిన ఆర్ద్రిచేతను మొదటియుందడ్డముగా గుచ్చబడిన యనటి యేనుగతుండమువంటి గొప్పఫలములనుఫలించును- పందిరక్తముచేతను లేక నెదడుచేతను ఉలుదుతైలముచేతనైన తడిపిన యనటి యుత్తమమగు దాడిమపండ్లనుబండును.

మనుష్యమాంసము నెదడు రక్తము యేనుగుదంతముల పొడుముతో కలిపినయుదకముతో తడిపిన యనటి మామిడిపండ్లను బండును. ఉలుదుగకషాయముతో తత్కాలమందైన మనుష్యమాంసముకవంతు పాలతో కలిపి తెలగపిండి తోమిశ్రితముచేసి తియ్యమామిడిమొదట వేసిన ద్రాక్షలతవలె సర్వదా ఫలించును. ఇదినిశ్చయము. సమస్తమైనవారికి నాశ్చర్యమును జేసును. నెవులపిల్లి తాబేలు రక్తములలో ననేకపర్యాయములు తడపబడిన మామిడిటెంక పాతి పాలు బోసిన సర్వకాలము కాచును.

విడంగము, యష్టిమధుకము, పాలు, బెల్లము వీటిచేతను ప్రయ్యాబడిన తాటిచెట్టు స్వభావముచే చేదైన మధురఫలములను ఫలించును.

## తరుచికిత్సా.

నరాణామివవృక్షాణాం వాతపిత్తకఫాగదాః। సంభవంతినిరూప్యాధ తుర్యాత్తద్దోషనాశనం॥ కీటజగ్ధాగ్నిసంప్లుష్టే వాతభగ్నేఽశనిక్షతే। వృశ్చేదో

చారాదిపీడితేచ పృథక్క్రియా। కృశో దీర్ఘో లఘూయాయో నిద్రాహీనోల్పవేదనః। సవ్రత్తేఫలపుష్పాణి వాతప్రకృతికస్తరుః॥ అతపాసహనః పాండుశ్శాఖాహీనోఽనుహుర్యది। అకాలఫలపాకీస్యాచ్ఛీఘ్రపిత్తాత్మకస్మృతః। స్నిగ్ధశాఖాదలశ్శాఖీ సస్యక్పుష్పఫలోజ్జ్వలః॥ లతాపలితగాత్రస్తు కఫవాన్ పరిమండలః॥ కటుతిక్తకషాయరసైః పవనః పిత్తం కట్వోష్ణలవణామ్లైః। స్నిగ్ధమధురామ్లలవణైశ్శ్లేష్మా కాయాతితరోః॥ స్నిగ్ధైః శిశిరరసైః ప్రయాతి వాతస్సంస్నిగ్ధైర్మధురహిమైర్జలైశ్చపిత్తం। కట్వమ్లైరహిమజలైః కషాయరూక్షైశ్శ్లేష్మాపి క్రిమవిహితైః ప్రియాతినాశం। రాజ్యం గ్రంథిఘుటికావాతాద్వృక్షస్యజాయతే నిత్యం। గోవిట్శ్వస్లోధ్రవచాకుణపజలైస్సజయోఽపిభవేదేవం॥ దోషైర్యస్యపి... ప్రవాళకుసుమమ్లానిర్వ్రీరూపంవపుర్మ్లానేతస్యతరోర్భవంతి కృమయో యత్నాచ్చతానుద్ధరేత్। గోమూత్రాజ్యవిడంగసర్షపజలైర్లిప్యాత్ప్రనష్టైస్తతస్సిక్తాః క్షీరజలైరుదేతిసహసా ధూపైశ్చధూపాయితః॥ కరంజారగ్వధాగ్నిసప్తపర్ణత్వచాకృతః। ఉపచారః కృమిహరః మూత్రేణుస్తవిడంగవాన్॥ కుణపజలపయోనిషిక్తమూలస్సరసిజకందవిలిప్తసర్వగాత్రః। తరురనలహతోపి బిభర్తి భూయో మరకతకాంతినిభానిపల్లవాని॥ ప్లక్షోదుంబరత్వగ్ఘృత మధు మధునోచ్ఛిష్ట దుగ్ధైర్విలిప్తస్తంభేయుత్తంభ్యరుజ్వా పరికలితవపుః పూరితస్లక్ష్ణమృద్భిః। సిక్తః క్షీరేణభూయో జలభరితతలశ్చండవాతాదిభగ్నస్స్వస్థోభూత్వాంఘ్రిపాయీ కుసుమఫలభరంవ్యాతనోతిప్రకామం॥ వృక్షస్యాశనిదగ్ధస్య జీవనంశృణుభేషజం। ఘనోశీరమధూకైశ్చ ముద్గామాషాయవాస్తిలాః॥ పిష్ట్వాక్షీరాంబుసంసిక్తైస్సేచయేత్తమభీక్ష్ణశః। సంసేకాప్యాయతశ్శీఘ్రం ప్రకృతిస్థోభవేత్తరుః॥ జనయిత్వాఫలకుసుమేయః పునరుపయాతి వృద్ధతాం శాఖీ। సక్షీరః కుణపజలైర్యాభ్యాయస్సిక్తః ఫలత్యేవ॥ అసేకతోత్యంతనిషేకతశ్చశాఖావిశోష్యంఫలినోసిరూప్య। సప్తాహమాత్రం ఘృతమేవసర్పి విడంగదుగ్ధేన నిషేచనీయః॥ ఉన్నిద్రతా మత్స్యసుగంధితా చ ప్రవాళహానిస్సపిపీలికత్వం। త్వగ్భ్రంశతావారికృతాదజీర్ణాత్తరోర్భవేత్తత్ర చికిత్సనీయం॥ తన్మూలదేశే పరశుప్రహారైర్విసావితం దోషరసంనిహత్య॥ క్షౌద్రాజ్యజంతుఘ్నతిలైః ప్రసిక్తం మృత్పూరితం దుగ్ధజలైర్నిషించేత్॥ శరరురాతిలగోక్షీరవారిసేకాత్తథాతరోః। శోషశ్శామ్యతివృక్షస్య లేపాద్ధూపోపచారతః॥ ప్రియంగువత్సతరారూరీ వేతసార్జునవల్కలైః। క్షీరసిద్ధైర్విలిప్తానాం

సా్రవశ్యామ్యతిశాఖినాం॥ సురభిసుమనోలబ్ధామోదాం నిధాయచమృత్తికాం ధవఖదిరయోఃక్వాథాంభోభిస్సుగంధనిరీక్షణాత్। మలయజరజోలేపాద్ధూపాద్ఘృతస్యచభూరుహాం వ్రజతికుసుమసిర్గంధానామతీవసుగంధతాం॥

తరుచికిత్స.

మనుష్యులకువలెను వృక్షములకు వాతకఫపైత్యరోగములుపుట్టుచున్నవి. అవి నిదానమునుజేసి నివారణనుజేయవలయును. పురుగుచేతతినబడినను అగ్నిచేకాల్చబడినను వాతముచేవిరిగినను పిడుగుచేతకొట్టబడినను గొడ్డలిచేతను ఛేదించబడినవాటికిన్ని వేరువేరుగ చికిత్సను జేయవలయును.

ఈమీద రోగనిదానమును జెప్పెదము. కృశించియుండుట, పొడవుగ నెదిగిపోవుట, స్థూలముగమూనుబలచుట, కఠినముగనుండుట, నిద్రలేకుండుట, స్వల్పాయాసమునగా ఎండకొంచమునకుసోకినవాడును. జలముతగిలితే ఊటగలుగుటయునుగలవృక్షము వాతప్రకృతికలదై ఫలపుష్పములను కలిగియుండును. పైత్యప్రకృతిగలవృక్షము ఎండకు సహించకుండును. తెల్లబడును. మాటిమాటికి కొమ్మలు పుల్లవిరిగిపోవును. అకాలమందు ఫలములుండును. శ్లేష్మప్రకృతిగల వృక్షము దట్టమైన కొమ్మలాకులుగలదియై యుండును. ఫలపుష్పసమృద్ధిగలదై యుండును. అకాలరోగములచెందకుండును. చెట్టునుసాంద్రముగలిగియుండును.

ఈపైని చికిత్సలనుబల్కెదను. వట్టివేరు కషాయరసములను బోసిన చెట్టుకువాతమునుబుట్టదు. వట్టియు, నెయ్యియు, పులుసును, వెచ్చనయును బోసిన పైత్యమునశించును. సాంద్రముగా మధురమును పులుసును ఉప్పును యూరసములనుబోసిన శ్లేష్మమణగును.

సాంద్రమైనమాంసరసములచేతను వాతము మధురశీతజలములచేతను పైత్యము వట్టియును పులుసును వెచ్చనయునుబోసిన శ్లేష్మము నశించగలదు. కఠినముగు కణుపులు వాతముచే వృక్షమునకు బుట్టును. ఆరోగము ఆవుపేడయు, లొద్దుగచెక్క, వస, కుణపజలములచేతనుబోవును. ఏవృక్షమునకు వాతపైత్యశ్లేష్మదోషములు లేకపోయినను పుష్పపల్లవములు వాడుటయు రూపహీనతయును గలుగునో దానిమూలమందు పురుగులుండును. వాటిని ప్రయత్నముచేతను దీసివేసి గోమూత్రము, నేయి, విడంగములు, ఆవాలు, నువ్వుపిండియునుగలిపి పూయవలెను- పురుగులుపోయినతరువాతను పాలు నీళ్లచేతను తడిపి ధూపద్రవ్యములచేధూపమునువేయబడిన వైశీఘ్రముగచెట్టువృద్ధిగనుండును.

కాగు, రేల, తెల్లఉల్లి, ఏడాకనటిదిప్పలు, గోమూత్రము, తుంగదుంపలు, వాయువిడంగములున్ను మొదట వేసినక్రిమిహరించును. కుణపజలము, పాలు వీటిని మొదటబోసి తామరదుంపలేపనమును మొదలుమొదలుకొని వృక్షమునకు లేపనముజేసిన యగ్నిహానినాగు వృక్షము తిరుగ పచ్చలవంటి పల్లవములు కలదగును.

జువ్వి, జిల్లేడు, మేక విటిచెక్క, నేయి, తేనియ, మద్యము, పాలు, వీటిచేతను చెట్టుకు లేపనముచేసి స్తంభములచేతను మొత్తి [illegible] నిలుపబడిన మొదలుకలదిగజేసి జువ్విచెట్లుయొక్క మట్టిచేతను మునటకూర పాలుబోసి తిరిగి నీటిచేతడిపిన ప్రచండవానములచే పడినచెట్టు స్వస్థమైనదై కాపుఫలించును.

పిడుగుచే కాలినచెట్టును [illegible] యుపాయము జెప్పుచున్నాను. ముతుంగముస్తలు, వట్టివేళ్లు, [illegible], [illegible], [illegible], [illegible] వీని పిండిచేసి పాలతోనూ నీళ్లతోనూ కలిపి చెట్టును [illegible] తడుపవలసినది. అందువలన [illegible] తిరుగ [illegible]. ఫలములను కాయలను కొన్నిరోజులు [illegible] కాచి [illegible] కుణపజలము పాలను గలిపి తడిపిన తిరుగ [illegible] ఫలించును. నీళ్లు విశేషముగపోయడమువల్లనైన తడపకుండుటవల్లనైన వృక్షముయొక్క [illegible] యుండడము పళ్లు రాలిపోవడమును జూచి [illegible] నేయి, పాలు, [illegible] గలిపి తడపవగును. విశేషముగ [illegible] [illegible] వంటివాసన [illegible] వృక్షమునకు ఉపకారము [illegible] చికిత్సను జేయదగును. ఉదకాజీర్ణముగలిగినవృక్షముయొక్క మూలమందు గొడ్డలిచేతను నాట్లుగొట్టి దోషరసమును స్రవింపజేసి తేనియ, నేయి, విడంగము, తిలలును గలిపి తడపి మృత్తికచేపూరణజేసి పాలును నీళ్లనుబోయవలెను. పంచదార తిలలు ఆవుపాలు నీళ్లను పోయడముచేతను లేపనమువలన ధూపమునుంచిన్ని శోషము శమించుచున్నది. పేంఖనపుచెట్టు, తక్కిలిచెట్టు, వస, ప్రబ్బచెట్టు, మద్దిచెట్టు వీటిచెక్క పాలతో గలిపి లేపనమునచ్చిన వృక్షములస్రావముశమించుచున్నది. పుష్పములకు పరిమళము పోయినపుడు పరిమళయుక్తమైన పుష్పములతో మృత్తికనుకలిపియుంచి ధవము, కాచును కషాయమునుబెట్టి దానితో సుగంధద్రవ్యమునుగూడవేసి యదిచెట్టుమొదటబోసి చందనలేపనమునుజేసి నేయి ధూపమువేసినపుష్పములకు సుగంధత్వముగలుగును.

## సస్యనిష్పత్తిజ్ఞానమ్.

ఫలకుసుమపత్రవృద్ధిం వనస్పతీనాం విలోక్య విజ్ఞేయం । సులభత్వం ద్రవ్యాణాం నిష్పత్తిశ్చాపి సస్యానాం॥ న్యగ్రోధేనతు యవకా స్తిందుకవృద్ధ్యాచ షష్టికాభవతి। గోధూమాశ్చ మధూకైర్యవవృద్ధి స్సప్తపర్ణేన॥ కరీరాశ్చ హస్తికర్ణైర్మిద్రే శ్యావాజినోశ్వకర్ణేన। అశ్వత్థేన జ్ఞేయా నిష్పత్తి స్సర్వసస్యానాం । జంబూభిస్తిలమాషాశ్శిరీషవృద్ధ్యాచ ముద్గనిష్పత్తిః॥ గావశ్చపాటలాభిఃకదళీభిరజావికంభవతి। ఆమ్రైః క్షేమం భల్లాతకైర్భయం పీలుభిస్తథారోగ్యం। ఖదిరశమీభ్యాందుర్భిక్షమర్జునేన శోభనావృష్టిః। పిచుమందనాగకుసుమైస్సుభిక్షమప్యమారుతఃకపిత్థేన। నిచులేనావృష్టిర్వ్యాధిభయం భవతికుటజేన॥ రంభారామే ప్రథమఫలితే ప్రాగ్భద్రంచ వహ్నౌ పుష్పంచేచ్ఛస్త్రవృద్ధిః ప్రత్యఖదిశిచేత్స్యాత్సుహృద్బంధునాశః। నైఋత్యాంపుత్రలాభో వరుణదిశి విపన్మారుతే నేత్రరోగః కౌబేర్యాం సర్వసంపద్భవతి హరదిశి శ్రీస్తదారామవృద్ధిః॥

ఫలకుసుమనిష్పత్తిచేతను సస్యవృద్ధిని జెప్పుట.

మఱ్ఱిఫలించడముచేతను యవలు, తుమ్మికచెట్టు ఫలించుటచే షష్టికనులు, ఇప్పచెట్టు ఫలించుటచే గోధూమములు, ఏడాకులనటచే యవలు, కరీరములు హస్తికర్ణములచే, వాజులనేవిఖద్దిఫలించుటచేతను, రావి కాచుటచే సకల సస్యవృద్ధి. నేరేడుచేతను మెరకమినుములు, శిరీషపుచెట్టుచేతను పెసలు, పాటలముచే గోవృద్ధి, అనటచే మేకలయొక్క గొఱ్ఱెలయొక్కవృద్ధి, మామిడిచెట్లకాపువలన ప్రజాక్షేమము, నల్లజీడికాపుచేభయము, పీలు అనేవృక్షము ఫలించిన యారోగ్యము, చండ్రి, జమ్మి వీటిచే దుర్భిక్షము, తెల్లమద్దిచే శోభనమగు వృష్టి, బావి నాగవృక్షములచే సుభిక్షము, వెలగవల్ల గాలిలేకుండును, ప్రబ్బచే అనావృష్టి, అంకుడునుంచిరోగభయము.

అనటితోటలో మొదట ప్రాగ్దిశని గలవేసిన మంగళము. ఆగ్నేయదిశను శస్త్రవృద్ధి. దక్షిణదిక్కున బంధుసుహృన్నాశనము. నైఋతిదిశను పుత్రలాభము. పశ్చిమదిశను విపత్తి, వాయువదిక్కున నేత్రరోగము. ఉత్తరమున సంపత్తి, ఈశాన్యదిశను సంపదయు, నాతోటయొక్కవృద్ధిన్ని జెప్పవలెను.

## శయనాదివిధిః.

సర్వర్తుషుదివాస్వాపో ప్రతిషిద్ధోన్యత్రగ్రీష్మాత్। మేదస్వేదకఫరసరక్తక్షీణానామజీర్ణినాంచ ముహూర్తం దివాస్వపన మప్రతిషిద్ధం రాత్రావపి

జాగరితవతాం జాగరితకాలాదర్ధమిష్యతే దివాస్వప్నః। వికృతిర్హి దివాస్వాపో నామ। తత్రస్వపతామధర్మః సర్వధర్మప్రకోపశ్చ। తత్ప్రకోపాచ్చ కాసశ్వాసప్రతిశ్యాయశిరో గౌరవాంగమర్దారోచకజ్వరాగ్నిదౌర్బల్యాని భవంతి। రాత్రావపి జాగరితవతాం వాతపిత్తనిమిత్తాస్తమేవోపద్రవా భవంతిచాత్ర॥ తస్మాన్నజాగృయాద్రాత్రౌ దివాస్వప్నంచవర్జయేత్। జ్ఞాత్వా దోషకరావేతౌ బుధస్స్వప్నంమితంచరేదితిసుశ్రుతే॥ ఉపాస్య పశ్చిమాం సంధ్యాం హుత్వాగ్నీంస్తానుపాస్యచ। భృత్యైఃపరివృతో భుక్త్వా నాతితృప్త్యాథసంవిశేదితి యాజ్ఞవల్క్యః॥ పునఃపాకముపాదాయ సాయమప్యవనీపతే। వైశ్వదేవనిమిత్తంవైపత్న్యాసార్థంబలింహరేత్। తత్రాపవశ్వపచాదిభ్యస్తథైవాన్నంబలింహరేత్॥ అతిథించాగతంతత్ర స్వశక్త్యాపూజయేద్బుధః। కృతపాదాదిశౌచస్తు భుక్త్వాసాయంతతోగృహీ। గచ్ఛేదస్ఫుటితాం శయ్యామపి దారుమయీం నృప। నావిశాలాంనవై భగ్నాం నాసమాంమలినాంనచ। నచజంతుమయీం శయ్యాం త్వధితిష్ఠేదనావృతామితి విష్ణుపురాణే॥ నావిశాలామితి। అవిశాలాంసంకుచితాంపరిలుంఠితుమనుపయోగినీత్వాత్। భగ్నాంశిథిలాంబాధోహేతుత్వాత్। అసమాంవిషమాంమధ్యనిమ్నాంనిర్గతాదివత్। మలినాంమలినవస్త్రాభిర్యుక్తామితి। జంతుమయీం మత్కుణాదినా వ్యాప్తామితి అనాస్తృతాం కశిపుశయ్యాస్తరణశీలాంగస్పర్శసుఖభంగికాభవతీత్యేతాదృశశయ్యాంనాధితిష్ఠేదిత్యుక్తం॥ ప్రదోషపశ్చిమౌయామౌ వేదాభ్యాసేనతౌనయేత్। యామద్వయంశయానశ్చ బ్రహ్మభూయాయకల్పతే॥ రాత్రిసూక్తంజపన్స్మృత్వా సర్వాంశ్చ సుఖశాయినః। నమస్కృత్వావ్యయంవిష్ణుంసమాధిస్థస్స్వపేన్నిశి॥ అగస్త్యోమాధవశ్చైవ ముచికుందో మహాముని। కపిలో మునిరాస్తీకః పంచైతే సుఖశాయినఇతిగోభిలః॥

శయనావిధి.

సర్వఋతువులయందును పగలు నిద్రించతగదు. గ్రీష్మఋతువునమాత్రము రెండుగడియలు నిద్రింపవచ్చును. మేద స్వేద కఫ రస రక్త క్షీణులకున్ను అజీర్ణరోగులకున్ను ముహూర్తమాత్రము పగలు నిద్రింపవచ్చును. రాత్రియందు నిద్రలేకుండిన నాకాలములో సగము పగలునిద్రింపవచ్చును. దివాస్వాపము వలన వికృతియగు ననగా అధర్మము. సర్వధర్మములకుహాని. కాసశ్వాసశిరోరోగాంగమర్దారోచకజ్వరాగ్నిదౌర్బల్యములుబుట్టును. రాత్రియందు మిక్కిలి మేలుకొనినవారికిని వాతపిత్తరోగములు బుట్టును- గావున రాత్రియందు జాగరణము

దివాస్వాపమును వర్జింపవలయును- ఇట్లు దెలసి బుద్ధిమంతులుఉచితముగ నిద్రింపవలయునని సుశ్రుతము.

సాయంసంధ్యావందనము నగ్నిహోత్రమును జేసి భృత్యులతో గూడ మితముగ భుజించి శయనించవలయునని యాజ్ఞవల్క్య వచనము. రాత్రిపచించినయన్నముచే సాయంవైశ్వదేవబలిహరణ శ్వపచాది బలిహరణప్రముఖములను పత్నితోగూడ జేసి యతిథిపూజగావించి శేషముభుజించి పాదప్రక్షాళనము జేసి గృహస్థుడు గట్టిది దారుమయము విశాలమగునది భగ్నముగాకుండునది విశేషముగమలినముగా కుండునది నల్లులుమొదలగుజంతువులులేనిది ఆస్తృతమగునదియగు శయ్యయందు బరుండవలయునని విష్ణుపురాణము.

శయ్యవిశాలముగా కుండిన వర్తిగిలుటకు నుపయోగించదు- భగ్నమైన నారోహణముచేపరాను. విషమమైనశ్రమకలుగును. మలినమైనరోగముగును. నల్లులుమొదలగుజంతువులుండిన నిద్రలేకుండును- ఆస్తరణలేకుండిన శరీరమువత్తును- గానమంచిశయ్యయందు శయనించవలయును. రాత్రిమొదటిజామును కొనజామును వేదాభ్యాసముచే వెళ్లించి మధ్యయామములు రెండింటిని నిద్రించిన ముక్తికహుడగునని దక్షుడు-

రాత్రిసూక్తమునుజపించి సుఖశాయులగు అగస్త్య, మాధవ, ముచికుంద, కపిల, ఆస్తికులను స్మరించి యవ్యయుడగు విష్ణువును నమస్కరించి బుద్ధినంతర్యామితోగలిపి నిద్రింపవలయునని గోభిలుడు-

ప్రో ప గ మః.

తత్రాపస్తంబః॥ సదానిశాయాం దారాన్ప్రత్యలంకుర్వీత॥ విష్ణుపురాణే॥ స్నాతస్స్రగ్గంధధృక్ప్రీతో నాధ్మాతః క్షుధితోపివా। సకామాంసానురాగశ్చ వ్యవాయంపురుషోవ్రజేత్। లఘ్వాహారాం స్త్రియం కుర్యాదేవం సంజనయేత్సుతం। చతుర్దశ్యష్టమీచైవ అమావాస్యాథపూర్ణిమా। పర్వాణ్యేతానిరాజేంద్ర రవిసంక్రాంతిరేవచ॥ బృహస్పతిః॥ ఋతుకాలాభిగమనం కుర్యాత్పర్వాణివర్జయేత్। స్త్రియాశ్శుక్రోధికేస్త్రీస్స్యాత్పుమాన్పుంసోధికే భవేత్। తస్మాచ్ఛుక్లవివృద్ధ్యర్థం వృష్యంస్నిగ్ధంచభక్షయేత్। తాసామాద్యాశ్చతస్రస్తు నిందితైకాదశీచయా। త్రయోదశీచశేషాస్తు ప్రశస్తాదశరాత్రయః।చతుర్భిరితరైస్సార్ధమహోభిస్సద్భిర్గర్హితైరితిచమనుః। నకేవలంరజోదర్శనాదారభ్యచతసృషురాత్రిషు స్త్రీగమనే సద్విగర్హితమాత్రం। కింతు। రజస్వలాంప్రాప్తవతో న

రస్యానియతాత్మనః। దృష్ట్యాయుస్తేజసాంహానిరధర్మశ్చ తతోభవేదితి సుశ్రు
తోక్త్యా దృష్ట్యాదిహానిరూపదృష్టఫలమపిదృశ్యతే॥

హంతవిజ్ఞానమునినా స్వదారగసురతంబుతౌ। నబ్రహ్మచర్యస్ఖలనదోష
శ్శ్రాద్ధేపివిద్యతే। ఇతీరితంమితాక్షర్యాం పశ్యేచ్చాశౌతిసంజ్ఞికే। దృష్ట్వానిబంధన
మిదం విజ్ఞానమునినాకృతం। పాయసంపూరికాలడ్డూన్పిష్టశేషంయథేచ్ఛయా।
భుంజానాభార్యయాసార్థం కృత్వా రతిమహోత్సవం। కారయిష్యంత్యవిద్వాం
సో కామభూతాభవంచితాః। తేవేశ్యైవాత్ర గేహో యశ్లోకస్తం వచ్మి సాద
రాత్। ధ్వనితంబ్రహ్మచారీస్యాచ్ఛ్రాద్ధకృచ్ఛ్రాద్ధిమస్తైస్సహ। యాజ్ఞవల్క్య ఇ
తిప్రాహ శ్రాద్ధేనిందితయాంరతిం। మూలానుసారిణీవ్యాఖ్యాభవేన్మానువిరోధినీ।
మన్వాదిస్మృతికర్తౄణాం సంమతాసావిద్యతే। పృథ్వీచంద్రోదయకృతా మా
ధవేనాపిధీవచ। దేవానందేనకుల్లూకభట్టాద్యైశ్చ వినిందితం। నిబంధనంతునగ్రా
హ్యం విజ్ఞానమునినాకృతం। శ్రాద్ధకృచ్ఛ్రాద్ధభోక్తారస్తాంనిశాం స్వస్త్రియాస
హ। రమేయుర్నైతియత్ప్రోక్తం మునిభిస్సర్వవేదిభిః। అనేనాయామ్యతాక్షేయమి
త్యాహకమలాకరః। సోయం వ్యవస్థాంకృతవాన్నృతౌ స్యాసంభవే సతి। ఏకాద
శ్యాంచశ్రాద్ధేవా కార్యం స్వస్త్రీగమనంక్వచిత్। పదమేతద్విరుధ్యుక్తం కాశీనాథేన
సూరిణా। కమలాకరభట్టస్య వ్యవస్థానోచితాకృతా। వ్యవస్థోజ్జీవకంమూలంవ్యా
ఖ్యమేతద్విచక్షణైః। సమయస్త్వేవసాధూనామస్మిన్నర్థేనవిద్యతే। సోపి వేదవది
త్యాహమునయస్తత్వదర్శినః। నిమంత్రితస్తుయశ్శ్రాద్ధే మైథునంసేవతేద్విజః।
శ్రాద్ధందత్వాచభుక్త్వాచయుక్తస్స్యాన్మహతైనసా। ఋతుకాలే నియుక్తోవా
నైవగచ్ఛేత్ స్త్రియంక్వచిత్। తత్రగచ్ఛన్నవాప్నోతి హ్యనిష్టాని ఫలానితు। శ్రా
ద్ధంకరిష్యన్కృత్వావా భుక్త్వావాపినిమంత్రితః। ఉపోష్యచతథాభుక్త్వా నోప
గచ్ఛ ఋతావపి। భోక్ష్యన్కరిష్యన్ శ్వశ్శ్రాద్ధం పూర్వరాత్రౌ ప్రయత్న
తః। వ్యవాయంభోజనంచాపి ఋతావపివివర్జయేత్। శంఖేనవృద్ధమనునాచాశ్వ
లాయనమహాసినా। ప్రోక్తాన్యేతాని దృష్ట్వాత్ర సంశయస్త్యజ్యతాం బుధైః। ని
యతంబ్రహ్మచర్యంస్యాచ్ఛ్రాద్ధేనైరతిజల్పితం। ఋతుస్నాతాంతయోభార్యాం
సన్నిధానోపగచ్ఛతి। ఘోరాయాంభ్రూణహత్యాయాం యుజ్యతే నాత్రసంశ
యః ఏషదోషస్తు ద్వేషేణ యదికామీ నసంక్రమేత్। వైరాగ్యాద్వ్రతార్థేన ఋ
తుత్యాగీనదోషభాక్। శ్రీధరాచార్యాదిశిష్టానా మిష్టమేతన్మతంకృతం॥ శ్రీదంతు
లూరినారాయణగజపతిరాజవర్యరచితమిదం। సంతోనుగృహ్యామోదంతాం క
రుణావరుణాలయాస్స్వాంతే॥

ఋతుకాలాభిగామీత్యత్ర కేచిదేవ మాచక్షతే। అజాతపుత్రస్యైషని
యమః। నతుజాతపుత్రస్యేతి। ఉపపాదయంతిచకూర్మపురాణే॥ ఋతుకాలాభి
గామీస్యాద్యావత్పుత్రో నజాయతఇతి॥ ఋణాపకరణార్థంహి పుత్రోత్పాద
నం తదర్థమేవ దారోపగమః। అపత్యార్థం స్త్రియస్సృష్టాః స్త్రీక్షేత్రంబీజినో
నరాః। క్షేత్రం బీజవతేదేయం నాబీజీ క్షేత్రమర్హతీతిమనుః॥ జాయమానో
వైబ్రాహ్మణస్త్రిభిరృణవాఞ్జాయతే బ్రహ్మచర్యేణర్షిభ్యో యజ్ఞేన దేవేభ్యః
ప్రజయాపితృభ్య ఏషవా అనృణో యఃపుత్రీ యజ్వా బ్రహ్మచారీవాసీతి శ్రుతేః॥
ఋణమస్మిన్సన్నయత్యమృతత్వంచగచ్ఛతి। పితాపుత్రస్యజాతస్య ప్రపశ్యేజ్జీవ
తోముఖమితి॥ మంత్రవర్ణోపి: పితౄణామనృణశ్చైవ సతస్మాత్సర్వమర్హతి।
తస్మిన్నృణంసన్నయతి తేనచానంత్యమశ్నుతే॥ సఏవధర్మజఃపుత్రః కామజా ని
తరాన్విదురితి మనుః॥

బహుపుత్రత్వమపిశ్రూయతే॥ ఇమాంత్వమింద్రమీఢ్వస్సుపుత్రాగ్ంసుభ
గాంకృణుదశాస్యాంపుత్రానాధేహిపతిమేకాదశంకృధీతి॥ నను జ్యేష్ఠేనైవానృ
ణ్యసిద్ధేః నిరర్థకం పుత్రాంతరోత్పాదనం తన్న సర్వేషాంపుత్రాణామానృణ్య
హేతుత్వాత్। నహిపుత్రజననమాత్రేణపితురానృణ్యం। కింతర్హి సమ్యగనుశి
ష్టేన పుత్రేణ శాస్త్రీయేషు ధర్మేష్వనుష్ఠితేషు పశ్చాదానృణ్యం సంపద్యతే॥
వాజసనేయబ్రాహ్మణే పుత్రానుశాసనవిధిరామ్నాతః। తస్మాత్పుత్రమనుశి
ష్టం లోకహితమాహుస్తస్మాదేనమనుశాసతి సయద్యనేనకించిదక్ష్ణయాకృతం
భవతి తస్మాదేనగ్ంసర్వస్మాత్పుత్రోముంచతి తస్మాత్పుత్రోనామసపుత్రేణైవా
స్మిన్లోకేప్రతితిష్ఠతీతి॥ అస్యాయమర్థః॥ అస్తికించిత్సంప్రతినామకం కర్మ య
దా పితృఋణాదిలోభనంభవతి తదా పుత్రమాహూయ వేదాధ్యయనే యజ్ఞే
లౌకికవ్యాపారేచ యద్యత్కర్తవ్యతయా జ్ఞాతం తస్యతస్య సర్వస్య సంప్రదా
నంకర్తవ్యం। తస్యాంచసంపత్తౌ యస్మాదనుశిష్టఏవ పుత్రోధికారీ తస్మాదనుశి
ష్టపుత్రంహి లోకహితమాహుశ్శాస్త్రజ్ఞాః। అతఏవపుత్రానుశాసనం కుర్యుః।
పితరంసచానుశిష్టఃపుత్రః యత్కించిత్స్వపిత్రా శాస్త్రీయంకర్మ అక్ష్ణయావ్యా
పకత్వేన శాస్త్రవైపరీత్యేనచ కృతంభవతి తస్మాత్పాపాదేనం పితరం స్వదే
యం శాస్త్రీయం సమ్యగనుతిష్ఠన్ మోచయతి।తస్మాత్పున్నామ్నో నరకాత్త్రా
యతఇతి వ్యుత్పత్త్యా పుత్రోనామ నచ పితా స్వయంమృతః పుత్రశరీరేణాస్మి
న్మర్త్యలోకే యథాశాస్త్రం కర్మ కుర్వన్ననుతిష్ఠతీతి। ఏవంచసతి బహూనాం
మధ్యే యథావదనుశాసనం। ప్రజ్ఞామాంద్యాదిప్రతిబంధకబాహుళ్యాత్కస్య

చికీర్షాసంపత్త్యై। అనుశిష్టేవ్యతిరిక్తేషు యథాభావదనుష్ఠానం కస్యచిదేవ। అతో జ్యేష్ఠపుత్రనిష్ఠేవా యథాస్త్రాద్యర్శస్సవివాహ్యహేతుః అత ఏవ ఏకవ్యాపకకాలే ఋతౌ యద్యేకో పికయాంగ్రవజేదితి స్మృతిః। దశాస్యాంపుత్రాన్నాధేహీతి మంత్రిశ్చ ఏవంగతి బహుపుత్రవిధిముపోద్బలయతి యత్తుకామజానితరాన్విదురిత్యుదాహృతం। తదనుశిష్టవిషయం। జ్యేష్ఠంగుణవయఃకృతమితి స్మరణాత్। తస్మాజ్జాతపుత్రో ఋతౌ ఉపేయాదేవ॥

పాత్రాన్యంశే శిరశ్ఛన్నం యామ్యాయాం మధవాస్పృష। సత్రైవస్వపతః పుంసో విపరీతంతురోగదమితి(శ్రీవిష్ణుప్రణీతసంహితత్వాదుత్తరదిశి శిరస్థితస్స్వపనం రోగహేతుత్వాద్దృష్టఫలమేవ। దిక్సాధనయంత్రేపర్ద్ధ. వనత్రిశేగా శిరోగతబుద్ధ్యాకర్షణాదున్మత్తో భవతి। ప్రాయి దేశోన్మత్తాః స్వపంత్యుదీచీస్థిత మస్తకా ఏవ॥

దారోపగమనము.

ప్రతిరాత్రియందును భార్యలలంకరించుకోవలెను. స్నానముసల్పి చందనాది సుగంధద్రవ్యములను ధరించి ప్రీతితో మిక్కిలి క్షుధితుడును అత్యాహారముచేత పుష్టాంగముగలవాడును గాక కామవిశిష్టుడు ననురాగయుక్తుడునై పురుషుడు వ్యవాయమునొందవలయును. కొంచెమాహారముగల స్త్రీనొందిన పుత్రోత్పత్తిగాగును. చతుర్దశి నష్టమిన మావాస్యను పూర్ణిమను రవిసంక్రాంతిని పర్వములగువీటిని వర్జించి ఋతుకాలమందు స్త్రీసాంగత్యమును జేయవలయును. స్త్రీయొక్క శోణితమధికమైన స్త్రీ జనించును. పురుషుని శుక్లమధికమైన పురుషుడుపుట్టును గావున శుక్లవృద్ధికొరకు వృష్యములను స్నిగ్ధములను పురుషుడు భుజింపవలయును.

ఋతుదినములలో మొదటి నాలుగుదినములు ౧౧వ దివసము ౧౩వ దివసమును వర్జించి మిగిలిన పదిదినములును ప్రశస్తములుగావున స్త్రీనొందుటకు ప్రశస్తములనిమనువు. రజస్వలయగు స్త్రీనొందుట శిష్టగర్హితమే కాదు- నియమములేక రజస్వలాస్త్రీనొందిననరునకు దృష్టియు నాయువు తేజమును ధర్మమును నశించుననిసుశ్రుతము. మనువునిటులే సిద్ధ్యముగా జెప్పెను. దృష్ట్యాదిహానిరూపమగు దృష్టఫలమందువలన గనబడుచున్నది. ఆశ్చర్యమగుచున్నది విజ్ఞానేశ్వరులవారిచేతను ఋతుకాలమందున స్వస్త్రీరతమొనర్చిన బ్రహ్మచర్యస్ఖలన దోషము శ్రాద్ధమందున్ను లేదని మితాక్షరి యను నామసంజ్ఞగల శ్లోకవ్యాఖ్యయందున జెప్పియున్నది.

ఈనిబంధనను బట్టి పరమాన్నము పూరీలు లాడూలు మొదలగు పిత్రు శేషమును స్వేచ్ఛగా భుజించి ఋతుకాలమున రత్యుత్సవమును స్వరమణితో కామపిశాచావిష్టులగువారలాచరింపుదురు. ఈయర్థమందు బృహస్పతివచనమును జెప్పుచున్నాను. శ్రాద్ధమునర్చువాడు భోక్తలతోకూడా రెండుదినములు బ్రహ్మచారిగానుండవలెను. లేకుండిన నరకగామియగునని యాజ్ఞవల్క్య భోక్తలతోకూడా శ్రాద్ధమునర్చువాడు ఆరోజున బ్రహ్మచారియై యుండవలసినదని శ్రాద్ధదినమందు రతినిషేధమును జెప్పెను

మూలమునకనుగుణముగా వ్యాఖ్యానమునర్చవలెనుగాని విరోధముగా జేయగూడదు. మన్వాదిస్మృతికర్తలయొక్క మతముచేతనున్ను పృథ్వీచంద్రోదయకారులు, మాధవాచార్యులు శివానందకల్లాకభట్టాదులవల్లనున్ను యీ విజ్ఞానేశ్వరమతము నిందించబడినది. గాన యీవిజ్ఞానేశ్వరనిబంధన గ్రహింపదగదు. కమలాకరభట్టు శ్రాద్ధమునర్చినవాడును భోక్తలును ఆరాత్రి తనస్త్రీతోకూడా రమించకూడదనే మునివాక్యములు ఋతువ్యతిరిక్త దినములయందాచరణకుగాని ఋతుదివసములయందు ఏకాదశినైనను శ్రాద్ధదినమైనను స్వస్త్రీగమనము అవశ్యకమనెను. కాశీనాథపండితులచే ఈకమలాకరభట్టుయొక్క వ్యవస్థ సంగీకరించబడలేదు ఈవ్యవస్థనుజ్జీవింపజేయదగినవచనములు వెతకదగియున్నవి. సకలఋషిమతముచేతనున్ను వేదతుల్యమని యొప్పుకొనేడి శిష్టాచారమున్ను యీయర్థమందు లేదు.

శ్రాద్ధమందు భోక్తలనుగా నియమించబడిన బ్రాహ్మణులును కర్తయున్ను స్వదారగమనమును జేయరాదనియును, జేసిరేని పాతకియగుననియును జెప్పిన శంఖ వృద్ధ మను ఆశ్వలాయన వచనములను జూచి యీయర్థమందు పెద్దలచేత సంశయము త్యజించబడవలయును.

అయితే ఋతుస్నాతయగు భార్యను సన్నిధియిందుండి పొందకుండిన ఘోరమగుభ్రూణహత్య నిస్సంశయముగ బొందుననెడివచనము ద్వేషముచేతను కాముకుండై యుండియు స్వస్త్రీగమనమునర్చనివాని విషయముగాని వైరాగ్యముచేతనైనను వ్రతముకొరకైనను ఋతుత్యాగి దోషమునొందడని శ్రీధరాచార్యులు మొదలగు శిష్టులకిష్టమగు మతమును జేయబడెను.

శ్రీదంతులూరి నారాయణగజపతిరాజ రచితమగు నీవ్యవస్థనుగూర్చి కరుణాసముద్రులగు సత్పురుషులనుగ్రహించి సంతుష్టులగుదురుగాక.

ఋతుకాలాభిగమననియమము పుత్రోత్పత్తిపర్యంతమని కూర్మపురా

త్పత్తివలనను దానులోకాంతరగతుడైనను పుత్రరూపముచే [illegible]లోకమం దు యథాశాస్త్రానుగుకర్మ జేయుచుండుననియును జెప్పబడియున్నది.

ఇట్లుగావున బహుసంతతిపుత్రులలో బుద్ధిమాంద్యాది ప్రతిబంధకమగు శాస్త్రీయ్యయనాదిశిక్షనొందిన యొకడు సత్కర్మానుష్ఠాతయగుచుండును. ఆ పుత్రుడు జ్యేష్ఠుడైన కనిష్ఠుడైన నట్టివానిచేతనే తండ్రి యానృణ్యము నొందును. బహుసంతతికుమారులను గనిన నందొకడు గయావ్రజనమైనను జేయునని ధర్మశాస్త్రము. దీనికి పదిమందికుమారులను గలుగజేయుమను వివాహకాలమందలి శ్రుతికిని తాత్పర్యమిదిగావున దీనిని శ్రుతి బలపరుచుచున్నది. జ్యేష్ఠపుత్రుడు కంటెనితరులు కామజులనువచన తాత్పర్యము శిక్షితులుగాకుండిన యవిద్వాంసులవిషయము. జ్యేష్ఠత్వగుణముచేతను వయస్సుచేతనుగూడ నాలోచింపవలయునను స్మృతివచనమువలన కేవలము జన్మజ్యేష్ఠుడు జ్యేష్ఠుడుగాడు. గుణజ్యేష్ఠుడే జ్యేష్ఠుడు. గానబుత్రోత్పత్తియైనబిమ్మటనుగూడ దానానుగమమావశ్యకము.

ప్రాగ్దిశగా, లేక దక్షిణదిశగా శిరస్సునుంచి పరుండుట ప్రశస్తము. ఎల్లప్పుడు నితరములగు నుత్తరపశ్చిమదిశలను బరుండిన రోగమిచ్చునని శ్రీవిష్ణుపురాణవచనము. ఎల్లప్పుడనుటచే ప్రయాణేపశ్చిమంశిరః అనేవచనానుజ్ఞచే ప్రయాణములో పశ్చిమదిక్కున శిరస్సునుంచి పరుండవచ్చును. ఉత్తరదిక్కుగా శిరస్సునెప్పుడుంచి నిద్రించరాదు రోగహేతువగుటచే దృష్టఫలమియ్యవే. దిక్సాధనయంత్రమువలె ధ్రువనక్షత్రాకర్షణ శిరస్సునందుండు బుద్ధికిని గలుగుచున్నందున వెఱ్ఱివాడగుచున్నాడు. తరుచుగా వెఱ్ఱివాళ్లు శిరస్సునుత్తరముగానుంచి నిద్రించుచున్నారు.

నన్వఖండనిరతిశయానందావాప్తిలక్షణత్వేనాభ్యర్హితత్వాన్మోక్షపురుషార్థ ఏవ ముఖ్య ఇతి సకలమతసిద్ధాంతః కిం చార్వాకగణ ఉపక్రాంతే ఇత్యత్రోచ్యతేఽస్మాభిః। ప్రసూతిభాజో విశ్వస్య స్త్రీపురుషాభ్యామేవ నిష్పన్నత్వాత్కామస్య పితృఋణవిమోచన హేతుభూతతయా సమ్మతం మహాపురుషపరిగ్రహాత్పురుషార్థ ఇతి నందికేశ్వర శ్వేతకేతు పాంచాల వాత్స్యాయనాది పూర్వసిద్ధాంతః॥

ఏవం సతి పూర్వాలాభే పరః పర ఇతి న్యాయాత్ ముఖ్యకల్పాలాభేనుకల్పవ్యాః విహితత్వాన్మోక్షపురుషార్థసాధనప్రవృత్త్యలాభే కామపురుషార్థసాధనేషు వా అవశ్యం ప్రవృత్తిః కర్తవ్యేత్యనుసంధాయైవ స్వ[illegible]పగమనముపన్యస్తం। కించ పశుపక్ష్యాదిజంతూనామపి గా[illegible]ర్థాః। మను

ష్యగ్రహాదేశు చిరిత్యనుస్మరణాత్తద్వాహాహి రరమణీరతాలనుమతమేవ। రస్య తేఆస్వాద్యతఇతివ్యుత్పత్త్యారసఇత్యుచ్యతే॥ తదుక్తం॥ రసతే స్వాదనార్థత్వా ద్రస్యంతఇతి తేరసాః। వ్యంజనావధిసంయోగోయధాస్న్వంస్వాదుతాంనయేత్। ఏవంనయంతిరసతామితరేస్థాయిసంశ్రితాః। ద్రాక్షాపాకస్సకధితో బహిరంతస్ఫురద్రసఇతి॥

నను॥ నిదాఘశరదోర్బాలాపథ్యావిషయిణో భవేత్। హేమంతే తరుణీయోగ్యా ప్రౌఢావర్షావసంతయోః। సతతం సేవ్యమానాపి బాలాప్రదయతేబలం॥ బాలాస్యాత్షోడశాబ్దాతదుపరితరుణీవింశతేర్వావదూర్ధ్వం ప్రౌఢాస్యాత్పంచపంచాశదవధిపరతోవృద్ధతామేతినారీత్యుక్తత్వాత్ప్రౌఢాయాం వర్షావసంతసమయా సుమశరసమరయోగ్యావితిశాస్త్రోక్తమనాదృత్యైవ లంబయానోర్ధంపత్యోర్బాహ్యాభ్యంతరసంభోగసంభ్రమఏవ సముదాహృత ఇత్యాశంకాయాముచ్యతే॥ ఆలింగనంలంబపయోధరాణాంస్త్రీణాంచదుఃఖం త్రయమేవభూమా॥ కవిమార్గేఘాష్యాహ॥ అయమతిజవరాః ప్రకామగుర్వీ రలఘువిలంబిపయోధరోపరుద్ధాః। సతతమసుమతామగమ్యరూపాః పరిణతదిక్కరికాస్తటీర్బిభర్తీతి॥

అత్ర స్త్రీణాంపురుషాణాంచ యావ్వనకృతసురతమేవ రమణీయమితి తాత్పర్యం॥ లంబకుచాలింగనతో లికుచకుచాపాదతాడనం శ్రేయః। స్త్రీణాం తావత్స్తనపతనావధికమేవరతంవరమితి-లంబస్తననితంబినీసంభోగస్త్వబలారమణీపాదతాడనాదపవేచనామేణ సుఖాహఇత్యభిప్రాయః॥

చుంబనాలింగనాదిబాహ్యాభ్యంతర సురతగుణాశ్చ బాలాద్యవస్థా స్త్రీసంభోగజగుణదోషాశ్చ చరకేభిహితాః। తదభిమత మభిజ్ఞానా మిత్యతాభిధాస్యామః॥

నారీదోషహారంసుదీపనకరంభూపైస్సదాసేవ్యతే॥ అధరామృతేన పైత్యంనశ్యతివాతఃపయోధరాలింగైః। అధసురతేనకఫం త్రిదోషహారం వపుస్త్రీణాం॥ కించిదుష్ణమనోహర్షణదీపనందేహలాఘవం।నాడీనాంనిర్మలత్వంచబాలస్త్రీభోగలక్షణం॥ పంచేంద్రియప్రీతికరంచసౌఖ్యందోషత్రయఘ్నం బలపుష్టిదంచ। కేకాగతిర్నాడిషయావనస్త్రీసంభోగచిహ్నాంసముదాహారంతి॥ జ్ఞానంచ దీపనత్వంచమన్మథోద్రేకితాలఘు। రాజహంసగతిర్నాడీ ప్రౌఢస్త్రీభోగలక్షణం॥ మాంద్యంజడత్వంమందాగ్నిరరుచిస్సారుతోద్భవః। మహిషస్య గతిర్నాడీ వృద్ధస్త్రీభోగలక్షణమితి॥ ఉత॥ యస్యాం మనశ్శ[illegible]బంధస్తస్యామృద్ధి

రిత్యాపస్తంబోక్తేశ్చ॥ ద్రవీభూతం పనోయత్ర తదర్శనే శ్రీమదాయిణీతి లతాసా ద్యానోస్త్రీపురుషయోరనోన్యం ప్రీయాస్పదం భవిష్యతీతి తస్మాద్యావ్వనకృత సురతమేవోక్తం ఉదితయద్యావనా ముగ్ధా లజ్జావిజితమన్మథా। లజ్జామన్మథమధ్య స్థామధ్యమోదితయావనా। స్మరమందీకృతవ్రీడా ప్రౌఢా సంపూర్ణయావనేతి వాత్స్యాయనీయే॥ ముగ్ధామధ్యాప్రగల్భా చ త్రివిధాభిస్త్రియోమతాః॥ ఏకాం తే ప్రియసంగృహీతవదనా కామంతనుం కంపతే మూకీభావముపాగతా నవవతి ప్రాయోరుషారోహిణీ। సంభోగాయనయాతితల్పమధవా సంప్రాప్తతల్పాప రా వస్త్రం నక్షిపతి స్థితా సువదనా యా సైవ ముగ్ధా భవేత్॥ లజ్జానమ్రముఖీప్రి యేణవిదితా కించిద్వదత్యాదరాద్గాఢాలింగితవత్యపి ప్రియతమే నాత్యంతహ ర్షోన్నతా। సంభోగాయమనో నియచ్ఛతి నఖస్థానేకృతే తాడితే జాతస్మేరము ఖీప్రియప్రణయినే మధ్యాస్మృతా సావధూః॥ బహుప్రియా తీవ్రరతోత్సవప్రి యాస్వనాయకంశాసతి తోషయత్యహో। గతత్రపా గానరతా స్వచేష్టితైర్వశం నయత్యాశుజనాన్విలోకయన్॥ ప్రగల్భాస్యాద్గతవ్రీడా ఇతి వాత్స్యాయనీయేభి హితత్వాత్ప్రౌఢాయాః వ్రీడారాహిత్యముక్తం। తస్యాః నిర్లజ్జాయాః విలాసో పి వికారాయతే వివేకదృశాం। బాలాతరుణాతు సవ్రీడాలోకనేనైవ స్వాభిమతమ భినయంత్యా సత్యా వితి సంచారీభావః। కుచకుంభదోర్మూలాచ్ఛాదనవదనవిని మన దరనిమీలిత నయనత్వానుభావక మనస్సంకోచనరూపా వ్రీడా॥ చేతస్సం కోచనం వ్రీడానంగరాగస్తనాదిభిరితి లక్షణాత్॥ అభిరూప మకార్పణ్య మంగా నాంచాతిమార్దవం। ఏవమాదిగుణావస్థా ప్రథమేయావనే భవేత్॥

ఏతాదృశీం యావ్వనావిర్భావవిభావభావభవావిర్భావసభ్రూవిభ్రమక టాక్షసస్మిత స్నేహావలోకనవిలాసశృంగారరససర్వస్వస్వర్ణపుత్తళికాముత్తమ నాయికామత్యుత్కటకామశాస్త్రజ్ఞః ప్రాజ్ఞః ప్రాజ్యయావ్వనో నాయకోత్యం తసుకుమారార్థసందర్భాం కైశికీమివ రసజ్ఞోవలంబయేదితి బ్రూమః॥ తదు క్తం రతిరహస్యే॥ దత్వాయథేష్టం ఘనభూషణాని విచిత్రవస్త్రాణి మృదూక్తిజా తైః। తాం సాంత్వయన్మన్మథశాస్త్రవేదీ ముగ్ధాం రమేతాధిక ధైర్యయుక్తః॥ మ ధ్యాప్రగల్భే స్త్రియౌ వశీకర్తుం విశదీకృతవాన్రతిసర్వస్వే॥ విచిత్రసురతైః పూ ర్వాంకశాభిర్మన్మథోద్భవైః। వశం నయేత సుకృతీ మధ్యాం కాంతాం మనోహ రాం॥ హాసైర్వచోభిర్ఘనముష్టిఘాతైర్నఖక్షతైర్గంతనిపీడనైశ్చ। విశ్వాసవాచా మణితైః ప్రసిద్ధైర్వశం నయేత ప్రమదాం ప్రగల్భామితి॥

ఓయీ యెడతగా దానికదియె సమమగు నానందస్వరూపము గాగల

యుత్తమమగు మోక్షపురుషార్థము ముఖ్యమని సకలమతసిద్ధాంతము. ఇట్లుండ దారోపగమమేమనియుపక్రమించిరనిన జెప్పుచున్నారము. సంతానోపయోగమగుకామముప్రపంచాభివృద్ధికైయగును. అట్టిప్రపంచము స్త్రీపురుషులచేనిష్పన్నమగుచున్నది. మరియునట్టికామముపితృఋణవిమోచనహేతువగుటచేసంతతమునుమహాపురుషులచేనాచరించబడుచున్న పురుషార్థమని నందికేశ్వర శ్వేతకేతు పాంచాల వాత్స్యాయనాదిపూర్వులసిద్ధాంతము.

ఇట్లగుచుండపూర్వములభించకున్న పైపైటగ్రహించతగినదను న్యాయమువలనముఖ్యకల్పాలాభమునందనుకల్పము విహితమగుటవలన మోక్షపురుషార్థసాధనప్రవృత్తిలేకున్న కామపురుషార్థసాధనమందైన ప్రవృత్తి యవశ్యకర్తవ్యమని స్వదారోపగమమున్యసించబడెను.

మరియును పశుపక్ష్యాదిజంతువులకును మైథునము సాధారణము. మనుష్యులైతే కామకళాజ్ఞానముచే నానందాతిశయమొందుదురు. అందువలన నన్యోన్యానురాగముచే స్త్రీలు పతివ్రతలును పతులేకపత్నీవ్రతులునగుదురు. అట్టినైపుణ్యములేకుండిన స్త్రీపురుషులవల యధేచ్ఛవ్యాపారముగలవారౌదురు. ఇది రసప్రదీపమందుచెప్పబడినది. కామశాస్త్రప్రవీణుడైన భర్తయందే స్త్రీలనురక్తలగుదురు దానపతివ్రతలగుదురు. భర్తవలననే భోగపరితుష్టయగుచుండును. ఈకారణముచేనీశాస్త్రమవశ్యము జ్ఞేయము ఈశాస్త్రమనుసరించిన న్యానందమొందుటకవకాశముండును నాలబంధాదిసాధ్యవిజ్ఞానముచే వాడు మనోవేగమునరికట్టును. అందువలన స్వాధీనచిత్తుడై క్రమముగజితేంద్రియుడగును. కావుననీహేతువుచేతనీశాస్త్రము తెలియవలసినదని మనంబునందెంచిగ్రంథంబుగాపురుషార్థచతుష్టయాధికారి యగుచున్నాము.

చెప్పబడినయానందమును విశేషించుచున్నాము. రసమే బ్రహ్మస్వరూపము. రసానుభవముగలవాడే యానందియగుచున్నాడనిశ్రుతి. రసమనగా ననిత్యమని నిత్యమనియును ద్వివిధము. అందుమొదటిది, ద్రాక్షేక్షు రసాలాది రసగ్రహణముచే నానందించు రసనేంద్రియమువలె సకలేంద్రియములకును నానందముగలిగించు తత్తద్విషయానందాబ్ధిలహరీమగ్నులకు నఖండనిరతిశయానందావాప్తికిహేతువు. యౌవ్వనవంతులగు దంపతులకు దర్శనాలింగనచుంబనమధురవచనాకర్ణన ముఖగంధాస్వాదనాది రూప బాహ్యాభ్యంతర సంభోగ శృంగారాఖ్యమగురసము.

ప్రియురాలిచే కౌంగలించబడినప్రియుడితరమగు బాహ్యము నించుకైన

తెలియదు. అట్టి యవకాశమె బ్రహ్మస్వరూపమని శ్రుతి. ప్రియురాలియత్యంత గాఢాలింగనసందితర మేమియు దెలియకుండుటచే బ్రహ్మానందముగల బ్రహ్మజ్ఞాని సుఖమువంటిసుఖమనిప్రశంసించుట మెగాదు. పరతత్వజ్ఞానముచేనగు మహానంద ముతోసమమని స్త్రీసంభోగసౌఖ్యమును సూక్ష్మమగు మన్మథకళావైచిత్ర్య మందు మూఢుడగు జనుడెవడో తెలుసుకొనును గాని ప్రౌఢాంగనాగాఢా లింగనచుంబనాదిజనితామితసుఖమితరజ్ఞానమేమియు లేకుండ జేయుచు నుండ నాసుఖమిట్టిదట్టిదని జెప్పుటకు శక్యమగునా?

బాహ్యమని యాభ్యంతరమని సురతము రెండువిధములు. అందు మొద టిది చుంబనాశ్లేషనఖదంతక్షతాదికము. రెండవది అనేకబంధాది సాధనముల చేనగు సాక్షాత్సురతము. అనుకూలురగు విలాసవంతులైన దంపతులన్యోన్యద ర్శనస్పర్శనాదులచే దేనియందు సంతుష్టులగుదు రది సంభోగశృంగారము. ర మ్యవస్తువులందగు ప్రేమ దిదృక్ష. దానియందగు చింత యభిలాష. తత్సంగమ మగుబుద్ధి రాగము. తదధీనమగుక్రియ స్నేహము. దానివియోగము నుసహించ కుండుట ప్రేమ. ఆవస్తువుతో గూడ బ్రవర్తించుట రతి. అన్యోన్యసమక్రీడ శృం గారము. సంభోగశృంగారమిటులేడు భేదములని వాత్స్యాయనులు.

ఓ,యీ సజాతీయవివాహితవనితాధరపల్లవరసాస్వాదనమైన నుచ్ఛిష్ట మగుటవలన శిష్టులచేననుభవింపదగదు. వాత్స్యాయనాదిఋషులచే నిట్టిదెట్లు చెప్పబడినదనిన సమాధానమును జెప్పుచున్నాము.

స్త్రీముఖము నిత్యశుచిత్వముకలది. ఫలపాతనమందు పక్షిముఖము ను, పాలుపిదుకునప్పుడు గోవత్సముఖమును, వేటలో మృగగ్రహణమందు శునక ముఖమును శుచితమములని మనువచనమువలనపరిణీతసజాతీయరసజ్ఞీరసప్రియం దనుమతి జేయబడెను.

ఆస్వాదించబడును గాన రసమనబడును. రసధాతువు కాస్వాదనమర్థ ము గాన యాస్వాదించబడునవిరసములివి యిష్టవస్తువుయందిచ్ఛ పూర్ణము గా కుండినదిరతియనుస్థాయీభావసంశ్రితములై అన్నముకూరలుమొదలగువ్యంజన ములతోకూడిననైస్వాదుత్వమునేలాగుబొందించబడునట్లురసములుసార్థకముల గును.బాహ్యాంతరములందుస్ఫురించుచుండురసముద్రాక్షాపాకమనిజెప్పబడెను.

ఓయీ గ్రీష్మశరదృతువులందు బాలయును, హేమంతర్తువందు తరుణి యును, వర్షావసంతర్తువులందు ప్రౌఢయును, భోగుల కుపభోగయోగ్యయ నియును, సర్వకాలమందును బాల బలమును జేయుననియును జెప్పబడియున్న

ది. బాలయనగా పదియాఱవవత్సరములపర్యంతము, ఆపైని యిరువైసంవత్సర ములమట్టుకు తరుణి, ఆమీద యేఁబదేనవవత్సరముమట్టుకును ప్రౌఢ, ఆపిమ్మట వృద్ధయనబడును. ఇట్లుజెప్పబడుటవలన వర్షావసంతసమయములయందు ప్రౌఢాంగనలగతి పథ్యమనుశాస్త్రము నాదరించక కేవలము యౌవ్వనవంతులగు దంపతులకుమాత్రము బాహ్యాభ్యంతరసంభోగశృంగారరససంభ్రమము జెప్ప బడెనేమియనిన సమాధానము జెప్పుచున్నారము.

లంబపయోధరపల్లవాధరాలింగనము దుఃఖకరమనియును, మాఘకావ్యమందును లంబపయోధరులగు జరఠాంగనలు దిగ్దంతులచే పొడవబడినయొల్ల వలెను ప్రాణులకగమ్యరూపలనిజెప్పబడియున్నదిగావున స్త్రీపురుషులకు యౌవ్వనమందగు సురతము రమణీయమని తాత్పర్యము. లంబకుచాలింగనముకంటె లికుచకుచా పాదతాడనమైనను శ్రేయస్కరమనియును జెప్పబడియున్నది. స్త్రీలకుస్తనపతనముమట్టుకే రతము వరమని లంబస్తననితంబినీపరిరంభము బాలాహేలాపాదతాడనముకంటె దుఃఖకరముగాని సుఖకరముగాదని తాత్పర్యము.

చుంబనాలింగనాదిబాహ్యాభ్యంతర సురత గుణదోషములను బాలాద్యవస్థా స్త్రీసంభోగసంభూత గుణదోషములను చరకగ్రంథానుసారముగా వ్రాయుచున్నారము.

స్త్రీ, దోషహరము- దీపనకరము- అనిరాజులచే నెల్లప్పుడును సేవించబడుచుండును. అధరామృతము పైత్యహరము. ఆలింగనము వాతహరము. సురతము కఫహరము గావున స్త్రీశరీరము త్రిదోషహరము. బాలస్త్రీసంభోగము ఇంచుకవెట్టను, మనోహర్షమును, దీపనమును, లఘుత్వమును, నాడీనైర్మల్యమును జేయును. యౌవ్వనస్త్రీసంభోగము బలమును, పుష్టిని, పంచేంద్రియములకును బ్రీతిని, సౌఖ్యమును, దోషత్రయనాశమును నెమలివంటి నాడీప్రచారమును జేయును. ప్రౌఢస్త్రీసంభోగము జ్ఞానమును, దీపనమును, మన్మథోద్రేకత్వమును, లఘుత్వమును, రాజహంసవంటి నాడీప్రచారమును జేయును. వృద్ధస్త్రీసంభోగము మాంద్యమును, జడత్వమును, మందాగ్నిని, అరుచిని, వాతరోగమును, మహిషగతివంటినాడీప్రచారమును జేయును.

మరియు నేస్త్రీనిజూచిన మనస్సు నేత్రము కట్టబడు నాస్త్రీయందు సుఖసమృద్ధియనియాపస్తంబులు. ఏస్త్రీనిజూచిన ప్రేమపుట్టి మనస్సు ద్రవీభూతమగు నాస్త్రీసంభోగయోగ్యయని జెప్పుటవలన యౌవ్వనవంతులగు స్త్రీపురుషుల కన్యోన్యప్రేమబుట్టును గాననట్లు జెప్పబడెను.

ఉదయించుచున్నయౌవ్వనముగలదై లజ్జచేజయించబడిన మన్మథావస్థ గలదిముగ్ధ. పూర్ణయౌవ్వనముగలదై లజ్జామన్మథమధ్యస్థ మధ్యను. మన్మథునిచేమందమై జేయబడిన లజ్జగలదై మిగులయౌవ్వనముగలది ప్రౌఢ.

ముగ్ధాదిలక్షణములను జెప్పుచున్నారము. ఏకాంతమందు ప్రియునిచేగ్రహించబడినముఖముకలదై కంపించును. మూగివలెమాటలాడకుండును. తరుచుగకోపముకలదైయుండును. సంభోగముకొరకు తల్పమును జేరకుండును. ప్రియుడొకవేళజేర్చినవస్త్రమువదలకుండును. ఇట్టిగుణములుగలది ముగ్ధ. లజ్జచే నమ్రముఖియై ప్రియుడడిగినమాటకించుకయుత్తరమును జెప్పుచు ప్రియునిచే గాఢాలింగితురాలై మిక్కిలి సహించును. సంభోగముకొరకుమనసిచ్చును. నఖక్షతాదులుజేయబడినసుందరహాసముఖారవిందయగునిట్టిగుణములుకలది మధ్య. అధికమైనప్రీతిగలిగి తీవ్రరతోత్సవప్రియురాలై తననాయకుని రోషముబుట్టించి శాసించును. లజ్జవిడుచును. గాఢాసక్తయగును. తనచేష్టలచేప్రియుని వశుని జేయును. ఇట్టిగుణముకలదిప్రౌఢ. అతిలజ్జారహితయైయుండునని వాత్స్యాయన తంత్రమందు జెప్పబడెను. లజ్జారహితయగుదానివిలాసమున్ను వివేకులకు వికారమగుచున్నది. బాలాతరుణులైతే లజ్జాయుక్తమగు దృష్టిమాత్రముచేతను యూనుకూల్యప్రకాశమును జేతురని కామతంత్రమందు జెప్పబడెను. లజ్జాదృష్టిచేతను తమ అభిప్రాయమును గూఢముగా నభినయించుట సంచారీభావము.

కుచకుంభములుదోర్మూలములనాచ్ఛాదించుట, మొగమునువంచుకొనుటయు, నించుకనిమీలితములగుచంచలనయనములుగలుగుట- ఇవిమొదలగువనుభావములచే గనబడు మనస్సంకోచనము వ్రీడ యనబడును. స్తనాదిగోపనముచేననంగరాగచేతస్సంకోచనము వ్రీడయగునని లక్షణగ్రంథము.

సౌందర్యము దైన్యము అవయవములయందతిమార్దవము ఇవి మొదలగు గుణావస్థలు ప్రథమయౌవ్వనమందగును. ఇట్టినూతనయౌవ్వనముచేసగులావణ్యముతోబొడమిన మన్మథావిర్భావముచేనగు భ్రూవిక్షేపకటాక్ష మందస్మితయుక్తములగు స్నేహావలోకనవిలాసములుగల శృంగారరససర్వస్వమగుబంగరుబొమ్మ తెరంగున రంగగు నుత్తమనాయికను ఉత్కృష్ట కామశాస్త్రజ్ఞానముచే ప్రాజ్ఞుడై పూర్ణయౌవ్వనముగల నాయకుడు సుకుమారార్థసందర్భముగల కైశికీవృత్తినవలంబించిన రసజ్ఞునివలె శృంగారరసనిర్మగ్నుడై తదానందమనుభవింపవలయునని జెప్పుచున్నాము.

యథేష్టముగా భూషణములును విచిత్రవస్త్రములు నొసంగి మృదువచనరచనలచే సచ్చికజేయుచు ననంగశాస్త్రకుశలుడగు ధీరుడు ముగ్ధాంగనాసంగసుఖమును ననుభవింపవలయునని రతిరహస్యమందున జెప్పబడెను. మధ్యాప్రగల్భాస్త్రీలనువశముగా జేయుటకు రతిసర్వస్వమందు విశదపరచెదను. విచిత్రములగు సురతములచే మందుగనున్మథకళాభిజ్ఞుడై సుఖమునుబుట్టించుచు మధ్యనాయికను వశముగాజేయవలెను. హాసోక్తులచేతను ముష్టిఘాత దంతక్షత నఖక్షతాది పీడనముచేతను విశ్వాసవాక్యములవల్లను రతికూజితములచేతనుప్రౌఢను వశముగా జేయవలెను.

అథ తస్యాఃకటాక్షస్నేహస్మితవిలాస శృంగారలక్షణాని లక్షయిష్యామః॥ యద్దర్శనేవిరక్తోపి తుభ్యతేతత్సానన్మథః। కుతూహలం రమ్యదృష్టౌచాపలం పరికీర్తితం। శిరశ్శ్రియతె తాపోమేనతన్మధురం స్మృతం। యద్గతాగతవిశ్రాంతవైచిత్ర్యేణవివర్తనం। తారకాయాఃకళాభిజ్ఞాస్తంకటాక్షం ప్రచక్షతే॥ స్యాద్భ్రూవాగ్లలితా క్షేపకేస్యాపక రేచితం। ద్వయోర్మూలసమక్షేప కౌటిల్యాద్భ్రుకుటింవిదుః॥ ఆకస్మికంతుహసితంయౌవనాదివికారజం॥ బాల్యయౌవనసంధావుత్పన్నశృంగారవిషయః ప్రథమాంతఃకరణభావః॥ ఈషద్దృష్టవికారిస్యాద్భావోహావః ప్రకీర్తితః ఇత్యుక్తత్వాత్। విస్రంభోపగమాంకాష్ఠామారూఢేదర్శనాదిభిః। మనోంతరంగంద్రవతిసస్నేహఇతికధ్యతే॥ లీలాప్రియానుకరణంవాగ్భిరగత్యాభిచేష్టయా॥ స్తంభరోమాంచస్వేదాదిసాత్వికభావైః హర్షోత్సుక్యావహిత్థాదిసంచారీభావైస్సహైవ శృంగారచేష్టావిశేషైరితిద్రష్టవ్యం॥ తదుక్తం॥ భావోహావశ్చహేలాచమాధుర్యంధైర్యమిత్యపి॥ లీలావిలాస విచ్ఛిత్తిర్విభ్రమః కిలికించితః। మోట్టాయితంకుట్టమితంబిబ్బోకోలలితంతథా।కుతూహలంచచకితంవిహృతం హాసఇత్యపి। ఏవం శృంగారచేష్టాస్స్యు రష్టాదశవిధామతాఇతి॥ కుట్టమితిలక్షణముక్తం॥ కేశాధరాదిగ్రహణే మోదమానాపి మానసే। దుఃఖితేవబహిఃకుప్యేదితకుట్టమితంహితదతి॥ రాగస్త్వలబ్ధవిషయేవేదనామహతీతయా। సంశోషణీతుగాత్రాణాం తాముత్కంఠాం విదుర్బుధాః॥ చత్వారోపిరహీణాంవినోదాః। నేపథ్యాఅపితావంతఏవ॥ తదుక్తం॥ వియోగేచాయోగేప్రియజనసదృక్షానుభవనం తతశ్చిత్రంకర్మస్వపనసమయేదర్శనమపి। తదంగస్పృష్టానాముపగతవతాంస్పర్శనమపి ప్రతీకారః కామవ్యథితమనసాంకోపికథితః॥ కచధార్యం దేహధార్యం పరిధేయంవిలేపనం। చతుర్థాభూషణంప్రాహుస్త్రీణామన్యత్తుదైశికమితిరసాకరే॥

ఇటుపైనట్టియువతులకటాక్షస్నేహస్మితవిలాసశృంగార లక్షణములను తెల్పుచున్నారము.

ఎవరిదర్శనముచే విరక్తులైననురక్తులగుదురో నట్టిది మన్మథావిర్భావము. రమ్యమగుదృష్టియందలిచాపల్యముకుతూహలమనబడును. దేనిచే మన్మథతాపముశీతలమగునదిమధురమనబడును. గతాగతవిశ్రాంతివైచిత్ర్యముచే నేత్రతారకావివర్తనము కటాక్షమనబడును. కనుబొమలలోనొకదాని యాక్షేపము రేచకము. రెండింటియొక్కమూలమును క్షేపయుక్తమగుకౌటిల్యము భృకుటియనబడును. యౌవనాదివికారములవలనబుట్టినయాకస్మికమగునగవు హసితమనబడును. బాల్యయౌవనసంధియందుత్పన్నమగుశృంగారవిషయాంతఃకరణవికారము భావమనబడును. ఇంచుకప్రకటనమగుకామవికారముగల భావము హావమనబడును. విశ్వాసమందు పరాకాష్ఠనొంది దర్శనాదులచే నంతరంగము దేనివలనద్రవించునది స్నేహము. వాక్కులచే,నడువడిచే, చేష్టలచే క్రియానుసరణము లీలయనబడును. స్తంభనమనగా నిశ్చేష్టత, రోమాంచము, స్వేదము మొదలగునవి సాత్త్వికభావములు. హర్షమౌత్సుక్యము మొదలగునవి సంచారిభావములిట్లుశృంగారచేష్టావిశేషములని తెలియదగును. వాటిని జెప్పుచున్నారము.

హావము, హేల, మాధుర్యము, ధైర్యము, లీల, విలాసము, విచ్ఛిత్తి, విభ్రమము, కిలికించితము, మోట్టాయితము, కుట్టమితము, బిబ్బోకము, లలితము, కుతూహలము, చకితము, విహృతము, హాసము ఇవిపదునెనిమిది శృంగారచేష్టలు. కేశాధరాదిగ్రహణముచే నంతరంగమందు మోదించుచు పైకి దుఃఖముగలిగినట్లభినయించునది కుట్టమితమనబడును. పొందబడినదానియందలి యభిలాషచే గాత్రసంశోషణియగు మహావేదన యుత్కంఠయనబడును. విరహులకుకాలయాపనోపాయములు నాలుగు. కొన్నిదినములు కలిసియుండి దేశాంతరగమనాదికముచే స్త్రీపురుషులు విడిగా నుండుట వియోగము. వినికిడివలన స్త్రీపురుషులన్యోన్యము ననురాగమొంది కలయగోరుటయె అయోగము. ఈ రెండింటియందును ప్రియజనసదృశవస్తువునుజూచుట, వారి చిత్తరువును వ్రాసి జూచుట, స్వప్నదర్శనము, వారిచేస్పృశించబడినవస్తువును స్పృశించుటయును. ఈనాలుగును కాలవ్యథితమనస్కులకు కాలక్షేపసాధనములు. కొప్పుయందు ధరించునది, దేహమందు ధరించునది, పరిధానముసేయునది, శరీరమందు బూయునది, స్త్రీలకలంకారమిట్లు నాలుగువిధములు. తదితరము దైశికమని రతిరసాకరము.

అథానంగావస్థాః బ్రూమః॥ నయనప్రీతిః ప్రథమా చిత్తాసంగస్తతోథ సంకల్పః। నిద్రాచ్ఛేదస్తనుతా విషయనివృత్తిస్త్రపానాశః। ఉన్మాదో మూర్ఛా మృతిరిత్యేవంస్మరదశా దశైవస్యురితి రతిప్రదీపే॥ ఏకాదశ భావస్థా ఇతి రతిరహస్యే॥ తదుక్తం॥ శ్రవణం చక్షుఃప్రీతి ర్మనస్సంగోథ సంకల్పః। నిద్రాచ్ఛేదస్తనుతా విషయనివృత్తిస్త్రపానాశః। మోహో మూర్ఛా మృతిరిత్యేకాదశధా స్మృతావస్థాః। స్త్రీణామపి పురుషాణామేతాస్సందర్శనేన సంజాతాః॥

శ్రవణంయథా॥ స్మరస్వరూపవానేషస్సంభోగకుశలశ్శుచిః। ఇత్యేకాంతే ప్రియతమా సఖ్యా సంబోధితా యథా॥ గాత్రేమేస్మిన్మదనాధికోజ్జ్వలతనుర్యావ్గ్మీవలయ్యాషణోదారో మన్మథశాస్త్రతంత్రవిభవజ్ఞానేరతః కః పుమాన్। ఇత్యేవంస్వసఖీజనేన పఠిత స్సంబోధితా కామినీ తం పశ్యామికదేతి సత్వరవతీ మార్గేసదావర్తతే॥ అథ చక్షుఃప్రీతిః॥ పూర్వం మయాహిగదితస్సోయమిత్యాప్తకాంతయా। యా స్త్రీ సందర్శితా తస్యాశ్చక్షుఃప్రీతి ర్భవేత్తదా॥ సందర్శితాచాప్తసఖీజనేన యం యాతి యావన్నిజదృష్టిమార్గం। తావద్వ్యధూస్తం శ్రుతపూర్వరూపమపక్ష్మపాతం సహి దదర్శసాక్షాత్॥ అథమనస్సంగః॥ మనస్యాదాయ తం కాంతా విసృజాన్యప్రయోజనం। ఆత్మాగామాభవేద్యత్ర చిత్తసంగోయమీరితః॥ అథసంకల్పః॥ సగ్వోపాన్మైస్తమేవాహంయాస్యామీతిస్పృహాయుతా। సత్వరం వర్తతేచిత్తే సంకల్పస్సంభవేత్తథా॥ అథజాగరః॥ ఏవం తదీయార్పితమానసాయా మనోజబాణవ్యథితాంగయష్టిః। దివానిశంతత్రవిచారయంతీ నయాతినిద్రాం నలినాయతాక్షీ॥ అథకార్శ్యం॥ కృష్ణచంద్రఇవసంతతనిద్రాచ్ఛేదతః ప్రతిదినం నిజదేహం। దర్శనీయమతిసౌష్ఠవయుక్తం యాతి కార్శ్యమబలా కమలాక్షీ॥ అథారతిః॥ స్రక్చందనేషు మణిమౌక్తికభూషణేషు భోజ్యేషు వస్తుషుచ నిస్పృహతాంప్రవిష్టా। హానాథ హారమణ ఇత్యభితోలపంతీ సామాననేతువిషయద్విషతామవాప॥ అథహ్రీత్యాగః॥ పశ్యత్సుబంధుషు సమస్తజనేషుమార్గేచాహూయ వాంఛతి కథాః కథితుంతమేషా। పశ్చాత్తదీయగృహమంటపమధ్యమాప్తమిచ్ఛావతీపరిహృతత్రపతామవాప॥ అథ మోహః॥ మజ్జీవితేశ్వరమనుప్రియనాథకింత్వమాదాయ మాం నరమసే నిజమందిరాంతే। ఇత్థంసఖీపురతఏవ సదాలపంతీ మోహంగతా మదనపంచశరానువిద్ధా॥ అథమూర్ఛా॥ తదాలపంతీ నిజనాయకస్యగుణాననేకాన్పరితాపయుక్తా। సఖీపురస్సంతతబాష్పవర్షా పునఃపునర్మోహమవాప మూర్ఛా॥ అథచరమః॥ అత్యంతమోహాయుక్తాపి తదభావాత్తనుంత్యజేత్। ఏవంభవతిపుంనార్యో రవస్థా మోహసంభవాః॥

ఈపైని మన్మధావస్థలను జెప్పుచున్నారము. చక్షుః ప్రీతి, మనస్సంగమము, సంకల్పము, జాగరము, కృశించుట, విషయనివృత్తి, లజ్జాత్యాగము, ఉన్మాదము, మూర్ఛ, మృతి, ఈ మొదలగునవి మన్మధావస్థలని రతిప్రదీపము- రతిరహస్యమందు శ్రవణమొకటికలిపి పదకొండవస్థలని జెప్పబడెను.

వాటి లక్షణములను జెప్పుచున్నారము.— సౌందర్యౌదార్యాది గుణయుక్తుడని సఖిచే నాయిక బోధింపబడుట శ్రవణము. స్వానురూపుడని దెలసి నాయకుని జూడగోరుట చక్షుఃప్రీతి, చూడబడినవాని మనస్సుయందు విడజాలకుండుట చిత్తస్సంగము, సకలోపాయములచేతను నాసినొంద నుద్యోగించుట సంకల్పము, ప్రియునియందర్పితమగు మనస్సుగలదగుటను నిద్రలేకుండుట జాగరము, నిద్రానాశముచేతను చింతాపరంపరచేతను జీర్ణించుట కృశత, స్రక్చందనభోజనాదులయందు స్పృహలేకుండుట యరతి, తనప్రియుని గుణములను జెప్పి తత్సంయోగాభిలాష సఖీజనమెదుట ప్రకటించుట లజ్జాత్యాగము. ప్రియునుద్దేశించి తత్సమాగమవిషయములగు మాటలనుబలవించి శరీరము దెలియకుండుట మూర్ఛ, అత్యంతమోహయుక్తయై యెప్పటికిని ప్రియసమాగమము లేకుండిన మృతినొందనది చరమావస్థ. ఇవి మోహముచేతను స్త్రీపురుషులకు బుట్టెడి యవస్థలు.

నను స్వీయా పరకీయా సాధారణా ఇతి త్రివిధానా యికాః తాసాం బాహ్యాభ్యంతరసురతసుఖం తుల్యమేవ కిమిత్యంస్వీయాస్సంభోగసంభ్రమాదం బరమాత్రమత్రోక్తమితిచేత్తదవిచారితరమణీయమిత్యుచ్య తేస్మాభి శ్లోకచతుష్టయేన॥ అకీర్తికరమస్వర్గ్యమనాయుష్యమితిస్ఫుటం। పరదారాభిగమనం శ్రుతిస్మృతివినిందితం। యథాస్వదారారక్ష్యాంతే తథైవాన్యాంగనాఅపి। ఇతిసత్యాత్యజేద్బుద్ధింపరదారాభిమర్శనే। పరద్రవ్యం యథాచోరా యత్నాదత్యంతభీతితః। నూనంతథాచాన్యాం విటావిషయచేతసః। తస్మిన్నవసరే బాహ్యామాభ్యంతరరతేస్సుఖం। కథం భవేచ్ఛ వేద్భావిదుఃఖ మత్యంతభీషణం॥ తదుక్తంవసంతతిలకే॥ దిశిదిశివిలోలనయనం సహసా సహసేతి సరససల్లాపం। అవిగళితనీవిబంధం తస్కరసురతంనమామితన్వంగ్యా ఇతి॥ పరదారాభిగమన నిషేధం ప్రబూమన్మృతిస్మృతిపురాణేతిహాసైః॥ నపరదారాన్గచ్ఛేదితిశ్రుతిః। నహీదృశమనాయుష్యం లోకే కించనవిద్యతే। యాదృశం పురుషస్యేహ పరదారోపసేవనం॥ పరదారాభిమర్శేషు ప్రవృత్తాన్నౄన్మహీపతిః। ఉద్వేజనకరైర్దండైశ్చిహ్నయిత్వా ప్రవాసయేత్॥ భర్తారం లంఘయేద్యాతు స్త్రీజాతిగుణదర్పితా।

తాంశ్వభిః ఖాదయేద్రాజా సంస్థానే బహుసంస్థితే॥ పుమాంసం దాహయేత్పా
పం శయనే తప్త ఆయసే। అభ్యాదధ్యుశ్చ కాష్ఠాని తత్ర దహ్యేత పాపకృదితిమ
నుః॥ మానసమపి పరదారగమనం నిషిద్ధతయా వివక్షితం విష్ణుపురాణే॥ పర
దారాన్నగచ్ఛేత మనసాపి కదాచన। పరదారగతిః పుంసాముభయత్రాపిభీతిదా।
ఇతిమత్వా స్వదారేషు ఋతుమత్సు బుధో వ్రజేదితి॥ స్కాందపురాణేప్యుక్తం॥ కో
ధర్మః కః పరో లోకః కామాంధానాం దురాత్మనాం। నైహికో న పరో ధర్మో న
బంధుర్న పరం ధనం। న్యక్కుర్వంతి విషీదంతి బాలవృద్ధాస్తథా స్త్రియః। జారం
దృష్ట్వా జనాస్సర్వే యథా చోరప్రవాదినమితి॥ రతిర..స్యాపి పరకామినీరతి ర
నీతిరితి చౌర్యవద్దర్శయతి. సంకేతితస్థలం ప్రాప్తాం నిర్భీకః పరకామినీం। యథైవ
సకృతీధీమాన్తమసావృతరాత్రిషు॥ ధర్మార్థేషు కామేషు భార్యాం నాతిచరా
మ్యహం। ఇతి వైవాహికే కాలే గుర్వగ్నిద్విజసన్నిధౌ। శపథః కారితః పుంసా తం
త్యక్త్వాన్యాం స్త్రియం వ్రజేత్। పాతకీ భవతీత్యేషా భాషా వేదేషు దృశ్యతే। శ్రీమ
హాభారతాదౌ తు పుంసః కామోధికః స్త్రియాః। ఇతీరితం మునీంద్రైశ్చ లోకేస్మి
న్దృశ్యతే తథా। అతృప్తస్స్వయథాదారే పుమాన్ప్రయుతే పరాం। తథా భర్త్రు
రిచాతృప్తా పరమిచ్ఛతి కామినీ। ఇత్యాత్మనోపమాం కృత్వా స్వదారనిరతో భ
వేత్॥ ప్రబ్రూత సత్యం కతరోంగనానాం దోషోస్తి యో నాచరితో మనుష్యైః।
ధాష్ట్ర్యేన పుంభిః ప్రమదా నిరస్తా గుణాధికాస్తా మనునాత్రచోక్తం॥ బ్రాహ్మ
ణాః పాదతో మేధ్యా గావో మేధ్యాస్తు పృష్ఠతః। అజాశ్వా ముఖతో మేధ్యాః స్త్రి
యో మేధ్యాస్తు సర్వతః॥ స్త్రియః పవిత్రమతులం నైతా దుష్యంతి కర్హిచిత్। మా
సిమాసి రజో హ్యాసాం దుష్కృతాన్యపకర్షతి। జామయో యాని గేహాని శపంత్య
ప్రతిపూజితాః। తాని కృత్యాహతానీవ వినశ్యంతి సమంతతః॥ దంపత్యోర్వ్యు
త్క్రమే దోషస్సమశ్శాస్త్రే ప్రతిష్ఠితః॥ నరా న..మవేక్షంతే తేనాత్ర వరమంగ
నాః॥ బహిర్లోమ్నా తు షణ్మాసాన్వేష్టితః ఖరచర్మణా। దారాతిక్రమణే భిక్షాం
దేహీత్యుక్త్వా విశుధ్యతి॥ పరాశరేణ గీతో యశ్శ్లోకస్తం వచ్మి శృణ్వతాం। యథా
భూమిస్తథా నారీ తస్మాత్తాం న తు దూషయేత్। అహో ధాష్ట్ర్యమసాధూనాం
నిందతామనఘాస్స్త్రియః। ముష్ణతామివ చోరాణాం తిష్ఠ చోరేతి జల్పతాం॥

ఓయీ స్వీయా, పరకీయా, సాధారణలను నాయికలందు బాహ్యా
భ్యంతరసురతసుఖము సమమగుచుండ స్వీయా సంభోగసంభ్రమాడంబరము
మాత్రమిచట నింతవిస్తరించితి రేయనిన నాయికాత్రితయ సంభోగసౌఖ్యసమా
నోక్తి యవిచారితరమణీయమని శ్లోకచతుష్టయముచే వివరించుచున్నాను.

పరస్త్రీగమనము కీర్తిని, స్వర్గమును, ఆయుష్యమును నశింపజేయునని స్ఫుటముగ శ్రుతిస్మృతులందు నిందింపబడియున్నది. తనభార్యలెట్లు రక్షింపబడు దురట్లన్యాంగనలుగూడ రక్షింపబడవలయునని తెలిసి పరదారగమనబుద్ధినివిడువవలయును. చోరులెట్లుశంకితులగుచు ప్రవేశింతురట్లువిటులన్యగృహమునందు ప్రవేశించి ముందనక్కిడి దెలసిన దనకు దారుణదుఃఖమగునను భీతితో బాహ్యాభ్యంతరరతసుఖము నేమియనుభవింపగలడు? మరియును వసంతతిలకమను టీకవిషయమందునజెప్పబడెను. పదిదిశలందున జలించు నేత్రములు గలిగి వేగము వేగముగ నిమ్మమనుసరససల్లాపములతో నీవీబంధమైనను విగళితముగ ని కామినీతస్కరసురతమునకు దండమని- పరదారాభిగమనమునిందితమను శ్రుతిస్మృత్యర్థములనువివరించుచున్నారము.

పరదారనొందగూడదనిశ్రుతి- పురుషునకు పరదారగమనమువంటి యనాయుష్యకరమగునది లోకమందేదియు లేదని- పరదారగమనప్రవృత్తిగల బురుషులను రాజు భయంకరముగదండించి మదనసదనసదృశచిహ్నమును వదనమందునగాల్పించి దేశమును దాటింపవలయునని- దర్పితురాలై యేస్త్రీ భర్తనుల్లంఘించి వ్యభిచరించు నాస్త్రీని బహుజనులుగల సభాస్థలమందు శునకములచే గరిపింపవలయునని- పరదారాభిగమనము జేయు పురుషుని కాలిన యినపశయ్యయందు వేయించి కట్టెలు వేసి యాపాపాత్ముని గాల్చవలెననువు. మానసమగు పరదారగమనమైనను నిషిద్ధమనివిష్ణుపురాణమందుజెప్పబడెను. పరదారగమనము పురుషులకిహపరభీతిప్రదము గావున మనస్సుచేతనైనను పరస్త్రీగమనము తలచరాదిట్లు దెలసి ఋతుకాలములందు స్వదారలతో భోగింపవలయునని- పరదారలందుకామాంధులగు దురాత్ములకు ధర్మము పరలోకము ఐహికము బంధువులు ధనము ఇవియేవియునుండవు. అట్టివానిజూచిన బాలవృద్ధస్త్రీజనులందరునుద్విగ్నులైదరు- దుఃఖించెదరు- సర్వజనమును చోరునిజూచి నిందించినట్లు జారునిజూచి నిందించుదురని స్కాందపురాణము.

రతిరహస్యమందును బరకీయారతి నీతికాదనియును చౌర్యమువంటిదనియును జెప్పబడెను. సంకేతస్థలమునొందించినబరస్త్రీనితుశలురైనను బుద్ధివంతులైన నంధకారబంధురరాత్రియందైననుభయములేనివాడై యెవడుభోగించును?

ధర్మార్థకామములందు భార్యనునేనతిక్రమించనని వైవాహికకాలమందు ద్విజగుర్వగ్నిసన్నిధిని పురుషునిచే శపథముచెయ్యబడెను. దానినిపిడచి పరస్త్రీసంగమమొనర్చిన పాతకియగునదేమాట వేదములయందుజూపబడుచుండె

ను. శ్రీమహాభారతాదిగ్రంథముల యందు పురుషులకంటె స్త్రీలకధికకామమని శ్రేష్ఠులగు మునులచే జెప్పబడెను. లోకమందునగూడ జూడబడుచుండెను.

పురుషుడు దానెట్లు స్వదారయందున దృష్టినొందక నితరస్త్రీ నిచ్ఛయించునో అటులనే స్త్రీగూడ స్వపురుషునివలన దృప్తిలేకుండిన పరపురుషుని బరిగ్రహించునని తనసామ్యమునేదలంచి పురుషుడు స్వదారపరుడై యుండవలెను. పురుషులకంటెనధికదోషము స్త్రీలయందేమియున్నదో సెప్పవలెను. స్త్రీ పురుషులకంటె గుణాధికయని మనువుగారు సెప్పినారు. పురుషులు ధార్ష్ట్యముచేత స్త్రీని త్యజింపుదురు. బ్రాహ్మణులపాదములు గోవులపృష్ఠములు గుఱ్ఱముల యొక్క మేకలయొక్క ముఖములు స్త్రీలశరీరమంతయును బవిత్రమనియును సాటిలేని పవిత్రత స్త్రీలకుకలదు. ప్రతిమాసమును రజస్రావము వారల దుష్కృతమును బోగొట్టుచున్నది. స్త్రీలెవరిగృహమందు సత్కరించబడక శపింపుదురో వారిగృహములు కృత్యాహతములూవలెను నశించును. దంపతులన్యోన్యమన్యథానటించుటచే దోషము సమముగనే శాస్త్రమందు నిరూపించబడినది. పురుషులు స్త్రీలను తమకంటె తక్కువగా జూతురుగాని స్త్రీ పురుషునికంటె శ్రేష్ఠము. లోమములు పైకికనపడెడి గాడెదచర్మముగట్టి కప్పబడి యారునెలలు భైక్షమాచరించి గాని దారాతిక్రమణమును జేసినవాడు శుద్ధినొందడు.

పారాశరీశ్లోకమొకటి జెప్పెదనువినవలెను. భూమివలె స్త్రీ పవిత్రత కలది గావున దూషించరాదనిరి. దోషరహితలగు స్త్రీలను దూషించెడి యి సాధువుల ధార్ష్ట్యమునుగూర్చి యాశ్చర్యపడెదము. దొంగిలించుండెడివాండ్లు తామితరులను నిలువుదొంగయని గర్జించుచు భర్జించినటులుండెను.

సాధారణా చాతుర్వర్ణ్యసాధారణా। పణ్యస్త్రీ యథాపణే సర్వైర్వస్తు క్రమేణ వశీక్రియతే తద్వన్మూల్యప్రజీవిన్యపి కాచార్థం నీచాయ కుష్ఠాద్యనిష్టారిష్టరోగిష్ఠాయ చాంధకుబ్జపంగ్వాదిభ్యస్స్వశరీరమర్పయతి తస్యా అధరం జాతినీతికులాచారధర్మజ్ఞః కోపినచుంబతీతి భర్తృహరిణాభిహితం॥ తద్యథా॥ జాత్యంధాయచ దుర్ముఖాయచ జరాజీర్ణాఖిలాంగాయచ గ్రామీణాయచ దుష్కులాయచ గళత్కుష్ఠాభిభూతాయచ। యచ్ఛంతీషు మనోహరం నిజవపుర్లక్ష్మీలవశ్రద్ధయా పణ్యస్త్రీషు వివేకకల్పలతికాశస్త్రీషు రజ్యేతకః॥ కశ్చుంబతి కులపురుషో వేశ్యాధరపల్లవం మనోజ్ఞమపి। చారభటచోరచేటకవిటనటనిష్ఠీవనశరావమితి॥ వృషలీఫేనపీతస్య నిశ్వాసోపహతస్యచ। తస్యాంచైవ ప్రసూతస్య నిష్కృతిర్నవిధీయత ఇతి॥ వృషల్యధరరసపాననిశ్వాససేవనాపత్యోత్పాదనేనై

కదాపి ద్విజస్య శుద్ధిర్నోపదిశ్యత ఇత్యాహ మనుః॥ వృషలీలక్షణముక్తం స్కాందే నాగరఖండే॥ చండాలీ బంధకీ వేశ్యా రజస్థా యా చ కన్యకా। ఊఢా యా చ సగోత్రా స్యాద్వృషల్యః పరికీర్తితాః। యః కరోత్యేకరాత్రేణ వృషలీసేవనం ద్విజః। తద్భైక్షభుగ్జపన్నిత్యం త్రిభిర్వర్షైర్విశుధ్యతీతి॥ ఏకరాత్రేణేతి సకృత్సేవనే ప్రాయశ్చిత్తముక్తమసకృద్యది నిష్కృతిర్నాస్తీతి మనువచనమిత్యవిరోధః॥

అత్రాహ మితాక్షరాకారః। వేశ్యాఖ్యా కాచిజ్జాతిరనాదిర్వేశ్యాయా ముత్కృష్టజాతేస్సమానజాతేర్వా పురుషాదుత్పన్నా పురుషసంభోగవృత్తిర్వేశ్యేతి బ్రాహ్మణ్యాదివల్లోకప్రసిద్ధిబలాదభ్యుపగన్తవ్యేయం నచ నిర్మూలేయం సిద్ధిః॥ స్మర్యతే హి స్కాందపురాణే॥ పంచచూడా నామ కాచనాప్సరాస్తత్సంతతిర్వేశ్యాఖ్యా పంచమీ జాతిరితి। అతస్తాసాం నియతపురుషపరిణయనవిధివిధురతయా సమానోత్కృష్టజాతీయపురుషాభిగమనే నాదృష్టదోషో నాపి దండః తాసు చానవరుద్ధాసు గచ్ఛతాం పురుషాణాం యద్యపి న దండస్తథాప్యదృష్టదోషోఽస్త్యేవ। స్వదారనిరతస్సదేతి నియమాత్॥ పశువేశ్యాభిగమనే ప్రాజాపత్యం విధీయత ఇతి ప్రాయశ్చిత్తశ్రవణాచ్చేతి నిరవద్యమితి। తదవిచారితదృష్టదోషాభావోక్తిరితి వదామో వయమిదం సదృష్టాంతం పరంపరయా దృష్టదోషం దర్శయంతః॥

శౌచాదిహీనమస్పృశ్యమమేధ్యం రోగదూషితం। స్వేదోపలిప్తలాక్షాదిపుత్రికామివశోభనం। వివేకినః ప్రపశ్యంతి హేయం వేశ్యాకళేబరం। తదేవ రమతే మూఢో విట్కీట ఇవ రంజయన్॥ అర్థనాశస్తు ప్రథమో దేహదూషణరుక్తతః। ద్యూతం తతస్తతో మత్తద్రవ్యసేవనమిష్యతే। ద్రవ్యహీనే తు చోరత్వం వేశ్యాసంగమజం ఫలం॥ చౌర్యేణ రాజదండస్స్యాదృష్టదోషమతో విదుః॥ ధర్మాఖ్యఖండే స్కాందే తు యద్వేశ్యాగమనే స్మృతం। తద్దృష్టదోషం ప్రబ్రూమో శృణ్వంతు శ్లక్ష్ణబుద్ధయః। అంగ నిర్దృష్ట్వా వేశ్యాయాః కథం మోహవశం గతః। అస్పృశ్యం ప్రథమం విదిశౌచాచారవివర్జితం। దుర్గంధస్రావిసచ్ఛిద్రం జారస్త్రీణాం కళేబరం। జరారోగాదిభిర్వ్యాప్తం పిత్తశ్లేష్మవిదూషితం। దేహదూషణరోగస్థమాపదశ్శ్రేయసాం గృహం। వ్యాధిభిర్దేహనాశస్స్యాద్ద్రవ్యసహైరర్థనాశనం। పరనాశో ధర్మహాన్యా కులనాశశ్చతుష్టయాత్। సర్వం తృణమివాభాతి దుర్జనే స్త్రీవిమోహితే॥ తద్ధితం కర్తుకామేన స్వర్గార్థీ చోరతాం వ్రజేదితి॥

రతిరహస్యేపి వేశ్యాగమనమతీవానర్థమితి సమర్థయతి॥ కలక్వణితకంకణారణితమేఖలాకింకిణీవిశాలజఘనస్తనారణితరత్నభూషోజ్జ్వలా। దిగంతనిహితేక్షణా ప్రసవక్లుప్తవేణీభరా గతాధికతరత్రపా గతభయైవ వారాంగనా॥

సా వేశ్యాద్రవిణప్రియా ప్రియంన ఉయత్ప్రియా। తేవత్వాద్రవిణం తాసాం తాసుమహా ధారమంత్య హా॥ వాగ్మిక ప్రేక్కర్తలోకనశ త్రైస్సంతర్గ సైన్సస్మి తైః కైశిరాషఫసంత్రతంత్రమణిభిః కృత్వావశం నాయకం। హృత్వా తస్య సమస్త వస్తువిదయం త్యక్త్వా తసన్యంనరం సేవంతే నిధనం వ్రజైవసతతం వారాంగనానాం రతిరితి॥

సాధారణయైన నాలుగువర్ణములవారికిని సామాన్యస్త్రీ. ఈప ణ్యాంగన బజారులోని వస్తువుల క్రయధనమిచ్చి యెట్టివాడైన తనవశ మైకొని జేసుకొనునో అదేరీతిని కాచముకైనను నీచునకు కుష్ఠాద్యనిష్టరిష్టరోగిష్ఠులకు నంధకుబ్జపంగ్వదులకును దనశరీరము నమ్ముకొని వారివశమును జేసును. కులాచారధర్మజ్ఞుడగు నెవడు వారాంగనాధరచుంబనమును జేయుననని భర్తృహరి. జాత్యంధుడు దుష్టమగుముఖముగలవాడు ముసిమిచేజీర్ణమగు సర్వావయములు గలవాడును నాగరికుడుగానివాడును కులహీనుడు కుష్ఠాదిరోగములచే నవయవములుజెగిపడుచుండపీడితుడగువాడును ఇట్టిహేయస్వరూపులగు నెట్టినీచజనులకును మనోహరమగు తనశరీరమును డబ్బుయందగునాసచే నమ్ముకొనుచు వివేకకల్పలతాచ్ఛేదనమునకు శస్త్రధారలవలెనుండు పణ్యస్త్రీలయం దెవడనురక్తుడగును. వేశ్యాధరపల్లవ మెంతమనోహరమై గనుపడినను చారులు చోరులు భటులు విటులు నటులు మొదలగువారుమియనమర్చిన ఫీకుదానువలెనుండునని దెలిసి సత్కులీనుడగు నెవడు చుంబనము జేయగోరును. వృషలీవనితాధరపానము చేసి దానినిట్టూర్పుచే నుపహతుడై దానియందు సంతానముగనిన వ్రాబునకు శుద్ధి లేదనిమనువు. చండాలి, జార, వేశ్య, రజస్వల, కన్యక, తనగోత్రమందు బుట్టినస్త్రీ, వీరలు వృషలీశబ్దవాచ్యలని స్కాందపురాణము. ఒకరాత్రియందేద్విజుడు వృషలీసంసర్గనొందునట్టివాడు నిత్యము భిక్షాన్నభోజియై జపించుచునుండిన మూడుసంవత్సరములకు శుద్ధుడగును. ఏకరాత్రిశబ్దముచే నొకమారు సంసర్గనొందినయని తాత్పర్యము. అనేకమారులట్టిపాపముజేసిన ప్రాయశ్చిత్తములేదనిన మనువచనార్థమునకు విరుద్ధములేకుండును.

ఈవిషయమై మితాక్షరకారులు సెప్పిరి. వేశ్యానామకమగు నొకజాతి యనాదిగానున్నది- అదివేశ్యయందు తనకంటెనుత్కృష్టజాతియైన సమానజాతియైనగలిగినబురుషునివలనబుట్టించబడి సంభోగమువృత్తిగాగలవేశ్యయనిబ్రాహ్మణి మొదలగువాటివలె లోకమందు ప్రసిద్ధిబలమువలన బోల్చదగియున్నదిగాని యిదిమూలములేనిదిగాదు- స్కాందపురాణమందు పంచచూడయను నప్సర

స్సంతతి వేశ్యయను నైదవజాతియగుచున్నదని చెప్పబడెను గావున వేశ్యలకు నియతమగు నొకపురుషుని వివాహముజేసికొనుటలేనందున స్వసమానోత్కృష్ట జాతీయులగు పురుషులసాంగత్యముచే నదృష్టదోషమును దండమును లేదు. ఆవేశ్యలు వకరియావరణలోనివారుకారు గావున వారలను బొందినపురుషులకును ఆలోచించగా దండము లేదు. అయినను అదృష్టదోషము కలిగియున్నది. సర్వదా స్వదారనిరతుడై పురుషుండుండవలయునని నియమమువలన పశువేశ్యాభిగమన దోషనివృత్తికి ప్రాజాపత్యవ్రతము ప్రాయశ్చిత్తము విధించబడియున్నదిగాన పైని జెప్పినది నిష్కళంకమయ్యున్నది. అదివిమర్శించనివారికి రమ్యమయ్యున్నది. దృష్టదోషాభావోక్తి యని- సదృష్టాంతరముగా పరంపరచే దృష్టదోషము వివరించుచున్నాము.

శౌచాదరహితము, అస్పృశ్యము, అపవిత్రము, రోగదూషితముగావున హేయమగు వేశ్యాకళేబరమును రంపపుపొట్టు, గజాశ్వాదివిష్ఠలు మొదలగు వాటిబురదచేజేసి పైనిలక్కబూసిన చక్కనిబొమ్మవలె వివేకముగలవారలు జూచి విడుతురు. మూఢుడుదీనియందు విట్కీటమువలె రంజనమునొంది రమించును. ముందుగా ధననాశము- అటుపైని దేహదూషణకరమగు రోగము- అటుపైద్యూతము- పిమ్మట మాదకద్రవ్యసేవనము- తమద్రవ్యము నశించినమీదట చోరత్వము- దానిచే రాజదండనము- వేశ్యాసంగఫలమిట్టిది గావున నిది దృష్టదోషమని దెలియదగును. స్కాందమందలి ధర్మఖండమందు వేశ్యాగమనవిషయమై యేదిచెప్పబడెనదిదృష్టదోషమని చెప్పుచున్నాము బుద్ధిమంతులువిందురుగాక.

వేశ్యాంగములనుజూచి యెట్టుగా మోహవశుడగునో మొదట నా వేశ్యాశరీరము శౌచాచారవర్జితము గావున నస్పృశ్యము- దుర్గంధముగా స్రవించు తుద్రిములతో గూడినదిగదా? జారస్త్రీకళేబరము ముదిమి, రోగము మొదలయినవాటిచే వ్యాప్తమై పైత్యశ్లేష్మాదిదూషితమై దేహదూషణ రోగము గలిగి యాపదలకును అశ్రేయమునకు నాలయమైయుండును. రోగములచే దేహనాశము, వ్యసనములచే ధననాశము, ధర్మహానిచే పరనాశము, సాంకర్యముచే కులనాశనము, ఈనాలుగును వేశ్యాశ్రయముచే సంభవించును. వేశ్యాస్త్రీలోలుడగు దుర్జనునకు తనసత్కులాదికము గడ్డిపరకవలె దోచుచుండును. దానిహితవుకొరకు ధనార్థియై కొసకుచోరుడగును. రతిరహస్యమందున వేశ్యాగమనము మిక్కిలి యనర్థకరమని జెప్పెను.

అవ్యక్తమధురముగరోయు కంకణములును గంటల యొడ్డాణమును ర

ద్మాలంకారములను గజవిధ వికాలగు జఘునస్థలమును గబ్బిగుబ్బలను దిగంతి ముఖప్రసరించుకొలిక ములను పుష్పసంధరితమగు వేణీభారమును లజ్జాభావ ముగలిగిన వారాంగన నిర్భయురాలై యుండును. అట్టి వేశ్య ధనప్రీతిచే ప్రియుని నటింపజేయును. ఆప్రియుడు ధనమిచ్చి యావేశ్యలతో మూఢుడైరమించును. చిత్రము! మంచిమాటలచే, చికిలిచూపులచే, దరహాసముచే, తర్జనాదులచే, క్రీడాదులచే, నౌషధమంత్రతంత్రాదులచే నాయకుని వశునిగ జేసి వానిసకలవస్తువులను రావించి నిర్ధనుడైనబిమ్మట విడచి మరియొకరిని సేవింపుదురు. వారాంగనారతి వృధామరణమని చెప్పబడియున్నది.

యఃపుణ్యవాన్సదాచారః కులీనో విజితేంద్రియః । ధర్మాధర్మవివేకజ్ఞస్స్వభార్యాయాం రమేతసఃఇతి రతిరహస్యే॥ హేమంతేసౌధమధ్యే పరిమళసహితే నైశిరేసద్వనాంతే వాసంతేగ్రీష్మకాలే జలసహితగృహే ధూపయుక్తేష్మగేహే। వర్షాకాలేశరత్సు ప్రకటవిధుకళాపూర్ణజాలాంతరాళే కళ్యాణీభిర్వధూభిస్సుమతివిలసలో నాయకస్సంవసేత॥ అతిస్త్రీసంప్రయోగాచ్చరక్షేదాత్మానమాత్మవాన్। శూలకాస జ్వరశ్వాసకార్శ్య పాండ్వామయ క్షయాః। అతివ్యవాయాజ్జాయంతే రోగాశ్చాక్షేపకాదయః। ఆయుష్మంతోమందజరావపుర్వర్ణబలాన్వితాః। స్థిరోపచితమాంసాశ్చ భవంతిస్త్రీషు సంయుతాః॥ త్రిభిస్త్రిభిరహోభిర్హి సమీయాత్ప్రమదాంనరః। సర్వేష్వృతుషుఘర్మేషు పక్షాత్పక్షాద్వ్రజేద్బుధః॥ రజస్వలామకామాంచ మలినామప్రియాంతథా । వర్ణవృద్ధాంవయోవృద్ధాంతథావ్యాధిప్రపీడితాం। హీనాంగీంగర్భిణీంద్వేష్యాం యోనిదోషసమన్వితాం। సగోత్రాంగురుపత్నీంచ తథాప్రవ్రజితామపి । సంధ్యాపర్వస్వగమ్యాంచతథామధ్యందినేషుచ। లజ్జాసమావహేదేశేవివృతేశుద్ధఏవచ। క్షుధితోవ్యాధితశ్చైవక్షుబ్ధచిత్తశ్చమానవః। వాతవిణ్మూత్రవేగీచపిపాసురతిదుర్బలః। తిర్యగ్యోనావయోనౌచ ప్రాప్తశుక్రవిధారణం । దుష్టయోనౌ విసర్గంతుబలవానపివర్జయేత్। శీతసస్నాతమాత్రంతు మూర్ధావరణమేవవా। స్థితాడత్తానశయనేవిశేషేణైవగర్హితం।క్రీడాయామపిమేధావీహితార్థీ పరివర్జయేత్॥

లింగినీంగురుపత్నీంచ సగోత్రామథపర్వసు । వృద్ధాంచసంధ్యయోశ్చాపి గచ్ఛతోజీవితక్షయః। గర్భిణ్యాంగర్భపీడాస్యా ద్వ్యాధితాయాం బలక్షయః। హీనాంగీంమలినాంద్వేష్యాం కామంవంధ్యామసంవృతే। దేశేనుద్దేచ శుక్రస్య చనసశ్చక్షుయోనవేత్। క్షుధితఃక్షుబ్ధచిత్తశ్చ మధ్యాహ్నే తృషితోఽబలః। స్థితస్యహానింశుక్రస్య వాయోఃకోపంచవిందతి। అతిప్రసంగాద్భవతి శోషశ్శుక్ర

ధర్మాధర్మజ్ఞానము కలవాడు, సదాచారసంపన్నుడు, జితేంద్రియుడు, పుణ్యాత్ముడనగువాడు స్వభార్యాగమనమును జేయునని రతిరహస్యము. హిమంతర్తువునందు పరిమళసహితమగు సౌధమందున్ను, శిశిరర్తువునందు ధ్యానవసమర్థమందు వాసంత గ్రీష్మర్తువులందు ధారాజలగృహములందును వార్షిక దివసములందు ధూపయుక్తములగు వెచ్చనిగృహములందు శరదృతువులందు నిర్మలమగు చంద్రకళలచే నంతటావ్యాపింపజేయుగవాక్షములుగల గృహములందును మంగళయుక్తులగు స్వస్త్రీలతో నిర్మలుడును సమమతికలవాడునగు నాయకుడు గూడియుండవలెను.

నియమించబడిన ఇంద్రియములుగల జనుడు విశేషముగా స్త్రీలయొక్క సంబంధమువలన దనను సంరక్షించుకొనవలెను. స్త్రీలను సర్వదా గూడియుండుటవలన శూల- దగ్గు, తృష్ణము, వగర్పు, కృశించుట, పాండురోగము, క్షయరోగము సంభవించును. స్త్రీలతో నియమముగా కలుసుకొనువారు ఆయుర్దాయముకలిగి ముదిమి వేగము రాకుందురు. తేజము, బలము, దృఢమైన వృద్ధి బొందించబడిన మాంసముగలవారునగుదురు. తెలిసినవాడు గ్రీష్మవ్యతిరిక్త సకలఋతువులందును మూడేసిరోజులకు స్త్రీనిబొందవలెను. వేసవియందు పక్షమునకొకసారిపొందవలెను. రజస్వలాస్త్రీని, కామములేనిదానిని, మలినముగానున్నదానిని, ఇష్టములేనిదానిని, అధికవర్ణస్త్రీని, వయోవృద్ధను, రోగములచే పీడించబడినదానిని, అవయవలోపముగలదానిని, గర్భిణీస్త్రీని, ద్వేషముగలదానిని, యోనిదోషముగలదానిని, సమానగోత్రస్త్రీని, గురుభార్యను, యోగినీస్త్రీని, సంధ్యాకాలములయందు, పర్వములందు, మధ్యాహ్నవేళలను, లజ్జకలిగేస్థలములందు, శుభ్రిమైయుండనిస్థలములను, ఆకలి రోగము చలచిత్తమునుగలదానిని, వాతవిణ్మూత్రవేగముగలవాడై తృషితుడై దుర్బలుడై పశ్వాదియోనులను రజస్వలగానికన్నియలయోనులను రోగయుక్తమగుయోనులను బలముగలవాడైనను రేతోత్సర్జనమొనర్చదగదు. విశేషముగా రేతస్సునువదలడము రేతఃపతనకాలము నరికట్టడము వెల్లగింతలపరుండియును హితవునుగోరువాడు క్రీడలందైనను రేతస్సును విడుచుటయునిందితము.

ఆయాయి వేషములనుధరించే దాత్యాదిస్త్రీలను గురుపత్నిని సగోత్రిస్త్రీని పర్వకాలములందున తనకంటెవయోధికను సంధ్యలందున బురుషుడురతియొనర్చినయాయువు క్షీణించును. గర్భిణీగమనమువలన గర్భపీడయగును. వ్యాధితోనున్నదానిగమనము బలక్షయకారి. హీనావయవి మాలిన్యముకలది ప్రతి

కూలిని కేవలవంధ్యను ఆవరణలేకుండినచోటను అపవిత్రస్థలమునగూడిన శుక్లముయొక్క మనస్సుయొక్క క్షయమగును. ఆకలితోనున్ను చలచిత్తముతోనున్ను మధ్యాహ్నవేళలందును రతియొనర్చినవాడు దాహముగలవాడును బలములేనివాడునయ్యెను. మరియు నుండినశుక్లమునకు హాని వాతప్రకోపమునున్ను పొందును. అతిప్రసంగముచేతను శుక్లక్షయకరమైన శోషపుట్టును. వ్యాధితుండగువానికి క్లీహాయనురోగము మూర్ఛ మృతియునగును. ప్రాతఃకాలమందర్ధరాత్రియందు వాతపైత్యప్రకోపమగును. పశ్వాదియోనులను రజస్వలకానియోనియందు రోగయుక్తమగుయోనియందు ఉపదంశమనేరోగమున్ను వాతప్రకోపమున్ను శుక్లక్షయమున్ను గలుగును. విశేషముగ రేతోత్సర్జనమును జేయుటయు మూత్రమును విడచుట రేతస్సునుబంధించుట వెళ్లగింతలపరుండి రేతస్సునువిడుచుటవల్లనున్ను శుక్లము రాళ్లవలె ఘనీభవించును. అదిహేతువుచేతను ఐహికాముష్మికములకహితమగు పైనిజెప్పినవన్నియును విడవవలెను.

మోహముచేత నుత్పన్నమైన శుక్లమును ధరించరాదు. తనతోతుల్యమగు రూపవయోగుణశీలములున్ను వాంఛయునుగలిగి హృద్యముగా నలంకరించుకొనబడి హృష్టురాలైయున్న స్వస్త్రీయందు శుక్లవృద్ధికరమగు సాధనములను సేవించినవాడు రతియొనర్చవలెను.

పంచదారతోగలిపినపాలును, లేకపంచదారతోరసద్రవ్యమైనను బుచ్చికొనవలెను. స్నానము, విశనకఱ్ఱగాలి, నిద్రయును వ్యవాయానంతరమువుదుహితములని సుశ్రుతమందు జెప్పబడెను.

చతుర్విధపురుషార్థములలో నర్థకామములు రెండున్ను విశేషైహికసౌఖ్యకరములుగా నున్న బహుజనులకు ఇష్టములవుచున్నవి. ధర్మమోక్షములు రెండున్ను నిరాలంబమైన బ్రహ్మానందరసమునకు ఆశ్రయములవుచున్నవి. స్రక్చందనాదిభోగములను ధ్యానింపుచుండెడి చిత్తమెవరికినివశ్యముకాదు. అట్టిమనస్సునుఅభ్యాసకౌశలముచేతనె మదగజమునువలె కాలక్రమముచేతను వశ్యముగాజేయవలెను.

మొదటకామభోగార్థమై తన్మయుడై పిమ్మట వైరాగ్యముగలిగి జ్ఞానమయుడుగావలయును- ఆత్మ మనస్సుతోనున్ను మనస్సుఇంద్రియములతోనున్ను చక్షుఃప్రభృతీంద్రియములు స్వార్థములైన రూపాదులతోనున్ను శీఘ్రముగాను క్రమముచేతను సంబంధించును. తత్తదింద్రియద్వారా సకలపదార్థములలోనూ సంబంధముగలిగియుండును. గనమనస్సునకు అప్రాప్యములేదు. మనస్సు

నొకచోటికి నడచునో తద్ద్వారా ఆత్మయున్ను అచటికిచేరును. శరీరమందలి హృదయప్రదేశగతమైన యతిసూక్ష్మమగు ఆత్మ నిశ్చలమైన మనస్సుచేతను సంతతయోగాభ్యాసమువల్లను గ్రహింపతగినది. ఏపరేపదార్థమును చింతించుదురో వారు తన్మయత్వమును బొందుదురు. గానగృహస్థునకు కామము మోక్షమని మహర్షులు చెప్పుచున్నారు. ఇట్టికామయజ్ఞముచేతను గృహస్థులు సంసారసముద్రమును తరింపజేసే పుత్రులను బొందుచున్నారు.

ఈపైనిబ్రహ్మైక్యబోధకమైన బ్రహ్మానందానుభవరూపమైనద్వితీయ రసము చెప్పబడుచున్నది. శృంగారావస్థయందు ఉత్పన్నమైనరాగముచేతను బాహ్యాభ్యంతరసంభోగాదిస్త్రీసేవనము స్వర్ణముయొక్క వర్ణాతిశయమును తెలియుకొరకు ముందుగా గీటురాయిపైని గీటుబెట్టి పరీక్షించుటవంటిదిగాన ధర్మావిరుద్ధమైన కామముచేతను ముందుగాఅనిత్యరసానుభూతికలవారై పిమ్మట నిత్యమైనబ్రహ్మరసానుభవమునందుప్రవర్తించుచున్నారు. అటుపైని యానందస్వరూపమైనబ్రహ్మయొక్క సాక్షాత్కారముచేతనుధన్యుడనైతిననుభావనాపూర్వకముగాశాశ్వతమైన బ్రహ్మానందాస్వాదనసౌఖ్యమును బొందుచున్నారు.

భగవానాపస్తంబోమునిర్గృహ్యసూత్రే యఃప్రవాసేత్ప్సస్వజాయాయాం జారరేతోత్సర్గేణసంకరంభవేత్స్వకులమితిభీతస్సన్వసతి తస్మైపరమకారుణ్యేనోక్తమిదం॥

అసంభవేప్సుఃపరేషాగ్ స్థూలాధారికా జీవచూర్ణాని కారయితోపేత్తరయాసుప్తాయాస్సంబాధఉపవపేత్॥ అస్యార్థః॥ అసంభవేప్సుః పరపురుషాసంభవేప్సుస్స్థూలాయాధారికాయాజీవంత్యాశ్చూర్ణాన్యస్యైవకారయితి। ఆధారికాగాళికాసరీసృపవిశేషః యాశతచరణానామ। సాచద్వివిధా గ్రామ్యారణ్యాచ తయోరారణ్యాస్థూలా గ్రామ్యాతస్యా జీవచూర్ణాని చర్మాదినాఆజ్యామివనన్వసతిత్యైతయా। సుప్తాయాభార్యాయాస్సంబాధేయోనావుపవపేత్। ఏవంకృతే సంబాధఉపభోగయోగ్యోనభవతి॥

గృహ్యసూత్రమందు సర్వజ్ఞులైన యాపస్తంబమునీంద్రులెవడు ప్రవాసమును జేయదలంచితనభార్యయందన్యరేతోత్సర్జనమొనర్పబడెనేని స్వకులమునకు సంకరముకలుగునని భీతికలవాడై యుండునో వానికొరకు కారుణ్యముచేత యీ క్రిందివిధముగను వివరించినట్లు చెప్పెను.

...రపురుషసంసర్గదోషభావము ... యీ ... స్థూలమైన యుదకపాత్రలలోనుండను చర్మమునకుం ... పంచియున్న ఉత్తరయో ఆజ్యామివధన్వయను మంత్రముచేసెను నిద్రించిన భార్యయొక్క గర్భస్థలద్వారమందు లేపన మొనర్చినయెడల యావివరము పురుషునకుపభోగయోగ్యము గాకుండును.

అథయ దాపరపురుషశంకా వ్యాప్తేతి తదా స్వశుక్లసంభవసిద్ధ్యర్థం శైషజముచ్యతే॥

సిద్ధ్యర్థేబభ్రుమూత్రేణ ప్రక్షాళయీత॥ అస్యార్థః॥ కపిలాగోమూత్రేణసంబాధం ప్రక్షాళయీత॥

పరపురుషసంసర్గసంశయనివృత్తిమైనపైని దన రేతోత్సర్జనముకొరకు తిరుగనౌషధము జెప్పబడుచున్నది.

కపిలాగోమూత్రముచేత నాద్వారమును గడిగివేయవలెను.

అవ్యభిచారిణీభర్త్రోర్వల్లభ్యం భార్యాయాశ్చభవితుం తేనైవ స్వగృహ్యసూత్రేసూచితమిదం॥

యంకామయేతనాయంమచ్యేతే జీవవిషాణే స్వం మూత్ర మానీయ సుప్తముత్తరాభ్యాం త్రిఃప్రసవ్యం పరిషించేత్॥ అస్యార్థః॥ యంభర్తారం సపత్న్యాశ్యమస్యాస్యాం వేంద్రియదౌర్బల్యాదనురక్తం యా స్త్రీ కామయేతాయం భర్తా మత్ మత్తో నచ్ఛిద్యేత అస్యాం మయ్యేవిచ్ఛేదేన స్నేహవాన్స్యాదితి సా స్త్రీ జీవవిషాణే జీవంత్యాగోర్విషాణే బలాత్పాటితే స్వంమూత్రమానీయ తేన భర్తారంసుప్తం ఉత్తరాభ్యాం పరిత్వాగిరేరమిహామితేతాభ్యాం త్రిః ప్రసవ్యం పరిషించేత్। అత్రచానీమేతి వచనాత్పూర్వమన్యస్మిన్పాత్రేమూత్రయిత్వా శౌచంకృత్వా తతోవిషాణేనోపనయనం॥

పతివ్రతయగు స్త్రీ భర్తయొక్క ప్రీతిని విశేషముగనొందుటకు యాపస్తంబులవారిచేతన యీయుదాహరించిన కృత్యము తమగృహ్యసూత్రము నందు సూచన జేయబడెను.

ఇంద్రియవశుడగునే పురుషుడు తన సపత్నియందనురక్తుడై యుండెనని తనయందువిశేషవాత్సల్యముగలిగెడి కొరకు జీవించియున్న గోవిషాణమును బలాత్కారముగదీసి భార్య వేరొకపాత్రయందదివరకుమూత్రించి శౌచనమొనర్చికొని యామూత్రమును గోవిషాణమందునిచి నిద్రించియున్న భర్తకు చుట్టూ మూడుపర్యాయములు ఉత్తరాభ్యాం పరిత్వాగిరేరమిహామితేతాభ్యామనేమంత్రమునుచ్చరించి పరిషేచన జేయవలసినది.

## స్వప్న ఫలాని.

అథస్వప్నఫలాని తచ్ఛాంతివిధీంశ్చ వ్యాఖ్యాస్యామః॥ అథ దారోపగమనానంతరం స్వప్నఫలాని స్వప్నప్రపంచదృష్టమనుస్మృత్య భావిశుభసూచకస్వప్నభేదాంశ్చ శుభనివృత్తిహేతుభూతశ్రుతిస్మృతిపురాణేతిహాసాద్యనుగ్రహకశాంతిప్రకారాంశ్చ ప్రబ్రూమ ఇతి సూత్రార్థః॥

నను శశవిషాణవత్ స్వప్నస్య మిథ్యాత్వేన కథం తత్ఫలానిచ దుష్టఫలనివర్తనోపాయశ్చోచ్యతే। సత్యం మాయాకార్యత్వం స్వప్నస్య నిద్రాజాగరయోస్త్వనుభూతత్వాత్తాసూన్యతావితివదామః। తదవిచారితరమణీయం॥ చక్షురాదీంద్రియైర్జనితో బాహ్యవిషయానుభవో జాగ్రత్। స్వప్నోంతఃకరణజన్యానుభవః। జాగ్రత్స్వప్నయోః వాసనాజ్ఞానవిరోధిరూపబీజం సుప్తం। అతస్త్రితయమపిమిథ్యైవ। అస్యత్రయఅవసథాస్త్రయస్స్వప్నా ఇతిశ్రుతేః। స్వప్నావస్థాయాంతజ్జనితసుఖదుఃఖాద్యనుభూతింమన్యతే సత్యమితి। నతుప్రబోధే। యజ్జాగ్రదవస్థాయామనుభూతం తజ్జ్ఞానావస్థాయామైంద్రజాలికవన్మన్యతే జ్ఞానీ। తథాచశ్రుతిః॥ ఆనందమంతర్నిజమాత్రయంత మాశాపిశాచీ మవమానయంతం। ఆలోకయంతంజగదింద్రజాలమాపత్కథంమాంప్రవిశేదసంగం॥ మాయోపాదానకరణరూపసుషుప్తిరపి తథావిధ ఇతి తథ్యం। జాగరాదివ్యవస్థాత్రయమాత్మా తేభ్యోవ్యతిరిక్తవస్తుత ఏవ సత్యం। సత్యంజ్ఞానమనంతం బ్రహ్మేతి శ్రుతేః॥ మనః కేవలంస్వప్నజాగ్రదవస్థోపాదానకారణమితి॥ స్మృతిః ప్రత్యక్షమైతిహ్యమనుమానశ్చతుష్టయం। విశిష్టశిష్టసంమతం। మనసా హ్యేవపశ్యతి మనసా శృణోతీత్యాదిశ్రుతయః॥

వ్యావహారికీ పారమార్థికీ ప్రాతిభాసికీతి త్రివిధాసత్తా॥ కటకమకుటాద్యర్థక్రియాకారిత్వం వ్యావహారికత్వం। యావజ్జ్ఞానం తావత్కాలస్థాయిత్వం ప్రాతిభాసికత్వం। కాలత్రయాబాధ్యత్వం పారమార్థికసత్యత్వం। ఉక్తాస్సాక్షిః పారమార్థికీ। జ్ఞానకాలస్థాయ్యపిస్వప్నదృష్టంవ్యావహారికశుభాశుభసూచకత్వేనానుభవసిద్ధం అతః అనుమానప్రమాణగమ్యం। దుస్స్వప్నజారిష్టనివారకశాంతిజపతపోహోమాద్యుపదేశక శ్రుతిస్మృతిరూప శబ్దప్రమాణకం॥ మాయామాత్రంతుకార్త్స్న్యేనానభివ్యక్తస్వరూపత్వాదితిబ్రహ్మసూత్రం॥ అస్యార్థః॥ అనాదిమనోగతాన్సంస్కారాన్స్వేచ్ఛామాత్రేణేశ్వరః ప్రదర్శయతి కార్త్స్న్యేనసాధనేన సమ్యగనభివ్యక్తస్వరూపత్వాత్। బ్రహ్మాండపురాణేచ॥ మనోగతాంస్తు సంస్కారాన్స్వేచ్ఛయాపరమేశ్వరః। ప్రదర్శయతి జీవాయ సస్వప్న ఇతి గీయతే

ఇతి। సాధనానంతరాభావేపి భావాభావసూచకత్వేనచేశ్వరో దర్శయతి। యదాకర్మసుకామ్యేషు స్త్రియంస్వప్నేషుపశ్యతి। సమృద్ధింతత్రజానీయాత్తస్మిన్స్వప్ననిదర్శనఇత్యాదిశ్రుతేః॥

## స్వప్నఫలములు.

ఇటుపైనిస్వప్నఫలములను దుష్టస్వప్నశాంతివిధులను జెప్పుచున్నాము.

దారోపగమానంతరమందు స్వప్నప్రపంచదృష్టములగువాటిననుసరించి శుభాశుభములను అశుభనివృత్తికై శ్రుతిస్మృతిపురాణేతిహాసములయందు జెప్పబడిన శాంతివిధులను జెప్పుచున్నామని సూత్రార్థము.

ఓయి సౌమ్యలక్ష్మీకొమ్మువలె అబద్ధమగు స్వప్నము శుభాశుభసూచకమనియును దానియశుభనివృత్తికై శాంత్యుపాయము ను జెప్పుచున్నామనుటయెట్లనిన వివరించెదము.

స్వప్నము మాయాకారిమనుట సత్యము. నిద్రాజాగ్రదవస్థలనుభూతములగుటవలన సత్యములని జెప్పుచున్నారమదియును విచారించక రమ్యము. చక్షురాదీంద్రియములచే విషయానుభవము జాగ్రదవస్థ. అంతఃకరణజన్యానుభవము స్వప్నావస్థ. ఆరెంటికిని వాసనాబీజమై జ్ఞానవిరోధిరూపము సుషుప్తి గావున నీమూడవస్థలు నసత్యములె. ఈసంసారియగు జీవునికట్టియవస్థలమూడును స్వప్నములవంటివై మూడునివాసస్థానములగుచున్నవని శ్రుతి. స్వప్నావస్థయందగు సుఖదుఃఖానుభవమప్పుడు సత్యముగానే తెలియును- గాని మేలుకొనినయపుడింద్రజాలమువలె దెలిసికొనుచున్నాడు. ఇందుకుశ్రుతి. స్వానందమును లోపలనాశ్రయించి యాశయనుపిశాచి నవమానించి లోకమునింద్రజాలమువలె నాలోచించునసంగుడనగు సన్న్యాసి యెటులోందునని- మాయ ముఖ్యకారణముగాగలసుషుప్తియు నిట్టిదే- సత్యము. జాగ్రదాద్యవస్థలతోగూడినయాత్మ యీయవస్థాత్రితయముకంటె వ్యతిరిక్తమగువస్తువిదియె సత్యము. బ్రహ్మము సత్యజ్ఞానానందస్వరూపమని శ్రుతి. స్వప్నజాగ్రదవస్థలకు మనస్సె ముఖ్యకారణమని- వేదము ప్రత్యక్షము ఇతిహాసము అనుమానము నీనాలుగును యోగ్యులగుశిష్టజనులకు సంమతమగు ప్రమాణము.

మనస్సుచేతను విను నీయర్థముగలవి మొదలగు శ్రుతులు వ్యావహారికీ, పారమార్థికీ, ప్రాతిభాసికీ యని ప్రకారత్రయమయ్యున్నది. కటకమకుటాదిప్రయోజనక్రియను జేయునది వ్యావహారికసత్తా- ఎంతపర్యంతము రజ్జువందుసర్పజ్ఞానముండు నంతమట్టుకనుభూతమగు నాస్వప్నస్థితి ప్రాతిభాసికసత్తా. కా

లత్రయమందును బాధింపబడక నెప్పటివలె నేకరీతినుండునది పారమార్థికస త్తా. పూర్వమందే పారమార్థికసత్తాస్వరూపము మాచే జెప్పబడెను. స్వప్న మందున జూడబడిన వస్తువు స్వప్నమున్నంతకాలము మాత్ర ముండినదైనను వ్యావహారిక శుభాశుభములను సూచించేదగుట యనుభవ సిద్ధమయ్యున్నది. ఇందువలన ననుమాన ప్రమాణ గమ్యమగుచున్నది. దుస్స్వప్నమువలన బుట్టిన యరిష్ట శాంతికై జప హోమాదులను జెప్పెడు శ్రుతి స్మృతి రూపశబ్దప్రమాణము గలదై యున్నది. అనాదిగా మనోగతములగు సంస్కారములను స్వేచ్ఛామాత్రముచే యీశ్వరుడు జూపించుచున్నాడు గాని మరివకసాధనముచే గాదు. లెస్సగా స్ఫుటముగాని స్వరూపముగలదాటవలెయని బ్రహ్మసూత్రార్థము. బ్రహ్మాండపురాణమందును మనోగతమగు సంస్కారములను స్వేచ్ఛచే పరమేశ్వరుడు జీవునకు జూపించుచున్నాడు. ఇదిస్వప్నమని జెప్పబడుచున్నది. సాధనాంతరములేకున్నప్పటికిని కలిమిలేములనుసూచించేదిగా స్వప్నము ఈశ్వరునిచే జూపింపబడుచున్నది. ఎట్లుకామ్యకర్మలయందు స్త్రీలనుస్వప్నమందుజూచిన సమృద్ధియగునని యాస్వప్ననిదర్శనవిషయమై తెలియదగునని శ్రుతి.

స్వప్నోద్వివిధః ఇష్టఫలోనిష్టఫలశ్చేతి॥ అథసుస్వప్నసూచితఫలప్రమాణాన్యుచ్యంతే॥ వాతకంపైత్తికంస్వప్నం కఫజంచింతితంత్యజేత్ । స్వప్నేతిపైత్తికపశ్యేత్తుంగాద్రవ్యోమలంఘనం। స్వర్ణరత్నాగ్నిమాల్యాని స్వప్నే పశ్యతి వాతకే। సరిత్తోయావగాహాదిశుక్లంపుష్పంకఫోద్భవే। అభీప్సితంవా దృష్టంవా చింతితంతముదాహృతం। దృష్టంనశక్యతేవక్తుం యన్నిబంధంతుతంత్యజేత్। త్రిద్వ్యేకవర్షాణ్మాసాత్ఫలంయామక్రమాద్భవేత్। పశ్చాదుషసిసప్తాహాత్ఫలంస్వప్నోరుణోదయఇత్యాత్రేయః॥

యస్సూర్యాచంద్రమసోర్బింపి గ్రసతేసమగ్రమపిపురుషః। కలయతి దీనోపిమహీం ససువర్ణాంసార్ణవాంనియతం॥ యోమానుషీయ మామిష మాత్రీయంవామానవస్సార్ధం। స్వేచ్ఛంఖాదతిస్వప్నే సామ్రాజ్యంరాజ్యమాప్నోతి॥ ప్రాసాదస్యశృంగే భుక్త్వాపస్తరతి తోయధేర్గాధం। దాసాభిజనేజాతో మనుజపతిర్గాయతేమనుజః॥ లింగచ్ఛేదే లభతే సౌభాగ్యంచ సుయోషితః పురుషః। ఘూనిచ్ఛేదేలభతే యోసావరపూరుషానులంభఫలం॥ ఛిద్యేత యస్య జిహ్వా శస్త్రైఃకేనాథవాస్వప్నే। క్షత్రియపురుషోరాజా శేషస్తువిశేషోధిపతిః॥ యోమానుషస్యమస్తకచరణభుజస్యాపి భక్షణంకురుతే। రాజ్యం కనకసహస్రం తదర్ధమాప్నోత్యసందిగ్ధః॥ మద్యంసద్యోమాంసం రుధిరంవసాం స్వాదయతే లభతే।

తాభ్యామంగాభ్యంగో యస్య భవేత్తస్య ధనవృద్ధిస్స్యాత్॥ నళినీదళేషు భక్తో మ
ధ్యేసలిలాశయే పరమాన్నం। ఘృతఖండయుతం భుంక్తే భూజ్యస్సచ రాజ్యమా
ప్నోతి॥ మూత్రంచ శుక్రశోణితం పిబతి నగర్హ్యా తే తద్ధి తేషాం। యస్యావలోకనమ
నులేపనంచ తస్యాపి వృద్ధిస్స్యాత్॥ భక్షయతి చ వీక్షతే శుభఫలకుసుమాన్యథాన్య
వాప్నోతి। స్వప్నే తస్య ముహుర్గృహాగణా లుంపంతి ఖలు లక్ష్మీః॥ ఆరోప్య ధను
ర్జ్యాటంకారవనిర్భరసకలదిగ్వలయం। యోహంతి శత్రుసైన్యం ప్రాప్నోతి ససంప
దం సపది॥ భక్షయతి క్షైరేయం ప్రాసాదక్షీరవృక్షస్థః। యః కనకరజతపాత్రే ప్ర
కథ్యతే పార్థివపదం తస్య॥ నగనగరగ్రామవనైస్సహితాం భూమిం సముద్రసహి
తాం। ఉత్తరతి యో జానుభ్యాం నీచోర్ధ్వాచిరేణ సనృపస్స్యాత్॥ యో వేలామధి
రోహతి తస్యానుత్తరతి భృశమభిన్నా। యానాత్ప్రత్యా ప్రవాసం మాసాత్ప్ర
తకృత్యస్స పునరాయాతి॥ ప్రియతే విరేణపురీషం యః పిబతి పిషం నిర్భయః పురుషః।
ఉపచీయతే స భోగైర్భోగైస్సంత్యజ్యతే సద్యః॥ యో రక్తాభ్యక్తాంగస్స్వప్నే వివా
హమీక్షతే దక్షః। జగతి ధనధాన్యలక్ష్మ్యా నృపలక్ష్మ్యస్తముపలక్షయతి॥ రుధిరధు
నీషు నిమజ్జనమథవా పానం యస్య రుధిరేణ। రుధిరస్య స్రావోంగాత్తస్య భృశం భ
వతి ధనధాన్యం॥ యస్స్వయమభిధావతి స్వప్నే యద్వా భిద్యతే చ శిరః। లభతే క
నకసహస్రం సభూమిభోగాంశ్చ భూమిపతేః॥ యానాధిగతభావం స గోపి యో
షిత్తనుం చ యో లభతే। తౌ వర్ధేతే సార్ధం కుటుంబవృద్ధ్యా సహ బుద్ధ్యా॥ ఆరు
హ్య మత్తకరిణం దేహి సమన్యం చ యుధ్యతే యుధియః। యః జాయతే నభీతో ధృ
వం తస్య లాభస్స్యాత్॥ మూత్రపురీషైః పురుషస్స్వప్నే యస్స్వపతి లిప్తసర్వాం
గః। మధ్యే శ్మశానముభయం ప్రాప్నోతి కళత్రపుత్రరాజ్యాని॥ పార్థివ ఇతి యః
ప్రథితః ప్రథమం చోపస్తతో ధనం యాతః। ధ్రువమనుసరతి స్వప్నే స బుధ్యతే ప్రా
జ్య రాజ్యాయ॥ యో యాతి దిశముదీచీం ప్రాచీం వా గౌరగోయుతం యానం। అ
ధిరూఢో జాగర్తి చ బాఢం తస్యార్థలాభస్స్యాత్॥ అంగప్రత్యంగయుతా నఖరో
మవివర్జితా తనుర్యస్య। వృద్ధిం సమేతి తం నరమనుసరతి కళత్రమివ లక్ష్మీః॥ యః
ప్రాతః పయసి ముదా ఖేలన్ ద్వారం చ తస్య వివృణోతి। వ్యసనాత్ప్రముచ్యతే
సా త్వరితం ప్రాప్నోతి ధనధాన్యం॥ అజ్ఞాతనిబిడనిగళైర్గోభుజబంధేన బద్ధ్యే
త। భవతి సుతస్తస్య పునః పదం ప్రతిష్ఠాం చ కష్టేన॥ నిమ్నాతూర్ధ్వపాత్రో యాద్గ
ర్తాదుదధిర్వా తస్థలేంభీతః। ధిష్ట్యా స మేధయా వా సమేధతే వివిధధాన్యేన॥ ఖా
దంతి వేష్టయంతి చ యం స్వప్నే మశకమక్షికాదంశాః। ఆప్నోతి పేషితమపి స యో
షిత్ వైత్తమచిరేణ॥ సరితస్సరాంసి కమలాన్యుద్యానాన్పర్వతాంస్తథా సా

ధాన్। యః పశ్యతి శోకార్తో శోకేన సముచ్యతే త్వరితం॥ నవధాన్యైః పత్రఫలప్ర
సూనైః పూర్యతే వక్షైత్రైః। యస్య స్వప్నే సయాతం సంప్రాప్నోతి శ్రియం మహా
తీం॥ సితం ఫలం ప్రభూతం రక్తం ఫలందియుత హేమ్యాషాం। కనకస్య భవతి లాభ స్స
పద్మరాగస్యవా తేషాం॥ పశ్యతి సకలకమలాం శుచిచేలాముత్తమాం సగో నా
రీం। లక్ష్మీస్సరస్వతీ వా తస్య ప్రకటీభవతి నియతం॥ శుభ్రాంగరాగమండన వస
నందధతీ సయావనా యువతీ। యం పరిరంభతి స్వప్నే భవతి శ్రీస్తస్య సర్వతోభి
ముఖీ॥ కర్ణే కుండలయుగళం ముక్తాహారో గళే శిరసి ముకుటం। యస్యాంగదం
భుజయోః గేమహీం మహీయ్యసీం సపాలయతి॥ శుభ్రాంబరతా శోచన రోదన పరి
దేవనాని మరణంవా। యస్య స్వప్నే ససుఖం లభతే ఖలు సర్వతోభిముఖం॥ ఇందు
సమైస్సితకుసుమైరుపహారం యోగృహాంగణే ధత్తే। నరపతిలక్ష్మీః కురుతే కింకర
తాం స్వయం తస్య॥ శ్వేతే మణిపర్యంకే యోమణిసింహాసనే సముపవిశతి। పురు
షైస్సహాప్తవేషైస్సకలశుభం జాయతే తస్య॥ ఛేహ్యావాసో వసనం యస్య ప్రా
సాదమాసనం శయనం। జ్వలనజ్వాలాకులితం తస్య శ్రీస్సర్వతోభిముఖీ॥ యోవా
సోభరదక్షైర్విష్ఖైః పరివేష్టితస్స్వప్నే। దహనేన దహ్యతే ఖలు సశ్రేయోభా
జనం భవతి॥ యః కోశభవం పుష్పం ఫలంచ భక్షయతి వీక్షతే లభతే। కాంతాని
పేశలానిచ సవిందతే సంపదం సపది॥ వృష్టినిపాతం బహుళం ఛాయాకుసుమై
ర్యుతం నగశ్శైలం। జ్వలదనలం యః పశ్యతి భవేద్ధ్రువం తస్య వశ్యా శ్రీః॥ శకునించ
శుష్కం వా యస్స్వప్నే ససుధిగన్యబుధ్యేత। రూపవతీం సతులం భతే కాంతాం స
పరిచ్ఛదాం నియతం॥ గోవృషమానుషకుంజరతురగప్రాసాదశైలశృంగాణి। ఆ
రుహ్యాపిబతి సలిలం బుధ్యేత తద్దైవస్య పతిస్స్యాత్॥ శిరసి జ్వలినీ కేతుర్గ్రామపరీయ
స్థితో జాగరితః। సద్యోసౌ సప్తదినైర్మనుజస్సామ్రాజ్యమాప్నోతి॥ యః ఫణివృ
శ్చికకీటశ్వాపదవిహగైర్వితుద్యతే వశ్యం। నఖలు హృది భవతి భీత స్సవిత్తమాసా
దయేత్సద్యః॥ శాంతే పయసి స్నానం ఖేలనమవగాహనం కురుతే। పూర్ణాబంధుజ
నైస్సహ తస్య భవేద్రాజ్యధనవృద్ధిః॥ మాతాపితరౌ దేవాన్స్వాధూన్నృపతీంశ్చ
వీక్షతే మర్త్యః। ముక్తో రోగాద్ద్రోగీ విజయో భవతి ధ్రువం హి విపరీతే॥ సితవిహగ
స్సితతురగస్సితమాతంగస్సితభవనాని యః। పశ్యత్యారోహతి గిరిశృంగం యో వ
నస్పతిం ఫలితం। సఫలం చింతితమచిరాత్తస్య భవేత్తాన్యస్య సందేహః॥ క్షీరద్రు
మమధిరోహతి బహుళఫలంచ ఘనచ్ఛాయం। జాగర్తిచ పదత్రస్తస్స్వప్నే ప్రా
ప్నోతి శయనాని॥ స్వప్నేధ్వజశత్ర్వాన్గజరథదేవాయతనమంచకాదీనాం। వీక్షణ
మధిరోహణం వా నౄణాంధనవృద్ధయే భవతి॥ ప్రాకారబంధయానకకాంచనతోరణ

సితాతపత్రాణాం । దర్శనమప్యర్థిరోహిణాం ధాన్యకరో భవేన్నృణాం॥ ఉ
ల్కాగ్రహతారాణాంతటిత్వమార్చిషామమితభాసాం । గర్జితసజలఘనా
నాం ప్రదర్శనంతుభకరంభవతి॥ పానంజలధినదీనాం తరణంచ విలుంపనం ప్ర
సూనానాం। భక్షణమప్యాపాదీనాం యఃకురుతేభవతి తస్యశివం॥ మృణ్మయ
భాండావాప్తేర్ధనధాన్యతాపశుప్రాప్తిః।భూమితలంస్యాద్భూమేస్సాధాన్యం
తస్యమంత్రత్వం॥ పశుగోదోహంస్వముఖేవేణుపరివాదనంచయఃకురుతే। హా
సనంనిజపక్షాణాం ససంపదాయుజ్యతేసపది॥ మిత్రాణాంబంధూనాంస్వజనా
నాంచ గురువేషాణాం। వీక్షణమథమాలానాంధారణమిష్టంనృణాంస్వప్నే॥యో
వృషమత్తుంగసురభిమాతంగఖగపతీస్స్వప్నే। పశ్యత్యారోహతిలభతేధనంతు
భంభవతి॥ సింహాసనరత్నమయప్రాసాదనృపసురవిమానానాం।వీక్షణమధ్యా
రోహణం భవతివావృద్ధయేపుంసాం॥ ఓదనదధిదుగ్ధానాందర్శనమశనంధనాప్త
యేభవతి। భక్ష్యాణామపరేషామపి పరమాన్నస్యచస్వప్నే॥ కలహంస చాష
సారసచాతకనీలకంఠచక్రవాకానాం। ఆలోకనంనిశాదౌపుంసాంధనధాన్యదో
భవతి॥ శుకశారికాచకోరక పారావతబోధకక్రౌంచానాం । ఘనసంపత్తినిమి
త్తంప్రదర్శనంభవతిశబ్దోపి॥ యస్స్వప్నేతస్యహస్త్యగారామిషపుష్పనికరేషు । తస్య
ధనధాన్యవృద్ధిస్సిద్ధిర్వాభవతికసకస్య॥ క్షేత్రాణ్యాసవనాని ద్విజరాజమప్యస్య
గురూన్దేవాన్। యస్స్వప్నేపశ్యతిఘనసస్యైస్వసతేసభ్యశం॥ స్వప్నే సంపూర్ణని
శాకరదివకరయోర్బింబోదయంగతయోః। యస్యాద్దర్శనంస్యాద్రాజ్యశ్రీరాజతే
తస్య॥ వృక్షంసమీక్షతేయఃఫలితంవాపుష్పితంవాసభోభృతే। ఫలితేచింతితమపి
రాత్పుష్పితేత్వర్థసంవిత్తం॥ యఃపశ్యతిసర్వజ్ఞాంవిగతపూజాంస్వదేవతాం
వాపి। తస్యభవేద్ధనలాభోవిపులతరాబుద్ధిసిద్ధిరపిచ॥ స్వప్నే బడబాం క్రౌంచీం
లబ్ధ్వాయస్సవిజాగర్తి। విందతేసధనాంకన్యాం ప్రియంవదాం సదనం వా సః॥
పిబతిస్నిగ్ధందుగ్ధం భాండస్థితం సఫేనంయః। స్యాత్తస్య సోమపానం నియతం
మాంగళ్యమన్యదపిచ॥ లాభేప్రదర్శనేవాగోధూమానాం ధనాగమః పుంసాం।
యజ్ఞాగమోయవానాంవిద్యాధిగమస్సర్షపాణాంస్యాత్॥ నృపావిప్రాగావో
దేవాఃపితరశ్చలింగినస్స్వప్నే। యద్యద్వదంతిపురుషంతత్తత్తథ్యంతథైవస్యాత్॥
ధ్వజభుజసంఘారోహోజపాతరువల్లీగుల్మరోపణంభూమౌ। స్యాద్యస్యసోపి స
త్యంసతతంసంపూజ్యతేచలక్ష్మ్యా॥ సితవిహగైస్సితతురగైర్భవతిహియస్యదిగ్గ
మనం। త్రిదశవిమానైశ్చతథాసమహీమురరీకరోతికృత్స్నాం॥ యఃపశ్యతిచా
త్మానంస్వప్నేఘనసంవియత్యతిగాఢం। ధూమాయుతంవా నరస్తస్య విఘాతిర్మ

హతిభవతి॥ తే తే్రవారివిమోక్షే దర్శనలాభేచజాతధాన్యానాం। ఏషాంభవ
తిస్వప్నేహవనశుభమావహతితేషాం॥ గ్రహసంఖ్యానంచతథా పుంసాంసంప
త్తిసుఖహేతూ। గమనమగమ్యస్త్రీణాంయద్భక్షణమగమ్యవస్తూనాం॥ స్వప్నే
మృగవిహగానాంవారిస్థా మీనశంఖశుక్తీనాం। క్రమణంచేద్భవతిధ్రువంకల్యా
ణకరంసదాపుంసాం॥ గ్రసనంవసుధారాయా జలసేతోర్బంధనం విధత్తే యః।
వ్యాళస్యమౌళిగ్రహణంభవతిశుభంతస్యమనుజస్య॥ విద్రుమవల్లీ శంఖా న్శుక్తి
ముక్తాకపర్దకాన్యతః। యఃపశ్యతివిందతివా సవిత్తమాప్నోత్యచిరేణ॥ కేయూ
రహారమకుటగ్రైవేయకకంకణాంగుళీయాని। యఃకర్ణాభరణంవాలభతేపశ్య
తిశివంతస్య॥ నందావర్తస్వస్తికదీపపతాకాకుసుమవృత్తికాదూర్వాః। మాంగ
ళ్యాన్యపరాణ్యపియఃపశ్యతితస్యభవతిశుభం॥ వ్యంజనశృణికలశభాజన ముకుట
ధ్వజచామరాతపత్రాణాం। లాభస్స్వప్నేశరీరస్పర్శోవావృద్ధయేపుంసాం॥ కే
ళిగ్విలాసినీభిర్వస్త్రాలంకారమండనయుతాభిః। యస్యచ కన్యాలాభ శ్శుభసంప
త్తిర్భవేత్తస్య॥ కాముకచక్రిణీని స్వప్నేశస్త్రాఘాతధారాణి। పశ్యత్యథ లభ
తేయఃస్సక్రీడతి మేదినీచక్రే॥ కలధౌతకనకరూప్యమరకతవైడూర్యవజ్రశోణమ
ణీన్। నార్యఃపశ్యతిలభతేవా శుభలాభోభవతి తస్య భృశం॥ మానతులాభాం
డానాంశయనాసనధాన్యవస్త్రాణాం। స్వప్నేశుభాయలాభో దర్శనమపి శస్త
మే తేషాం॥ షష్టికశాలితండులముద్గకణాన్యోయుగంధసూనాన్నం। పశ్యతి లభ
తేభుంక్తేప్రిజాయతే తస్యధనధాన్యం॥ స్వప్నేదర్శనలాభోవీణాయా వాదనం
యదిస్యాత్॥ యోవ్యవహితవత్తూర్యరవంశృణోతిసంపద్భవేత్తస్య॥ వాపీకూప
తటాకగ్రామారామేషుయఃపరిభ్రమతి। దేవగృహేషుస్థానం రచయత్యచిరేణ
తస్యశుభం॥ సర్వజ్ఞప్రతిమాయాంయాత్రాస్నపనోపహారపూజాదీన్। యోవి
దధాతిస్వప్నేతస్యభవేత్సర్వతోవృద్ధిః॥ లక్ష్మీం సరస్వతీంవా దినోపాంతేవిబు
ధ్యతేప్రీతః। యోమంత్రిదేవతావాధ్రువంభవేత్తస్య ధనధాన్యం॥ స్వప్నేపీ
యూషరసంపురుషోయఃపిబతిదేవతాదత్తం।ఆరోహతిగరుడంవా వహతిమహీం
సువర్ణార్ణవయుతాం॥సురభిప్రసూనమాలామమ్లానాంవీక్ష్యతేయోలభతే।నిక్షి
పతికంఠపీఠే నృపలక్ష్మీస్స్వయంవృణుతే॥ ఆజ్యంప్రాజ్యంస్వప్నేయోవిందతి వీ
క్షతేవశస్తస్య। తస్యాభ్యవహరణంవాక్షీరాత్తేనైవసహశస్తం॥ గీతధ్వనిహసి
తసింహనాదహయహేషాః। యోభృశమాకారయతి ప్రజాయతేతస్యశుభలా
భః॥ మేరుగిరౌకల్పతరౌ భవనస్థానంకరోతివిలసతివా। శాడ్వలభూమిం పశ్యతి
సుఖధనసంపద్భవేత్తస్య॥ పునాగనాగకేసరచంపకశిరీషనికరాణాం। కుసుమ

ఫలసంకులానాం ప్రదర్శనంశోభనంస్వప్నే॥ కదళీఫలబదరీఫలదాక్షిమ నారంగ మాతులుంగానాం। స్పర్శనదర్శనవిటపారోహణకుసుమఫలావాప్తిరపిశోభనం స్వప్నే॥ ఏలాలవంగవల్లీకర్పూరఫలాని సురభిగంధీని। జాతీఫలంచ పశ్యేత యస్స్వాదయతి తస్యభవతిశివం॥ ప్లక్షశ్రీఫలబిల్వన్యగ్రోధకపిద్ధపాదపాస్స్వప్నే। అపరస్తుక్షీరతరుస్తత్ఫలలాభాశనంచశివం॥ ముచిళింద జాతివిచకల నవమల్లికా ప్రసూనాని। యోలభతేపశ్యతివాతస్యశివంసజాయతేసతతం॥ ఇక్షూలతాతాం బూలీదళానిభక్షయతివీక్షతేలభతే। యస్యమనుజస్యస్వప్నే హస్తగతం తస్య ధనధాన్యం॥

స్వప్నము రెండుప్రకారములు ఇష్టఫలదమని యనిష్టప్రదమని ఇటుపైని సుస్వప్నసూచితఫలములను జెప్పుచున్నారము.

వాతపైత్యశ్లేష్మవికారములవలనను చింతాసాంతత్యమువలననుబుట్టిన స్వప్నములకు ఫలములేదు- గావున వాటిని విడువవలయును. పైత్యోద్రేకము వలనబుట్టినస్వప్నము ఉన్నతమగుగిరులను గగనమును దాటినట్లగును. బంగారు రత్నములను వహ్నిని జూచినట్లును వాతాధిక్యమువలన గనబడును. నదీజలమున మునిగినట్లును తెల్లనిపుష్పములను జూచినట్లునగు స్వప్నముకఫోద్భవము- కోరబడినవస్తువు జూడబడినదియు కనబడుస్వప్నము చింతితోద్భవము. స్వప్నమందగుచరితము జెప్పుటకుశక్యముగాకుండునట్టి దానికి ఫలము లేదు- స్వప్నము మొదటి జామునందైన మూడుసంవత్సరములకు రెండవజామునందైన వత్సరమునకును ఉషఃకాలమందైన నొకపక్షమునకు నరుణోదయమందైన నేడుదివసములకును ఫలమగునని యాత్రేయులు.

సూర్యచంద్రుల తేజస్సునంతను మింగినట్లయిననాపురుషుడు దీనుడైనను సువర్ణార్ణవాదియుక్తమగు భూమికధిపతియగును- మనుష్యమాంసమును తన మాంసము నైనను బచ్చిది స్వేచ్ఛగ బుచ్చికొనిన సాంమ్రాజ్యపదవినొందును. సౌధాగ్రభాగమందు భుజించి సముద్రోదకమును తరించినట్లు స్వప్నమైన బురుషుడు దాసకులమునబుట్టినను నరపతియగును- లింగచ్ఛేదమగునట్లు స్వప్నమైన బురుషుడుతన భార్య యొక్కసౌఖ్యము నొందును- యోనిచ్ఛేదనమైనట్లు స్వప్నమైన స్త్రీతనభర్తతోమిగులసౌఖ్యమునొందును.

శస్త్రముచే జిహ్వాచ్ఛేదమగునటులైన క్షత్రియుడు రాజగును. ఇతరుడుమిగుల నాధిపత్యమునొందును. నరశిరోమాంసము దినినట్లయిన రాజ్యమును, పాదముల మాంసముదినినట్లయిన సువర్ణసహస్రమును, భుజముల మాంస

ముడిసినట్లయిన నేనూరు సువర్ణములలాభము నొందును. మద్యమును పచ్చిమాంసమును రక్తమును మెదడును దినినట్లయినను వీటిని బూసికొనటులయినను ధనవృద్ధియగును. చెరువులో తామరాకుపైని పరమాన్నము ఘృతఖండయుక్తముగ భుజించినటులయిన బూజ్యుడై రాజ్యము నొందును. మూత్రమును శుక్లశోణితములను దాగి యసహ్యపడకుండినటులైనను వంటికి బూసికొనునటులైనను జూచినటులైనను వృద్ధియగును. ఫలములనుభక్షించినట్లు పుష్పములను బూచినటులైనను వాడిగృహమునుపట్టకుండ లక్ష్మీసమృద్ధి యగును. ధనస్సు నెక్కుపెట్టి గుణధ్వనిచే దిక్కులుపిక్కటిలజేయుచు శత్రుసైన్యము సంహరించునటులైన శీఘ్రముగ సంపదనొందును. మేడమీదనైన పాలచెట్టుపైననుండి కనకరజతపాత్రలందు క్షీరసంబంధమగుదాని భక్షించిన రాజసంపద నొందును. నగ నగర గ్రామ వనసముద్రములతోగూడ భూమిని జానువులతో దాటినటులైన నీచుడైనను రాజగును. నావపైనెక్కి యీయొడ్డునుంచి యావలయొడ్డుకు సముద్రమునుదాటి జేరినటులైన ప్రవాసముజేసి యొకమాసమునకు కృతార్థుడై వచ్చును. ఒకవీరునిచే దాను జంపబడినటులైనను బురీషమును విషమును భక్షించినటులైనను నిర్భయుడై దాగినటులైనను భోగసమృద్ధిగలిగి రోగములనపుడే విడవబడును. రక్తముచే దడసిన శరీరముగలవాడైనను పెళ్లిపెద్దయినటులైనను ధనధాన్యసమృద్ధమగు రాజ్యలక్ష్మినొందును. రక్తనదియందు మునుగుచు రక్తపానముజేసినటులైనను శరీరమందు రక్తము స్రవించినటులైననుధనధాన్యసమృద్ధియగును. తన పేరును దానె జెప్పినటులైనను దనశిరస్సు పగిలినట్లయినను ధనధాన్యసమృద్ధిగలిగి సువర్ణసహస్రమొందును. రాజైన భూమిని భోగముల నొందును. స్త్రీ పురుషుడైనట్లును బురుషుడు స్త్రీయగునట్లును స్వప్నమైన కుటుంబవృద్ధిగలవాడగును. మదకరినెక్కి యొకనితో యుద్ధమొనర్చినటులై భయముబుట్టకుండిన శాశ్వతమగు లాభమునొందును. మూత్రపురీషలిప్తాంగుడై శ్మశానమధ్యమందు వాటియందున బవళించినటులై భయమునొందకుండిన కళత్రపుత్రరాజ్యసౌఖ్యమునొందును. తాను రాజైనట్లు పిదప చోరుడైనట్లు ధనము నొందినట్లును స్వప్నమై మేలుకొనిన ప్రాజ్యమగు రాజ్యమొందును.

తెల్లనిగోయానమునెక్కి తూర్పుదిశకైనను, యుత్తరదిశకైనజనుచు మేలుకొనిన యధికధనలాభమగును. కేశనఖరహితమైన సర్వావయవ సంపన్నమగు నెవనిశరీరముస్వప్నమందగపడు వాడు వృద్ధినొంది కళత్రమువలె లక్ష్మిచే ననుసరించును. ప్రాతఃకాలమందు జలకందాడుచున్నటులైనను యచటినుంచి

యొద్దుకువచ్చినట్లైన వ్యసనములనుంచి నివృత్తుడై ధనధాన్య సమృద్ధినొందును. శృంఖలాబద్ధుడై బాహుబంధన యుక్తుడగు నట్లైన వానికి పుత్రప్రాప్తియు రాజ్యలాభమును గలుగును. కష్టముచే ప్రతిష్ఠనొందును. లోతుగలనూతి వలన నుదకము వలన గర్తము సముద్రము తటాకము మొదలగునవి- వీటివలన భయము గలవాడయి బుద్ధిపూర్వకముగానయిన నవశుడైనను లేచి స్థలము నొందినటుల స్వప్నమయిన ధాన్యాభి వృద్ధియగును. దోమలు యీగలు యిదలగు నవి శరీరము నాచ్ఛాదించి భక్షించుచున్నట్లైన వాడు భృత్యుడయినను భార్యాసుఖము ధనసమృద్ధియు నొందును. నదులు సరస్సులు పద్మాను లుద్యానములు పర్వతములు మేడలు వీటిని శోకార్తుడెవడుస్వప్నమందున జూచునో వాడాశోకము వలన విముక్తుడగును.

నవ ధాన్యముల చేతను పత్ర ఫల పుష్పముల చేతను వజ్రముల చేతను పూర్ణములగు పాత్రలను జూచినటులయిన గొప్ప సంపద నొందును. పచ్చని దెబ్బని ఫలము తనకొకరిచ్చినట్లు స్వప్నమైన పద్మరాగయుక్తమగు సువర్ణలాభమగును. విలాసకులము, శుభ్రవస్త్రము గల యుత్తమస్త్రీని జూచినటులయిన లక్ష్మీలాభమైనను సరస్వతీ లాభమైనను గలుగును. తెల్లని గంధమాలంకారములు వస్త్రము వీటిని ధరించి యావ్వనము గలస్త్రీ స్వప్నమందెవని కౌగలించునో వానికి లక్ష్మీప్రాప్తియగును. కర్ణములందు కుండలములు కంఠమందు ముక్తాహారము తలను కిరీటము భుజములందంగదములు యెవనికి ధరించినటులగునో వాడు విస్తారమగు భూమిని పాలించును. తెల్లని వస్త్రము గట్టినట్లును దుఃఖించినట్లును రోదనము జేసినట్లును విలపించినట్లును తాను మృతి నొందినట్లును స్వప్నమైనవాడు సుఖము నొందును. చంద్రుని భంగిని తెల్లనగు పుష్పోపహారము తమ గృహాంగణమందు ధరించినట్లు స్వప్నమైన రాజ్యలక్ష్మీకింకరినై ప్రాప్తించును. రత్నశయ్యయందు పరుండినట్లును- సింహాసనమందు తగిన వేషముగలపురుషుడు కొలువు కూర్చుండినటులైనను సకల శుభములనొందును-దేహముననధరించిన వస్త్రమున తనమేడను ఆసనమున శయ్యను అగ్నిజ్వాలలగపడిన లక్ష్మీ ప్రాప్తియగును. ఎవడు శుభ్రమగు శ్రేష్ఠవస్త్రములచేతను జుట్టబడి వహ్నిచే గాల్చబడినట్లు స్వప్నమైనవాడు శ్రేయమునొందును. పట్టుబట్టపుష్పము ఫలము మనోహరములగు వీటినిధరించినట్లును భక్షించినట్లు నివి దొరికినటులైనను స్వప్నమైనవానికి సంపదగలుగును. అధికమగు వర్ణము, ఛాయ, పుష్పములును గల వృక్షములతో గూడిన బర్వతము ప్రజ్వలించుచుండిన వహ్ని వీటిని స్వప్నమం

దు జూచినవానికి లక్ష్మీవశ్యయగును- పక్షినైన పుష్పకము నైన నెక్కినట్లు స్వప్నమై మేలుకొనిన రూపవతి సాలంకారయయు నగునువతినొందును. గోవృషభము నరుడు గజమశ్వముమేడ శైలశృంగము వీటినధిష్ఠించి జలపానము జేసినట్లైన మేలుకొనిన వేగమె నరపతి యగును. తలపైని మండుచున్న ధ్వజముండగా గ్రామమందు దిరుగుచున్నట్లు స్వప్నమై మేలుకొనిన నేడుదినములకు సామ్రాజ్యమొందును. పాము తేలు కీటకము చిట్టపులి పక్షులు వీటిచే కరవబడి చిత్తభీతి లేకుండిన వాడధికమగు ధనలాభమును వేగముగా నొందును. నిర్మలోదకమందు స్నానము క్రీడయవగాహనము జేసినట్లైన బంధుజనులతో వానికి రాజ్యధనసమృద్ధి గలుగును- తలిదండ్రులను దేవతలను సాధులను రాజులను స్వప్నమందునజూచిన రోగిరోగములబాయును. నిరోగి విజయము నొందును. పక్షి గుఱ్ఱము గజము గృహము వీటిని తెల్లగ నున్నవిగా జూచిన బర్వతాగ్రమును ఫలములు గల వృక్షమునెక్కినట్లైన జింతితఫలము శీఘ్రముగనొందు నిందుకు సందియము లేదు. అధికమగు ఫలములు నీడగలిగిన పాలచెట్టునెక్కి పదములు వణకినట్లై మేలుకొనిన మంచిశయ్యల నొందును. ధ్వజము, శత్రువులు, గజములు, రథములు, దేవాలయములు, మంచకాదులు వీటిని స్వప్నమున జూచిన ధనవృద్ధిగలుగును. ప్రాకారము, యానము, స్వర్ణము, తూణీరము, శ్వేతఛత్రము, వీటిని జూచినట్లైన ధాన్యప్రాప్తిగలుగును. ఉల్కాగ్రహములు, తారలు, మెరుపులు, అధిక తేజస్సులు, గర్జితము, వర్షమును గలిగిన మేఘము వీటినిజూచిన శుభప్రాప్తియగును. సముద్రనదీజలములను ద్రావినట్లు తరించినట్లును స్వప్నమైన మంగళమగును. మట్టికుండ దొరికినట్లైన ధనప్రాప్తియగును. భూమిదొరికినట్లైన భూప్రాప్తియగును. మంత్రము దొరికినట్లైన మంత్రప్రాప్తియగును. గోవులు మొదలగు పశువుల పాలుపితికినట్లును వేణుగానము జేసినట్లును తనపక్షమగువారి సంహారమైనట్లును స్వప్నమైన సంపదగలుగును. మిత్రులు, బంధువులు, స్వజనము, సుందరమగు వేషములను ధరించినవారినిగా జూచినట్లును మాలికలను ధరించినట్లును స్వప్నమైన నిష్టసిద్ధియగును. ఉన్నతములగు వృషభము గోవు, గజము, గరుత్మంతుడు, వీటినిజూచినట్లైన యెక్కినట్లైన ధనమును శుభమును బొందును. సింహాసనమును రత్నమయసౌధమును రాజయానమును దేవవిమానమును వీటిని జూచినట్లైన యెక్కినటులయిన వృద్ధియగును. అన్నము, పెరుగు, పాలు, వీటినిజూచిన దినిన ధనప్రాప్తియగును. భక్ష్యములను పరమాన్నమును దినినటులయిన ధనప్రాప్తియగును- కల

హంస, చమరకాకి, సారసపక్షి, చాతకము, నెమలి, చక్రవాకము వీటినిజూచి న వీటిపలుకులను విన్న ధనధాన్యప్రాప్తి యగును. చిలుక, గోరు, చకోరము, పారవము, కోడి, క్రౌంచము, వీటినిజూచిన వీటినాదమువిన్న ధనసంపత్తి గలుగును. పగటియందైన రాత్రియందైన గృహమందు మాంసమందు పురీషమందు పరుండినట్లు స్వప్నమైన ధనధాన్య కనకవృద్ధియగును. క్షేత్రము ద్యానవనము బ్రాహ్మణులు రాజులు గురువులు దేవతలు వీరినిజూచినటులైన నధికముగు ధనము గలుగును. పూర్ణచంద్రుని, సూర్యుని, యుదయించినకాలమందు జూచి నటులైన రాజ్యలక్ష్మినొందును.

వృక్షమును ఫలయుక్తమగు దానిజూచిన నుత్తమవిత్తమగును. సర్వాఙ్గ సుందరగువానిని సిద్ధమగుపూజను శ్రేష్ఠదేవతను జూచినటులయిన ధనలాభము బుద్ధిసిద్ధియగును. ఆడగుఱ్ఱమును ఆడకోంగను గైకొని మేల్కొనిన ధనయుక్తయు ప్రియవక్తయునగు కన్యకను మంచిగృహము నొందును. సురగతో గూడి యెక్కినగు చక్కని పాలుకుండయందుండగ ద్రావినటులయిన వానికి సోమపానమైనను మిగుల మాంగళ్యమైనను సంభవించును. దొరకడము గాని జూడడముగాని గో ధూమమునకు ధనాగమము యవలకు యజ్ఞసిద్ధి ఆవాలకు విద్యాసిద్ధి యగును. రాజులు బ్రాహ్మణులు గోవులు దేవతలుపితరులు లింగధారులు వీరు స్వప్నమందగపడి యేమిజెప్పిదరది సత్యమగును. ధ్వజస్థాపనము జేసినట్లు భుజములధికములు గలిగినట్లు మందారవృక్షము లతలు గుల్మములు వీటిని భూమియందు పాతినట్లు స్వప్నమైన నది సత్యమగును. భుజోత్పత్తికి ఫలము లక్ష్మీప్రాప్తి. గుఱ్ఱములను పక్షులను తెల్లనగువాటిని దేవవిమానముల నెక్కి యొకదిక్కునకు నడచినట్లైన వానికి సకలభూమండలాధిపత్యము గలుగును.

ఎవడు స్వప్నమునం దంతరిక్షమందు మేఘములతో గలసినటులైనను ధూమముతో గూడినటులైనను జూచునతనికధికైశ్వర్యము గలుగును. క్షేత్రమందుదకము ప్రవహించినట్లు జూచిన నాజలము తనకు లాభించినటులైనను వానికి యజ్ఞశుభప్రాప్తియగును. గ్రహములను లెక్కపెట్టినటులైన సంపత్తియు నగమ్యాగమనము నభక్ష్య భక్షణమును జరిగినటులైన సుఖ ప్రాప్తియగును. గరుత్మంతునెక్కినటులైనభూలాభమునొందును. పరిమళపుష్పమాలవాడిపోనిది స్వప్నమందు నగపడిన దొరకిన కంఠమందు ధరించిన వాని రాజ్యలక్ష్మి వరించును. పాజ్యమగు నాజ్యముజూచిననది లాభించిన భోజనసుఖము స్త్రీ రాదియుక్తముగ నగును. గీతము, హసితము, సింహనాదము, హయహేష, వీటి

సేవచు వినునో వానికి శుభమగును. మేరుగిరియందు కల్పతరువందును నివసించి నట్లైనను పచ్చికబట్టను జూచినట్లైనను సుఖము ధనము సంపదయును గ లుగును. కుసుమఫలాదులచే వ్యాప్తములగు పొన్న, సంపెంగ, నాగకేసరము, శిరిష నీచెట్లను జూచినట్లైనను శోభనమగును. అనటి, రేగు, దాడిమ, నా రంజి, దబ్బ, వీటిఫలములను జూచినట్లైన ముట్టినట్లైన వీటి కొమ్మలపై నె క్కినట్లైన పుష్పఫలములను గైకొని నట్లైన శోభనమగును.

ఏలకులు లవంగములు కర్పూరము జాజికాయ సువాసనగల వీటిని జూ చిన వినిన మంగళమగును. జువ్వి మారేడు మఱ్ఱి వెలగ యీవృక్షములను మరి యును పాలుగలిగిన వృక్షములను స్వప్నమందు జూచిన వాటిఫలములు దొరికి నట్లైన దినినట్లులయిన శుభమగును. బొండుమల్లియలు జాతీపుష్పములు మదన బాణములు నవమల్లికాపుష్పములు వీటిని జూచినను దొరికినట్లులయినను శుభమ గును. చెరుకు తమలపాకులు వీటినిజూచిన భక్షించిన హస్తగతమైన ధనధా న్యసిద్ధియగును.

అథా నిష్టఫలసూచక స్వప్నాన్యుచ్యంతే॥ నాభేరన్యత్రగాత్రే తృణత రుకనుమపోద్భవ స్నేహపాశం క్రీడాయానోపభోగః ఖర మహిష సృగాల వ్యాళగృధ్రైశ్చ సత్త్వైః। స్నానంస్యాల్లేపనంవా కలుష జలమయైర్గోమయైర్వా స్నేహపంకైర్ద్రుగ్భేదోదంత బాహుప్రపతన మథవానర్థశోకప్రదాతే॥ గీత క్రీడిత భూషిత ప్రహసిత ప్రేంఖోళితాచ్ఛేదితాదర్కేందు ధ్వజతారకానిపత నం స్రోతోవహాధోగమః॥ రజ్జుచ్ఛేద వితాప్రపాత జననీ గాత్రప్రవేశస్తథా స్వప్నేకాక విఘూర్ణ నంచశిరసి క్లేశాయయానర్థదం॥ శ్మశ్రు కేశ నఖైర్ఘ్యై క ల్పనా వానరీ విక్రృత నార్యుపాసనం। రక్తవస్త్రమనుజాంగ మర్దనం రోగమృ త్యుభయశోక తాపదం॥ స్థలపశుమృగ కోష్ఠే స్వంకుయశ్చాండజానాం ప్లవన ముదక రాశౌ వాదివా హోత్సవోవా। సరసిజజతుభాండ క్రీడనం నర్తనంవా మలినవివసనత్వం చారుశోకప్రదాని॥ పుంద్రస్యనాశే సుహృదాంవియోగ శ్ఛేద శ్చ పాణ్యోశ్చ రుజావహాశ్చ। ప్రాసాదవేశ్మాద్రి గుహావతార స్వప్నేషు నే ష్టాఇతి సంప్రదిష్టా॥ మిత్రావాప్తిస్స్యాద్వికోశాసిలాభే వైశ్యోరాజా యోవదే త్తస్యనామ్నా। సర్వేకర్ణంనాసికాంవాప్రవిష్టైతచ్ఛేదస్యాద్వోపునశ్చానుబంధః॥ ఖరోష్ట్రి మహిషంవాపి వరాహంచాధిరోహతి। తత్రస్థస్సువిబుద్ధ్యేత శీఘ్రంమృ త్యుమవాప్నుయాత్॥ చోరకృద్ధష్టభ వ్యాఘ్రికేశబంధశ్చ కర్షణం। మాహిషం వ్యాధికృత్స్వప్నే రాజపీడాథవాభవేత్॥ శుష్కంకంటకినం వృక్షమేకాకీయో

ధిరోహతి। తత్రస్థస్తువిబుధ్యేత మృత్యుం శీఘ్రమవాప్నుయాత్॥ కేశాయస్యవిశీర్యంతె దంతాశ్చైవపతంతివై। ధనానాశో భవేత్తస్య పీడావాపి శరీరజాః॥ ఖరాదిభిర్యుక్తరథై ర్యాయాద్వాదక్షిణాముఖం। రక్తవస్త్రధరస్స్వప్నేరక్తమాల్యానులేపనం। కూపె పంకితతన్వాపి వ్యాధితోవాపి మృత్యుభాక్। అభిద్రవంతి యంస్వప్నే శృంగిణో దంష్ట్రిణో మృగాః। వానరోవావరాహోవా భవేద్రాజకులాద్భయం॥ అభ్యంజితస్సతైలేన పయసాపిఘృతేనవా। స్నేహేనవా తథాన్యేన వ్యాధిస్తస్యవినిర్దిశేత్॥ పీతాంబరధరానారీ పీతగంధానులేపనా। ఉపగూహతియంస్వప్నే నిందాతస్య వినిర్దిశేత్॥ ఏరండకింశుకజపాకరవీరమనర్థకృత్॥ దీర్ఘమేఘం మహావర్ష మన్నతౌ కలహప్రదం॥ తుంబికూశ్మాండ తక్కోలల పటోల్యాది లతాఫలం। బృహత్యాదిఫలంస్వప్నే భింద్యాద్వంశశిశోర్మృతిః॥ దేవతాశ్చద్విజాగావోలింగినఃపితరస్తథా।యత్రనృత్యంతి గాయంతి రటంతిచ చరంతి చ। ఆస్ఫోటయంతి ధావంతి దేశస్తస్య వినశ్యతి॥ రవేర్ధ్వజస్యచంద్రస్య ప్రాసాదానాం వనస్పతేః। చైత్యప్రతిమయోః పాతస్స్వప్నే రాజవినాశనం॥ భింద్యాద్వనస్పతేశ్శాఖాం రాజవల్లభనాశనం॥ పాశబద్ధంగృహందృష్ట్వా స్వప్నే గ్రామభయంభవేత్॥ గ్రామంస్వప్నే పాశబద్ధం తద్దేశాధిపతేర్భయం॥ అన్యాన్యప్యనుభుక్తాని కార్యోన్నేయానిపండితైః॥

ఇటుమీద ననిష్టఫలసూచక స్వప్నములను జెప్పుచున్నారను. నాభికంటె నితరశరీరమందు తృణము,వృక్షము, పుష్పము వీటివలనబుట్టినచమురు రాసికొనినట్లును వీటితాళ్లకట్టబడినట్లును గర్దభమహిషజంబుకసర్పములనెక్కిక్రీడించినట్లును గోమయము చమురుబురదవీటిచేకలుషమగుజలములో మునిగినట్లు ఇవివంటికిరాసినట్లైన దృష్టిభేదమైనట్లును దంతములు బాహువులుపడినట్లైన ననర్థమైన మరణమైన శోకమైనను గలుగును. గీతము క్రీడ యాలంకారము నగవు దాటడము గలిగినట్లైన సూర్యచంద్రధ్వజతారకలు పడినట్లును ప్రవాహములో మునిగిపోయినట్లును పట్టినదారిడుదెగి క్షితియందుబడినట్లును తల్లిశరీరమందు ప్రవేశించినట్లును కాకధ్వని వినినట్లును అదితలనెక్కినట్లును స్వప్నమైన కష్టము రోగము ననర్థమును సంభవించును. ముఖరోమములు,కొప్పు,గోళ్లుమిగులబొడవైనట్లు, కోతిభంగివికృతిగలస్త్రీని సేవించినట్లు,ఎఱ్ఱనిబట్టగట్టిన నరుడుశరీరమందు కొట్టినట్లు,స్వప్నమైన రోగమృత్యుభయశోకములగును. భూమియందు పశుమృగపక్షిరోమములచే తనకు నాశమైనట్లును పక్షులనెక్కి యుదకముపైనితేలి యాడినట్లును వర్షమున దడిచినట్లును పద్మములు, లక్కపాత్రలను బ

ట్టిక్రీడించినట్లును నటించినట్లును మలినవస్త్రము గట్టినట్లును దిగంబరుడైనట్లు నుస్వప్నమైన శోకమగును. బొట్టు తుడిచినటులైన మిత్రవియోగమగును. హస్తములు ఛేదించినటులైన రోగమగును. మేడలు, యిళ్లు, పర్వతములు, గుహలు, వీటివల్లనుండి దిగువకుజారినట్లు స్వప్నమైన యనిష్టఫలమగును. వరలేనికత్తి దొరికినటులైన మిత్రవియోగమగును. సర్పము కర్ణమందైన నాసికయందైన ప్రవేశించినట్లు స్వప్నమైనవాటికి ఛేదమగును. గాడిద లొట్టెట పోతుపంది వీటినెక్కి దిగకుండ మేల్కొనినవానికి శీఘ్రముగ మృత్యువగును. చోరులు కోరలుగల వృషభములు వ్యాఘ్రములు మహిషములు వీటిచే బాధితులై కేశాకర్షణమైనటులైన వ్యాధియైన రాజపీడయైన యగును. ముళ్లుగలిగిశుష్కమగువృక్షమునెక్కి గానెక్కి దిగకుండ మేల్కొనిన శీఘ్రముగ వానికి మృత్యువగును. కేశములూడినట్లును దంతములూడిపడినట్లును స్వప్నమైన ధనహానియుశరీరపీడయునగును. గాడ్దెల బూన్చినట్టి యరిద మెక్కి దక్షిణాభిముఖముగ జనినటులైననురక్తవస్త్రమాల్యాను లేపనుడై కూపమందుబడి పంకిలాంగుడైనటులైనను వ్యాధితుడైన మృతుడైనయగును. కొమ్ములు కోరలుగల మృగములైన వానరులైన పందులైన యెదిరించి పీడించినటులైన రాజభీతిగలుగును. తైలము, ఉదకము, నేయి మరియునేదియయిన చమురుచే నన్నముచే తలయంటికొనినట్లు స్వప్నమైన వ్యాధి కలుగును. పీతాంబరగంధానులేపనయగు నారి కౌగలించినటులైన నిందయగును. ఆమదము, నొాదుగ, మందారము, గన్నేరు, వీటినిజూచినటులైన యనర్థమగును. పెద్దమేఘమునకాలమందగు నధికవర్షమును, ఆనప,గుమ్మడి, పుచ్చ,పొట్ల మొదలగు తీవలకాయలను వాకుడుములగ మొదలగువాటికాయలను స్వప్నమందుజూచినవంశకరుడగుశిశువుప్పుతుడగును. దేవతలు బ్రాహ్మణులు గోవులు లింగధాగులు పితృదేవతలెచట నటించుచు పాడుచు ధ్వనిజేయుచు మల్లజరచుచు పరుగెత్తుచు సంచరింతురా దేశమునశించును.

బ్రాహ్మణుడు చంద్రుడు మేడ వనస్పతి రచ్చచెట్లు దేవతాప్రతిమలు బడినట్లు స్వప్నమైన రాజనాశనమగును. వనస్పతిశాఖను ఛేదించినటులైన రాజవల్లభుడునశించును. తాడిముచేగట్టబడిన గృహముమునుబూచిన గ్రామమునకుభయమగును. గ్రామము పాశబద్ధమగునటుల జూచిన దేశాధిపతికి భయమగును. మిగిలినకొన్నియనుభూతములగువాటిని గ్రంథముచేపండితులు పోల్చదగియుందును.

అథశాంతివిధిర్వ్యాఖ్యాయతే॥ స్నాత్వాతిలాన్నవాసోగాదద్యాత్తిప్తేతవాగ్యతః। సుస్వప్నంబహునోబ్రాయా ద్దుస్వప్నంగోపయేన్నరః॥ దుస్వప్నం

శ్రీవమేద్వాచాపశ్యేద్యద్వాపునస్స్వపేత్॥ ఉపోష్య పాయసం కృత్వా రాత్రిసూక్తేన ప్రత్యృచం। హుత్వా శేషం తతో లక్ష్మీయాదన్యాన్నైన ద్విజాశనం। జపేద్వాజాతవేదస్య శతమైంద్రద్వయం తు వా॥ నోర్ధ్వం స్వప్యాచ్ఛోభనే స్వప్నదృష్టే పశ్చాద్దృష్టే యస్సుపాకం విధత్తే। శంసన్నిష్టం తచ్చ సాధుద్విజేభ్యస్తైరాశీర్భిః పూజయేయుర్నరేంద్రాః॥ భూపః స్వపనం న చాన్యకథనం గంగాభిషేకో జపహోమం తిస్వచ్ఛజలాభిషేచనమతిపాత్రేభ్యస్తు రాంస్వస్థధీః। విప్రేభ్యశ్చ తిలాన్న హేమవసనస్నైః పూజా యథాశక్తితః పుణ్యం భారతకీర్తనం చ కథితం దుస్స్వప్నవిచ్ఛిత్తయే॥ గంగాభిషేకో గంగాజలధారిణాం। అథవా శుద్ధజలేన స్నాత్వా దానాని కుర్యాత్॥ వినాయకః కర్మవిఘ్నసిద్ధ్యర్థం వినియోజితః। గణానామాధిపత్యేన రుద్రేణ బ్రహ్మణా తథేతి యాజ్ఞవల్క్యః॥ ఏవం వినాయకస్యాధికారముక్త్వా జ్ఞాపకహేతుప్రదర్శనార్థమాహ స ఏవ॥ తేనోపదిష్టో యస్తస్య లక్షణాని నిబోధత। స్వప్నేఽవగాహతేఽత్యర్థం జలం ముండాంశ్చ పశ్యతి। కాషాయవాససశ్చైవ క్రవ్యాదాంశ్చాధిరోహతి। అంత్యజైర్గర్దభైరుష్ట్రైస్సహైకత్రావతిష్ఠతి। వ్రజన్నపి తథాత్మానం మన్యతేఽనుగతం పరైః। విమనా విఫలారంభస్సంసీదత్యనిమిత్తతః। తేనోపసృష్టో లభతే న రాజ్యం రాజనందనః। కుమారీ న చ భర్తారమపత్యం గర్భమంగనా। ఆచార్యత్వం శ్రోత్రియశ్చ న శిష్యోఽధ్యయనం తథా, వణిగ్లాభం న చాప్నోతి కృషిం చాపి కృషీవలః॥ స్నపనం తస్య కర్తవ్యం పుణ్యేఽహ్ని విధిపూర్వకం। గౌరసర్షపకల్కేన సాజ్యేనోత్సాదితస్య చ। సర్వౌషధైస్సర్వగంధైః ప్రలిప్తశిరసస్తథా। భద్రాసనోపవిష్టస్య స్వస్తి వాచ్యా ద్విజాశ్శుభాః। అశ్వస్థానాద్గజస్థానాద్వల్మీకాత్సంగమాద్ధ్రదాత్। మృత్తికాం రోచనాం గంధాన్గుగ్గులుం చాప్సు నిక్షిపేత్। యా ఆహృతా హ్యేకవర్ణైశ్చతుర్భిః కలశైర్హ్రదాత్। చర్మణ్యానడుహే రక్తే స్థాప్యం భద్రాసనం తతః। సహస్రాక్షం శతధారమృషిభిః పావనం కృతం। తేన త్వామభిషించామి పావమాన్యః పునంతు తే। భగం తే వరుణో రాజా భగం సూర్యో బృహస్పతిః। భగమింద్రశ్చ వాయుశ్చ భగం సప్తర్షయో దదుః। యత్తే కేశేషు దౌర్భాగ్యం సీమంతే యశ్చ మూర్ధని। లలాటే కర్ణయోరక్ష్ణోరాపస్తద్ఘ్నంతు సర్వదా। స్నాతస్య సార్షపం తైలం స్రువేణౌదుంబరేణ తు॥ జుహుయాన్మూర్ధని కుశాన్సవ్యేన పరిగృహ్య తు। మితశ్చ సంమితశ్చైవ తథా శాలకటంకటౌ। కూష్మాండో రాజపుత్రశ్చేత్యంతే స్వాహాసమన్వితైః। నామభిర్బలిమంత్రైశ్చ నమస్కారసమన్వితైః। దద్యాచ్చతుష్పథే శూర్పే కుశానాస్తీర్య సర్వతః। కృతాకృతాంస్తండులాంశ్చ పలలౌదనమే

వచాసుతాన్సర్వాన్ప్రకల్ప్యాంస్తథైవామాస్తాంస మే తాశ దేవతు॥ పుష్పంచిత్రంసుగంధం చాసురాంచత్రివిధామపి। మూలకంపూరికాపూపాం స్తథైవాండ్రేరకాస్రజః। దధ్యన్నంపాయసంచైవ గుడపిష్టంసమోదకం। ఏతాంత్సర్వాంత్సమాహృత్యభూమౌకృత్వా తతశ్శిరః। వినాయకస్యజననీ ముపతిష్ఠేత్తతోంబికాం। దూర్వాసర్షపపుష్పాణాం దత్వార్ఘ్యంపూర్ణమంజలిం। రూపం దేహియశో దేహిభగంభవతి దేహిమే। పుత్రాన్దేహిధనం దేహిసర్వాన్కామాంశ్చ దేహిమే। తతశ్శుక్లాంబరధరశ్శుక్లమాల్యానులేపనః। బ్రాహ్మణాన్భోజయేద్దద్యాద్వస్త్రయుగ్మం గురోరపి। ఏవంవినాయకంపూజ్యగ్రహాంశ్చైవవిధానతః। కర్మణాంఫలమాప్నోతి శ్రియమాప్నోత్యనుత్తమామితి॥

యోమేరాజన్యుజ్యోవా సఖావాస్వప్నే భయంభీరవేమహ్యమాహ। స్తేనోవాయోదిప్సతినోవృకోవాత్వం తస్మాద్వరుణ పాహ్యస్మానితిబుచా సూర్యోపస్థానే దుస్స్వప్ననాశః॥ అథ స్వప్నస్యనిర్వేదేభుంజతశ్చ రేవతః। ఉభాతా బస్రీరస్యతణతి బుగ్జపాద్వా। యద్వా శ్రీమహాభారతభగవద్గీతాస్తవరాజానుస్మృతి గజేంద్రమోక్షశ్రీమద్రామాయణాదిపాఠోవా దుస్స్వప్న నాశకః॥ తదుక్తం శ్రీమహాభారతే॥ భజంతం గజరాజాన మవదన్మధుసూదనః। యేమాం త్వాంచ సరశ్చైవ గ్రహస్యచవిదారణం। గుల్మకీచక వేణూనాం రూపంచైవసమాశ్రితం। అశ్వత్థం భాస్కరంగంగాం నైమిశారణ్యపుష్కరం। ప్రయాగంబ్రహ్మతీర్థంచ దండకారణ్యమేవచ। పురాణం రామచరితం భారతాఖ్యానముత్తమం। విభూతించ కురుక్షేత్రం గరుడం మేరుపర్వతం। రూపంకాంచనగుల్మానాం రూపంమేరోస్సుతస్యచ। యేస్మరిష్యంతిమనుజాః ప్రయతాస్థిరబుద్ధయః। దుస్స్వప్నో నశ్యతే తేషాం సుస్వప్నశ్చభవిష్యతీతి॥

శ్రీదంతులూరి నారాయణ గజపతి రాజవిరచితాధ్వస్య। మునిభావబోధినీయం వితనోతు పరాంముదంసదావిదుషాం॥

అసూయా మతివాచాలా హరిష్యంతీతిశంకయా। సదుక్తిరత్నహారస్య మంజూషైసా సుయాకృతా॥

ఇతిశ్రీమద శేషస్తుతిపాత్రవిశ్వామిత్రగోత్ర ధనంజయసగోత్ర సుంత్రక్షత్రకులపవిత్ర శ్రీదంతులూరి నారాయణరాజపుత్రేణారుంధతీసమాన పాతివ్రత్యాన్యగణిత సుగుణమణినికురుంబ శ్రీబుచ్చివేంకయాంబా గర్భశుక్తి ముక్తిరత్నేన శ్రీనారాయణ గజపతిరాజన్యేన విరచితాయాం మునిభావబోధిన్యాఖ్యాయామాచారకాండే స్మిన్నాహ్నికో నామ ప్రథమోధ్యాయః॥

నువ్రజేత్॥ యమః॥ నపృచ్ఛేత్ గోత్రచరణం దేశంనామకులంశ్రుతం। అధ్వనో
భ్యాగతంవిప్రం భోజనార్థముపస్థితం॥ విష్ణుపురాణే॥ దినేతిథౌతువిముఖేగతేయ
త్పాతకం నృణాం। తదేవాష్టగుణం పుంసాంసూర్యోఢేవిముఖేగతే విముఖేసూ
ర్యాస్తైఇత్యర్థః। రాత్రౌస్థలాంతర గమనాసంభవా ద్దివాప్రతిషేధనాదతీవపా
తకమిత్యుక్తం। తతోతిథింప్రతీక్ష్య పాదౌప్రక్షాళ్యసంపూజ్యాయాన్నం నివేద్య
కస్మైచిద్విప్రాయవా సనకాదిమనుష్యేభ్య ఇదంనమమేత్యుక్త్వా దద్యాత్ ।ఇదం
నిత్యశ్రాద్ధాత్ప్రాగితి హరిహరః॥ విష్ణుపురాణే॥ ఇష్టోవాయదివాద్వేష్యో మూ
ర్ఖఃపండితఏవవా। సంప్రాప్తోవైశ్వదేవాంతే సోతిథిస్స్వర్గసంక్రమః॥

## మనుష్యయజ్ఞము-

విద్వాంసుడగుబ్రాహ్మణుడెవరిగృహమునకు వచ్చునో సకలదేవతలును
వాడింటికివచ్చెదరు ప్రాణదేవతలును సంతుష్టినొందుచున్నవనిహారీతుడు అతిథి
యొక్క-స్వాగతముచేతనగ్ని- యాసనదానముచేనింద్రుడు- పాదప్రక్షాళనచేత
పితృదేవతలు- భోజనముచేబ్రహ్మయునుప్రీతులగుదురనిబృహస్పతి- రేపటిదినుండ
నివాడనగా నొకతిథికంటె నధికముండనివాడతిథి- వేదాధ్యాయుడగు శ్రోత్రి
యుడనతిథి- వీరలుబ్రహ్మలోకము నొందనిచ్ఛగల గృహస్థుకు పూజనీయులు-
శ్రోత్రియుడగు తృప్తుడయినయతిథితో పొలిమేరమట్టుకును కూడా వెళ్లవలెనని
యాజ్ఞవల్క-

భోజనార్థము వచ్చిన బ్రాహ్మణునియొక్క- గోత్రమును దేశమును నా
మమును కులమును శ్రుతమునునడుగగూడదని యముడు. పగటియందున విగ
స్పృహుడై యతిథి వెళ్లుటచే నెట్టిపాతకము గృహస్థునకగునో దానికెనిమిది రె
ట్లుదోషము రాత్రివిముఖుడై యతిథి వెళ్లిన బొందగలడని విష్ణుపురాణము. రా
త్రియందున స్థలాంతర గమనమునకవకాశము లేనందున బగటియందతిథి ప్రతి
షేధముకంటె రాత్రియందధిక పాతకమొందునని జెప్పిరి.

అటుపైని యతిథిని ప్రతీక్షించి పాదములనుగడిగి యర్చించి యన్నద్రవ్య
మునిచ్చియైన లేకనొకరియొక విప్రునకైనను సనకాది మనుష్యులకొరకిది నాదిగా
దని తనస్వత్వపరిత్యాగమునుజేసి యివ్వవలెనిది నిత్యశ్రాద్ధమునకు ముందుగాజే
యుమనిహరిహరులు. ఇష్టుడైన విరోధియైన మూర్ఖుడైన పండితుడైన వైశ్వదే
వాంతమందువచ్చినవాడతిథి- వానిబూజించిన స్వర్గమిచ్చునని విష్ణుపురాణము.

## గోగ్రాసః॥

గవాంగ్రాసంచ కుర్వీతనిత్యమేవ సమాహితః। గవాంకండూయనంస్ప

ర్థం గ్రాసమాహ్నికమేవ చేతి ఋష్యశృంగః॥ మంత్రస్తు॥ సౌరభేయాస్సర్వహితాః పవిత్రాః పాపనాశనాః। ప్రతిగృహ్ణంత్విమంగ్రాసం గావస్త్రైలోక్యమాతరః। సురభేత్వం జగన్మాత దేవి విష్ణుపదేస్థితా। గ్రాసం గృహాణ మద్దత్తం గోమాతస్త్రాతుమర్హసి॥ తృణోదకేనసంయుక్తం ప్రదద్యాద్యోగవాహ్నికం। కపిలాశత దానస్యఫలంవిందేన్నసంశయ ఇతిభవిష్యోత్తరపురాణే॥ గవాహ్నికమహోరాత్రపర్యాప్తంగోభక్ష్యం॥ మంత్రస్తు॥ పంచభూతేశివేపుణ్యేపవిత్రే సూర్యసంభవే। ప్రతీచ్ఛేమం మయాదత్తం సౌరభేయినమోస్తుతే॥

## గోగ్రాస విధానము.

నిత్యమును గోవులకు గ్రాసమును సమాహితుడైయివ్వవలెను. గోవులను గోకుట స్పృశించుట గ్రాసమిచ్చుట ఇవియాహ్నికమనిఋష్యశృంగులు. సౌరభేయులు సర్వమునకు హితులు పవిత్రులు పాపమును బోగొట్టువారలు గోవులు మూడులోకములకును తల్లులు యీగ్రాసమును గ్రహించవలెను. ఓసురభీదేవి నీవుజగన్మాతవు విష్ణుపదమందుండినదానవు- నాచేనివ్వబడినగ్రాసమును గ్రహించుము. ఓగోమాతనన్నురక్షించుటకుతగుదువనిమంత్రము. తృణోదకముతోగూడినగవాహ్నికమివ్వవలెను. కపిలాగోశతదానతుల్యఫలమునునిస్సందేహముగ నందువలననగునని భవిష్యోత్తరపురాణమందు- గవాహ్నికమనగా గోవుకొక పగలును రాత్రికి సరిపడుభక్ష్యము.

ఓమంగళప్రదురాలా పంచభూతస్వరూపురాలా, పవిత్రమైనదానా, పుణ్యమైనదానా, సూర్యునివలనబుట్టినదానా, ఓసౌరభేయి నాచేనివ్వబడిన దీని ప్రతిగ్రహించుమని మంత్రము.

## భోజనవిధిః॥

బాలవృద్ధగర్భిణ్యాతురసఖీబాంధవాదీన్సంభోజ్య పాణిపాదం ప్రక్షాళ్య శుచౌదేశేరహసి। చతురశ్రం త్రికోణంచ వర్తులంచార్ధచంద్రకం। కర్తవ్యమానుపూర్వ్యేణబ్రాహ్మణాదిషు మండలమితివ్యాసోక్తమర్ధచంద్రం శూద్రస్యాభ్యుక్షణం మతమితిశంఖోక్తేరభ్యుక్షణంవాకృత్వా। పంచాశత్పలికం కాంస్యంద్వ్యధికం భోజనాయవై। గృహస్థైస్తు సదాకార్యమభావే హేమరౌప్యయోరిత్యత్రిప్రోక్తం కాంస్యాదిపాత్రే పరివిష్టమన్నం ప్రాఙ్ముఖోపవిష్టో మౌనీ ఘృతాక్తంప్రోక్ష్య ధర్మరాజాయనమః। చిత్రాయనమః। చిత్రగుప్తాయనమః। ప్రేతేభ్యోనమఇతి దక్షిణతో బలిందత్త్వా జలంప్రాశ్య దేవతీర్థేన సాంగుష్ఠేన తూ

ష్టే౽నమశ్నీత్యేవవా పంచగ్రాసాన్ప్రాశ్య యథాసుఖంభుంజీయాత్। నోచ్ఛిష్టం గ్రాహయేదాజ్యంజగ్ధ్వాశిష్టంనసంత్యజేదిత్యాదిత్యపురాణే॥ భోజనంతునని శ్శేషం కుర్యాత్ప్రాజ్ఞః కథంచన। అన్యత్రదధ్నఃక్షీరాజ్యక్షౌద్రసక్తుభ్యఏవచ॥ ఇతి పులస్త్యః॥ నైకహస్తేనచజలం శూద్రేణావర్జితంపిబేదితివృద్ధమనుః॥ ఇత్యాదిద్వి జవచ్ఛూద్రేజ్ఞేయం॥ భుక్త్వోచ్ఛిష్టంసమాదాయ స్వస్మాత్కించిదాచమన్। ఉచ్ఛిష్టభాగధేయేభ్యస్సోదకేనిర్వపేద్భువిశేషజలం॥ భోజనాంతే పునర్జలంప్రాశ్య శేషంసించేత్। మంత్రస్తు॥ రౌరవేపుణ్యనిలయేపద్మార్బుదనివాసినాం। అర్థినాముదకందత్తమక్షయ్యముపతిష్ఠతు॥ తతోముఖపాణిపాదంప్రక్షాళ్య ద్విరాచమ్య జానునీస్పృష్ట్వా పునరాచమ్య। అగస్తిర్గ్నిర్బడబానలశ్చ భుక్తంమయాన్నం జరయత్వశేషం। సుఖం మమైతత్పరిణామసంభవం యచ్ఛత్వరోగం మమచాస్తుదేహే॥ అగస్తిం కుంభకర్ణంచ శమీంచబడబానలం। ఆహారపరిణామార్థంస్మరామి చవృకోదర మిత్యుదరం సంస్పృశ్య। తాంబూలంప్రాశ్య ద్విజవద్వా పురాణ శ్రవణస్వజాతివృత్త్యాధర్మార్థ కామసేవనేనావశ్యవహశ్శేషంనయేత్॥ భక్ష్యా భక్ష్యపేయాపేయ పచనరచనాదీని ప్రథమాధ్యాయేస్మాభిర్విస్తృతాని తస్మాద ద్యన విస్తృతాని॥

## భోజనవిధానము.

బాలులను, వృద్ధులను, గర్భిణీస్త్రీలను, రోగులను, సఖులను, సంబంధులను ముందుగ భుజింపజేసి పాణి పాదములను గడిగి శుభస్థలమందు రహస్యమందు వ్యాసోక్తప్రకారముగా నర్ధచంద్రాకారమండలమునర్చికొని లేక శంఖునిచేత చెప్పబడిన ప్రోక్షణమైననుజేసి యేబదిరెండు పలములయెత్తనగా 3౨౦ గుంజములొకపలమట్టి ౫౨ పలములెత్తుకంచు కంచమైననులేక వెండిబంగారు కంచములయందైనను గృహస్థు భుజించవలెనను యత్రివాక్యప్రకారము కాంస్యాదిపాత్రలయందుంచబడిన యన్నమును ప్రాఙ్ముఖముగగూర్చుండి మౌనియై నేయిచేతను తడపబడినది ప్రోక్షించి ధర్మరాజుకొరకు చిత్రగుప్తులకొరకు ప్రేతలకొరకు నమస్కారమని దక్షిణదిశను బలినిచ్చి జలప్రాశనమునుజేసి యంగుష్ఠముతోగూడిన దేవతీర్థముచేతను మౌనముగా నన్నమును నైదుగ్రాసములను ప్రాశనజేసి సుఖము నతిక్రమించకుండగ భుజించవలెను.

ఉచ్ఛిష్టమగు నాజ్యమును గ్రహించరాదు భక్షణశేషమును విడువరాదని యాదిత్యపురాణమందు- దధిక్షీరాజ్యమధుసక్తువ్యతిరేకములగుభక్ష్యములను నిశ్శేషముగ ప్రాజ్ఞుడుభుజించరాదని పులస్త్యులు- శూద్రులచేతను తేబడినదయు నే

కహస్తముచేతనున్ను జలపానమొనర్చరాదని వృద్ధమనువు-ఇవిమొదలగుధర్మ ములను శూద్రుడుద్విజులవలెనే నాచరించవలెనని తెలియదగును.

భుజించి యన్నియుచ్ఛిష్టపదార్థములనుంచిన్ని యించుకంతదీసి యా చమించియుచ్ఛిష్టభాగమునుభుజించువారలకునుదకముతో భూమియందివ్వవల యునని దేవలుడు- భోజనానంతరమందు దిరుగజలప్రాశనజేసి శేషమును సేచ నజేయవలయును- అపుణ్యస్థానమయినరౌరవమందు పద్మార్బుదసంఖ్యగలవార లై యుదకార్థులగువారలకీయుదకమివ్వబడెను- అక్షయ్యముగాకయని మం త్రోచ్చారణజేయవలెను. అటుపయిని ముఖమును పాణిపాదములను ప్రక్షాళనజే సి రెండుపర్యాయములాచమించి జానువులను స్పృశించి దిరుగనాచమించియ గస్త్యులగ్నిబడబానలము నాచేభుజింపబడినయన్నమును నిశ్శేషముగజీర్ణమును జేతురుగాక- జీర్ణసంబంధమయినసుఖమౌగాక- దేవుడురోగములేకుండజేయు గాక- అగస్త్యులనుకుంభకర్ణునిశమీవృక్షమునుబడబానలమును భీముని యాహా రపరిణామార్థముకొరకు స్మరించుచు వ్యాననియుదరమునుస్పృశించవలెను.

తాంబూలమును వేసికొని బ్రాహ్మణద్వారాపురాణశ్రవణమును స్వ జాతిధర్మాచరణచే ధర్మార్థకామముల నార్జించుటయందు దినశేషమును వెళ్లించదగును- భక్షించదగినవి తగనవి- పానమొనర్చదగినవియుం గూడనవి యుపచనరచనాదికమును ప్రధమాధ్యాయమందునమాచేవిస్తరించబడెను- అ దికారణమువలన నిచటం దిరుగ జెప్పుటలేదు.

తతో రాత్రౌ రవి- పర్వ- సంక్రమ- వ్యతీపాత- వైధృతి- శ్రాద్ధతత్పూ ర్వదినరాత్రిషు ద్వితీయవారం నభుంజీయాత్। తద్భిన్నరాత్రిషు ద్వితీయవారం యామాంతరం భుక్త్వా। అగస్త్యాయనమః। మాధవాయనమః। ముచుకుందాయన మః। కపిలాయనమః। ఆస్తీకాయనమఇతి నత్వా ప్రాచ్యాం దక్షిణతోవా శిరః కృత్వా స్వపేత్॥

అటుపయిని యాదివారమున- పర్వములయందు- సంక్రమణములయందు- వ్యతీపాతయోగమున- వైధృతిని- శ్రాద్ధదినతత్పూర్వదినములయొక్క రాత్రుల యందున భుజించరాదు. తదితరరాత్రులయందు యామాంతరమందునభుజించి యగస్త్యులవారికి మాధవులకు ముచికుందులకు కపిలునకాస్తీకునకును నమస్క రించి ప్రాగ్దిశనైన, దక్షిణదిశనైన శిరస్సునుంచి నిద్రించవలెను.

దారోపగమః॥

తత్రస్త్రీయాఋతావాద్యదినచతుష్టైకాదశత్రయోదశ వర్జషోడశ

దినముక్తే చతుర్థీషష్ఠ్యష్టమీ చతుర్దశీపర్వద్వయశ్రాద్ధతత్పూర్వ దినభిన్నాయాం రాత్రౌశనిరవిభౌమవర్జం; భరణీకృత్తికార్ద్రామఘాపూర్వా విశాఖా జ్యేష్ఠా మూల పూర్వాభాద్ర జన్మసంక్రమ వ్యతీపాతవైధృతివర్జం। సమరాత్రౌ సంగం కృత్వామూత్రాత్త్రిగుణంశౌచం స్నానంచకుర్యాత్। అన్యతాతు స్నానవర్జంకృత్వాస్వపేత్॥

పూర్వాధ్యాయే ఽస్మాభిశ్శ్వేతకేతు పాంచాలనందికేశ్వరవాత్స్యాయనాదిమతానుసారేణ రతిరహస్యాదీని సాధారణాపరకీయా పరిగ్రహ పరిహరణాదీని స్వప్నదృష్టారిష్టేష్టఫలానిచ తచ్ఛాంతిప్రకారానివప్రకటితాని తానిదృష్ట్వాచరేదాహ్నికం వర్ణసాధారణ ధర్మత్వాత్॥

దారోపగమము.

ఆశయనమందు ఋతుమతియగు తనభార్యయొక్క ౧౬ రాత్రులలో మొదటినాలుగు రాత్రులను ౧౧, ౧౩ రాత్రులను వర్జించి మిగిలిన ౧౦ రాత్రులయందు చతుర్థీ షష్టి అష్టమీ చతుర్దశ్యమావాస్య పౌర్ణమాసులయందు శ్రాద్ధ తత్పూర్వదినముల రాత్రులందును శనిరవిభౌమ రాత్రులందును, భరణీకృత్తికార్ద్రామఘాపూర్వావిశాఖాజ్యేష్ఠామూలపూర్వాభాద్ర నక్షత్రముల యందు స్వజన్మదినమందు సంక్రమవ్యతీపాతవైధృతులయందును వర్జించి సమరాత్రిని సంగమమునుజేసి మూత్రముకంటె త్రిగుణశౌచమునుస్నానమునుజేయవలయును. ఋతుకాలవ్యతిరేకదినములయందు స్నానమును జేయకనే నిద్రించదగును.

పూర్వాధ్యాయమందున మాచేతను శ్వేతకేతు పాంచాలనందికేశ్వర వాత్స్యాయనాదిమతానుసారముచేతనురతిరహస్యాదులునుసాధారణాపరకీయా పరిత్యాగమావశ్యకమనియును, స్వప్నమందున గనపడిన యిష్టానిష్టఫలములు, నరిష్టశాంతులును, పూర్వాధ్యాయమందున విశేషముగ ప్రకటించుటవలన దిరుగ జెప్పుటలేదదిజూచి వర్ణసాధారణ ధర్మముతోటవలననాచరించదగును.

శూద్రాహ్నికమిదంధర్మ్యం ద్వితీయాధ్యాయమీరితం।పఠన్నహరహశ్శూద్రస్స్వర్గం ప్రాప్నోత్యసంశయః॥

ధర్మ్యమగు ఈ శూద్రాహ్నికము రెండవ యధ్యాయముగా నాచే జెప్పబడెను. శూద్రుడు ప్రతిదిన మిటులాచరించినేని నిస్సంశయముగ స్వర్గ తుడగు ను.

ఇతి శ్రీమదశేషర్షి స్తుతిపాత్ర విశ్వామిత్ర పౌత్రధనంజయసగోత్ర మంత్రకృత్క్షత్ర కుల పవిత్ర శ్రీదంతులూరి నారాయణరాజపుత్రేణా రుంధతీసమా

నపాతివ్రత్యాది ధర్మయుత యువతీ శిరోమణీ శ్రీబుచ్చివేంకయాంబికా గర్భ శుక్తిమౌక్తికరత్నేన శ్రీనారాయణగజపతిరాజన్యేన రచితాయాం మునిభావ బోధిన్యామాచారకాండే స్మిన్మాధ్యాహ్నికోనామద్వితీయోధ్యాయః॥



ఇదిశ్రీమదఖిల మునీంద్ర సంస్తుతిపాత్రపుణ్య విశ్వామిత్రి పౌత్రివరధ। నంజయగోత్ర సన్మంత్రకృష్ణక్షత్ర సద్వంశపవిత్ర శ్రీదంతులూరి। నారాయణా హ్వయ భూరమాణాత్మజులా యరుంధతికి తుల్యమగునట్టి। విమలపాతివ్రత్యవి విధసౌశీల్యాది గుణవత్సతీశిరోమణియగుఘన॥ బుచ్చివేంకయాంబాగర్భభూరి శుక్తి। క్రమరత్ననారాయణ గజపతినృప। ఘనులకృతి మునిభావబోధినిని యు గ్మమాహ్నికాధ్యాయమున శాద్రమవని వెలయు॥

సంపూర్ణము.

